శ్రీమద్ధన్వంతరయేనమః

మాధవకరునిచే రచియింపబడిన

రుగ్వినిశ్చయమను

# మాధవనిదానము



ఇది

చెన్నపురి ఆయుర్వేద కాలేజి ప్రిన్సిపాలును, చెన్నపురి ఆయుర్వేద ధర్మ వైద్యశాల ప్రధాన చికిత్సకులును, మైసూరుదొరతనమువారియొక్కయు, పంజాబు డి. ఏ. వి. కాలేజివారియొక్కయు, అలహాబాదు ఆయుర్వేద మహామండలివారియొక్కయు, ఆయుర్వేద విద్వత్పరీక్షకులును, ఢిల్లీ ఆయుర్వేద యునాని తి. బి. కాలేజియొక్క పఠనగ్రంథనిలయమున సభ్యులును, ఆయుర్వేద విద్వత్పరీక్షకులును, శ్రీ సయాజీ ఆయుర్వేద విద్యాపీఠ సభ్యులును, సుశ్రుతమాధవనిదానాది గ్రంథములకు వ్యాఖ్యాన కర్తలును, కేరళ ఆయుర్వేద సమాజ సప్తమ సమ్మేళనాధ్యక్షులును, బొంబాయి అఖిలభారతవర్షీయ ద్వితీయాయుర్వేద సమ్మేళనాధ్యక్షులును, భరతఖండమందలి దేశీయ మహాసభానుబంధముగ జరిగిన మహాచిత్రవస్తు ప్రదర్శనములలో ననేక స్వర్ణపతకములను బొంది, శ్రీమత్పంచమజార్జి సార్వభౌమునిచే ప్రదత్తమగు "వైద్యరత్న" బిరుదావళి విరాజమానులును, శ్రీవైఖానసకులతిలకులునైన

ఆయుర్వేదమార్తాండ, భిషఙ్మణి

పండిత **డి. గోపాలాచార్యులు,** ఏ. వి. యస్. గారిచే

మధుకోశ-పంజికా-ఆతంకదర్పణాది వ్యాఖ్యానముల ననుసరించి

విపులముగ విశేషార్థములతో వ్రాయబడిన

## నిదానదీపిక

యను నాంధ్రవ్యాఖ్యానసహితముగ ముద్రింపబడి

ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలయందు ప్రకటింపబడెను

చెన్నపురి

రిజిస్టర్డు కాపీరైటు] ౧౯౪౦. [వెల 5 రూపాయలు

# మాధవ నిదానము

డి. గోపాలాచార్యులు



ప్రాచీ పబ్లికేషన్స్

**MADHAVANIDANAMU**
Telugu Translation *by* D. Gopalacharyulu

Price : Rs. 200/-

ISBN : 81-7443-006-7




Title : Chandra

First Published in 1911, Reprints 1929, 1940
Prachee Reprint February, 1995

Published by P.P.C.Joshi
for Prachee Publications
1-1-336/73, Viveknagar,
( Near Sri Thyagaraya Gana Sabha ) Chikkadpally,
Hyderabad-500 020, A.P.
☎ 630703

Printed at Gayatri Offset Press,
A-66, Sector No. 2, Noida, U.P.



ఈ గ్రంథము

శ్రీమన్మహీశూర మహారాజధానీమధ్యవిద్యోతమాన

సర్వతోభద్ర దివ్యరత్నసింహాసనాధీశ్వర

శ్రీమద్రాజాధిరాజేత్యాది బిరుదావళీ విరాజమాన

శ్రీ శ్రీ శ్రీ కృష్ణరాజసార్వభౌమ సంస్థానాస్థాన

ఆయుర్వేద విద్వద్వైద్య ప్రకాండులుగను

శ్రీమద్రాజకీయ సంస్కృతమహాపాఠశాలాయుర్వేద మహోపదేశికులుగనుండి

దివి నలంకరించిన అస్మత్ప్రియగురువర్యులగు

ఆయుర్వేదమహోపాధ్యాయ

## అగరం - శ్రీపుట్టస్వామిశాస్త్రివర్యులవారియందలి

సవినయ కృతజ్ఞతా సూచకముగ

ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలలోని ప్రథమగుచ్ఛము

గ్రంథకర్తచే ప్రచురింపఁబడెను.






అపరధన్వంతరి

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారు.

# ముద్రాపకుల విజ్ఞప్తి

## ద్వితీయముద్రణము

ఆయుర్వేదశాస్త్రమున కమూల్యాలంకారమగు నీ "మాధవనిదానము"ను స్వనిర్మితమగు "నిదానదీపిక" వ్యాఖ్యానముతో గూర్చి నానోపదులును, ధన్వంతర్యపరావతారులును, "ఆయుర్వేదమార్తాండ" "భిషఙ్మణి," "వైద్యరత్న" మొదలగు నన్వర్థబిరుదములచే సుప్రసిద్ధులునగు శ్రీ ఉ. వే. బ్ర. శ్రీమాన్ పండిత డి. గోపాలాచార్యులవారు 1911 సంవత్సరమున ముద్రించి ప్రచురించియుండిరి. ఆయుర్వేదమున నీగ్రంథరత్నమున కీయబడిన స్థానము, ప్రాశస్త్యము మొదలగు నంశములనుగూర్చి శ్రీ ఆచార్యులవారిచే విపులముగ పీఠికయందు విమర్శింపబడియుండుటచే యీభాగమును విడచి ప్రకృతమున కొంచెము వ్రాయదలచితిని.

శ్రీ ఆచార్యులవారి యవతారకాలముననే ప్రథమముద్రణగ్రంథములు చాలవరకు వ్యయపడియుండి ద్వితీయముద్రణము నపేక్షించుచుండె. నాయన గతించిన వెనుక నాకుగల అనివార్యములగు కొన్ని ప్రతిబంధములచే రమారమి యీ తొమ్మిదిసంవత్సరములనుంచి యత్నించియు నీకార్యమును చేయజాలనైతిని.

శ్రీ ఆచార్యులవారి యసమానసామర్థ్యముచే పునరుద్ధరింపబడిన యీయాయుర్వేదము క్రమముగ శ్రీ ప్రభుత్వముయొక్క లక్ష్యమునకుగూడ తేబడి, పట్టణములు పల్లెలనక విశాల భూభాగమంతెల్లయెడలను విద్యాధికలోకమును, విద్వల్లోకమును, జనసామాన్యమును శీఘ్రముగ నాకర్షించుచుండె. ఆచార్యులవారి నిరంతరకృషిఫలితములలో నొక్కటియగు ఆయుర్వేదాశ్రమగ్రంథమాలలో సర్వారంభప్రచురమునగు నీ గ్రంథముయొక్క ప్రతులు లేకుండుటచే గ్రాహకమహాశయుల కాశాభంగము గలుగజేయవలసివచ్చినదనుట శ్రీ యాచార్యులవారి నిర్యాణమునకంటె నాకెక్కువ చింతావిషయమైయుండె. పరమేశ్వరానుగ్రహముచే నేటికా లోపము తీరినది.

శ్రీ ఆచార్యులవారియందును, ఆయుర్వేదమందును భక్తివిశ్వాసములుగలయట్టి సహృదయులెల్లరును శ్రీ ఆచార్యులవారిని స్మరించుటకు వారి కృతిరత్నముల నభ్యస్తము చేసికొనుటకంటె సాధనాంతరము లేనందున యీగ్రంథమునందుగల విశేషములను మననము చేసికొని గ్రంథముయొక్క పఠనసాధనములచే జ్ఞానసామగ్రి నరయుటయే గాక శ్రీ యాచార్యులవారి యుద్యమమునకు సాయపడి శ్రీవారి యానృణ్యమును సంపాదించుకొని కృతకృత్యులగుదురని కోరుచున్నాను.

మరియు, "ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలా" పుస్తకములలో నింతవరకు ముద్రింపబడియు వ్యయపడినందుచే ప్రస్తుతమలభ్యములగు గ్రంథములను క్రమముగ పునర్ముద్రణము జేయుటకును శ్రీ యాచార్యులవారు సేకరించి సంస్కరించియు, వ్యాఖ్యానములచే పరిష్కరించియు నున్నయట్టి యముద్రిత గ్రంథములను ముద్రించి ప్రచురించుటకునుగూడ నేనన్నివిధముల సంకల్పించుకొని గ్రాహకమహాశయుల ప్రోత్సాహమునకై యెదురు చూచుచున్నాను. కావున, సహృదయులెల్లరును నా యుద్యమమును గౌరవించి శ్రీ యాచార్యులవారియందుగల వారి సంస్థాపనమగు "నాయుర్వేదాశ్రమ గ్రంథమాల"యందు తమ కృతజ్ఞతను చిరస్థాయినిగ జేయ ప్రార్థించుచున్నాడను.

ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలా
మద్రాసు 1-8-1929.

ఇట్లు విధేయుడు,
డి. దేశికాచార్యులు.

# విజ్ఞప్తి

## మూడవ కూర్పు

ఈగ్రంథ ద్వితీయముద్రణముప్రతులు బహుకాలము క్రిందటనే అయిపోయినందువలన కలిగిన గ్రంథగ్రహణాభిలాషుల తాత్కాలికాకాంక్షనైనను వెంటనే తొలగింపలేకపోయినందుకు నన్ను మన్నింపగోరుచున్నాను. ఎట్లో తిరిగి తృతీయముద్రణము పూర్తిచేసి పాఠకలోకమునకు గ్రంథము నందజేసిన నాపై లోకమువారు ఎప్పటి ఆదరాభిమానములను చూప ప్రార్థించుచున్నాను.

ఈ తృతీయముద్రణమునకు నన్ను ప్రోత్సహించిన శ్రీ యం. విశ్వేశ్వరశాస్త్రి, హెచ్. పి. ఐ. యం. గారికిని, ముద్రణాదిలోపముల సంస్కరించిన పండిత, జ్యోతిషాచార్య, శ్రీ పాతూరి సుబ్బరాయశాస్త్రి గారికిని నాకృతజ్ఞత తెలుపుచున్నాను.

మద్రాసు
1—1—40.

డి. దేశికాచార్యులు,
ప్రొప్రైటరు, ఆయుర్వేదాశ్రమము.

# భూమిక

---

శ్రీమద్విక్టోరియామహారాజ్ఞి గారి ప్రభుత్వకాలమునాటనుండి భారతీయుల భాగ్యోదయముచే గూఢములును, సంస్కృతాంగ్లేయాదిభాషామయములునగు గ్రంథములు ఆయాదేశభాషల బరివర్తింపఁబడి ప్రచారములోఁ గన్పట్టుచున్నయవి.

అందు, ఆయుర్వేదీయగ్రంథములు హిందీబంగాళీ భాషలలోఁ బ్రకాశించుకరణి నాంధ్రభాషాయోషామణి నలంకరింపకుండుట మిక్కిలి శోచనీయము.

హిందీ భాషయందు శాస్త్రసామాన్యము బరివర్తనము చేయఁబడియుండుటచేతను, హిందీ భాషలోనుండిన గ్రంథములను మహారాష్ట్రము, గుజరాతు, బంగాళా, పంజాబు మొదలగు దేశములవారు నిశ్శంకముగ నుపయోగించుటచేతను, వారల జనసంఖ్య యధికముగనుండుటచేతను, అచ్చటి వారలు దేశభాష సంస్కృతభాషలనే యభ్యసించుటచేతను, మన దేశమునకన్న నచ్చటి దేశభాషలలో ననేక గ్రంథములకుఁ బ్రచారముగల్గుట కవకాశము కలిగినదని యూహింపఁదగియున్నది.

ఉత్తర హిందూస్థానమున ననేకములగు శాస్త్రీయగ్రంథములు హిందూస్థానీభాషలో బరివర్తన మొనరింపఁబడినట్టులే ఆంధ్రభాషయందును గడచిన కొన్ని సంవత్సరములుగ ననేక శాస్త్రీయగ్రంథములు, కావ్యములు, నాటకములు, పురాణములు మొదలగునవి తర్జుమా చేయఁబడుటయే గాక యాంధ్రగ్రంథరచనలు స్వతంత్రముగఁగూడఁ బ్రారంభమయ్యెను. పుణ్యపరిపాకదశ యనఁదగిన నిట్టికాలమునసహితము నాయుర్వేదీయగ్రంథములు లక్ష్యలక్షణములతో నిమిడి యుండుటంబట్టి కాబోలును వానికిఁ దఱచుగ ప్రచారము కలుగకున్నయది.

సత్సంప్రదాయజ్ఞులును, సంస్కృతజ్ఞులునగు విద్వద్వైద్యులచే భేదింపఁదగిన ఈ యాయుర్వేదీయగ్రంథముల నాంధ్రభాష నలంకరింప బద్ధాదరులగు కొందఱుమిత్రులు ఇందుఁ బ్రవర్తించినను వారికి సంస్కృతజ్ఞులగు ఆర్యవైద్యవిశారదుల సాహాయ్య మావంతయు దొరకకుండుటచేతను, ఒకప్పుడు దొరకినను వారికి ఆయుర్వేదీయసంప్రదాయములు గగనకుసుమములం బోలి యుండుటచేతను, అట్టి వారల సాహాయ్యముచే రచియింపఁబడిన యాయుర్వేదీయగ్రంథములు సర్వజనాంగీకారార్హములు గాకున్నయవి.

## ఆంధ్రీకరించుటకు కారణము

ఆయుర్వేదవైద్యశాస్త్రమును పాఠప్రవచనములచే నభివృద్ధి నొందించుటకై యిక్కాలమున సంస్కృతభాష లుప్తప్రాయమగుటవలనఁ జక్కఁగ సంస్కృతము జదివిన విద్యార్థులు సాధారణముగ దొరకుట దుర్లభము. కాన నాయుర్వేదీయ గ్రంథములు గొన్నియైన దేశభాషలలో లేని లోపముచేత ఆయుర్వేదకళాశాలలయందు విద్యార్థివేతనాదుల నొసంగినను విద్యార్థులసంఖ్య తక్కువగానుండుటంగని దేశభాషలో నాయుర్వేదీయ గ్రంథముల రచించినఁగాని విద్యార్థులకు దేశభాషచే బోధింప సుకరముగాదని తలఁచి, దేశహితైకతత్పరులును, చెన్నరాజధానియందలి

యాయుర్వేదాభివృద్ధికి మూలపురుషులును, రాజకీయోన్నతన్యాయస్థానమునఁ బ్రధానన్యాయాధికారులుగనుండిన జస్టిస్ డాక్టర్ సర్ సుబ్రహ్మణ్యయ్యర్, యల్, యల్.డి., కే.సి.ఐ., సి. ఐ. ఇ., గారియొక్కయు, రాజధానియందలి పై యున్నత న్యాయస్థానమున న్యాయవాదులగు మ॥రా॥రా॥ పి. వి. కృష్ణస్వామిశెట్టి, బి. ఏ., బి. ఎల్., మహామహులయొక్కయు ప్రోత్సాహబలముచేత ప్రతిమనుజుని నియతముగ వేధించెడు వ్యాధిసామాన్యమును మిక్కిలి సులభముగా తెలుపు మాధవనిదానమను నీగ్రంథమును 1906 సంవత్సరమున నాంధ్రీకరించుట కారంభించి యావంతయైన నవకాశము లేమింజేసి యెట్టకేలకు నీసంవత్సరాన్తమున పూర్తిచేసితిని.

## గ్రంథకర్తృత్వ విచారము

ప్రాచీనసంస్కృతగ్రంథకర్తలు దాము రచియించు గ్రంథములయందు తమ దేశకాలాదుల గనఁబఱచుట మిక్కిలి యరుదని యెల్లవారికిని దెలిసియేయున్నది.

అట్టి గ్రంథకర్తల కాలాదినిర్ణయమును జేయునప్పుడు విమర్శకుల కష్టమింతయని వ్రాయఁజాలను.

మఱియు నొకగ్రంథమునుగుఱించి పండితులు వేర్వేఱుగ విమర్శించునపుడు గ్రంథకర్తల దేశకాలాదులు కొంచెము వ్యుత్పత్తిగలుగఁ గన్పించుచున్నది.

అట్లు వ్యుత్పత్తిగలుగుటకు మన గ్రంథకర్తలు స్వీయచరిత్రముల వ్రాయకపోవుటయే ముఖ్యకారణమని తోఁచెడిని. ఇట్టికష్టములు సంస్కృతగ్రంథసామాన్యమునకుఁ గలవు.

అందును సంస్కృతభాషామయమగు ఆయుర్వేదవైద్యగ్రంథ విశేషముగ లుప్తమగుటచేతను, ఇయ్యది ప్రత్యేకశాస్త్రమగుటచేతను, లోకమునం దినిని గొందఱు మాత్రమే గ్రహించియుండుటచేతను, సంస్కృతవైద్యగ్రంథకర్తల కాలాదుల నిర్ణయించుట మిక్కిలికష్టము.

మఱియు గ్రంథకర్తలయొక్క కాలాదులను వారివారి స్వగ్రంథములచేతఁ [illegible] [illegible]డరు; అట్లుగాక [illegible] మూలమును వ్యాఖ్యానములను బట్టి నిర్ణయించుట దుస్తరము.

మాధవనిదానమను పేరుగల యీగ్రంథము సుప్రసిద్ధులును, సర్వతంత్రస్వతంత్రులును, వేదభాష్యాది సకలశాస్త్ర వ్యాఖ్యానకర్తలును, కర్ణాట సింహాసన స్థాపనాచార్యులును, శ్రీబుక్కభూపాల మంత్రివర్యులును, విద్యారణ్య సంయమిసార్వభౌములును మాధవాచార్యులచే విరచితమని ప్రతీతికలదు. మఱియు H. H. సర్ భగవత్సింహజి, జి. సి. ఐ. ఇ., యమ్. డి., డి. సి. యల్., యల్ యల్. డి., ఎఫ్. ఆర్. సి. పి. ఇ., ఠాకూర్ సాహెబ్ ఆఫ్ గొండాల్ మహారాజుగారు ఆర్యవైద్యచరిత్రము (History of aryan Medical Science) నను, రాయ బహద్దర్ లాలా భవానీబోసవ్రతా, ఎమ్. ఏ., ఎఫ్. పి. యు., యమ్. ఆర్. ఏ. యస్., గారు సంస్కృత విద్యోపాఖ్యానమునను, డాక్టర్ అణ్ణా మోరేశ్వరకుంతే, యమ్. డి., గారు అష్టాఙ్గహృదయ పీఠికయందును శ్రీవిద్యారణ్యమాధవాచార్యులవారు రచించిరనియె వ్రాసిరి.

లోకప్రసిద్ధిచేతను, గొండాల్ మహారాజు మొదలగువారు వ్రాయుటచేతను నీగ్రంథకర్త మాధవాచార్యులని తెలియుచున్నను, అట్లూహించుట కవకాశము లేనట్లులు కొన్ని కారణములచే తోటపడుచున్నది.

అవియెట్లులనిన: శ్రీమాధవాచార్య విరచిత వేదభాష్యములయందును, పరాశర మాధవీయము, కాలమాధవీయము, మాధవీయధాతువృత్తి, మున్నగు గ్రంథములయందునుంగల "హ

కాద్యాస్సుమనస్సర్వార్థానాముపక్రమే" యను సుప్రసిద్ధ మంగళశ్లోకముచే గాక ఈ మాధవనిదానము "ప్రణమ్యజగదుత్పత్తిస్థితిసంహారకారణమ్ । స్వర్గాపవర్గయోర్ద్వారం త్రైలోక్యశరణం శివమ్॥" అను మంగళశ్లోకముచే ప్రారంభింపబడియున్నది.

మఱియు మాధవాచార్యులచే రచియింపఁబడిన గ్రంథసామాన్యమునందు టీకగా వారి స్వీయ చరిత్రమును, శ్రీబుక్కభూపతి చరిత్రమును వ్రాయబడుట సహజముగ విశదమగుచున్నది.

మాధవనిదానారంభమున "నానామునీనాం వచనైరిదానీం సమాసతస్సద్భిషజాం నియోగాత్ । సోపద్రవారిష్ట నిదానలింగో నిబధ్యతే రోగవినిశ్చయోయమ్" అను శ్లోకమునుజూడ నీగ్రంథకర్త సద్వైద్యులయొక్క యాజ్ఞవలన ననేకమహర్షులవాక్యముల నొక్కచోఁ జేర్చి గ్రంథమును రచించినట్టులు తెలియుచున్నది. శ్రీవిద్యారణ్యమాధవకృతగ్రంథములయం దెచ్చటఁజూచినను వారు స్వతంత్రముగ గ్రంథములరచించినట్లు గానవచ్చుచున్నదియేగాని, యొకరియాజ్ఞనొంది కొందఱు చెప్పియుండు వాక్యసముదాయముతో మాత్రమే గ్రంథముల రచించినట్టులు తెలియఁబడుటలేదు.

మాధవులు జ్ఞానమున సర్వతంత్రస్వతంత్రత్వాదిప్రజ్ఞలు గలవారగుటచేతను, ప్రభుత్వాదిగుణములచేత నొకరికి నాజ్ఞనొసఁగు శక్తిగలవారలుగాని యొకరిచే నాజ్ఞాపింపఁబడువారలుగారు; ఈ మాధవనిదానమను గ్రంథము సద్వైద్యులయొక్క యాజ్ఞచేఁ జేయబడినటుల గన్పడుచున్నది.

ఈమాధవనిదానమును రచియించినది 'మాధవకర్' అను కర్శబ్దాన్తవాచ్యులును, గ్రంథాన్తమున విషయసూచికలో "శ్రీమాధవేనేందుకరాత్మజేన" అను వాక్యముచే నిందుకరపుత్రుండు నగు మాధవకరుఁడనితోఁచుచున్నదియేగాని "శ్రీమతీ జననీ యస్య సుకీర్తిః మాయణః పితా । సాయణో భోగనాథశ్చ మనోబుద్ధీ సహోదరౌ । యస్య బోధాయనం సూత్రం శాఖా యస్య చ యాజుషీ । భారద్వాజకులం యస్య సర్వజ్ఞస్స హి మాధవః॥" అను సామవేదబ్రాహ్మణపీఠికలోని శ్లోకములచే బోధితులును, మాయణ పుత్రులునగు విద్యారణ్య మాధవులని బోధపడుటలేదు.

ఈ గ్రంథమునకు వ్యాఖ్యానకారులగు విజయరక్షితులు, శ్రీకంఠదత్తులు, వాచస్పతి, వైద్యకాళిదాసులు మొదలగువారు మిక్కిలి ప్రసిద్ధులు. వీరలు వ్యాఖ్యానముచేయునపుడుకూడ మూలగ్రంథమును సద్వైద్యులయాజ్ఞచే మాధవకరుఁడను వైద్యశ్రేష్ఠుఁడు రచించినట్టులు వ్రాసిరిగాని వేదభాష్యకర్తయగు మాధవులు రచించినట్లు వ్రాసియుండలేదు.

ఈ మాధవనిదానము శ్రీవిద్యారణ్యమాధవులే రచించిరను మహారాజా గొండాల్ ఠాకూర్ సాహేబు మొదలగువారి మతములను అంగీకరించినచో శ్రీవిద్యారణ్యమాధవులు 14-వ క్రీ॥ శ॥ మున నుండినవారని సుప్రసిద్ధ చరిత్రములనుండి తెలియవచ్చుటవలన నీమాధవనిదాన వ్యాఖ్యానకారులగు క్రీ॥ శ॥ 1240 లో నుండిన విజయరక్షిత, క్రీ॥ శ॥ 1260 లో నుండిన వాచస్పతిగార్లకంటెను అతి నవీనులగుటచేతను, మాధవనిదానము *775 క్రీ॥ శ॥ నకే అరబ్బీభాషలో పరివర్తితమై పఠనపాఠనములలోనున్నట్లు చరిత్రలవల్ల దెలియుటచేతను, వ్యాఖ్యానకర్తలకంటె మూలగ్రంథకర్తలు నవీనులుగనుండుట యసంభవమగుటచేతను, పూర్వోక్తమగు నితరకారణములచేతను, ఈ మాధవనిదానమును శ్రీవిద్యారణ్య మాధవులు రచించిరనుట యంగీకారార్హము కానేరదు.

ఇంతవరకు చేయబడిన విషయవిచారణనుబట్టి వాస్తవమిట్లు యేర్పడుచుండ, ఆర్యవిద్యాప్రపంచమున శ్రీవిద్యారణ్య మాధవాచార్యులవలె వేదాదులకు భాష్యములను, శాస్త్రసామాన్య

---

* ఈ విషయము గ్రంథకర్తృకాలాది నిర్ణయప్రస్తావమున విపులముగ వ్రాయబడుచున్నది.

మునకు వ్యాఖ్యానములను-స్వతంత్రగ్రంథములను రచియించినవా రింకొకరు లేకుండుటయేగాక * పాటర్‌సన్‌గా రుదాహరించిన ప్రకారము విద్యారణ్యమాధవకృత వైద్యనిదానమను గ్రంథ మొకటి రాజపుత్రస్థానమునందలి ఉదయపురసంస్థానములో సరస్వతీభాండాగారమున నున్నట్లు గనబడుచుండుటవల్లను, ఆగ్రంథము సాధారణముగ లుప్తప్రాయమైయుండుటవల్లను, సుప్రసిద్ధమైన ఈ మాధవకరకృత నిదానమును జగత్ప్రసిద్ధులగు శ్రీవిద్యారణ్యమాధవులు రచియించిరని పండితులు సహితము భ్రమనొందుటకు ముఖ్యకారణముగ దోచుచున్నది.

## గ్రంథకర్త్ర కాలాది నిర్ణయము

ఈ గ్రంథకర్తయగు మాధవకరుని కాలము, దేశము దెలియుట యావశ్యకముగాన వానిని గుఱించి యించుక విచారింతము.

ఈ గ్రంథమును గుజరాతీ, మరాటీ, బంగాళీ, హిందీ మొదలగు భాషలలోనికిఁ బరివర్తనముఁ జేసిన వారొకరైనను గ్రంథకర్త-వ్యాఖ్యానకర్తల కాలాదినిర్ణయముఁగూర్చి యించుకైనను ముచ్చటించియుండలేదు.

బొంబాయిలో నిర్ణయసాగరముద్రాయంత్రమున ముద్రింపఁబడిన సంస్కృతపుస్తకమునందు మాత్రము గ్రంథకర్తదేశకాలాదులఁ దెలిసికొనుట మిగులఁ గష్టముగానున్నదని వ్రాయఁబడియున్నది.

ఈ మాధవనిదానమునకు సుప్రసిద్ధములగు మూఁడువ్యాఖ్యానములు గన్పట్టుచున్నవి. అందు మధుకోశమనువ్యాఖ్య విజయరక్షితునిచేతను, అతని శిష్యుడగు శ్రీకంఠదత్తునిచేతను వ్రాయబడి మిక్కిలి ప్రౌఢమైయుండుటచేత నది తార్కికులకు మాత్రమే వేద్యమని తలఁచి వాచస్పతియను విద్వద్వైద్యుఁడు ఆతంకదర్పణమను వ్యాఖ్యానమును రచించెను.

కవిరాజ కాళిదాససేన్ అను భిషగ్వరుఁడు మధుకోశమునందుఁ జెప్పంబడని విషయములను దెల్పెదనని ప్రతినచేసి మధుకోశమునకు "పంజిక" అను పేరుచే నొప్పు వ్యాఖ్యానమును రచించెను.

ఈ మాధవనిదాన వ్యాఖ్యానములు వానిలో "ఆతంకదర్పణము" అను వ్యాఖ్యానమును రచియించిన వాచస్పతియనువారు వ్యాఖ్యానారంభమున

శ్లో॥ "శ్రీహమ్మీరనరేశ్వర స్సమభవద్వీరప్రతాపానల
జ్వాలాజాలకరాలదగ్ధపవనప్రాగ్భారశుష్కార్ణవః।
యస్య ప్రౌఢసభాఙ్గణేష్వపి యశస్స్వర్లోకకల్లోలినీ
కల్లోలామల మజ్జనాస్సుమనసాం గాయన్తి గోమాఞ్ఛితాః॥

శ్లో॥ ప్రత్యర్థిక్షితినాథసార్థవనితావైధవ్యదీక్షాగురోః
శౌర్యం యస్య రణాఙ్గణే సురగణైః పశ్యన్ సురాణాం పతిః।
లబ్ధ్వా నేత్రసహస్రజం ఫలమలం స్మృత్వా నిజాభ్యర్థితం
రామం రావణఘాతినం చ సమభూత్తుష్టోఽపి లజ్జాత్సునః॥

శ్లో॥ తస్యాథవన్ద్యవైద్యవరః ప్రభూతవిశ్వాసపాత్రం విదితశ్చరిత్రైః।
ప్రమోదనామా సకలప్రమోదీ కలావిలాసైకనిధిర్ద్విజేన్ద్రః॥

---

* *History of Sri Vidyaranya (Madhavacharya)* by Mr. V.V.S. Avadhani, B.A., now District Munsiff, Rajahmandry, p. 38.

శ్లో॥ జ్యేష్ఠోఽభవత్తస్య సుతః ప్రశస్తశాస్త్రార్థవేత్తా శివసక్తచేతాః ।
రైశర్మనామా ప్రథితః కలాభిః మహమ్మదక్షోణిపతే స్సభాయామ్॥

శ్లో॥ అన్యశ్చ తస్యాస్తి సుతః కనీయాన్ వాచస్పతి స్తత్వగుణైకసద్మ ॥
సహోదరప్రీతతమస్సమస్తా యో వేదవిద్యా స్స్వయమధ్యగీష్ట ॥

శ్లో॥ గురువచనవిచారై శ్చారుదృష్టచ్చరిత్రః చరకచతురచేతాః సుశ్రుతే సుశ్రుతోయః।
కపిలమతవయస్యః బ్రహ్మవిద్యారహస్య ప్రకటితపటుబుద్ధిః బుద్ధకాణాదసిద్ధిః ॥

శ్లో॥ తేనోజ్జ్వలా వివృతి రల్పధియాం హితాయ సంబధ్యతే విబుధమాధవసంగ్రహస్య ।
విజ్ఞాయ తార్కికవరైకవిచారవేద్యం భైషజ్యసమ్యగవశాన్మధుకోశబద్ధమ్ ॥"

అను శ్లోకములచేత స్వీయచరిత్రమును కొంచెముగ తెలిపియున్నారు. ఈ శ్లోకములనుబట్టి వ్యాఖ్యానకర్త వాచస్పతియనియు, వారితండ్రి 'ప్రమోద' అను పేరుగలవారనియు, వారియన్న 'రైశర్మ' యనియు 'మహమ్మద్ హమ్మీర్' అను చక్రవర్తియొక్క సభయందు వారితండ్రియు అన్నయు విద్వద్వైద్యులుగ నుండిరనియు స్పష్టముగఁ దెలియుచున్నది.

మహమ్మద్ హమ్మీరే, క్రీ॥ శ॥ 1193 నుండి 1205-వ సంవత్సరమువరకు ఢిల్లీనగరమందుండి పరిపాలనమొనరించిన మహమ్మద్ గోరీయనియు, ఈతనికి అమీరు మొయిజుద్దీన్ అను నామాంతరము కలదనియు, కాబట్టి వాచస్పతియనువారు క్రీ॥ శ॥ 1260 సంవత్సరకాలము నాటివారనియు, మాధవనిదానమునకు వాచస్పతికృత ఆతంకదర్పణవ్యాఖ్యానముకంటెఁబూర్వమే మధుకోశమను మొదటివ్యాఖ్యానమును రచించిన విజయరక్షితులు క్రీ॥ శ॥ 1240 సంవత్సరకాలము నాటివారనియు, కలకత్తామదరసా ప్రిన్సిపాల్ డాక్టర్ హార్నల్ గారు *వ్రాసియుండుటనుబట్టి మాధవకరుఁడు క్రీ॥ శ॥ 1240 సంవత్సరమునకు పూర్వమందున్నవాఁడని మాత్రమేగాక-డల్లణుఁడను వైద్యశ్రేష్ఠుఁడు నిబంధసంగ్రహమనుపేర సుశ్రుతమునకు వ్యాఖ్యానమును వ్రాయునపుడు తన గ్రంథమునందు మాధవు నుదాహరించియుండుటనుబట్టియు, ఈడల్లణుఁడు మథురానగరప్రాంతమున పరిపాలనముచేసిన సహనపాలదేవుని కాలము నాటివాఁడని మాత్రము ప్రొఫెసర్ పి. సి. రాయ గారు వ్రాసి డల్లణుని కాలమును స్పష్టపరచకపోయినను డల్లణుఁడు క్రీ॥ శ॥ 1200 సంవత్సరకాలము నాటివాఁడని డాక్టర్ హార్నలుగారే † స్పష్టీకరించుటనుబట్టియు, మాధవుఁడింకను ప్రాచీనులనిసహితము తెలియుచున్నది; అయినను ఈ విషయమునింకను చర్చించిచూతము.

కాయశస్త్ర చికిత్సలలో మిగుల ప్రశస్తిగాంచిన చరక సుశ్రుతములకు వ్యాఖ్యానకర్తయగు చక్రపాణిదత్తులు క్రీ॥ శ॥ 1050 వత్సరమున తామురచించిన చక్రదత్త అను నామాంతరముగల చికిత్సాసారమనెడు గ్రంథములో నుపసంహారమున "శ్లో॥ గౌడాధినాథరసవత్యధికారపాత్ర నారాయణస్య తనయస్సునయోఽన్తరఙ్గాత్ । భానోరనుప్రథితలోధ్రవలీకులీనః శ్రీచక్రపాణిరిహకర్తృపదాధికారీ ॥ యస్సిద్ధయోగలిఖితాధికసిద్ధయోగా నత్రైవ నిక్షిపతి కేవలముద్ధరేద్వా । భట్టత్రయత్రిపథవేదవిదా జనేన దత్తః పతేత్ సపది మూర్ధని తస్య శాపః ॥" అని వ్రాసియున్నారు. ఇందలి "గౌడాధినాథ" అను పదమునుబట్టి క్రీస్తుశతాబ్దము 1060 లో గౌడదేశము నేలుచుండు నయపాలునికాలమునసున్నటుల గనఁబడుచున్న నారాయణుని కొమారుడగు

---

* *Studies in the Medicine of Ancient India* (by A. F. Rudolf Hoernle, M.A., Ph.D., C.I.E., Part I, p. 17.

† Ibid p. 16.

చక్రపాణిదత్తులు, ఈ మాధవకరకృత నిదానము ననుసరించి వ్రాయఁబడిన బృందమాధవవిరచిత సిద్ధయోగమునఁ జెప్పంబడని యపూర్వౌషధ యోగములను తన గ్రంథమునఁ జెప్పెదనని "యస్సిద్ధయోగ" అను శ్లోకముచే దెలుపుటవలన శ్రీచక్రపాణిదత్తులకంటె బృందమాధవుఁడు కొన్ని శతాబ్దములకు ముందటివాఁడని తెలియుచున్నది.

కాబట్టి పైవచనములబట్టి చక్రపాణిదత్తుని చికిత్సాసారమునకు పూర్వమే రచియింపబడి యున్నట్లు తెలియుచున్న సిద్ధయోగమును వ్రాసిన బృందమాధవుని కాలమును గురించి యిపుడు విచారించవలసియున్నది. చక్రదత్తుని కాలమునకు పూర్వము కనీసము ఒకటి రెండు శతాబ్దముల నుండి యయినను బృందమాధవుని గ్రంథము సుప్రసిద్ధమై యున్నట్టుల నూహించ వచ్చుననియు-కాబట్టి బృందమాధవుఁడు రమారమి యెనిమిదవశతాబ్దమువాఁడు కావచ్చుననియు, అదే ప్రకారము బృందమాధవుడు వ్రాసిన సిద్ధయోగము మాధవకరనిదానము ననుసరించి రచియింపఁబడుటంజేసి మాధవకర గ్రంథము బృందమాధవుని కాలమునకు పూర్వము ఇంకొకటి రెండు శతాబ్దములు ప్రాచీనమైనదిగ నుండవచ్చుననియు ప్రొఫెసర్ * ప్రఫుల్లచంద్రరాయగారు వారి "హిందూ కెమిస్ట్రి"యను గ్రంథమున నుదాహరించియున్నారు. ఇంతియగాక ప్రొఫెసర్ విల్సన్ దొరగారుకూడ చరక సుశ్రుత † మాధవనిదానములు క్రీ॥ శ॥ 775 లో ఆసియాఖండము నందలి టర్కీలోఁజేరిన బాగ్దాద్ (Bagdad) పట్టణమున హారూన్ (Horun) మన్సూన్ (Mansun) అను కాలీఫుల కాలమున సంస్కృతమునుండియో లేక పారసీక భాషనుండియో అరబ్బీ భాషకు పరివర్తన మొనరింపబడి పఠనపాఠనములయందు ప్రచారములోనున్నట్లు వ్రాసిరి.

ప్రొఫెసర్ విల్సన్ దొరగారి మతమునే ప్రొఫెసర్ పి. సి. రాయ, కవిరాజ అవినాశ చంద్ర కవిరత్న, కవిరాజ ఉమేశ చంద్రగుప్త, కవిరత్న డాక్టర్ హార్నల్ సి. ఐ. ఇ., గార్లు కూడ నవలంబించియున్నారు.

ప్రొఫెసర్ విల్సన్‌దొరగారు నుడివినట్టుల క్రీ॥ శ॥ 775 కే మాధవనిదానము సంస్కృతమునుండియో లేక పారసీక భాషనుండియో అరబ్బీ భాషకు పరివర్తితమై ప్రచారములో నుండెనయెడల నీమాధవనిదానము క్రీ॥ శ॥ 775 కు కనీసము ఒకటి రెండు శతాబ్దములకు పూర్వపుదనియే నిశ్చయించవచ్చును.

శ్రీరాజా రాధాకాంతదేవవిరచితమగు "శబ్దకల్పద్రుమము" అను సంస్కృత మహానిఘంటువున వైద్యశబ్దవిచారణలో కర, దాస, గుప్త, సేన, దత్త, మొదలగు నుపపదధారులగు ఉన్నతవైద్యసంతతివారలు కలరని తెలియఁజేయఁబడినది.

మాధవులుకూడ కర అను నుపపదధారులగుటచేత, ప్రకృతకాలమున బొంబాయి, నాగపూర్ మొదలగుచోట్ల ప్రఖ్యాతిగాంచిన డాక్టర్ భండార్కర్, యమ్. ఏ. యల్. యల్. డి., సి.ఐ.ఇ., ఆనరబిల్ డాక్టర్ సర్ బాలచంద్రకృష్ణభాటేవాడేకర్, కెటి., యల్. యమ్., జే.పి., ఆనరబిల్ రాయబహద్దూర్ మధుహోల్కర్, బి. ఏ., యల్. యల్. బి., మున్నగువారివలె మహారాష్ట్రీయులని నిర్ణయముగఁ జెప్పుచుండుటయేగాక మధ్యరాష్ట్రమున జనించినవారనికూడ నూహింపఁదగియున్నది.

---

* *History of Hindu Chemistry* (by Praphulla Chandra Roy. D Sc.), p. 19.
† *Charaka English Translation* (by Avinasachandra Kaviratna) introduction p. 2.

## గ్రన్థరచనాపద్ధతి

మాధవకరులు గ్రంథాదియందు "నానామునీనాం వచనైరిదానీం సమాసతః సద్భిషజాం నియోగాత్ । సోపద్రవారిష్ట నిదానలింగో నిబధ్యతే రోగవినిశ్చయోఽయం" అను శ్లోకమువల్ల ననేకమహర్షి వాక్యసముదాయముచే రుగ్వినిశ్చయమను గ్రంథము 'నిబధ్యతే' (కూర్పఁబడుచున్నది) అని ప్రతిజ్ఞ చేయుటచేతను, ఈగ్రంథమున ననేకమహర్షులవాక్యముల యథానుపూర్వియే పలు నిదానభాగములయందుఁ గనఁబడుచుండుటచేతను, ఈగ్రంథకర్తయొక్క రచనాపద్ధతిని నిర్ణయించుట సుస్ఫుటముగాఁ దోఁచెడిని. గ్రంథాదియం దనేకమహర్షుల వాక్యసముదాయముచేత నీ నిదానము సంగ్రహింపఁబడినదని శ్రీమాధవకరులు దెలుపుటచేత నీ గ్రంథమునకు శ్రీమాధవకరులు సంగ్రాహక కర్తలే గాని వాస్తవమునకు రచనాకర్తలుగారని తోఁచుచున్నది.

మఱియు పలువురుమహర్షుల వాక్యసముదాయము నొక గ్రంథరూపముగా సంగ్రహించుటచేత నిందలి శైలియు నవిచారణీయము; మఱియు నీమాధవకరు లేయేగ్రంథములనుండి యేయేభాగములు సంగ్రహించిరో యను విషయముగూడ విచారణకు మీఱియున్నది.

ఇంతియగాక నీ గ్రంథకర్త యీ నిదానముల యథానుపూర్వికి నెద్దియైన ప్రాచీనగ్రంథము ననుసరించి యేర్పఱచిరా లేక స్వతంత్రముగ నేర్పరచిరా యను విషయమును విచారింతము. ఋషిప్రోక్తములగు చరక సుశ్రుతాదులయందలి నిదానములు పలుభాగముల చికిత్సాగులతోడను, ప్రత్యేకముగను, వ్రాయఁబడియుండుటచేత నాయా గ్రంథములయందుఁగల నిదానములనుచేర్చి మాత్రము నిదానానుపూర్వికను వ్రాయుటకు మాధవకరులే మొదటివారలని తెలియుచున్నది.

మఱియు ప్రాచీనులగు బృందమాధవ, చక్రదత్త మొదలగువారలును-నవీనులలోఁ జేరిన వంగసేన మొదలగువారలునుగూడ మాధవకరుని నిదానానుపూర్వినే యవలంబించి చికిత్సా గ్రంథములు వ్రాయుటచేతను ఈ మాధవకరునికంటెఁ బూర్వము ప్రత్యేక నిదానానుపూర్వికలు లేక పోవుటచేతను ఈమాధవకరులే రుగ్వినిశ్చయకర్తలలో నగ్రగణ్యులనిగూడ స్పష్టమగుచున్నది.

ఈమాధవకరనిదానముయొక్క యథానుపూర్విగల "అంజననిదానము" అను అగ్నివేశమహర్షి ప్రణీతమగు గ్రంథ మొకటి కానఁబడుచున్నది. ఇయ్యది అగ్నివేశప్రణీతమని యందలి శ్లోకముల వలన గానవచ్చుటచేతను, విషయ మతిసంగ్రహముగా నుండుటచేతను, మాధవకరునికన్నఁ బ్రాచీనమను భ్రాంతిగలుగుచున్నను, గ్రంథమునందలి శ్లోకరచనను అంతమందుఁగల సమాప్తిశ్లోకములను జూచిన నీ గ్రంథము ఆర్షమను సంశయము నివృత్తికి వచ్చుచున్నది.

ఒకవేళ అంజననిదానము ఋషిప్రణీతమని యంగీకరించినప్పటికిని దీని ననుసరించియే మాధవకరులు నిదానపద్ధతి నవలంబించిరనుటకు వలనుపడదు. ఏగ్రంథానుపూర్విని గాని యనుసరించి చెప్పితినని మాధవులు చెప్పకపోవుటచేతను, శ్రీవిజయరక్షితాది వ్యాఖ్యానకారులు నుడువకపోవుటచేతను, బృందమాధవాది చికిత్సాకారులుగూడ మాధవకరులు వారికిఁ బ్రాచీనులగు మునుల వాక్యముల సంగ్రహించుటలో నీమహర్షి గ్రంథానుపూర్వి ననుసరించిరని తెలుపకపోవుటచేతను, ఈయంజన నిదానము ఆర్షముగాదనియు, మాధవకరునికన్న నవీనులెవరో-మాధవనిదానము విపులమగు విషయములుగలదియగుటచేత వైద్యులకు చికిత్సావసరమున నాయా వ్యాధుల నిదానాదులు కంఠస్థముగ నుండవనియు, నట్లుండుట విశేషసౌకర్యమనియు తలఁచి-మాధవనిదానానుపూర్విని అవలంబించి,

విషయమును సంగ్రహించి, చిన్నపాత్రమును రచించి, గ్రంథమునకు గౌరవాతిశయము గలుగ వలెనను తలంపుతో యగ్నివేశ మహర్షి ప్రణీతమని రనియు తోఁచెడిని. ఈ యంజననిదాన గ్రంథ కర్తృత్వాది విషయములు గోచరముగాకుండుటచే ప్రకృత మిట్లూహింపవలసివచ్చినది.

## గ్రంథకర్తచే రచింపబడిన ఇతర గ్రంథములు

ఈ మాధవకరులు రుగ్వినిశ్చయమను గ్రంథమును సమకూర్చినదియేగాక సుశ్రుతమునకు టిప్పణమును, * రత్నమాల యను గ్రంథమునుగూడ రచించినట్లు తెలియుచున్నది.

## నిదానమను రుగ్వినిశ్చయమును రచించుటకు కారణము

ఆత్రేయ చరక సుశ్రుత కాశ్యపసంహిత మొదలగు మహర్షిప్రణీతము లగు పెక్కు విస్తృత వైద్యగ్రంథములున్నను ఈమాధవకరునిచే ప్రత్యేకముగ నీరుగ్వినిశ్చయమను గ్రంథము సద్వైద్యులయొక్క ఆజ్ఞ చేత నేల సమకూర్పఁబడెనో యించుక విచారింతము.

చరక సుశ్రుతాదులయందు:—

1. శల్యతంత్రము = (Science of Surgery.)
2. శాలాక్యతంత్రము = (Science of Eye, Nose, Throat &c. Diseases.)
3. కాయ చికిత్స = (General Treatment.)
4. భూతవిద్య = (Demoniacal Diseases.)
5. కౌమారభృత్యము = (Management of Children.)
6. అగదతన్త్రము = (Toxicology.)
7. రసాయనతన్త్రము = (Science of Reguveration.)
8. వాజీకరణతంత్రము = (Science of Aphrodisiacs.)

అను నెనిమిది తంత్రములు విపులముగ చెప్పంబడియున్నవి. హేతు లక్షణ ఔషధస్కంధాత్మక ములగు ఈయెనిమిదితంత్రములలో నంతర్భూతమగు హేతులక్షణస్కంధములు ఔషధస్కంధ సామాన్యమునకు అనగా చికిత్సాశాస్త్రమునకు ముఖ్యతమములగుటచేత నీ హేతులక్షణస్కంధ ప్రతి బోధకములగు విషయములు చరక సుశ్రుతాదులయందు నిదానస్థానమని ప్రత్యేకముగ నొక భాగ ముగనుండినను ఆనిదానస్థానమునఁ గొన్నిరోగములుమాత్రమే తెలియఁబడియున్నవి. తక్కిన రోగ బోధకనిదానములన్నియో చికిత్స, ఉత్తరతంత్రములనెడి భాగములలో మిళితమైయున్నవి.

చరక సుశ్రుతాదిగ్రంథములు పూర్వోక్తములగు శల్యతంత్రాది అష్టాంగముల బోధించుటలో విఖ్యాతిగాంచినవైనను - శల్యతంత్రబోధకనిదానములనుగురించి సుశ్రుతమును, మఱికొన్ని నిదాన ములను గురించి కాయచికిత్సాప్రధానమగు చరకమును, చెవులు-ముక్కు-నోరు-కన్ను మున్నగు చోట్ల జనించు రోగాదులనుగురించి విదేహమహారాజకృత గ్రంథమును, ఇటులనే రోగసామాన్య మును దెలిసికొనవలెనన్న ఇంకననేకగ్రంథములను సాహాయ్యముగ దీసికొనవలసియుండెను.

---

* బొంబాయి నిర్ణయసాగర ముద్రాయంత్రమున నాగరలిపిలో ముద్రితమైన మాధవనిదాన భూమిక 1-వ పేజి.

రోగసామాన్యమును తెలిసికొనునపుడు ఇట్లు అనేక గ్రంథములను పరిశీలించుట యతికష్టమని తలంచి శ్రీమాధవకరుఁడు ఆయా గ్రంథములయందు ముఖ్యములగు నాయా నిదానభాగముల నన్నిటి నొకచోటఁ జేర్చి రుగ్వినిశ్చయమను పేర నీ గ్రంథమును సమకూర్చెను.

చరకసుశ్రుతాదులయందున్న రోగసామాన్యమును బోధించెడు నిదానభాగములు పయిన చెప్పబడిన ట్లొక్కచోటలేక గ్రంథమునందలి పలుభాగములనుండుట విచారపరులగు వైద్యులయొక్క శంకల కాస్పదమగుచుండెను. ఇట్టి శంకలను బోగొట్టి మాధవకరులు రోగసామాన్యమును దెలుపు నిదానలక్షణాదు లొక్కచో రత్నపుంజములవలె జేర్చి లోకమునకు మహోపకారము గావించిరి. దానం జేసియే "నిదానే మాధవశ్శ్రేష్ఠః" అను నార్యోక్తిచే రోగనిర్ణాయకగ్రంథములలో నీ మాధవనిదానము కడు శ్రేష్ఠమని ఖ్యాతినొందెను.

## ఈ గ్రంథమును నిదాన మనుటకు కారణము

"సోపద్రవారిష్టనిదానలింగో నిబధ్యతే రోగవినిశ్చయోఽయమ్" అను శ్లోకముచేత మాధవకరుఁడు రోగవినిశ్చయమను గ్రంథమును రచించినట్లు తెలియుచున్నదే కాని నిదానమను గ్రంథమును రచించినట్లు కనబడుటలేదు. ఇట్లుండ, రోగవినిశ్చయమను నీగ్రంథమున కేల నిదానమను పేరుగల్గెనో విచారింతము.

"రోగవినిశ్చయః" అను పదమునకు "రోగాణాం విశేషేణ నిశ్చయః (జ్ఞానం) యేన (గ్రంథేన) సః (గ్రంథః) రోగవినిశ్చయః" అను వ్యుత్పత్తిచేత రోగవిశేషజ్ఞానమునకు సాధనమని తెలియుచున్నది (అనఁగా నీగ్రంథము రోగములను జక్కఁగఁ దెలిసికొను నుపాయముల బోధించుచున్నది యని భావము). అట్లు రోగములఁ దెలిసికొనుటకు నిదానము, పూర్వరూపము, రూపము, ఉపశయము, సంప్రాప్తి, అను నైదుపాయములు కలవు. వానిలో నొక్కొక్కటైనను, రెండును గలిసియైనను రోగముల బోధించును. ఈ యుపాయములో నేది లేకున్నను రోగపరిజ్ఞానము గలుగ నేరదు. రోగోత్పత్తికి ముఖ్యమైనట్టి కారణము దెలుపునిదానము "నిదీయతే వ్యాధిరనేనేతి నిదానం" (అనఁగా నీ కారణముచేత వ్యాధి తెలిసికొనఁబడును) లేక "నిశ్చిత్య దీయతే ప్రతిపాద్యతే వ్యాధి రనేనేతి నిదానం (వ్యాధి నిర్ణయించి తెలుపునది) లేక "నిధీయతే నిబధ్యతే ధాత్వాది సంబన్ధో వ్యాధిరనేనేతి నిదానం" (హేత్వాద్యములలో కూడిన వ్యాధి దీనిచేఁ గల్పింపబడును) అనునట్టి వ్యవహారములచేతను, "హేతులక్షణనిర్దేశా న్నిదానాని" యను సుశ్రుతవాక్యమునుబట్టి తక్కిన పూర్వరూప - రూప - ఉపశయ - సంప్రాప్తులు కేవల నిదానశబ్దముచేతనే బోధింపబడుటచేతను, "రుగ్వినిశ్చయః" అను పేరు గ్రంథమాత్రావశిష్టమై, నిదానమను పేరు విఖ్యాతిగాంచెను.

మఱియు చరక, సుశ్రుత, వాగ్భటాది గ్రంథములయందు సహితము పై యవయవార్థములతోఁగూడిన వ్యాధిబోధకభాగము మాత్రము నిదానస్థానమనియే పేర్కొనఁబడుచున్నది.

## పంచలక్షణ నిదానము

జ్వరాది రోగసామాన్యములను విపులముగఁ దెలుపుటలో నగ్రస్థానమును వహించిన ఈ గ్రంథము జ్వరాదిరోగసామాన్యలక్షణములోగాక "పంచలక్షణనిదానము" అను ప్రకరణములో ప్రారంభింపబడెను; కాబట్టి ఈ పంచలక్షణనిదానముయొక్క స్వరూపం బిట్టిదని చదువరులకు నాశంక గలుగవచ్చును.

ఈ గ్రంథకర్త జ్వరాది రోగసామాన్యములను వివరించుటకు ముందు ప్రతిరోగమును నిశ్చయించుట కావశ్యకమైన యుపాయములు నాయా వ్యాధులయందు జెప్పుటచే గ్రంథవిస్తర

మగునని "సోపద్రవారిష్ట నిదాన లిఙ్గః" అను ప్రతిజ్ఞచే వ్యాధిసామాన్యమును సిద్ధాంతపఱచుటకు ఆవశ్యకమైన ఉపద్రవారిష్టాదు లన్నిటికి నుపలక్షకభూతమగు నిదాన ప్రాగ్రూప రూప ఉపశయ సంప్రాప్తులనెడి యైదుపాయములను సవిస్తరముగఁ జెప్పంబూని గ్రంథాదియందు పంచలక్షణ నిదానమును నిరూపించెను.

## రోగశబ్దనిర్వచనము

"రుజ్యన్తే సన్తప్యన్తే అనయేతి రుక్, రుజా - రోగశ్చ" (దీనిచేతఁ దపింపజేయబడుదురు) అనెడి యవయవార్థముచే బోధితమగునదియే రోగమని తెలియుచున్నది. మఱియు మిథ్యాహార విహారములచే శరీరనిష్ఠమగు వాతపిత్తశ్లేష్మములు మూఁడును వాని స్వభావధర్మములను విడిచి, రసాది ధాతువులను స్వభావగుణములనుండి చెడఁగొట్టుటచే గనంబడు లక్షణములే రోగమని తెలుపఁ దగియున్నది. ఇట్టి రోగమును గనుగొనుటకు ఆర్యవైద్యప్రపంచమునఁగల మార్గములను ఈక్రింది విధముగఁ దెలుపవచ్చును.

## రోగములం దెలిసికొను నుపాయములు

అందు మున్ముందు నిదానము (రోగముబుట్టుటకుఁ గారణము) నిరూపించబడెను. ఈ నిదానము ఆయా వ్యాధిభేదములఁ దెలుపుటకై వ్యభిచారి, విప్రకృష్ట, సన్నికృష్ట, ప్రాధానిక, బాహ్య, అభ్యంతర, వ్యంజక, ఉత్పాదకాది భేదములచే బదునాలుగు విధములుగ నిరూపింపబడెను. మఱియు నీ నిదానము వ్యాధిరూప పరిణామమగు వాతపిత్తకఫములయొక్క వికృతికిఁ గారణ మగుననియు, నట్టి నిదానముచే వికారములుగ పరిణమించిన వాతపిత్తకఫములనెడి త్రిదోషములు ప్రాకృత, వైకృత, అనుబంధ, అనుబంధ్య, ఆశయాపకర్ష, క్షయ, స్థాన, వృద్ధి మొదలగు పదునారు భేదములుగ నున్నవనియు నిరూపించబడెను.

ఇటుల రోగోత్పత్తికి హేతుభూతమగు నిదానదోషముల విభాగమును దెలిపి, పిమ్మట జనింప బోవు రోగములం దెలిసికొనుటకై ప్రాగ్రూపమును (అనగా పుట్టబోవు రోగముయొక్క అంకురావస్థ) గ్రంథకర్తవివరించెను. ఆ పూర్వరూపము సామాన్యపూర్వరూపమనియు విశేషపూర్వరూప మనియు ఇరుతెఱంగులు. ఈ రెండువిధములగు పూర్వరూపములచేతను పుట్టబోవు రోగముయొక్క సామాన్యవిశేషజ్ఞానము గనుఁగొనంబడును. ఇట్లు రాబోవు రోగములయొక్క జ్ఞానము కలిగినపిమ్మట నట్టిరోగమును నిశ్చయముగఁ దెలిసికొనుటకై రూపము (అనగా పుట్టిన రోగముయొక్క నిజస్థితి) నిరూపింపంబడెను.

నిదాన ప్రాగ్రూప రూపములచే కొంతవఱకు రోగజ్ఞానముకలిగినను, గూఢమగు లక్షణ ములుగల రోగములయొక్క విశేషజ్ఞానము దుర్లభమగుచున్నది. అట్టివ్యాధుల నిశ్చయము నకై ఉపశయము (అనగా వ్యాధిని శమింపఁజేయు నౌషధాన్నవిహారములచే కలుగునట్టి సుఖకరం బగు నుపయోగము) గనిపెట్టబడెను. ఇయ్యది 1. హేతువిపరీతము; 2. వ్యాధివిపరీతము; 3. హేతు వ్యాధివిపరీతము; 4. హేతువిపరీతార్థకారి; 5. వ్యాధివిపరీతార్థకారి; 6. హేతువ్యాధివిపరీతార్థ కారి; యని యాఱువిధములు. ఈషడ్విధోపశయములచే సత్త్రరోగభేదములందు ఔషధాన్నవిహార సుఖజనకమగు నుపయోగమునుండి ఉపశయానుపశయంబుల గుర్తింపనగు. ఇట్లు గూఢ లక్షణములగు రోగముల జ్ఞానానంతరము సంప్రాప్తి (ఆయా ప్రకరణములయం దుదాహరింపఁబడిన రీతిని దుష్టంబై శరీరమునం దూర్ధ్వాదిగమనభేదములఁ గలిగి వ్యాపించిన వాతాదిదోషములచేత జనించు జ్వరాదివ్యాధులలో నిట్టివ్యాధియేయని స్థిరపఱచుట) నిరూపింపబడెను. ఇయ్యది 1. సంఖ్యా

సంప్రాప్తి, 2. వికల్పము, 3. ప్రాధాన్యము, 4. బలము, 5. కాలము అని యైదువిధములు. ఈరీతి నిదాన, ప్రాగ్రూప, రూప, ఉపశయ, సంప్రాప్తులనెడి అయిదుపాయములచేత రోగసామాన్యము దెలియందగు. మఱియు పయి నిదానాదులచే రోగసామాన్యజ్ఞానము గోచరమగునేగాని వివరమగు రోగవిశేషజ్ఞానముగలుగ నేరదని నాడి, మూత్రము, పురీషము, శబ్దము, స్పర్శము, రూపము, జిహ్వా, నేత్రము, మొదలగువాని పరీక్ష రోగవిశేషజ్ఞానమునకై నానా నిదానముల నిరూపించబడెను.

పూర్వోదాహృతమగు నిదానాది పంచోపాయములచేతను, నాడి మొదలగు విశేషోపాయములచేతను, త్రిదోషజన్యములనబడు జ్వరము, పాండు, క్షయము, శోఫ, అపస్మారము, విసర్పము, కుష్ఠము, మొదలగు వ్యాధులయొక్క సామాన్యజ్ఞానమును, విశేషజ్ఞానమును బోధపడుచున్నవి.

మఱియు పయి నిదానాది ఉపాయములచేత దోషజవ్యాధుల జ్ఞానగరిమ దెలియుటయేగాక ఆగంతుకములును, వ్రణములోచేరిన అస్థి భగ్నము (ఎముకలువిరుగుట), సంధిచ్యుతములు (కీళ్లు జారుట), కపాలస్ఫుటనము (తలపుఱ్ఱె పగులుట), ఆంత్రఛేదనము (ప్రేగులు తెగిపోవుట), శల్యములు (ఇనుపమేకులు-సీసపుగవలు-ఎముకలు మొదలగునవి) శరీరములో గ్రుచ్చుకొనియుండుట మొదలగువాని జ్ఞానముగూడ గనుగొనఁబడుచున్నది.

వెండియు పయి నిదానాదులచే నక్రమప్రసవములయందలి గర్భనిర్గమనమార్గమునందు శిశువుయొక్క కాళ్లు, చేతులు, పిఱ్ఱలు, వీపు, మొదలగునవి అడ్డుపడుటచే గలిగెడి బాధలను చక్కగా గనిపెట్టఁదగును.

ఈరీతి శారీరక, మానసిక, స్వాభావిక, ఆగంతుకములనెడి వ్యాధిసామాన్యమును తెలుపుటలో ప్రసిద్ధిగాంచిన శ్రీమాధవకరకృతనిదానమునందలి పయి రుగ్వినిశ్చయోపాయములు త్రికాలజ్ఞులగు మహర్షిప్రవరులచేత గొనియాడబడి, ఋగ్వేదాదులయందు ప్రతిపాదితమై అధర్వణవేదమున విస్తరించి వెలసిల్లిన ఆయుర్వేదవైద్యశాస్త్రమున క్రీస్తుశకమునకు పూర్వకాలము నుండియే గనఁబడుటచేత ప్రపంచమునఁగల వైద్యశాస్త్ర సామాన్యమునందలి రోగవినిశ్చయోపాయములలో ఆయుర్వేదతంత్రజ్ఞులచేత గనిపెట్టఁబడిన రోగములఁ దెలిసికొను మార్గములే మొట్టమొదటివని నిశ్చయమగుచున్నది.

మఱియు మహర్షులు ఆయుర్వేదవైద్యతంత్రమున రుగ్వినిశ్చయమునకై జూపిన విస్తారమగు జ్ఞానమునుగురించి వేఱొక పుస్తకమును విపులముగ వ్రాయుచుండుటచేతను, ఈగ్రంథాదియందలి పంచలక్షణనిదానమున రుగ్వినిశ్చయోపాయములు విపులముగ గనబఱచబడియుండుటచేతను శాస్త్రమర్యాద తెలియుటకీభూమికయందు గ్రంథబాహుళ్యమగునని సంక్షేపముగ వ్రాసినాడను.

## గ్రంథమునందలి విషయములు

శ్రీమాధవకరులు హేతులక్షణ ప్రధానమగు నీ గ్రంథమున కాయచికిత్సలో నంతర్భూతమగు జ్వర పాండు క్షయాతిసారము మొదలగు నిదానములను, భూతవిద్యలోఁజేరిన ఉన్మాద అపస్మారాది నిదానములను, శల్యతంత్రమునకుఁజేరిన భగ్న సద్యోవ్రణాది నిదానములను, శాలాక్యతంత్రమునకుఁజేరిన కర్ణ నాసా నేత్రగళ శిరోరోగ నిదానాదులను, కౌమారభృత్యమునఁజేరిన బాలరోగనిదానాదులను, అగదతంత్రమునకుఁజేరిన స్థావర జంగమ కృత్రిమ విష నిదానాదులను విపులముగ వ్రాసిరి; మఱియు శాలాక్యతంత్రమునకుఁజేరిన ప్రత్యేకవ్యాధు లనఁబరఁగు నేత్రశ్రోత్ర

గళరోగాదులను అతివిపులముగ నిరూపించిరి; మఱియు స్త్రీరోగములనఁబరఁగు మూఢగర్భ సూతికావాత అసృగ్దరాదివ్యాధులనుగూడ బాగుగ విశదీకరించిరి.

అత్రి, చరక, సుశ్రుత, హారీత, భాలుకి, కాశ్యప, వాగ్భట, భోజ, సాత్యకి, వరరుచి, గౌతమ, విదేహ, నాగార్జునాది గ్రంథకర్తల గ్రంథముల ననుసరించి వ్రాయఁబడిన శ్రీవిజయరక్షితుఁడు, శ్రీకంఠదత్తు, వాచస్పతి, కవిరాజవైద్యకాళిదాసు మొదలగువారల వ్యాఖ్యానముల ననుసరించియు, ననేక స్థలముల స్వానుభవములనుజేర్చియు నీమాధవనిదానమునకు "నిదానదీపిక" యను నాంధ్రవ్యాఖ్యను వ్రాసి బొంబాయి కలకత్తాలయందు ముద్రితములగు బహుపుస్తకములనుండియు శ్రీమాన్ మాగురువర్యు లుపదేశించిన పాఠక్రమము ననుసరించియు గనుగొనబడిన పాఠభేదముల తోడను ఇతరప్రక్షిప్తములతోడను గూడ దీని ముద్రించితిని.

ఒక భాషయందుండిన సామాన్యగ్రంథములనే మఱియొకభాషకుఁ బరివర్తనచేయుట యతి కష్టము. మఱియు నతిప్రాచీనమగు సంస్కృతభాషను మనదేశభాషలకు మార్చుట యంతకన్న కష్టము. మఱియు ఆయుర్వేదవైద్యము ప్రత్యేకశాస్త్రమగుటచేతను, ఆ వైద్యశాస్త్రమందుఁగల సాంకేతికశబ్దములు లుప్తప్రచారములగుటచేతను ఇట్టి వైద్యశాస్త్రమును దెనుఁగునకుఁ బరివర్తించుట కష్టతమము; అయినను సాధ్యమైనంతవఱకు నా సాంకేతికపదములకుఁ దెనుఁగు వ్రాసితిని.

మఱియు నీగ్రంథమున కాంధ్రవ్యాఖ్యరచించుటలో విషయప్రాముఖ్యత యెక్కువగ గమనించబడుటనుబట్టి భాషాశైలి మొదలగు వానిలో పెక్కుదోషములుండుననుటకు సంశయము లేదు. అట్టి దోషములను మన్నించి గుణమేదైన నుండినచో దాని గ్రహించి నాకు ప్రోత్సాహము గలుగజేయుదురని పండితప్రకాండుల ప్రార్థింపుచున్నాడను.

జ్వరాది వ్యాధులను దెనుఁగుభాషలో నేయే పేళ్లలో దేశీయవైద్యులు వ్యవహరించెదరో ఆయా తెనుఁగుపేళ్లను సంస్కృతనామములకు ప్రక్కను, వానికిఁ బ్రక్కన నింగ్లీషుపేళ్లనుగూడ, సాధ్యమైనంతవరకు, సర్వజన సౌకర్యమునకై వ్రాసితిని.

ఈ యాంధ్రవ్యాఖ్యరచించుటకై "ఆతంకదర్పణము," "పంజికా" అను వ్యాఖ్యానముల నిచ్చి నా కమితసాహాయ్యమునుజేసిన, నావిద్యాభివృద్ధికి యాస్థానమైన శ్రీమన్మహీశూర మహారాజా సంస్కృత మహాపాఠశాలయొక్క సెక్రెటరిగారును, మహిసూరు రాజకీయ ప్రాచీన సంస్కృత భాండార ప్రధానాధ్యక్షులును నగు బ్రహ్మశ్రీ ఎ. మహాదేవశాస్త్రిలు, బి. ఏ., యం.ఆర్.ఏ. యస్., గారియెడల సర్వదా కృతజ్ఞుఁడనై యున్నాఁడను.

ఈ వ్యాఖ్యను రచించునపుడు నాకు మిక్కిలి తోడ్పడి శ్రద్ధతో సంస్కరించిన సాహిత్య భూషణ, వైయ్యాకరణ విద్వాన్ బ్రహ్మశ్రీ నుదురుపాటి విశ్వనాథశాస్త్రిలవారి కనేకవందనము లాచరించుచున్నాడను.

డి. గోపాలాచార్యులు

శ్రీః

మాధవనిదానసంబను సీ గ్రంథము సంధలి

# విషయానుక్రమణిక




| విషయము | పుట |
|---|---|
| **౧. పంచలక్షణనిదానము.** | ౧ |
| మంగళాచరణము | ౧ |
| గ్రంథప్రాశస్త్యము | ౨ |
| వ్యాధినిఁదెలియుటకు నైదుపాయములు | ౩ |
| నిదానలక్షణము | ,, |
| పూర్వరూపలక్షణము | ౧౦ |
| రూపలక్షణము | ౧౧ |
| ఉపశయలక్షణము | ,, |
| అనుపశయలక్షణము | ౧౪ |
| సంప్రాప్తిలక్షణము | ,, |
| వికల్పలక్షణము | ౧౫ |
| ప్రాధాన్యలక్షణము | ,, |
| బలాబలలక్షణము | ౧౬ |
| కాలనిర్ణయము | ,, |
| నిదానవిశేషము | ౧౮ |
| చరకాద్యంగీకృత నిదానానువాదము | ౧౯ |
| రోగము రోగాంతరమునుఁ గల్గించుక్రమము | ,, |
| **౨. జ్వరనిదానము** | ౨౧ |
| జ్వరసంప్రాప్తి | ౨౨ |
| జ్వరసామాన్యలక్షణము | ,, |
| జ్వరములకు సామాన్యపూర్వరూపము | ,, |
| జ్వరములకు వేర్వేరుగఁబూర్వరూపములఁ జెప్పుట | ౨౩ |
| వాత జ్వరలక్షణము | ,, |
| పిత్తజ్వరలక్షణము | ౨౪ |
| కఫ జ్వరలక్షణము | ,, |
| వాతపిత్త జ్వరలక్షణము | ౨౫ |
| వాతశ్లేష్మ జ్వరలక్షణము | ,, |
| పిత్తశ్లేష్మ జ్వరలక్షణము | ,, |
| సన్నిపాత జ్వరలక్షణము | ౨౬ |
| అసాధ్య సన్నిపాత జ్వరలక్షణము | ౩౦ |
| సన్నిపాత జ్వరోపద్రవము | ,, |
| ఆగంతు జ్వరలక్షణము | ౩౨ |
| విషాదులవలనఁ గలిగిన జ్వరములనుఁ బ్రత్యేక లక్షణములు | ౩౩ |
| ఆగంతుజ్వరములయందు వాతాదిదోష సంబంధ నిర్ణయము | ,, |
| విషమజ్వర సంప్రాప్తి | ,, |
| విషమజ్వర భేదములు | ౩౪ |
| సంతతాది జ్వరములకు ఆశ్రయంబులైన ధాతువుల నిర్ణయము | ,, |
| సంతతాది జ్వరలక్షణము | ,, |
| సతతక అన్యేద్యుష్క తృతీయక చతుర్థక జ్వరలక్షణములు | ౩౬ |
| మతాంతరమున విషమజ్వర లక్షణములు | ,, |
| తృతీయకజ్వర భేదములు | ,, |
| చతుర్థకజ్వర భేదము | ౩౮ |
| చతుర్థక విపర్యయజ్వరలక్షణము | ౪౦ |
| వాతబలాసక జ్వరలక్షణము | ౪౧ |
| ప్రలేపక జ్వరలక్షణము | ,, |
| విషమజ్వర విశేషములు | ,, |
| దాహపూర్వ శీతపూర్వ జ్వరలక్షణములు | ౪౨ |
| రసగత జ్వరచిహ్నములు | ౪౨ |
| రక్తగత జ్వరలక్షణము | ౪౪ |
| మాంసగత జ్వరలక్షణము | ,, |
| మేదోగత జ్వరలక్షణము | ,, |
| అస్థిగత జ్వరలక్షణము | ,, |
| మజ్జగత జ్వరలక్షణము | ౪౪ |
| శుక్రగత జ్వరలక్షణము | ౪౫ |
| రసాది ధాతుగత జ్వరములకు సాధ్యాసాధ్య నిర్ణయము | ,, |

# విషయానుక్రమణిక


| విషయము | పుట |
|---|---|
| జ్వరమునకు ప్రాకృత వైకృత భేదనిర్ణయము | ౪౫ |
| పూర్వోక్త ప్రాకృత జ్వరోత్పత్తి క్రమము | ౪౬ |
| అన్తర్వేగ జ్వరలక్షణము | ,, |
| బహిర్వేగ జ్వరలక్షణము | ౪౭ |
| ఆమజ్వరలక్షణము | ,, |
| పచ్యమాన జ్వరలక్షణము | ౪౮ |
| పక్వజ్వర లక్షణము | ౪౯ |
| సాధ్యజ్వర లక్షణము | ,, |
| అసాధ్యజ్వరలక్షణము | ,, |
| జ్వరవిముక్తి పూర్వరూపము | ౫౦ |
| జ్వరవిముక్త లక్షణములు | ౫౨ |
| **౩. అతిసారనిదానము** | ౫౩ |
| అతిసార సంప్రాప్తి | ౫౪ |
| అతిసార పూర్వరూపము | ,, |
| వాతాతిసారలక్షణము | ౫౫ |
| పిత్తకఫాతిసార లక్షణము | ,, |
| సన్నిపాతాతిసార లక్షణము | ,, |
| శోకజాతిసార లక్షణము | ,, |
| ఆమాతిసారలక్షణము | ౫౬ |
| ఆమమల లక్షణము | ,, |
| పక్వమల లక్షణము | ,, |
| అసాధ్యాతిసార లక్షణము | ౫౭ |
| రక్తాతిసార లక్షణము | ౫౮ |
| ప్రవాహికాలక్షణము | ,, |
| వాతజాది ప్రవాహికాలక్షణములు | ,, |
| అతిసారనివృత్తి లక్షణము | ౫౯ |
| జ్వరాతిసార లక్షణము | ,, |
| **౪. గ్రహణీరోగనిదానము** | ౬౦ |
| గ్రహణీరోగ సంప్రాప్తి | ౬౦ |
| గ్రహణీసామాన్య లక్షణము | ,, |
| గ్రహణీపూర్వరూపము | ౬౧ |
| వాతజగ్రహణీలక్షణము | ,, |
| పిత్తజగ్రహణీలక్షణము | ౬౨ |
| కఫజగ్రహణీ లక్షణము | ,, |
| సన్నిపాతజగ్రహణీ లక్షణము | ౬౩ |
| సంగ్రహ గ్రహణీ! ఘటీయన్త్రి గ్రహణీ లక్షణములు | ,, |
| అసాధ్యగ్రహణీ లక్షణము | ౬౪ |
| మతాన్తరమునందసాధ్యగ్రహణీలక్షణము | ౬౫ |
| **౫. అర్శోనిదానము** | ౬౬ |
| అర్శస్స్వరూప సంప్రాప్తిలక్షణములు | ౬౬ |
| వాతార్శోనిదానము | ౬౭ |
| పిత్తార్శోనిదానము | ,, |
| కఫార్శోనిదానము | ,, |
| ద్వన్ద్వజ సన్నిపాతజార్శోనిదానములు | ౬౮ |
| వాతార్శోలక్షణములు | ,, |
| పిత్తార్శోలక్షణము | ౬౯ |
| కఫజార్శోరోగలక్షణములు | ౭౦ |
| సన్నిపాతజార్శోలక్షణము | ౭౧ |
| రక్తార్శోలక్షణము | ,, |
| వాతాద్యనుబంధము చేజనించిన రక్తార్శోలక్షణము | ,, |
| అర్శోరోగ పూర్వరూపములు | ౭౨ |
| అర్శోరోగమున సర్వదేహమునందు సంతాపాదులు గల్గుకారణములు | ,, |
| సుఖసాధ్యార్శోలక్షణము | ౭౪ |
| కృచ్ఛ్రసాధ్యార్శోలక్షణము | ,, |
| అసాధ్యార్శోలక్షణము | ౭౫ |
| యాప్యార్శోలక్షణము | ,, |
| ఉపద్రవవిశేషములచే నర్శోవ్యాధికి అసాధ్యత్వము | ,, |
| మేఢ్రాదిగతార్శోలక్షణములు | ౭౬ |
| చర్మకీలలక్షణము | ,, |
| **౬. అగ్నిమాన్ద్యాజీర్ణ విసూచికాలసకవిలంబికానిదానము** | ౭౭ |
| మందతీక్ష్ణాద్యగ్ని భేదములు | ,, |
| మన్దతీక్ష్ణాద్యగ్ని లక్షణములు | ౭౭ |
| అజీర్ణ భేదములు | ౭౮ |
| అజీర్ణము జనించుటకు కారణములు | ౭౯ |
| ఆమాజీర్ణ లక్షణము | ౮౦ |
| విదగ్ధాజీర్ణ లక్షణము | ,, |
| విష్టబ్ధాజీర్ణ లక్షణము | ,, |
| రసశేషాజీర్ణ లక్షణము | ,, |
| అజీర్ణోపద్రవములు | ,, |

| విషయము | పుట |
|---|---|
| ౧౨. హిక్కా శ్వాసనిదానము | ౧౧౩ |
| హిక్కాసంప్రాప్తి | ౧౧౩ |
| హిక్కాభేదములు | ౧౧౪ |
| హిక్కాపూర్వరూపములు | ,, |
| అన్నజహిక్కాలక్షణము | ,, |
| యమళహిక్కాలక్షణము | ,, |
| క్షుద్రహిక్కాలక్షణము | ౧౧౫ |
| గంభీరహిక్కాలక్షణము | ,, |
| మహాహిక్కాలక్షణము | ,, |
| అసాధ్యహిక్కాలక్షణములు | ,, |
| శ్వాసభేదములు | ౧౧౯ |
| శ్వాసవ్యాధిపూర్వరూపములు | ,, |
| శ్వాసవ్యాధిసంప్రాప్తి | ,, |
| మహాశ్వాసలక్షణము | ౧౧౭ |
| ఊర్ధ్వశ్వాసలక్షణము | ,, |
| ఛిన్నశ్వాసలక్షణము | ౧౧౮ |
| తమకశ్వాసలక్షణము | ,, |
| ప్రతమకసంతమకశ్వాసలక్షణములు | ౧౧౯ |
| క్షుద్రశ్వాసలక్షణము | ౧౨౦ |
| సాధ్యాసాధ్యశ్వాసలక్షణములు | ,, |
| ౧౩. స్వరభేదనిదానము | ౧౨౨ |
| స్వరభేదనిదానసంప్రాప్తులు | ౧౨౨ |
| వాతజపిత్తజ స్వరభేదలక్షణములు | ,, |
| కఫజసన్నిపాతజస్వరభేదలక్షణములు | ౧౨౩ |
| క్షయజమేదోజస్వరభేదలక్షణములు | ,, |
| అసాధ్యస్వరభేదలక్షణము | ,, |
| ౧౪. అరోచకనిదానము | ౧౨౫ |
| వాతాద్యరోచకలక్షణములు | ౧౨౫ |
| అభిఘాతజసన్నిపాతజారోచకలక్షణము | ౧౨౬ |
| వాతాద్యరోచకములయందుగల్గు విశేష లక్షణములు | ,, |
| ౧౫. ఛర్దినిదానము | ౧౨౮ |
| ఛర్దివ్యాధిపూర్వరూపములు | ౧౨౯ |
| వాతచ్ఛర్దిలక్షణము | ,, |
| పిత్తచ్ఛర్దిలక్షణము | ,, |
| కఫచ్ఛర్దిలక్షణము | ౧౩౦ |
| సన్నిపాతజచ్ఛర్దిలక్షణము | ,, |

| విషయము | పుట |
|---|---|
| అసాధ్యచ్ఛర్దిరోగలక్షణములు | ,, |
| ఆగంతుచ్ఛర్దిలక్షణము | ౧౩౧ |
| క్రిమిజచ్ఛర్దిలక్షణము | ,, |
| అసాధ్యచ్ఛర్దిలక్షణము | ,, |
| ౧౬. తృష్ణానిదానము | ౧౩౩ |
| తృష్ణాసంప్రాప్తి | ౧౩౩ |
| తృష్ణాభేదములు | ౧౩౪ |
| వాతజతృష్ణాలక్షణము | ,, |
| పిత్తజతృష్ణాలక్షణము | ,, |
| కఫజతృష్ణాలక్షణము | ,, |
| క్షతజక్షయజతృష్ణాలక్షణములు | ౧౩౫ |
| ఆమజతృష్ణాలక్షణము | ౧౩౬ |
| అన్నజతృష్ణాలక్షణము | ,, |
| ఉపసర్గజతృష్ణాలక్షణము | ,, |
| అసాధ్యతృష్ణాలక్షణములు | ,, |
| ౧౭. మూర్ఛాభ్రమ నిద్రా తంద్రాసన్న్యాస నిదానము | ౧౩౮ |
| మూర్ఛానిదానసంప్రాప్తులు | ౧౩౮ |
| మూర్ఛారోగపూర్వరూపములు | ౧౩౯ |
| వాతజమూర్ఛాలక్షణము | ,, |
| పిత్తజమూర్ఛాలక్షణము | ,, |
| కఫజమూర్ఛాలక్షణము | ౧౪౦ |
| సన్నిపాతజమూర్ఛాలక్షణము | ,, |
| రక్తజమూర్ఛాలక్షణము | ,, |
| విషజమద్యజమూర్ఛాలక్షణములు | ౧౪౧ |
| రక్తజాది మూర్ఛాత్రయముయొక్క స్వరూపము | ,, |
| మూర్ఛాభ్రమాదులయొక్క పరస్పర భేదములు | ౧౪౨ |
| తన్ద్రాలక్షణము | ,, |
| సన్న్యాసమూర్ఛలయొక్క పరస్పర భేదములు | ,, |
| సన్న్యాసలక్షణము | ,, |
| ౧౮. పానాత్యయ పరమదపానాజీర్ణ పానవిభ్రమ నిదానము | ౧౪౪ |
| మద్యపానముచే మూర్ఛకల్గుటకు కారణములు | ౧౪౪ |
| మద్యసేవచే జనించుగుణములు | ౧౪౬ |
| ప్రథమమదలక్షణము | ,, |

| విషయము | పుట |
|---|---|
| ద్వితీయమదలక్షణము | ౧౪౭ |
| తృతీయమదలక్షణము | ,, |
| చతుర్థమదలక్షణము | ,, |
| అయుక్తమద్యసేవచే జనించు వికారము | ౧౪౮ |
| మద్యపానానర్హ కారణములు | ౧౪౯ |
| మదవికారభేదములు | ,, |
| వాతాధికమదాత్యయలక్షణము | ,, |
| పిత్తప్రాయమదాత్యయలక్షణము | ,, |
| కఫప్రాయమదాత్యయలక్షణము | ౧౫౦ |
| సన్నిపాతజమదాత్యయలక్షణము | ,, |
| పరమదలక్షణము | ,, |
| పానాఽజీర్ణ పానవిభ్రమలక్షణములు | ,, |
| అసాధ్యమదాత్యయలక్షణము | ౧౫౧ |
| ౧౯. దాహనిదానము | ౧౫౩ |
| మద్యజదాహలక్షణము | ౧౫౩ |
| రక్తజదాహలక్షణము | ,, |
| పిత్తజతృష్ణానిరోధజదాహలక్షణములు | ,, |
| కోష్ఠజదాహలక్షణము | ౧౫౪ |
| ధాతుక్షయజదాహము | ,, |
| మర్మజదాహలక్షణము | ,, |
| ౨౦. ఉన్మాదనిదానము | ౧౫౬ |
| ఉన్మాదశబ్దమునకు అన్వర్థత్వనిరూపణము | ౧౫౬ |
| ఉన్మాదభేదములు | ,, |
| ఉన్మాదసామాన్యహేతువులు | ,, |
| ఉన్మాదసంప్రాప్తి | ౧౫౭ |
| ఉన్మాదసామాన్యరూపము | ,, |
| వాతజఉన్మాదలక్షణము | ,, |
| పిత్తజోన్మాదలక్షణము | ౧౫౮ |
| కఫజోన్మాదలక్షణము | ,, |
| సన్నిపాతజోన్మాదలక్షణము | ౧౫౯ |
| శోకజోన్మాదలక్షణము | ,, |
| విషజోన్మాదలక్షణము | ౧౬౦ |
| అసాధ్యోన్మాదలక్షణము | ,, |
| భూతోన్మాదసామాన్యలక్షణము | ,, |
| దేవగ్రహోన్మాదలక్షణము | ౧౬౧ |
| అసురగ్రహోన్మాదలక్షణము | ,, |
| గన్ధర్వగ్రహోన్మాదలక్షణము | ,, |
| యక్షగ్రహోన్మాదలక్షణము | ౧౬౨ |

| విషయము | పుట |
|---|---|
| పితృగ్రహోన్మాదలక్షణము | ౧౬౨ |
| నాగగ్రహోన్మాదలక్షణము | ,, |
| రాక్షసగ్రహోన్మాదలక్షణము | ౧౬౩ |
| పిశాచగ్రహోన్మాదలక్షణము | ,, |
| అసాధ్యగ్రహలక్షణము | ,, |
| దేవగ్రహములుపట్టు కాలనిర్ణయము | ౧౬౪ |
| ౨౧. అపస్మారనిదానము | ౧౬౬ |
| అపస్మారసామాన్యలక్షణము | ౧౬౬ |
| అపస్మారపూర్వరూపములు | ,, |
| వాతాపస్మారలక్షణము | ౧౬౭ |
| పిత్తాపస్మారలక్షణము | ,, |
| శ్లేష్మజాపస్మారలక్షణము | ,, |
| సన్నిపాతజాపస్మారలక్షణము | ,, |
| అపస్మారప్రకోపకాలనిర్ణయము | ౧౬౮ |
| ౨౨. వాతవ్యాధినిదానము | ౧౬౯ |
| వాతవ్యాధిపూర్వరూపములు | ౧౭౦ |
| వాతవ్యాధిస్వరూపము | ,, |
| కోష్ఠగతవాతలక్షణము | ౧౭౧ |
| సర్వాఙ్గవాతలక్షణము | ,, |
| గుదస్థితవాతలక్షణము | ,, |
| ఆమాశయస్థవాతలక్షణము | ,, |
| పక్వాశయస్థవాతలక్షణము | ,, |
| శ్రోత్రాదిగతవాతలక్షణము | ౧౭౨ |
| త్వగ్గతవాతలక్షణము | ,, |
| రక్తగతవాతలక్షణము | ,, |
| మాంసమేదోగతవాతలక్షణము | ,, |
| అస్థిమజ్జాగతవాతలక్షణము | ,, |
| శుక్రగతవాతలక్షణము | ౧౭౩ |
| సిరాగతవాతలక్షణము | ,, |
| స్నాయుసంధిగతవాతలక్షణము | ,, |
| పిత్తకఫావృతప్రాణవాతలక్షణము | ,, |
| కఫపిత్తములతో గూడిన యుదానవాత లక్షణము | ౧౭౪ |
| కఫపిత్తములతో గూడిన సమానవాతలక్షణము | ,, |
| కఫపిత్తములతో గూడిన అపానవాతలక్షణము | ,, |
| పిత్తకఫములతో గూడిన వ్యానవాతలక్షణము | ,, |
| ఆక్షేపకవాతసామాన్యలక్షణము | ,, |
| అపతన్త్రకవాతలక్షణము | ౧౭౫ |

# విషయానుక్రమణిక


| విషయము | పుట |
| --- | --- |
| అపతానకవాతలక్షణము | ౧౭౫ |
| దండాపతానకవాతలక్షణము | ,, |
| ధనుస్తమ్భవాతలక్షణము | ౧౭౬ |
| అన్తరాయామవాతలక్షణము | ,, |
| బాహ్యాయామవాతలక్షణము | ,, |
| అసాధ్యాక్షేపకలక్షణము | ౧౭౭ |
| ఏకాఙ్గసర్వాఙ్గవాతలక్షణము | ,, |
| సాధ్యాసాధ్యైకాఙ్గవాతలక్షణము | ౧౭౮ |
| అర్దితవాతలక్షణము | ,, |
| అసాధ్యార్దితవాతలక్షణము | ౧౭౯ |
| ఆక్షేపకాదివాతవ్యాధులకు వేగనియమము | ,, |
| హనుగ్రహవాతలక్షణము | ,, |
| మన్యాస్తమ్భవాతలక్షణము | ౧౮౦ |
| జిహ్వాస్తమ్భవాతలక్షణము | ,, |
| సిరాగ్రహవాతలక్షణము | ,, |
| గృధ్రసీవాతలక్షణము | ,, |
| విశ్వాచీవాతలక్షణము | ,, |
| క్రోష్టుకశీర్షవాతలక్షణము | ౧౮౧ |
| ఖంజపంగువాతలక్షణము | ,, |
| కలాయఖంజవాతలక్షణము | ,, |
| వాతకంటకవాతలక్షణము | ,, |
| పాదదాహవాతలక్షణము | ౧౮౨ |
| పాదహర్షవాతలక్షణము | ,, |
| అంసశోషాపబాహుకవాతలక్షణములు | ,, |
| మూకమిన్మినగద్గదవాతలక్షణములు | ,, |
| తూనీవాతలక్షణము | ,, |
| ప్రతితూనీవాతలక్షణము | ౧౮౩ |
| ఆధ్మానవాతలక్షణము | ,, |
| అష్ఠీలావాతలక్షణము | ,, |
| కంపవాతఖల్వీవాతలక్షణములు | ౧౮౪ |
| అనుక్తవాతవ్యాధినిర్ణయము | ,, |
| వాతవ్యాధ్యుపద్రవములు | ,, |
| ప్రకృతిస్థవాతగుణము | ౧౮౫ |
| ౨౩. వాతరక్తనిదానము | ౧౮౬ |
| వాతరక్తసంప్రాప్తి | ౧౮౬ |
| వాతరక్తపూర్వరూపము | ౧౮౭ |
| వాతాధికవాతరక్తలక్షణము | ౧౮౮ |
| రక్తాధికవాతరక్తలక్షణము | ,, |
| పిత్తాధికవాతరక్తలక్షణము | ,, |
| కఫాధికవాతరక్తలక్షణము | ,, |
| వాతరక్తవ్యాధికి స్థలవిశేషముచే గమనభేదములు | ౧౮౯ |
| అసాధ్యవాతరక్తలక్షణము | ,, |
| ౨౪. ఊరుస్తమ్భనిదానము | ౧౯౧ |
| ఊరుస్తమ్భమునకుపూర్వరూపాదులు | ౧౯౨ |
| ౨౫. ఆమవాతనిదానము | ౧౯౪ |
| ఆమవాతసామాన్యలక్షణము | ౧౯౫ |
| ఆమవాత విశేషలక్షణము | ,, |
| ఆమవాతసాధ్యాసాధ్యలక్షణము | ౧౯౬ |
| ౨౬. శూలపరిణామశూలాన్నద్రవ శూలనిదానము | ౧౯౭ |
| శూలభేదములు | ౧౯౭ |
| వాతజశూలలక్షణము | ౧౯౮ |
| పిత్తజశూలలక్షణము | ౧౯౯ |
| శ్లేష్మజశూలలక్షణము | ,, |
| సన్నిపాతజశూలలక్షణము | ౨౦౦ |
| ఆమజశూలలక్షణము | ,, |
| ద్వన్ద్వజశూలలక్షణము | ౨౦౧ |
| సాధ్యాసాధ్యశూలవ్యాధిలక్షణము | ,, |
| పరిణామశూలసామాన్యలక్షణము | ,, |
| వాతజనితపరిణామశూలలక్షణము | ౨౦౨ |
| పిత్తజపరిణామశూలలక్షణము | ,, |
| కఫజపరిణామశూలలక్షణము | ,, |
| ద్విదోషజపరిణామశూలలక్షణము | ౨౦౩ |
| అన్నద్రవశూలలక్షణము | ,, |
| ౨౭. ఉదావర్తానాహనిదానము | ౨౦౪ |
| వాతనిరోధజోదావర్తలక్షణము | ,, |
| పురీషనిరోధముచేగల్గిన ఉదావర్తలక్షణము | ,, |
| మూత్రనిరోధముచే జనించిన ఉదావర్తలక్షణము | ౨౦౫ |
| జృంభాశ్రునిరోధముచే గల్గు ఉదావర్తలక్షణములు | ,, |
| క్షుతనిరోధముచేగల్గిన ఉదావర్తలక్షణము | ,, |
| ఉద్గారనిరోధజనితఉదావర్తలక్షణము | ౨౦౬ |
| ఛర్దినిగ్రహజోదావర్తలక్షణము | ,, |

| విషయము | పుట |
| --- | --- |
| శుక్రనిగ్రహజనితఉదావర్తలక్షణము | ౨౦౬ |
| క్షుత్తృష్ణానిరోధములచేగల్గిన ఉదావర్త లక్షణము | ,, |
| శ్వాసమును నిద్రను నిరోధించుటచేగల్గిన ఉదావర్తలక్షణములు | ౨౦౭ |
| రూక్షాదికుపితవాతజోదావర్తలక్షణము | ,, |
| ఆనాహలక్షణము | ౨౦౮ |
| ఆమజన్యంబైన ఆనాహలక్షణము | ,, |
| **౨౮. గుల్మనిదానము** | ౨౧౦ |
| గుల్మవ్యాధిస్వరూపము | ,, |
| గుల్మవ్యాధిసామాన్యలక్షణము | ,, |
| గుల్మవ్యాధిపూర్వరూపములు | ౨౧౧ |
| గుల్మసామాన్యరూపము | ,, |
| వాతజగుల్మలక్షణము | ,, |
| పిత్తజనితగుల్మలక్షణము | ౨౧౨ |
| కఫజనితగుల్మలక్షణము | ౨౧౩ |
| ద్విదోషజగుల్మలక్షణము | ,, |
| సన్నిపాతజనితగుల్మలక్షణము | ,, |
| రక్తగుల్మలక్షణము | ౨౧౪ |
| అసాధ్యగుల్మలక్షణము | ౨౧౫ |
| **౨౯. హృద్రోగనిదానము** | ౨౧౬ |
| హృద్రోగసంప్రాప్తి | ,, |
| వాతజహృద్రోగలక్షణము | ,, |
| పిత్తజహృద్రోగలక్షణము | ౨౧౮ |
| కఫజహృద్రోగలక్షణము | ,, |
| త్రిదోషజక్రిమిజహృద్రోగలక్షణములు | ,, |
| హృద్రోగోపద్రవములు | ౨౧౯ |
| **౩౦. మూత్రకృచ్ఛ్రనిదానము** | ౨౨౦ |
| మూత్రకృచ్ఛ్రసంప్రాప్తి | ,, |
| వాతాదిజనితమూత్రకృచ్ఛ్రలక్షణములు | ౨౨౧ |
| శల్యజమూత్రకృచ్ఛ్రలక్షణము | ,, |
| పురీషజమూత్రకృచ్ఛ్రలక్షణము | ,, |
| అశ్మరీజమూత్రకృచ్ఛ్రలక్షణము | ౨౨౨ |
| శుక్రజమూత్రకృచ్ఛ్రలక్షణము | ,, |
| అశ్మరీశర్కరలపరస్పరభేదము | ,, |
| **౩౧. మూత్రాఘాతనిదానము** | ౨౨౪ |
| వాతకుండలికాలక్షణము | ,, |

| విషయము | పుట |
| --- | --- |
| అష్ఠీలాలక్షణము | ౨౦౬ |
| వాతవస్తిలక్షణము | ౨౨౫ |
| మూత్రాతీతలక్షణము | ,, |
| మూత్రజఠరలక్షణము | ,, |
| మూత్రోత్సంగలక్షణము | ,, |
| మూత్రక్షయలక్షణము | ౨౨౬ |
| మూత్రగ్రంథిలక్షణము | ,, |
| మూత్రశుక్రలక్షణము | ,, |
| ఉష్ణవాతలక్షణము | ౨౨౭ |
| మూత్రసాదలక్షణము | ,, |
| విడ్విఘాతలక్షణము | ,, |
| వస్తికుండలికాలక్షణము | ౨౨౮ |
| సాధ్యాసాధ్యవస్తికుండలికాలక్షణము | ,, |
| **౩౨. అశ్మరీనిదానము** | ౨౩౦ |
| అశ్మరీనిదానము | ,, |
| అశ్మరీసంప్రాప్తి | ,, |
| అశ్మరీపూర్వరూపములు | ,, |
| అశ్మరీసామాన్యలక్షణము | ౨౩౧ |
| వాతజాశ్మరీలక్షణము | ,, |
| పిత్తజాశ్మరీలక్షణము | ,, |
| శ్లేష్మజఅశ్మరీలక్షణము | ౨౩౨ |
| శుక్రాశ్మరీలక్షణము | ,, |
| శర్కరాలక్షణము | ౨౩౩ |
| అసాధ్యశర్కరాశ్మరీలక్షణము | ,, |
| **౩౩. ప్రమేహనిదానము** | ౨౩౫ |
| ప్రమేహసంప్రాప్తి | ,, |
| ప్రమేహములయందు దోషదూష్యవిభాగము | ౨౩౬ |
| ప్రమేహపూర్వరూపములు | ,, |
| ప్రమేహసామాన్యలక్షణము | ౨౩౭ |
| ఉదకమేహలక్షణము | ,, |
| ఇక్షుమేహలక్షణము | ౨౩౭ |
| సాంద్రమేహలక్షణము | ,, |
| సురామేహలక్షణము | ,, |
| పిష్టమేహలక్షణము | ౨౩౮ |
| శుక్రమేహలక్షణము | ,, |
| సికతామేహలక్షణము | ,, |
| శీతమేహలక్షణము | ,, |
| శనైర్మేహలక్షణము | ,, |

అస్ఫుటముగ సూచించు శ్రమాదులు సామాన్య పూర్వరూపము లనియు, జనించబోవు జ్వరాదివ్యాధు లకు వాతాదిభేదముల మాత్రము అస్ఫుటముగ దెలియం జేయు జృంభాదులు విశేష పూర్వరూపంబు లనియు ముఖ్యార్థము. అస్ఫుటంబులైన వాతాదిదోషములచే జనించిన జ్వరాదులను దెలియంజేయు లక్షణము విశేషపూర్వరూపంబనియు, వాతాదిజ్వరభేదములను స్ఫుటముగ దెలియంజేయునది రూపమనియు నీరెంటికిని భేదము నెరుంగునది.

మరియు రాబోవు వ్యాధిని అస్ఫుటముగ దెలియంజేయునది పూర్వరూపమనియు, తత్కాలమున గల్గియుండు వ్యాధిని స్ఫుటముగ దెల్పునది రూపమనియు నీరెంటికిని బరస్పరభేదములను కొందరు వచించెదరు. ఇవ్విధంబుగ పూర్వరూపము నెరుంగునది.

రూపలక్షణము

శ్లో॥ తదేవ వ్యక్తతాం యాతం రూపమిత్యభిధీయతే ।
సంస్థానం వ్యంజనం లిఙ్గం లక్షణం చిహ్నమాకృతిః ॥౭॥

తా॥ పైజెప్పబడిన పూర్వరూపము స్ఫుటముగ గానంబడినచో నద్దాని రూపమనందురు. అట్టి రూపము ఈ శాస్త్రమునందు సంస్థానం, వ్యంజనం, లింగం, లక్షణం, చిహ్నం, ఆకృతి, అను నీయారు పర్యాయపదములచే వ్యవహరింపంబడునని భావము.

ఇచ్చట పూర్వరూపములు జనించినతోడనే సంపూర్ణ లక్షణములతో గూడి జనించిన రోగముల స్వరూపమును దెల్పునది రూపముగాన పూర్వరూపలక్షణమును జెప్పినపిదప సంప్రాప్తి లక్షణమును జెప్పుట యుక్తంబైనను వ్యాధి యిట్టిదని స్పష్టముగ దెలియుటకై తొలుత రూపలక్షణమును జెప్పెనని యెరుంగునది. మరియు నాయా వ్యాధులను జెప్పియుండు పూర్వరూపములలో గొన్నియైనను అన్నియు గలిసియైనను స్ఫుటముగ గానంబడినచో నద్దాని రూపమనందురు. అంతట బూర్వరూపము లన్నియు వ్యక్తంబులై యున్నచో "పూర్వరూపాణి సర్వాణి జ్వరోక్తాన్యతిమాత్రయా । యం విశన్తి విశత్యేనం మృత్యుర్జ్వరపురస్సరః" అను చరకోక్త ప్రకారము జ్వరాదిరోగము లసాధ్యంబు లగుననియు, కొన్నియే గల్గియున్నయెడ సుఖసాధ్యంబు లనియు నెరుంగునది. ఈ యర్థమునే కొందరు "ఉత్పన్న వ్యాధిబోధక మేవ లింగం రూపం" అని వచించిరి. ఉత్పత్తినొందిన వ్యాధిని బోధించునదియే రూపంబని యర్థము. మరియు "తదేవ" అనునట్టి ఏవకారముచేత పూర్వరూపము వ్యక్తంబైన (స్ఫుటముగ గానంబడిన) చో రూపమగును గాని, నిదానాదులు రూపము కావని తాత్పర్యము. ఇత్తెరంగున రూపలక్షణము నెరుంగునది.

ఉపశయలక్షణము

శ్లో॥ హేతువ్యాధి విపర్యస్త విపర్యస్తార్థకారిణామ్ ।
ఔషధాఽన్నవిహారాణా ముపయోగం సుఖావహం ॥౮॥
విద్యా దుపశయం వ్యాధేః స హి సాత్మ్యమితి స్మృతః ॥

తా॥ వ్యాధిజనించుటకు గారణంబైన నిదానమునకును జ్వరాదిరోగములకును విరుద్ధంబులగు హరీతక మున్నగాగల ఔషధములయొక్కయు అన్నములయొక్కయు వాటిదేహమునకు సంబంధములగు వ్యాయామాది (దేహపరిశ్రమమున్నగాగల) విహారములయొక్కయు, శరీరమునకు సుఖకరంబైన ఉపయోగంబును, పైనజెప్పిన హేతువు (నిదానము) లకును వ్యాధులకును విరుద్ధములు గాక

న్నను, అట్టి హేతువ్యాధులకు విరుద్ధంబైన వ్యాధిశమన (వ్యాధినిశమింపఁజేయుట) రూపకార్యమును జేయునట్టి ఔషధాఽన్నవిహారముల నుపయోగించుటయు ఉపశయంబని చెప్పంబడును. అట్టి యుపశయమే వ్యాధికి సాత్మ్యంబనియు చెప్పంబడును.

గ్రన్థాన్తరమునందు, "దేశానా మామయానాఞ్చ విపరీతగుణాం గుణైః। సాత్మ్య మిచ్ఛన్తి సాత్మ్యజ్ఞా శ్చేష్టితఞ్చాద్యమేవచ॥" అని యున్నది. దేశములకును వ్యాధులకును విరుద్ధంబులగు గుణములుగల ఔషధాహారవిహారాదులు, క్రమముగ దేశసాత్మ్యమనియు వ్యాధిసాత్మ్యమనియు వైద్యులు వచించెదరని భావము.

మరియు, ఇచ్చట హేతువ్యాధులకు వేర్వేరుగనైనను రెంటికినైనను విరుద్ధగుణంబులైన ఔషధాహారాదులని యర్థము చెప్పుటచేత, హేతువిపరీతకరంబులును, వ్యాధివిపరీతకరంబులును హేతువ్యాధివిపరీతకరంబులును, హేతువిపరీతార్థకరంబులును, వ్యాధివిపరీతార్థకరంబులును, హేతువ్యాధి విపరీతార్థకరంబులు నగు ఔషధాన్నవిహారములను శరీరమునకు వ్యాధినివృత్తి రూపంబైన సుఖము జనించునట్లుపయోగించుట ఉపశయంబనియు, వ్యాధిసాత్మ్యంబనియు చెప్పంబడునని ముఖ్యతాత్పర్యము. మరియు, "సుఖానుబన్ధో యో హేతువ్యాధివ్యాధి విపరీతకః। దేశాదికశ్చోపశయో జ్ఞేయోఽనుపశయోఽన్యథా॥" (సుఖకరంబులై హేతువ్యాధులకు విపరీతంబులైన దేశకాలాదులు ఉపశయంబనియు, హేతువ్యాధుల కనుగుణంబులైన దేశకాలాదులు అనుపశయంబులనియు చెప్పంబడును.) అనునట్టి గ్రన్థాన్తర ప్రమాణమునుబట్టి ప్రకృతమూలమున, "ఔషధాఽన్న విహారాణాం" అనుపదము దేశకాలాదుల కుపలక్షణంబని యెరుంగునది. మరియు "సుఖావహః" అను పదమునకు వ్యాధినివృత్తిరూపంబైన సుఖమును గల్గించునది, అని యర్థము చెప్పుటచేత తాపము, దప్పి, మొదలగు గుణములతో గూడిన జ్వరాదులయందు శీతలజలపానము (చన్నీళ్లు ద్రాగుట) మున్నగునవి తత్కాలమున తాపము, దప్పి మొదలగును బాధల నివర్తింపంజేసి సుఖము గల్గించినను వ్యాధిని శమింపంజేయునవి కావుగాన శీతజలపానాదులు జ్వరాదివ్యాధుల కుపశయంబులు గావని యెరుంగునది. విహారంబులన, వాక్కు దేహము మనస్సు ఈ మూడిటికి సంబంధించిన దేహపరిశ్రమము, స్త్రీసంపర్కము, జాగరణము, అధ్యయనము (చదువుట), గానము, సంభాషణము మున్నగు చేష్టావిశేషములని యెరుంగునది.

హేతువిపరీతాదుల కుదాహరణము లెట్లనిన: శీతకఫములచే జనించిన జ్వరాదులయందు శీతకఫములకు విరుద్ధంబులైన ఉష్ణగుణముగల శుంఠ్యాదులను సేవించుటయు, శ్రమముచే జనించిన జ్వరమునందు శ్రమహారంబైన మాంసరసముతో గూడిన యన్నమును భుజించుటయు, పవలు నిద్రించుటచే గల్గిన రోగమున రాత్రియందు నిద్రమేల్కొంచుటయు క్రమముగ హేతువిరుద్ధంబులైన ఔషధాన్నవిహారంబు లగును. "శీతేనోష్ణకృతాన్ రోగాన్ శమయన్తి భిషగ్విదః। యే చ శీతకృతా రోగా స్తేషాముష్ణం భిషగ్జితం॥" అని గ్రన్థాన్తరమునందుండుటచేత, ఉష్ణముచే జనించిన రోగంబులకు శీతంబులగు ఔషధాదులచేతను, శీతలముచే జనించిన వ్యాధులను ఉష్ణంబులైన ఔషధాదులచేతను శమింపదగునని భావము.

మరియు, అతిసారమునందు చిరుబొద్ది మొదలగు ఔషధంబులును, విషమునకు విషమును, కుష్ఠవ్యాధియందు చంద్ర నుపయోగించుటయు వ్యాధివిపరీతంబులైన యౌషధములు. ఇచ్చట

లని లక్షణసమన్వయము. ఇత్తెరంగున నే అన్నవ్యాఖ్యానములయందును లక్షణసమన్వయము నెరుగునది. మరియు "ఉపశయః పునర్హేతువ్యాధివిపరీతానాం విపరీతార్థకారిణా మౌషధాహారవిహారాణా ముపయోగస్సుఖానుబన్ధః" అని చరకాచార్యుండు ఉపశయలక్షణమును జెప్పెను. ఇవ్విధంబుగ నుపశయలక్షణము నెరుంగునది.

అనుపశయలక్షణము

శ్లో॥ విపరీతోఽనుపశయో వ్యాధ్యసాత్మ్యేఽభిసంజ్ఞితః ॥౯॥

పైనజెప్పిన ఉపశయమునకు విరుద్ధలక్షణంబై శరీరమునకు వ్యాధివృద్ధి (వ్యాధిని వృద్ధినొందించుట) రూపంబైన దుఃఖమును గల్గించు నౌషధాన్నవిహారములు అనుపశయం బనియు వ్యాధ్యసాత్మ్యంబనియు జెప్పంబడును. ఈ యనుపశయము వ్యాధిని వృద్ధినొందించును గాన నిదానములో నంతర్భూతంబగుటంజేసి నిదానాదులైదిటికంటె వేరుగ జెప్పంబడదయ్యె. కనుక నే "విజ్ఞానం రోగాణాం పఞ్చధా స్మృతం" అను వాక్యము సంగతం బయ్యె నని యెరుంగునది. మరియు "గూఢలిఙ్గం వ్యాధి ముపశయానుపశయాభ్యాం పరీక్షేత" అను చరకవచనము ననుసరించి మిక్కిలి గూఢంబులైన లక్షణములు గల్గి తెలియంబడకుండు వ్యాధిని ఉపశయానుపశయముల రెంటిచే తెలిసికొనుట యావశ్యకము గాన దానికొఱకు అనుపశయ లక్షణము జెప్పంబడియెనని యెరుంగునది.

సంప్రాప్తిలక్షణము

శ్లో॥ యథాదుష్టేన దోషేణ యథాచానువిసర్పతా ।
నిర్వృత్తిరామయస్యాసౌ సమ్ప్రాప్తి ర్జాతిరాగతిః॥౧౦॥

తా॥ మరియు నానాప్రకారములయందు తప్పనరీతిగ దుష్టంబయి శరీరమునం దూర్ధ్వాదిగమనభేదములు గలిగి వ్యాపించు వాతాదిదోషములచేత జ్వరాదివ్యాధులు జనించుటయే సమ్ప్రాప్తి యని జెప్పంబడును. ఈ సమ్ప్రాప్తి యీ శాస్త్రమునందు జాతియనియు ఆగతియనియు పర్యాయపదములచే వ్యవహరింపఁ బడునని యెరుంగునది. దీనికి నుదాహరణము జ్వరాదిప్రకరణములయం దెరుంగునది. అదెట్టులనిన, "దోషాహ్యామాశయాశ్రితాః । బహిర్నిరస్య కోష్ఠాగ్నిం జ్వరదాస్స్యూ రసానుగాః । స్వేదావరోధస్సన్తాపస్సర్వాఙ్గగ్రహణం తథా॥ యుగపద్యత్ర రోగేచ సజ్వరో వ్యపదిశ్యతే" ప్రకుపితంబులైన దోషములు ఆమాశయమున చేరి కోష్ఠమునందలి యగ్నిని బయలువెడలించి రసధాతువుతో గూడి జ్వరమును గల్గించును. మరియు శరీరమున జెమటబొడమకుండుట, సర్వావయవములయందు సంతాపము, అగ్నిమాంద్యము ఈగుణములన్నియు సమకాలమునం దేవ్యాధియందునో అట్టిరోగమును జ్వరంబని యెరుంగవలెనని అర్థము. ఇచ్చట దోషములు ప్రకుపితంబులై యామాశయమునజేరి యగ్నిని బయలు వెడలించినచో నయ్యది స్వేదమును శరీరమున వెడలనీయక శరీరమునం దెల్ల సంతాపమును గల్గించుట జ్వరసంప్రాప్తియని లక్షణసమన్వయము నెరుంగునది.

శ్లో॥ సఙ్ఖ్యా వికల్పప్రాధాన్యబలకాలవిశేషతః ।
సా భిద్యతే యథాఽత్రైవ వక్ష్యన్తేఽష్టౌ జ్వరాఇతి॥ ౧౧॥

తా॥ మరియు సంఖ్య, వికల్పము, ప్రాధాన్యము, బలము, కాలము, అనువాని విశేషములచేత పైనజెప్పిన సంప్రాప్తి యైదువిధములుగ భేదముగల్గి యుండును. అదియెట్లులనిన: ఈ క్రింద, జ్వరము లెనిమిదివిధములని చెప్పినదాని నెరుంగునది. ఇచ్చట, వాతాదిదోషత్రయముచే మూడువిధంబులుగను, దోషద్వయ సంసర్గముచే మూడువిధంబులుగను, సన్నిపాతముచే నొకవిధంబుగను, ఆగంతుభేదముచే నొకవిధంబుగను, అన్నియుగలసి జ్వరములు ఎనిమిది విధములుగ నుండును గాన నాయాభేదముల ననుసరించి సంప్రాప్తి గూడ భిన్నంబై యుండునని భావము. ఇవ్విధంబుగనే "పఞ్చకాసాః" (కాసము లైదువిధములు) "పఞ్చశ్వాసాః" (శ్వాసము లైదువిధములు) "అష్టౌ గుల్మాః" (గుల్మములు ఎనిమిదివిధములు) అనునవి మొదలగుస్థలములయందు సంఖ్యావిశేషముచే సంప్రాప్తి భేదముల నెరుంగునది.

## వికల్పలక్షణము

శ్లో॥ దోషాణాం సమవేతానాం వికల్పోంశాంశకల్పనా॥

తా॥ జ్వరాదిరోగములలో నెద్దానియందైనను ఒకటిగ జేరియుండు వాతాదిదోషములయొక్క సూక్ష్మాంశములను ఊహచే గల్పించుట వికల్పకంబని యెరుంగునది. అది యెట్లులనిన: రూక్షత్వము, శీతత్వము, లఘుత్వము, విశదత్వము మున్నగాగల గుణములతోగూడిన వాతమును, అట్టిగుణములుగల కషాయరసము రౌక్ష్యాదిగుణాంశములన్నిటిచే వృద్ధినొందించుననియును, రౌక్ష్యము శైత్యము లాఘవము అనునీగుణములమూడిటిచేత చిత్తికూర వాతమును వృద్ధినొందించు ననియు, రౌక్ష్య శైత్యగుణములచే జెఱకు వాతమును వృద్ధినొందించుననియు, రౌక్ష్యగుణముచే మద్యము వాతమును వృద్ధినొందించుననియు, వాతవృద్ధియందు దానికి నిదానంబైన వస్తుగుణములను బట్టి రౌక్ష్యాదిగుణాంశములయొక్క కల్పనాభేదముల ననుసరించి సంప్రాప్తిగూడ భిన్నంబై యుండునని యర్థవిశేషము నెరుంగునది. ఈ యర్థమును సుశ్రుతుం డిత్తెరంగున జెప్పెను: "సర్వైర్భావై స్త్రిభిర్వాపి ద్వాభ్యా మేకేన వా పునః। సంసర్గే కుపితః క్రుద్ధం దోషం దోషోఽనుధావతి॥" ఒకవ్యాధియందు వాతాదిదోషములు గలిసియున్నపుడు అన్నిగుణములచేనైనను లేక మూడుగుణములచేనైనను ప్రకోపమునొందిన దోషమును పైనచెప్పినరీతిగనే ప్రకుపితంబులైన యితర దోషముల ననుసరించి శరీరమున వ్యాపించునని భావము. ఇత్తెరంగుననే తక్కిన పిత్తశ్లేష్మముల రెండిటికిని వికల్పము నెరుంగునది.

## ప్రాధాన్యలక్షణము

శ్లో॥ స్వాతన్త్ర్యపారతన్త్ర్యాభ్యాం వ్యాధేః ప్రాధాన్య మాదిశేత్ ॥౧౨॥

తా॥ మరియు, జ్వరాదిరోగములయందు ఇతరరోగములు సంక్రమించినపుడు వ్యాధులయొక్క స్వాతన్త్ర్యమును పారతన్త్ర్యమును బట్టి వ్యాధియొక్క ప్రాధాన్యము నెరుంగునది. స్వతంత్ర (ముఖ్య)ముగనుండు వ్యాధి ప్రధానంబనియు, పరతంత్రముగనుండు (ముఖ్యముగాకుండు) వ్యాధి అప్రధానంబనియు నెరుంగవలెనని భావము. ఇచ్చట ప్రధానంబైన వ్యాధి అనుబంధ్యమనియు, అప్రధానంబైనది అనుబంధ మనియు భేదము నెరుంగునది. మరియు వ్యాధిప్రాధాన్యమును బట్టి సంప్రాప్తిభేదమును జెప్పినచో దానికి బ్రతియోగి (విరోధి) యగు అప్రాధాన్యము

ననుసరించిన సంప్రాప్తిభేదముకూడ ఉక్తప్రాయముగాన "సంఖ్యా వికల్ప ప్రాధాన్య" అని మూలమున జెప్పంబడియె.

## బలాఽబల లక్షణము

శ్లో॥ హేత్వాదికార్త్స్న్యావయవై ర్బలాబలవిచక్షణం॥

తా॥ మరియు నాయావ్యాధులకు జెప్పియుండు నిదాన పూర్వరూప రూప ఉపశయ ములలో నొక్కొక్కదానియొక్క లక్షణములన్నియు గానంబడినచో వ్యాధి బలిష్ఠంబనియు, కొన్నియే కనబడినచో వ్యాధి బలహీనంబనియు క్రమముగ నెరుంగవలెనని యర్థము. ఏ వ్యాధికి ఏవేవి నిదానముగ జెప్పియుండునో అవియన్నియు గలిగియుండునెడ ఆ రోగము బలవంతం బనియు, వానిలో గొన్నిమాత్రమున్నయెడ బలహీనంబనియు భావము. ఇత్తెరంగుననే పూర్వ రూపమునుగూడ నెరుంగునది. మరియు వ్యాధికి జెప్పియుండు లక్షణము లన్నియు స్ఫుటముగ దెలి యుచున్నచో బలవంతమనియు, కొన్నియే కనబడినచో బలహీనంబనియు రూపముచేతనున్ను, సం పూర్ణంబులగు సంతర్పణాదులచేతను దేహమునకు సుఖముగల్గునెడ బలవంతమనియు, కొన్నిటిచేతనే సుఖము గల్గెనేని బలహీనంబనియు ఉపశయముచేతనున్ను వ్యాధిబలాఽబలముల నెరుంగునది. అట్టి బలాఽబలవిశేషముచేత గూడ సంప్రాప్తి భిన్నంబై యుండునని యెరుంగునది.

## కాలనిర్ణయము

శ్లో॥ నక్తం దినర్తు భుక్తాంశై ర్వ్యాధికాలో యథామలం॥౧౩॥

తా॥ మరియు రాత్రి పవలు వసన్తాది ఋతువులు భోజనము వీనియొక్క అంశముల (సూక్ష్మభాగముల) చేత ఆయాదోషముల ననుసరించి వ్యాధియొక్క వృద్ధిక్షయములకు హేతు వైన కాలము నెరుంగవలెనని భావము. దీని కుదాహరణం బెట్టు లనిన: శ్లేష్మముచే జనించిన జ్వర మునకు రాత్రి ప్రథమకాలంబును, పవలు పూర్వాహ్ణంబును, వసంత ఋతువును, భుజించిన ఉత్తర క్షణంబును, బలకరంబైన కాలము. తక్కినకాలములు బలనాశకరంబులు. దోషముల ననుసరించి కాలవిభాగము నీరీతిగ నెరుంగునది. రాత్రి ప్రథమభాగమున శ్లేష్మంబును, మధ్యభాగమున పిత్తం బును, మూడవభాగమున వాతంబును ప్రకోపమునొందును. దినమునకు గూడ నీరీతిగ నెరుంగునది. మరియు వసన్తర్తువునందు కఫంబును, శరదృతువునందు పిత్తంబును, వర్షర్తువునందు వాతంబును వృద్ధినొందును. భుజించినతోడనే కఫంబును, ఆహారము పచనం బగునపుడు పిత్తంబును, జీర్ణించు నపుడు వాతంబును ప్రకోపమునొందును. ఆ యర్థమునే వాగ్భటాచార్యుండు "తే వ్యాపినోఽపి హృన్నాభ్యో రధోమధ్యోర్ధ్వ సంశ్రయాః । వయోఽహోరాత్రిభుక్తానాం తేఽన్త మధ్యాదిగాః క్రమాత్:" అని వచించెను. ఇచ్చట, "తే" అనుపదమునకు వాత పిత్త శ్లేష్మములని యర్థము. ఇట్టి కాలభేదముచేత సంప్రాప్తి భిన్నంబై యుండునని యెరుంగునది.

శ్లో॥ ఇతి ప్రోక్తో నిదానార్థః తద్వ్యాసేనోపదేక్ష్యతే।

తా॥ ఇత్తెరంగున నిదానపదార్థము సకలవ్యాధిసామాన్యముగ సంగ్రహరూపముగ వివరింప బడియె. పిమ్మట జ్వరాదివ్యాధులయందు విస్తరముగ నాయావ్యాధుల ననుసరించి జెప్పంబడు

నని భావము. ఈగ్రంథము రోగనిదానముల దెలియుటకై రచియింపబడినది గాన ఆయారోగప్రకరణములయందు దానికి సంబంధించిన నిదానాదులు విశదముగ జెప్పబడునని తాత్పర్యము.

## నిదానవిశేషము

శ్లో॥ సర్వేషా మేవ రోగాణాం నిదానం కుపితామలా ॥౧౪॥
తత్ప్రకోపస్య తు ప్రోక్తం వివిధాఽహితసేవనం।

తా॥ జ్వరాది రోగములకన్నింటికిని ప్రకోపమునొందిన వాతాదిదోషములు నిదాన (కారణ) ముగ నుండును. అట్టిదోషత్రయము ప్రకోపమునొందుటకు పలుతెరంగులును అపథ్యకరంబులు నగు ఆహారవిహారాదులను జేయుట కారణంబైయుండునని యర్థము. ఈయర్థమును చరకుండిట్టె రంగున నుడివెను: "నాస్తి రోగో వినా దోషై ర్యస్మాత్తస్మాద్విచక్షణః। అనుక్తమపి దోషాణాం లింగై ర్వ్యాధి ముపాచరేత్॥" దోషప్రకోపము లేకనే రోగం బొక్కటియైన జనించుటలేదు గాన కొన్నివ్యాధులకు దోషప్రకోపమును జెప్పకుండినను ఆయాదోషచిహ్నములనుబట్టి దోషమును నిర్ణయించి తదనుసారముగ చికిత్స జేయవలెనని భావము. మరియు ఆగంతురోగములయందు రోగములు జనించునప్పుడు వాతాదిదోషముల సంబంధము లేకున్నను ఫలాదులయందు కాలాంతరమున మధురాదిగుణంబులు గల్గుచందంబున వ్యాధి జనించిన పిదప వాతాదిదోషగుణములు కల్గునని యెరుంగునది. ఈవిషయమై చరకుండు "ఆగన్తుర్హి వ్యథాపూర్వ సముత్పన్నో జఘన్యం వాతపిత్తశ్లేష్మణాం వైషమ్య మాపాదయతి" అని వచించెను. ఆగంతుకవ్యాధి తొలుత జనించి పిమ్మట వాతాదిదోషములచే జనించు వికారములను కల్గించునని భావము. మరియు దోషములు కల్గుటకు కారణములు సన్నికృష్టములనియు విప్రకృష్టములనియు రెండువిధములు. అందు దోషప్రకోపముచే వ్యాధి జనించును గాన వాతాదిదోషములు సన్నికృష్ట (సమీపించిన) కారణములనియు అట్టిదోషములను ప్రకోపింపజేయు అపథ్యాహారాదులు విప్రకృష్ట (వ్యవధానముకల) కారణములనియు నెరుంగునది. మఱియు "దూషయన్తీతి దోషాః" అను వ్యుత్పత్తిచేత రసాదిధాతువులను దుష్టంబులుగ జేయుటంజేసి వాతాదులు మూడును దోషశబ్దముచే వ్యవహరింపబడును. కొందరు "ప్రకృత్యారమ్భకత్వే సతి దుష్టికర్తృత్వం దోషత్వం" అని దోషలక్షణమును నుడివిరి. వాతాది ప్రకృతులకు కారణంబులై రసాదిధాతువులను దుష్టంబులుగ జేయునవి దోషములని యర్థము. వాతాదులచే దుష్టంబులైన శుక్లశోణితములవలన జనించిన వారికి క్రమముగ వాతప్రకృతియనియు, పిత్తప్రకృతియనియు, శ్లేష్మప్రకృతియనియు ప్రకృతులు మూడువిధంబులై యుండును. అట్టి వాతాది ప్రకృతుల కారంభకములై రసాదిధాతువులను దుష్టంబులుగ జేయునవి దోషములని ఫలితార్థము. మఱియు "దోషానుశయితా హ్యేషాం దేహప్రకృతి రుచ్యతే" అని చరకమునను డుటంజేసి వాతాదిదోషముల ననుసరించియుండు దేహతత్వములు వరుసగా వాతపిత్తకఫ ప్రకృతులనియు, అట్టి ప్రకృతులకు కారణంబులైనవి దోషములనియు చెప్పుటవలన రసాదిధాతువులు ప్రకృత్యారంభకములు గామింజేసి రసాదులకు దోషసంజ్ఞ లేదని యెఱుంగునది. మఱియు వాతాదిప్రకృతులయందు అపథ్యంబులగు నాహారాదులచేత మిక్కిలి బాధజనించకుండుననియు, వాతాదులచే జనించిన రోగములయందు

అపథ్యసేవనచేత విశేషముగ బాధజనించుననియు, వాతాదిప్రకృతులకును వాతాదులచే జనించిన రోగములకును పరస్పరభేదము నెరుంగునది. ఈయర్థము "విషజాతో యథా కీటో విషేణ నవిపద్యతే। తద్వత్ప్రకృతిభిర్దేహ స్తజ్జాతత్వా న్నబాధ్యతే" అని తన్త్రాన్తరమున గానంబడియెడు. విషమున బుట్టిన పురుగు విషముచే నాపదనొందకుండుకరణి వాతాదిప్రకృతుల చేత శరీరము బాధింపంబడదని భావము.

మరియు వాతాదిప్రకోపకారణములు వాగ్భటమున నీరీతిగ జెప్పంబడియె. "తిక్తోషణ కషాయాఽల్పరూక్ష ప్రమిత భోజనైః। ధారణోదీరణ నిశాజాగరాఽత్యుచ్చ భాషణైః। క్రియాఽతియోగ భీ శోక చిన్తా వ్యాయామ మైథునైః। గ్రీష్మాఽహోరాత్రి భుక్తాన్తే ప్రకుప్యతి సమీరణః। పిత్తం కట్వమ్లతీక్ష్ణోష్ణ పటుక్రోధ విదాహిభిః॥ శరన్మధ్యాహ్న రాత్ర్యర్ధ విదాహసమయేషు చ। స్వాద్వమ్ల లవణ స్నిగ్ధ గుర్వభిష్యన్ది శీతలైః। ఆస్యాస్వప్నసుఖాఽజీర్ణ దివాస్వప్నాఽతి బృంహణైః। ప్రచ్ఛర్దనాద్య యోగేన భుక్తమాత్ర వసన్తయోః। పూర్వాహ్ణే పూర్వరాత్రే చ శ్లేష్మా, ద్వన్ద్వన్తు సంకరాత్। మిశ్రీభావా త్సమస్తానాం సన్నిపాత స్తథాపునః॥" తిక్త (చేదు) ఊషణ (కారము) కషాయ (వగరు) ఈరసములుగలద్రవ్యములను భుజించుట, స్వల్పముగ భుజించుట, రూక్షపదార్థముల భుజించుట, కాలము నతిక్రమించి భుజించుట, వాత మూత్రపురీషములను విసర్జించక వానివేగమును నిరోధించుట, వాతాదులను బలాత్కారముగ బైలువెడలించుట, రాత్రియందు నిదుర మేల్కాంచియుండుట, బిగ్గరగ మాట్లాడుట, వమన విరేచన ఆస్థాపనాదిక్రియలను అధికముగ జేసికొనుట, భయపడుట, దుఃఖించుట, మనసున చింతబడుట, దేహపరిశ్రమ జేయుట, స్త్రీసంభోగము జేయుట, ఈకారణములచేతను, గ్రీష్మకాలమునందును, అహోరాత్రుల (రేయిబవళ్లు) యొక్క అంతములందును, భోజనాన్తమునందును వాతము ప్రకోపము నొందుననియు, కటు (కారము) రసముగల పదార్థములను, ఆమ్ల (పులుసు) రసముగల పదార్థములను, తీక్ష్ణపదార్థములను, ఉష్ణపదార్థములను, ఉప్పుగల పదార్థములను భుజించుటచేతను, కోపబడుటచేతను, విదాహి పదార్థములను భుజించుటచేతను, శరత్కాలమునందును, మధ్యాహ్నకాలమునందును, అర్ధరాత్రియందును, ఎండకాలమునందును పిత్తము ప్రకోపము నొందుననియు, మధురరసంబును అమ్లరసంబును లవణరసంబును గల ద్రవ్యంబులభుజించుట స్నిగ్ధపదార్థములను అజీర్ణకరపదార్థములను జలుబునుజేయుపదార్థములను శీతలపదార్థములను భుజించుట, ఎల్లప్పుడు కూర్చుని యుండుట, అధికముగ నిదురించుట, అజీర్ణము, పవటియందునిదురించుట, శరీరమునకు పుష్టికరంబులగు పదార్థములను విశేషముగ సేవించుట, వమనాద్యౌషధముల సేవించినప్పుడు వమనాదులు చక్కగ గాకుండుట, ఈ కారణములచేతనున్ను, భోజనాఽనన్తరకాలమునందును, వసన్తకాలమునందును, పగటిపూర్వభాగమునందును కఫము ప్రకోపము నొందుననియు, పైన వాతాదులకు వేర్వేరుగ జెప్పబడిన కారణములలో రెండేసికారణములు కలిసినచో దోషద్వయము ప్రకోపించుననియు, కారణములన్నియు గలిసియున్నచో త్రిదోషంబులును ప్రకోపించుననియు భావము.

## చరకాఽఙ్గీకృతనిదానాఽనువాదము

శ్లో॥ నిదానార్థకరో రోగో రోగస్యాఽప్యుపజాయతే ॥౧౫॥
తద్యథా జ్వరసన్తాపా ద్రక్తపిత్త ముదీర్యతే।
రక్తపిత్తాజ్జ్వరః, తాభ్యాం శోషశ్చాఽ ప్యుపజాయతే ॥౧౬॥
ప్లీహాఽభివృద్ధ్యా జఠరం జఠరా చ్ఛోథఏవచ।
అర్శోభ్యో జాఠరం దుఃఖం గుల్మశ్చాఽప్యుపజాయతే॥ ౧౭॥
* * దివాస్వాపాది దోషైశ్చ ప్రతిశ్యాయశ్చ జాయతే* *
ప్రతిశ్యాయా దథో కాసః కాసా త్సఞ్జాయతే క్షయః।
క్షయో రోగస్య హేతుత్వే శోషస్యాప్యుపజాయతే॥ ౧౮॥

తా॥ తనకు సంబంధించిన కారణములచే జనించిన రోగము వేరొండు రోగమునకు నిదానము జేయు కార్యమును జేయును. (అనగా ముందు జనించినరోగము మరియొకరోగమును నిదానము వలె గల్గించునని భావము.) అది యెట్లులనిన: జ్వరముయొక్క సంతాపముచేత రక్తపిత్తంబును రక్తపిత్తముచేత జ్వరంబును, జ్వరరక్తపిత్తముల రెంటిచేత శోషంబును, ప్లీహవృద్ధిచేత ఉదరంబును, మహోదరముచేత శోథరోగంబును (వాపు), అర్శో (మూల) రోగములచేత ఉదరములో జనించు (కడుపునొప్పి మున్నగు) రోగంబులును, గుల్మరోగంబును, పవలు నిద్రించుట మున్నగు కారణములచే ప్రతిశ్యాయము (పడిశెము) చేత కాసంబును (దగ్గు), కాసరోగముచేత క్షయరోగంబును జనించును. మరియు నాక్షయరోగము శోషరోగమునకు గారణంబై యుండును. ఇచ్చట కొందరు "క్షయోరోగస్య హేతుత్వే శోషశ్చాప్యుపజాయతే" అని పాఠాన్తరమును కల్పించి, క్షయ, ఉరోగ అనుపదములకు రెంటికిని సమాహారద్వన్ద్వఏకవచనముల నంగీకరించి, శోషము (ధాతుక్షయము) రాజయక్ష్మకును ఉరః క్షతమునకును కారణం బగునని యర్థమును రచించెదరు. మఱియు "నిదానార్థకరః" అను పదమునకు చరకమతానుసారముగ అసాత్మ్యేన్ద్రియార్థసంయోగ ప్రజ్ఞాపరాధ పరిణామంబులని మూడువిధంబులగు నిదానములు జ్వరము మున్నగాగల వ్యాధులను గల్గించుభంగి, అట్టినిదానములచే బలిష్ఠంబులగు జ్వరాదిరోగములు రక్తపిత్తము మున్నగు వ్యాధులను గల్గించునని యర్థము. ఇట్లు చెప్పుటచేత "నిదానార్థకరోరోగః" అను నదికూడ మూడువిధంబులైన నిదానములలో నన్తర్భూతంబగును గాన నిదానములు మూడు విధంబులని చెప్పిన చరకవచనమునకు పౌర్వాఽపర్యవిరోధము లేదని యెరుంగునది.

## రోగము రోగాన్తరమును గల్గించు క్రమము

శ్లో॥ తే పూర్వం కేవలా రోగాః పశ్చాద్ధేత్వర్థకారిణః।
కశ్చిద్ధి రోగో రోగస్య హేతు ర్భూత్వా ప్రశామ్యతి। ౧౯।
న ప్రశామ్యతి చాప్యన్యో హేతుత్వం కురుతేఽపిచ।
ఏవం కృచ్ఛ్రతమా నౄణాం దృశ్యన్తే వ్యాధిసంకరాః ॥౨౦।

తస్మా ద్యత్నేన సద్వైద్యై రిచ్ఛద్భి స్సిద్ధి ముద్ధతాం।
జ్ఞాతవ్యో వక్ష్యతే యోఽయం జ్వరాదీనాం వినిశ్చయః॥ ౨౧॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
పఞ్చలక్షణ నిదానం సమాప్తమ్

తా॥ సామాన్యముగ శరీరమున వ్యాపించి బాధించుచుండు రోగములు కొంతకాలమునకు గొన్ని కారణములచే బలిష్ఠంబులై నిదానముల బోలి వేరొండురోగమును గల్గించును. అట్టిరోగ ములలో నొకటి వేరొకరోగమునకు కారణంబై యారోగము జనించినపిదప తనంతనే శమించును. పీనస మున్నగు కొన్నివ్యాధులు, కాసము మున్నుగాగల వ్యాధులను గల్గించి యంతట శమించకనే బాధించుచుండును. ఇత్తెరంగున నానావిధబాధల గల్గించుటచే మిక్కిలి కృచ్ఛ్రసాధ్యంబులగు వ్యాధులు మనుజులకు గానంబడును గాన మిక్కుటంబగు కార్యసిద్ధిని గోరిన వైద్యులు ఈ క్రింద జెప్పబడు జ్వరాదిరోగములయొక్క నిర్ణయమును అతిప్రయత్నముతో దెలిసికొనవలెనని భావము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గో
త్రవిరాజమాన దివ్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదాన దీపికయను

మాధవనిదానార్థతాత్పర్యమునందు
పఞ్చలక్షణనిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# అథ జ్వరనిదానమ్

జ్వరము సర్వరోగములయందుఁ బ్రధానంబు గావునఁ దొలుతం జెప్పఁబడుచున్నది. జ్వరంబునకుం బ్రాధాన్య మెట్లనిన—ఇది శరీరరోగములయం దన్నిటికంటె దొలుతం బుట్టినది, బలముగలది, దేహేంద్రియమనస్సులను తపింపంజేయునది, జన్మమరణములయం దవశ్యముండునది, స్థిరచరరూపములగు సర్వప్రాణులకును సంభవించునది అని చరకంబునఁ జెప్పంబడినది. గ్రంథాంతరంబున ఈ జ్వరము ఏనుగులకు పాకలమనియు, గుఱ్ఱంబులకు నభిపాతంబనియు, గోవుల కీశ్వరమనియు, మనుజులకు జ్వరమనియు, మేకలకును గొఱియలకును ప్రలాపమనియు, ఒంటెలకు నలసంబనియు, మహిషంబులకు హారిద్రంబనియు, మృగంబులకు మృగరోగంబనియు, పక్షుల కభిఘాతంబనియు, మత్స్యంబుల కింద్రమదంబనియు, పతంగంబులకు పక్షపాతంబనియు, సర్పంబుల కక్షికమనియు, జలంబునకు నీలికమనియు, భూమికి నూషరంబనియు, వృక్షంబులకు కోటరంబనియు వ్యవహరింపం బడుచున్నది. కావున దీనింబోలిన వికారంబు లేవియు గన్పడవు.

శ్లో॥ దక్షాఽపమానసంక్రుద్ధ రుద్రనిశ్వాససంభవః ।
జ్వరోఽష్టధా పృథగ్ద్వంద్వ సంఘాతాగంతుజ స్స్మృతః॥౧॥

తా॥ రుద్రుడు దక్షప్రజాపతిమీద కోపించినప్పుడు ఆయన కోపనిశ్వాసములవలన జ్వరము జనియించినది. అది వాతజ్వరము, పిత్తజ్వరము, కఫజ్వరము, వాతపిత్తజ్వరము, వాతకఫజ్వరము, పిత్తకఫజ్వరము, సన్నిపాతజ్వరము, ఆగంతుజ్వరము అని ఎనిమిది విధంబులయినది.

ఇచ్చట ''రుద్రనిశ్వాససంభవః'' అనుటచే జ్వరమునకు రుద్రకోపము విప్రకృష్టకారణమని దెల్పఁబడినది. క్రోధమువలన జనియించినది గావున జ్వరము తేజోరూపమని తెలియఁబడుచున్నది. కనుక సర్వజ్వరములయందును తేజోరూపమగు పిత్తమునకు విరోధము లేనటుల చికిత్సం జేయవలయునని సిద్ధించినది. ఈ యర్థమును, ఊష్మా పిత్తా దృతే నాస్తి జ్వరో నాస్త్యూష్మణా వినా । తస్మాత్పిత్త విరుద్ధాని త్యజేత్పిత్తాఽధికేఽధికం'' అని వాగ్భటుండు వచించెను. కనుకనే చరకంబున తరుణజ్వరములకు పాచనార్థము కట్వమ్లలవణముల వర్జించి పిత్తహారమగు తిక్తరసము నిర్దేశింపఁబడినది. మఱియు కొందరు విదేహప్రభృతులు జ్వరము రుద్రకోపసంభవము గావున దేవతాత్మకమయి పూజార్హమగుననిరి. మరియు, ''జ్వరస్తు పూజన్నైర్వాపి సహసై వోపశామ్యతి'' అని యుండుటచేత నీ జ్వరము ఈశ్వరసంబంధ మగు

టంజేసి పూజాదిసత్క్రియలచే గూడ శీఘ్రముగ శాన్తి నొందుననని దెలియుచున్నది. హరి వంశంబున జ్వరము త్రిపాదమనియు త్రిశిరస్సనియు షడ్భుజ మనియు నవలోచన మనియు భస్మాయుధ మనియు రౌద్రాకార మనియు కాలాంతకయమోపమ మనియు దేహవంతముగనే చెప్పంబడినది.

## జ్వర సంప్రాప్తి

శ్లో॥ మిథ్యాహార విహారాభ్యాం దోషా హ్యామాశయాశ్రయాః।
బహిర్నిరస్య కోష్ఠాఽగ్నిం జ్వరదాస్స్యూ రసానుఽగాః॥౨॥

తా॥ దేశకాల దేహప్రకృతి మొదలగువానికి విరుద్ధముగ నుపయోగింపబడిన ఆహార ఆచారములచేత వాత పిత్త కఫములు ఆమాశయమును బొందినవియై జఠరాగ్నిని వెలుపలికి ద్రోసి రసధాతువుతోఁ జేరినవి యగుచు జ్వరమును కలుగజేయును. అనగా దేహప్రకృతి మొదలగువానిక సరిపడని ఆహారవిహారములచేత దోషములు ఆమాశయమునందుఁ జేరి రసధాతువు ననుసరించి జఠరాగ్నిని వెడలఁద్రోయును, ఆయగ్ని వెలుపలికి వచ్చి జ్వరమగుచున్నదని భావము. ఇచ్చట "ఆమాశయాశ్రయాత్ః" అనుటచేత ఆమాశయమును జేరనియెడ జ్వరముగలుగదు. "రసానుగాః" అనుటచే అవశ్యముగ రసధాతువును దూషింపజేసియే జ్వరమును బుట్టించునని యరుగుచున్నది.

## జ్వర సామాన్య లక్షణము

శ్లో॥ స్వేదావరోధ స్సంతాప స్సర్వాఙ్గ గ్రహణంతథా।
యుగప ద్యత్ర రోగేచ జ్వరో వ్యపదిశ్యతే ౩॥

తా॥ ఏరోగమునందు చెమట బైట వెడలకుండుట, దేహమునకును ఇంద్రియములకును మనస్సునకును తాపముగలుగుట, దేహమంతట నొప్పి, ఇవి ఏకకాలమందు కల్గునో, ఆరోగము జ్వరమని వ్యవహరింపబడుచున్నది. అనగా చెమటలేకుండుట, తాపము గలుగుట, దేహమునందంతట నొప్పి ఇవియన్నియు జ్వరమునకు లక్షణములని భావము.

## జ్వరములకు సామాన్య పూర్వరూపము

శ్లో॥ శ్రమోఽరతి ర్వివర్ణత్వం వైరస్యం నయనప్లవః।
ఇచ్ఛాద్వేషా ముహుశ్చాపి శీతవాతాతపాదిషు ॥౪॥
జృంభాఙ్గమర్దో గురుతా రోమహర్షోఽరుచి స్తమః।
అప్రహర్ష శ్చ శీతంచ భవత్యుత్పత్స్యతి జ్వరేః ॥౫॥
సామాన్యతః॥ ... ... ... ...

తా॥ అలసట, చిత్తమునకు నిలుకడ లేకుండుట, దేహము డస్సి వర్ణము మారియుండుట, నోటికి రసము విరుద్ధముగా నుండుట, కన్నుల నీరు నిండియుండుట, చలి గాలి యెండ మొదలగు వానియందు మాటిమాటికి ప్రీత్యప్రీతులు, ఆవలింతలు, ఒడలు విరుపులు, దేహము బరువుగ నుండుట, గగుర్పాటు, దేనియందును రుచిలేకపోవుట, చీకట్లుగ్రమ్మినట్లుండుట, సంతోషము లేకుం

డుట, చలి, ఈ గుణములన్నియు జ్వరము పుట్టబోవుచుండగా (అన్నిజ్వరములకు) సాధారణముగా కలుగుచున్నవి. జ్వరముల కన్నిటికి సాధారణముగా వచ్చుటకు ముందు ఈలక్షణములు కల్గునని భావము.

జ్వరములకు వేర్వేరుగం బూర్వరూపములను జెప్పుట

శ్లో॥ ... ... విశేషాత్తు జృంభాత్యర్థం సమీరణాత్ ॥
పిత్తా న్నయనయోర్దాహః కఫా దన్నాఽరుచిర్భవేత్ ॥౬॥
రూపైరన్యతరాభ్యాంతు సంసృష్టే ద్వంద్వజం విదుః।
సర్వలిఙ్గసమావాయ స్సర్వదోష ప్రకోపతే॥ ౭॥

తా॥ వాతజ్వరమునకు పూర్వరూపము ఆవలింతలు, పిత్తజ్వరమునకు కన్నులమంటలు, కఫజ్వరమునకు అన్నము రుచించకుండుట, వాతపిత్త జ్వరమునకు ఆవలింతలున్ను కన్నులమంటయున్ను వాత శ్లేష్మ జ్వరమునకు ఆవలింతలున్ను అన్నమం దరుచియును, పిత్తశ్లేష్మ జ్వరమునకు కన్నుల మంటలును అన్నమం దరుచియును, త్రిదోషజ్వరమునకు ఆవలింతలున్ను కన్నులమంటయును అన్నారుచియును పూర్వరూపములగును.

వా త జ్వ ర ల క్ష ణ ము

శ్లో॥ వేపథు ర్విషమో వేగః కంఠౌష్ఠ పరిశోషణం ।
నిద్రానాశః క్షుత స్తంభో గాత్రాణాం రౌక్ష్యమేవ చ ।
శిరోహృద్గాత్రరుగ్వక్త్రే వైరస్యం గాఢవిట్కతా ।
శూలాధ్మానే జృంభణం చ భవత్యనిలజే జ్వరే॥ ౮॥

తా॥ వణుకు, జ్వరముయొక్క ప్రవృత్తి ఒకొ్కకప్పు డధికముగను మఱియొకప్పుడు తగ్గుగనుండుట, గొంతు పెదవులు ఆరుట, నిద్రలేకుండుట, తుమ్ములు, జడత్వము, అవయవములకు జిడ్డులేకుండుట, తలయందును రొమ్మునందును దేహమునందును నొప్పి, నోటియందరుచి, మలము గట్టిపడుట, కడుపునొప్పి, ఉబ్బరము, ఆవలింతలు, ఈ గుణములన్నియు వాతమువలనఁ బుట్టిన జ్వరమునందు కల్గును. అనఁగా వాతజ్వరమునకీ లక్షణములుండునని భావము. వాత పిత్త కఫములలో వాతము పెద్దది. దారుణమైనది, దానికన్న చిన్నది పిత్తము. దానికన్న కఫము చిన్నది. కావున ముందు వాతజ్వరమును జెప్పెను. ఇవ్విధంబుగనే సర్వరోగంబులయందును వాత పిత్త కఫములు వరుసగా చెప్పంబడును:—వాతరోగంబు లెనుబది, పిత్తరోగంబులు నలువది, కఫరోగంబు లిరువది యని చరకంబునఁ జెప్పంబడియున్నది. కావున వాతాదులలో పూర్వపూర్వము పెద్దది. ఆ ప్రకారము వాతమునందు ఆక్షేపక పక్షాఘాతంబులు మొదలగునవి క్రూరములనియు నెరుంగునది.

మరియు ఆధ్మాన మనఁగా వాయువు గర్భమునందునిండి నొప్పితోకూడి కడుపు ఉబ్బరించుట "శిరోహృద్గాత్రరుక్" అనుచోట గాత్రశబ్దముచేతనే శిరోహృత్తులు గ్రహింపబడినను శిరోహృచ్ఛబ్దములను మరల జెప్పుటచేత దేహమునకన్న శిరంబునను హృదయంబునను వేదన యధికముగ నుండునని యెఱుంగునది. ఈచెప్పంబడిన లక్షణములు తరుచుగా గలుగునే గాని వీనికన్న

నితరలక్షణములును వాతజ్వరమందుగల్గునని సుశ్రుతమునందు చెప్పంబడినది. ఇతరలక్షణములు చరకమునందు అనేక విధములగు వాతనొప్పులు, కాళ్లుతిమ్మిరి, పిక్కలుతీపు, చెవులలోనాదము, నోరు వగరుగ నుండుట, తొడలు చిక్కుట, దవడలు పట్టుకున్నట్లుండుట, కీళ్లయందును, మోకాళ్లయందును పీడినట్లుండుట, పొడిదగ్గు, వమనము, గగుర్పాటు, బడలిక, భ్రమ, కన్నులును మూత్రమును అరుణవర్ణము గలిగియుండుట, దప్పి, ప్రలాపము, వేడినికోరుట ఇవియన్నియు చెప్పంబడినవి.

## పిత్తజ్వరలక్షణము

శ్లో॥ వేగస్తీవ్రోఽతిసారశ్చ నిద్రాఽల్పత్వం తథా వమిః।
కంఠౌష్ఠముఖనాసానాం పాకస్స్వేదశ్చ జాయతే ॥౧౦॥
ప్రలాపో వక్త్రకటుతా మూర్ఛాదాహో మదస్తృషా॥
పీతవిణ్మూత్ర నేత్రత్వం పైత్తికే భ్రమఏవచ॥ ౧౧॥

తా॥ జ్వరముయొక్క ప్రవృత్తితీక్ష్ణంబై యుండుట, ద్రవముగ మలమునువిడచుట, నిద్రతగ్గుట, వాంతి, కంఠమునందును పెదవులయందును నోరువందును ముక్కులయందును పుండగుట, చెమటబట్టుట, అసంబద్ధముగ మాటలాడుట, నోరు చేదుగ నుండుట, రూపాదులను తెలియకుండుట, దేహమునందు మంటలు, (ఉమ్మెత్తకాయ మొదలగునవి తినినప్పుడుండునట్లు) మత్తతగలుగుట, దప్పి, మలము మూత్రము నేత్రములు ఇవి పచ్చగనుండుట, దేహము తిరిగినట్లుండుట, లేక ఇతరవస్తువులు తిరుగుచున్నట్లు కనబడుట, ఈగుణములు పిత్తజ్వరమందు కలుగునని భావము.

ఇచ్చట చకారమువలన చరకమునందు జెప్పిన తీవ్రమైనవేడి, ఎఱ్ఱని బొబ్బలులేచుట శీతోపచారములయం దిచ్ఛ, అరోచకము ఈలక్షణములుగూడ జనించునని యెరుంగునది. మరియు భ్రమము అశీతివాత రోగములలో పరిగణనముచేయబడియుండుటచే వాతమువలన జనించునదియైనను "నరోగోప్యేకదోషజః" అను వాక్యము ననుసరించి ఒకదోషముచేతనే రోగము జనించదుగాన పిత్తజ్వరమునందును వాతసంబంధముచేత భ్రమము కల్గునని యెఱుంగునది. ఈయర్థమును సుశ్రుతాచార్యుండు "రజఃపిత్తానిలాద్భ్రమః" అనివచించెను. వాతముతో గలిసిన పిత్తముచే భ్రమము జనించునని భావము.

## కఫజ్వరలక్షణము

శ్లో॥ స్తైమిత్యం స్తిమితోవేగ ఆలస్యమ్మధురాస్యతా।
శుక్లమూత్ర పురీషత్వం స్తంభస్తృప్తిరథాపిచ॥౧౨॥
* *నాత్యుష్ణగాత్రతా ఛర్ది రఙ్గసాదాఽవిపాకితా * *
గౌరవం శీత ముత్క్లేదో రోమహర్షోఽతినిద్రతా।
ప్రతిశ్యాయోఽరుచిః కాసః కఫజేఽక్ష్ణోశ్చశుక్లతా॥ ౧౩॥

తా॥ దేహముమీద తడిగుడ్డ గప్పినట్లు కదలకుండుట, జ్వరవేగము మందముగ నుండుట, పనులయందు ప్రాలుమాలిక, నోరు తీపుగనుండుట, మలమూత్రములు తెల్లగనుండుట, దేహము పొద్దు

బారియుండుట, అన్నాదులు చాలినట్లుండుట, ఒడలు బరువుగ నుండుట, చలిపట్టినట్లుండుట, వమనము వచ్చునట్లుండుట, గగురుపాటు గలుగుట, మిక్కిలి నిద్రవచ్చుట, పడిశము బట్టుట,(అన్నాదులయందు అభిలాష గల్గియున్నను) రుచిలేకపోవుట, దగ్గు గల్గుట, నేత్రములయందు తెల్పుగలుగుట, ఈలక్షణములు కఫజ్వరమున గల్గును. ఇచ్చట పూర్వమువలె చకారమువలన దేహమునందు చల్లని పొక్కులులేచుట, నోటనీరూరుట, వమనము వచ్చుట, కునికిపాటుగలుగుట, రొమ్ము పూసినట్లుండుట, వేడినిగోరుట, జఠరాగ్ని మందముగ నుండుట, ఇవియును కఫజ్వర లక్షణములుగా తెలియవలయును.

## వాతపిత్తజ్వరలక్షణము

శ్లో॥ తృష్ణా మూర్ఛా భ్రమో దాహ స్స్వప్ననాశ శ్శిరోరుజా ।
కంఠాఽఽస్య శోషో వమథూ రోమహర్షోఽరుచి స్తమః॥ ౧౪ ॥
పర్వభేదశ్చ జృంభాచ వాతపిత్త జ్వరాకృతిః ।

తా॥ దప్పి మూర్ఛ, (అనగా రూపరసాదిజ్ఞానము లేకుండుట), భ్రమ, తాపము, నిద్రపట్టకుండుట, తలనొప్పి, గొంతు నోరుఎండుట, వమనము, గగురుపాటు, అన్నాదులయందు రుచిలేకపోవుట, చీకట్లు గ్రమ్మినట్లుండుట, వ్రేళ్ల గణుపులలోనొప్పి, ఆవలింతలు, ఇవి వాతపిత్తజ్వరలక్షణములు. అనగా నీచెప్పబడిన లక్షణములు గల్గినది వాతపిత్తజ్వరమని యెరుంగవలెనని భావము.

## వాతశ్లేష్మజ్వరలక్షణము

శ్లో॥ స్తైమిత్యం పర్వణాం భేదో నిద్రా గౌరవ మేవ చ ॥౧౫॥
శిరోగ్రహః ప్రతిశ్యాయః కాసస్స్వేదాఽప్రవర్తనం ।
సంతాపో మధ్యవేగశ్చ వాతశ్లేష్మజ్వరాకృతిః ॥ ౧౬ ॥

తా॥ దేహము తడిసినబట్టగప్పినట్లు స్తిమితముగ నుండుట, వ్రేలి గణుపులయందు నొప్పి, నిద్రగల్గుట, దేహము బరువుగ నుండుట, తల దిమ్ముపట్టినట్లుండుట, పడిశము, దగ్గు, చెమటపట్టకుండుట, దేహమందు మంటలు, జ్వరము, విశేషవేగము లేకుండుట, ఈ లక్షణములు గలది వాతశ్లేష్మ జ్వరమని తెలియునది.

## పిత్తశ్లేష్మజ్వరలక్షణము

శ్లో॥ లిప్తతిక్తాస్యతా తంద్రా మోహః కాసోఽరుచి స్తృషా ।
ముహుర్దాహో ముహుశ్శీతం పిత్తశ్లేష్మజ్వరాకృతిః ॥ ౧౭ ॥

తా॥ శ్లేష్మముచేత నోరు జిగటగ పూసినట్లును పిత్తముచేత చేదుగనుండుట, కునికిపాటు, మత్తు, దగ్గు, ఏ వస్తువులును రుచించకుండుట, దప్పి, మాటిమాటికి తాపము, చలి, ఈ లక్షణములు గలది పిత్త శ్లేష్మ జ్వరమని తెలియునది. ఈ లక్షణములు తరుచుగ గల్గునవి. చరకంబున చెప్పఁబడిన జడత్వము, చెమటబాగుగపట్టుట, శ్లేష్మంబును పసరును బయలు వెడలుట ఈ లక్షణములు గూడ జనించునని యెరుంగునది,

## సన్నిపాత జ్వర లక్షణము

శ్లో॥ క్షణే దాహః క్షణే శీత మస్థిసంధి శిరోరుజా ।
సాస్రావే కలుషే రక్తే నిర్భుగ్నే చాపి లోచనే ॥ ౧౮ ॥
సస్వనౌ సరుజౌ కర్ణౌ కణ్ఠశ్శూకై రివావృతః ।
తన్ద్రా మోహః ప్రలాపశ్చ కాసశ్శ్వాసోఽరుచిర్భ్రమః ॥ ౧౯ ॥
పరిదగ్ధా ఖరస్పర్శా జిహ్వా స్రస్తాంగతా పరం ।
ష్ఠీవనం రక్తపిత్తస్య కఫేనోన్మిశ్రితస్య చ ॥ ౨౦ ॥
శిరసోలోఠనం తృష్ణా నిద్రానాశో హృది వ్యథా ।
స్వేదమూత్రపురీషాణాం చిరాద్దర్శనమల్పశః ॥ ౨౧ ॥
కృశత్వం నాతి గాత్రాణాం ప్రతతం కంఠకూజనం ।
కోఠానాం శ్యామరక్తానాం మండలానాం చ దర్శనం ॥ ౨౨ ॥
మూకత్వం స్రోతసాం పాకో గురుత్వ ముదరస్య చ ।
చిరా త్పాకశ్చ దోషాణాం సన్నిపాత జ్వరాకృతిః ॥ ౨౩ ॥

తా॥ కొంతసేపు తాపముగల్గుట, కొంపసేపు చలిగల్గుట, అస్థులయందును కీళ్లయందును శిరస్సునందును నొప్పి కల్గుట, కన్నులు కన్నీటిచే నిండి కలకబారి ఎఱ్ఱనై కూరుకొని యుండుట, చెవులయందు ధ్వనియు నొప్పియు గల్గి యుండుట, గొంతు ముండ్లచే నిండియున్నట్లు నసగల్గి యుండుట, కునికిపాటు కలుగుట, మూర్ఛబొడముట, సంబంధములేని మాటల మాట్లాడుట, దగ్గు, ఆయాసము, అన్నాదులయందు రుచిలేకుండుట, ఒడలు తిరుగుట, నాలుక కాలినచందం బున నల్లనై పశువుల నాలికెలంబోలి గరగరలాడుచుండుట, అవయవములు జారిపోవునట్లుండుట, కఫరక్తములతో గూడిన ఉమ్మి నుమియుట, శిరస్సును పలుదెరంగుల త్రిప్పుచుండుట, దప్పిగల్గుట, నిదుర బట్టకుండుట, రొమ్మునొప్పి, చెమట మూత్రము పురీషము ఇవి చిరకాలము నకు మిగుల స్వల్పముగ వెడలుట, అవయవములు కొంచెముగ చిక్కియుండుట, ఎల్లప్పుడును కంఠమున మూల్గుచుండుట, శ్యామవర్ణంబులును రక్తవర్ణంబులునైన బొబ్బలును మండలంబులును (దద్దులును) కల్గుట, మాట్లాడలేకుండుట, ముక్కు నోరు చెవులు మున్నగు స్రోతస్సులయందు పుండగుట, కడుపు మిగుల బరువై యుండుట, వాతాది దోషములు చిరకాలమునకు పక్వంబు లగుట, ఈ లక్షణంబులన్నియు కల్గినది సన్నిపాతము (దోషత్రయ ప్రకోపము) చే జనించిన జ్వరంబని యెరుంగునది. మరియు చకారమువలన వాగ్భటమున జెప్పిన లక్షణములగూడ గ్రహించు నది. అవి యెవ్వియనిన: “ తద్వచ్ఛీతం మహానిద్రా దివా జాగరణం నిశి । సదావా నైవవా నిద్రా మహాస్వేదోఽతి నైవవా । గీతనర్తన హాస్యాది వికృతేహా ప్రవర్తనం ॥ ” చలి, పగటియందు విశేషముగ నిదురించుట, రాత్రియందు నిదుర బట్టకుండుట ఎల్లప్పుడును అధికముగ నిద్రయైనను లేక నిదురబట్టక యైన నుండుట, అధికముగ జెమటగల్గి

బట్టుచునైననులేక చెమట బొత్తుగ బొడమక యైననుండుట, పాడుట, ఆడుట, నవ్వుట, మొదలగు లక్షణములు సన్నిపాతజ్వరమున గల్గునని భావము.

ఈ లక్షణములు పదిమూడు సన్నిపాతములలో స్వప్రమాణమునకన్న నధికంబులై వృద్ధి నొందియుండు దోషములచే జనించిన సన్నిపాతమునందును, సమంబులుగ వృద్ధినొందిన త్రిదోషములచే జనించిన సన్నిపాతజ్వరమునందును గల్గునని చరకాచార్యుండు వచించెను. మరియు త్రిదోషప్రకోపముచే జనించిన సన్నిపాత జ్వరములు; ద్వ్యుల్బణ (రెండుదోషము లధికములుగ నుండుట) ఏకోల్బణ (ఒక్కదోష మధికముగనుండుట) భేదములచే పదిరెండువిధంబులై యుండును. వాని లక్షణములు చరకమున నిత్తెరంగున గానంబడియెడు, "భ్రమః పిపాసా దాహశ్చ గౌరవం శిరసోఽతిరుక్ । వాతపిత్తోల్బణే విద్యా ల్లిఙ్గం మన్దకఫే జ్వరే[1] । శైత్యం కాసోఽరుచి స్తన్ద్రా పిపాసా దాహహృద్వ్యథాః । వాతశ్లేష్మోల్బణే వ్యాధౌ లిఙ్గం పిత్తావరే విదుః[2] । ఛర్దిశ్శైత్యం ముహుర్దాహ స్తృష్ణా మోహోఽస్థివేదనా । మన్దవాతే వ్యవస్యన్తి లిఙ్గం పిత్తకఫోల్బణే[3] । సన్ధ్యస్థి శిరసాం శూలం ప్రలాపో గౌరవం భ్రమః । వాతోల్బణే స్యా ద్ద్వ్యనుగే తృష్ణా కణ్ఠాస్యశుష్కతా । రక్తవిణ్మూత్రతా దాహః స్వేద స్తృష్ణా బలక్షయః । మూర్ఛా చేతి త్రిదోషే స్యా ల్లిఙ్గం పిత్తే గరీయసి[5] । ఆలస్యారుచిహృల్లాస దాహ వమ్యరతి భ్రమైః । కఫోల్బణం సన్నిపాతం తన్ద్రా కాసేనచాఽఽదిశేత్[6] । ప్రతిశ్యాయ చ్ఛర్దిరాలస్యం తన్ద్రాఽరుచ్యగ్ని మార్దవం । హీనవాతే పిత్తమధ్యే లిఙ్గం శ్లేష్మాధికే మతం[7] । హారిద్రమూత్రనేత్రత్వం దాహ స్తృష్ణా భ్రమోఽరుచిః । హీనవాతే మధ్యకఫే లిఙ్గం పిత్తాధికే మతం[8] । శిరోరుగ్వేపథుశ్వాస ప్రలాప చ్ఛర్ద్యరోచకాః । హీనపిత్తే మధ్యకఫే లిఙ్గం వాతాధికే మతం[9] । శీతతా గౌరవం తన్ద్రా ప్రలాపోఽస్థి శిరోతిరుక్ । హీనపిత్తే వాతమధ్యే లిఙ్గంశ్లేష్మాధికే విదుః । వర్చోభేదోఽగ్ని దౌర్బల్యం తృష్ణా దాహోఽరుచి ర్భ్రమః ॥ కఫహీనే వాతమధ్యే లిఙ్గం పిత్తాధికే విదుః[11] । శ్వాసః కాసః ప్రతిశ్యాయః ముఖశోషోఽతిపార్శ్వరుక్ । కఫహీనే పిత్తమధ్యే లిఙ్గం వాతాధికే మతం[12]॥"

భ్రమము, దప్పి, తాపము, భారము, తలనొప్పి ఇవి వాతపిత్తము లధికముగనుండి కఫము తక్కువగ నుండిన జ్వరమునకు లక్షణములు. జలుబు, దగ్గు, అరుచి, కునికిపాటు, దప్పి, తాపము, రొమ్మునొప్పి ఇవి వాతశ్లేష్మము లధికముగ నుండి పిత్తము తక్కువగనుండు జ్వరమునకు లక్షణములు. వమనము,జలుబు, మాటిమాటికి తాపము,దప్పి,మూర్ఛ, ఎముకలలోనొప్పి ఇవి పిత్తశ్లేష్మము లధికముగ నుండి వాతము తక్కువగనుండిన జ్వరమునకు లక్షణములు. కీళ్లు ఎముకలు తల వీనియందు శూల, అసంబద్ధప్రలాపము, దేహముబరువు, భ్రమ, దప్పి, గొంతు ఎండుట, ఇవి వాత మధికముగా నుండి కఫపిత్తములు తక్కువగానుండు జ్వరమునకు లక్షణములు. మలమూత్రము లెఱ్ఱగనుండుట,

తాపము చెమట, దప్పి, బలముక్షీణించుట, మూర్ఛ, ఇవి పిత్తమధికమయి వాతకఫములు తక్కువగా నుండు జ్వరమునకు లక్షణములు. మాంద్యము, అరుచి హృల్లాసము (డోకరింతలు) తాపము, వమనము, ఉత్సాహములేకుండుట, భ్రమ, కునికిపాటు, దగ్గు ఇవి కఫము అధికమయి వాతపిత్తములు తక్కువగ నుండు జ్వరమునకు లక్షణములు. పీనస, వమనము, మాంద్యము, కునికిపాటు, అరుచి, అగ్నిమాంద్యము ఇవి శ్లేష్మమధికముగను పిత్తము మధ్యమముగను వాతము తక్కువగను ఉన్నపుడు బుట్టిన సన్నిపాత జ్వరమునకు లక్షణములు. నేత్రములును మూత్రంబును పచ్చగనుండుట, తాపము, దప్పి, భ్రమము, అరుచి, ఇవి పిత్తమధికముగను కఫము మధ్యమముగను వాతము తక్కువగనుండు సన్నిపాతజ్వర లక్షణములు. తలనొప్పి, వణకు, ఎగశ్వాసము, అసంబద్ధ ప్రలాపము, వమనము, అరుచి, ఇవి వాత మధికముగను కఫము మధ్యమముగను పిత్తము తక్కువగ నుండు సన్నిపాతజ్వరమునకు లక్షణములు. శైత్యము, గౌరవము, కునికిపాటు, అసంబద్ధప్రలాపము, ఎముకలయందును, తలయందును శూల, ఇవి శ్లేష్మమధికముగను వాతము మధ్యమముగను పిత్తము తక్కువగనుండు సన్నిపాత జ్వరలక్షణములు. మలము భిన్నముగ వెడలుట, జఠరాగ్ని దుర్బలమగుట, దప్పి, తాపము, అరుచి, భ్రమ, ఇవి పిత్తమధికముగను వాతము మధ్యమముగను కఫము తక్కువగనున్న సన్నిపాతజ్వరముయొక్క లక్షణములు. ఉబ్బసము, దగ్గు, పీనస, నోరెండుట, పార్శ్వపునొప్పి ఇవి వాతమధికముగను పిత్తము మధ్యమముగను కఫము తక్కువగనుండిన సన్నిపాతజ్వరలక్షణము లని యర్థము.

సుశ్రుతాచార్యుడు సన్నిపాతజ్వరలక్షణమును మఱియొకవిధముగ జెప్పెను. అది యెట్లనిన: "వాత్యుష్ణశీతో౽ల్పసంజ్ఞో భ్రాన్తప్రేక్షీ హతస్వరః। ఖరజిహ్వః శుష్కకణ్ఠః స్వేదవిణ్మూత్రవర్జితః। సాస్రునిర్భుగ్ననయనః భుక్తిద్వేషీ హతస్వరః। శ్వాస న్నిపతితశ్శేతే ప్రలాపోపద్రవాన్వితః। అభిన్యాసన్తు తం ప్రాహుః హతౌజస మథాపరే। సన్నిపాతజ్వరం కృచ్ఛ్ర మసాధ్య మపరే జగుః॥" మిగులవేడియు చలువయు లేకుండుట, చైతన్యము తగ్గుట, తిరుగుచున్నట్లుండుట, కాంతిపోవుట, నాలుక గరుకుగనుండుట, గొంతెండుట, చెమటయు మలమూత్రములును లేకుండుట, కన్నులయందు నీరు గారుచు లోనికిబోయి యుండుట, అన్నమందు ద్వేషముగల్గుట, స్వరము క్షీణించుట, ఆయాసముతో క్రిందపడుట, అసంబద్ధప్రలాపము, ఉపద్రవములు గలిగి యుండుట, ఈ లక్షణములుగల జ్వరమును అభిన్యాసమని కొందరును హతౌజసమని మఱికొందరును సన్నిపాతమని యితరులును జెప్పిరి. మఱియు నిది అసాధ్యమని కొందరును కష్టసాధ్యమని మఱికొందరును ఈప్రకారము అనేకు లనేక ప్రకారంబుల జెప్పిరి.

మఱియు భాలుకితన్త్రమున పైన జెప్పంబడిన ద్వ్యుల్బణఏకోల్బణాదిజ్వరముల లక్షణములు మరియొకవిధంబుగ జెప్పంబడియె. అది యెట్లనిన: "వాతపిత్తాధికో యస్య సన్నిపాతః ప్రకుప్యతి। తస్య జ్వరో౽ఙ్గమర్దస్తృట్ తాలుశోష ప్రమీలకాః। ఆధ్మానతన్ద్రా౽రుచయః శ్వాస కాసభ్రమశ్రమాః। పిత్తశ్లేష్మాధికో యస్య సన్నిపాతః ప్రకుప్యతి। అన్తర్దాహో బహిశ్శీతం తస్య తన్ద్రా చ బాధతే। తుద్యతే దక్షిణం పార్శ్వ మురశ్శీర్షగలగ్రహః। నిష్ఠీవేత్కఫ పిత్తఞ్చ తృష్ణా

కణ్ఠశ్చ దూయతే । విశ్వేదశ్వాసహిక్కాశ్చ బాధన్తే సప్రమీలకాః । విధు ఫల్గూచ తౌ నామ్నా సన్నిపాతా వుదాహృతౌ । శ్లేష్మాఽనిలాధికో యస్య సన్నిపాతః ప్రకుప్యతి । తస్య శీతజ్వరో నిద్రా క్షుత్తృష్ణా పార్శ్వసఙ్గ్రహః । శిరోగౌరవమాలస్య మన్యాస్తమ్భ ప్రమీలకాః । ఉదరం దహ్యతే చాస్య కటీవస్తిశ్చ దూయతే। సన్నిపాత స్సవిజ్ఞేయో మకరీతి సుదారుణః । వాతోల్బణస్సన్నిపాతో యస్య జన్తోః ప్రకుప్యతి। తస్య తృష్ణా జ్వరగ్లాని పార్శ్వరుక్స్రుష్టి సంక్షయాః । పిణ్డికోద్వేష్టనం దాహః ఊరుసాదోబలక్షయః । సరక్తశ్చాస్య విణ్మూత్రం శూలం నిద్రావిపర్యయః । నిర్భిద్యతే గుదశ్చాస్య వస్తిశ్చ పరికృష్యతే । ఆయమ్యతే భిద్యతే చ హిక్కతే విలపత్యపి । మూర్ఛతి స్వాయతే రౌతి నామ్నా విస్ఫురక స్స్మృతః । పిత్తోల్బణస్సన్నిపాతో యస్య జన్తోః ప్రకుప్యతి । తస్య దాహో జ్వరో ఘోరో బహిరన్తశ్చ వర్ధతే । శీతఞ్చ సేవమానస్య కుప్యతేన కఫమారుతౌ । తతశ్చైనం ప్రధావన్తే హిక్కా శ్వాస ప్రమీలకాః । విసూచికాపర్వభేదః ప్రలాపో గౌరవం క్లమః। నాభి పార్శ్వరుజా తస్యస్విన్నస్యాశు వివర్ధతే । స్విద్యమానస్యర క్తఞ్చ స్రోతోభ్య స్సం ప్రవర్తతే। శూలేనపీడ్యమానస్య తృష్ణా దాహశ్చవర్ధతే। అసాధ్యస్సన్నిపాతోఽయం శీఘ్రకారీతి కథ్యతే । నహి జీవత్యహోరాత్ర మేతేనాఽభిష్టవిగ్రహః। కఫోల్బణ సన్నిపాతోయస్య జన్తోః ప్రకుప్యతి । తస్య శీతజ్వరస్స్వప్న గౌరవాలస్య తన్ద్రయః । ఛర్ది మూర్ఛాతృషాదాహాత్పృష్ఠ్యోచకహృద్గ్రహాః । ష్ఠీవనం ముఖమాధుర్యం శ్రోత్ర వాగ్దృష్టినిగ్రహః । శ్లేష్మణోనిగ్రహంచాస్య యదా ప్రకురుతే భిషక్ । తదా తస్య భృశం పిత్తం కుర్యాత్సోపద్రవం జ్వరం। నిగృహీతే తు పిత్తేచ భృశం వాయుః ప్రకుప్యతి। నిరాహారస్య సోఽత్యర్థం మేదో మజ్జాస్థి బాధతే। తథా త్ర న్నాని భుక్త్వా త్రిరాత్రన్నహి జీవతి । మేదోగత స్సన్నిపాతః కఫ్వణస్స ఉదాహృతః । కామాన్మోహాచ్చ లోభాచ్చ భయాచ్చాఽయం ప్రపద్యతే। మధ్యహీనాధికై ర్దోషైః సన్నిపాతో యదా భవేత్ తస్య రోగాస్త ఏవోక్తాః ప్రాయోదోష బలాశ్రయాః॥'' అని యున్నది. ఎవ్వానికి వాతపిత్తము లధికముగాగల సన్నిపాతజ్వరము ప్రకోపించునో వానికి జ్వరము, ఒడలువిరుపులు, దప్పి, దవడలు శుష్కించుట, ఱెప్ప లార్చుట, కడుపుబ్బరము, కునికిపాటు, అరుచి, నిట్టూర్పు లధికముగా నుండుట, దగ్గు, భ్రమము, శ్రమము ఇవి యుండును. ఈ సన్నిపాతము విధువని చెప్ప దగు. ఎవ్వానికి పిత్తశ్లేష్మము లధికములగు సన్నిపాతము గల్గునో వానికి లోపల తాపము, వెలుపల చలవ, కునికిపాటు, కుడిపార్శ్వము బ్రద్దలుగ కొట్టినట్లుండుట, రొమ్ము తల కంఠము వీనియాగు బట్టుకున్నట్లుండుట, కఫమును పిత్తమును ఉమియుట, దప్పి, కంఠమందు పరితాపము, మలము

భేదిల్లుట, శ్వాసము, వెక్కిళ్లు, పలుమారు అప్పళార్చుట ఇవి గలుగును. ఈ సన్నిపాతము ఫల్గు అని చెప్పంబడును. ఎవ్వనికి శ్లేష్మవాతము లధికములగు సన్నిపాతము ప్రకోపించునో వానికి శీతజ్వరము, నిద్ర, ఆకలి, దప్పి, పార్శ్వముపట్టుట, తలభారము, మాంద్యము, పెడతలనరములు కదలకుండుట, అప్పళార్చుట, కడుపులో మంట, పిరుదులయందును, పొత్తికడుపునందును నొప్పి, ఇవి కలుగును. ఇది మర్కరియను దారుణమైన సన్నిపాతము. ఎవ్వానికి వాతమధికముగగల సన్నిపాతము ప్రకోపించునో వానికి జ్వరము, దప్పి, బడలిక, పార్శ్వపునొప్పి, కన్నులు కనుపించకుండుట, పిక్కల నొప్పికల్గుట, తాపము, తొడలుచిక్కుట, బలము నశించుట, మలమూత్రము లెఱ్ఱగనుండుట, కడుపులోశూల, నిద్రలేకపోవుట, ఆసనమందు పోటు, పొత్తికడుపు లాగుట, నీల్గుట, భేదిల్లుట, వెక్కిళ్లు వచ్చుట, ఏడ్చుట, మూర్ఛిల్లుట, బలిసినట్లుండుట, అరచుట ఇవి గలుగును. ఈ సన్నిపాతము విస్ఫురకమని చెప్పబడును. ఎవ్వానికి పిత్త మధికమగు సన్నిపాతము ప్రకోపించునో వానికి తాపము, ఘోరమగుజ్వరము వెలుపల లోపల వృద్ధినొందుట, శీతమును సేవించినప్పుడు కఫవాతములు వృద్ధి నొందుట, వెక్కిళ్లు, ఉబ్బసము, అప్పళార్చుట, విషూచి, (వాంతిభేది) గణుపు కొంకరలు పోవుట, ప్రలాపము, భారము, శరీరము వాడుట, వానికి చెమర్చునట్లు (స్వేదవిధి) చేసినచో బొడ్డునంగును ప్రక్కలయందును నొప్పిగలుగుట, స్వేదవిధిజేయునప్పుడు రోమకూపములు ముక్కులు మొదలగు రంధ్రములనుండి రక్తము స్రవించుట, విశేషముగ శూలగలుగుట, దప్పి, తాపము ఇవి గల్గును. ఇది అసాధ్యమైన శీఘ్రకారియను సన్నిపాతము. ఈసన్నిపాతగ్రస్తుడు ఎనిమిదిజాములకన్న జీవించడు. ఎవ్వానికి కఫ మధికముగాగల సన్నిపాతము ప్రకోపించునో వానికి శీతజ్వరము, స్వప్నములు, శరీరభారము, మాంద్యము, కునికిపాటు, వమనము, మూర్ఛ, దప్పి, తాపము, తృప్తి, (భోజనము చేసినట్లుండుట) అసహ్యాత, రొమ్ముపట్టుకొనుట, ఉమియుట, నోరుతీపుకల్గియుండుట, చెవులకు వినరాకుండుట, నోట మాటరాకుండుట, కన్నులు కనుపించకుండుట, శ్లేష్మమునుతగ్గించినచో పిత్తము ఉపద్రవములతోగూడిన జ్వరమును వృద్ధిబొందించుట, పిత్తమును తగ్గించినచో వాతము మిక్కిలి ప్రకోపించుట, ఆహారమును తగ్గించినయెడ మేదస్సు మజ్జా అస్థి వీనియందు బాధగలుగుట ఈ లక్షణములు కల్గును. అట్టిరోగి స్నానముజేసినను భోజనముచేసినను మూడురాత్రులకన్న జీవించడు. దీనిని కఫఘ్నసన్నిపాతమని చెప్పెదరు. ఇయ్యది మేదస్సున జనించును. కామము లోభము మోహము భయము వీనివలన నీ సన్నిపాతము గలుగును.

మీద చెప్పిన ప్రకారము హీన మధ్యాధిక భేదములుగల దోషములచే సన్నిపాతము సంభవించినపుడు తరుచుగ దోషముల బలము నాశ్రయించినవియై ఇచ్చట చెప్పఁబడిన రోగములను కల్గించునని తెలియందగునని యర్థము. మరియు వాతపిత్త శ్లేష్మములు మూడును పరస్పర విరుద్ధంబులగు గుణములతో గూడియుండుటచేత మంచు నిప్పు ఈ రెండును గలిసి యొక కార్యమును గల్గించుటకు సమర్థములుగాని భంగి జ్వరాదిరోగములను గల్గించుటకు సామర్థ్యము లేకుండునని చెప్పుట యుక్తంబైనను ఈ దోషత్రయము స్వభావముచేతనే ఒకదాని గుణములచేత వేరొకదోషము కొట్టబడకుండును గాన తమతమ గుణములతో గూడి అన్నియుగలసి రోగములను గల్గించునని యెరుంగునది. ఈ యర్థమును దృఢబలుండు "విరుద్ధైరపి న త్వేతే గుణైర్ఘ్నన్తి పరస్పరం । దోషాస్సహజసాత్మ్యత్వాద్ఘోరం విషమహీనివ॥" అని వచించెను. వాతాదిదోషములు

రూక్షాదిగుణంబులచే పరస్పరవిరుద్ధంబు లైనను అట్టి గుణంబులు ఆయాదోషములకు సహజంబులును (కూడజనించినవియు) సాత్మ్యంబులును (స్వభావసిద్ధంబులు) అగుటచే విషము సహజమైన విషముతో గూడిన సర్పములను జంపకుండుకరణి ఒకదోషముయొక్క గుణములచేత వేరొకదోషము కొట్టబడదు;అని తాత్పర్యము. ఈ యర్థమునే గయదాసాచార్యులు ఇత్తెఱంగున నుడివెను. "దైవాద్దోషస్వభావాద్వా దోషాణాంసాన్నిపాతికే । విరుద్ధైశ్చగుణైః కశ్చి న్నోపఘాతః పరస్పరం॥" దైవబలముచేనైనను దోషముల స్వభావముచేనైనను సన్నిపాతము (దోషత్రయప్రకోపము) చేత జనించిన రోగమునందు పరస్పరవిరుద్ధంబులైన గుణములచేత కొట్టబడుట లేదని తాత్పర్యము.

## అసాధ్యసన్నిపాతజ్వరలక్షణము

శ్లో॥ దోషే విబద్ధే నష్టేఽగ్నౌ సర్వసంపూర్ణలక్షణః ।
సన్నిపాతజ్వరోఽసాధ్యః కృచ్ఛ్రసాధ్య స్తతోన్యథా ॥ ౧౮ ॥

తా. వాతాదిదోషంబులును మూత్రపురీషాదిమలంబులును బద్ధింపబడి జఠరాగ్ని మన్దగించి సన్నిపాతమున జెప్పియుండు లక్షణములన్నియు గల్గియుండు సన్నిపాతజ్వరము అసాధ్యం బగును. పై జెప్పబడిన లక్షణములకు విరుద్ధముగ నుండు (అనగా దోషవిబంధము లేక అగ్ని నశించక సన్నిపాత లక్షణములలో కొన్నియే కల్గియుండు) సన్నిపాతజ్వరము కృచ్ఛ్రసాధ్యమై (మిక్కిలి కష్టముచే సాధింపందగినదియై) యుండునని భావము. ఇట్లు చెప్పుటచేత సన్నిపాతజ్వరము అసాధ్యంబును కృచ్ఛ్రసాధ్యంబునై యుండును గాని ఒకప్పుడును సుఖసాధ్యంబై యుండుట లేదని భావము. ఈయర్థమును "సన్నిపాతో దుశ్చికిత్స్యానాం" అని చరకాచార్యుండును, "మృత్యునా సహ యోద్ధవ్యం సన్నిపాతం చికిత్సతా" అని భాలుకియు జెప్పిరి. కష్టముచే జికిత్స జేయదగిన వ్యాధులలో సన్నిపాతము బలిష్ఠంబనియు, సన్నిపాతమునకు చికిత్స జేయువాఁడు మృత్యువుతో యుద్ధము చేయగలడనియు భావము (అనగా కష్టసాధ్యమనుట).

శ్లో॥ * * సప్తమే దివసే ప్రాప్తే దశమే ద్వాదశేఽపి వా ।
పునర్ఘోరతరోభూత్వా ప్రశమం యాతి హన్తి వా ॥
సప్తమీ ద్విగుణా చైవ నవమ్యేకాదశీ తథా ।
ఏషా త్రిదోషమర్యాదా మోక్షాయచ వధాయచ ॥ * *

తా॥ సన్నిపాతజ్వరము ఏడవదినమునందైనను, పదియవదినమునందైనను పండ్రెండవదినమునందైనను మిక్కిలి ఘోరమై శాంతినైన బొందును, లేక రోగిని జంపును, లేక పదునాల్గవదినమునందైనను పదునెనిమిదియవదినమునందైనను ఇరువదిరెండవదినమునందైనను రోగిని చంపును, లేక శాంతినొందును.

## సన్నిపాతజ్వరోపద్రవము

శ్లో॥ సన్నిపాతజ్వరస్యాన్తే కర్ణమూలే సుదారుణః ।
శోథస్సంజాయతే తేన కశ్చిదేవ ప్రముచ్యతే ॥ ౧౯ ॥

తా॥ సన్నిపాతజ్వరముయొక్క అంతమునందు చెవిమొదట మిక్కిలి క్రూరమైన శోథ (అనగా వాపు) పుట్టును. దానిచేత ఒకానొకడే విడువబడును. నివర్తించుట యరుదని భావము. సన్నిపాతజ్వరము విడిచినపిదప చెవిమొదట తీక్ష్ణమైనవాపుగలిగి దానిచేత ఒకానొకడు మాత్రము జీవించునేగాని సాధారణముగ జీవించరు అని భావము.

శ్లో॥ * * త్రయః ప్రకుపితా దోషా ఉరస్స్రోతోనుగామినః ।
ఆమాభివృద్ధ్యా గ్రథితా బుద్ధీన్ద్రియ మనోగతాః ।
జనయన్తి మహాఘోర మభిన్యాసం జ్వరం దృఢం ।
శ్రుతౌ నేత్రే ప్రసుప్తి స్స్యాన్న చేష్టాం కాంచి దీహతే ।
నచ దృష్టి ర్భవే త్తస్య సమర్థా రూపదర్శనే ।
న ఘ్రాణం నచ సంస్పర్శం శబ్దంవా నైవ బుధ్యతే ।
శిరో లోలయతేఽభీక్ష్ణ మాహారం నాఽభినన్దతి ।
కూజతే విద్యతే చైవ పరివర్తన మీహతే ।
అల్పం ప్రభాషతే కించి దభిన్యాసస్స ఉచ్యతే ।
ప్రత్యాఖ్యాతస్సభూయిష్ఠః కశ్చి దేవాత్రసిధ్యతి ॥ * *

తా॥ వాతపిత్తశ్లేష్మములు ప్రకోపించి రొమ్మును స్రోతస్సులను (ముక్కు కన్నులు రోమకూపములు మొదలగు రంధ్రములను) అనుసరించి ఆమముయొక్క యభివృద్ధితోఁగూడి బుద్ధిని ఇంద్రియములను మనస్సును చేరి మిక్కిలి భయంకరమగు అభిన్యాసమను జ్వరమును నిశ్చయముగ పుట్టించును. ఆరోగికి చెవులు బిగియును (మూతలుపడినట్లు వినరాకుండును), కన్నులు మూసికొనియుండును. ఒక కార్యమునైన చేయఁజాలఁడు. సమీపమునందు వస్తువునుగూడ జూడఁజాలడు. గంధమును మూర్కొనఁజాలడు. స్పర్శమును తెలిసికొనఁజాలడు. శబ్దమును వినలేడు. తలనూచుచుండును. ఆహారమందిచ్ఛయుండదు. మూలుగుచుండును. బాధపడుచుండును. పొర్లాడును. కొంచెముగ మాటలాడును. ఇట్టి సన్నిపాతజ్వరము అభిన్యాసమని చెప్పంబడును. అట్టి రోగము చికిత్స చేయబడినదైయున నొకానొకటిమాత్రము సిద్ధించునుగాని తరుచుగ నివర్తించుటలేదు.

## ఆగంతుజ్వరలక్షణము ౩

శ్లో॥ అభిఘాతాఽభిచారాభ్యా మభిశాపాఽభిషంగతః ।
ఆగన్తుర్జాయతే దోషై ర్యథాస్వం తం విభావయేత్ ॥ ౨౬ ॥

తా॥ ఆగంతుజ్వరము ఆయుధములు రాళ్లు మొదలగువానిచే దెబ్బతగులుటవలనను, అనిష్టప్రయోగములవలనను, ఋషులు మొదలగువారి శాపమువలనను, కామాతిశయమువలనను, క్రోధాఽతిశయమువలనను, భయాఽతిశయమువలనను, భూతాదులయొక్క ఆవేశమువలనను, గలుగును. అట్టి జ్వరము జనించినతోడనే వాతాదిదోషములు ప్రకోపించును. అప్పుడు వాతాదులయొక్క లక్షణములను బట్టి యేదోషము ప్రకోపించినదియు నూహించవలెను. ఈ దోషప్రకోపము జ్వరము కల్గినపిమ్మట జనించునని సంప్రాప్తిని జెప్పినచోటఁ జెప్పంబడి యున్నయది.

తా॥ జ్వరముచే విడువంబడిన మనుజునకు స్వల్పముగ ననుసరించి యుండు దోషము అపథ్యంబులైన ఆహారవిహారాదులచే నానాట వృద్ధినొంది కొంతకాలమునకు రసాదిధాతువులలో నొకదాని నాశ్రయించి విషమజ్వరమును గల్గించును. ఇచ్చట "జ్వరోత్సృష్టస్య వా" అని చెప్పుటచేత జ్వరవిముక్తుడు (జ్వరమువచ్చి విడువబడినవాడు) గాకున్నను తొలుత ప్రారంభ కాలమునందే విషమజ్వరము సంభవించునని యెరుంగునది. దీనికి ప్రమాణము: "ఆరమ్భాద్విష మోయస్తు" అని అసాధ్యజ్వరలక్షణమున గానంబడియెడు. మరియు "యస్స్యాదనియతాత్కాలాచ్ఛీతోష్ణాభ్యాం తథైవచ। వేగతశ్చాపి విషమో జ్వరస్సవిషమస్స్మృతః॥" అని విషమజ్వరలక్షణము భాలుకిచే జెప్పంబడియె. నియతము లేని కాలము శీతోష్ణములు వేగము వీని యన్నిటిచే విషమంబై యుండు జ్వరము విషమజ్వరమని జెప్పంబడునని భావము.

## విషమజ్వరభేదములు

శ్లో॥ ** సన్తత స్సతతో౽న్యేద్యు స్తృతీయక చతుర్థకౌ **

తా॥ సన్తతజ్వరమనియు, సతతజ్వరమనియు, అన్యేద్యుష్కజ్వరమనియు, తృతీయకజ్వరమనియు, చతుర్థక జ్వరమనియు విషమజ్వరము ఐదువిధంబులై యుండునని భావము.

## సంతతాదిజ్వరములకు ఆశ్రయంబులైన ధాతువుల నిర్ణయము

శ్లో॥ సన్తతం రసరక్తస్థః, సో౽న్యేద్యుః పిశితాశ్రితః॥ ౩౨॥
మేదోగత స్తృతీయే౽హ్ని, అస్థిమజ్జగతః పునః।
కుర్యాచ్చతుర్థకం ఘోరం అన్తకం రోగసఙ్కరం॥ ౩౩॥

తా॥ సన్తతజ్వరము రసధాతువు నాశ్రయించి జనించుననియు, సతతజ్వరము రక్తధాతువు నాశ్రయించి జనించు ననియు, అన్యేద్యుష్కంబను జ్వరము మాంసము నాశ్రయించి జనించు ననియు, తృతీయకజ్వరము మేదస్సు నాశ్రయించి జ్వరము వ్యాపించినదినమునకు మూడవదినము నందు వరుసగా వచ్చుననియు, అస్థిమజ్జల నాశ్రయించి జ్వరము వ్యాపించిన దినమునకు నాల్గవదినమున మరల వ్యాపించునది చతుర్థక జ్వరమనియు భావము. అట్టిచతుర్థకజ్వరము ఓరువ నశక్యమై యమునిబోలె ప్రాణముల హింసించుచు అనేకరోగముల గల్గించును.

మరియు చరకమున "రక్తధాత్వాశ్రయః ప్రాయో దోష స్సతతకం జ్వరం" (రక్తధాతువు నాశ్రయించి సతతకజ్వరము తరుచుగ జనించును) అని యుండుటం జేసి ప్రకృత మూలమున "సన్తతః" అనుపదము సతత అను పదమునకుకూడ నుపలక్షణంబు గాన సతత జ్వరము రక్తధాతువు నాశ్రయించి యుండు ననే యర్థము లభించెనని యెరుంగునది.

## సన్తతాదిజ్వరలక్షణము

శ్లో॥ సప్తాహం వా దశాహం వా ద్వాదశాహ మథా౽పి వా।
సన్తత్యా యో౽విసర్గీ స్యా త్సన్తత స్సనిగద్యతే॥ ౩౪॥

తా॥ ఏడుదినముల కాలమైనను పదిదినముల కాలమైనను పదిరెండుదినముల కాలమైనను ఒక క్షణకాలముగూడ విడువక అనుసరించి యుండు జ్వరము సంతతజ్వర మనంబడును. ఇచ్చట దోషత్రయ ప్రకోపముచే జనించిన సన్తతజ్వరమునందు వాతము అధికముగ నున్నచో ఏడుదినములవరకు జ్వరము విడువక అనుసరించి యుండుననియు, పిత్తము అధికముగ నుండునపుడు జనించిన జ్వరము పది దిన ములవరకు నిరంతరముగ వ్యాపించి యుండుననియు, కఫము అధికముగనుండునపుడు గల్గిన జ్వరము పదిరెండు దినములవరకు ఎడలేక యుండుననియు అర్థము.

ఈ విషయమై తన్త్రాన్తరమున నీరీతిగ చెప్పంబడియె: "పిత్తకఫాఽనిలవృద్ధ్యా దశ దివస ద్వాదశాహ సప్తాహాత్ । హన్తి విముఞ్చతి వాఽశు త్రిదోషజో ధాతు మల పాకాత్॥" త్రిదోష సన్నిపాతముచే గల్గిన జ్వరమునందు వాత పిత్త కఫములలో పిత్తము వాత కఫ ములకంటె వృద్ధినొంది యున్నచో మలములు పక్వంబులై యుండెనేని పదిదినములకు పిమ్మట అట్టి జ్వరము నివర్తించును; లేక ధాతువులు పక్వంబులై యుండెనేని రోగిని చంపును. వాతపిత్తములకంటె కఫము వృద్ధినొందియున్నచో మలములు పక్వంబులై యుండెనేని పనిరెండుదినములు గడచినపిమ్మట జ్వరము విడుచును; లేక ధాతువులు పక్వంబులై యుండెనేని రోగినిచంపును. కఫపిత్తములకంటె వాతము వృద్ధి నొంది యున్నచో మలములు పక్వంబులై యుండెనేని ఏడుదినములు గడచినపిమ్మట నివ ర్తించును; లేక ధాతువులు పక్వంబులై యుండెనేని రోగినిచంపును అని యర్థము. మరియు చర కమునందు "యథా ధాతూం స్తథా మూత్రం పురీషఞ్చాఽనిలాదయః। యుగపచ్చాఽనుపద్యన్తే నియమాత్సన్తతే జ్వరే॥" అని యుండుటచేత ఈ సన్తతజ్వరమునందు వాతపిత్త శ్లేష్మములు మూడును రసాదిధాతువులను మూత్రపురీషములను సమకాలమునందు నియతముగ వ్యా పించునని యెరుంగునది. మరియు చరకాచార్యుండీసన్తతజ్వరలక్షణమునందు "విసర్గం ద్వాదశే కృత్వా దివసే వ్యక్తలక్షణః । దుర్లభోపశమః కాలం దీర్ఘ మప్యనువర్తతే" అని జెప్పెను. ఈ సన్తతజ్వరము పదిరెండు దినములు క్షణకాలమైన విరామములేకుండి పదిరెండవ దినమున విడచి చెమటబట్టుట శరీరము చుల్కనై యుండుట మున్నగు జ్వరముక్తలక్షణములు స్ఫుట ముగ గానంబడి యుండుననియు, ఒక సమయమున అంతట శమించక మరల అట్టి జ్వరముకల్గి చాలాదినములవరకు బాధించుననియు భావము. ఈ వాక్యముచేత సన్తత జ్వరమునకు గూడ ఒక సమ యమున ముక్తాఽనుబన్ధిత్వము (జ్వరము విడచి మరల అనుసరించి యుండుట) కలదు గాన "జ్వరో త్సృష్టస్య వా పునః "అనునట్టి విషమజ్వర లక్షణయుక్తంబని యెరుంగునది. "జ్వరాః పూర్వం మయోక్తా యే పఞ్చ సన్తతకాదయః । చత్వార స్సన్తతం హిత్వా జ్ఞేయాస్తే విషమజ్వరాః॥" అని ఖరనాదుండు వచించెను. సన్తతజ్వరం బొక్కటి దక్క తక్కిన సతత అన్యేద్యుష్క తృతీయక చతుర్థకము లను నాల్గు జ్వరములు విషమజ్వరము లని చెప్పంబడునని యర్థము. ఈ వాక్యముచేత సన్తతజ్వరము విషమజ్వరము కాదని తెలియ బడుచున్నది; ఐనను ఈ జ్వరమునందు సతత అన్యేద్యుష్క తృతీయక చతుర్థకములబోలి ఆవృత్తి (పలుమారువిడచి మరల ననుసరించుట) లేదు గాన సతతము మున్నగు నాల్గు జ్వరములకన్న సన్తతజ్వరము భిన్నంబనియు, అట్టి నాల్గు జ్వరములకన్న సన్తతజ్వరమునకు చికిత్స వేరై యుండుననియు ఖరనాదుని యభిప్రాయము గాన సన్తతజ్వరమునకు విషమజ్వరత్వము లేదని జెప్పం

జనగు. చరకమునందు "కర్మ సాధారణం జహ్యా తృతీయక చతుర్థకౌ" అనియుండు టంజేసి తృతీయక చతుర్థక జ్వరముల రెండిటికిని విషమజ్వరమునకు జెప్పియుండు చికిత్స జేయవలెగాని దోషసాధారణమైన చికిత్స జేయ జనదనియు, తక్కిన జ్వరములయందు ఆ యా దోషములకు విరుద్ధంబులగు చికిత్సల జేయుట యుక్తంబనియు భావము. ఇచ్చట విషమజ్వరముల కన్నిటికని చికిత్స సమానముగ తన్త్రాన్తరమున నున్నదిగాన విషమజ్వరసామాన్యంబైన చికిత్సను తృతీయక చతుర్థక జ్వరములయందు విశేషముగ చేయవలెననియు, విషమజ్వరములందక్క తక్కిన జ్వరములయందు నాయాదోషములకు విరుద్ధంబులైన జకిత్సల చేయందగుననియు అర్థవిశేషము చరక వాక్యమునకు నెరుగునది.

## సతతక అన్యేద్యుష్క తృతీయక చతుర్థక జ్వరలక్షణములు

శ్లో॥ అహోరాత్రే సతతకో ద్వౌకాలావనువర్తతే ।
అన్యేద్యుష్క స్త్వహోరాత్ర ఏకకాలం ప్రవర్తతే॥ ౩౫॥
తృతీయక స్తృతీయేఽహ్ని చతుర్థేఽహ్ని చతుర్థకః ।

తా॥ రాత్రిపగలు ఈ రెండుకాలములయందును జ్వరవేగమును జూపునది సతతకజ్వర మనంజను. అనగా పగటియందు జ్వరము వ్యాపించి సాయంకాలమున శమించి మరల రాత్రియందు జ్వరవేగమును జూపునది సతతక జ్వరమని భావము. రాత్రియందైనను పగటియందైనను ఒకకాలమున వ్యాపించునది అన్యేద్యుష్కజ్వరమని చెప్పందగును. జ్వరవేగము కల్గిన దినము మొదలు మూడవనాడు మరల వ్యాపించునది తృతీయకజ్వర మనంబడు. జ్వరవేగము కల్గినదినమునకు నాల్గవనాడు వ్యాపించునది చతుర్థకజ్వర మనందగు. ఇచ్చట పగలు రెండు కాలములయందును రాత్రి రెండు కాలములయందును వ్యాపించు జ్వరము సతతకజ్వరమనియు,పగలు ఒకకాలమునందును రాత్రి యొకకాలమునందును వ్యాపించునది అన్యేద్యుష్కజ్వరమనియు కొందరు వచించెనరు.

## మతాన్తరమున విషమజ్వరలక్షణము.

శ్లో॥ కేచిద్భూతాఽభిషఙ్గోత్థం బ్రువతే విషమజ్వరమ్॥ ౩౬॥

తా॥ కొందరు భూతసంబంధములన జనించిన జ్వరమును విషమజ్వరమని వచించెదరు.

## తృతీయకజ్వరభేదములు.

శ్లో॥ కఫపిత్తా త్త్రికగ్రాహీ పృష్ఠాద్వాతకఫాత్మకః ।
వాతపిత్తాచ్ఛిరోగ్రాహీ త్రివిధ స్స్యా త్తృతీయకః॥ ౩౭॥

తా॥ కఫపిత్తములు అధికములై యున్నపుడు జనించిన తృతీయక జ్వరము తొలుత వెన్నెముకకు క్రిందిభాగమున వేదనను కల్గించి శరీరమున వ్యాపించును. వాతకఫములు అధికంబులై యుండునపుడు జనించు తృతీయకజ్వరము తొలుత వీపునందు వేదనకల్గించి శరీరమున వ్యాపించును. వాతపిత్తములు అధికంబులై యుండునపుడు జనించు తృతీయకజ్వరము తొలుత శిరస్సునందు వేదన కల్గించి పిమ్మట శరీరమున వ్యాపించును. ఇత్తెరంగున తృతీయక జ్వరము మూడు విధంబులై యుండును.

వికారస్యాస్య దస్థిమజ్జగతోఽనిలః । కుపితః పిత్తమేవంతు కఫశ్చైవం స్వకాలతః । శీతదాహాకర స్తీవ్రః త్రికాలశ్చాఽనువర్తతే । స సన్నిపాత సమ్భూతో విషమో విషమజ్వరః । ఊర్ధ్వం కాయస్య గృహ్ణాతి యః పూర్వం సోఽనిలాత్మకః । పూర్వం గృహ్ణా త్యధఃకాయం శ్లేష్మపూర్వజ్వరశ్చ సః॥'' చతుర్థకంబను క్రూరంబైన విషమజ్వరము రసాదిధాతువుల నన్నింటిని శోషింపంజేయునదియు. జఠరాగ్నిని నశింపజేయునదియు నై త్రిదోషసన్నిపాతముచే జనించును; అట్టి జ్వరమునందు వాతపిత్తశ్లేష్మములు మూడును అస్థిమజ్జల రెంటిని ఆశ్రయించి ప్రకుపితంబులై తమతమ కాలములయందు చలి తాపము మున్నగు వేదనల గల్గించును. ఈజ్వరము తీవ్రంబై ఉదయకాలమునందును మధ్యాహ్నకాలమునందును సాయంకాలమునందును ఆనుసరించి యుండును. సన్నిపాతముచే జనించిన యీవిషమజ్వరము తొలుత ఊర్ధ్వకాయమున (కంఠము శిరస్సు మున్నగు అవయవముల) వ్యాపించి పిమ్మట శరీరమున వ్యాపించినచో వాతం బధికముగ నున్నప్పుడు జనించినది యనియు, శరీరమునందు నాభిక్రింద తొలుత వ్యాపించి పిమ్మట శరీరమునందెల్ల వ్యాపించినచో నాచతుర్థకజ్వరము కఫాధిక్యముచే జనించినది యనియు నెరుంగవలెనని యర్థము. ఇచ్చట ''కుపితం పిత్తమేవంతు''అని చెప్పియున్నను వాతప్రధానంబైన జ్వరము తొలుత ఊర్ధ్వశరీరమున వ్యాపించు ననియు, కఫప్రధానంబైన జ్వరము శరీరమునం దధోభాగమున తొలుత వ్యాపించి పిమ్మట శరీరమునందెల్ల వ్యాపించుననియు, వాతకఫముల రెండిటికిని స్థలవిశేషమును జెప్పినభంగి పిత్తమునకు స్థలవిశేషమును జెప్పియుండలేదు గాన పిత్తము ఉపసర్జనం (అప్రధానం) బై యుండును గాని ప్రధానంబైయుండుట లేదని చరకవ్యాఖ్యానకారులు వచించిరి. మరియు ''ఆమాశయస్థః పవనో హ్యస్థిమజ్జగతోఽపివా । కుపితః కోపయత్యాశు శ్లేష్మాణం పిత్తమేవచ॥'' అని తన్త్రాన్తరమునందును, ''ఊర్ధ్వకాయన్తు యః పూర్వం గృహ్ణాతి సోఽనిలాత్మకః। మధ్యకాయన్తు గృహ్ణాతి పూర్వం యస్తు స పిత్తజః ॥ పూర్వం గృహ్ణాత్యధఃకాయం శ్లేష్మవృద్ధ శ్చతుర్థకః॥'' అని నాగభర్తృతన్త్రమునందును గానంబడియెడు. వాతము ఆమాశయమునందైనను అస్థిమజ్జలయందైనను జేరి ప్రకోపమునొంది కఫపిత్తములను ప్రకోపింపజేసి చతుర్థకజ్వరమును కల్గించుననియు; తొలుత శరీరమునం దూర్ధ్వభాగమున వ్యాపించి పిమ్మట శరీరమునం దెల్ల వ్యాపించునది వాతాధిక్యముచే జనించిన చతుర్థక జ్వరమనియు, తొలుత మధ్యశరీరమున వ్యాపించి శరీరమునందెల్ల వ్యాపించునది పిత్తాధిక్యముచే జనించిన చతుర్థకజ్వరమనియు, అధశ్శరీరమున దొలుత వ్యాపించి పిమ్మట శరీరమునందెల్ల వ్యాపించు చతుర్థకజ్వరము కఫాధిక్యముచే జనించినదియనియు పైజెప్పబడిన వాక్యములరెంటికిని యర్థము. ఈవాక్యమునందు పిత్తముచే జనించు చతుర్థకజ్వరమునకు స్థానవిశేషము జెప్పబడియున్నది గాన పిత్తలక్షణములు స్ఫుటంబులుగ గానంబడినచో పైత్తిక (పిత్తముచేజనించిన) చతుర్థకజ్వరంబును ఒక సమయమున జనించునని యెరుంగునది. వాతకఫలముచేత చతుర్థకజ్వరము విశేషముగ జనించుననియు, పైత్తిక చతుర్థకజ్వగము జనించుట యరుదనియు తలచి చరకాచార్యులు మున్నగువారు పైత్తిక చతుర్థక జ్వరమును జెప్పకుండిరి యని ముఖ్యార్థము నెరుంగునది.

మఱియు సతతాది జ్వరముల ఉత్పత్తిక్రమమును వృద్ధసుశ్రుతుం డిత్తెరంగున నుడివెను: "అహోరాత్రాదహోరాత్రాత్ స్థానాత్స్థానం ప్రపద్యతే । తతశ్చామాశయం ప్రాప్య కరోతి విషమజ్వరం । కఫస్థాన విభాగేన యథా సఙ్ఖ్యం కరోతిహి । సతతాన్యేద్యుష్క త్ర్యాఖ్యచతుర్థాన్ సప్రలేపకాన్॥" కఫస్థానంబులైన ఆమాశయము, హృదయము, కణ్ఠము, శిరస్సు, సంధులు అను నీ యైదింటియందును వాతాదిదోషములు ఒక్కొక అహోరాత్రమునకు ఒక్కొకస్థానమున సంచరించుచుండును. అట్టియెడ ఆమాశయాదిస్థానము లైదిటియందును వాతాదిదోషములు ఆశ్రయించుచు ఆమాశయమునజేరి సతత అన్యేద్యుష్క తృతీయక చతుర్థక ప్రలేపకము లను విషమజ్వరములను వరుసగా గల్గించునని యర్థము. అందు ఆమాశయమువనుండు దోషము పగటియందొక కాలమునను రాత్రియందొక కాలమునను జ్వరమును కల్గించును. అయ్యది సతతకజ్వర మనంబడును. ఇచ్చట దోషము ఎల్లప్పుడును ఆమాశయమున జేరి యున్నను "వయోఽహోరాత్రిభుక్తానాం తేఽన్తమధ్యాదిగాః క్రమాత్" అనియుండుటచేత, రాత్రిప్రథమకాలమునందును పగటిప్రథమకాలమునందును కఫము ప్రకోపించును గాన అట్టి కఫప్రకోపకాలముల రెంటియందును జ్వరవేగము కల్గునని యెరుంగునది. మరియు దోషము కఫస్థానంబైన హృదయమునందుండి ఒక్క అహోరాత్రమునకు ఆమాశయమునజేరి అన్యేద్యుష్కంబను జ్వరమును కల్గించును; ఈ జ్వరము దినమున కొకసారి వ్యాపించును. కఫస్థానంబైన కణ్ఠమునందుండు దోషము ఒక అహోరాత్రమునకు హృదయస్థానమునను రెండవయహోరాత్రమునకు ఆమాశయంబునను వ్యాపించి జ్వరవేగదినమునకు మూడవదినమున తృతీయకజ్వరమును కల్గించును. కఫస్థానంబైన శిరస్సునందుండు దోషము ఒక అహోరాత్రమునకు కంఠమునందును రెండవయహోరాత్రమున హృదయమునందును మూడవయహోరాత్రమున ఆమాశయమునందును వ్యాపించి జ్వరవేగదినము మొదలు నాల్గవదినమున చతుర్థకజ్వరమును కల్గించును. సంధులయందుండు దోషము ఆమాశయమునజేరి ప్రలేపకంబను జ్వరమును కల్గించును. ఆమాశయమునందును సంధులందును గాన అట్టిసంధులయం దెల్లప్పుడు దోషము లాశ్రయించి యుండుటంజేసి ప్రలేపకజ్వరము అహోరాత్రులయం దెల్లప్పుడును వ్యాపించి యుండును. మఱియు "ప్రలేపకస్తు విషమః ప్రాయః శ్లేష్మాయ శోషిణాం" అని సుశ్రుతమునందున్నదిగాన ప్రలేపకజ్వరమునకును మతాన్తరమున విషమత్వము కలదు. పైనజెప్పబడియుండు వాక్యములచేత సతతజ్వరమునకు ఆమాశయంబును, అన్యేద్యుష్కజ్వరమునకు హృదయంబును, తృతీయకజ్వరమునకు కంఠంబును, చతుర్థకజ్వరమునకు సంధులును నియతముగ స్థానంబులై యున్నను "దోషాహ్యామాశయాశ్రయాః। బహిర్నిరస్య కోష్ఠాగ్నిం జ్వరదాస్స్యూ రసానుగాః" అని యుండుటచేత దోషములు ఆమాశయమునజేరక జ్వరము జనించుట లేదు గాన హృదయాదిస్థానములయందుండు దోషములు ఆమాశయమున జేరినప్పుడే విషమజ్వరములు కల్గునని యెరుంగునది. అన్యేద్యుష్కాది జ్వరములయందు జ్వరవేగము నివర్తించిన తోడనే వాతాదిదోషములు మిగుల చుల్కనై యుండును గాన శీఘ్రముగ హృదయాదిస్థానములయందు జేరును. ఇత్తెఱంగున సతతాదివిషమజ్వరముల యుత్పత్తిక్రమము నెరుంగునది.

## చతుర్థక విపర్యయ జ్వర లక్షణము

శ్లో॥ విషమజ్వర ఏవాన్య శ్చతుర్థక విపర్యయః।
మధ్యేఽహని జ్వరయతి హ్యాదావన్తేచ ముఞ్చతి॥ ౩౯॥

తా॥ మొదట నొకదినము జ్వరములేకుండి పిదప రెండుదినములు జ్వరవేగమునుజూపి పిమ్మట నొకదినము జ్వరము లేకుండునది చతుర్థక విపర్యయంబను విషమజ్వరమని యర్థము. జ్వరవేగము కల్గిన దినమునకు నాల్గవదినమున మరల వ్యాపించు జ్వరము చతుర్థకజ్వరముగాన దానికి విరుద్ధముగ నీజ్వరము ఆద్యన్తదినములయందు వ్యాపించక నడుమ రెండుదినములు వ్యాపించుటంజేసి చతుర్థకవిపర్యయ మని జెప్పంబడునని భావము. ఈ జ్వరలక్షణమునకు "అస్థిమజ్జోభయగతే చతుర్థకవిపర్యయః। మధ్యేఽహని జ్వరయతి హ్యాదావన్తేచ ముఞ్చతి॥" అని తన్త్రాన్తరంబును, "అసిమజ్జోభయగతే చతుర్థకవిపర్యయః। త్ర్యహాద్ద్వ్యహం జ్వరయతి హ్యాదావన్తేచ ముఞ్చతి॥" అని హరిచన్ద్రవచనంబును గానంబడియెడు. ఈ వచనములు రెండును ప్రకృతమూలమునకు సమానార్థకములు.

ఇచ్చట చెప్పబడిన చతుర్థకవిపర్యయలక్షణము ఉపలక్షణంబుగాన తృతీయకాది విపర్యయములగూడ నూహించవలెను. అది యెట్లులనిన; నడుమ నొకదినము జ్వరము వ్యాపించి ఆద్యన్తదినములయందు జ్వరము వ్యాపించకున్నచో తృతీయకవిపర్యయ మనియు, ప్రాతఃకాలమునందును రాత్రిప్రథమకాలమునందును జ్వరము లేకుండి తక్కినకాలమునందెల్ల వ్యాపించు జ్వరము సతతక విపర్యయంబనియు, రాత్రియందైనను పగటియందైనను ఒకకాలమున జ్వరము లేకుండి తక్కిన కాలములయందు వ్యాపించు జ్వరము అన్యేద్యుష్క విపర్యయంబనియు నెఱుంగునది.

మఱియు "కఫస్థానేషు వా తిష్ఠన్ దోషో ద్వి త్రి చతుర్షు చ। విపర్యయాఖ్యాన్ కురుతే విషమాన్ కృచ్ఛ్రసాధనాన్॥" అని వృద్ధ సుశ్రుతుండు అన్యేద్యుష్క తృతీయక చతుర్థక విపర్యయ జ్వరలక్షణముల జెప్పెను. కఫస్థానంబులైన ఆమాశయ హృదయస్థానముల రెంటియందు నుండు దోషముచేత అన్యేద్యుష్క విపర్యయంబను విషమజ్వరము జనించుననియు, కఫస్థానంబులైన ఆమాశయహృదయకణ్ఠముల మూటియందును వ్యాపించియుండు దోషముచేత తృతీయక విపర్యయంబను విషమజ్వరము జనించుననియు, కఫస్థానంబులైన ఆమాశయ హృదయ కణ్ఠ శిరస్సుల నాల్గిటియందును వ్యాపించియుండు దోషముచేత చతుర్థకవిపర్యయంబను విషమజ్వరము జనించుననియు భావము. ఇచ్చట హృదయముననుండు దోషము ఆమాశయముననుండు దోషముతో గలిసి అన్యేద్యుష్క విపర్యయమును పైజెప్పబడినరీతిగ కల్గించును. తృతీయకవిపర్యయమునందు ఆమాశయహృదయకణ్ఠముల మూడిటియందును వ్యాపించియుండు దోషములలో హృదయముననుండు దోషము ఒకదినమునకు ఆమాశయమున జేరి అందుండు దోషముతో గలిసి జ్వరమును కల్గించును. ఆనాడు కంఠముననుండు దోషము హృదయస్థానమున జేరును; హృదయస్థానమున జేరియుండు దోషము మరునాడు ఆమాశయమున జేరి జ్వరమును కల్గించును. ఇట్లైయంగున రెండుదినములు ఎడలేక జ్వరము వ్యాపించి మూడవదినము జ్వరములేకుండి పైనజెప్పినరీతిని మరల జ్వరము వ్యాపించుచుండును. ఇయ్యది మూడవదినమున వ్యాపించు తృతీయక జ్వరమునకు విరుద్ధముగ మూడవదినమున వ్యాపించ

కుండునుగాన తృతీయకవిపర్యయంబని పేర్కొనందగు. చతుర్థకవిపర్యయమునందు ఆమాశయ హృదయ కణ్ఠ శిరస్థానంబుల నాల్గిటియందును వ్యాపించియుండు దోషములలో హృదయమున నుండు దోషము ఒకదినమునకు ఆమాశయమునజేరి జ్వరమును కల్గించును. ఆ దినమునందే కంఠమున నుండు దోషము హృదయస్థానమునందును, శిరంబుననుండు దోషము కంఠమునందును వ్యాపించును. హృదయమున జేరియుండు దోషము మరునాడు ఆమాశయమున వ్యాపించి జ్వరమును కల్గించును. ఆ దినమునందే కంఠముననుండు దోషము హృదయస్థానమున జేరును. హృదయమున జేరియుండు దోషము మూడవనాడు మరల ఆమాశయమున వ్యాపించి జ్వరమును కల్గించును. ఇట్లైనందున మూడుదినములు ఎడలేక జ్వరము వ్యాపించి నాల్గవదినమున జ్వరములేకుండునది చతుర్థకవిపర్యయము. ఇట్లైనందున విపర్యయముల మూడిటికిని ఉత్పత్తిక్రమము తెలియుచున్నది. మరియు నీతృతీయకాది విపర్యయములకు తృతీయకాది జ్వరములకు చెప్పియుండు చికిత్సలనే ఉపయోగించవలెను.

## వాతబలాసకజ్వరలక్షణము

శ్లో॥ నిత్యం మన్దజ్వరో రూక్షః శూనకస్తేన సీదతి।
స్తబ్ధాఙ్గః శ్లేష్మభూయిష్ఠో నరో వాతబలాసకీ ॥ ౮౦

తా॥ వాతబలాసకమను జ్వరముకల మనుజుండు ఎడతెగని మన్దజ్వరముకలవాడును, స్నేహము లేక రూక్షంబైన శరీరము కలవాడును, వాపుతోగూడినవాడును, స్తంభించిన అవయవములు కలవాడును, ప్రబలమైన శ్లేష్మముకలవాడునై ఆజ్జ్వరముచేత నశించునని యర్థము. ఈజ్వరము వాతకఫములచే జనించును గాన వాతబలాసకము అని చెప్పంబడును. మరియు "వాయుః ప్రకుపితో దోషావుదీర్యోభౌ ప్రధావతి। సశరీరస్థస్సర్వశ్శరీర్యాలం" అని తన్త్రాన్తరమున నుండుటచే నీ జ్వరమున తొలుత వాతము ప్రకుపితంబై పిత్తకఫముల రెంటిని ప్రకోపము నొందించునని తెలియుచున్నది గాన దోషత్రయముచే నీ జ్వరము జనించును.

## ప్రలేపకజ్వరలక్షణము

శ్లో॥ ప్రలిమ్పన్నివ గాత్రాణి ఘర్మేణ గౌరవేణచ।
మన్దజ్వరవిలేపీ చ సశీతస్స్యాత్ప్రలేపకః॥ ౮౧॥

తా॥ చెమటచేతను శరీరభారముచేతను అవయవములను పూయుచున్నట్లున్నదియు, మందమైనజ్వరము కల్గించునదియునై చలితోగూడియుండుజ్వరము ప్రలేపకమనంబడు. ఈ జ్వరము కఫపిత్తములచే జనించునని యెఱుంగునది.

## విషమజ్వరవిశేషములు

శ్లో॥ విదగ్ధేఽన్నరసే దేహే శ్లేష్మపిత్తే వ్యవస్థితే॥
తేనార్ధం శీతలం దేహే చార్ధం చోష్ణం ప్రజాయతే॥ ౮౨॥

తా॥ దుష్టంబగు అన్నరసంబైనను దుష్టమైనశ్లేష్మమైనను దుష్టమైన పిత్తమైనను శరీరమున వ్యాపించి యున్నయెడ అట్టి శరీరములో సగము శ్లేష్మముచే శీతలంబుగను సగము పిత్తముచే నుష్ణంబుగను నుండును. అట్టిపిత్తశ్లేష్మములు వ్యాపించుటకు నియమములేదు గాన అర్ధనారీశ్వరునివలె దేహ

మునం దిరుప్రక్కలనైనను నరసింహుని యాకారమువలె నూర్ధ్వాధోభాగములయందైనను శీతోష్ణములు యథాక్రమముగ కల్గునని యెఱుంగునది.

శ్లో॥ కాయే దుష్టం యదా పిత్తం శ్లేష్మా చాన్తే వ్యవస్థితః ।
తేనోష్ణత్వం శరీరస్య శీతత్వం హస్తపాదయోః ॥౭౩॥
కాయే శ్లేష్మా యదా దుష్టః పిత్తఞ్చాన్తే వ్యవస్థితం ।
శీతత్వం తేన గాత్రాణాం ఉష్ణత్వం హస్తపాదయోః ॥౭౪॥

తా॥ శరీరము దుష్టమైన పిత్తముచేత వ్యాప్తమై శరీరాగ్రభాగంబులైన హస్తపాదముల యందు శ్లేష్మము వ్యాపించియున్నయెడ శరీరమునం దుష్ణంబును హస్తపాదములయందు శీతత్వంబును కల్గును. మఱియు శ్లేష్మము దుష్టమై శరీరమున వ్యాపించి అగ్రభాగములయందు పిత్తము వ్యాపించి యున్నపుడు శరీరమునందు చలువయు కరచరణంబులయం దుష్ణంబును గలుగును.

## దాహపూర్వ శీతపూర్వ జ్వరలక్షణములు

శ్లో॥ త్వక్స్థౌ శ్లేష్మానిలౌ శీతం ఆదౌ జనయతో జ్వరమ్।
తయోః ప్రశాన్తయోః పిత్తమన్తే దాహం కరోతి చ ॥౭౫॥
కరోత్యాదౌ తథా పిత్తం త్వక్స్థం దాహమతీవచ ।
తస్మిన్ ప్రశాన్తే త్వితరౌ కురుత శ్శీతమన్తతః ॥౭౬॥
ద్వావేతౌ దాహశీతాది జ్వరౌ సంసర్గజౌ స్మృతౌ ।
దాహపూర్వః తయోః కష్టః కృచ్ఛ్రసాధ్యతమశ్చ సః ॥౭౭॥

తా॥ కఫవాతములు తొలుత త్వగ్గతమైన రసము నాశ్రయించి జ్వరమువచ్చుటకు మున్ను చలిని కల్గించును; అట్టి కఫవాతముల వేగము శమించిన పిమ్మట పిత్తము ప్రకుపితంబై తాపమును కల్గించును. మఱియు పిత్తము తొలుత ప్రకుపితంబై త్వగ్గతంబైన రసము నాశ్రయించినయెడ జ్వరము వచ్చుటకు మున్ను మిగుల తాపముగల్గి జ్వరాన్తమున (జ్వరము విడుచునప్పుడు) అట్టి పిత్తవేగము శాన్తినొంది కఫవాతములు ప్రకుపితంబులై చలిని కల్గించును; ఈదాహాదియు (తాపముతొలుతగల్గినదియు) శీతాదియు (చలి యాదిలో కల్గినదియు) నైన జ్వరములు రెండును దోషపరస్పరసంబంధముచే గల్గుటంజేసి సంసర్గజములని తెలియందగినది. ఈ రెంటిలో దాహాది (తాపము ముందుగా కల్గినది) యైన జ్వరము శరీరమునకు మిగుల బాధకల్గించునదియు కష్టసాధ్యంబునై యుండును. శీతాదియైన (చలిమొదటగల) జ్వరము సుఖసాధ్యంబగునని భావము.

ఇచ్చట విషమజ్వరములయందు దోషములు బొత్తుగా శమించుట లేదుగాన “ప్రశాన్తయోః” అను పదమునకు శమించినవేగముకల కఫవాతములు వేగమును దక్కియున్నపుడు, అని యర్థము. ఇందుకు చరకమునందు “స చాపి విషమో దేహం న కదాచి ద్విముఞ్చతి। గ్లానిగౌరవ కార్శ్యేభ్యస్స యస్మాన్న విముచ్యతే । వేగే తు సమతిక్రాన్తే గతోఽయ మితి లక్ష్యతే । ధాత్వన్తరస్థో లీనత్వాత్ సౌక్ష్మ్యాన్నైవోపలభ్యతే॥”

అని యున్నది. విషమజ్వరమునందు బడలిక, భారము, కృశత్వము, ఈమూడును విడచియుండుటలేదు గాన వాతాది దోషములు శమించుటలేదు; అట్టి దోషములు వేగముపక్క రసాదిధాతువుల యందు లీనంబులై యున్నపుడు మిగుల సూక్ష్మంబులై యుండునుగాన గానంబడవు; దానంజేసి శమించియుండునటుల వ్యవహరింపబడునని భావము. మరియు నిచట దోషత్రయముయొక్క పరస్పరసంబంధముచే నీజ్వరములు జనించును గాన సంసర్గజములని వ్యవహరింపబడునని యెఱుంగ నది. సకల విషమజ్వరములయందును వాతము అవశ్యము సంబద్ధమైయుండును. ఇందుకు చరకమునందు "సన్తతేనిలాద్వై విషమజ్వర స్సముపజాయతే। కఫపిత్తే హి నిశ్చేష్టే చేష్టయ త్యనిల స్సదా" అనియు, తంత్రాన్తరమున "పవనో గతివైషమ్యా ద్విషమజ్వర కారణం" అనియు నున్నది. విషమజ్వరమునందు నిశ్చలంబులై యుండు కఫపిత్తములను వాతంబెల్ల పుడు చలనమునొందించునుగాన వాతప్రకోపములేక విషమజ్వరము కల్గుటలేదనియు, విషమజ్వరము నందు విషమగతి కల్గియుండుటచేత వాతము అట్టి జ్వరమునకు ముఖ్యకారణమై యుండుననియు భావము. ఈ విషమజ్వరలక్షణము లుపలక్షణములు గాన రాత్రిజ్వరము మున్నగు విషమజ్వరములు గూడ నూహింపదగినవి. మఱియు తన్త్రాన్తరమున "సమౌ వాతకఫౌ యస్య హీనపిత్తస్య దేహినః। ప్రాయో రాత్రౌ జ్వర స్తస్య దివా హీనకఫస్య చ॥" అని యున్నది. వాతకఫములు రెండును సమములై పిత్తముతగ్గియున్నయెడ అట్టి మనుజునకు ప్రాయికముగ రాత్రి వేళల జ్వరము వచ్చుననియు, వాతకఫములతగ్గి పిత్తం అధికమై యున్నయెడ పగటియందు జ్వరము వచ్చుననియు భావము. మఱియు "ఋత్వహోరాత్రదోషాణాం మనసశ్చ బలాబలాత్। కాలమర్థవశాచ్చైవ జ్వర స్తం తం ప్రపద్యతే" అని చరకమునం దుండుట చేత ఋతువులు అహోరాత్రములు వాతాది దోషములు మనస్సు వీనియొక్క బలాబలములచేత తత్తత్కార్యానుగుణముగ సతతక చతుర్థకాది జ్వరములు తమతమ కాలనియమమును వదలి వేఱొక జ్వరముగ పరిణమించునని యెఱుంగునది. ఋతువు మొదలగువానియొక్క బలాబలములచేత సంతతజ్వరము స్వరూపమును వదలి సతతాది జ్వరములలో నొకటిగ పరిణమించుననియు, చతుర్థక జ్వరము తృతీయ కాది జ్వరములలో నొకటిగ పరిణమించుననియు భావము. ఈ రీతిగనే తక్కిన విషమజ్వరముల కన్నింటికిని పరిణామభేదంబులును ఉదాహరణంబులు గాహ్యంబులు.

## రసగతజ్వరచిహ్నములు

శ్లో॥ గురుతా హృదయోత్క్లేశ స్సదనం ఛర్ద్యరోచకౌ।
రసస్థే తు జ్వరే లిఙ్గం దైన్యం చాస్యోపజాయతే॥౭౮॥

తా॥ జ్వరము రసగతంబైన యపుడు దేహము భారముగా నుండుట, హృదయము, అవయవ ములు శిథిలంబులై యుండుట, వమనము, అరుచి, మనస్సున క్లేశముగల్గుట ఇట్టి చిహ్నములు గల్గును. మున్ను వచించిన వాత పిత్త కఫములచే జనించిన నానావిధజ్వరములను ఈలక్షణములచేత రసగతంబులని యెఱింగి రసాదిధాతువులకు నిరోధము గల్గనీయక ఆయాజ్వరములకు చికిత్స జేయ వలెనని భావము. క్రంద జెప్పంబడు రక్తాది ధాతువులయందును ఈరీతిగనే యెఱుంగునది.

## రక్తగతజ్వరలక్షణము

శ్లో॥ రక్తనిష్ఠీవనం దాహో మోహశ్ఛర్దనవిభ్రమౌ ।
ప్రలాపః పిడకా తృష్ణా రక్తప్రాప్తే జ్వరే నృణామ్॥౮౯॥

తా॥ రక్తమును ఉమియుట, తాపము, మూర్ఛ, వమనము, ఒడలుతిరుగుట, అనర్థముగ మాటలాడుట, శరీరమున బొబ్బలులేచుట, దప్పి ఈలక్షణములు రక్తగతమైన జ్వరమునందు మనుజులకు కల్గును.

## మాంసగతజ్వరలక్షణము

శ్లో॥ పిణ్డికోద్వేష్టనం తృష్ణా సృష్టమూత్రపురీషతా ।
ఊష్మాఽన్తర్దాహ విక్షేపౌ గ్లానిస్స్యాన్మాంసగే జ్వరే॥౯౦॥

తా॥ పిక్కలయందుండు మాంసమున కట్టెలతో గొట్టినరీతిగ బాధగల్గుట, దప్పి, మూత్రపురీషము లధికముగా వెలువెడలుట, ఒడలు మిగుల వేడిగానుండుట, శరీరమునకు లోపల తాపము గల్గుట, హస్తపాదాద్యవయవములను చలింపజేయుట, శరీరము బడలియుండుట ఈ లక్షణములు మాంసగతమైన జ్వరమునందు విశేషముగ కల్గును.

## మేదోగతజ్వరలక్షణము

శ్లో॥ భృశం స్వేదస్తృషా మూర్ఛా ప్రలాపశ్ఛర్దిరేవ చ ।
దౌర్గన్ధ్యారోచకౌ గ్లానిర్మేదస్థే చాసహిష్ణుతా॥౯౧॥

తా॥ మేదోగతమైన జ్వరమునందు మిక్కిలి చెమటయు, దప్పియు, మూర్ఛయు, అర్థములేక అధికముగా మాట్లాడుటయు, వాంతియు, శరీరమున దుర్గంధంబును, అరుచియు, బడలికయు, బాధల నోర్వజాల కుండుటయు ఈలక్షణములు కల్గును.

## అస్థిగతజ్వరలక్షణము

శ్లో॥ భేదోఽస్థ్నాం కూజనం శ్వాసో విరేకశ్ఛర్దిరేవ చ ।
విక్షేపణం చ గాత్రాణాం ఏత దస్థిగతే జ్వరే॥౯౨॥

తా॥ అస్థిగతమైన జ్వరమునందు అస్థులలో విరిగినట్లు నొప్పిగల్గుట, కంఠమునకూతలుబుట్టుట, శ్వాసంబధికముగుట, విరేచనము, వాంతి, చేతులు కాళ్లు మొదలైన అవయవములను కదలించుట, ఇట్టి లక్షణములు గల్గును.

## మజ్జగతజ్వరలక్షణము

శ్లో॥ తమఃప్రవేశనం హిక్కా కాస శ్శైత్యం వమిస్తథా ।
అన్తర్దాహో మహాశ్వాసో మర్మభేదశ్చ మజ్జగే॥౯౩॥

తా॥ మజ్జగతమైన జ్వరమునందు చీకటిలో ప్రవేశించినట్లు కన్నులు గానరాకుండుట, వెక్కిళ్లు, చలి, వాంతి, అన్తశ్శరీరమున తాపముగల్గుట, శ్వాసాధికారమున జెప్పంబడు మహాశ్వాసము, మర్మంబుల భేదించిన రీతిగ బాధగల్గుట ఈ లక్షణములు కల్గును.

## శుక్రగతజ్వరలక్షణము

శ్లో॥ మరణం ప్రాప్నుయా త్తత్ర శుక్రస్థానగతే జ్వరే।
శేఫస స్స్తబ్ధతా మోక్ష శ్శుక్రస్య తు విశేషతః॥ ౫౪॥

తా॥ శుక్రస్థానమును పొందిన జ్వరమునందు మేఢ్రము స్తంభించియుండును; శుక్రంబధికముగా స్రవించును; రసాదిధాతువులలో శుక్రగతజ్వరమునందు మనుజుడు మృతుండగును. "యథా పయసి సర్పిస్తు గుడశ్చేక్షురసే యథా । శరీరేషు తథా నృణాం శుక్రం విద్యా ద్భిషగ్వరః" అని గ్రంథాంతరమున నుండుటంజేసి నెయ్యి పాలయందును బెల్లము చెఱకురసమునందును లీనమైయుండుభంగి మనుజులశరీరమునం దంతట శుక్రము వ్యాపించియుండును.

## రసాదిధాతుగతజ్వరములలో సాధ్యాసాధ్య నిర్ణయము

శ్లో॥ * * రసరక్తాశ్రితస్సాధ్యో మాంసమేదోగతశ్చ యః।
అస్థిమజ్జగతః కృచ్ఛ్రశ్శుక్రస్థస్తు న సిధ్యతి * *

తా॥ మున్ను చెప్పిన రసాదిగత జ్వరములలో రసరక్తమాంసమేదోగత జ్వరములు సాధ్యంబులై యుండును. అస్థిమజ్జల నాశ్రయించిన జ్వరములు కష్టసాధ్యంబులై యుండును. శుక్రగతమైన జ్వరము సాధ్యంబుగాదు.

## జ్వరమునకు ప్రాకృత వైకృత భేదనిర్ణయము

శ్లో॥ వర్షాశరద్వసన్తేషు వాతాద్యైః ప్రాకృతః క్రమాత్ ।
వైకృతోఽన్య స్స దుస్సాధ్యః ప్రాకృత శ్చానిలోద్భవః ॥౫౫॥

తా॥ వర్షర్తువునందు వాతముచే జనించిన జ్వరంబును, శరదృతువునందు పిత్తముచే జనించిన జ్వరంబును, వసంతఋతువునందు కఫముచే జనించిన జ్వరంబును ప్రాకృతమనందగును. తక్కిన హేమన్తశిశిరగ్రీష్మములయందు వాతాదులచే జనించిన జ్వరములు వైకృతము లనంజను. అట్టి వైకృత జ్వరంబులును వాతముచే జనించిన ప్రాకృతజ్వరంబును కష్టసాధ్యములు. తక్కిన ప్రాకృతజ్వరములు సుసాధ్యంబులని భావము. ఋతుధర్మము నాశ్రయించి ప్రకోపించిన దోషము ప్రకృతియనియు అట్టి దోషమువలన జనించిన జ్వరము ప్రాకృతంబనియు; ఋతుధర్మమునకు విరుద్ధముగా ప్రకుపితంబులైన వాతాదిదోషములచే జనించిన జ్వరము వైకృతంబనియు భావము. అట్టి ప్రాకృతజ్వరము ఋతువునకుసమానమైన ధర్మముగల వాతాదిదోషములచే జనించుటంజేసి సుఖసాధ్యంబై యుండును. వైకృతజ్వరము ఋతువునకు విరుద్ధమైన ధర్మముగల దోషములచే జనించుటంజేసి దుస్సాధ్యంబై యుండును. వాతముచే జనించిన ప్రాకృతజ్వరంబుకూడ వ్యాధిస్వభావముచే దుస్సాధ్యంబగునని భావము. ఋతువునకు తుల్యధర్మంబైన దోషముచే జనించుట సుఖసాధ్యత్వమునకు కారణంబను నియమము జ్వరవ్యాధి కొకటికే తగియుండును. తక్కిన వ్యాధులయందు వైకృతత్వమే సుఖసాధ్యత్వకారణంబని యెఱుంగునది. ఈ యర్థము గ్రంథాన్తరమున "జ్వరే తుల్యర్తుదోషత్వం ప్రమేహే తుల్యదూష్యతా । రక్తగుల్మే పురాణత్వం సుఖసాధ్యస్య లక్షణం" అనియున్నది. జ్వరమునందు ఋతువునకు సమానమైన ధర్మముగల దోషముచే జనించుటయు

ప్రమేహమునందు దోషములైన వాతాదులును దూష్యంబులైన రసరక్తాదులును సమానములైన ధర్మంబులుగల్గియుండుటయు, రక్తగుల్మమునందు వ్యాధి చిరకాలమునకు ముందు జనించి పురాతనంబై యుండుటయు సుఖసాధ్యత్వమునకు కారణంబులని యర్థము. ఈనిర్ణయము ఆయా వ్యాధి స్వభావముచే గల్గినది యని యెఱుంగునది.

### పూర్వోక్తప్రాకృతజ్వరోత్పత్తిక్రమము

శ్లో॥ వర్షాసు మారుతో దుష్టః పిత్తశ్లేష్మాన్వితో జ్వరమ్ ।
కుర్యాత్పిత్తం చ శరది తస్యచానుబలః కఫః॥ ౫౬॥
తత్ప్రకృత్యా విసర్గాచ్చ తత్ర నాఽనశనాద్భయమ్ ।
కఫో వసన్తే తమపి వాతపిత్తం భవేదను॥ ౫౭॥

తా॥ వర్షఋతువునందు వాతము ప్రకుపితంబై తత్కాలోచిత పిత్తశ్లేష్మములతోగూడి జ్వరమును గల్గించును. శరత్కాలమునందు పిత్తము ప్రకోపమునొంది జ్వరమును కల్గించును. మఱియు నాపిత్తమునకు కఫము ఉపబలంబై యుండును. అట్టి పిత్తకఫములచే జనించిన జ్వరమునందు కఫపిత్తములయొక్క స్వభావముచేతను వర్షాశరద్ధేమంతములు విసర్గకాలంబులగుటచేతను ఆరోగికి లంఘనముచేయించినను భయములేదు. విసర్గకాలమనగా ఆఋతువుల మూడిటియందును మనుజులు బలయుక్తులై యుండు కాలమనియర్థము. మఱియు "కఫపిత్తే ద్రవే ధాతూ సహేతే లంఘనం మహత్" అని గ్రన్థాన్తరమునం దున్నది. కఫపిత్తములు రెండును ద్రవధాతురూపంబులుగాన లంకణమున కోర్చి యుండునని భావము. మఱియు కఫము వసన్తఋతువునందు ప్రకోపించి జ్వరమునుకల్గించును. అట్టి కఫమునకు వాతపిత్తములు సహకారులై యుండును. ఇవ్విధముగ ప్రాకృతజ్వరోత్పత్తిక్రమము నెఱుంగునది.

శ్లో॥ కాలే యథాస్వం సర్వేషాం ప్రవృత్తి ర్వృద్ధి రేవ వా ।
నిదానోక్తానుపశయో విపరీతోపశాయితా॥ ౫౮॥

తా॥ వాతపిత్తశ్లేష్మములు ప్రకోపము నొందుటకు సహజమైన పూర్వోక్త వర్షాశరద్వసన్త కాలములలో వరుసగా నాయాదోషముల ననుసరించి జ్వరములన్నియు జనించును, లేక జనించిన జ్వరములు వృద్ధినొందును. మఱియు నీ జ్వరములకు నిదానములుగా చెప్పియుండు ఆయా దోషములవృద్ధినొందించు ఆహారవిహారాదులచేత జ్వరం బధికమై దుఃఖముకల్గును. అట్టి దోషములకు విరుద్ధంబులైన యాహారాదులచేత సుఖకరంబులునై యుండును.

### అన్తర్వేగజ్వరలక్షణము

శ్లో॥ అన్తర్దాహోఽధిక స్తృష్ణా ప్రలాప శ్శ్వసనం భ్రమః ।
సన్ధ్యస్థిశూల మస్వేదో దోషవర్చోవినిగ్రహః ॥ ౫౯॥
అన్తర్వేగస్య లిఙ్గాని జ్వరస్యైతాని లక్షయేత్ ।

తా॥ శరీరాన్తర్భాగమున వేగముగ ప్రవర్తించు జ్వరమునందు అన్తర్భాగమున తాపము మిగుల నధికముగా నుండుట, దప్పి, వ్యర్థముగా మాట్లాడుట, అధికముగా నిట్టూర్పులు నిగుడిం

చుట, బుద్ధి కలతినొందుట, సంధులయందును అస్థులయందును నొప్పిగల్గుట, చెమట బట్టకుండుట, వాతాదిదోషంబులును మలంబును ప్రవర్తించక బద్ధంబులై యుండుట, ఈలక్షణములు గల్గియుండును. ఇట్టిలక్షణములచేత అంతర్వేగజ్వరంబని యెఱుంగవలెనని భావము.

### బహిర్వేగజ్వరలక్షణము

శ్లో॥ సన్తాపోఽభ్యధికో బాహ్య స్తృష్ణాదీనాంచ మార్దవం
బహిర్వేగస్య లిఙ్గాని సుఖసాధ్యత్వమేవచ ।

తా॥ శరీరసంబంధమైన వేడిమి మిగుల నతిశయముగా నుండుట, దప్పి, ప్రలాపము, నిట్టూర్పులు, భ్రమము ఇవియన్నియు స్వల్పముగానుండుట, ఇవి బహిర్వేగజ్వరమునకు లక్షణములు. మఱియు నీజ్వరము సుఖసాధ్యంబై యుండును. "గమ్భీరతీక్ష్ణవేగార్తం జ్వరితం పరివర్జయేత్" అని సుశ్రుతమునందుండుటచేత మున్ను వచించిన అన్తర్దాహజ్వరము మిగుల కష్టసాధ్యంబని యెఱుంగునది.

### ఆమజ్వరలక్షణము

శ్లో॥ లాలాప్రసేకో హృల్లాసహృదయాఽశుద్ధ్యరోచకాః॥౬౧॥
తన్ద్రాలస్యాఽవిపాకాస్య వైరస్యం గురుగాత్రతా॥
క్షున్నాశో బహుమూత్రత్వం స్తబ్ధతా బలవాన్జ్వరః॥౬౨॥
ఆమజ్వరస్య లిఙ్గాని న దద్యా త్తత్ర భేషజమ్ ।
భేషజం హ్యామదోషస్య భూయో జ్వలయతి జ్వరమ్॥౬౩॥

తా॥ నోట జొల్లుగారుట, వికారించుట, హృదయము పరిశుద్ధము గాకుండుట, నోరు అరుచియై యుండుట, కునికిపాటు, పనులయం దుత్సాహము లేకుండుట, అన్నము జీర్ణము గాకుండుట, నోటికి మధురాదిరసములు తెలియకుండుట, అవయవములన్నియు మిగుల భారముగానుండుట, ఆకలినశించుట, మూత్రంబధికముగా స్రవించుట, శరీరము స్తంభించియుండుట, జ్వరము మిగుల బలిష్ఠమై యుండుట, ఇవియన్నియు ఆమజ్వరలక్షణములు. అట్టి యామజ్వరమునందు ఔషధము నియ్యకూడదు. ఔషధముల నుపయోగించినయెడ జ్వరము అధికముగా జ్వలింపజేయును. ఇచ్చట ఆమత్వము వాతాదిదోషంబులకును రసమునకును కల్గును గాన రసంబైనను వాతాదిదోషంబులైనను పక్వములుగాకుండునపుడు వ్యాప్తంబైన జ్వరము ఆమజ్వరంబని భావము. ఈ యామత్వమునకు కాలనియమము గ్రన్థాన్తరమునందీరీతిగ నున్నది. "సప్తాహేనైవ పచ్యన్తే సప్తధాతుగతా మలాః । నిరామశ్చాప్యతః ప్రోక్తో జ్వరః ప్రాయోఽష్టమేఽహని" ధాతువులేడిటి యందుగల మలములు ఏడుదినములకు పక్వంబులగును గాన ఎనిమిదియవదినమునందు జ్వరము నిరామంబగునని యర్థము. మఱియు సుశ్రుతమునందు "మృదౌ జ్వరే లఘౌ దేహే ప్రచలేషు మలేషుచ । పక్వం దోషం విజానీయా జ్జ్వరే దేయం తదౌషధం ॥ సప్తరాత్రాత్పరం కేచి న్మన్యన్తే దేయమౌషధం । దశరాత్రాత్పరం కేచిద్దాతవ్యమితి నిశ్చితం" అని యున్నది. జ్వరము మిక్కిలి స్వల్పమై దేహము భారములేక చలనమైన మలములు

బద్ధంబులుగాక బయల్వెడలుచునున్నయెడ దోషము పక్వంబైనదని యెఱుంగునది. అట్టిపక్వావస్థను చూచి జ్వరమునం దౌషధమును ప్రయోగించవలెను. కొందరు ఏడుదినములకు పిమ్మట నౌషధము నుపయోగించవలెననియు, మరికొందరు పదిదినములకు పిదప జ్వరహరంబైన యౌషధమును ప్రయోగించవలెననియు వచించెదరని యర్థము. మఱియు వాగ్భటాచార్యుండు "సప్తాహాదౌషధం కేచి దాహురన్యే దశాహతః। కేచిల్లఘ్వన్నభుక్తస్య యోజ్యమామోల్బణేనతు। తీవ్రజ్వరపరీతస్య దోషవేగోదయే యతః। దోషేఽథవాతినిచితే తన్ద్రాస్తైమిత్యకారిణి। అపచ్యమానం భైషజ్యం భూయో జ్వాలయతి జ్వరం" అని వచించెను. జ్వరమువచ్చిన నాడు మొదలుజేసి యేడుదినములు వెళ్లినపిదప ఎనిమిదవదినమునందు ఔషధములిచ్చుట యుక్తమని కొందరును, పదినాళ్లువెళ్లినపిదప ఔషధమునిచ్చుట ఉచితంబని మఱికొందరును, లఘ్వాహారంబులగు మండపేయాదుల భుజించిన పిమ్మట ఔషధము నుపయోగించవలెనని మరికొందరును వచించిరి. మరియు తీవ్రంబైన జ్వరముచే పీడింపబడిన మనుజునకు ఆమాధిక్యముగల వాతాదిదోషములు మిగుల వేగముతో గూడియుండునపుడును కునికిపాటును స్తబ్ధమును కల్గించు దుష్టవాతాదిదోషములు వృద్ధినొందియున్నపుడును, జ్వరహరంబులైన కషాయములు మొదలైన యౌషధముల నిప్పించినయెడ నవి ఆమదోషముచే మందీభూతంబైన జాఠరాగ్నిచే జీర్ణంబుగాక జ్వరమును మిగుల వృద్ధినొందించును గాన ఆమదోషం బధికముగా నున్నపుడు మున్ను వచించిన సప్తాహాది కాలములయందును ఔషధము నిప్పించదగదని యర్థము. ఇట్టి వచనముల వలన కాలభేదము గన్పట్టినను ఆయా దోషముల ప్రాబల్యము ననుసరించి పూర్వోక్తకాలములయందైనను ఇతరకాలములయందైనను జ్వరము నిరామంబైయున్నపుడు జ్వరహరంబులైన కషాయాద్యౌషధములను ప్రయోగించవలెను గాని ఆమావస్థయందు ప్రయోగించినయెడ జ్వరవేగం బధికమగునని ముఖ్యాభిప్రాయంబు గాన పైనజెప్పిన వచనములకు పరస్పరవిరోధము లేదని యెఱుంగునది. ఈ సిద్ధాన్తమునే వాగ్భటాచార్యుండు "మృదుర్జ్వరో లఘుర్దేహ శ్చలితాశ్చ మలా యదా। అచిరజ్వరితస్యాపి భేషజం కారయే ద్బుధః" అని వచించెను. జ్వరము మిగుల స్వల్పమై దేహము భారములేక మల్కనై మలమూత్రాదులు బంధములేక చక్కగా వెడలుచున్న యెడ మున్నువచించిన కాలనియమములేక దానికి మున్నే జ్వరహరంబులైన కషాయాదుల నుపయోగించవచ్చునని భావము.

మఱియు "మృద్వీకాజ్వరే" అని యుపక్రమించిచెప్పిన సుశ్రుతాచార్యునకుగూడ నిరామావస్థయందు ఔషధము నుపయోగించవలెగాని కాలనియమం బక్కరలేదనే యభిప్రాయమని భిషగ్వరులచే దెలియందగినది.

## పచ్యమానజ్వరలక్షణము

శ్లో॥ జ్వరవేగోఽధిక స్తృష్ణా ప్రలాప శ్శ్వసనం భ్రమః।
మలప్రవృత్తి రుత్క్లేశః పచ్యమానస్య లక్షణం॥౬౪॥

తా॥ జ్వరవేగం బధికముగానుండుట, దప్పి, అనర్థముగ మాటలాడుట, నిట్టూర్పునిగుడించుట, ఒడలుదిరుగుట, మలముకొంచెముగ వెడలుట, ఓకరింత వచ్చుట, ఇవియన్నియు పచ్యమానంబైన (పాకమునొందుచున్న) జ్వరమునకు చిహ్నంబులని యెఱుంగునది.

## పక్వజ్వరలక్షణము

శ్లో॥ క్షుత్క్షామతా లఘుత్వంచ గాత్రాణాం జ్వరమార్దవమ్ ।
దోషప్రవృత్తి రష్టాహో నిరామజ్వరలక్షణం॥ ౬౭॥

తా॥ ఆకలిచే కృశించియుండుట, అవయవములు భారములేక చులకనై యుండుట, జ్వరవేగము స్వల్పముగా నుండుట, వాతాదిదోషములు బంధములేక వ్యాపించియుండుట ఇట్టి లక్షణములుగల్గి జ్వరప్రారంభదినము మొదలుకొని యెనిమిదిదినములు గడచిన జ్వరము నిరామంబని యెఱుంగునది. పక్వంబైనదిగాన చికిత్స్యంబని భావము.

## సాధ్యజ్వరలక్షణము

శ్లో॥ బలవత్స్వల్పదోషేషు జ్వరస్సాధ్యోఽనుపద్రవః।

తా॥ మిక్కిలి బలవంతులైన మనుజులకు స్వల్పంబులైన వాతాదిదోషములచే జనించిన జ్వరము కాసాద్యుపద్రవములు లేకున్నయెడ సాధ్యంబై యుండును. జ్వరోపద్రవములు గ్రంథాంతరమునం దీరీతిగ నున్నయవి: "కాసోమూర్ఛారుచిశ్ఛర్ది స్తృష్ణాఽతీసార విడ్గ్రహాః।హిక్కా శ్వాసాఙ్గభేదాశ్చ జ్వరస్యోపద్రవా దశ।" దగ్గు, మూర్ఛ, అరుచి, వాంతి, దప్పి, అతిసారము, మలబంధము, వెక్కిళ్లు, శ్వాసము, ఒళ్లునొప్పులు, ఈ పదియు జ్వరము నందుగల్గు నుపద్రవంబులని భావము.

## అసాధ్యజ్వరలక్షణము

శ్లో॥ హేతుభి ర్బహుభిర్జాతో బలిభి ర్బహులక్షణః ॥౬౮॥
జ్వరః ప్రాణాన్తకృద్యశ్చ శీఘ్ర మిన్ద్రియనాశనః ।

తా॥ మిక్కిలి బలయుక్తంబులైన అనేకహేతువులచే జనించి అనేకచిహ్నములుగల జ్వరంబును, జనించినపోడ నేత్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులను జ్ఞానేంద్రియపంచకము; వాక్పాణిపాదపాయూపస్థలను కర్మేంద్రియములు; మనస్సు ఈ పదునొకండింద్రియములను స్వవిషయములయందు ప్రవర్తింపనీయక నశింపంజేయు జ్వరంబును ప్రాణాంతకరంబగును; అసాధ్యంబని భావము.

ఇచ్చట వాతాదిదోషప్రకోప మూడు కారణములచే జ్వరము జనించినను సాధ్యంబులైన రసాదిధాతువులలో రెంటిని మూడిటిని ఆశ్రయించి ప్రకుపితంబులైన దోషములచే జనించిన జ్వరము అనేకహేతువులచే జనించినదియనియు, అట్టి రసాదిధాతువుల ననేకముల నాశ్రయించిన దోషములచే జనించిన జ్వరము బహులక్షణంబనియు, వాని నాశ్రయించని దోషములచే జనించినజ్వరము స్వల్పలక్షణంబనియు భావము. దీనికి తన్త్రాన్తరమున "ఏకం ద్వౌ త్రీన్ బహూన్వాపి దేహే ధాత్వాదియోగతః। దర్శయన్తి వికారాంశ్చ కుపితాః పవనాదయః॥" అని యున్నది. ప్రకుపితంబులైన వాతాదిదోషములు రసాదిధాతువులలో నొకటినైనను రెంటినైనను మూటినైనను అనేకములనైనను ఆశ్రయించి జ్వరాదిరోగములను కల్గించునని భావము.

శ్లో॥ జ్వరః క్షీణస్య శూనస్య గమ్భీరో దైర్ఘరాత్రికః॥౬౭॥
అసాధ్యోబలవాన్యశ్చ కేశసీమన్తకృజ్జ్వరః।
గమ్భీరస్తు జ్వరో జ్ఞేయో హ్యన్తర్దాహేన తృష్ణయా॥౬౮॥

తా॥ క్షీణబలుండగువానికి జనించిన జ్వరంబును, దేహము కృశించినవానికి కల్గిన జ్వరంబును, గమ్భీరంబైన (వాతాదిదోషములను నిర్ణయించుటకు సాధ్యముకాని) జ్వరంబును, అనేక రాత్రులయందు వ్యాపించిన జ్వరంబును, బలిష్ఠంబులైన వాతాదిదోషములచే జనించిన జ్వరంబును, తలవెండ్రుకలయందు పాపటదీసిన విధంబుగ రేఖలను కల్గించు జ్వరంబును, అసాధ్యంబని యర్థము. శరీరాన్తర్భాగమున మిగుల సంతాపమును కల్గించి దప్పిని పుట్టించు జ్వరము గంభీరంబని కొందరు వచించెదరు.

శ్లో॥ ఆనద్ధత్వేన చాత్యర్థం శ్వాసకాసోద్గమేనచ।
ఆరమ్భాద్విషమోయస్తు యశ్చవా దైర్ఘరాత్రికః॥౬౯॥
క్షీణస్య వాఽతిరూక్షస్య గమ్భీరో యస్య హన్తి తమ్।

తా॥ మలబంధముచేతను శ్వాసకాసములచేతను మిగుల విషమంబైన జ్వరంబును, జ్వరము ప్రారంభించినది మొదలు విషమంబైన సతతకాది జ్వరంబును, అనేకరాత్రులయందు వ్యాపించిన జ్వరంబును, క్షీణబలునకు జనించిన జ్వరంబును, మిగులరూక్షస్వభావము గలవానికి జనించిన జ్వరంబును, గంభీరమైన జ్వరంబును అసాధ్యంబులు.

శ్లో॥ విసంజ్ఞస్తామ్యతే యస్తు శేతే నిపతితోఽపి వా॥ ౭౦॥
శీతార్దితోఽన్తరుష్ణశ్చ జ్వరేణ మ్రియతే నరః।

తా॥ జ్వరవేగముచేత ఒడలెరుంగక మూర్ఛనొందినను, శయనించి లేచుటకు శక్తిలేక పడియున్నను, చలిచే మిగుల పీడితుండై శరీరాన్తర్భాగమున మిక్కిలి జ్వరతాపము గల్గియున్నను అట్టి మనుజుండు బ్రతుకనేరడు. ఆ జ్వరం బసాధ్యంబని భావము.

శ్లో॥ యో హృష్టరోమా రక్తాక్షో హృది సఙ్ఘాతశూలవాన్॥౭౧॥
వక్త్రేణ చైవోచ్ఛ్వసితి తం జ్వరో హన్తి మానవమ్।

తా॥ ఏమనుజుండు జ్వరవేగముచేత గగురుపాటుతోగూడిన శరీరము గలవాడును, ఎఱ్ఱని కన్నులు గలవాడును, హృదయమునందు నానావిధములైన పోటుకలవాడునై ముక్కున శ్వాసమును విడువక తీక్ష్ణముగ నోటనే విడుచుచుండునో అట్టి మనుజుని ఆ జ్వరము చంపును.

శ్లో॥ హిక్కా శ్వాసతృషాయుక్తం మూఢం విభ్రాన్తలోచనమ్॥౭౨॥
సన్తతోచ్ఛ్వాసినం క్షీణం నరం క్షపయతి జ్వరః।

తా॥ జ్వరవేగముచేత వెక్కిళ్లు, శ్వాసము, దప్పి, ఈ యుపద్రవములతోగూడిన మనుజుండును, మూర్ఛనొందినవాడును, చంచలంబులగు చూపులైనను లేక నేత్రములైనను కల్గిన మనుజుండును, ఎల్లప్పుడు నెడతెగక తీక్ష్ణంబుగ నిట్టూర్పు నిగుడించువాడును, క్షీణబలుండును, జ్వరముచే నాశమునొందును.

శ్లో॥ హతప్రభేన్ద్రియం క్షీణ మరోచకనిపీడితమ్॥ ౨౩॥
గమ్భీరతీక్ష్ణవేగార్తం జ్వరితం పరివర్జయేత్ ।

తా॥ జ్వరవేగముచేత క్షీణబలంబులై శబ్దాదులను గ్రహింపనోపని శ్రోత్రాదీన్ద్రియములతో గూడిన మనుజుండును, అరోచకముచే పీడితుండై క్షీణంబైన బలముగల మనుజుండును, గంభీరంబును తీక్ష్ణంబునైన జ్వరవేగముచే పీడింపబడిన మనుజుండును వైద్యునిచే విడువంబడును. అట్టి జ్వరము అసాధ్యంబుగాన చికిత్సజేయందగదని భావము.

మరికొన్ని అసాధ్యజ్వరలక్షణములను వృద్ధవాగ్భటను మొదలగు గ్రన్థములయందు జూడందగినది. మఱియు అసాధ్యసన్నిపాతజ్వరలక్షణములు గ్రన్థాన్తరమున నీరీతిగ గానంబడియెడు: "పిత్తకఫానిలవృద్ధ్యా దశదివస ద్వాదశాహ సప్తాహాత్ । హన్తి విముంచతి వాఽసు త్రిదోషజో ధాతుమలపాకాత్॥" వాతాది దోషత్రయప్రకోపముచే జనించిన సన్నిపాతజ్వరమునందు పిత్తంబధికముగా నున్నయెడ రసాదిధాతువులు పక్వంబులగుటచేత నా జ్వరము రోగిని పదిదినములలో చంపును; మలములు పక్వంబులైనయెడ పదియవదినమునందే విడుచును; కఫంబధికముగా వృద్ధినొందియున్నయెడ ధాతువులు పక్వంబులగుటచే పన్నెండుదినములలో చంపును; మలములు పక్వంబులైనయెడ విడుచును; వాతంబధికముగా వృద్ధినొందినప్పుడు ధాతువులు పక్వంబులైనయెడ ఏడుదినములలో మరణము నొందించును; మలములు పక్వంబులై యుండెనేని విడుచును; ఈరీతిగ సన్నిపాతజ్వరాఽసాధ్యత్వము నరయంగవలెనని భావము. మఱియు ధాతువుల పక్వలక్షణములు గ్రన్థాన్తరమున గానంబడియెడు. "నిద్రానాశో హృది స్తమ్భో విష్టమ్భో గౌరవాఽరుచీ । అరతి ర్బలహానిశ్చ ధాతూనాం పాకలక్షణమ్ । దోషప్రకృతి వైశద్యం*లఘుతా జ్వర దేహయోః । ఇన్ద్రియాణాంచ వైమల్యం దోషాణాం పాకలక్షణమ్॥" నిద్రానాశము, హృదయమునందు పట్టుకొనియుండుట, మలబంధము, శరీరము బరువై యుండుట, అరుచి, పనులయం దాసక్తి లేకుండుట, బలము నశించుట, ఇవి సన్నిపాత క్రమముగా రసాదిధాతువులు పక్వంబులగుటకు చిహ్నములు. దోషప్రకృతులు నిర్మలముగ నుండుట, జ్వరంబును దేహంబును చుల్కనై యుండుట, చక్షురాదీన్ద్రియములు నిర్మలముగా నుండుట, ఇవి పక్వంబులైన దోషముల లక్షణములని యర్థము.

జ్వ ర వి ము క్తి పూ ర్వ రూ ప ము

శ్లో॥ దాహః స్వేదో భ్రమ స్తృష్ణా కంపవిట్భేదసంజ్ఞితా॥ ౨౪॥
కూజనం చాస్యవైగన్ధ్యం ఆకృతి ర్జ్వరమోక్షణే ।

తా॥ తాపము, చెమట, భ్రమము, దప్పి కంపము, పురీషము భేదిల్లుట, శరీరమున ప్రజ్ఞ లేకపోవుట, స్ఫుటముగాకుండ మెల్లగా ధ్వనిజేయుట, శరీరమునందు దుర్గన్ధము గల్గుట, ఈ లక్షణములు జ్వరము విడచుటకు ముందు కల్గును.

మఱియు వాగ్భటాచార్యుండు "ధాతూన్ప్రక్షోభయన్దోషో మోక్షకాలే బలీయతే । తతో నరశ్శ్వసన్స్విద్య న్కూజన్వమతి చేష్టతే" అని వచించెను. జ్వరము

* వైచిత్యం—వైశద్యం.

విడుచు సమయంబున్ను దోషము రసాదిధాతువులను చలింపజేయుచు మిగుల బలిష్ఠంబగును. అట్టి సమయంబున రోగి శ్వాసమును విడుచుచు చెమట గార్చుచు అస్ఫుటముగా కూయుచు కాలు చేతుల కదలించుచు వమనము చేయునని యర్థము. ఇచ్చట జ్వరవిముక్తికి మున్నె దోషము క్షీణ బలంబైనను దీపము ఆరిపోవు సమయమున నధికముగ జ్వలించుభంగి దోషము శమించు నవసరమున మిగుల దీప్తంబై ధాతువుల నన్నింటిని ఆకులత నొందజేయును గాన దోషము శమించిన కొంతసేపు అట్టివేగము గల్గియుండును. దానంజేసి జ్వరమోక్షసమయమున స్వేదాదులు జనించునని యెరుంగునది.

## జ్వరవిముక్తలక్షణములు

శ్లో॥ స్వేదో లఘుత్వం శిరసఃకణ్డూః పాకో ముఖస్య చ॥౭౫॥
క్షవథు శ్చాన్నలిప్సా చ జ్వరముక్తస్య లక్షణమ్ ।



ఇతి శ్రీమాధవకరవిరచితే మాధవనిదానే
జ్వరనిదానం సమాప్తమ్.



తా॥ చెమటబట్టుట, శరీరము తేలికగానుండుట, శిరంబున నవపుట్టుట, నోరు పుండగుట, తుమ్ములు వచ్చుట, అన్నమునం దాసబొడముట, ఈలక్షణములు జ్వరముచే విడువబడిన వానికి గల్గును. ఈ లక్షణములు త్రిదోషములచే జనించిన జ్వరము విడుచునప్పుడు గల్గునని యెరుంగునది. ఈ యర్థమును భాలుకి "త్రిదోషజే జ్వరే స్యాతదస్తర్వేగే చ ధాతుగే । లక్షణం మోక్షకాలే స్యా దన్యస్మిన్స్వేదదర్శనాత్॥" అని చెప్పెను. మున్ను వచించిన స్వేదాది లక్షణము లన్నియు త్రిదోషజ్వరంబును, అన్తర్వేగజ్వరంబును విడచుసమయమున కల్గును; ఇతరంబులైన వాతాదిజ్వరములు విడచునప్పుడు స్వేదమమాత్రము కల్గునని భావము.

---

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రిచర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమగోత్ర
విరాజమాన దీవ్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపిక యను
మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు
జ్వరనిదానము
సమాప్తము.

---

శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# అతిసారనిదానమ్



ఇవ్విధంబుగ జ్వరనిదానమును సవిస్తరముగ నిరూపించినపిదప అతిసారము జ్వరసంబంధమైన ఉపద్రవము గాన అట్టి అతిసారమును నిరూపించ దలంచి తన్నిదానమును చెప్పట.



శ్లో॥ గుర్వతిస్నిగ్ధ రూక్షోష్ణ ద్రవస్థూలాతిశీతలైః।
విరుద్ధాధ్యశనాజీర్ణై ర్విషమై శ్చాపి భోజనైః॥ 1॥

స్నేహాద్యైరతియుక్తైశ్చ మిథ్యాయుక్తై ర్విషైర్భయైః।
శోకాద్దుష్టాంబు మద్యాఽతిపానైః సాత్మ్యర్తు పర్యయైః॥ 2॥

జలాభిరమణై ర్వేగ విఘాతైః క్రిమిదోషతః।
నృణాం భవత్యతీసారో లక్షణం తస్య వక్ష్యతే॥ 3॥

తా॥ స్వభావముచేత గురుత్వముగల మాషాదిపదార్థములను భుజించుటచేతను, అతిస్నిగ్ధంబులును, అతిరూక్షంబులును, అత్యుష్ణంబులును, అతి ద్రవంబులును, అతి స్థూలంబులును, స్వస్వవీర్యంబులచే మిగుల శీతంబులునైన పదార్థములను భుజించుట, దేశకాలసంయోగములచే విరుద్ధంబులగు క్షీరమత్స్యాదులను భుజించుట, ముందుదినమున భుజించినయన్నము జీర్ణముగాక శేషించియున్నపుడు మరలభుజించుట, జీర్ణముకాని పదార్థముల భుజించుట, అకాలమున భుజించుట, న్యూనాధికములుగ భుజించుట, మితిలేక భుజించుట, స్నేహన స్వేదన వమన విరేచన అనువాసనము లను వస్తికర్మలనుఅధికముగ జేసికొనుట, అట్టి వస్తికర్మలను శాస్త్రవిరుద్ధముగ జేసికొనుట, స్థావరంబులైన విషపదార్థములను సేవించుట, భయము, శోకము, దుష్టంబైన జలమును మద్యమును పానముచేయుట, జలమద్యములను అధికముగ పానముచేయుట, తటాకాది జలమునందు ఈతకొట్టుట మున్నగు క్రీడలసలుపుట, మలమూత్రాదివేగముల నిరోధించుట, క్రిమిదోషము, ఇట్టి కారణములచేత వాతాదిదోషములు ప్రకోపము నొంది మనుజులకు అతిసారం బను వ్యాధిని కల్గించును. అట్టి అతిసారవ్యాధిలక్షణమును వివరించెద నని భావము. "భుక్తంపూర్వాన్నశేషేతు పునరధ్యశనం మతమ్" అని అధ్యశనలక్షణము చరకమునందును "బహుస్తోకమకాలేచ తజ్జ్ఞేయం విషమాశనమ్" అని విషమాశనలక్షణము సుశ్రుతము నందును కానంబడియెడు. మున్ను భుజించినయన్నము శేషించియుండునపుడు మరల భుజించుట అధ్యశనంబనియు,

తానుభుజించు మితమునకు కొంచెముగనైనను అధికముగనైనను భుజించుటయు, అకాలమున భుజించుటయు విషమాశనంబనియు భావము.

అ తి సా ర సం ప్రా ప్తి

శ్లో॥ సంశమ్యాపాం ధాతు రగ్నిం ప్రవృద్ధః
శకృన్మిశ్రో వాయునాధఃప్రణున్నః।
సరత్యతీవాఽతిసారం తమాహు
ర్వ్యాధిం ఘోరం షడ్విధం తం వదన్తి॥ ౪॥
ఏకైకశ స్సర్వశశ్చాపి దోషైః
శోకేనాన్యః షష్ఠ ఆమే న చోక్తః।

తా॥ ద్రవరూపంబులగు రస జల మూత్ర స్వేద మేదః కఫ పిత్త రక్తాది ధాతువులు మిగుల వృద్ధినొంది జఠరాగ్నిని మందగింపజేసి మలముతోఁగలిసి అపానవాతముచే ప్రేరితంబై అధోమార్గముగ మాటిమాటికి ద్రవరూపమై స్రవించుచుండును. దానిని అతిసారం బను క్రూరవ్యాధియని వైద్యశిఖామణులు వచించెదరు. మఱియు నా వ్యాధి వాతాదిదోషములలో నొక్కొక దానిచేతను, దోషత్రయసన్నిపాతముచేతను శోకముచేతను అజీర్ణముచేతను జనించుటంజేసి షడ్విధం బగునని వచించెదరు.

దోషద్వయసంసర్గముచే జనించుటంజేసి యనేకభేదంబు లగునని కాశిరాజు వక్కాణించెను. అతిసారము, వాతాతిసారము, పిత్తాతిసారము, కఫాతిసారము, సన్నిపాతాతిసారము, శోకాతిసారము, ఆమాతిసారము, ఇవ్విధంబుగ నారువిధంబులగుననియు, దోషద్వయసంసర్గములచే ననేకభేదంబులగు ననియు ముఖ్యతాత్పర్యము.

మఱియు వాగ్భటాచార్యుండు, "సామం శకృన్నిరామం వా జీర్ణే యేనాతిసార్యతే। సోతిసారోఽతిసరణా దాశుకారీ స్వభావతః" అని అతిసార లక్షణమును అన్వర్థముగా జెప్పెను. పక్వముకాని పురీషంబైనను పక్వంబగు పురీషంబైనను ఏ వ్యాధిచేత జీర్ణకాలమునందు ద్రవీభూతమై అధికముగా మాటిమాటికి స్రవింపబడునో అట్టి వ్యాధి అధికముగ స్రవింపజేయుటంజేసి అతిసారమని వ్యవహరింపంబడును. మఱియు నీ వ్యాధి స్వభావముచే పురీషమును అతిశీఘ్రముగ స్రవింపజేయునని యర్థము. ఇచ్చట "అపాం ధాతుః" అను పదముచే శరీరమునందలి ద్రవరూపధాతువు లన్నియు గ్రహింపబడునని యెరుంగునది.

అ తి సా ర పూ ర్వ రూ ప ము

శ్లో॥ హృన్నాభిపాయూదరకుక్షితోద
గాత్రావసాదానిలసన్నిరోధాః।
విట్సఙ్గ ఆధ్మాన మథావిపాకో
భవిష్యత స్తస్య పురస్సరాణి॥౫॥

తా॥ హృదయము బొడ్డు గుదము ఉదరము కుక్షి ఈస్థలములయందు పోటు, శరీరము కృశత నొందుట, అపానవాతము వెడలక నిరుద్ధంబగుట, మలబంధము, కడుపుబ్బరము, అజీర్ణము, ఇవి యన్నియు అతిసారవ్యాధి కల్గుటకు మున్ను జనించు పూర్వరూపములని యర్థము.

వా తా తి సా ర ల క్ష ణ ము

శ్లో॥ అరుణాం ఫేనిలం రూక్షం అల్పమల్పం ముహుర్ముహుః।
శకృదామం సరుక్శబ్దం మారుతేనాతిసార్యతే॥ ౬॥

తా॥ వాతముచే జనించిన అతిసారమునందు అరుణవర్ణంబును నురుగుతో గూడినదియు, రూక్షంబును, అపక్వంబును, బాధతోడను శబ్దముతోడను గూడినదియునైన పురీషము కొంచెము కొంచెముగ మాటిమాటికి స్రవించుచుండును.

పి త్త క ఫా తి సా ర ల క్ష ణ ము లు

శ్లో॥ పిత్తాత్పీతమ్ నీలమాలోహితంవా
తృష్ణామూర్ఛాదాహపాకోపపన్నమ్।
శుక్లం సాంద్రం శ్లేష్మణా శ్లేష్మయుక్తం
విస్రం శీతం హృష్టరోమా మనుష్యః॥ ౭॥

తా॥ పిత్తముచే జనించిన అతిసారమునందు పసుపురంగు కల్గినదియు, లేక నీలవర్ణంబును కొంచెముగ రక్తవర్ణంబునైన పురీషము స్రవించును. దప్పి, మూర్ఛ, శరీరమునందెల్ల మంటలు,గుద స్థానమున పుండు, ఈ యుపద్రవములు కల్గును. కఫముచే జనించిన అతిసారమునందు మలము శుక్ల వర్ణంబును, కఠినంబును, శ్లేష్మముతోకూడినదియు దుర్గంధయుక్తంబును, శీతంబునునై స్రవించును. అట్టివ్యాధియందు మనుజుండు గగుర్పాటు కల్గియుండును.

స న్ని పా తా తి సా ర ల క్ష ణ ము

శ్లో॥ వరాహస్నేహ మాంసామ్బుసదృశం సర్వరూపిణమ్।
కృచ్ఛ్రసాధ్యమతీసారం విద్యాద్దోషత్రయోద్భవమ్॥ ౮॥

తా॥ పందిచమురు, మాంసమును కడిగిననీళ్లు ఈరెంటికి సమానంబును, మున్ను జెప్పిన అతిసారముల మూడిటిలక్షణములు కల్గినదియునైన అతిసారము దోషత్రయ సన్నిపాతముచే జనించినదియని యెఱుంగునది. మఱియు నీఅతిసారము మిగుల కష్టసాధ్యంబై యుండును.

శో క జా తి సా ర ల క్ష ణ ము

శ్లో॥ తైస్తైర్భావైః శోచతోఽల్పాశనస్య
బాష్పోష్మా వై వహ్నిమావిశ్య జన్తోః।
కోష్ఠంగత్వా క్షోభయేత్తస్య రక్తం
తచ్చాధస్తాత్కాకణన్తీ ప్రకాశమ్॥౯॥

నిర్గచ్ఛేద్వైవిడ్విమిశ్రం హ్యవిడ్వా
నిర్గన్ధం వా గన్ధవద్వాతిసారః ।
శోకోత్పన్నో దుశ్చికిత్స్యో౽తిమాత్రం
రోగోవైద్యైః కష్ట ఏష ప్రదిష్టః॥౧౦॥

తా॥ ధనము బంధువులు మిత్రులు మొదలగువాని నాశమువలన గల్గుదుఃఖముచేత స్వల్పముగ భుజించు మనుజునకు కన్నీళ్లవిడుచుటచే జనించిన ఉష్ణము జాఠరాగ్నితోఁగలసి కోష్ఠమున ప్రవేశించి రక్తమును క్షోభింపజేయును; అట్టి క్షోభముచేత గురిగింజతో సమానమైన రంగుగలరక్తము మలముతోఁ గూడియైనను మలరహితంబుగనైనను దుర్గంధముతోఁ గూడియైనను దుర్గంధములేకనైనను గుదద్వారమున బైలువెడలి స్రవించును. ఈ యతిసారము శోకముచే జనించుటంజేసి చికిత్సచే సాధించుటకు కష్టమైయుండును. ఈ రోగమునకు నిదానంబైన శోకము నివర్తించకనే ఔషధములచేత సాధ్యంబు గాదని భావము.

## ఆమాతిసారలక్షణము

శ్లో॥ అన్నాజీర్ణాత్ప్రద్రుతాః క్షోభయన్తః
కోష్ఠం దోషా ధాతుసంఘాన్మలాంశ్చ ।
నానావర్ణం నైకశస్సారయన్తి
శూలోపేతం షష్ఠమేనం వదన్తి॥౧౧॥

తా॥ అన్నసంబంధమైన అజీర్ణముచే వాతాదిదోషములు స్వమార్గములవదలి యితరమార్గముల సంచరించుచు కోష్ఠమును రక్తాదిధాతుసమూహమును పురీషాదిమలములను దుష్టములుగఁ జేయుచు నానావిధవర్ణములు గలిగినట్టియు శూలతోఁగూడినదియు నైన మలమును పలుమారు స్రవింపజేయును. దీనిని ఆమాతిసారంబని వ్యవహరింతురు.

## ఆమమలలక్షణము

శ్లో॥ సంసృష్టమేభిర్దోషైస్తు న్యస్తమప్స్వవసీదతి ।
పురీషం భృశదుర్గన్ధి పిచ్ఛిలం చామసంజ్ఞితమ్॥౧౨॥

తా॥ పైనచెప్పిన దోషములతోఁగూడిన పురీషము మిగుల దుర్గంధముతోఁ గూడి పిచ్ఛిలంబై జలమునం బడవైచిన మునిగిపోయినయెడ అట్టిపురీషము ఆమంబని యెఱుంగునది.

## పక్వమలలక్షణము

శ్లో॥ ఏతాన్యేవతు లిఙ్గాని విపరీతాని యస్య వై ।
లాఘవం చ విశేషేణ తస్య పక్వం వినిర్దిశేత్ ॥౧౩॥

తా॥ పైనచెప్పిన లక్షణములకు విరుద్ధములైన చిహ్నములుగల్గిన మలము పక్వంబనియెఱుంగునది. మలము పక్వంబైనపుడు మనుజునకు శరీరంబును కోష్ఠంబును మిగుల చుల్కనై యుండును.

## అ సా ధ్యా తి సా ర ల క్ష ణ ము.

శ్లో॥ పక్వజామ్బవసఙ్కాశం యకృత్పిణ్డనిభం తను।
ఘృతతైలవసామజ్జ వేశవారపయోదధి॥౧౪॥
మాంసధావనతోయాభం కృష్ణం నీలారుణప్రభమ్।
మేచకం స్నిగ్ధకర్బూరం చన్ద్రికోపగతం ఘనమ్॥౧౫॥
కుణపం మస్తులిఙ్గాభం సుగన్ధి కుథితం బహు।
తృష్ణాదాహాతమశ్వాసహిక్కాపార్శ్వస్థిశూలినమ్॥౧౬॥
సంమూర్ఛారతిసమ్మోహాయుక్తం పక్వవలీగుదమ్।
ప్రలాపయుక్తం చ భిషగ్వర్జయేదతిసారిణమ్॥౧౭॥

తా॥ పండిన నేరేడుపండువంటి రంగుగల్గినదియు, కుడిప్రక్కనుండు యకృత్తనుమాంసము వలె రక్తకృష్ణవర్ణంబును, మిగుల సూక్ష్మంబును, నెయ్యి నూనె మాంసములోని చమురు మూలుగు వేయించినమాంసపుముక్కలు పాలు పెరుగు మాంసమును కడిగిననీరు వీనితో సమానమైనరంగుగల్గినదియు, కృష్ణవర్ణంబును, నీలారుణవర్ణంబును, కొంచము నల్లనిరంగు కల్గినదియు, స్నిగ్ధంబును, చిత్రవర్ణంబును, నెమలియీకవంటివర్ణము కల్గినదియు, నిబిడంబైనదియు, శవమువంటి దుర్గంధము గల్గినదియు, శిరంబుననుండు మెదడువలె నుండునదియు, స్వాభావికగంధము లేక సుగంధముగల్గియుండునదియు, క్రుళ్లినదియును అధికముగను మలము వెడలుట, దప్పి, తాపము, మత్తు, శ్వాసము, వెక్కిళ్లు, ప్రక్కలనుండుయెముకలలోనొప్పి, ఒడలెరుంగక మూర్ఛనొందుట, పనులయందాసక్తి లేకుండుట, ఇన్ద్రియజన్యజ్ఞానము లేకుండుట, గుదస్థానము పుండై ముడతలుపడుట, అనర్థముగ మాటలాడుట ఇట్టి లక్షణములతోగూడిన అతిసారవ్యాధి గల మనుజుని చికిత్సజేయంపగదు. ఈలక్షణములు జనించినయెడ అతిసారవ్యాధి యసాధ్యంబని భావము.

శ్లో॥ అసంవృతగుదం క్షీణం దూరాధ్మాతముపద్రుతం।
గుదే పక్వే గతోష్మాణం అతిసారకిణం త్యజేత్॥౧౮॥

తా॥ గుదస్థానమును మూసికొనుటకు శక్తిలేనివాడును, బలహీనుండును, అధికముగ కడుపుబ్బరముకలవాడును, శోఫము మొదలగు అతిసారోపద్రవములు కలవాడును, గుదపాకము గల్గినను శరీరమునం దుష్ణము లేనివాడునైన అతిసారవ్యాధికల మనుజుని చికిత్సజేయంజనదు. అతిసారోపద్రవములు గ్రన్థాన్తరమునం దీరీతిగ నున్నవి: "శోథం శూలం జ్వరం తృష్ణాం శ్వాసం కాసమరోచకం। ఛర్దిం మూర్ఛాం చ హిక్కాంచ దృష్ట్వాతీసారిణం త్యజేత్॥" శోఫ, శూలము, జ్వరము, దప్పి, శ్వాసము, దగ్గు, అరుచి, వాంతి, మూర్ఛ, వెక్కిళ్లు, ఇవి అతిసారోపద్రవములుగాన ఇట్టి యుపద్రవములుకల్గిన యతిసారం బసాధ్యంబని భావము.

శ్లో॥ శ్వాసశూలపిపాసార్తం క్షీణం జ్వరనిపీడితమ్।
విశేషేణ నరం వృద్ధం అతిసారో వినాశయేత్॥౧౯॥

తా॥ శ్వాసము, శూల, దప్పి, కృశత్వము, జ్వరము ఇట్టి యుపద్రవములతో గూడిన మనుజుని అతిసారవ్యాధి మరణము నొందించును. మిక్కిలి వృద్ధు డగువానికి అతిసారముగల్గినయెడ బ్రతుకుట దుస్తరమని భావము.

## రక్తాతిసారలక్షణము

శ్లో॥ పిత్తకృన్తి యదాత్యర్థం ద్రవ్యాణ్యశ్నాతి పైత్తికే।
తదోపజాయతేఽభీక్ష్ణం రక్తాతీసార ఉల్బణః॥౨౦॥

తా॥ పిత్తాతిసారము గల్గుటకుముందైనను, కల్గినపుడైనను, పిత్తవృద్ధికరంబులైన పదార్థములను భుజించినయెడ మిగుల తీక్ష్ణంబైన రక్తాతిసారము కల్గును. ఇచ్చట రక్తపిత్తములకు భేదము లేమింజేసి రక్తాతిసారము పిత్తాతిసారాన్తర్భూతంబని వేరుగ జెప్పలేదు; గాన షడ్విధంబను సంఖ్యకు విరోధము లేదని యెరుంగునది.

## ప్రవాహికాలక్షణము

శ్లో॥ వాయుః ప్రవృద్ధోనిచితం బలాసం
నుదత్యధస్తా దహితాశనస్య
ప్రవాహతోఽల్పం బహుశో మలాక్తం
ప్రవాహికాం తాం ప్రవదన్తి తజ్జ్ఞాః॥౨౧।

తా॥ అపథ్యాహారములచేయు మనుజునకు వాతము కుపితంబై సంచితంబైన కఫమును మలముతోగూడి బలాత్కారముగ ముక్కినపుడు అల్పంబైనను అధికంబైనను పలుమారు అపానద్వారమున వెడలించును; దానిని ప్రవాహికంబని వైద్యశ్రేష్ఠులు జెప్పెదరు.

## వాతజాదిప్రవాహికాలక్షణములు

శ్లో॥ ప్రవాహికా వాతకృతా సశూలా
పిత్తాత్సదాహా సకఫా కఫాచ్చ।
సశోణితా శోణితసంభవా చ
తాస్స్నేహరూక్షప్రభవా మతాస్తు॥౨౨॥
తాసామతీసారవదాదిశేచ్చ
లిఙ్గం క్రమం చామవిపక్వతాం చ।

తా॥ వాతముచే జనించిన ప్రవాహికము శూలముతో గూడియుండును. పిత్తముచే జనించిన ప్రవాహికము మంటతోగూడియుండును. కఫముచే జనించిన ప్రవాహికము శ్లేష్మముతో గూడియుండును. రక్తముచే జనించిన ప్రవాహికము రక్తముతో గూడియుండును. అందు కఫజప్రవాహికము స్నేహముచే జనించును. వాతజప్రవాహికము రూక్షముచే జనించును. ఇచ్చట తు శబ్దము సముచ్చయార్థకముగాన పిత్తరక్తప్రవాహికములు తీక్ష్ణోష్ణములచే జనించునని యర్థము. మరియు నాప్రవా

హికములయందు వాతాది చిహ్నంబులును ఆమవిపక్వ భేదంబులును చికిత్సాభేదంబులును అతిసార భేదములను బోలియుండును. దానంజేసియే అతిసారమునకంటె దీనిని వేరుగా పరిగణనమును జేయకుండుట యని యెఱుంగునది.

### అతిసారనివృత్తిలక్షణము

శ్లో॥ యస్యోచ్చారం వినామూత్రం సమ్యగ్వాయుశ్చ గచ్ఛతి।
దీప్తాగ్నేర్లఘుకోష్ఠస్య గత స్తస్యోదరామయః॥ ౨౩॥

తా॥ ఏమనుజునకు మలములేకనే మూత్రముఅపానవాతము అడ్డములేక ప్రవర్తించునో అగ్ని దీపనము విశేషముగా కలిగికోష్ఠము మిగుల చుల్కనై యుండునో అట్టిమనుజునకు అతిసారవ్యాధినివర్తించినది యని యెఱుంగునది.

### జ్వరాతిసారలక్షణము

శ్లో॥ * * జ్వరాతిసారయోరుక్తం నిదానం యత్పృథక్పృథక్ ।
తత్సాన్నిజ్జ్వరాతిసారస్య తేననాత్రోదితంపునః * *



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
అతిసారనిదానం సమాప్తమ్.



తా॥ జ్వరాతిసారములకు వెవ్వేరుగ జెప్పినలక్షణములు గల్గియున్నయెడ నయ్యది జ్వరాతిసారంబని చెప్పందగును. జ్వరలక్షణంబులును, అతిసారలక్షణంబులును మున్ను జెప్పియున్నవిగాన నిచ్చట జ్వరాతిసారముయొక్క లక్షణమును ప్రత్యేకముగ జెప్పలేదని యెఱుంగునది.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రిచరణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్రవిరాజమాన దీక్షితాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయవిధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" " "భిషఙ్మణి" "పణ్డిత" గోపాలాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు
అతిసారనిదానము
సమాప్తము.

శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# గ్రహణీరోగనిదానమ్

అతిసారనిదానమును జెప్పినపిమ్మట తత్సజాతీయమగుటంజేసి గ్రహణీనిదానమును జెప్పుట.

## గ్రహణీరోగసంప్రాప్తి

శ్లో॥ అతీసారే నివృత్తేఽపి మన్దాగ్నేరహితాశినః।
భూయస్సందూషితోవహ్ని ర్గ్రహణీమభిదూషయేత్॥ ౧॥

తా॥ అతిసారవ్యాధికల్గి నివర్తించినను అతిసారము కలగకున్నను అగ్నిమాన్ద్యము కల మనుజుండు అపథ్యంబులైన అన్నాదులను భుజించినయెడ జఠరాగ్ని దూషితమై గ్రహణియను వ్యాధిని కల్గించును. మఱియు వాగ్భటుండు "అతీసారేషు యోనాతియత్నవాన్ గ్రహణీగదః। తస్య స్యాదగ్నివిధ్వంసకరై రత్యర్థ సేవితైః" అని వచించెను. అతిసారవ్యాధియం దేమనుజుండు మిగుల ప్రయత్నముతో చికిత్సజేయకుండునో అట్టిమనుజునకును అతిసారవ్యాధి కలగకున్నను అగ్నిమాన్ద్యకరంబులైన యాహారాదులను సేవించుమనుజునకును గ్రహణీరోగము సంప్రాప్తంబగునని భావము. అతిసారవ్యాధికి తగిన చికిత్సజేయక ఉపేక్షించుటయు, అగ్నిమాన్ద్యకరాహారముల సేవించుటయు గ్రహణీరోగమునకు నిదానంబులని తాత్పర్యము.

## గ్రహణీసామాన్యలక్షణము

శ్లో॥ ఏకైకశస్సర్వశశ్చ దోషైరత్యర్థమూర్ఛితైః।
సా దుష్టా బహుశోభుక్త మామమేవ విముఞ్చతి॥ ౨॥
పక్వం వా సరుజం పూతి ముహుర్బద్ధం ముహుర్ద్రవమ్॥
గ్రహణీరోగమాహుస్తం ఆయుర్వేదవిశారదాః॥ 3॥

తా॥ వాతపిత్తకఫము లొక్కొకటియైనను అన్నియైనను ప్రకుపితంబులై జఠరాగ్ని కధిష్ఠానంబైన గ్రహణియను నాడిని (పచ్యమానాశయమును) దుష్టముగజేయును. అట్టిదుష్టంబైన గ్రహణి భుజించబడిన యాహారమును అపక్వముగనైనను పక్వముగనైనను బాధతోడను దుర్గన్ధముతోడను గూడి వాతముచే బద్ధంబుగను పిత్తముచే నార్ద్రంబుగను అపానద్వారముచే మాటిమాటికి వెలువెడలించును; అవ్యాధిని గ్రహణీరోగమని ఆయుర్వేదజ్ఞులు వచించెదరు.

గ్రహణీనాడి స్వరూపంబు చరకమునం దీరీతిగ చెప్పంబడినది. "అగ్న్యధిష్ఠాన మన్న స్య గ్రహణాద్గ్రహణీ మతా। నాభేరుపరి సాహ్యగ్ని బలోప స్తమ్భబృంహితా। అపక్వం ధారయత్యన్నం పక్వం సృజతి చాప్యధః" జఠరాగ్నికి నధిష్ఠానంబై భుజించిన యాహారమును గ్రహించునాడి గ్రహణియనంబరగు; ఆట్టి గ్రహణి నాభికి ఊర్ధ్వభాగమున జఠరాగ్ని సాహాయ్యముచే బలయుక్తంబై యపక్వమైన యన్నమును ధరించుచు పక్వంబైనయన్నమును వెలుపట విడచుచు నుండునని భావము. మఱియు గ్రహణియనునది పక్వామాశయములకు మధ్యమున నుండు కలయని సుశ్రుతమునందు చెప్పియున్నది.

## గ్ర హ ణీ పూ ర్వ రూ ప ము

శ్లో॥ పూర్వరూపం తు తస్యేదం తృష్ణాలస్యం బలక్షయః।
విదాహోఽన్నస్య పాకశ్చ చిరాత్కాయస్య గౌరవమ్॥౪॥

తా॥ దప్పి, ఆలస్యము, బలహాని, అగ్నిమాన్ద్యము, అన్నము చిరకాలమునకు జీర్ణించుట, శరీరము బరువుగా నుండుట, ఇవియన్నియు గ్రహణీరోగమునకుముందు కల్గు పూర్వరూపములు.

## వా త జ గ్ర హ ణీ ల క్ష ణ ము

శ్లో॥ కటుతిక్తకషాయాతి రూక్షసందుష్టభోజనైః।
ప్రమితానశనాత్యధ్వ వేగనిగ్రహ మైథునైః॥౫॥
మారుతః కుపితో వహ్నిం సంఛాద్య కురుతే గదాన్।
తస్యాన్నం పచ్యతే దుఃఖం శుక్తపాకం ఖరాఙ్గతా॥౬॥
కంఠాస్యశోషః క్షుత్తృష్ణా తిమిరం కర్ణయోస్స్వనః।
పార్శ్వోరువఙ్క్షణగ్రీవారుగభీక్ష్ణం విసూచికా॥౭॥
హృత్పీడా కార్శ్యదౌర్బల్యం వైరస్యం పరికర్తికా।
గృద్ధిస్సర్వరసానాం చ మనసస్సదనం తథా॥౮॥
జీర్ణే జీర్యతి చాధ్మానం భుక్తే స్వాస్థ్యముపైతి చ।
సవాతగుల్మహృద్రోగ ప్లీహాశఙ్కీ చ మానవః॥౯॥
చిరాద్దుఃఖం ద్రవం శుష్కం తన్వామం శబ్దఫేనవత్।
పునఃపునస్సృజేద్వర్చః కాసశ్వాసార్దితోఽనిలాత్॥౧౦॥

తా॥ కటుతిక్తకషాయ రసములుగల పదార్థములను భుజించుట, రూక్షపదార్థములను పరస్పర విరుద్ధంబులగు పదార్థములను భుజించుట, స్వల్పముగ భుజించుట, ఉపవాసములుండుట,

అధికముగ త్రోవనడచుట, మలమూత్రవేగముల నిరోధించుట, స్త్రీలతో నధికముగ సంభోగించుట, ఇట్టి కారణములచేత వాతము కుపితంబై జఠరాగ్నిని మందముగచేసి వాతగ్రహణిని కల్గించును. అట్టివ్యాధికల మనుజునకు భుజించిన అన్నము మిగుల కష్టముగా పచనంబగును. పులిత్రేనుపులు విశేషముగా వచ్చును. మఱియు శరీరము కర్కశముగా నుండుట, కుత్తుక నోరు ఎండుట, ఆకలి, దప్పి, కంటిచూపు తక్కువగానుండుట, కర్ణరంధ్రములయందు ధ్వనిగల్గుట, ఇరుప్రక్కలు తొడలు గజ్జలు కంఠము ఈస్థలములయందు మిగుల నొప్పిగల్గుట, ఆమంబైన యన్నరసము ఊర్ధ్వాధోమార్గముల వెడలుట, రొమ్మునొప్పి, శరీరము కృశించుట, బలము నశించుట, నోటికిరుచి తెలియకుండుట, గుదమునందు రంపముతో కోయునట్లు బాధగల్గుట, మధురాది రసముల నన్నింటిని భుజించుట కిచ్ఛకలుగుట, మనసు నొచ్చియుండుట, అన్నము జీర్ణించునపుడును జీర్ణంబైనపిమ్మటను కడుపుబ్బరించుట, భుజించినపుడు స్వస్థముగనుండుట, వాతగుల్మము హృద్రోగము ప్లీహము ఈ యుపద్రవములు కల్గినట్లుండుట, ద్రవంబుగనైనను శుష్కంబుగనైనను సూక్ష్మంబుగనైనను నురుగుతో గూడియైనను మలమును చిరకాలమునకు మాటిమాటికి వెడలించుట, కాసశ్వాసములు కల్గుట ఈలక్షణములు వాతముచే జనించిన గ్రహణీరోగమునం గల్గును.

## పిత్తజగ్రహణీలక్షణము

శ్లో॥ కట్వజీర్ణవిదాహ్యమ్లక్షారాద్యైః పిత్తముల్బణమ్ ।
ఆప్లావయద్ధన్త్యనలం జలం తప్తమివానలమ్॥౧౧॥
సోఽజీర్ణం నీలపీతాభం పీతాభస్సార్యతే ద్రవమ్।
పూత్యమ్లోద్గారహృత్కణ్ఠ దాహారుచితృడర్దితః॥౧౨॥

తా॥ కటుపదార్థములు అజీర్ణకర ద్రవ్యములు మిగుల తాపమును కల్గించు పదార్థములు ఆమ్లరసంబులును క్షారంబులు నైన ద్రవ్యములు మున్నగువానిని భుజించుటచే పిత్తము వృద్ధినొంది జఠరాగ్నిని తిరస్కరించి మిగుల నుష్ణంబైన జలము అగ్నిని చల్లార్చుభంగి జఠరాగ్నిని చల్లార్చును. మరియు నాపిత్తముఅజీర్ణంబును పసుపునలుపుకలసినరంగుకల్గినదనియు పచ్చనిరంగుకల్గినదియునైన మలమును మాటిమాటికి వెడలించును. అట్టి వ్యాధిగలమనుజుండు పచ్చనిశరీరముకల్గినవాడును దుర్గన్ధయుక్తంబులగు పులిత్రేనుపులు, కంఠహృదయములయందు మంట, అరుచి, దప్పి, ఈ యుపద్రవములచే పీడితుండు నగును.

## కఫజగ్రహణీలక్షణము

శ్లో॥ గుర్వతిస్నిగ్ధశీతాదిభోజనా దతిభోజనాత్ ।
భుక్తమాత్రస్య చ స్వాప్నాద్ధన్త్యగ్నిం కుపితః కఫః॥౧౩॥

తస్యాన్నం పచ్యతే దుఃఖం హృల్లాసచ్ఛర్ద్యరోచకాః
ఆస్యోపదేహ మాధుర్యం కాసష్ఠీవనపీనసాః॥౧౪॥
హృదయం మన్యతే స్త్యానం ఉదరం స్తిమితం గురు।
దుష్టోమధుర ఉద్గారస్సదనం స్త్రీష్వహర్షణమ్॥౧౫॥
భిన్నామశ్లేష్మసంసృష్ట గురువర్చః ప్రవర్తనమ్।
అకృశస్యాపి దౌర్బల్యం ఆలస్యం చ కఫాత్మకే॥౧౬॥

తా॥ గురుత్వమును కల్గించు పదార్థములు మిగుల స్నిగ్ధంబులగు పదార్థములు మిక్కిలి శీతలకరంబులగు పదార్థములు మధురాదిపదార్థములు వీనినిభుజించుటచేతను, భోజనముచేసినతోడనే నిదురించుటచేతను, కఫము కుపితంబై జఠరాగ్నిని నశింపంజేయును; అట్టివ్యాధికల మనుజునకు భుజించినయాహారము మిగుల కష్టముచే పాకమునొందును. మఱియు నోట నీరు వెడలుట, వాంతి, అరుచి, నోరు జిగటగల్గి తీపుగనుండుట, దగ్గు, ఉమ్మియధికముగనుండుట, పడిశముపట్టుట, హృదయము ఘనద్రవపదార్థముచే నిండియున్నట్లు తోచుట, ఉదరము నిశ్చలంబై గొప్పదిగానుండుట, వికృతంబుగ త్రేనుపులు వచ్చుట, అగ్నిమాంద్యము, స్త్రీసంభోగమునం దిచ్ఛలేకుండుట, ఆమకఫములతో గూడి పలచనైన మలము పలుమారు వెడలుట, శరీరము కృశింపకున్నను మిక్కిలి బలహీనుండగుట, ప్రాలుమాలిక ఈలక్షణములన్నియు కల్గును. ఇవి కఫముచే జనించిన గ్రహణీరోగ లక్షణంబులని యెఱుంగునది.

## సన్నిపాతజగ్రహణీలక్షణము

శ్లో॥ పృథగ్వాతాదిభిర్దిష్ట హేతులింగసమాగమే।
త్రిదోషం నిర్దిశేదేవం తేషాం వక్ష్యామి భేషజమ్॥౧౭॥

తా॥ గ్రహణీరోగమునకు వాతాదిదోషములకు వేర్వేఱుగ జెప్పిన కారణంబులును చిహ్నంబులును ఒకటిగ జేరియున్నయెడ దానిని త్రిదోష సన్నిపాతముచే జనించిన గ్రహణియని యెఱుంగునది. అగ్నికి ఆధారంబైన గ్రహణి దుష్టంబగునపుడు దాని నాశ్రయించిన జఠరాగ్నికూడ దుష్టంబగును గాన అగ్నిమాంద్యము మున్నగు వ్యాధులు గ్రహణీభేదంబులని యెఱుంగునది. ఈశ్లోకమునందు నాల్గవపాదము శ్లోకపూరణార్థముగ చెప్పినదియని యెఱుంగునది.

## సంగ్రహగ్రహణీ ఘటీయంత్రగ్రహణీలక్షణములు

శ్లో॥ * * అంత్రకూజనమాలస్యం దౌర్బల్యం సదనం తథా।
ద్రవం శీతం ఘనం స్నిగ్ధం సకటీవేదనం శకృత్।
ఆమం బహు సపైచ్ఛిల్యం సశబ్దం మన్దవేదనమ్।

పక్వాన్నామసాద్రశాహోద్వా నిత్యం వా పృథముఞ్చతి।
దివా ప్రకోపోభవతి రాత్రౌ శాన్తిం వ్రజేచ్చ సా।
దుర్విజ్ఞేయా దుశ్చికిత్స్యా చిరకాలానుబన్ధినీ।
సా భవేదామవాతేన సంగ్రహగ్రహణీ మతా!
స్వపతః పార్శ్వయోశ్శూలం గలజ్జలఘటీధ్వనిః।
తం వదన్తి ఘటీయన్త్రం అసాధ్యం గ్రహణీగదమ్॥ * *

తా॥ ప్రేగులుకూయుట, ప్రాలుమాలిక, బలహీనము, అగ్నిమాన్ద్యము, ద్రవంబును శీతం బును ఘనంబును స్నిగ్ధంబునైన మలము నడుమునొప్పితోకూడి బైలువెడలుట, అపక్వంబును పిచ్ఛిలంబును సశబ్దంబును స్వల్పమైన వేదనకల్గినదియునైన మలము పక్షమున కొకసారియైనను మాసమున కొకసారియైనను పదినాళ్లకొకసారియైనను లేక ప్రతిదినమునందైనను వెడలుట, పగటియందు ప్రకోపమునొంది రాత్రియందు శాంతినొందుట, ఇట్టి లక్షణములుగల గ్రహణి సంగ్రహగ్రహణి యని చెప్పంబడును. ఈవ్యాధి ఆమవాతముచే జనించును. మరియు నీరోగము తెలిసికొనుట కసాధ్యంబును చికిత్సకు నసాధ్యంబును చిరకాలమువరకు అనుసరించియుండునదియునై యుండును. మరియు నిదురించునపుడు పార్శ్వములయందు నొప్పికల్గి నగమువరకు కదలుచున్న జలముకల కుండ వలె ధ్వనితోగూడి మలము వెడలుచున్నయెడ ఘటీయన్త్రంబను గ్రహణీరోగమని చెప్పంబడును. ఈవ్యాధి మిగుల నసాధ్యంబు. ఈ చెప్పంబడిన గ్రహణీభేదంబులు రెండును సన్నిపాతజాన్తర్గతంబులుగాన వేరుగ పరిగణనము జేయలేదని యెరుంగునది.

## అ సా ధ్య గ్ర హ ణీ ల క్ష ణ ము

శ్లో॥ దోషం సామం నిరామం చ విద్యాదత్రాతిసారవత్।
లిఙ్గైరసాధ్యోగ్రహణీవికారో
యైస్తైరతీసారగదోనసిధ్యేత్।
వృద్ధస్య నూనం గ్రహణీవికారో
హత్వా తనూం నైవ నివర్తతే చ॥౧౮॥

తా॥ దోషములయొక్క సామత్వనిరామత్వభేదములను అతిసారవ్యాధికి జెప్పినరీతిగ నిర్ణయించవలెను. ఏట్టిలక్షణములచే నతిసారవ్యాధి యసాధ్యంబగునో ఆ లక్షణములచేతనే గ్రహణీరోగం బసాధ్యంబని యెరుంగునది. అతిసారమునకు జెప్పిన యసాధ్యలక్షణములే గ్రహణీరోగమునకుగూడ గల్గును గాన అట్టిలక్షణములచేతనే గ్రహణి యసాధ్యంబని నిర్ణయించవలెనని భావము. మరియు వృద్ధునకు గ్రహణీవ్యాధి కల్గినయెడ శరీరమును కృశింపజేసి ప్రాణహానిజేయునుగాని నివర్తించుట లేదని యర్థము.

## మతాన్తరమునం దసాధ్యగ్రహణీలక్షణము

శ్లో॥ * * బాలకే గ్రహణీ సాధ్యా యూని కృచ్ఛ్రా సమీరితా।
వృద్ధే త్వసాధ్యా విజ్ఞేయా మతం ధన్వన్తరేరిదమ్॥ * *



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
గ్రహణీరోగనిదానం సమాప్తమ్



తా॥ బాలునకుంగల్గిన గ్రహణి సాధ్యంబనియు, యౌవనవంతునకు గల్గిన గ్రహణి కష్టసాధ్యంబనియు, వృద్ధునకుగల్గిన గ్రహణి యసాధ్యంబనియు ధన్వంతరి మతమని యర్థము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత ...గరం పుట్టస్వామిశాస్త్రి గారి
శారపిద్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్ర
విరాజమాన దివ్యజ్ఞానాయ రామకృష్ణశాస్త్రిగారిచే సకలజనహితము
...ము "ఆయుర్వేదమార్తాండ" "క...ర" "పండిత" సోపా
లాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానాన్వయతాత్పర్యమునందు
గ్రహణీరోగనిదానము
సమాప్తము.



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# అర్శోనిదానము



అతిసారగ్రహణ్యర్శస్సులు పరస్పర సంబద్ధము లగుటంజేసి అతిసారగ్రహణుల నిరూపించిన పిదప అర్శోనిదానమును వివరించుట.



శ్లో॥ పృథగ్దోషైస్సమస్తైశ్చ శోణితాత్సహజాని చ।
అర్శాంసి షట్ప్రకారాణి విద్యాద్గుదవళిత్రయే॥౧॥

తా॥ వాతపిత్తశ్లేష్మంబులచే వేర్వేరుగ జనించినది మూడువిధంబులును, త్రిదోషంబులచే నొకటియు, రక్తముచే జనించినది యొకటియు, సహజంబైనది యొకటియు, ఇవ్విధంబుగ నర్శోరోగములు గుదస్థానమునందలి వళుల మూడిటియందును ఆరువిధములుగ జనించునని యెరుంగునది.

ఇచ్చట ద్వంద్వజార్శస్సులు వాతాదిదోషములలో రెండేసి దోషములయొక్క హేతు లక్షణములు గల్గియుండునుగాన వేరుగ పరిగణనము చేయలేదని యెఱుంగునది. ఈయర్థము సుశ్రుతమునందు "అర్శస్సు దృశ్యతే రూపం యదా వై దోషయోర్ద్వయోః। సంసర్గం తం విజానీయాత్సంసర్గష్షడ్విధస్స్మృతః" అని యున్నది. అర్శోరోగమునందు వాతాదిదోషములలో రెండేసిదోషములయొక్క లక్షణములు కానంబడెనేని ఆయర్శస్సు సంసర్గజ మని యెఱుంగునది. మఱియు నా సంసర్గజము వాతపిత్తములనియు, వాతకఫజంబనియు, పిత్తకఫజ మనియు, వాతరక్తజమనియు, పిత్తరక్తజమనియు, కఫరక్తజమనియు, ఆరువిధంబులని భావము. మఱియు గుదము నాల్గున్నర అంగుళముల ప్రమాణము గల్గియుండుననియు, అట్టి గుదమునకు అవయవభూతంబులై ప్రవాహణీ విసర్జనీ సంవరణి యను పేరుగల మూడువళులు (ముడతలు) శంఖములో నుండురేఖల బోలి యుండుననియు సుశ్రుతమునందు సవిస్తరముగా నున్నది. అర్శస్సు అనగా "అరివత్ ప్రాణాన్ శృణాతీతి అర్శః" అను వ్యుత్పత్తిచేత శత్రువువలె ప్రాణములను హింసించునది యని యర్థము.

## అర్శస్స్వరూపసంప్రాప్తిలక్షణములు

శ్లో॥ దోషాస్త్వఙ్మాంసమేదాంసి సందూష్య వివిధాకృతీన్।
మాంసాఙ్కురానపానాదౌ కుర్వన్త్యర్శాంసితాన్జగుః॥౨॥

తా॥ వాతాదిదోషములు ప్రకుపితంబులై త్వక్ మాంస మేదస్సులను దుష్టములుగ జేసి నానావిధంబులైన ఆకారములుగల మాంసపు మొలకలను గుదము మొదలగు ప్రదేశములయందు కల్గించును; వానిని అర్శస్సులని వ్యవహరించెదరు.

## వాతార్శో నిదానము

శ్లో॥ కషాయకటుతిక్తాని రూక్షశీతలఘూని చ।
ప్రమితాల్పాశనం తీక్ష్ణం మద్యం మైథునసేవనమ్॥౩॥
లఙ్ఘనం దేశకాలౌ చ శీతౌ వ్యాయామకర్మ చ।
శోకో వాతాతపస్పర్శో హేతుర్వాతార్శసాం మతః॥౪॥

తా॥ కషాయ కటు తిక్తరసంబుల నధికముగ భుజించుట, రూక్షపదార్థములను శీతల పదార్థములను లఘుపదార్థములను భుజించుట, పరిమాణమునకు న్యూనాధికములుగ భుజించుట, తీక్ష్ణంబగు మద్యమును పానము చేయుట, స్త్రీసంభోగముజేయుట, ఉపవాసముచేయుట, శీతంబైన అనూపదేశమునందును హేమంతాదికాలమునందును సంచరించుట, దేహపరిశ్రమము జేయుట, అతిదుఃఖము, గాలియందును ఎండయందును సంచరించుట, ఇవి యన్నియు వాతార్శోరోగమునకు కారణములని భావము.

## పిత్తార్శో నిదానము

శ్లో॥ కట్వమ్లలవణోష్ణాని వ్యాయామాగ్న్యాతపప్రభాః।
దేశకాలావశిశిరౌ క్రోధోమద్యమసూయనమ్॥౫॥
విదాహి తీక్ష్ణ ముష్ణం చ సర్వం పానాన్నభేషజమ్।
పిత్తోల్బణానాం విజ్ఞేయః ప్రకోపే హేతురర్శసామ్॥౬॥

తా॥ కటు ఆమ్ల లవణ రసముల నధికముగ భుజించుట, ఉష్ణపదార్థముల భుజించుట, దేహ పరిశ్రమమును జేయుట, అగ్నియొక్కయు ఎండయొక్కయు కాంతిని సేవించుట, ఉష్ణంబైన చోటిప్రదేశములయందును, ఉష్ణంబైన శరత్కాలమునందును సంచరించుట, క్రోధము, మద్య పానము, అసూయ, సంతాపకరంబును తీక్ష్ణంబును ఉష్ణంబునైన పానాన్నద్రవ్యములను, అన్నమును, ఔషధమును సేవించుట, ఇవియన్నియు పిత్తప్రకోపముచేజనించిన అర్శస్సులకు ముఖ్యకారణములు.

## కఫజార్శో నిదానము

శ్లో॥ మధురస్నిగ్ధశీతాని లవణామ్లగురూణి చ।
అవ్యాయామో దివాస్వప్నః శయ్యాసనసుఖే రతిః॥౭॥
ప్రాగ్వాతసేవా శీతౌ చ దేశకాలావచిన్తనమ్।
శ్లైష్మికాణాం సముద్దిష్ట మేతత్కారణమర్శసామ్॥౮॥

తా॥ మధురపదార్థములను స్నిగ్ధపదార్థములను శీతలపదార్థములను లవణామ్లపదార్థములను గురుపదార్థములను భుజించుట, దేహపరిశ్రమము లేకుండుట, పగటియందు నిదురించుట, సుఖకరంబులైన శయనాసనములయం దిచ్ఛబొడముట, తూర్పుగాలిని సేవించుట, శీతలంబులైన దేశకాలములయందు సంచరించుట, చింతలేకుండుట, ఇవి యన్నియు కఫప్రకోపముచే గల్గు అర్శోరోగములకు కారణంబులని యెరుంగునది.

## ద్వంద్వజ సన్నిపాతజార్శోనిదానములు

శ్లో॥ హేతులక్షణసంసర్గా ద్విద్యాద్ద్వంద్వోల్బణానిచ।
సర్వో హేతుస్త్రిదోషాణాం సహజై ర్లక్షణం సమమ్॥౯॥

తా॥ ద్వంద్వములచే జనించిన అర్శోరోగములను వాతాదిదోషద్వయ లక్షణము లొకటిగ కలసియుండుటచే నెఱుంగునది. సన్నిపాతార్శోరోగమును వాతాదులకు వేర్వేరుగ జెప్పిన లక్షణము లన్నియు నొకటిగ కలసియుండుటచే నెఱుంగునది. సహజంబైన యర్శోరోగమునకును సన్నిపాతజ అర్శోరోగమునకును లక్షణములు సమంబులై యుండును.

మఱియు సహజార్శోలక్షణము సుశ్రుతమునం దీరీతిగ నున్నది: "దుర్దర్శనాని పరుషాణి పాణ్డూని దారుణా న్యన్తర్ముఖాని తైరుపద్రుతః కృశోఽల్పభుక్ సిరాసన్తతగాత్రోఽల్పప్రజః క్షీణరేతాః క్షామస్వరః క్రోధనోఽల్పాగ్నిః ఘ్రాణశిరోఽక్షిశ్రవణరోగవాన్ సతతమన్త్రకూజనాటోప హృదయోపలేపారోచకప్రభృతిభిః పీడ్యతే" సహజార్శోరోగము కలవానికి గుదాంకురములు చూచుట కసాధ్యంబులును, పరుషంబులును, అరుణపాండువర్ణంబులును, దారుణంబులును, అన్తర్ముఖంబులునై యుండును. వానిచే పీడితుండగు మనుజుండు కృశించినశరీరముకలవాడును, స్వల్పముగ భుజించువాడును, సిరలచే నావృతంబైన దేహముకలవాడును, అల్పసంతానము కలవాడును, క్షీణంబైనరేతస్సుకలవాడును, బిగిచెడిన కంఠస్వరము కలవాడును, మిక్కిలి కోపస్వభావముకలవాడును, మందంబైన జఠరాగ్నికలవాడును, నాసిక శిరస్సు నేత్రములు శ్రోత్రములు వీనియందు రోగముకలవాడును, ఎల్లప్పుడును ప్రేవులు కూయుట, కడుపుబ్బరము, రొమ్ముబరువుగానుండుట, అరుచి ఇవి మొదలగు నుపద్రవములచే పీడితుండు నగునని యర్థము.

## వాతార్శోలక్షణములు

శ్లో॥ గుదాఙ్కురా బహ్వనిలాశ్శుష్కాశ్చిమచిమాన్వితాః।
మ్లానాశ్శ్యావారుణా స్స్తబ్ధా విశదాః పరుషాః ఖరాః॥౧౦॥
మిథోవిసదృశా వక్రా స్తీక్ష్ణావిస్ఫుటితాననాః।
బిమ్బీ ఖర్జూర కర్కన్ధూ కార్పాసీ ఫలసన్నిభాః॥౧౧॥
కేచిత్కదమ్బపుష్పాభాః కేచిత్సిద్ధార్థకోపమాః।
శిరఃపార్శ్వాంసకట్యూరువంక్షణాద్యధికవ్యథాః॥౧౨॥

క్షవథూద్గారవిష్టమ్భహృద్గ్రహారోచకప్రదాః।
కాసశ్వాసాగ్నివైషమ్యకర్ణనాదభ్రమావహాః॥౧౩॥
తైరార్తో గ్రథితంస్తోకం సశబ్దం సప్రవాహికమ్।
రుక్ఫేనపిచ్ఛానుగతం విబద్ధముపవేశ్యతే॥౧౪॥
కృష్ణత్వఙ్నఖవిణ్మూత్రనేత్రవక్త్రశ్చ జాయతే।
గుల్మప్లీహోదరాష్ఠీలాసంభవస్తత ఏవ చ॥౧౫॥

తా॥ వాతప్రకోపముచే జనించిన గుదస్థానమునందలి మాంసపుమొలకలు ద్రవములేక శుష్కంబులును, చిమచిమలాడుచుండునవియు, వాడినవియు, శ్యావారుణవర్ణంబులుగలిగినవియు, మేకుల వలె స్తంభించియుండునవియు, విశదంబులును, ఆవునాలుకవలె గరగరలాడుచుండునవియు, కఠినంబులును, ఒకదానివలె నింకొకటియుండక భిన్నరూపములు కల్గినవియు, వక్రంబులును, తీక్ష్ణంబులును, కొనలయందు పగిలినవియు, దొండపండు ఖర్జూరము రేగుపండు ప్రత్తికాయ వీని కనురూపమైన యాకారము కల్గినవియునై యుండును; వానిలో కొన్ని కడిమిపువ్వులబోలియు, కొన్ని ఆవగింజలవలె సూక్ష్మంబులైన యాకారముకల్గినవియునై యుండును. శిరస్సు ఇరుప్రక్కలు భుజశిరస్సులు నడుము తొడలు గజ్జలు ఇవి మున్నగు అవయవములయందు అధికమైన నొప్పి, తుమ్ములు, త్రేనుపులు, మలబద్ధకము, రొమ్ము పట్టినట్లు వేదనకల్గుట, అరుచి, శ్వాసకాసములు, జఠరాగ్ని విషమంబై యొకప్పుడు తీక్ష్ణాగ్నియు మఱియొకప్పుడు మందాగ్నియునై యుండుట, కర్ణములయందు ధ్వని, భ్రమము, ఆసనమునందు గుడగుడ యను శబ్దముతోగూడి కఠినంబై బాధతోగూడి పిచ్ఛిలంబైనమలమును బలాత్కారముగ వెడలించుట, చర్మము గోళ్లు మలమూత్రములు నేత్రములు ముఖము ఇవి యన్నియు నల్లనిరంగుగల్గి యుండుట, ఈ లక్షణములన్నియు వాతముచే జనించిన యర్శోరోగమునందు కల్గును. మఱియు నా వ్యాధిచేత గుల్మము ప్లీహము ఉదరము అష్ఠీల యను వాతరోగము ఈ యుపద్రవములు కల్గును.

## పిత్తార్శోలక్షణము

శ్లో॥ పిత్తోత్తరా నీలముఖా రక్తపీతాసితప్రభాః।
తన్వస్రస్రావిణో విస్రాస్తనవో మృదవశ్శ్లథాః॥౧౬॥
శుకజిహ్వా యకృత్ఖణ్డ జలౌకో వక్త్రసన్నిభాః।
దాహపాకజ్వరస్వేదతృణ్మూర్ఛారుచిమోహదాః॥౧౭॥
సోష్మాణో ద్రవనీలోష్ణపీతరక్తామవర్చసః।
యవమధ్యా హరిత్పీతహారిద్రత్వఙ్నఖాదయః॥౧౮॥

తా॥ పిత్తార్శోరోగమునందు గుదాఙ్కురములు నల్లనికొనలుగల్గినవియు, రక్తవర్ణంబైనను పీతవర్ణంబైనను కృష్ణవర్ణంబైనను కల్గినవియు, సూక్ష్మముగ రక్తమును స్రవించునవియు, దుర్గంధయుక్తంబులును, సూక్ష్మాకారంబులును, కోమలంబులును, సడలి వ్రేలుచున్నయవియు, చిలుక

నాలుక యక్కృత్తను మాంసఖండము జలగముఖము వీనికి సమమైన యాకారము కల్గినవియునై యుండును. మరియు నీవ్యాధియందు తాపము, గుదస్థానమున పుండగుట, జ్వరము, చెమట, దప్పి, మూర్ఛ, అరుచి, మోహము ఈ యుపద్రవములు కల్గును. వేడిగనుండి ద్రవరహితంబై నీలవర్ణంబును ఉష్ణంబును పచ్చనిరంగుకల్గినదియు లేక ఎఱ్ఱనిరంగుకల్గినదియు ఆమముతోఁగూడినదియునైన మలములు వెడలును. అట్టి గుదాంకురములు యవలవలె మధ్యభాగంబున స్థూలంబులై యుండును. మలము మూత్రము నేత్రములు ముఖము చర్మము ఇవియన్నియు పచ్చనిరంగైనను పసపువర్ణంబైనను కల్గి యుండును. పైన చెప్పిన లక్షణములచే పిత్తార్శోరోగమును కనుగొనవలెనని భావము.

## క ఫ జా ర్శో రో గ ల క్ష ణ ము లు

శ్లో॥ శ్లేష్మోల్బణా మహామూలా ఘనా మన్దరుజస్సితాః।
ఉత్సన్నోపచితస్నిగ్ధస్తబ్ధవృత్తగురుస్థిరాః॥౧౯॥
పిచ్ఛిలాస్తిమితాశ్ల్క్ష్ణాః కణ్డ్వాఢ్యాస్స్పర్శనప్రియాః।
కరీరపనసాస్థ్యాభాః తథా గోస్తనసన్నిభాః॥౨౦॥
వఙ్క్షణానాహినః పాయువస్తినాభివికర్షిణః।
సశ్వాసకాసహృల్లాస ప్రసేకారుచిపీనసాః॥౨౧॥
మేహకృచ్ఛ్రశిరోజాడ్యశిశిరజ్వరకారిణః।
క్లైబ్యాగ్నిమాన్ద్యచ్ఛర్ది రామప్రాయవికారదాః॥౨౨॥
వసాభ సకఫ ప్రాజ్య పురీషాస్స్రప్రవాహికాః।
న స్రవన్తి న భిద్యన్తే పాణ్డుస్నిగ్ధత్వగాదయః॥౨౩॥

తా॥ శ్లేష్మప్రకోపముచే జనించిన గుదాఙ్కురములు మిగుల లోతుగ వ్యాపించిన వ్రేళ్లు కల్గినవియు, దట్టముగ నిండియుండునవియు, స్వల్పమైన బాధకల్గినవియు, తెల్ల నిరంగు కల్గినవియు, మిగుల పొడవుగల్గినవియు, స్థూలంబులును, స్నిగ్ధంబులును, వంగియుండక నిలచియుండునవియు, వర్తులాకారంబులును, గుదస్థానమున భారముగ నుండునవియు, చలించకుండునవియు, జిగటకల్గి నవియు, స్తిమితంబులును, మణులవలె నిగనిగలాడుచుండునవియు, అధికమైన దురద కల్గినవియు, కరముచే స్పృశించిన సుఖకరంబులును, వెదురుమోవు పనసవిత్తులు ద్రాక్షపండు వీనికి సమమైన యాకారముకల్గినవియునై యుండును. మరియు నావ్యాధియందు గజ్జలలో నుబ్బరించియుండుట, గుదవస్తినాభిస్థానములయందు ఈడ్చిపట్టినట్లుండుట, శ్వాసకాసములు, రొమ్మదరుట, నోట నీరు వెడలుట, అరుచి, పడిశము, మేహము, మూత్రకృచ్ఛ్రము, శిరోభారము, చలి జ్వరము, నపుంసకత్వము, అగ్ని మాన్ద్యము, వాంతి, ఆమాధిక్యమువలన కలుగు అతిసారము మొదలగు రోగములు కల్గును. మఱియు క్రొవ్వునకు సమమైన కఫముతోఁగూడిన మలము అధికముగా వెడలును. మున్ను వచించిన ప్రవాహికంబను వ్యాధి జనించును. గుదాఙ్కురములు పగలక రక్తాదులను స్రవించకుండును, మలమూత్ర నేత్ర త్వక్ నఖ ముఖములు పాండువర్ణంబులును స్నిగ్ధంబులునై యుండును.

## సన్నిపాతజార్శోలక్షణము

శ్లో॥ సర్వైస్సర్వాత్మకాన్యాహుర్లక్షణైస్సహజాని చ।

తా॥ త్రిదోషములచే జనించిన అర్శోరోగమును వాతాదులకు వేర్వేరుగ జెప్పిన లక్షణము లన్నింటిచే నెరుంగునది.

## రక్తార్శోలక్షణము

శ్లో॥ రక్తోల్బణా గుదే కీలాః పిత్తాకృతిసమన్వితాః॥ ౨౪॥
వటప్రరోహసదృశాః గుఞ్జావిద్రుమసన్నిభాః।
తేఽత్యర్థం దుష్టముష్ణం చ గాఢవిట్కప్రపీడితాః॥ ౨౫॥
స్రవన్తి సహసా రక్తం తస్య చాతిప్రవృత్తితః।
భేకాభః పీడ్యతే దుఃఖైః శోణితక్షయసమ్భవైః॥ ౨౬॥
హీనవర్ణబలోత్సాహో హతౌజాః కలుషేన్ద్రియః।
విట్శ్యావం కఠినం రూక్షం అధోవాయుర్న వర్తతే॥ ౨౭॥

తా॥ రక్తప్రకోపముచే జనించిన గుదాంకురములు పైత్తికార్శోలక్షణములు గల్గినవియు, మఱ్ఱిచిగుళ్లు గురిగింజలు పవడములు వీనితో సమానమైన రంగుకల్గినవియునై యుండును. మఱియు నా గుదాంకురములు కఠినంబైన పురీషముచే పీడింపబడి మిగుల దుష్టంబును ఉష్ణంబునైన రక్తమును అధికముగ స్రవించును. ఇవ్విధంబుగ రక్తము అధికముగ స్రవించుటచేత మనుజుండు వర్షాకాలము నందు కప్పశరీర ముండువిధంబుగ పచ్చనిశరీరముకలవాడై శరీరకాంతియు బలంబును ఉత్సాహంబును దక్కి సోమాత్మకంబును ప్రాణములకు ముఖ్యాధారంబునైన యోజస్సు చెడి వ్యాకులంబులైన సర్వేన్ద్రియములు కలవాడునై రక్తక్షయముచే గల్గు త్వక్పారుష్యము మున్నగు క్రూరరోగములచే పీడితుండై శ్యామలవర్ణంబును కఠినంబునైన మలమును విసర్జించుచు అపానవాతము వెలువెడలక మిగుల కష్టమునొందును.

## వాతాద్యనుబంధముచే జనించిన రక్తార్శోలక్షణము

శ్లో॥ తను చారుణవర్ణంచ ఫేనిలం చాసృగర్శసామ్।
కట్యూరుగుదశూలం చ దౌర్బల్యం యది చాధికమ్॥ ౨౮॥
తత్రానుబన్ధో వాతస్య హేతుర్యది చ రూక్షణమ్।
శిథిలం శ్వేతపీతం చ విట్స్నిగ్ధం గురు శీతలమ్॥ ౨౯॥
యద్యర్శసాం ఘనం చాసృక్తన్తుమత్పాణ్డు పిచ్ఛిలమ్।
గుదం సపిచ్ఛం స్తిమితం గురు స్నిగ్ధం చ కారణమ్॥ 3౦॥
శ్లేష్మానుబన్ధో విజ్ఞేయస్తత్ర రక్తార్శసాం బుధైః।

తా॥ రక్తము మిగుల స్వల్పమై అరుణవర్ణంబును నురుగుతో గూడినదియునై కటిస్థలము తొడలు గుదము ఈ స్థలములయందు బాధకల్గి బలహీనం బధికముగా నున్నయెడ వాతయుక్తంబైన రక్తార్శోరోగమని యెరుంగునది. శిథిలంబును శ్వేతవర్ణంబును పీతవర్ణంబును స్నిగ్ధంబును మిగుల భారంబును శీతలంబునైన మలము పైలువెడలి రక్తము మిగుల దట్టంబై త్రాడువలెనుండి పాండువర్ణంబును పిచ్ఛిలంబునై యుండినను గుదము జిగటగల్గి స్తిమితంబును భారముగను స్నిగ్ధంబునై యున్నయెడ శ్లేష్మముతోగూడిన రక్తార్శోరోగమని పండితులచే దెలియందగినది. ఇచ్చట పిత్తరక్తములు సమానలక్షణంబులు గాన పిత్తసంబంధ రక్తార్శోరోగమును వేరుగ జెప్పలేదని యెరుంగునది.

## అర్శోరోగ పూర్వరూపములు

శ్లో॥ విష్టమ్భోఽన్నస్య దౌర్బల్యం కుక్షే రాటోప ఏవ చ॥3౧॥
కార్శ్యముద్గార బాహుల్యం సక్థిసాదోఽల్పవిట్కతా।
గ్రహణీదోష పాణ్డ్వర్తేరాశంకా చోదరస్యచ॥3౨॥
పూర్వరూపాణి నిర్దిష్టాన్యర్శసా మభివృద్ధయే।

తా॥ భుజించినయన్నము వాతముచే నిరుద్ధంబై యామాశయమున నిలచి యుండుట, శరీరము మిగుల దుర్బలంబై యుండుట, కుక్షియందు గుడగుడ యను శబ్దము బుట్టుట, శరీరము కృశంబగుట, అధికముగా త్రేపులు వచ్చుట, తొడలు నొచ్చుట, స్వల్పముగ మలము వెడలుట, గ్రహణీ పాండురోగములు గల్గినట్లుండుట, ఉదరవ్యాధిజనించినట్లుండుట, ఈ లక్షణములన్నియు అర్శోరోగములు జనించుటకు పూర్వరూపములు.

## అర్శోరోగమున సర్వదేహమునందు సంతాపాదులు గల్గుకారణములు

శ్లో॥ పఞ్చాత్మా మారుతః పిత్తం కఫో గుదవలీత్రయమ్॥33॥
సర్వ ఏవ ప్రకుప్యన్తి గుదజానాం సముద్భవే।
తస్మాదర్శాంసి దుఃఖాని బహువ్యాధికరాణి చ॥3౪॥
సర్వదేహోపతాపీని ప్రాయః కృచ్ఛ్రతమానిచ।

తా॥ ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానంబులును నైదుభేదములుగల వాతంబును, ఆలోచక రంజక సాధక పాచక భ్రాజకంబులను నైదుభేదములు కల పిత్తంబును, అవలంబక క్లేదక బోధక తర్పక శ్లేషకంబు లను నైదుభేదములు కల కఫంబును, గుదస్థానమునందలి వళీత్రయంబును, ఇవియన్నియు గుదస్థానము నాశ్రయించిన అర్శస్సు మొదలగు వ్యాధులు పుట్టునపుడు ప్రకోపము నొందును గాన అర్శస్సులు మిగుల దుఃఖకరంబులును, అనేక వ్యాధుల గల్గించునవియు, సర్వదేహమును తపింపజేయునవియు, తరుచుగ కృచ్ఛ్రసాధ్యంబులు నగును. పైనజెప్పినరీతిగ వేర్వేరుగ పంచాత్మకంబులగు వాతపిత్తశ్లేష్మములు హృదయాదిస్థానములయందెల్ల వ్యాపించుటంజేసి అర్శస్సు మున్నగు వ్యాధులు కేవలము గుదస్థానమున జనించినను సర్వదేహమునందు సంతాపాదులు కల్గునని భావము,

పంచాత్మకంబులైన వాతాదులకు స్థానములు వేర్వేరుగ గ్రన్థాన్తరమున నీరీతిగ నున్నయవి: "ప్రాణాదిభేదాత్పఞ్చాత్మా వాయుః ప్రాణోఽత్ర మూర్ధగః। ఉరఃకణ్ఠచరో బుద్ధిహృదయేన్ద్రియచిత్తధృక్ । ష్ఠీవనక్షవథూద్గారనిశ్వాసాన్నప్రవేశకృత్ । ఉరః స్థానముదానస్య నాసానాభిగళాంశ్చరేత్ । వాక్ప్రవృత్తి ప్రయత్నోర్జాబలవర్ణస్మృతిక్రియః । వ్యానో హృది స్థితః కృత్స్నదేహచారీ మహాజవః । గత్యపక్షేపణోత్క్షేపనిమేషోన్మేషణాదికాః । ప్రాయః సర్వాః క్రియాస్తస్మిన్ ప్రతిబద్ధాశ్శరీరిణామ్ । సమానోఽగ్నిసమీపస్థః కోష్ఠే చరతి సర్వతః। అన్నం గృహ్ణాతి పచతి వివేచయతి ముఞ్చతి । అపానోఽపానగః శ్రోణిబస్తిమేఢ్రోరుగోచరః । శుక్రార్తవశకృన్మూత్రగర్భనిష్క్రమణక్రియః॥" అని వాతమునకు స్థానములు కొనంబడియెడు. ప్రాణాది నామభేదములచే నైదువిధములైన వాతములలో ప్రాణవాయువు శిరంబున నియతముగ నుండి హృదయమునందును కంఠమునందును వ్యాపించి బుద్ధిని హృదయమును ఇన్ద్రియములను చిత్తమును ధరించుచు, ఉమియుట, తుమ్ముట, త్రేపుట, నిట్టూర్పును విడచుట, అన్నమును లోనికి ప్రవేశింపజేయుట మొదలగు కృత్యములు జేయుచుండుననియు; ఉదానవాతము రొమ్మునందుండి నాసికానాభికంఠములయందు సంచరించుచు, మాటలాడుట, ప్రయత్నము, ఉత్సాహము, బలము, వర్ణము ననుభవించినదానిని స్మరించుట మున్నగు కృత్యముల జేయుననియు; వ్యానవాతము హృదయమునందుండి దేహమునందెల్ల వ్యాపించుచు తక్కిన ప్రాణాది వాతములకంటె అధికమైన వేగముగల్గి, అంగములను అధోభాగమున జూచుట, కనురెప్పల విప్పుట, ఇవి మొదలగు క్రియల నన్నింటిని జేయుచుండుననియు; సమానవాతము పాచకాగ్నికి సమీపమునందుండు కోష్ఠమునందంతట సంచరించుచు అన్నమును గ్రహించుచు ఆయన్నమును ఆమపక్వాశయమునం జేర్చి పచనము నొందించుట, ఉంటగనుండు అన్నమును సారకిట్టములుగ విభజించుట, మలమును అధోభాగమున జేర్చుట మొదలగు కృత్యములజేయుననియు; అపానంబను వాతము అపానస్థానమునందుండి పిరుదులు వస్తి శిశ్నము తొడలు ఈస్థలములయందు సంచరించుచు రేతస్సు, ఆర్తవము, మలమూత్రములు, గర్భము వీనిని వెలుపట వెడలించుననియు భావము.

"పిత్తం పఞ్చాత్మకం తత్ర పక్వామాశయమధ్యగమ్ । పఞ్చభూతాత్మకత్వేఽపి యత్తైజసగుణోదయాత్ । త్యక్తద్రవత్వం పాకాదికర్మణాఽనలశబ్దితమ్ । పచత్యన్నం విభజతే సారకిట్టౌ పృథక్తథా । తత్రస్థమేవ పిత్తానాం శేషాణామప్యనుగ్రహమ్ । కరోతి బలదానేన పాచకం నామ తత్స్మృతమ్ । ఆమాశయాశ్రయం పిత్తం రఞ్జకం రసరఞ్జనాత్ । బుద్ధిమేధాభిమానాద్యైరభిప్రేతార్థసాధనాత్ । సాధకం హృద్గతం పిత్తం రూపాలోచనతస్స్మృతమ్ । దృక్స్థమాలోచకం త్వక్స్థం భ్రాజకం భ్రాజనాత్త్వచః॥"

[illegible]పిత్తమునకు స్థానములు గానంబడియెడు. ఐదువిధములైన పిత్తములలో పాచకపిత్తము పక్వామాశయములకు నడుమనుండి పంచభూతాత్మకంబైనను తేజోగుణం బధికముగ నుండుటచే ద్రవరూపమునువదిలి కఠినంబై వాతాదులతో జేరి పాకాదిక్రియలజేయుటంజేసి పాచకపిత్తమనంబడును. ఆహ్యాది అన్నమును పచింపజేసి సారమును మలమును వేరుపరచుచు నచ్చోటనేయుండి తక్కిన రంజకాదిపిత్తములకు బలమును కల్గించుచుండుననియు; రసధాతువునకు రాగమును గల్గించుటచే రంజకం బను పిత్తము ఆమాశయముననుండుననియు; బుద్ధి మేధ అభిమానము మొదలగువానిచే తా గోరుచున్న కార్యములను సాధించుటచే సాధకంబనందగు పిత్తము హృదయముననుండుననియు, రూపాదులను గ్రహించుటచే నాలోచకమనంబడు పిత్తము నేత్రములయందలి నల్లగ్రుడ్డు లోపల నుండుననియు; శరీరమున కాంతిని కల్గించుటచే భ్రాజకంబనిచెప్పందగు పిత్తము త్వక్కున నుండుననియు భావము.

"శ్లేష్మా చ పంచధోరస్థశ్శ్లేష్మకాది స్వకర్మణా । కఫధామ్నాం చ సర్వేషాం యత్కరోత్యవలమ్బనం । అతోఽవలమ్బకశ్లేష్మా యస్త్వామాశయ సంశ్రితః । క్లేదకస్సోఽన్నసంఘాతక్లేదనాద్రసబోధనాత్ । బోధకో రసనా స్థస్తు శిరస్సంస్థోఽక్షతర్పణాత్ । తర్పకశ్శ్లేషకస్సన్ధిశ్లేషణాత్సన్ధిషు స్థితః॥"

అని శ్లేష్మమునకు స్థానములు గానంబడియెడు. ఉరస్థానమునందుండి ఆయా కఫస్థానముల కన్నిటికిని అవలంబనమును కల్గించుటచే నవలంబకమనియు, ఆమాశయము నాశ్రయించి భుజింపబడిన యాహారమును ద్రవీభూతంబుగ జేయుటచే క్లేదకంబనియు, రసనేన్ద్రియము నాశ్రయించి మధురాదిరసముల దెల్పుటచే బోధకంబనియు, శిరంబుననుండి ఇంద్రియములకు తృప్తిని కల్గించుటచే తర్పకంబనియు, అవయవసంధులనుండి అవయవముల నొకటిగ జేర్చుటచే శ్లేషకంబనియు కఫం బైదువిధంబులగునని భావము. ఇవ్విధంబుగ దోషత్రయములు సర్వశరీరమునవ్యాపించియుండుటం జేసి సకలవ్యాధులయందును శరీరమునందెల్ల సంతాపాదులు జనించునని ముఖ్యతాత్పర్యము.

## సుఖసాధ్యార్శోలక్షణము

శ్లో॥ బాహ్యాయాంతు వలౌ జాతా న్యేకదోషోల్బణాని చ॥ ౩౫॥
అర్శాంసి సుఖసాధ్యాని నచిరోత్పతితాని చ ।

తా॥ గుదస్థానముననుండు మూడువళులలో వెలిప్రక్కనుండు ముడతయందు జనించిన అర్శోరోగంబులును, వాతాదులలో నొకదోషముచే జనించిన యర్శస్సులును, స్వల్పకాలమునకు మున్ను జనించిన యర్శోరోగంబులును సుఖసాధ్యంబులు.

## కృచ్ఛ్రసాధ్యార్శోలక్షణము

శ్లో॥ ద్వంద్వజాని ద్వితీయాయాం వలౌ యాన్యాశ్రితానిచ॥ ౩౬॥
కృచ్ఛ్రసాధ్యాని తాన్యాహుః పరిసంవత్సరాణి చ।

తా॥ దోషద్వయప్రకోపముచే జనించిన అర్శోరోగంబులును, రెండవముడతలో జనించిన యర్శస్సులును, సంవత్సరకాలమునకుమున్ను జనించిన అర్శోరోగంబులును కృచ్ఛ్రసాధ్యంబులని భావము.



## అసాధ్యార్శోలక్షణము

శ్లో॥ సహజాని త్రిదోషాణి యాని చాభ్యన్తరాం వలిమ్॥౩౭॥
జాయన్తేఽర్శాంసి సంశ్రిత్య తాన్యసాధ్యాని నిర్దిశేత్ ।

తా॥ పుట్టుకతోగూడ జనించిన యర్శస్సులును, త్రిదోషములచే జనించిన యర్శస్సులును, లోపలనుండు మూడవ వలియందుండు అర్శస్సులును, అసాధ్యంబులని భావము. ఇచ్చట బాహ్య వలియందు దోషద్వయసంసర్గముచే జనించిన యర్శస్సులు కృచ్ఛ్రసాధ్యంబులనియు, త్రిదోషములచే జనించిన యర్శస్సులు యాప్యంబులనియు, ద్వితీయవలియందు ఏకదోషముచే జనించిన యర్శస్సులు కృచ్ఛ్రసాధ్యంబులనియు, దోషద్వయముచే జనించిన యర్శస్సులు యాప్యంబులనియు, త్రిదోషములచే జనించినవి యసాధ్యంబులనియు, తృతీయవలియందు ఏకదోషముచే జనించిన యర్శస్సులు యాప్యంబులనియు, ద్విదోషత్రిదోషములచే జనించినవి యసాధ్యంబులనియు, దోషములయొక్క బలాబలముచే నెఱుంగునది.

## యాప్యార్శోవ్యాధిలక్షణము

శ్లో॥ శేషత్వాదాయుషస్తాని చతుష్పాదసమన్వితే॥౩౮॥
యాప్యన్తే దీప్తకాయాగ్నేః ప్రత్యాఖ్యేయాన్యతోఽన్యథా॥

తా॥ దీప్తాగ్ని కల రోగి వైద్యుడు ఔషధములు పరిచారకులు ఈ ఉపకరణములను గల్గియున్న యెడ మున్ను జెప్పిన యసాధ్యార్శస్సులు ఆయుశ్శేషముండునంతవరకు యాప్యంబులై యుండును. రోగి మందాగ్నియై వైద్యాదిచతుష్టయము లేకున్నయెడ మరణము నొందించును గాన అట్టి రోగికి చికిత్స చేయుంజనదని భావము. అసాధ్యత్వము యాప్యంబనియు ప్రత్యాఖ్యేయంబనియు రెండు విధంబులు; అందు ఆయుశ్శేషముండి వైద్యాదిచతుష్టయం బున్నయెడ యాప్యంబనియు, ఆయుశ్శేషంబును వైద్యాది చతుష్టయంబును లేనియెడ ప్రత్యాఖ్యేయం (చికిత్సచేయక విడువందగినది) బనియు నెఱుంగునది.

## ఉపద్రవవిశేషములచే నర్శోవ్యాధికి అసాధ్యత్వము

శ్లో॥ హస్తే పాదే ముఖే నాభ్యాం గుదే వృషణయోస్తథా॥౩౯॥
శోథో హృత్పార్శ్వశూలం చ యస్యాఽసాధ్యోఽర్శసో హి సః।

తా॥ హస్తములు పాదములు ముఖము నాభి గుదము వృషణములు ఈ స్థానములయందు శోథకల్గినను, హృదయమునందును పార్శ్వములయందును శూలకల్గినను ఆ యర్శోవ్యాధి యసాధ్యం బగును.

శ్లో॥ హృత్పార్శ్వశూలం సమ్మోహః ఛర్దిరంగస్య రుగ్జ్వరః॥౪౦॥
తృష్ణా గుదస్య పాకశ్చ నిహన్యుర్గుదజాతురమ్।
తృష్ణాఽరోచకశూలార్తం అతిప్రస్రుతశోణితమ్॥౪౧।
శోథాతిసారసంయుక్తం అర్శాంసి క్షపయన్తి హి।

తా॥ హృదయమునందును పార్శ్వములయందును శూల, మూర్ఛ, వమనము, అవయవముల యందు నొప్పి, జ్వరము, దప్పి, గుదమున పుండగుట, ఈ యుపద్రవములు కల్గినయెడ రోగిని అర్శో

వ్యాధి మరణము నొందించును. మరియు దప్పి, అరుచి, శూల, ఈ యుపద్రవములు కలిగినను రక్తంబధికముగ స్రవించినను శోఫంబును అతిసారంబును కలిగినను, అర్శోరోగము మరణము నొందించును.

## మేఢ్రాదిగతార్శోలక్షణములు

శ్లో॥ మేఢ్రాదిష్వపి వక్ష్యన్తే యథాస్వం నాభిజాని చ॥౨౨॥
గణ్డూపదాస్యరూపాణి పిచ్ఛిలాని మృదూని చ।

తా॥ మేఢ్ర భగ నాసికా కర్ణములయందు జనించు అర్శస్సులును నాభిస్థానమున జనించిన అర్శస్సులును ఎఱ్ఱల ముఖమువంటి యాకారముకల్గి పిచ్ఛిలంబులును మృదులంబులు నై యుండును. ఆ యర్శస్సులను ఆ యా స్థానవిశేషములనుబట్టి నాసికార్శస్సు కర్ణార్శస్సు మొదలగు నామభేదములచే వ్యవహరింపబడునని భావము.

## చర్మకీలలక్షణము

శ్లో॥ వ్యానో గృహీత్వా శ్లేష్మాణం కరోత్యర్శస్త్వచో బహిః॥౨౩॥
కీలోపమం స్థిరఖరం చర్మకీలం తు తద్విదుః।
వాతేన తోదపారుష్యం పిత్తాదసితవక్త్రతా॥౨౪॥
శ్లేష్మణా స్నిగ్ధతా తస్య గ్రథితత్వం సవర్ణతా।

ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
అర్శోరోగనిదానం సమాప్తమ్

తా॥ సర్వశరీరవ్యాపియగు వ్యానవాతము శ్లేష్మమును గ్రహించి చర్మమునకుబైట చీలవలె కఠినంబులును కర్కశంబులు నైన అర్శస్సులను కల్గించును. అవి చర్మకీలములని వ్యవహరించబడును. అట్టి చర్మకీలములు వాతముచే జనించినయెడ పోటుకల్గి పరుషంబులై యుండును. పిత్తముచే గల్గినయెడ కొనలయందు నల్లగనుండును. శ్లేష్మముచే, జనించినయెడ స్నిగ్ధంబులై గ్రంథితుల్యంబులై శరీరమునకు సమమైన రంగు కల్గి యుండును.

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్ర
విరాజమాన దివ్యన్వాయ రామకృష్ణార్యతనూభవ సకలహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానార్థతాత్పర్యమునందు
అర్శోరోగనిదానము
సమాప్తము.

శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# అగ్నిమాన్ద్యాజీర్ణ విసూచికాలసక విలంబికా నిదానమ్

అన్నరోగముచేత అగ్నిమాన్ద్యము మున్నగు వ్యాధులు జనించునుగాన అన్నరోగ లక్షణము జెప్పినపిదప అగ్నిమాన్ద్యాజీర్ణ విసూచికాలసక విలంబికా నిదానములను చెప్పుట.

### మందతీక్ష్ణాద్యగ్నిభేదములు.

శ్లో॥ మన్దస్తీక్ష్ణోఽథ విషమః సమశ్చేతి చతుర్విధః।
కఫపిత్తానిలాధిక్యాత్తత్సామ్యాజ్జాఠరోఽనలః॥౧॥

తా॥ జఠరమునందలి యగ్ని కఫాధిక్యముచే మందాగ్ని యనియు, పిత్తాధిక్యముచే తీక్ష్ణాగ్ని యనియు, వాతాధిక్యముచే విషమాగ్ని యనియు. దోషత్రయము సమస్థితిగ నుండుటచే సమాగ్ని యనియు నాలుగువిధంబులగును.

### మందతీక్ష్ణాద్యగ్నిలక్షణములు.

శ్లో॥ విషమో వాతజాన్ రోగాన్ తీక్ష్ణః పిత్తనిమిత్తజాన్।
కరోత్యగ్నిస్తథా మన్దో వికారాన్ కఫసమ్భవాన్॥౨॥
సమా సమాగ్నేరశితా మాత్రా సమ్యగ్విపచ్యతే।
స్వల్పాఽపి నైవ మన్దాగ్నేర్విషమాగ్నేస్తు దేహినః॥౩॥
కదాచిత్పచ్యతే సమ్యక్కదాచిచ్చ న పచ్యతే।
మాత్రాతిమాత్రాప్యశితా సుఖం యస్య విపచ్యతే॥౪॥
తీక్ష్ణాగ్నిరితి తం విద్యాత్సమాగ్నిః శ్రేష్ఠ ఉచ్యతే॥

తా॥ అందు విషమాగ్ని యశీతివాతరోగములలో దేనినైనను వాతజ్వరాది సామాన్యరోగములనైనను కల్గించును. తీక్ష్ణంబైన యగ్ని పిత్తమునిమిత్తముగాగల నలుబదిరోగములలో దేనినైనను కల్గించును. మన్దాగ్ని కఫమునిమిత్తముగాగల యిరువదిరోగములలో దేనినైనను కల్గించును. మఱియు సమమైన యగ్నిగల మనుజునకు సమప్రమాణముగ భుజించిన యాహారము లెస్సగ పచనమునొందును; మందాగ్నిగల మనుజునకు స్వల్పముగ భుజించిన యాహారముకూడ జీర్ణంబు కాదు. విషమాగ్నియైన

మనుజునకు భుజించినయాహారము ఒకప్పుడు జీర్ణంబై యొకప్పుడు జీర్ణంబు గాకుండును. అధిక ప్రమాణముగనైనను సమప్రమాణముగనైనను భుజించిన యాహారము సుఖముగ పచనంబైనయెడ అట్టి మనుజుండు తీక్ష్ణంబైన యగ్నిగల మనుజుండని యెరుంగునది.

మరియు తీక్ష్ణాగ్నిలక్షణము గ్రంథాన్తరమునం దీరీతిగ గానంబడియెడు: "అతిమాత్ర మజీర్ణేఽపి గురుచాన్నమథాశ్నతః। దివాపి స్వపతో యస్య పచ్యతే సోఽగ్నిరుత్తమః॥" ప్రమాణమున కధికముగ భుజించినను అజీర్ణకాలమున భుజించినను గురుపదార్థముల భుజించినను పవటియందు నిదురించినను జీర్ణంబైనయెడ అట్టి యగ్నిగలమనుజుండు తీక్ష్ణాగ్నియనం బడునని యర్థము. మరియు అత్యగ్నిలక్షణము చరకమున నివ్విధంబుగ గానంబడియె: "నరే క్షీణకఫే పిత్తం కుపితం మారుతానుగమ్। స్వోష్మణా పావకస్థానే బలమగ్నేః ప్రయచ్ఛతి। తదా లబ్ధబలో దేహం విరుజేత్సానిలోఽనలః। అభిభూయ పచత్యన్నం తైక్ష్ణ్యాదాశు ముహుర్ముహుః। పక్త్వా చాన్నం తతో ధాతూ& శోణితాదీ& పచత్యపి। తతో దౌర్బల్యమాతఙ్కా& మృత్యుం చోపనయేన్నరమ్। భుక్తేఽన్నే లభతే శాన్తిం జీర్ణమాత్రే ప్రతామ్యతి। తృట్ప్రసదాహ మూర్ఛాస్స్యుః వ్యాధయోఽత్యగ్నిసంభవాః॥" మనుజునకు కఫము క్షీణంబైనపుడు పిత్తము ప్రకుపితంబై వాతముతో కూడి తనయందలి వేడిమిచే జాఠరాగ్నికి బలమును కల్గించును; జాఠరాగ్నియు అధికబలమునొంది వాతముతో గలిసి యాహారమును మాటిమాటికి తీక్ష్ణముగ పచింపజేయుచు శరీరమునందలి రక్తాదిధాతువులను పచనమునొందించును. పిమ్మట మనుజునకు దుర్బలత్వమును నానావిధరోగములను కల్గించి మరణమునుకూడ నొందించును. మరియు ఆయగ్ని అన్నమును భుజించినతోడనే కొంచెము శాంతి నొందును. ఆయన్నము జీర్ణించినతోడనే మిగుల తాపమును కల్గించును. దప్పి, దగ్గు, తాపము, మూర్ఛ, ఈ వ్యాధులన్నియు అట్టి యత్యగ్నిచే కల్గునని భావము.

## అజీర్ణభేదములు

శ్లో॥ ఆమం విదగ్ధం విష్టబ్ధం కఫపిత్తానిలైస్త్రిభిః॥౫॥
అజీర్ణం కేచిదిచ్ఛన్తి చతుర్థం రసశేషతః॥
అజీర్ణం పంచమం కేచిన్నిర్దోషం దినపాకి చ॥౬॥
వదన్తి షష్ఠం చాజీర్ణం ప్రాకృతం ప్రతివాసరమ్।

తా॥ అజీర్ణరోగము కఫప్రకోపముచే జనించినయెడ ఆమాజీర్ణంబనియు, పిత్తప్రకోపముచే జనించినయెడ విదగ్ధాజీర్ణంబనియు, వాతప్రకోపముచే జనించినయెడ విష్టబ్ధాజీర్ణంబనియు, మూడు విధములు. భుజించినయన్నము రసయుక్తంబై శేషించియున్నయెడ దాన జనించిన యజీర్ణము నాల్గవది యని కొందరును, ప్రమాణమున కధికముగా భుజించినను కాలము నతిక్రమించి భుజించినను అసాత్మ్యంబులైన యన్నాదుల భుజించినను నాటిదినము పక్వంబుగాక మరునాడు వాతాద్యుపద్రవములులేక జీర్ణంబగునది దినపాకియను ఐదవ యజీర్ణంబని మరికొందరును, ప్రతిదినము వికృతి

జన్యముకాక స్వాభావికముగానుండు అజీర్ణము ప్రాకృతంబను యారవయజీర్ణంబని మరికొందరును వచించెదరు.

ఇచ్చట వాతాదిదోషములచే జనించిన యజీర్ణములు భుజించిన యాహారములో నొకింత జఠరాగ్నిమార్గమును జేరక శేషించి యుండుటచే జనించినదియనియు, రసశేషంబైన నాల్గవయజీర్ణము త్రేనుపులు పరిశుద్ధముగ వెడలుచున్నను అన్నమునం దిచ్ఛబొడమక రొమ్ము బరువై అన్న రసము జీర్ణముకాక శేషించియుండుటచే జనించినదియనియు ఆమాద్యజీర్ణత్రయమునకు నాల్గవ యజీర్ణమునకును పరస్పరభేదముల నెఱుంగునది. ఈ యర్థమునే సుశ్రుతాచార్యుండు "ఉద్గార శుద్ధావపి భక్తకాఙ్క్షా న జాయతే హృద్గురుతా చ యస్య। రసావశేషేణ తు సప్రసేకం చతుర్థమేతత్ప్రవదన్త్యజీర్ణమ్॥" అను శ్లోకముచే వివరించెను. మఱియు అసాత్మ్యాహారభోజనాదులచేత నొక యహోరాత్రములో జీర్ణంబు గాక మరునాడు కడుపుబ్బరము మొదలగు దోషోపద్రవములు లేకనే జీర్ణించునది యైదవయజీర్ణము. ఈ యజీర్ణమున జీర్ణించువరకు భోజనాదుల జేయక నిరీక్షించుట ముఖ్యము. మరియు భుజించినతోడనే అన్నకాంక్ష మొదలగునవి జీర్ణకాలమువరకు లేకుండును గాన ఇది ప్రాకృతంబను నారవ యజీర్ణము. ఈ యజీర్ణమున భోజనము చేసినతోడన నూరడుగులదూరము సంచరించుట వామపార్శ్వమున పరుండుట మొదలగు కృత్యముల జేయుట యారోగ్యకరంబని సుశ్రుతమునందు జెప్పియున్నది.

అజీర్ణము జనించుటకు కారణములు

శ్లో॥ అత్యమ్బుపానాద్విషమాశనాచ్చ
సన్ధారణాత్స్వప్నవిపర్యయాచ్చ।
కాలేఽపి సాత్మ్యం లఘుచాపి భుక్తం
అన్నం న పాకం భజతే నరస్య॥౭॥
* * ఈర్ష్యాభయక్రోధపరిప్లుతేన
లుబ్ధేన రుగ్దైన్య నిపీడితేన।
ప్రద్వేషయుక్తేన చ సేవ్యమానం
అన్నం న సమ్యక్పరిపాకమేతి * *

తా॥ అధికముగా జలమును పానముచేయుట, ప్రమాణమునకు న్యూనాధికంబులుగను అకాలమునందును భుజించుట, మలమూత్రాది వేగములను నిరోధించుట, రాత్రులయందు నిదురించక పవళ్లయందు నిదురించుట ఈ కారణములచేత సకాలమునందు సాత్మ్యంబైన యన్నమును లఘువుగ భుజించినను జీర్ణంబుకాదు. మరియు ఈర్ష్య, భయము, క్రోధము, లుబ్ధత్వము, రోగము, దీనత్వము, ద్వేషము, ఇట్టిగుణములుకల మనుజునిచే భుజించబడిన యన్నము లెస్సగ జీర్ణంబుగాదు. ఈర్ష్య మొదలగు మానసదోషంబులచే గూడ అజీర్ణము జనించునని భావము.

## ఆమాజీర్ణ లక్షణము

శ్లో॥ తత్రామే గురుతోత్క్లేదః శోథోగణ్డాక్షికూటగః।
ఉద్గారశ్చ యథాభుక్తం అవిదగ్ధః ప్రవర్తతే॥౮॥

తా॥ మున్ను వచించిన యజీర్ణములలో ఆమంబను అజీర్ణమునందు శరీరము బరువై యుండుట, నోట నీరూరుట, గండస్థలములయందును అక్షికూటమునందును శోఫ జనించుట, భుజించిన మధురాది రసముల కనుగుణముగ త్రేనుపులు వచ్చుట ఈ లక్షణములు జనించును.

## విదగ్ధాజీర్ణ లక్షణములు

శ్లో॥ విదగ్ధే భ్రమతృణ్మూర్ఛాః పిత్తాచ్చ వివిధా రుజః।
ఉద్గారశ్చ సధూమామ్లః స్వేదోదాహశ్చ జాయతే॥౯॥

తా॥ విదగ్ధాజీర్ణమునందు భ్రమము, దప్పి, మూర్ఛ, పిత్తముచే జనించు నానావిధ వ్యాధులు, పొగతోగూడి పులిత్రేనుపులు వచ్చుట, చెమట, తాపము ఈ లక్షణములు కల్గును.

## విష్టబ్ధాజీర్ణ లక్షణము

శ్లో॥ విష్టబ్ధే శూలమాధ్మానం వివిధా వాతవేదనాః।
మలవాతాప్రవృత్తిశ్చ స్తమ్భో మోహోఙ్గపీడనమ్॥౧౦॥

తా॥ విష్టబ్ధాజీర్ణమునందు శూల, కడుపుబ్బరము, వాతముచేజనించు నానావిధవేదనలు, మలంబును అపానవాతంబును వెలుపలకు వెడలకుండుట, శరీరము స్తంభించి యుండుట, మూర్ఛ, అవయవములు నొచ్చుట, ఈ లక్షణములు జనించును.

## రసశేషాజీర్ణ లక్షణము

శ్లో॥ రసశేషేఽన్నవిద్వేషః హృదయాశుద్ధిగౌరవే।

తా॥ రసశేషాజీర్ణమునందు అన్నద్వేషము; హృదయము పరిశుద్ధము గాకుండుట, శరీరము భారముగా నుండుట ఈలక్షణములు కల్గును.

## అజీర్ణోపద్రవములు

శ్లో॥ మూర్ఛా ప్రలాపో వమథుః ప్రసేకస్సదనం భ్రమః॥౧౧॥
ఉపద్రవా భవన్త్యేతే మరణం వాప్యజీర్ణతః।

తా॥ మూర్ఛ, అనర్థకముగ మాటలాడుట, వాంతి, నోటనీరూరుట, అవయవములు శిథిలంబులగుట, భ్రమము, ఇవియన్నియు అజీర్ణములకన్నిటికి సాధారణంబులగు నుపద్రవములు. అట్టి యజీర్ణము మిక్కిలి యధికముగా ప్రకోపించినయెడ మరణముకూడ కల్గును.

## అతిభోజనముచే గల్గు వ్యాధులు

శ్లో॥ అనాత్మవన్తః పశువద్భుఞ్జతే యేఽప్రమాణతః॥౧౨॥
రోగానీకస్య తే మూలం అజీర్ణం ప్రాప్నువన్తిహి।

తా॥ తమశరీరస్థితి నెరుంగని జడులు మితిలేక పశువులవలె భుజించినయెడ అట్టి మనుజులు విసూచిమున్నగు రోగములకు మూలకారణంబైన ప్రబలాజీర్ణమును పొందుదురు.

విసూచ్యలసకవిలమ్బికా నిదానములు

శ్లో॥ అజీర్ణ మామం విష్టబ్ధం విదగ్ధం చ యదీరితం॥౧౩॥
విషూచ్యలసకౌ తస్మాద్భవేచ్చాపి విలమ్బికా।

తా॥ మున్ను వచించిన ఆమ విష్టబ్ధ విదగ్ధంబు లను అజీర్ణముల మూడిటిచేత విసూచి అలసక విలంబికము లను వ్యాధులు యథాసంభవముగ జనించును. ఇచ్చట మూడువిధంబులైన అజీర్ణములచే విసూచ్యాదివ్యాధులు మూడును యథాసంఖ్యముగ జనించునని చెప్పినయెడ పిత్తప్రకోపముచే జనించిన విదగ్ధాజీర్ణముచే విలంబికావ్యాధి జనించునని యర్థమగును. అట్టియెడ కఫవాతములచే విలంబికా జాడ్యము కల్గునని చెప్పుచున్న ఉత్తరగ్రన్థముచే స్వోక్తివిరోధము కల్గును గాన యథాసంఖ్య విచారము లేదని యెరుంగునది.

విసూచీశబ్దవివరణము

శ్లో॥ సూచీభిరివ గాత్రాణి తుదన్సన్తిష్ఠతేఽనిలః॥౧౪॥
యత్రాజీర్ణేన సా వైద్యైర్విసూచీతి నిగద్యతే।
న తాం పరిమితాహారా లభన్తే విదితాగమాః॥౧౫॥
మూఢాస్తామజితాత్మానో లభన్తేఽశనలోలుపాః।

తా॥ వాతము మిగుల ప్రకుపితంబై సకలావయవములను సూదులగ్రుచ్చినవిధంబుగ నానావిధవేదనల కల్గించుటచే నా యజీర్ణము విసూచియని వైద్యులచే చెప్పబడినది. అట్టి విసూచి యను వ్యాధిని వైద్యతంత్రముల దెలిసి పరిమితంబుగ నాహారముసల్పు మనుజులు పొందరు. వైద్యతంత్రముల దెలియక మూఢులై యింద్రియముల జయించలేక అమితాహారమునం దాసగల మనుజులు అట్టి ఘోర వ్యాధిని బొందుదురు.

విసూచీలక్షణము

శ్లో॥ మూర్చ్ఛాతిసారో వమథుః పిపాసా
శూలో భ్రమోద్వేష్టనజృమ్భదాహాః।
వైవర్ణ్యకమ్పౌ హృదయే రుజశ్చ
భవన్తి తస్యాం శిరసశ్చ భేదః॥౧౬॥

తా॥ మైమరచియుండుట, అధికముగా నామవిరేచనం బగుట, వాంతి, అధికమైన దప్పి, శూల, భ్రమము, ఉద్వేష్టనము (అవయవములు కొంకరలుపోవుట), ఒడలువిరుపు, ఆవలింతలు, తాపము, శరీరము వివర్ణంబగుట, వణకు, హృదయమున నొప్పి మొదలగు బాధలుకల్గుట, తలనొప్పి, ఈ లక్షణములన్నియు విసూచివ్యాధియందు జనించును. చరకమునందు "ఊర్ధ్వంచాధశ్చ ప్రవృత్తామామదోషాం యథోక్తరూపాం విసూచీం విద్యాత్" అని విసూచీలక్షణము

కానంబడియెడు. ఆమాజీర్ణముచేత నూర్ధ్వాధోమార్గములయందు వమనవిరేచనరూపముగ బైలువెడలు నది విసూచియని చెప్పంబడునని భావము.

అ ల స క ల క్ష ణ ము

శ్లో॥ కుక్షిరానహ్యతేఽత్యర్థం ప్రతామ్యేత్పరికూజతి।
నిరుద్ధో మారుతశ్చైవ కుక్షావుపరిధావతి॥౧౭॥
వాతవర్చోనిరోధశ్చ యస్యాత్యర్థం భవేదపి।
తస్యాఽలసకమాచష్టే తృష్ణోద్గారౌ చ యస్య తు॥౧౮॥

తా॥ అధికముగ కడుపుబ్బరించుట, మూర్ఛగల్గుట, పలువెరంగుల దీనముగ ధ్వనిచేయుట, వాతము అజీర్ణముచే నధోముఖముగ వెడలక కుక్షిలో నూర్ధ్వభాగమున హృదయాది స్థానములయందు సంచరించుట, వాతము మలము ఈ రెండును అడ్డగింపబడి బైటవెడలకుండుట, దప్పిపుట్టుట, త్రేనుపులు వచ్చుట, ఈలక్షణములు కల్గినది యాలసకంబని యెరుంగునది. మరియు అలసకలక్షణము అన్వర్థముగా తన్త్రాన్తరమున జెప్పియున్నది: "ప్రయాతి నోర్ధ్వం నాధస్తాదాహారో న చ పచ్యతే। ఆమాశయేఽలసీభూతస్తేన చాఽలసకస్స్మృతః॥" భుజించబడిన యాహారము ఊర్ధ్వాధోముఖముల వెడలకను, కుక్షిలో పచనముకాకను మందీభూతంబై యామాశయమున నే నిలచియుండుటచేత అలసకమనంబడునని యర్థము.

వి ల ం బి కా ల క్ష ణ ము

శ్లో॥ దుష్టం తు భుక్తం కఫమారుతాభ్యాం
ప్రవర్తతే నోర్ధ్వమధశ్చ యస్య।
విలమ్బికాం తాం భృశదుశ్చికిత్స్యాం
ఆచక్షతే శాస్త్రవిదః పురాణాః॥౧౯॥

తా॥ భుజించబడిన యాహారము కఫవాతములచే దుష్టంబై యూర్ధ్వాధోమార్గముల బైలు వెడలక నిరుద్ధంబై కుక్షిలోనే నిలచియున్నయెడ దానిని విలంబిక యనువ్యాధి యని ప్రాచీన వైద్యులు వచించెదరు. మరియు నీజాడ్యంబు చికిత్సకసాధ్యంబై యుండును. ఇచ్చట అలసకమునందు తృష్ణ ఉద్గారము వాయుసంచారము మొదలగు నుపద్రవములు కల్గుననియు, విలంబికావ్యాధియందు అట్టి యుపద్రవములు లేకుండుననియు పరస్పరభేదముల నెరుంగునది. తన్త్రాన్తరమునందు "పీడితం మారుతేనాన్నం శ్లేష్మణా రుద్ధమన్తరా। అలసం క్షోభితం దోషైః శల్యత్వేనైవ సంస్థితమ్। శూలాదీన్కురుతే తీవ్రాం శ్ఛర్ద్యతీసారవర్జితాన్॥" అనియున్నది. భుజించబడిన యాహారము వాతముచే పీడింపబడి శ్లేష్మచే నడ్డగించబడినదియై శరీరములో శల్యమును బోలె నిలచి వమనవిరేచనములులేక తక్కిన శూలమొదలగు బాధల గల్గించునది అలసకమని యర్థము. ఈ వాక్యముచేత శూలాద్యుపద్రవములు అలసకమునసుండునని తెలియుటంజేసి అట్టి యుపద్రవములు కల్గినది అలసకమనియు శూలాదులు లేకుండునది విలంబికయనియు భేదము దెలియు చున్నయది.

### ఆమవిశేషకృత్యములు

శ్లో॥ యత్రస్థమామం విరుజేత్తమేవ
దేశం విశేషేణ వికారజాతైః।
దోషేణ యేనావతతం శరీరం
తల్లక్షణైరామసముద్భవైశ్చ॥౨౦॥

తా॥ ఏస్థలమునం దామము నిలచియుండునో ఆప్రదేశమును అట్టిఆమము తత్కాలమున ప్రకుపితంబులై శరీరమునవ్యాపించియుండు వాతాదిదోషములయొక్క లక్షణములతోగూడి ఆమముచే జనించిన వ్యాధిసముదాయముచేత విశేషముగ బాధించును. ఆమములేని ప్రదేశమునుకూడ సామాన్యముగ బాధించునని భావము.

### అసాధ్యవిసూచ్యలసకలక్షణములు

శ్లో॥ యశ్శ్యావదన్తౌష్ఠనఖోఽల్పసంజ్ఞో
వమ్యర్దితోఽభ్యన్తరయాతనేత్రః।
క్షామస్వరః సర్వవిముక్తసన్ధిః
యాయాన్నరస్సోఽపునరాగమాయ॥౨౧॥

తా॥ దంతములు పెదవులు గోళ్లు ఇవి నల్లనై యుండుట, మైమఱచుట, వాంతి అధికమట, కన్నులు లోపలికిబోవుట, కంఠస్వరము హీనంబగుట, అస్థిసంఘులన్నియు శిథిలంబులగుట, ఈ లక్షణములు విసూచ్యలసకవ్యాధులయందు జనించిన యెడ ఆమనుజుండు మరణమునొందును. అసాధ్యంబులని భావము. విలంబికాజాడ్యము స్వభావముగనే యసాధ్యంబని యెరుంగునది.

### జీర్ణాహారలక్షణము

శ్లో॥ ఉద్గారశుద్ధిరుత్సాహో వేగోత్సర్గో యథోచితః।
లఘుతా క్షుత్పిపాసా చ జీర్ణాహారస్య లక్షణమ్॥౨౨॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
అగ్నిమాన్ద్యాజీర్ణ విసూచికాలసక
విలంబికా నిదానమ్
సమాప్తమ్.



తా॥ పుల్లిత్రేనుపులు మొదలగునవి లేక పరిశుద్ధముగ నుండుట, శరీరమునకును మనస్సునకును పనులయందు ఉత్సాహముగల్గియుండుట, మలమూత్రాదులు బంధములేక చక్కగ బైలువెడలుట, శరీరము తేలికగా నుండుట, ఆకలిదప్పులు కలుగుట ఈ లక్షణములు కల్గినప్పుడు ఆహారము జీర్ణంబైనదియని యెఱుంగునది.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానార్థతాత్పర్యమునందు
అగ్నిమాంద్యాజీర్ణ విసూచికాలసక
విలంబికా నిదానము

సమాప్తము.



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# క్రిమినిదానమ్

అజీర్ణముచే క్రిములుగల్గును కాన అజీర్ణనిదానమును జెప్పిన పిదప క్రిమినిదానము చెప్పబడుచున్నది.



## క్రిమిభేదములు

శ్లో॥ క్రిమయశ్చ ద్విధా ప్రోక్తా బాహ్యాభ్యన్తర భేదతః।
బహిర్మల కఫాసృగ్విడ్జన్మ భేదా చ్చతుర్విధా॥౧॥

తా॥ క్రిములు బాహ్యంబులనియు అభ్యన్తరంబులనియు రెండువిధములు. మఱియు త్వక్కు మొదలగుదానియందుండు స్వేదమున్నగు బాహ్యమలములయందును కఫమునందును రక్తమునందును పురీషమునందును జనించుటచేత నాల్గువిధంబులగును.

## బాహ్యక్రిమిలక్షణము

శ్లో॥ నామతో వింశతి విధా బాహ్యాస్తత్ర మలోద్భవాః।
తిలప్రమాణ సంస్థాన వర్ణాః కేశామ్బరాశ్రయాః॥౨॥
బహుపాదాశ్చ సూక్ష్మాశ్చ యూకా లిక్షాశ్చ నామతః।
ద్విధా తే కోఠ పిడకా కండూ గణ్డాన్ ప్రకుర్వతే॥౩॥

తా॥ పూర్వోక్తచతుర్విధక్రిములు నామభేదముచే నిరువదివిధంబు లగును. అందు బాహ్యమలంబులైన స్వేదాదులయందు జనించినక్రిములు నువ్వులయొక్క పరిమాణంబును, ఆకారంబును వర్ణంబును కల్గినవియు, వెండ్రుకలను వస్త్రములను ఆశ్రయించి యుండునవియు, అనేకపాదములు కల్గినవియునై యుండును. మరియు నవి యూక (పేలు) లనియు, లిక్ష (ఈర్లు) లనియు రెండువిధములు. ఇవియే బాహ్యక్రిములని చెప్పబడును. ఈక్రిములు మండలములను బొబ్బలను దురదను కణుతులను గల్గించును.

## క్రిములుకల్గుటకు కారణము

శ్లో॥ అజీర్ణభోజీ మధురామ్లనిత్యో
ద్రవప్రియః పిష్టగుడోపభోక్తా।
వ్యాయామవర్జీ చ దివా శయానో
విరుద్ధభుక్సంలభతే క్రిమీంస్తు॥౪॥

తా॥ భుజించిన యాహారము జీర్ణముకాకుండినపుడు మరల భుజించుట, ఎల్లపుడు మధుర పదార్థములను అమ్లపదార్థములను విశేషముగ భుజించుట, ద్రవపదార్థములయందు మిగుల యభిలాష జనించుట, బెల్లముకలిసిన పిండిని తినుట, శరీరపరిశ్రమలను చేయకుండుట, పవటియందు శయనించుట, విరుద్ధాహారముల భుజించుట, ఇట్టి కారణములచేత మనుజునకు క్రిములు జనించును.

పురీషకఫరక్తములయందు క్రిములుజనించుటకు నిదానము

శ్లో॥ మాష పిష్టామ్ల లవణ గుడ శాకైః పురీషజాః।
మాంస మత్స్య గుడ క్షీర దధి శుక్తైః కఫోద్భవాః॥౫॥
విరుద్ధాజీర్ణ శాకాద్యైః శోణితోత్థా భవన్తి హి।

తా॥ మినుములపిండి, అమ్లలవణరసములుకల ద్రవ్యములు, బెల్లము, కూరగాయలు వీనిని అధికముగ భుజించుటచేత పురీషమునందు క్రిములు జనించును. మాంసము, మత్స్యములు, బెల్లము, పాలు, పెరుగు, పులిగంజి ఈపదార్థములను విశేషముగ సేవించుటచేత కఫమునందు క్రిములు జనించును. విరుద్ధంబులును అజీర్ణకరంబులునైన శాకములు మున్నగు పదార్థములను భుజించుటచేత రక్తమునందు క్రిములు జనించును. పురీషజ కఫజ రక్తజంబులైన క్రిములు జనించుటకు ఈచెప్పిన మూడుకారణములు వరుసగా నిదానంబులని యెరుంగునది.

క్రిములు జనించినవాని లక్షణములు

శ్లో॥ జ్వరో వివర్ణతా శూలం హృద్రోగస్సదనం భ్రమః॥౬॥
భక్తద్వేషోఽతిసారశ్చ సఞ్జాతక్రిమిలక్షణమ్।

తా॥ జ్వరము, శరీరము వివర్ణంబగుట, శూల, హృదయరోగము, శరీరము కృశించుట, భ్రమము, అన్నద్వేషము, అతిసారము, ఈలక్షణములు కల్గినయెడ క్రిములు జనించినవి యని యెరుంగునది.

క ఫ జ క్రి మి ల క్ష ణ ము లు

శ్లో॥ కఫాదామాశయే జాతాః వృద్ధాః సర్పన్తి సర్వతః॥౭॥
పృథుబ్రధ్ననిభాః కేచిత్కేచి ద్గణ్డూపదోపమాః।
రూఢధాన్యాఙ్కురాకారా స్తనుదీర్ఘా స్తథాణవః॥౮॥
శ్వేతాస్తామ్రావభాసాశ్చ నామతస్సప్తధా తు తే।
అన్త్రాదా ఉదరావేష్టా హృదయాదా మహాగుదాః॥౯॥
చురవోదర్భకుసుమాస్సుగన్ధాస్తేచ కుర్వతే।
హృల్లాసమాస్యస్రవణం అవిపాక మరోచకమ్॥౧౦॥
మూర్ఛా ఛర్దిజ్వరానాహ కార్శ్యక్షవథుపీనసాన్।

తా॥ కఫముచేత ఆమాశయమునందు క్రిములు జనించును. అవి వృద్ధినొంది శరీరముయొక్క ఊర్ధ్వాధోభాగములయందంతట సంచరించును. వానిలో కొన్ని స్థూలంబులై చర్మపుతీగవలె నుండును. కొన్ని యెఱ్ఱలవలె నుండును. కొన్ని వరిమొలకలవలె సూక్ష్మంబులైయుండును. కొన్ని సన్నగ నిడుదలైయుండును. కొన్ని మిగుల సూక్ష్మాకారంబులై యుండును. కొన్ని శ్వేతవర్ణంబులును

కొన్ని రక్తవర్ణంబులునై యుండును. మరియు నవి శరీరమునందలి క్రేగులను తినుచుండుటచేత నంత్రాదంబులనియు, కడుపున జుట్టికొని యుండుటంజేసి ఉదరావేష్టంబులనియు, హృదయమును తినుచుండుటంజేసి హృదయాదంబులనియు, మహాగుదంబులనియు, చురువులనియు, రెల్లుపువ్వులంబోలి యుండుటంజేసి దర్భకుసుమంబులనియు, సుగన్ధంబులనియు, నామభేదములచేత నేడు విధంబులగును. ఇవ్విధంబుగ నేడువిధంబులైన కఫజక్రిములు హృదయమునందు చేరుట, నోట నీరు గారుట, ఆహారము జీర్ణము గాకుండుట, అరుచి, మూర్ఛ, వాన్తి, జ్వరము, కడుపుబ్బరము, శరీరము కృశించుట, తుమ్ముట, పీనస, ఈ యుపద్రవములను కల్గించును.

## రక్తజక్రిములలక్షణము

శ్లో॥ రక్తవాహిసిరాస్థానా రక్తజా జన్తవోఽణవః॥౧౧॥
అపాదావృత్తతామ్రాశ్చ సౌక్ష్మ్యాత్కేచిదదర్శనాః।
కేశాదా రోమవిధ్వంసా రోమద్వీపా ఉదుమ్బరాః॥౧౨॥
షట్తే కుష్ఠైకకర్మాణః సహ సౌరసమాతరః।

తా॥ రక్తముచే జనించిన క్రిములు మిగుల సూక్ష్మాకారంబులును, పాదరహితంబులును, గుండ్రమైన యాకారంబులు గలిగినవియు, రక్తవర్ణంబులునునై రక్తమునువహించు సిరలయందుండును. వానిలో కొన్ని మిగుల సూక్ష్మాకారంబులగుటంజేసి కనబడకుండును. మరియు నవి తలవెండ్రుకల నశింపచేయుటచే కేశాదంబులనియు, రోమముల రాలిపోవునట్లుల జేయుటచే రోమవిధ్వంసంబులనియు, రోమకూపముల నాశ్రయించి యుండుటచే రోమద్వీపంబులనియు, ఉదుంబరములనియు, సౌరసములనియు, మాతలనియు, నామభేదములచే నారువిధంబులగును. ఈ యారువిధంబులైన క్రిములు ముఖ్యముగ కుష్ఠవ్యాధులను కల్గించును. చరకము రోమవిధ్వంసములను రోమాదంబులనియు, మాతలను జన్తుమాతలనియు నామభేదములచే చెప్పియున్నది.

## పురీషజక్రిములలక్షణము

శ్లో॥ పక్వాశయే పురీషోత్థా జాయన్తేఽధోవిసర్పిణః॥౧౩॥
వృద్ధాస్తే స్యుర్భవేయుశ్చ తే యదామాశయోన్ముఖాః।
తదాస్యోద్గారనిశ్వాసవిడ్గన్ధానువిధాయినః॥౧౪॥
పృథువృత్తతనుస్థూలాః శ్యావపీతసితాసితాః।
తే పఞ్చనామ్నా క్రిమయః కకేరుకమకేరుకాః॥౧౫॥
సౌసురాదాస్ససూలాఖ్యా లేలిహా జనయన్తి హి।
విడ్భేదశూలవిష్టమ్భకార్శ్యపారుష్యపాణ్డుతాః॥౧౬।
రోమహర్షాగ్నిసదనం గుదకణ్డూర్వినిర్గమాః।

---

ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే.

క్రిమి నిదానం సమాప్తమ్

తా॥ పురీషజములను క్రిములు పక్వాశయమున జనించి యధోమార్గమున సంచరించుచుండును. అవి వృద్ధినొంది యామాశయమునకు నున్ముఖముగ సంచరించునపుడు త్రేనుపులు వచ్చును. నిశ్వాసవాతము మలమువలె దుర్గన్ధంబై వెలువెడలును. ఆక్రిములలో కొన్ని లావుగను, కొన్ని వర్తులంబుగను, కొన్ని సూక్ష్మంబులుగను, కొన్ని స్థూలంబులుగను, కొన్ని శ్యామవర్ణముగను, కొన్ని పీతవర్ణంబుగను, కొన్ని తెల్లనిరంగుకల్గినవియు, కొన్ని నల్లనిరంగు కల్గినవియునై యుండును. మరియు నాక్రిములు కకేరుకములనియు, మకేరుకములనియు, సౌసురాదములనియు, సశూలంబులనియు, లేలిహములనియు నామభేదములచే నైదువిధములు. ఆ క్రిములు మలము ఉంటలుగ పడుట, శూల, మలబంధము, శరీరము కృశించుట, శరీరము గరగరలాడుట, శరీరము తెల్లనగుట, ఈ గుణములను గల్గించును. మరియు నాక్రిములు స్వస్థానమును వదలి ఇతరస్థానములయందు సంచరించునపుడు గురుపాటు అగ్నిమాన్ద్యము, గుదస్థానమున దురద, ఈ యుపద్రవంబులు జనించును.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమగోత్ర
విరాజమాన దివ్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానార్థతాత్పర్యమునందు
క్రి మి ని దా న ము
సమాప్తము.

శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# పాణ్డురోగ కామలా కుమ్భకామలా హలీమక నిదానమ్



పురీషజంబులగు క్రిములవలన పాండురోగము జనించునుగాన క్రిమిరోగనిదానమును చెప్పిన పిదప పాణ్డురోగనిదానమును చెప్పుట.



పాణ్డురోగభేదములు

శ్లో॥ పాణ్డురోగాః స్మృతాః పఞ్చ వాతపిత్తకఫైస్త్రియః ।
చతుర్థస్సన్నిపాతేన పఞ్చమో భక్షణాన్మృదః ॥౧॥

తా॥ పాండురోగములు వాతపిత్తశ్లేష్మసన్నిపాతములచే జనించుటంజేసి క్రమముగ వాతపాండువనియు, పిత్తపాండువనియు, కఫపాండువనియు, సన్నిపాతపాండువనియు, వాతాదిభేదంబులును; మట్టిని తినుటచే జనించినది మృత్పాండువనియు నైదుభేదములు గల్గియుండునని భావము.

పాండురోగనిదానపూర్వకసంప్రాప్తి

శ్లో॥ వ్యాయామమమ్లం లవణాని మద్యం
మృదం దివా స్వప్న మతీవ తీక్ష్ణమ్ ।
నిషేవమాణస్య ప్రదూష్య రక్తం
దోషాస్త్వచం పాండురతాం నయన్తి ॥౨॥

తా॥ దేహపరిశ్రమమును అధికముగ చేయుట, అమ్ల లవణ రసములు కల పదార్థములను, మద్యమును మట్టిని విశేషముగ తినుట, పవటియందు నిదురించుట, అతితీక్ష్ణంబులైన పదార్థములను సేవించుట,ఇట్టి కారణములచే వాతాదిదోషములు ప్రకుపితంబులై రక్త మాంసములను చెరచి చర్మమును పాండువర్ణముగ చేయును. దీనిని పాండురోగమని భిషగ్వరులు వ్యవహరించెదరు.

ఇచ్చట రక్తపదముచేత మాంసమునకు కూడ గ్రహణము. మరియు వాగ్భటాచార్యుండు "శ్లేష్మ త్వగ్రక్తమాంసాని ప్రదూష్య" అని చెప్పియుండుటచేత శ్లేష్మము త్వక్కు రక్తము మాంసము, వీనినన్నింటిని దుష్టములుగజేసి పాండురోగ మును కల్గించును అని యర్థంబగు చున్నయది. ఇచ్చట ఋషిమతములు రెండును ప్రమాణములు గాన యీ చెప్పబడిన రెండువిధము

లుగ పాండురోగములు జనించునని యెరుంగునది. వాత పిత్త పాండువుల యందు కృష్ణ పీత వర్ణములు కల్గినను పాండువర్ణం బీ వ్యాధియందు ప్రబలముగా చర్మము నాశ్రయించి యుండును గాన పాండురోగసామాన్యంబైన సంప్రాప్తియందు "పాండురతాం నయన్తి" అని మూలకారుడు వచించెను. ఈయర్థము వాగ్భటమునందు "పాండుత్వం తేషు చాధికం । యతోఽతః పాండురిత్యుక్తస్స రోగః" అను వాక్యముచే జెప్పియున్నది. ఈ వ్యాధియందు హారిద్రాది వర్ణములు దోషభేదములచే గల్గినను పాండువర్ణం బధికముగా నుండుననియు, దానంజేసి యీరోగము పాండురోగమని చెప్పంబడుననియు భావము.

పాండురోగపూర్వరూపములు

శ్లో॥ త్వక్స్ఫోటన ష్ఠీవన గాత్రసాద
మృద్భక్షణ ప్రేక్షణకూటశోథాః ।
విణ్మూత్రపీతత్వ మథావిపాకో
భవిష్యత స్తస్య పురస్సరాణి ॥౩॥

తా॥ చర్మము కొంచెముకొంచెముగ పగులుట, నోట జొల్లు కారుట, శరీరము కృశత నొందుట, మట్టిని తినుట కిచ్ఛ బొడముట, కనురెప్పలయందు వాపు కల్గుట, మల మూత్రములు పచ్చగ నుండుట, భుజించిన యాహారము జీర్ణము కాకుండుట, ఇవి యన్నియు పాండురోగము జనించుటకు ముందు కల్గు (పూర్వ)రూపములని యెరుంగునది.

వాతజపాండురోగలక్షణము

శ్లో॥ త్వఙ్మూత్రనయనాదీనాం రూక్షకృష్ణారుణాభతా ।
వాతపాణ్డ్వామయే తోదకమ్పానాహభ్రమాదయః ॥౪॥

తా॥ వాతముచే జనించిన పాండురోగమునందు త్వక్కు, మూత్రము, నేత్రములు మొదలగునవి మిగుల రూక్షంబులై కృష్ణవర్ణము కలిసిన రక్తవర్ణము కల్గి యుండును. పోటు వణకు భ్రమము మున్నగు నుపద్రవములు కల్గియుండును. ఇచ్చట కృష్ణారుణాదివర్ణములు కల్గి యున్నను పాండువర్ణము మిగుల నధికముగా నుండునని యెరుంగునది. ఈ యర్థము సుశ్రుతమునందు "సర్వేషు చైతేష్విహ పాణ్డుభావో యతోఽధికోఽతః ఖలు పాణ్డురోగః" అని యున్నది. వాతాదులచే జనించిన పాండురోగములయందు పాండువర్ణమే అధికముగ నుండుటంజేసి పాండురోగమని చెప్పంబడునని భావము.

పిత్తజపాండురోగలక్షణము

శ్లో॥ పీతమూత్రశకృన్నేత్రో దాహతృష్ణాజ్వరాన్వితః ।
భిన్నవిట్కోఽతిపీతాభః పిత్తపాణ్డ్వామయీ నరః ॥౫॥

తా॥ పిత్తపాండురోగము కల మనుజుండు పచ్చనిరంగు కల మూత్రపురీషములును నేత్రములును కలవాడై తాపము, దప్పి, జ్వరము, పురీషము పల్చనై వెడలుట, శరీరము మిగుల పసుపురంగు కల్గియుండుట యీ లక్షణములతో కూడి యుండును.

## కఫజపాండులక్షణము

శ్లో॥ కఫప్రసేకశ్వయథుతన్ద్రాలస్యాతిగౌరవైః।
పాణ్డురోగీ కఫాచ్ఛుక్లైస్త్వఙ్మూత్రనయనాననైః॥౯॥

తా॥ కఫముచే గల్గిన పాండురోగమునందు నోట కఫము వెడలుట, వాపు, కునికిపాటు, అలసత్వము, శరీరము భారముగా నుండుట, త్వక్కు మూత్రము నేత్రములు ముఖము ఇవి శుక్లవర్ణంబులై యుండుట, ఈ లక్షణములు కల్గును.

## సన్నిపాతజపాండురోగలక్షణము

శ్లో॥ జ్వరారోచకహృల్లాస ఛర్దితృష్ణాక్లమాన్వితః॥
పాండురోగీ త్రిభిర్దోషైస్త్యాజ్యః క్షీణో హతేన్ద్రియః॥౭॥

తా॥ త్రిదోషసన్నిపాతముచే జనించిన పాండురోగముకల మనుజునకు జ్వరము, అరుచి, హృల్లాసము, వాంతి, దప్పి, బడలిక, బలక్షయము, ఇంద్రియ దౌర్బల్యము, ఈ యుపద్రవములు కల్గినయెడ ఆ వ్యాధి కుదరదు గాన వానికి చికిత్స జేయంజనదని భావము. మరియు సన్నిపాత పాండురోగలక్షణం బీరీతిగ చరకమున నున్నది: "సర్వాన్న సేవినస్సర్వే దుష్టా దోషాస్త్రిదోషజమ్। త్రిలిఙ్గం సంప్రకుర్వన్తి పాండురోగం సుదుస్సహమ్" నానావిధంబులగు అన్నములను భుజించు మనుజులకు వాతాదిదోషములన్నియు ప్రకుపితంబులై వాతాదులచే జనించిన పాండురోగములకు వెవ్వేరుగ గల లక్షణములతో గూడిన పాండురోగమును కల్గించునని యు, ఇదియే సన్నిపాతజ పాండురోగమనియు భావము.

## మృద్భక్షణజనితపాండురోగసంప్రాప్తి

శ్లో॥ మృత్తికాదనశీలస్య కుప్యత్యన్యతమోఽమలః।
కషాయా మారుతం పిత్తమూషరా మధురా కఫమ్॥౮॥
కోపయేన్మృదరసాదీంశ్చ రౌక్ష్యాద్భుక్తం చ రూక్షయేత్।
పూరయత్యవిపక్వైవ స్రోతాంసి నిరుణద్ధ్యపి॥౯॥
ఇన్ద్రియాణాం బలం హత్వా తేజోవీర్యౌజసీ తథా।
పాణ్డురోగం కరోత్యాశు బలవర్ణాగ్నినాశనమ్॥౧౦॥

తా॥ ఎల్లప్పుడు మృత్తికాభక్షణము చేయువాని శరీరమునందు వాతాదులలో నొకటి దుష్టంబగును. అందు కషాయరసము కల మృత్తికను భక్షించినయెడ వాతంబును, చౌటి మన్నును తినినయెడ పిత్తంబును, మధురరసముకల మృత్తికను భక్షించినయెడ కఫంబును ప్రకోపము నొందును. మరియు నా భుజించబడిన మృత్తిక రసాదిసప్తధాతువులను కోపింపజేసి రూక్షంబగుటచేత రూక్షంబులుగ జేయును. అయ్యది పక్వంబుగాకనే రసవహాది స్రోతస్సులను నిండించి యడ్డగించుచు చక్షురాదీన్ద్రియములయొక్క బలమును నశింపంజేసి తేజస్సును వీర్యమును ఓజస్సును హరించి శరీరబలమును వర్ణమును జఠరాగ్నిని నశింపజేసి పాండురోగమును కల్గించును.

మృద్భక్షణజనిత పాండురోగలక్షణము

శ్లో॥ శూనాక్షికూటగణ్డభ్రూః శూనపాన్నాభిమేహనః॥
క్రిమికోష్ఠోఽతిసార్యేత మలం సాసృక్కఫాన్వితమ్॥౧౧॥

తా॥ నేత్రగోళము, గణ్డస్థలము, కనుబొమలు, నాభి, మేఢ్రము, ఈస్థలములయందు వాపు కల్గుట, కోష్ఠమునందు క్రిములు జనించుట, రక్తకఫములతోగూడిన మలము విశేషముగ పలుమారు వెడలుట, ఇట్టి లక్షణములు కల్గినయెడ మృత్తికాభక్షణముచే జనించిన పాండురోగమని యెరుంగునది.

అసాధ్యపాండురోగలక్షణములు

శ్లో॥ పాండురోగశ్చిరోత్పన్నః ఖరీభూతో న సిధ్యతి।
కాలప్రకర్షాచ్ఛూనానాం యో వా పీతాని పశ్యతి॥౧౨॥

తా॥ చిరకాలమునకుమున్ను జనించిన పాండురోగము కాలాధిక్యముచే స్థిరంబై యుండును గాన నా వ్యాధి కుదరదు. మరియు పాండురోగమునందు వాపు కల్గి మలమూత్రశరీరాదులు పచ్చనై దృశ్యపదార్థములన్నియు పచ్చగ కనబడుచున్నయెడ ఆ పాండువ్యాధి నివర్తించదు.

మరికొన్ని యసాధ్యపాండులక్షణములు

శ్లో॥ బద్ధాల్పవిట్సహరితం సకఫం యోఽతిసార్యతే।
దీనశ్శ్వేతాతిదిగ్ధాఙ్గశ్ఛర్దిమూర్ఛాతృడర్దితః॥౧౩॥
సనాస్త్యసృక్క్షయాద్యశ్చ పాణ్డుశ్శ్వేతత్వమాప్నుయాత్।

తా॥ పాండురోగమునందు కఫముతోగూడి పచ్చనిరంగుకల్గి బద్ధంబైనమలము కొంచెముగ పలుమారు స్రవించుచున్నను; పాండురోగి మిగుల బలహీనుండై తెల్లనిరంగుపూసినట్లుండు శరీరముకలవాడై వాంతి మూర్ఛ దప్పి ఈయుపద్రవముతో కూడియున్నను; రక్తక్షయమువలన శరీరంబెల్ల తెల్లనై యున్నను; అట్టి మనుజుండు బ్రతుకడు.

వేరొక అసాధ్యపాండులక్షణము

శ్లో॥ పాణ్డుదన్తనఖో యస్తు పాణ్డునేత్రశ్చ యో భవేత్॥౧౪॥
పాణ్డుసంఘాతదర్శీ చ పాణ్డురోగీ వినశ్యతి।

తా॥ పాండురోగముకల మనుజుండు పాండువర్ణములో కూడిన దన్తములు గోళ్లు నేత్రములు కలవాడై వస్తుజాలములనన్నిటిని పాండువర్ణముగ చూచుచున్నయెడ బ్రతుకడు.

శ్లో॥ అన్తేషు శూనం పరిహీణమధ్యం
మ్లానం తథాఽన్తేషు చ మధ్యశూనమ్॥౧౫॥
గుదే చ శేఫస్యథ ముష్కయోశ్చ
శూనం ప్రతామ్యన్తమసంజ్ఞకల్పమ్॥

వివర్జయేత్పాణ్డుకినం యశోఽర్థీ
తథాతిసారజ్వరపీడితం చ ॥౧౬॥

తా॥ పాండురోగము కలవానికి దేహమున కంతంబులగు హస్తపాదశిరస్సులయందు వాపు కల్గి శరీరమధ్యము కృశించియున్నను, మధ్యభాగమునందు వాపుకల్గి హస్తపాదశిరస్సులయందు కృశత్వము కల్గినను, గుదమేఢ్రవృషణములయందు వాపు కల్గి శరీరమున ప్రజ్ఞలేక మృతునిభంగి మూర్ఛనొంది యున్నను, జ్వరాతిసారములచే పీడితుండైనను, యశస్సును కోరువైద్యుండు ఆ రోగిని చికిత్సచేయక వదలిపెట్టవలెను. ఈలక్షణములు కల పాండురోగము అసాధ్యంబని భావము.

## కామలానిదానలక్షణములు

శ్లో॥ పాణ్డురోగీ తు యోఽత్యర్థం పిత్తలాని నిషేవతే।
తస్య పిత్తమసృఙ్మాంసం దగ్ధ్వా రోగాయ కల్పతే॥౧౭॥
హారిద్రనేత్రస్స భృశం హారిద్రత్వఙ్నఖాననః
రక్తపీతశకృన్మూత్రో భేకవర్ణో హతేన్ద్రియః॥౧౮॥
దాహావిపాకదౌర్బల్యసదనారుచికర్శితః॥
కామలాబహుపిత్తైషా కోష్ఠశాఖాశ్రయా మతా॥౧౯॥

తా॥ పాండురోగము కల మనుజుండు పిత్తవృద్ధికరంబులైన పదార్థములను విశేషముగ సేవించినయెడ పిత్తము ప్రకుపితంబై రక్తమాంసములను దుష్టములుగ జేసి కామలారోగమును కల్గించును. ఆ రోగమునందు కన్నులు చర్మము గోళ్లు ముఖము ఇవి పచ్చగా నుండుట, మలము రక్తవర్ణంబుగను మూత్రము పచ్చగ నుండుట, శరీరమునందు కప్పయొక్క వర్ణముకలిగియుండుట, చక్షురాదీన్ద్రియములు తమ తమ వ్యాపారంబులైన దర్శనాదులయందు సామర్థ్యము లేకుండుట, తాపము, అజీర్ణము, బలహీనము, కృశత్వము, అరుచి, ఈ లక్షణములు కల్గియుండును. మఱియు, వాగ్భటమునందు "భవేత్పిత్తోల్బణస్యాసౌ పాండురోగాదృతేఽపిచ" అని యుండుటంజేసి యా రోగము పాండురోగము లేకున్నను పిత్తప్రకృతి కల మనుజుండు పిత్తవృద్ధికరంబులగు పదార్థములను సేవించినను కల్గునని యెరుంగునది. మరియు నీ కామలారోగము ప్రబలమైన పిత్తము కల్గి యుండును. కోష్ఠము నాశ్రయించియు రక్తాదిధాతువుల నాశ్రయించియు రెండుతెరంగులై యుండును.

## కుమ్భకామలాలక్షణము

శ్లో॥ కాలాన్తరాత్ఖరీభూతా కృచ్ఛ్రాస్యాత్కుమ్భకామిలా।

తా॥ మున్ను వచించిన కామలారోగమును చికిత్సజేయక ఉపేక్షించినయెడ కొంతకాలమునకు మిగుల కఠినంబై కోష్ఠము నాశ్రయించియుండును; ఈయది కుమ్భసదృశమైన కోష్ఠము నాశ్రయించి యుండుటంజేసి కుమ్భకామల యనందగు. ఇది కృచ్ఛ్రసాధ్యంబై యుండును.

## అసాధ్యకామలా లక్షణములు

శ్లో॥ కృష్ణపీతశకృన్మూత్రో భృశం శూనశ్చ మానవః॥౨౦॥
సరక్తాక్షి ముఖచ్ఛర్దివిణ్మూత్రో యశ్చ తామ్యతి।
దాహారుచితృడానాహ తన్ద్రామోహసమన్వితః॥౨౧॥
నష్టాగ్నిసంజ్ఞః క్షిప్రం హి కామలావాన్విపద్యతే।

తా॥ మలమూత్రములు నల్లగనైనను లేక పచ్చని రంగు కల్గియైనను నుండుట, వాపు మిగుల నధికమై యుండుట, నేత్రములు ముఖము వాంతి మలమూత్రములు ఇవి రక్తముతోకూడియుండి మూర్ఛజనించుట, ఈలక్షణములును; తాపము, అరుచి, దప్పి, కడుపుబ్బరము, కునికిపాటు, మూర్ఛ,యీ యుపద్రవములతో గూడి జఠరాగ్ని నశించి మైమరచి యుండుట, యీ లక్షణములును కామలారోగము కలవానికి జనించినయెడ మరణము నొందును. అసాధ్యంబనిభావము.

## అసాధ్య కుమ్భకామలాలక్షణము

శ్లో॥ ఛర్ద్యరోచకహృల్లాసజ్వరక్లమనిపీడితః॥౨౨॥
నశ్యతి శ్వాసకాసార్తోవిడ్భేదీ కుమ్భకామలీ।

తా॥ వాంతి, అరోచకము, హృల్లాసము, జ్వరము, బడలిక, శ్వాసకాసములు, మలము ఖండములై వెడలుట, యీ లక్షణములు కుమ్భకామలాజాడ్యము కలవానికి జనించినయెడ మరణము నొందును.

## హలీమకలక్షణము

శ్లో॥ యదాతు పాణ్డోర్వర్ణస్స్యాద్ధరితశ్యావపీతకః॥౨౩॥
బలోత్సాహక్షయస్తన్ద్రా మన్దాగ్నిత్వం మృదుజ్వరః।
స్త్రీష్వహర్షోఽఙ్గమర్దశ్చ దాహస్తృష్ణారుచిర్భ్రమః॥౨౪॥
హలీమకం తదా తస్య విద్యాదనిలపిత్తతః।



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
పాణ్డురోగ కామలా కుమ్భకామాలా
హలీమక దానం సమాప్తమ్



తా॥ పాండురోగమునందు శరీరవర్ణము పచ్చగనైనను శ్యామలంబుగనైనను పీతంబుగనైన నుండుట, శరీరమునందలి బలంబును ఉత్సాహంబును నశించుట, కునికిపాటు, అగ్నిమాన్ద్యము, సూక్ష్మమైన జ్వరము, స్త్రీసంభోగమునం దిచ్ఛలేకుండుట, అవయవములు నొచ్చుట, తాపము, దప్పి, అరుచి, భ్రమము, ఈ గుణములు పాండురోగమునందు వాతపిత్త ప్రకోపముచే జనించిన యెడ హలీమకం బను వ్యాధి యని యెరుంగునది. మరియు వాగ్భటమునందు "లోఢరం తం హలీమకమ్। అలసంచేతి శంసంతి" అని యుండుటచేత నీ హలీమకమును మతాన్తరములయందు లోఢరంబనియు అలసంబనియు నామాన్తరములచే వ్యవహరించెదరని యెరుంగునది.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేద విద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యస్వామాయ రామకృష్ణార్యతనూభవ సకల సహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానార్థతాత్పర్యము
నందు పాణ్డురోగ కామలా
కుమ్భకామలా హలీ
మక నిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# రక్తపిత్తనిదానమ్



రక్తపిత్తం బను వ్యాధి పాండురోగమువలెనే పిత్తప్రధానరోగంబు గాన పాండురోగనిదానము చెప్పిన పిదప రక్తపిత్తనిదానమును చెప్పుట.



శ్లో॥ ఘర్మవ్యాయామశోకాధ్వవ్యవాయైరతిసేవితైః
తీక్ష్ణోష్ణైః క్షారలవణైరమ్లైః కటుభిరేవ చ ॥౧॥
పిత్తం విదగ్ధం స్వగుణైర్విదహత్యాశు శోణితమ్।
తతః ప్రవర్తతే రక్తం ఊర్ధ్వంచాధో ద్విధాపి వా॥౨॥
ఊర్ధ్వం నాసాక్షికర్ణాస్యైర్మేఢ్రయోనిగుదైరధః।
కుపితం రోమకూపైశ్చ సమస్తైస్తత్ప్రవర్తతే॥౩॥

తా॥ ఎండలో సంచరించుట, దేహపరిశ్రమము, దుఃఖము, త్రోవనడచుట, స్త్రీసంభోగము, ఈ పనుల నధికముగ జేయుట, తీక్ష్ణవీర్యము కల మిరియాలు మున్నగు పదార్థములను మిగుల వేడిగనుండు పదార్థములను క్షార లవణ అమ్ల కటురసములు కల పదార్థములను భుజించుట, ఈ కారణములచే పిత్తము ప్రకుపితంబై తీక్ష్ణాదిస్వగుణములచేత రక్తమును శీఘ్రముగ ప్రకోపింపజేయును. పిమ్మట ప్రకుపితమైన రక్తము ద్రవరూపమైన పిత్తముతో గూడి ఊర్ధ్వముఖంబుగనైనను అధోముఖంబుగనైనను ఉభయముఖంబులుగనైనను బైలువెడలును. అందు ఊర్ధ్వముఖముగ వెడలు రక్తము నాసికాద్వారములు కన్నులు చెవులు నోరు ఈ రంధ్రములనుండి స్రవించును. అధోమార్గమున వెడలు రక్తము మేఢ్రయోనిగుదరంధ్రములనుండి స్రవించును. మరియు నా పిత్తం బధికముగ ప్రకుపితంబైనపుడు రోమరంధ్రములయందెల్ల రక్తము స్రవించును. ఇచ్చట ప్రకుపితంబులైన రక్తపిత్తములు రెండును శరీరమున వ్యాపించి బైలువెడలుటంజేసి రక్తపిత్తంబని వ్యవహరించబడునని యెరుంగునది.

ఈ విషయమై వాగ్భటమునందు "కుపితం పిత్తలైః పిత్తద్రవం రక్తంచ మూర్ఛతే। తే మిథస్తుల్యరూపత్వమాగమ్య వ్యాప్నుతస్తనుమ్॥" అనియున్నది. పిత్తవృద్ధికరంబులైన యాహారాదులచే పిత్తంబును రక్తంబును ప్రకుపితంబులై ఒండొంట సమానరూపమునొంది శరీరమునందు వ్యాపించును అని యర్థము.

## రక్తపిత్తపూర్వరూపములు

శ్లో॥ సదనం శీతకామిత్వం కణ్ఠధూమాయనం వమిః।
లోహగన్ధిశ్చ నిశ్వాసో భవత్యస్మిన్భవిష్యతి॥౪॥

తా॥ శరీరము కృశించుట, చల్లదనమును కోరుట, కంఠమున పొగవెడలునట్లుండుట, వాంతి, నిట్టూర్పుగాలి ఇనుము మొదలగు లోహములయొక్క వాసన గల్గియుండుట, ఇవియన్నియు రక్తపిత్తము జనించుటకుమున్ను కల్గు పూర్వరూపములు.

## కఫవాతములచే జనించిన రక్తపిత్తలక్షణము

శ్లో॥ సాన్ద్రం సపాణ్డు సస్నేహం పిచ్ఛిలం చ కఫాన్వితమ్।
శ్యావారుణం సఫేనం చ తనురూక్షం చ వాతికమ్॥౫॥

తా॥ కఫముచే జనించిన రక్తపిత్తమునందు రక్తము చిక్కనై కొంచెము పాండువర్ణము కల్గినదియు, జిడ్డు కల్గినదియు, పిచ్ఛిలంబునై యుండును. వాతముచే జనించిన రక్తపిత్తమునందు శ్యామారుణవర్ణంబును నురుగుతో కూడినదియు పలచనైనదియు రూక్షంబునై యుండును.

## పిత్తముచే జనించిన రక్తపిత్తలక్షణము

శ్లో॥ రక్తపిత్తం కషాయాభం కృష్ణం గోమూత్రసన్నిభమ్।
మేచకాగారధూమాభం అఞ్జనాభం చ పైత్తికమ్॥౬॥

తా॥ రక్తపిత్తము కషాయముతో సమానమైన వర్ణము కల్గియున్నను, నల్లనిరంగు కల్గియున్నను, గోమూత్రమును బోలియున్నను, మేచకవర్ణం (నల్లనిరంగు) బైనను, కఱిదూపమువలె నున్నను, కాటుకవలె నున్నను, పిత్తముచే జనించినది యని యెరుంగునది.

ఇచ్చట రక్తపిత్తము పిత్తప్రధానంబు గాన పిత్తములేక జనించుట లేదు; ఐనను ఆలోచక రంజక సాధక పాచక భ్రాజకంబులను నైదువిధములైన పిత్తములలో రక్తపిత్తమును కల్గించు పిత్తము స్వస్థానమునుండి వేఱొండుస్థానమునుండు పిత్తముతో గలిసి యైనను లేక వాతకఫములతో సంబంధములేకనే పిత్తము మాత్రంబైనను రక్తపిత్తమును కల్గించినచో నయ్యది పిత్తజరక్తపిత్తంబని యెరుంగునది.

## ద్వన్ద్వజరక్తపిత్తలక్షణములు

శ్లో॥ సంసృష్టలింగం సంసర్గా త్త్రిలిఙ్గం సాన్నిపాతికమ్।
ఊర్ధ్వగం కఫసంసృష్టం అధోగం పవనానుగమ్॥౭॥
ద్విమార్గం కఫవాతాభ్యాం ఉభాభ్యామనువర్తతే।

తా॥ దోషములకు వేర్వేరుగ జెప్పిన లక్షణములలో రెండేసిదోషములయొక్క లక్షణములతో గూడి యున్న యెడ సంసర్గజ (రెండుదోషములయొక్క సంబంధముచే బుట్టిన) రక్తపిత్తమనియు, దోషత్రయలక్షణములతోగూడి యున్నయెడ త్రిదోషజరక్తపిత్త మనియు నెరుంగునది.

కఫముతోకూడిన రక్తపిత్తము ఊర్ధ్వమార్గముగ వెడలును. వాతముతోచేరిన రక్తపిత్తము అధోమార్గముగ వెడలును. కఫవాతములతోచేరిన రక్తపిత్తముఊర్ధ్వాధోమార్గముల రెంటియందును వెడలును.

## సాధ్యాసాధ్యరక్తపిత్తలక్షణము

శ్లో॥ ఊర్ధ్వం సాధ్య మధోయాప్యం అసాధ్యం యుగపద్గతమ్॥౮॥
ఏకమార్గం బలవతో నాతివేగం నవోత్థితమ్।
రక్తపిత్తం సుఖే కాలే సాధ్యం స్యాన్నిరుపద్రవమ్॥౯॥
ఏకదోషానుగం సాధ్యం ద్విదోషం యాప్యముచ్యతే।
యత్త్రిదోషమసాధ్యం స్యాన్మన్దాగ్నేరతివేగవత్॥౧౦॥
వ్యాధిభిః క్షీణదేహస్య వృద్ధస్యాఽనశ్నతశ్చయత్।

తా॥ ఊర్ధ్వమార్గమననుసరించిన రక్తపిత్తము సాధ్యము. అధోమార్గము ననుసరించినది యాప్యము. మార్గములరెంటి ననుసరించినది యసాధ్యము. మఱియు శరీరము ఇతరవ్యాధులచే పీడింపబడక సుఖముగానుండు సమయమున జనించిన రక్తపిత్తము ఉపద్రవములు లేకున్నయెడ సుఖసాధ్యంబై యుండును. ఒక్కదోషము ననుసరించి యున్నయెడ సాధింపందగును. దోషద్వయముచే జనించినయెడ యాప్యంబగును. త్రిదోషములచే జనించినను, అగ్నిమాన్ద్యముకలవానికి అతితీక్ష్ణముగ జనించినను, ఇతరవ్యాధులచే క్షీణుండగు వానికి తీవ్రముగ జనించినను అరుచి మొదలగువానిచే నన్నమును భుజించక నున్నవానికి జనించినను, అట్టి రక్తపిత్తము సాధ్యంబు కాదు.

## రక్తపిత్తోపద్రవములు

శ్లో॥ దౌర్బల్యశ్వాసకాసజ్వరవమథుమదాః పాణ్డుతాదాహమూర్ఛాః
భుక్తే ఘోరోవిదాహస్త్వధృతిరపి సదా హృద్యతుల్యా చ పీడా।
తృష్ణా కోష్ఠస్య భేదశ్శిరసి చ తపనం పూతినిష్ఠీవనత్వమ్
భక్తద్వేషాఽవిపాకౌ వికృతిరపి భవేద్రక్తపిత్తోపసర్గాః॥౧౧॥

తా॥ శరీరమున బలములేకపోవుట, శ్వాసకాసములు, జ్వరము, వాంతి, మత్తిల్లియుండుట, శరీరము తెల్లబారియుండుట, తాపము, మూర్ఛ, భుజించినపిదప క్రూరమైనతాపము కల్గుట, ధైర్యము లేకుండుట, హృదయమునం దెల్లప్పుడు నోరువరాని బాధ గల్గియుండుట, దప్పి, మలవిసర్జనకాలమున కోష్ఠమునందు బాధకల్గుట, శిరంబున తాపముగల్గుట, దుర్గంధయుక్తముగ నుమియుట, అన్నద్వేషము, అజీర్ణము, ఈ వికారములన్నియు రక్తపిత్తమునకు సంబంధించిన ఉపద్రవములని యెరుంగునది.

## అసాధ్యరక్తపిత్తలక్షణములు

శ్లో॥ మాంసప్రక్షాళనాభం క్వథితమివ చ యత్కర్దమాంభోనిభం వా
మేదఃపూయాస్రకల్పం యకృదివ యది వా పక్వజమ్బూఫలాభమ్।

యత్కృష్ణం యచ్చ నీలం భృశమతికుణపం యత్రచోక్తా వికారా
స్తద్వర్జ్యం రక్తపిత్తం సురపతిధనుషా యచ్చ తుల్యంవిభాతి ॥౧౨॥

తా॥ మాంసమును కడిగిన నీళ్లవలె నుండుట, కుళ్లినట్లుండుట, అడుసునీళ్లవలె నుండుట, మేదస్సువలె నుండుట, చీమువలెనుండుట, రక్తమువలెనుండుట, యకృత్తువంటి రంగు కలిగి యుండుట, పండిన నేరేడుపండువలె నల్లనై నిగనిగలాడుచుండుట, మిగుల నీలవర్ణమై యుండుట, శవమువలె మిగుల దుర్గంధముతో గూడియుండుట, ఇట్టిగుణములతో గూడి రక్తపిత్తము వెడలుచున్నయెడ అట్టి రక్తపిత్తము నివర్తించుటలేదు. మఱియు పూర్వోక్తంబులైన దౌర్బల్యశ్వాసకాసా ద్యుప ద్రవములతో గూడియున్నను ఇంద్రధనుస్సువలె చిత్రవర్ణమై యున్నను అసాధ్యంబని భావము.

శ్లో॥ యేన చోపహతో రక్తం రక్తపిత్తేన మానవః ।
పశ్యేద్దృశ్యం వియచ్చాపి తచ్చాఽసాధ్యమసంశయమ్ ॥౧౩॥
లోహితం ఛర్దయేద్యస్తు బహుశో లోహితేక్షణః ।
లోహితోద్గారదర్శీ చ మ్రియతే రక్తపైత్తికః ॥౧౪॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
రక్తపిత్తనిదానం సమాప్తమ్.



తా॥ రక్తపిత్తముచే పీడితుండగు మనుజుండు చక్షుర్గోచరంబులగు వస్తుజాలమును ఆకసమును రక్తవర్ణముగ జూచినను, ఎఱ్ఱని కన్నులు కలవాడై రక్తమును పలుమారు వాంతి జేయుచున్నను, వస్తువులనన్నింటిని. రక్తవర్ణములుగ జూచుచు రక్తమును వమనముజేయుచున్నను, అట్టి మనుజుండు బ్రతుకుటలేదు. అసాధ్యంబని భావము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిందసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్ర
విరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాండ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానాన్వయతాత్పర్యము
నందు రక్తపిత్తనిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# రాజయక్ష్మక్షతక్షీణనిదానమ్



రాజయక్ష్మరూపములయందు "పిత్తాద్రక్తస్యచాగమః" అని పిత్తముచే రక్తముకూడ వెడలునని చెప్పియుండుటచేత రక్తపిత్తనిదానమును జెప్పినపిదప రాజయక్ష్మనిదానమును చెప్పుట.



## రాజయక్ష్మవిప్రకృష్టకారణములు

శ్లో॥ వేగరోధాత్క్షయాచ్చైవ సాహసాద్విషమాశనాత్ ।
త్రిదోషో జాయతే యక్ష్మా గదో హేతుచతుష్టయాత్ ॥౧॥

తా॥ మలమూత్ర వాతములయొక్క వేగమును నిరోధించుట, రసాదిధాతువులు అతిసంభోగము ఉపవాసము మున్నగు కారణములచే క్షీణంబులగుట, సాహసము, (తనబలమును యోచించక తొందరపడి అధికబలముగలవారితో యుద్ధముజేయుట మొదలగునవి) న్యూనాధికములుగ భుజించుట, ఈ నాల్గుకారణములచే త్రిదోషాత్మకంబగు యక్ష్మ యను వ్యాధి జనించును.

మరియు నీ వ్యాధి శోషంబనియు, క్షయంబనియు, రాజయక్ష్మయనియు నామభేదములచే వ్యవహరించబడును. నామభేదమునకు కారణములు సుశ్రుతమునందు "సంశోషణాద్రసాదీనాం శోష ఇత్యభిధీయతే । క్రియాక్షయకరత్వాచ్చ క్షయ ఇత్యుచ్యతే బుధైః । రాజ్ఞశ్చన్ద్రమసో యస్మాదభూదేష కిలామయః । తస్మాత్తం రాజయక్ష్మేతి కేచిదాహుర్మనీషిణః॥" అని యున్నది. ఈ వ్యాధిచేత రసాదిధాతువులు శుష్కంబులగుటచే శోషంబనియు, చికిత్సాదిక్రియలచే శాన్తినొందక అట్టిక్రియల క్షయము నొందించుటచే క్షయంబనియు, రాజైనచంద్రునకీవ్యాధి జనించుటచే రాజయక్ష్మయనియు వ్యవహరించబడునని భావము. మరియు నీ వ్యాధి "ఏక ఏవ మతశ్శోషస్సన్నిపాతాత్మకోహ్యతః । ఉద్రేకాత్తత్ర లింగాని దోషాణాం నిపతన్తి హి॥" అని సుశ్రుతమునందుండుటచేత వాతాదిదోషత్రయప్రకోపముచే జనించుటచేసి సన్నిపాతాత్మకంబై యొకవిధముగనే యుండునని యెరుంగునది.

## రాజయక్ష్మ సంప్రాప్తి

శ్లో॥ కఫప్రధానైర్దోషైస్తు రుద్ధేషు రసవర్త్మసు।
అతివ్యవాయినో వాఽపి క్షీణే రేతస్యనన్తరాః॥ ౨॥
క్షీయన్తే ధాతవస్సర్వే తతశ్శుష్యతి మానవః।

తా॥ కఫము ప్రధానముగా గల వాత పిత్తములు ప్రకుపితంబులై రసరక్తాదులను వహించు ధమనుల నడ్డగించుటచే రసాదిధాతువులు శరీరమున వ్యాపించక నాయా చోట్లనే క్షీణించును. మరియు స్త్రీసంభోగము నధికముగా చేయుటచేత శుక్రము క్షీణంబై దానంజేసి తక్కిన ధాతువులన్నియు ప్రతిలోమముగ క్షీణించును. పిమ్మట అట్టి రెండు కారణములచేత మానవుడు కృశత నొందును. దీనిని క్షయమని వైద్యనిపుణులు వచించెదరు. అందు మొదలింటి హేతువునందు రసాది ధాతువులు వరుసగా క్షీణించుటచేత అనులోమక్షయంబనియు, రెండవ హేతువునందు తొలుత శుక్రము క్షీణంబై తక్కిన ధాతువులన్నియు తలక్రిందుగా క్షీణించుటంజేసి ప్రతిలోమక్షయంబనియు నెరుంగునది. మరియు చరకమునం దీరీతిగ నున్నది. "రసస్రోతస్సు రుద్ధేషు స్వస్థానస్థో విదహ్యతే। స ఊర్ధ్వం కాసవేగేన బహురూపః ప్రవర్తతే" రసాది ధాతువులు సంచరించు నాడులు శ్లేష్మాది దోషములచే నడ్డగించబడినప్పుడు రసధాతువు స్వస్థానంబైన హృదయమునంజేరి మిగుల సంతప్తంబై కాసముయొక్క వేగముచేత నూర్ధ్వముఖంబై ముఖము నుండి బైలువెడలునని భావము.

ఇచ్చట అనులోమక్షయమునందు రసధాతువు శుష్కంబైనపుడు రసధాతువుచే జనించు రక్తమాంసమేదోస్థిమజ్జశుక్రంబు లను ఆరు ధాతువులును వరుసగా క్షీణంబు లగుననియు, ప్రతిలోమ క్షయమునందు మితిమీరిన స్త్రీసంభోగముచే శుక్రము క్షీణంబగును; దానంజేసి వాతము కుపితంబై మజ్జను శోషింపజేయును. పిమ్మట అగ్నితప్తంబైన ఇనుపముద్దయొక్క స్పర్శముచేత తడిసిన భూమి యెండువిధంబుగ శుష్కంబైన మజ్జసంబంధముచేత అస్థులు క్షీణంబులగును. ఇత్తెరంగున నే మేదస్సు, మాంసము, రక్తము, రసము, అనునవి ఒండొంటి సంబంధముచే క్షీణించుననియు నెరుంగునది.

## రాజయక్ష్మ పూర్వరూపము

శ్లో॥ శ్వాసాఙ్గమర్దకఫసంస్రవతాలుశోష
వమ్యగ్నిసాదమదపీనసకాసనిద్రాః।
శోషే భవిష్యతి భవన్తి స చాపి జన్తుః
శుక్లేక్షణో భవతి మాంసపరో రిరంసుః॥ 3॥
స్వప్నేషు కాకశుకసల్లకినీలకణ్ఠా
గృధ్రాస్తథైవ కపయః కృకలాసకాశ్చ।
తం వాహయన్తి స నదీర్విజలాశ్చ పశ్యే
చ్ఛుష్కాంస్తరూన్పవనధూమదవార్దితాంశ్చ॥ ౪॥

తా॥ శ్వాసము, అవయవములునొచ్చుట, నోట కఫము స్రవించుట, గొంతులు కృశించుట, వాంతి, అగ్నిమాన్ద్యము, మదము, పీనసము, దగ్గు, నిద్ర, ఈ లక్షణములన్నియు క్షయవ్యాధి జనించుటకు మున్ను కల్గు పూర్వరూపములు. మరియు నా మనుజుండు తెల్లని కన్నులు కలవాడై మాంసము దినుటయందు మిక్కిలి యాసగొని ఇంద్రియపుష్టి లేకున్నను వ్యాధిస్వభావముచేత స్త్రీసంభోగమునందు మిక్కిలి యాసగొని యుండును. మరియు నా వ్యాధి జనించుటకు మున్ను మనుజునకు స్వప్నమునందు కాకి, చిలుక, ముండ్లపంది, నెమలి, గెద్ద, కోతులు, తొండ, ఈజంతువులపై తానెక్కినట్లు గానంబడును. మఱియు జలములేని నదులను, ఎండిన వృక్షములను, గాలి, పొగ, కార్చిచ్చు ఈ మూటిచే పీడింపబడిన వృక్షములనుగూడ చూచును.

## రాజయక్ష్మలక్షణము

శ్లో॥ అంసపార్శ్వాభితాపశ్చ సన్తాపః కరపాదయోః।
జ్వరస్సర్వాఙ్గగశ్చేతి లక్షణం రాజయక్ష్మణః॥౫॥

తా॥ భుజశిరస్సులయందును పార్శ్వములయందును మిగుల తాపము కల్గుట, హస్తపాదములయందు మంట, శరీరమునందంతట జ్వరము, యీ మూడులక్షణములు కల్గినది రాజయక్ష్మ యని యెఱుంగునది.

## రాజయక్ష్మరూపములు

శ్లో॥ స్వరభేదోఽనిలాచ్ఛూలం సంకోచశ్చాంసపార్శ్వయోః
జ్వరో దాహోఽతిసారశ్చ పిత్తాద్రక్తస్యచాగమః॥౬॥
శిరసః పరిపూర్ణత్వం అభక్తచ్ఛన్ద ఏవ చ।
కాసః కణ్ఠస్య చోద్ధ్వంసో విజ్ఞేయః కఫకోపతః॥౭॥

తా॥ దోషత్రయప్రకోపముచే జనించిన క్షయమునందు వాతప్రకోపముచేత కంఠస్వరము మారియుండుట, శూలము, భుజశిరస్సులును పార్శ్వములును ముడుచుకొనియుండుట, ఈలక్షణములు కల్గును. జ్వరము, తాపము, అతిసారము, నోట రక్తము వెడలుట, ఈ లక్షణములు పిత్తప్రకోపముచే గల్గును. శిరోభారము, అన్నమునందిచ్ఛలేకుండుట, దగ్గు, కంఠనాళము శిథిలంబగుట ఈలక్షణములు కఫప్రకోపముచే జనించును. క్షయవ్యాధియందు పై జెప్పిన పదునొకండు లక్షణములు వాతాది ప్రకోపముచే కల్గునని భావము.

## అసాధ్యరాజయక్ష్మలక్షణములు

శ్లో॥ ఏకాదశభిరేభిర్వా షడ్భిర్వాపి సమన్వితమ్।
కాసాతీసారపార్శ్వార్తిస్వరభేదారుచిజ్వరైః॥
త్రిభిర్వా పీడితం లిఙ్గైః కాసశ్వాసాసృగామయైః।
జహ్యాచ్ఛోషార్దితం జన్తుం ఇచ్ఛన్సువిమలం యశః॥౮॥

తా॥ పైజెప్పిన స్వరభేదము మున్నగు పదునొకండు రూపంబులతో గూడియున్నను, కాసము, అతిసారము, ప్రక్కలయందు నొప్పి, స్వరభేదము, అరుచి, జ్వరము, ఈ యారురూపములతో గూడియున్నను, దగ్గు, శ్వాసము, నోట రక్తము వెడలుట, ఈ మూడులక్షణములతో గూడియున్నను, అట్టి క్షయవ్యాధికల మనుజుని నిర్మలంబగు యశమును గోరిన వైద్యుండు వదలిపెట్టవలెను. అసాధ్యంబు గాన చికిత్స జేయంజనదని భావము.

మఱియు సుశ్రుతాచార్యుండు రాజయక్ష్మకు పూర్వరూపత్వము నీరీతిగ జెప్పెను; "భక్తద్వేషో జ్వరః శ్వాసః కాసః శోణితదర్శనమ్ । స్వరభేదశ్చ జాయేత షడ్రూపం రాజయక్ష్మణి॥" అన్నద్వేషము, జ్వరము, శ్వాసకాసములు, నోట రక్తము వెడలుట, కంఠస్వరభేదము, ఈ యారురూపంబులును రాజయక్ష్మవ్యాధియందు జనించునని భావము. ఇచ్చట చరకమునందు "వాతవ్యాధిరపస్మారీ కుష్ఠీ బ్రధ్నీ చిరజ్వరీ । గుల్మీ చ మధుమేహీ చ రాజయక్ష్మీ చ యో నరః । అచికిత్స్యా భవన్త్యేతే బలమాంస పరిక్షయాత్" అని చెప్పియుండుటచేత శరీరబలమాంసములు క్షయించి యున్నయెడ రాజయక్ష్మవ్యాధి కల మనుజునకు చికిత్స జేయందగదని యర్థము.

శ్లో॥ సర్వైర్వార్ధైస్త్రిభిర్వాపి లిఙ్గైర్మాంసబలక్షయే ।
యుక్తో వర్జ్యశ్చికిత్స్యస్తు సర్వరూపోఽప్యతోఽన్యథా ॥౧౦॥

తా॥ రాజయక్ష్మ కల మనుజుండు పూర్వోక్తంబులైన పదునొకండు లక్షణములతో గూడియున్నను, ఆరులక్షణములతో గూడియున్నను, మూడులక్షణములతో గూడియున్నను, శరీరమునందలి మాంసబలములు క్షీణంబులై యున్నయెడ చికిత్స జేయం జనదు. బలమాంసములు నశించకున్నయెడ పదునొకండు రూపములు గల్గియున్నను చికిత్స జేయంపగును.

శ్లో॥ మహాశనం క్షీయమాణం అతిసారనిపీడితమ్ ।
శూనముష్కోదరం చైవ యక్ష్మిణం పరివర్జయేత్ ॥౧౧॥
శుక్లాక్షమన్నద్వేష్టారం ఊర్ధ్వశ్వాసనిపీడితమ్ ।
కృచ్ఛ్రేణ బహుమేహన్తం యక్ష్మా హన్తీహ మానవమ్ ॥౧౨॥

తా॥ అధికముగా భుజించినను బలమునశించి శరీరము కృశించుచున్నను, అతిసారముకల్గినను, ఉదరమునందును అండకోశమునందును వాపు కల్గినను, కన్నులు తెల్లనై యున్నను, అన్నద్వేషము కల్గినను, ఊర్ధ్వశ్వాసముచే మిగుల బాధకల్గినను, మిగులకష్టముచే నధికముగా మూత్రమును విసర్జించినను, రాజయక్ష్మవ్యాధి మానవుని మరణము నొందించును.

### సాధ్యరాజయక్ష్మలక్షణములు

శ్లో॥ జ్వరానుబన్ధరహితం బలవన్తం క్రియాసహమ్ ।
ఉపక్రమేదాత్మవన్తం దీప్తాగ్నిమకృశన్నరమ్ ॥౧౩॥

తా॥ జ్వరబాధ లేనివాఁడును, శరీరబలయుక్తుండును, చికిత్సాక్రియల నోరువఁగలవాఁడును, జితేన్ద్రియుండును, దీప్తమైన జాఠరాగ్ని కలవాఁడు నైన యక్ష్మరోగిని చికిత్స జేయఁదగును.

### వ్యవాయాది జనితక్షయలక్షణములు

శ్లో॥ వ్యవాయ శోక వార్ధక్య వ్యాయామాధ్వ ప్రశోషితాన్ ।
వ్రణోరఃక్షతసంజ్ఞౌ చ శోషిణౌ లక్షణైశ్శృణు ॥౧౪॥

తా॥ స్త్రీసంభోగము, శోకము, ముసలితనము, దేహపరిశ్రమము, మార్గాయాసము, వ్రణము, ఉరఃక్షతము, అను నీకారణములచే జనించిన క్షయముల లక్షణములను వేర్వేరుగ వివరించెదనని యర్థము.

మరియు సుశ్రుతమునందు "కేషాఞ్చిదేవ శోషో హి లక్షణైర్భేదమాగతః । నతు త్రిదోషలిఙ్గానాం సమస్తానాన్నిపాతనమ్ । క్షయా ఏవ హి తే జ్ఞేయాః కేవలం ధాతుసంజ్ఞితాః" అని యున్నది. దోషత్రయలక్షణములు లేక కొన్ని లక్షణములు కానంబడుచున్నయెడ అవి ధాతుక్షయములని చెప్పంబడును గాని యక్ష్మ యను పేరు వానికి లేదని భావము. ఈ ప్రమాణముచేత స్త్రీసంభోగాదులచే నైన ధాతుక్షయము క్షయమనంబడును గాని రాజయక్ష్మ యనం జనదని భావము.

### వ్యవాయశోషి లక్షణము

శ్లో॥ వ్యవాయశోషీ శుక్రస్య క్షయలిఙ్గైరుపద్రుతః ।
పాణ్డుదేహో యథాపూర్వం క్షీయన్తే చాస్యధాతవః ॥౧౫॥

తా॥ స్త్రీసంభోగము నధికముగ జేయుటచే గల్గిన క్షయము వ్యవాయశోషం బనందగు; ఆ వ్యాధి కల మనుజుండు శుక్రక్షయముచే గల్గు చిహ్నములచే నుపద్రవము నొందిన వాడును, తెల్లని దేహము కలవాడునై యుండును. శుక్రము మొదలుజేసి రసపర్యంతము లైన ధాతువులన్నియు ప్రతిలోమముగ నొకొక్కటి నానాట క్షీణించును. ఇచ్చట సుశ్రుతమునం జెప్పిన మేఢ్రవృషణముల యందు వేదన, బలహీనము, సంభోగసమయమున చిరకాలమునకు శుక్రము స్రవించుట, ఇవి మొదలగు శుక్రక్షయలక్షణముల నెరుంగునది.

### శోకశోషాది లక్షణములు

శ్లో॥ ప్రధ్యానశీలస్స్రస్తాఙ్గశ్శోకశోష్యపి తాదృశః ।
జరాశోషీ కృశో మన్దవీర్యబుద్ధిబలేన్ద్రియః ॥౧౬॥
కమ్పనోఽరుచిమాన్భిన్న కాంస్యపాత్రహతస్వరః ।
ష్ఠీవతి శ్లేష్మణా హీనం గౌరవారతిపీడితః ॥౧౭॥
సంప్రస్రుతాస్యనాసాక్షిశ్శుష్కరూక్షమలచ్ఛవిః ।
అధ్వశోషీ చ స్రస్తాఙ్గస్సంభృష్టపరుషచ్ఛవిః ॥౧౮॥

తా॥ దుఃఖముచే జనించిన క్షయముకల మనుజుండు ఎల్లప్పుడు చింతించుచుండువాడును, శిథిలంబులైన అవయవములు కలవాడును, శుక్రక్షయముదక్క తక్కిన పాండుత్వాది లక్షణములతో గూడినవాడునై యుండును. ముసలితనముచే జనించిన క్షయముకల్గిన మనుజునకు కృశత్వము, వీర్య బుద్ధి బలములు మందంబులగుట, వణకు, అరుచి, పగిలిన కంచుపాత్రను వాయించినయెడ మ్రోయుచందంబున కంఠధ్వని గల్గియుండుట, శ్లేష్మములేకనే ఉమియుట, శరీరభారము, అరతి, నోటియందును నాసికయందును నేత్రములయందును నీరు వెడలుట, గట్టిగను రూక్షంబుగను మలము వెడలుట, దేహకాన్తి నశించుట, ఈ లక్షణములు కల్గును. అవయవబంధములు సడలియుండుట, వేపుడుగింజవలె కర్కశమైన శరీరము కల్గియుండుట, ఈ లక్షణములు త్రోవ నడచుటచే జనించిన క్షయముకలవానికి జనించును.

వ్యాయామశోష లక్షణము

శ్లో॥ వ్యాయామశోషీ భూయిష్ఠం ఏభిరేవ సమన్వితః ।
లిఙ్గైరురఃక్షతకృతైస్సంయుక్తశ్చ క్షతం వినా ॥౧౯॥

తా॥ దేహపరిశ్రమముచే జనించిన క్షయము కల మనుజునకు అధ్వశోషమునం జెప్పిన ప్రస్తాంగాదిలక్షణములే మిక్కిలి యధికముగా నుండును. మరియు ఉరఃక్షతశోషమునం జెప్పబడు లక్షణములు ఉరఃక్షతము లేకనే జనించును.

వ్రణశోష లక్షణము

శ్లో॥ రక్తక్షయాద్వేదనాభిస్తథైవాహారయన్త్రణాత్ ।
వ్రణితస్య భవేచ్ఛోషః స చాసాధ్యతమో మతః ॥౨౦॥

తా॥ వ్రణము కల మనుజునకు రక్తక్షయము, వ్రణవేదనలు, ఆహారము లేకుండుట, ఈ కారణములచే క్షయము గల్గును. అట్టి క్షయము మిగుల నసాధ్యంబై యుండును. ఇచ్చట వ్రణముచే కృశించినవారికి సుశ్రుతమున జెప్పిన బృంహణీయౌషధసేవనము స్వల్పమైన క్షయమునకు జెప్పినది గాన వ్రణమునందు క్షయం బధికముగా జనించినయెడ నసాధ్యంబగునని యెరుంగునది.

ఉరఃక్షత లక్షణము

శ్లో॥ ధనుషాఽఽయస్యతోఽత్యర్థం భారముద్వహతో గురుమ్ ।
యుధ్యమానస్య బలిభిః పతతో విషమోచ్చతః ॥౨౧॥
వృషం హయం వా ధావన్తం దమ్యం వాఽన్యం నిగృహ్ణతః ।
శిలాకాష్ఠాశ్మనిర్ఘాతాన్ క్షిపతో నిఘ్నతః పరాన్ ॥౨౨॥
అధీయానస్య వాఽత్యుచ్చైః దూరం వా వ్రజతో ద్రుతమ్ ।
మహానదీర్వా తరతో హయైర్వా సహ ధావతః ॥౨౩॥
సహసోత్పతతో దూరం తూర్ణం వాఽపి ప్రనృత్యతః ।
తథాఽన్యైః కర్మభిః క్రూరైః భృశమభ్యాహతస్య వా ॥౨౪॥

విక్షతే వక్షసి వ్యాధిః బలవాన్సముదీర్యతే ।
స్త్రీషు చాఽతిప్రసక్తస్య రూక్షాల్పప్రమితాశినః ॥౨౫॥
ఉరో విరుజ్యతేఽత్యర్థం భిద్యతేఽథ విభజ్యతే ।
ప్రపీడ్యేతే తతః పార్శ్వే శుష్యత్యఙ్గం ప్రవేపతే ॥౨౬॥
క్రమాద్వీర్యం బలం వర్ణో రుచిరగ్నిశ్చ హీయతే ।
జ్వరో వ్యథా మనోదైన్యం విడ్భేదాఽగ్నివధావపి ॥౨౭॥
దుష్టశ్శ్యావస్సుదుర్గన్ధః పీతో విగ్రథితో బహుః ।
కాసమానస్య చాఽభీక్ష్ణం కఫస్సాసృక్ప్రవర్తతే ॥౨౮॥
స క్షతీ క్షీయతేఽత్యర్థం తథా శుక్రౌజసోః క్షయాత్ ।

తా॥ చిరకాలము ధనుస్సుచే బాణముల ప్రయోగించుటవలన శ్రమనొందియుండుట, మిగుల నధికమగు భారమును మోచుట, అధికబలముగలవారితో యుద్ధము చేయుట, మిట్టపల్లములుగా నుండు స్థలమునుండియు ఉన్నతంబైన స్థలమునుండియు పడుట, పరుగిడుచున్న వృషభమునైనను గుఱ్ఱమునైనను బలవంతముచే బట్టుకొనుట, మదించినయేనుగ మొదలగు బలిష్ఠంబులగు జంతువుల నెదుర్కొని పట్టుట, పెద్దరాయి కట్టెలు ఒడిశలరాయి వీనిని విసిరివేయుట, ఇతరులను కొట్టుట, మిగుల గట్టిగా జదువుట, మిగుల దూరము పరుగులిడుట, గొప్పనదులయం దీదుచు దాటుట, గుఱ్ఱములతోగూడి పరుగులిడుట, మిగుల దూరమునుండి వేగముగ నెగరి దుముకుట, అతివేగముగ నృత్యము చేయుట, స్త్రీలయం దత్యాసక్తితో నధికముగ సంభోగము చేయుట, మిగుల రూక్షంబైన యాహారమును భుజించుట, స్వల్పముగా భుజించుట, ఇట్టి కారణములచేతను మిగుల క్రూరంబులైన మల్లయుద్ధము మొదలగు పనులచేతను రొమ్మునం దభిఘాతముకల్గి దానంజేసి ఉరఃక్షతం బను బలిష్ఠంబైన క్షయము జనించును. ఆ వ్యాధియందు రొమ్ము పగిలిన విధంబుగ నుండుట, రొమ్మునొప్పి, మంట, పీడ, పార్శ్వములు చిక్కిపోవుట, శరీరము వణకుట, వీర్యము బలము శరీరవర్ణము కాన్తి జఠరాగ్ని ఇవి వరుసగా నానాట నశించుట, జ్వరము, వ్యథ, మనంబున దీనత్వము, మలం బధికముగా వెడలుట, అగ్ని నశించుట, ఈ లక్షణములు కల్గును. మరియు నావ్యాధికలమనుజుండు దగ్గినప్పుడు దుష్టంబును, శ్యామవర్ణంబును, దుర్గన్ధయుక్తంబును, పీతవర్ణంబును, కఠినంబునైన కఫము రక్తములోకూడి యధికముగా పలుమారు నోటనుండి బైలువెడలుచుండును. మఱియు నా క్షయము కల మనుజుండు శుక్రౌజస్సులు క్షయించుటచేత మిగుల కృశించును.

ఉరఃక్షతపూర్వరూపము

శ్లో॥ అవ్యక్తలక్షణం తస్య పూర్వరూపమితి స్మృతమ్ ॥౨౯॥

తా॥ మరియు నీ లక్షణములు స్ఫుటముగ కనబడకున్నయెడ పూర్వరూపంబని యెరుంగునది.

క్షతక్షీణములకు సామాన్య లక్షణము

శ్లో॥ ఉరోరుక్ శోణితచ్ఛర్దిః కాసో వై శేషికః క్షతే।
క్షీణే సరక్తమూత్రత్వం పార్శ్వపృష్ఠకటీగ్రహః ॥౩౦॥

తా॥ రొమ్మునొప్పి, రక్తము వమనమగుట, విశేషముగా దగ్గు, ఈ లక్షణములు క్షతమునందు కల్గును. రక్తముతో గూడిన మూత్రము వెడలుట, ఇరుప్రక్కలు కటిస్థలము పృష్ఠము ఇవి యీడ్చుకొని యుండుట, ఈ లక్షణములు క్షయమునందు కల్గును.

సాధ్యాసాధ్యక్షయ లక్షణములు

శ్లో॥ అల్పలిఙ్గస్య దీప్తాగ్నేస్సాధ్యో బలవతో నవః।
పరిసంవత్సరో యాప్యః సర్వలిఙ్గం తు వర్జయేత్ ॥౩౧॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
రాజయక్ష్మ క్షతక్షీణ నిదానం సమాప్తమ్



తా॥ పై చెప్పిన లక్షణములలో కొన్ని లక్షణములున్నను దీప్తంబైన జాఠరాగ్ని కల్గి బలయుక్తుండైనవానికి నూతనముగా జనించినను ఈ క్షతక్షయము సాధ్యంబై యుండును. సంవత్సరము గడచినయెడ యాప్యంబు. సంపూర్ణలక్షణయుక్తంబైనయెడ అసాధ్యంబై యుండును.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యన్వయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానాన్ధ్రితాత్పర్యమునందు
రా జ య క్ష్మ క్ష త క్షీ ణ
నిదానము సమాప్తము.



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# కాసనిదానమ్



కాసము క్షయముయొక్క రూపములో జేరియుండుటచేతను కాసమును ఉపేక్ష చేయుట వలన క్షయము జనించుటచేతను కాసము క్షయమునకు సంబంధించినది గాన క్షయనిదానమును జెప్పినపిదప కాసనిదానము జెప్పబడుచున్నది.



## కాసము జనించుటకు కారణములు

శ్లో॥ ఘూమోపఘాతాద్రసతస్తథైవ
వ్యాయామ రూక్షాన్ననిషేవణాచ్చ ।
విమార్గగత్వాచ్చ హి భోజనస్య
వేగావరోధాత్ క్షవథోస్తథైవ ॥౧॥
ప్రాణో హ్యుదానానుగతః ప్రదుష్టః
సంభిన్నకాంస్యస్వనతుల్యఘోషః ।
నిరేతివక్త్రాత్సహసా సదోషో
మనీషిభిః కాస ఇతి ప్రదిష్టః ॥౨॥

తా॥ పొగ నోటియందును ముక్కునందును ప్రవేశించి శ్వాసము నడ్డగించుట, ఆమరసమును ఊర్ధ్వముగ పీల్చుట, అధికముగ దేహపరిశ్రమమును జేయుట, మిగుల రూక్షంబైన యన్నమును భుజించుట, భుజించిన యాహారము మార్గముదప్పి ఇతరమార్గమున జేరుట, మలమూత్రముల యొక్కయు, తుమ్ములయొక్కయు వేగమును నిరోధించుట, ఈ కారణములచేత దుష్టంబైన ప్రాణవాతము ఉదానవాయువునం గలసి పగిలిన కంచుఘంటయొక్క ధ్వనితో సమానమైన ధ్వని గలిగి కఫపిత్తములతో గూడి నోటనుండి శీఘ్రముగ బైలువెడలును. దానిని పండితులు కాసమని వచించెదరు. ఇచ్చట ''కసతి (కంఠాదూర్ధ్వంగచ్ఛతి)'' అను వ్యుత్పత్తిచేత కంఠమునం దూర్ధ్వముగ సంచరించుటచే కాసమని చెప్పంబడునని యెరుంగునది.

## కాసరోగభేదములు

శ్లో॥ పఞ్చ కాసాః స్మృతా వాతపిత్తశ్లేష్మక్షతక్షయైః।
క్షయాయోపేక్షితాస్సర్వే బలినశ్చోత్తరోత్తరమ్॥ 3॥

తా॥ వాతము, పిత్తము, శ్లేష్మము, క్షతము, క్షయము అను నీ యైదు కారణములచేత జనించుటంజేసి కాసము ఐదువిధంబు లగును. ఈ యైదిటిలో వరుసగ నొకటికన్న నొకటి బలిష్ఠంబై యుండును. మరియు నీ కాసరోగమునకు తగు చికిత్స జేయక నుపేక్ష జేయుటచే రసాదిధాతువులు క్షీణించును.

## కాసరోగ పూర్వరూపములు

శ్లో॥ పూర్వరూపం భవేత్తేషాం శూకపూర్ణగళాస్యతా।
కణ్ఠే కణ్డూశ్చ భోజ్యానామవరోధశ్చ జాయతే॥ ర॥

తా॥ కంఠమునందును నోటియందును ముండ్లునిండినట్లుండుట, కంఠమునందు దురద, అన్నము మొదలగుదానిని మ్రింగ లేకుండుట, ఈ లక్షణములు కాసరోగము జనించుటకు మున్ను కల్గు పూర్వరూపములు.

## వాతజకాసలక్షణము

శ్లో॥ హృచ్ఛఙ్ఖమూర్ధోదరపార్శ్వశూలీ
క్షామాననః క్షీణబలస్వరౌజాః।
ప్రసక్తవేగస్తు సమీరణేన
భిన్నస్వరః కాసతి శుష్కమేవ॥ ౫॥

తా॥ హృదయము కణతలు శిరస్సు ఉదరము పార్శ్వములు ఈస్థలములయందు శూలను జనించుట, ముఖము కృశించుట, బలము కంఠస్వరము ఓజస్సు ఇవి క్షీణంబు లగుట, ఎల్లప్పుడు కాసవేగము అనుసరించి యుండుట, కఫములేక నే దగ్గు వచ్చుట, కంఠధ్వని మారియుండుట; ఈ లక్షణములు కల్గినది వాతముచే జనించిన కాసరోగంబని యెరుంగునది.

## పిత్తజకాసలక్షణము

శ్లో॥ ఉరోవిదాహజ్వరవక్త్రశోషై
రభ్యర్దితస్తిక్తముఖస్తృషార్తః।
పిత్తేన పీతాని వమేత్కటూని
కాసేత్స పాణ్డుః పరిదహ్యమానః॥ ౬॥

తా॥ పిత్తజనితంబైన కాసముచే పీడింపబడిన మనుజుండు రొమ్మురుమంట, జ్వరము, నోరు ఎండుట, నోరు చేదుగనుండుట, ఇట్టి లక్షణములు కలవాడై చేదై యుండు పసరును వమనము చేయును. పసపురంగులో గలిసిన తెల్లని శరీరముకలవాడై సంతాపము నొంది పలుమారు దగ్గుచుండును.

## కఫజకాసలక్షణము

శ్లో॥ ప్రలిప్యమానేన ముఖేన సీదన్।
శిరోరుజార్తః కఫపూర్ణదేహః।
అభక్తరుగ్గౌరవకణ్డుయుక్తః
కాసేద్భృశం సాన్ద్రకఫః కఫేన॥౭॥

తా॥ నోరు జిగటకల్గి యుండుట, తలనొప్పి, శరీరమంతయు కఫముచే నిండియుండుట, అన్నమునందు రుచిలేకుండుట, శరీరము భారముగా నుండుట, దురద కల్గి యుండుట, దగ్గినపుడు కఠినంబైన కఫము పడుట, ఈ లక్షణములుకల్గినది కఫముచే జనించిన కాసరోగమని యెరుంగునది.

## క్షతజకాసలక్షణము

శ్లో॥ అతివ్యవాయభారాధ్వయుద్ధాశ్వగజవిగ్రహైః।
రూక్షస్యోరః క్షతం వాయుర్గృహీత్వాకాసమాచరేత్॥౮॥
స పూర్వం కాసతే శుష్కం తతష్ఠీవేత్సశోణితమ్।
కణ్ఠేన రుజతాఽత్యర్థం విరుగ్ణేనేవ చోరసా॥౯॥
సూచీభిరివ తీక్ష్ణాభిస్తుద్యమానేన శూలినా।
దుఃఖస్పర్శేన శూలేన భేదపీడాభితాపినా॥౧౦॥
పర్వభేదజ్వరశ్వాసతృష్ణావైస్వర్యపీడితః।
పారావత ఇవాకూజన్ కాసవేగాత్క్షతోద్భవాత్॥౧౧॥

తా॥ రూక్షశరీరముకలవానికి మిక్కుటముగ స్త్రీసంభోగము జేయుట, భారమును మోయుట, త్రోవ నడచుట, యుద్ధము జేయుట, ఏనుగులు గుఱ్ఱములు మొదలగువానిని పరువిడునపుడు బలాత్కారముగ బట్టుట, ఈకారణములచే వ్రణంబైన వక్షస్థ్సలమును వాతము గ్రహించి దగ్గును కల్గించును. ఇది క్షతజనితకాసంబని యెరుంగునది; మరియు నీకాసమునందు మొదట పొడి దగ్గు కల్గి అట్టి దగ్గుచేత రొమ్మున నభిఘాతము కల్గి రక్తముతో గూడి యుండిన కఫము నోట వెడలుట, కంఠమునందు వేదన, దగ్గువలన రొమ్ము పగులునట్లుండుట, తీక్ష్ణంబులగు సూదుల బొడిచినట్లు పోటు కల్గుట, హృదయమును స్పృశించినను పగులగొట్టినట్లు నొప్పియు మంటయు గల్గుట, అవయవ సంధులయందు నొప్పి, జ్వరము, శ్వాసము, దప్పి, శరీరము వివర్ణంబగుట, దగ్గుయొక్క వేగము చేత కంఠమునందు పావురములు కూసినట్లు ధ్వనికల్గుట, ఈ లక్షణములన్నియు కల్గును.

## క్షయకాసనిదానము

శ్లో॥ విషమాఽసాత్మ్యభోజ్యాఽతివ్యవాయాద్వేగనిగ్రహాత్।
ఘృణినాం శోచతాం నౄణాంవ్యాపన్నేఽగ్నౌ త్రయో మలాః॥౧౨॥
కుపితాః క్షయజం కాసం కుర్యుర్దేహక్షయప్రదమ్।

తా॥ పరస్పరవిరుద్ధంబులగు పదార్థములను అసాత్మ్యంబులగు పదార్థములను భుజించుట, అధికముగ స్త్రీసంభోగమును జేయుట, మలమూత్రాదులయొక్క వేగమును నిరోధించుట, కరుణచే మిగుల శోకించుచు ఆహారము లేకుండుట, ఈ కారణములచే జఠరాగ్ని నశించును; దానంజేసి వాతాది దోషత్రయము ప్రకుపితంబై ధాతువులను క్షయమునొందజేసి కాసమును కల్గించును; ఇది క్షయజ కాసమని వైద్యులచే వ్యవహరించబడును.

క్ష య జ కా స ల క్ష ణ ము లు

శ్లో॥ సగాత్రశూలజ్వరదాహమోహాన్
ప్రాణక్షయం చోపలభేత కాసీ॥౧౩॥
శుష్యన్వినిష్ఠీవతి దుర్బలస్తు
ప్రక్షీణమాంసో రుధిరం సపూయమ్।
తం సర్వలిఙ్గం భృశదుశ్చికిత్స్యం
చికిత్సితిజ్ఞాః క్షయజం వదన్తి॥౧౪॥

తా॥ శరీరమునందెల్ల నొప్పి, జ్వరము, తాపము, మూర్ఛ, బలక్షయము, ప్రవములేని కఫము నుమియుట, బలము లేకుండుట, శరీరమునందలి మాంసము నశించుట, చీముతోగూడిన రక్తమును నోట గ్రక్కుట, ఇట్టి లక్షణములుగల కాసము క్షయజంబని యెరుంగునది. మరియు నీ వ్యాధి దోషత్రయాలక్షణములతో గూడినదియు చికిత్సకు నసాధ్యంబునై యుండును.

సాధ్యాది కాస లక్షణములు

శ్లో॥ ఇత్యేష క్షయజః కాసః క్షీణానాం దేహనాశనః।
సాధ్యో బలవతాం వా స్యాత్ యాప్యస్త్వేనం క్షతోత్థితః॥౧౫॥
నవౌ కదాచిత్సిధ్యేతామపి పాదగుణాన్వితౌ।
స్థవిరాణాం జరాకాసః సర్వో యాప్యః ప్రకీర్తితః॥౧౬॥
త్రీన్పూర్వాన్ సాధయేత్సాధ్యాన్ పథ్యైర్యాప్యాంస్తు యాపయేత్।



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
కాసనిదానం సమాప్తమ్



తా॥ ఈ చెప్పంబడిన క్షయకాసము క్షీణించిన మనుజునకు జనించినయెడ ప్రాణహానిని కల్గించును. బలము అధికముగా కల్గినవానికి జనించినయెడ సాధ్యంబై యుండును. క్షతముచే గల్గిన కాసము యాప్యంబై యుండును. మరియు క్షయకాసము నూతనముగా జనించి "భిషగ్ద్రవ్యాణ్యుపస్థాతా రోగీ పాదచతుష్టయం" అని శ్రీ వాగ్భటుండు వచించినప్రకారము, (చికిత్సకుడు, ద్రవ్యము, సేవకుడు, రోగి,) అను నీ పాదచతుష్టయముతో గూడియున్నయెడ నొకప్పుడు

సాధింపందగి యుండును. వృద్ధులకు ముసలితనముచే జనించిన నానావిధకాసంబులును యాప్యంబులు. వాతాది దోషములచే మూడు తెరంగులైన కాసములు ఔషధములచే సాధింపవలెను. క్షత క్షయములచే గల్గిన కాసములు పథ్యంబులగు నాహారాదిసేవచే యాప్యంబులని భావము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్ర
విరాజమాన దీవ్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు

కా స ని దా న ము

సమాప్తము.



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# హిక్కాశ్వాసనిదానమ్



కాసమునకును హిక్కాశ్వాసములకును నిదానము తరుచుగ సమానంబై యుండుటంజేసి కాసనిదానమును జెప్పినపిదప హిక్కాశ్వాసములయొక్క నిదానమును వివరించుట.



శ్లో॥ విదాహిగురువిష్టమ్భిరూక్షాభిష్యన్దిభోజనైః।
శీతపానాశనస్థానరజోధూమాతపానిలైః ॥౧॥
వ్యాయామకర్మభారాధ్వవేగాఘాతాపతర్పణైః।
హిక్కా శ్వాసశ్చ కాసశ్చ నృణాం సముపజాయతే॥౨॥

తా॥ మిగుల సంతాపకరంబులైన మిరపకాయలు మున్నగుపదార్థములను గురుపదార్థములను మలబంధకరపదార్థములను రూక్షపదార్థములను అభిష్యందిపదార్థములను భుజించుట, శీతంబులైన యన్నపానాదుల సేవించుట, శీతంబైన స్థలమున వసించుట, ధూళి పొగ మొదలగునవి నాసాదిద్వారములం బ్రవేశించుట, ఎండయందును గాలియందును సంచరించుట, ధనుస్సు నెక్కుపెట్టుట మున్నగు పనుల జేయుట, భారమును మోచుట, మార్గమున నడచుట, మలమూత్రాదివేగముల నిరోధించుట, ఉపవాసము జేయుట, ఇట్టి కృత్యములచేత హిక్క (వెక్కిళ్లు), శ్వాసము, కాసము (దగ్గు), ఈవ్యాధులు మూడును జనించును. ఇచ్చట కాసవ్యాధికని హిక్కాశ్వాసములకును నిదానము సమానంబై యున్నను "వాయుః కఫేనానుగతః పఞ్చ హిక్కాః కరోతి హి" అను సుశ్రుతవచనముచేతను "కఫవాతాత్మకావేతౌ పిత్తస్థానసముద్భవౌ" అను వృద్ధబలవాక్యముచేతను హిక్కాశ్వాసములు కఫము ననుసరించిన వాతముచే జనించుటంజేసియు కాసము పూర్వోక్తప్రకారము వాతపిత్తకఫములచే వెవ్వేరుగ జనించుటంజేసియు వాతాదిదోషకృతభేదంబు కొంచబడచున్నదిగాన కాసనిదానము ప్రత్యేకముగ జెప్పబడినదియని యెరుంగునది.

## హిక్కాసంప్రాప్తి

శ్లో॥ ముహుర్ముహుర్వాయురుదేతి సస్వనో
యకృత్ప్లిహాన్త్రాణి ముఖాదివాక్షిపన్।

సఘోషవానాశు హిన స్త్యసూన్యత
స్తతస్తు హిక్కేత్యభిధీయతే బుధైః॥ ౩॥

తా॥ కంఠమునందలి యుదానవాయువుతో గూడిన ప్రాణవాయువు "హిక్"అను ధ్వనితో గూడి యకృత్ప్లీహములను ప్రేవులను ముఖమునుండి బైలువెడలించుకరణి మాటిమాటికి నూర్ధ్వముఖముగ వెడలుచుండును; అట్టి వాతము అతిశీఘ్రముగ మనుజుల హింసించుటంజేసి హిక్కయని పండితులచే వ్యవహరించబడునని యర్థము. మరియు శాబ్దికులు "హిక్ ఇతి కాయతీతి హిక్కా కైగై శబ్దే" అను వ్యుత్పత్తిచేత హిక్ అను ధ్వనిని కల్గించు వాతము హిక్క యని వచించెదరు.

హి క్కా భే ద ము లు

శ్లో॥ అన్నజాం యమలాం క్షుద్రాం గమ్భీరాం మహతీం తథా।
వాయుః కఫేనానుగతః పంచ హిక్కాః కరోతి హి॥౪॥

తా॥ వాతము కఫముతో గలిసి అన్నజంబనియు, యమళంబనియు, క్షుద్రంబనియు, గమ్భీరంబనియు, మహతి యనియు నైదు విధంబులైన హిక్కలను కల్గించును.

హి క్కా పూ ర్వ రూ ప ము లు

శ్లో॥ కణ్ఠోరసోర్గురుత్వఇ్చ వదనస్య కషాయతా।
హిక్కానాం పూర్వరూపాణి కుక్షేరాటోప ఏవ చ॥౫॥

తా॥ కంఠమునందును రొమ్మునందును భారముగ నుండుట,నోరు వగరై యుండుట,కుక్షిలో గుడ గుడ యను శబ్దము కల్గుట, ఇవి హిక్కారోగము జనించుటకు మున్ను కానంబడు పూర్వరూపములు.

అ న్న జ హి క్కా ల క్ష ణ ము

శ్లో॥ పానాన్నైరతిసంయుక్తైస్సహసా పీడితోఽనిలః।
హిక్కయత్యూర్ధ్వగో భూత్వా తాం విద్యాదన్నజాం భిషక్ ॥౬॥

తా॥ అధికముగ భుజించుటచేతను ఉదకాదులను పానముచేయుటచేతను వాతము పీడితంబై యూర్ధ్వమార్గముగ సంచరించుచు వెక్కిళ్లను కల్గించును. దానిని అన్నజహిక్క యని యెరుంగునది.

య మ ళ హి క్కా ల క్ష ణ ము

శ్లో॥ చిరేణ యమలైర్వేగైర్యా హిక్కా సమ్ప్రవర్తతే।
కమ్పయన్తీ శిరోగ్రీవాం యమలాం తాం వినిర్దిశేత్॥౭॥

తా॥ శిరఃకణ్ఠములను చలింపజేయుచు చిరకాలమునకు రెండేసి వెక్కిళ్లు జంటగా నతివేగముతో గూడి బైలువెడలినయెడ దానిని యమళహిక్క యని యెరుంగునది.

క్షుద్రహిక్కాలక్షణము

శ్లో॥ వికృష్టకాలైర్యా వేగైర్మన్దైస్సమభివర్తతే।
క్షుద్రికా నామ సా హిక్కా జత్రుమూలాత్ప్రధావితా॥౮॥

తా॥ చిరకాలమునకు మన్దవేగముతో గూడి కంఠమూలమునుండి బైలువెడలిన వెక్కిళ్లు క్షుద్రహిక్కయని చెప్పంబడును.

గంభీరహిక్కాలక్షణము

శ్లో॥ నాభిప్రవృత్తా యా హిక్కా ఘోరా గమ్భీరనాదినీ।
అనేకోపద్రవవతీ గమ్భీరా నామ సా స్మృతా॥౯॥

తా॥ వెక్కిళ్లు నాభిస్థానమునుండి వెడలి గంభీరమైన ధ్వనిని కల్గించుచు దప్పి జ్వరము మున్నుగాగల అనేకోపద్రవములతో గూడి భయంకరముగ నున్నయెడ గంభీరహిక్క యని యెరుంగునది.

మహాహిక్కాలక్షణము

శ్లో॥ మర్మాణ్యుత్పీడయన్తీవ సతతం యా ప్రవర్తతే।
మహాహిక్కేతి సా జ్ఞేయా సర్వగాత్రవికమ్పినీ॥౧౦॥

తా॥ వస్తి, హృదయము, శిరస్సు, మొదలైన మర్మములను బాధించుచు సర్వావయవములను వణకించుచు ఎడతెగక వెక్కిళ్లు వెడలుచున్నయెడ మహాహిక్క యని యెరుంగునది.

అసాధ్యహిక్కాలక్షణము

శ్లో॥ ఆయమ్యతే హిక్కతో యస్య దేహో
దృష్టిశ్చోర్ధ్వం నామ్యతే యస్య నిత్యమ్।
క్షీణోఽన్నద్విట్ క్షౌతి యశ్చాతిమాత్రం
తౌ ద్వౌ చాన్త్యౌ వర్జయేద్ధిక్కమానౌ॥౧౧॥

తా॥ పూర్వోక్తహిక్కలలో మొదటనుండు హిక్కల నాటియందు శరీరము ఈడ్వబడుట, దృష్టు లూర్ధ్వముగ నుండుట, హిక్కావేగముచేత శరీరము వంగియుండుట, ఈ లక్షణములు కల్గియున్నను; శరీరము కృశించుట, అన్నద్వేషము, అధికముగ తుమ్ములు వెడలుట, ఈ లక్షణములు కల్గియున్నను అసాధ్యములు. తక్కిన గంభీర మహాహిక్కలు రెండును స్వభావముచేతనే అసాధ్యంబులు; గాన చికిత్స జేయంజనదని భావము.

శ్లో॥ అతిసంచితదోషస్య భక్తచ్ఛేదకృశస్య చ।
వ్యాధిభిః క్షీణదేహస్య వృద్ధస్యాతివ్యవాయినః॥౧౨॥
ఆసాం యా సా సముత్పన్నా హిక్కా హన్త్యాశు జీవితమ్।
యమికా చ ప్రలాపార్తిమోహతృష్ణాసమన్వితా॥౧౩॥

తా॥ మిక్కుటంబైన దోషసంచయము, అన్నద్వేషముచేనైన శరీరకృశత్వము, ఇతర వ్యాధులచే గల్గిన శరీరక్షయము, ఈ లక్షణములుగల పురుషునకును, మిగుల వృద్ధునకును, అధికముగ స్త్రీసంభోగము జేయువానికిని మున్ను వచించిన హిక్కలలో నేదియైన జనించినయెడ అట్టి మనుజుండు జీవించడు. మరియు యమలహిక్క ప్రలాపము, మూర్ఛ, దప్పి, ఈ యుపద్రవములతో గూడి యున్నయెడ అసాధ్యంబని భావము.

శ్లో॥ అక్షీణశ్చాప్యదీనశ్చ స్థిరధాత్విన్ద్రియశ్చ యః।
తస్య సాధయితుం శక్యా యమికా హన్త్యతోఽన్యథా॥౧౪॥

తా॥ శరీరము కృశతనొందక దీనత్వములేక ధాతువులకును ఇంద్రియములకును పటుత్వము కల మనుజునకు జనించిన యమళహిక్క సాధ్యంబైయుండును. శరీరము కృశించి దీనుండై ధాత్విన్ద్రియ పాటవము దప్పియున్న మనుజునకు జనించెనేని యసాధ్యంబని భావము.

## శ్వా స భే ద ము లు

శ్లో॥ మహోర్ధ్వచ్ఛిన్నతమకక్షుద్రభేదైస్తు పఞ్చధా।
భిద్యతే స మహావ్యాధిశ్శ్వాస ఏకో విశేషతః॥౧౫॥

తా॥ శ్వాసవ్యాధి మహాశ్వాసంబనియు, ఊర్ధ్వశ్వాసంబనియు, ఛిన్నశ్వాసంబనియు, తమక శ్వాసంబనియు, క్షుద్రశ్వాసంబనియు నీ భేదములచే నైదువిధంబులగును. ఇచ్చట ''పంచధా'' అని సంఖ్యానియమము జేయుటచే ప్రతమకంబను శ్వాసము తమకశ్వాసభేదంబని యెరుంగునది.

శ్లో॥ * * వాతాధికో భవేత్క్షుద్రస్తమకస్తు కఫోద్భవః।
కఫవాతాధికశ్చైవ సంసృష్టశ్ఛిన్నసంజ్ఞకః।
శ్వాసో మారుతసంసృష్టో మహానూర్ధ్వస్తతో మతః * *

తా॥ అందు వాతంబధికముగాగల్గినది క్షుద్రశ్వాసమనియు, కఫముచే జనించినది తమకశ్వాసంబనియు, కఫవాతసంసర్గముచే జనించినది ఛిన్నశ్వాసంబనియు, వాతముచే సంసృష్టమైనది మహాశ్వాసంబనియు, ఊర్ధ్వముగ సంచరించినది యూర్ధ్వశ్వాసంబనియు నెరుంగునది.

## శ్వా స వ్యా ధి పూ ర్వ రూ ప ము లు

శ్లో॥ ప్రాగ్రూపం తస్య హృత్పీడా శూలమాధ్మానమేవ చ।
ఆనాహో వక్త్రవైరస్యం శఙ్ఖనిస్తోద ఏవ చ॥౧౬॥

తా॥ హృదయమునందు బాధ, నొప్పి, ఆధ్మానము, కడుపుబ్బరము, నోరు విరసముగ నుండుట, కంఠమున బాధగల్గుట, ఇవి యన్నియు శ్వాసవ్యాధి జనించుటకు మున్ను కల్గు పూర్వరూపములు.

## శ్వా స వ్యా ధి సం ప్రా ప్తి

శ్లో॥ యదా స్రోతాంసి సంరుధ్య మారుతః కఫపూర్వకః।
విష్వగ్వ్రజతి సంరుద్ధః తదా శ్వాసాన్ కరోతి సః॥౧౭॥

తా॥ కఫము ప్రధానముగాగల వాతము ప్రాణోదానవాతములను వహించు స్రోతస్సుల నడ్డగించి కఫముచే నడ్డగించబడినదియై శరీరమునం దంతట వ్యాపించుచు శ్వాసములను గల్గించును. ఇచ్చట "సంరుద్ధః" అను పదమునకు "కఫోపరుద్ధగమనః" అని వాగ్భటమునందుండుట చేత కఫముచే నడ్డగించబడిన వాతమనియు "ప్రాణోదానాన్నవాహీని దుష్టస్రోతాంసి దూషయన్" అని యుండుటచే "స్రోతాంసి" అను పదమునకు ప్రాణోదానాన్నవహంబులైన స్రోతస్సులనియు నర్థవిశేషము నెరుంగునది.

## మహాశ్వాసలక్షణము

శ్లో॥ ఉద్ధూయమానవాతో యః శబ్దవద్దుఃఖితో నరః।
ఉచ్చైః శ్వసితి సంరుద్ధో మత్తర్షభ ఇవానిశమ్॥౧౮॥
ప్రనష్టజ్ఞానవిజ్ఞానస్తథా విభ్రాన్తలోచనః।
వికృతాక్ష్యాననో బద్ధమూత్రవర్చా విశీర్ణవాక్॥౧౯॥
దీనః ప్రశ్వసితం చాస్య దూరాద్విజ్ఞాయతే భృశమ్।
మహాశ్వాసోపసృష్టస్తు క్షిప్రమేవ విపద్యతే॥౨౦॥

తా॥ ఊర్ధ్వముగ నెట్టబడిన వాతము కల్గియుండుట, శబ్దముతోగూడి మిగుల కష్టముగా మదించిన వృషభమును బంధించినయెడ కోపముచే శ్వాసమును విడుచు విధంబున నెడతెగక గట్టిగా నిట్టూర్పు నిగుడించుట, వస్తువిషయకజ్ఞానంబును యుక్తాయుక్తజ్ఞానంబును లేకుండుట, నేత్రములు చంచలంబులై యుండుట, కన్నులను నోరును తెరచికొని యుండుట, మలమూత్రములు బైలువెడలక నిలచి యుండుట, వాక్కు శిథిలంబై యుండుట, మనోవ్యథకల్గియుండుట, ఈ లక్షణములు కల్గినది మహాశ్వాసంబని యెరుంగునది. మరియు నిశ్వాసమున నిట్టూర్పు విడుచునపుడు ధ్వని విశేషముచేత దూరమునగూడ తెలియంబడగి యుండును. ఈ మహాశ్వాసము జనించిన మనుజుండు శీఘ్రముగ మృతిజెందును.

## ఊర్ధ్వశ్వాసలక్షణము

శ్లో॥ ఊర్ధ్వం శ్వసితి యో దీర్ఘం న చ ప్రత్యాహరత్యధః।
శ్లేష్మావృతముఖస్రోతాః క్రుద్ధగన్ధవహార్దితః॥౨౧॥
ఊర్ధ్వదృష్టిర్విపశ్యంస్తు విభ్రాన్తాక్ష ఇతస్తతః।
ప్రముహ్యన్వేదనార్తశ్చ శుష్కాస్యోఽరతిపీడితః॥౨౨॥
ఊర్ధ్వశ్వాసే ప్రకుపితే హ్యధశ్శ్వాసో నిరుధ్యతే।
ముహ్యతస్తామ్యతశ్చోర్ధ్వం శ్వాసస్తస్యైవ హన్త్యసూన్॥౨౩॥

తా॥ మిగులదీర్ఘముగ నిశ్వాసవాతము నూర్ధ్వముగ వెడలించి యా నిశ్వాసమును మరల నధోమార్గముగ మరలింపలేకుండుట, ముఖము నేత్రమార్గము కర్ణనాసాదిద్వారములు శ్లేష్మచే

నావృతంబులై యుండుట, మిగుల ప్రకోపమునొందిన వాతముచే పీడింపబడుట, ఊర్ధ్వదృష్టికల వాడై నలుప్రక్కల వికృతముగ కన్నులద్రిప్పుచుజూచుట, నానావిధవేదనలచే పీడింపబడి మూర్ఛ నొందుట, నోరు తెల్లనై యుండుట, దేనియందును రుచిలేకుండుట, ఈలక్షణములు కల్గినది యూర్ధ్వ శ్వాసమని యెరుంగునది. మరియు నూర్ధ్వశ్వాసము మిగుల ప్రకోపము నొందినపుడు అధశ్శ్వాసము హృదయమునందే అడ్డగింపంబడును; దానంజేసి మిగుల శ్రమనొంది మూర్ఛనొందు మనుజునియొక్క ప్రాణములను ఊర్ధ్వశ్వాసము హరించును.

### ఛిన్నశ్వాసలక్షణము

శ్లో॥ యస్తు శ్వసితి విచ్ఛిన్నం సర్వప్రాణేన పీడితః।
నవా శ్వసితి దుఃఖార్తః మర్మచ్ఛేదరుగర్దితః॥౨౪॥
ఆనాహస్వేదమూర్ఛార్తో దహ్యమానేన వస్తినా।
విప్లుతాక్షః పరిక్షీణః శ్వసన్ రక్తైకలోచనః॥౨౫॥
విచేతాః పరిశుష్కాస్యో వివర్ణః ప్రలపన్నరః।
ఛిన్నశ్వాసేన విచ్ఛిన్న స్స శీఘ్రం విజహాత్యసూన్॥౨౬॥

తా॥ విచ్ఛిన్నమగునటుల శ్వాసమును విడుచుట, సర్వప్రాణములచేత పీడితుండై మిగుల బాధనొందుచు హృదయమును ఛేదించు బాధచే పీడితుండై శ్వాసమును బైలువెడలించలేకుండుట, కడుపుబ్బరము, చెమటగ్రమ్ముట, మూర్ఛగల్గుట, వస్తి దహింపబడినవిధముగ నుండుట, కన్నుల నీరు గ్రమ్ముట, శరీరము కృశత నొందుట, వ్యాధిస్వభావముచే నొకకన్ను ఎఱ్ఱగనుండుట, జ్ఞానము లేకుండుట, నోరెండుట, దేహము వివర్ణమై యుండుట, అసంబద్ధముగ మాటలాడుట, ఈ లక్షణములు కల్గినది ఛిన్నశ్వాసమనంబడును; ఈశ్వాసముచే విచ్ఛిన్నంబులైన సంధిబంధములు కల మనుజుండు శీఘ్రముగ ప్రాణముల వదలిపెట్టును. బ్రతుకజాలడని భావము.

### తమకశ్వాసలక్షణము

శ్లో॥ ప్రతిలోమం యదా వాయుస్స్రోతాంసి ప్రతిపద్యతే।
గ్రీవాం శిరశ్చ సంగృహ్య శ్లేష్మాణం సముదీర్య చ॥౨౭॥
కరోతి పీనసం తేన రుద్ధో ఘుర్ఘురకం తథా।
అతీవ తీవ్రవేగం చ శ్వాసం ప్రాణప్రపీడకమ్॥౨౮॥
ప్రతామ్యతి స వేగేన తృష్యతే సన్నిరుధ్యతే।
ప్రమోహం కాసమానశ్చ స గచ్ఛతి ముహుర్ముహుః॥౨౯॥
శ్లేష్మణ్యముచ్యమానే తు భృశం భవతి దుఃఖితః।
తస్యైవ చ విమోక్షాన్తే ముహూర్తం లభతే సుఖమ్॥౩౦॥
తథాఽస్యోద్ధ్వంసతే కణ్ఠః కృచ్ఛ్రాచ్ఛక్నోతి భాషితుమ్।
న చాపి లభతే నిద్రాం శయానశ్శ్వాసపీడితః॥౩౧॥

పార్శ్వే తస్యావగృహ్ణాతి శయానస్య సమీరణః।
ఆసీనో లభతే సౌఖ్య ముష్ణం చైవాభినన్దతి॥ ౩౨ ॥
ఉచ్ఛ్రితాక్షో లలాటేన స్విద్యతా భృశమార్తిమాన్ ।
విశుష్కాస్యో ముహుశ్శ్వాసో ముహుశ్చైవావధమ్యతే॥ ౩౩॥
మేఘామ్బుశీతప్రాగ్వాతై శ్శ్లేష్మలైశ్చవివర్ధతే।
స యాప్యస్తమకశ్శ్వాసస్సాధ్యో వా స్యాన్నవోత్థితః॥ ౩౪॥

తా॥ తమ తమ స్రోతస్సులయందు వాతము ప్రతిలోమముగ సంచరించుచు కంఠశిరస్సులను గ్రహించి కఫమును ప్రకోపింపజేసి పీనసమును కల్గించి యా కఫముచే నడ్డగింపబడి కంఠమునందు ఘుర్ఘురధ్వనిని కల్గించి ప్రాణస్థానంబైన హృదయమున మిగుల బాధకల్గించునదియు మిగుల తీవ్రంబైన వేగము కల్గినదియునైన శ్వాసమును కల్గించును; అట్టి శ్వాసము కల్గిన మనుజుండు శ్వాసవేగముచేత మోహము, దప్పి, చేష్టలదక్కియుండుట, మాటిమాటికి దగ్గుచు అట్టి దగ్గుచే మూర్ఛనొందుట, ఈ లక్షణములు కల్గియుండును. దగ్గినపుడు కంఠమునందలి కఫము బైలువెడలినయెడ క్షణకాలము సుఖమునొందును. మరియు కంఠమున దురద, మిగులకష్టముచే మాటలాడుట, శయనించియున్నపుడు శ్వాసముచే పీడింపబడి నిదురనొందకుండుట, పరుండియున్నపుడు వాతముచేత ఇరుప్రక్కలు ఈడ్వబడుట, కూర్చుండియున్నపుడు కొంచెము బాధలేక సుఖముగ నుండుట, ఉష్ణంబులైన పదార్థములయందు మిక్కిలి యాశకొనియుండుట, కన్నులు పైకి యుబ్బియుండుట, నుదుట చెమట బట్టుట, మిగుల ఆయాసము నొందుట, నోరెండుట, మాటిమాటికి పూరించుచు శ్వాసమును బలుమారు విడచుట, ఈ లక్షణములతోగూడియుండును. మరియు నిశ్వాసము మేఘోత్పత్తి, వర్షము, శీతకాలము, తూర్పుగాలి, శ్లేష్మమును వృద్ధినొందించు ద్రవ్యముల నుపయోగించుట, ఈకారణముల చేత మిగుల వృద్ధినొందును. దీనిని తమకశ్వాసమని వైద్యులు వచించెదరు. ఈ తమకశ్వాసము యాప్యంబై యుండును. నూతనముగ జనించినయెడ నొకవేళ చికిత్సలచే సాధ్యంబగుచుండును.

## ప్రతమక సంతమక శ్వాస లక్షణములు

శ్లో॥ జ్వరమూర్ఛాపరీతస్య విద్యాత్ప్రతమకం తు తమ్।
ఉదావర్తరజోఽజీర్ణక్లిన్నకాయనిరోధజః॥ ౩౫॥
తమసా వర్ధతేఽత్యర్థం శీతైశ్చాశు ప్రశామ్యతి।
మజ్జత స్తమసీవాస్య విద్యాత్సంతమకం తు తమ్॥ ౩౬॥

తా॥ మున్ను చెప్పిన తమకశ్వాసము జ్వరము, మూర్ఛ, ఈవ్యాధులచే బాధితునకు జనించెనేని ప్రతమక మనంబడును. మరియు ఉదావర్తవాతము, ధూళి వ్యాపించుట, ఆమాద్యజీర్ణము, వాత మూత్ర పురీష వేగముల నిరోధించుట, ఈ కారణములచే జనించినది సంతమకమని చెప్పం బడును. ఈ సంతమకశ్వాసము తమోగుణముచే వృద్ధినొంది శీతపదార్థముల సేవించుటచే శాంతి నొందును. ఈవ్యాధికల మనుజునకు చీకటియందు మునింగినభంగి నుండును. ఈప్రతమకసంతమకంబులను శ్వాసవ్యాధులు రెండును తమకశ్వాసభేదంబులు గాన వేరుగ పరిగణనము చేయబడలేదని యెరుంగునది.

ఇచ్చట "అజీర్ణక్లిన్నకాయనిరోధజః" అనుచోట ఆమాజీర్ణముచేతను, విదగ్ధాజీర్ణముచేతను, శరీరమున మలమూత్రాదివేగముల నిరోధించుటచేతను, సంతమకము జనించునని యర్థమును కొందరు వచించెదరు. కొందరు"క్లిన్నకాయ" అను శబ్దముచేత ముసలితనముచే జనించునని వచించెదరు. ఈ రెండుపక్షములకన్నను "అజీర్ణక్లిన్నకాయనిరోధజః" అను సమస్తపదమునకు ఆమరసముచే నార్ద్రమైన శరీరముకలవారికి సంతమకమను శ్వాసము కల్గునని చెప్పుట యుక్తమని దోచుచున్నది.

## క్షుద్రశ్వాసలక్షణము

శ్లో॥ రూక్షాయాసోద్భవః కోష్ఠే క్షుద్రో వాత ఉదీరయన్ ।
క్షుద్రశ్వాసో న సోఽత్యర్థం దుఃఖనాఙ్గప్రబాధకః॥ ౩౭॥
హినస్తి న స గాత్రాణి నచ దుఃఖో యథేతరే।
న చ భోజనపానానాం నిరుణద్ధ్యుచితాం గతిమ్॥ ౩౮॥
నేన్ద్రియాణాం వ్యథాం నాపి కాఞ్చిదాపాదయేద్రుజమ్।
స సాధ్య ఉక్తో బలినస్సర్వే చావ్యక్తలక్షణాః॥ ౩౯॥

తా॥ రూక్షంబులగు అన్నపానాదుల సేవించుట, శరీరాయాసము ఈ కారణములచేత క్షుద్రశ్వాసము జనించి కోష్ఠమునం దూర్ధ్వముగ వాతమును సంచరింపజేయుచుండును. ఈక్షుద్రశ్వాసముచేత మనుజునకు మిగుల కష్టముచే శరీరబాధ, అవయవములయందు బాధ, అన్నపానాదులయొక్క గతినిరోధము, చక్షురాదీన్ద్రియములయొక్క బాధ, ఈ యుపద్రవములు ఇతరశ్వాసములయందు జనించుకరణి జనించవు. మరియు నీ శ్వాసము స్వల్పకారణములచే జనించి స్వల్పలక్షణములు గల్గియుండుటచేత క్షుద్రశ్వాసంబని చెప్పంబడును. బలిష్ఠునకు జనించి అవ్యక్తలక్షణంబులైన తక్కిన మహాశ్వాసాదులును క్షుద్రశ్వాసంబును సాధ్యంబులై యుండును.

## సాధ్యాసాధ్యశ్వాస లక్షణములు

శ్లో॥ క్షుద్రస్సాధ్యోమతస్తేషాం తమకః కృచ్ఛ్ర ఉచ్యతే।
త్రయశ్శ్వాసా న సిధ్యన్తి తమకో దుర్బలస్య చ॥ ౪౦॥
కామం ప్రాణహరా రోగా బహవో న తు తే తథా।
యథా శ్వాసశ్చ హిక్కా చ హరతః ప్రాణమాశు చ॥ ౪౧॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
హిక్కా శ్వాస నిదానం సమాప్తమ్

తా॥ పైజెప్పిన పఞ్చవిధశ్వాసములలో క్షుద్రశ్వాసము సాధ్యంబును, తమకశ్వాసము సాధ్యంబు నగును. తక్కిన మహాశ్వాస ఊర్ధ్వశ్వాస ఛిన్నశ్వాసంబులు మూడును, బలహీనునకు జనించిన తమకశ్వాసంబును అసాధ్యంబులై యుండును, సన్నిపాతజ్వరను మున్నగువ్యాధులు ప్రాణహరంబులైనను అవియన్నియు హిక్కాశ్వాసములు ప్రాణములను హరించుభంగి హరింపం జాలవు. సన్నిపాతజ్వరాదులకన్న హిక్కాశ్వాసములు క్రూరముగ ప్రాణముల హింసించునని భావము.

-oo✿✿✿✿✿oo-

శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్ర విరాజమాన దివ్యన్వాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపాలాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానార్థతాత్పర్యమునందు
హిక్కాశ్వాసనిదానము
సమాప్తము



శ్రీ హ య గ్రీ వా య న మః

శ్రీ ర స్తు

# స్వ ర భే ద ని దా న మ్



శ్వాసమునందు ప్రాణోదానవాయువులు దుష్టంబులగుటచే స్వరభేదము కల్గును గాన శ్వాస నిదానాన్తరము స్వరభేదనిదానమును జెప్పుట.



## స్వ ర భే ద ని దా న సం ప్రా ప్తు లు

శ్లో॥ అత్యుచ్చభాషణవిషాధ్యయనాభిఘాత
సన్త్రాసకైః ప్రకుపితాః పవనాదయస్తు।
స్రోతస్సు తే స్వరవహేషు గతాః ప్రతిష్ఠాం
హన్యుస్స్వరం భవతి చాపి హి షడ్విధస్సః॥౧॥

తా॥ మిగుల గట్టిగ సంభాషించుట, విషము, నిరంతరముగ వేదము మున్నగుదానిని జదువుట, అభిఘాతము, ఈ కారణములచేతను; వాతాదిదోషముల ప్రకోపింపంజేయు ఇతర కారణములచేతను, వాతాదిదోషములు ప్రకోపమునొంది స్వరవహంబులైన స్రోతస్సులయందు జేరి వృద్ధినొంది స్వరభేదమును గల్గించును. అట్టి స్వరభేదంబను వ్యాధి వాత పిత్త కఫ సన్నిపాత క్షయ మేదస్సులచే జనించుటంజేసి యారువిధంబులగును. స్వరవహంబులగు స్రోతస్సులను గురించి సుశ్రుతమునందు "ద్వాభ్యాం భాషతే, ద్వాభ్యాం ఘోషంకరోతి" అని చెప్పియున్నది. మనుజుండు రెండుద్వారములచేత మాటలాడుననియు, రెండుద్వారములచేత ధ్వనిచేయుననియు భావము. ఇచ్చట భాషణము సూక్ష్మధ్వనియనియు, ఘోషణము గొప్పధ్వనియనియు భేదము నెరుంగునది.

శ్లో॥ * * వాతాదిభిః పృథక్ సర్వైర్మేదసా చ క్షయేణ చ * *

తా॥ పూర్వోక్తస్వరభేదము వాతాదిదోషత్రయముచే వేర్వేరుగను దోషత్రయసన్నిపాతముచేతను మేదస్సుచేతను క్షయముచేతను జనించునని భావము.

## వాతజ పిత్తజ స్వరభేద లక్షణములు

శ్లో॥ వాతేన కృష్ణనయనాననమూత్రవర్చా
భిన్నం శనైర్వదతి గర్దభవత్స్వరశ్చ।

పిత్తేన పీతనయనాననమూత్రవర్చా
బ్రూయాద్గలేన స చ దాహసమన్వితేన॥౨॥

తా॥ వాతముచే జనించిన స్వరభేదమునందు కన్నులు, ముఖము, మూత్రపురీషములు, ఇవి నల్లనై యుండును. కంఠస్వరము స్వాభావికముగ నుండక గాడిదయొక్క కంఠస్వరమును బోలి మిగుల కఠినంబై తిన్నని స్వరము గల్గియుండును. పిత్తముచే జనించిన స్వరభేదమునందు నేత్రములు, ముఖము, మూత్రపురీషములు, ఇవి పసుపురంగుకల్గియుండుట, మిగుల తాపముతోగూడిన కంఠముతో మాటలాడుట, ఈలక్షణములు కల్గియుండును.

కఫజ సన్నిపాతజ స్వరభేద లక్షణములు

శ్లో॥ బ్రూయాత్కఫేన సతతం కఫరుద్ధకణ్ఠ
స్స్వల్పం శనైర్వదతి చాపి దివా విశేషాత్ ।
సర్వాత్మకే భవతి సర్వవికారసమ్ప
త్తంచాప్యసాధ్యమృషయస్స్వరభేదమాహుః॥ ౩॥

తా॥ కఫముచే జనించిన స్వరభేదముకలమనుజుండు ఎల్లప్పుడు కఫముచే నడ్డగింపబడిన కంఠముగలవాడై అతిసూక్ష్మముగ తిన్నగ మాటలాడును. పగటియందు సూర్యకిరణములచేత శ్లేష్మము మందమైయుండును గాన విశేషముగ మాటలాడును. సన్నిపాతముచే జనించిన స్వరభేదమునందు వాతాదిస్వరభేదమునకు వేర్వేరుగ చెప్పిన లక్షణములన్నియు గానంబడును. అట్టి స్వరభేదము అసాధ్యంబని ఋషులు వచించెదరు.

క్షయజ మేదోజ స్వరభేద లక్షణములు

శ్లో॥ ధూమ్యేతవాక్ క్షయకృతే క్షయమాప్నుయాచ్చ
వాగేష చాపి హతవాక్ పరివర్జనీయః।
అన్తర్గతస్వరమలక్ష్యపదం చిరేణ
మేదోఽన్వయాద్వదతి దిగ్ధగలస్తృషార్తః॥౪॥

తా॥ ధాతుక్షయముచే జనించిన స్వరభేదమునందు మాటలాడునపుడు వాక్కున పొగ వెడలునట్లుండును. మాట మిగుల హీనస్వరముగ నుండును. అట్టి హీనస్వరంబగు వాక్కు కల మనుజునకు జికిత్సజేయంజనదు. మేదస్సుచే జనించిన స్వరభేదమునందు కంఠస్వరము కంఠమునందేయుండి మాట విరళముగ దెలియక చిరకాలమునకు కష్టముగ మాటలాడుట, దప్పిచే బాధకల్గుట, ఈలక్షణములు కల్గును.

అ సా ధ్య స్వ ర భే ద ల క్ష ణ ము

శ్లో॥ క్షీణస్య వృద్ధస్య కృశస్య వాపి
చిరోత్థితో యశ్చ సహోపజాతః।

మేదస్స్వనస్సర్వసముద్భవశ్చ
స్వరామయో యో న స సిద్ధిమేతి॥౫॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
స్వరభేదనిదానం సమాప్తమ్

---

తా॥ మాంసము కృశించినవానికిని వృద్ధునకును బలహీనునకును జనించిన స్వరభేదంబును, చిరకాలమునుండి అనువర్తించియుండు స్వరభేదంబును, పుట్టుకతో గూడ జనించిన స్వరభేదమును, మిక్కిలి బలిసియున్న శరీరముకలవానికి మేదస్సు వృద్ధినొంది స్రోతస్సుల నడ్డగించుటచే జనించిన స్వరభేదంబును, సన్నిపాతముచే జనించిన స్వరభేదంబును ఇవియన్నియు చికిత్సలచే సాధ్యంబులు గావు.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానాన్వితాత్పర్యము
నందు స్వరభేదనిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# అరోచకనిదానమ్



అరోచకవ్యాధి స్వరభేదము వలెనే కంఠమునకూర్ధ్వభాగమున జనించును గాన స్వరభేదానన్తరము అరోచకనిదానమును జెప్పుట.



శ్లో॥ వాతాదిభిశ్శోకభయాతిలోభ
క్రోధైర్మనోఘ్నాశనరూపగన్ధైః।
అరోచకాస్యుః..............॥

తా॥ వాతపిత్తశ్లేష్మములచే వేర్వేరుగను, సన్నిపాతముచేతను, శోకము భయము అతిలోభము అతిక్రోధము మనస్సునకు రమ్యములుకాని యన్నరూపగన్ధముల సేవించుట మున్నగు నాగంతుక కారణములచేతను అరోచకవ్యాధి జనించును. ఇచ్చట "భక్తోపఘాతమిహ పంచవిధం వదన్తి" అని సుశ్రుతమునం దున్నది గాన వాతాదిదోషములచే వేర్వేరుగను సన్నిపాతముచేతను శోకభయాద్యాగంతుక కారణములచేతను జనించుటంజేసి అరోచకము ఐదు తెరంగులగునని యెరుంగునది. మరియు శోకభయాదిహేతువులకు విరుద్ధంబులైన చికిత్సలం జేయుటకై అట్టికారణములు వేర్వేరుగ పరిగణనము జేయబడినవి.

## వాతాద్యరోచకలక్షణములు

శ్లో॥ ..................పరిహృష్టదన్తః
కషాయవక్త్రశ్చ మతోఽనిలేన॥౧॥
కట్వామ్లముష్ణం విరసఞ్చ పూతి
పిత్తేన విద్యాల్లవణం చ వక్త్రమ్।
మాధుర్యపైచ్ఛిల్యగురుత్వశైత్య
విబద్ధసమ్బద్ధయుతం కఫేన॥౨॥

తా॥ వాతముచే జనించిన అరోచకమునందు పండ్లుపులిసి నోరు వగరై యుండును. పిత్తముచే గల్గిన యరోచకమునందు నోరు కటు (చేదు) అమ్ల (పులుసు) రసములతోగూడినదియు, ఉష్ణం

బును, విరసంబునై దుర్గంధముతోగూడి యుండును. కఫముచే జనించిన యరోచకమునందు నోరు ఉప్పగను తీపుగనుండును. పిచ్ఛిలత్వగురుత్వశీతలత్వములుగల్గియుండును. ఆహారాదుల భుజించుటకు సాధ్యముగాక నడ్డముగను, కఫముతోగూడినదియునై యుండును. ఇచ్చట "పిత్తేన తిక్తాస్య విదాహకృత్స్యాత్ స్వాద్వాస్యహృల్లాసకరః కఫేన" అను విదేహవచనము ననుసరించి కటుశబ్దమునకు తిక్తరసమని యర్థము నెరుంగునది.

అభిఘాతజ సన్నిపాతజారోచక లక్షణములు

శ్లో॥ అరోచకే శోకభయాతిలోభ
క్రోధాద్యహృద్యాఽశుచిగన్ధజే స్యాత్ ।
స్వాభావికం చాఽఽస్యమథాఽరుచిశ్చ
త్రిదోషజే నైకరసం భవేత్తు॥3॥

తా॥ శోకము, భయము, అతిలోభము, క్రోధము, మనస్సునకిష్టముకానిదియు అపరిశుద్ధంబులైన గంధము నాఘ్రాణించుట మున్నగు నాగంతుకారణములచే గల్గిన యరుచియందు నోరురసభేదములులేక స్వాభావికముగ నే యుండును. సన్నిపాతముచే జనించిన యరుచియందు వాతాది త్రిదోషములకు వేర్వేరుగ జెప్పిన యనేకరసములు కల్గియుండును.

వాతాద్యరోచకములయందు గల్గు విశేషలక్షణములు

శ్లో॥ హృచ్ఛూలపీడనయుతం పవనేన, పిత్తా
త్తృడ్దాహచోషబహులం, సకఫప్రసేకమ్ ।
శ్లేష్మాత్మకం, బహురుజం బహుభిశ్చ విద్యాత్
వైగుణ్యమోహజడతాభిరథాపరం చ॥४॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
అరోచకనిదానం సమాప్తమ్.

---

తా॥ వాతముచే జనించిన అరోచకమునందు రొమ్ము నొప్పిచే పీడించబడును. పిత్తముచే జనించిన అరోచకమునందు దప్పి, తాపము, చోషము (పీల్చబడినట్టులు బాధ, లేక అగ్నిసమీపమున నున్నప్పుడుగల్గు బాధ)ఇవి యధికముగా నుండును. కఫముచే జనించిన యరోచకమునందు నోట కఫముస్రవించుచుండును. సన్నిపాతముచే జనించిన అరోచకమునందు త్రిదోషములకుజెప్పిన నానావిధవేదనలు గల్గును. ఆగంతుకారోచకమునందు మనోవ్యాకులము, మోహము, జడత్వము, ఈ మూడులక్షణములు గల్గునని యర్థము. మరియు అరుచి అన్నద్వేష అభక్తచ్ఛన్ద లక్షణము లీరీతిగ గ్రన్థాన్తరమున గానంబడియెడు. "ప్రక్షిప్తం తు ముఖే చాన్నం జన్తోర్నస్వదతే ముహుః । అరోచకస్స విజ్ఞేయో భక్తద్వేషమతశ్శృణు । చిన్తయిత్వాతు మనసా దృష్ట్వా

శ్రుత్వాపి భోజనమ్। ద్వేషమాయాతి యోజన్తుః భక్తద్వేషస్స ఉచ్యతే! యస్య నాన్నే భవేచ్ఛ్రద్ధా సోఽభక్తచ్ఛన్ద ఉచ్యతే। కుపితస్య భయార్తస్య యశ్చ భక్తనిరోధజః॥ ఆకలి కల్గియున్నను నోటనుంచిన యన్నము హితముగానుండనిది యరుచి యనియు, అన్నమును మనస్సున స్మరించినను చూచినను విన్నను మనస్సునకు సహ్యముగాకుండుట అన్నద్వేషమనియు, కోపభయాదులచేత నన్నమునందు శ్రద్ధలేకుండుట అభక్తచ్ఛన్దంబనియు భావము. ఈ రీతిగ మూడుతెరంగులైన రోగములను అరుచిశబ్దముచే చరక సుశ్రుతాదులు గ్రహించిరి.

-०-

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యాన్వయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" సోమ
లాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానాన్ధ్రి తాత్పర్యము
నందు అరోచకనిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# ఛర్దినిదానమ్



ఛర్దిరోగమునందు అరుచిగూడ కల్గును గాన అరోచక నిదానమును జెప్పినపిదప ఛర్దినిదానము జెప్పంబడుచున్నది.



శ్లో॥ దుష్టైర్దోషైః పృథక్సర్వైర్బీభత్సాలోచనాదిభిః।
ఛర్దయః పఞ్చ విజ్ఞేయాస్తాసాం లక్షణముచ్యతే॥౧॥
అతిద్రవైరతిస్నిగ్ధైరహృద్యైర్లవణైరతి।
అకాలే చాతిమాత్రైశ్చ తథాఽసాత్మ్యైశ్చ భోజనైః॥౨॥
శ్రమాద్భయాత్తథోద్వేగాదజీర్ణాత్క్రిమిదోషతః।
నార్యాశ్చాపన్నసత్త్వాయాస్తథాఽతిద్రుతమశ్నతః॥ 3॥
బీభత్సైర్హేతుభిశ్చాన్యైర్ద్రుతముత్క్లేశితో బలాత్।
ఛాదయన్నాననం వేగైరర్దయన్నఙ్గభఞ్జనైః॥౪॥
నిరుచ్యతే ఛర్దిరితి దోషో వక్త్రం ప్రధావితః।

తా॥ అతిద్రవంబులును, అతిస్నిగ్ధంబులును, మనస్సునకు రమ్యములుగానియవియు, అధికమైన లవణరసము కల్గినవియునైన పదార్థములను భుజించుట, అకాలమున భుజించుట, మిక్కిలి యధికముగ భుజించుట, సాత్మ్యంబులుగాని పదార్థములను భుజించుట, శ్రమము, భయము ఉద్వేగము (దుఃఖాదులచే గలుగుమనోవికారము), అజీర్ణము, క్రిమిదోషములు, గర్భిణీస్త్రీలకు గల్గిన గర్భపీడనము, మిగుల శీఘ్రముగభుజించుట, ఈ కారణములచేత వాతపిత్తశ్లేష్మములు వేర్వేరుగను అన్ని కలిసియు ప్రకుపితంబులై వాతపిత్తశ్లేష్మ సన్నిపాతంబులను ఛర్దులును, వికృతి దర్శనాదులచేత నాగంతుకఛర్దియును జనించును. ఇవ్విధంబుగ ఛర్దిరోగము ఐదువిధంబులగును. మరియు బీభత్సంబులగు (మనస్సునకు ఇంపుగాని) ఇతరకారణములచేత కోష్ఠగతంబైన దోషము ఊర్ధ్వమార్గమున వెడలి వేగముచే నోటిని నిండింపుచు అవయవములను బాధింపుచు బైటవెడలునది ఛర్దిరోగంబని జెప్పంబడును. ''ఛద అపవారణే'' ''అర్దహింసాయాం'' అను ధాతువులచేత

"ఛర్దిః" అను శబ్దము నిష్పన్నంబైనది కాన నోటియందు వ్యాపించి శరీరమును హింసించునది యని భావము.

### ఛ ర్ది వ్యా ధి పూ ర్వ రూ ప ము లు

శ్లో॥ హృల్లాసోద్గారరోధౌ చ ప్రసేకో లవణస్తనుః ॥ ౫ ॥
ద్వేషోఽన్నపానే చ భృశం వమీనాం పూర్వలక్షణమ్ ।

తా॥ ఓకరింతలు, త్రేనుపులు బైలువెడలక నోట్నయనే యడచికొని యుండుట, నోరు ఉప్పనై పలచగనుండు నీరు వెడలుట, అన్నపానములయం దిచ్ఛలేకుండుట, ఇవియన్నియు ఛర్దిరోగమునకు పూర్వము జనించు పూర్వరూపములని భావము.

### వా త చ్ఛ ర్ది ల క్ష ణ ము

శ్లో॥ హృత్పార్శ్వపీడా ముఖశోష మూర్ధ
నాభ్యర్తి కాస స్వరభేద తోదైః । ౬ ।
ఉద్గారశబ్దప్రబలం సఫేనం
విచ్ఛిన్నకృష్ణం తనుకం కషాయమ్ ।
కృచ్ఛ్రేణ చాల్పం మహతా చ వేగే
నార్తోఽనిలాచ్ఛర్దయతీహ దుఃఖమ్ ॥ ౭ ॥

తా॥ వాతముచేగల్గిన ఛర్దిరోగమున హృదయమునందును ఇరుప్రక్కలయందును బాధగల్గుట, నోరెండుట, శిరమునందును నాభియందును నొప్పికల్గుట, దగ్గు, స్వరభేదము, సూదుల గ్రుచ్చినట్లు పోటు, ప్రబలమైన శబ్దముతోగూడి యుండుట, ఈలక్షణములుకల్గి నురుగతోగూడి నల్లని రంగుకలిగిన కొంచెముగ కషాయరసముగల్గి అధికమైన వేగముచే పీడితుండై మిగుల కష్టముచే స్వల్పముగ వాంతియగును.

### పి త్త చ్ఛ ర్ది ల క్ష ణ ము

శ్లో॥ మూర్ఛా పిపాసా ముఖశోష మూర్ధ
తాల్వక్షిసన్తాప తమో భ్రమార్తః ।
పీతం భృశోష్ణం హరితం సతిక్తం
ధూమ్రం చ పిత్తేన వమేత్సదాహమ్ ॥ ౮ ॥

తా॥ మూర్ఛ, దప్పి, నోరెండుట, శిరస్సునందును దౌడలయందును కన్నులయందును మంట, చీకటిలో ప్రవేశించినట్లుండుట, భ్రమము, ఈ లక్షణములతో గూడి పచ్చవర్ణముగను మిగుల నుష్ణముగను ఆకుపచ్చరంగుగను ధూమ్రవర్ణముగను మంటతోగూడి చేదుగనైనదియు దానిని పిత్తముచే జనించిన ఛర్దియని యెరుంగునది.

## కఫచ్ఛర్దిలక్షణము

శ్లో॥ తన్ద్రాస్యమాధుర్య కఫప్రసేక
సన్తోష నిద్రారుచి గౌరవార్తః।
స్నిగ్ధం ఘనం స్వాదు కఫాద్విశుద్ధం
సరోమహర్షోఽల్పరుజం వమేత్తు ॥ ౯ ॥

తా॥ కఫముచే జనించిన ఛర్దిరోగముకల మనుజుండు కునికిపాటు, నోరుతీపి, నోట కఫము స్రవించుట, భోజనమును జేయకున్నను భుజించినట్లు తృప్తిజెందియుండుట, నిద్ర, అరుచి, గురుత్వము, ఈ బాధలచే పీడితుండై స్నిగ్ధంబుగను చిక్కగను మాధుర్యయుక్తంబుగను స్వచ్ఛంబుగను వాంతిచేయును. బాధ కొంచెముగనుండును. గగురుపాటు జనించును.

## సన్నిపాతజఛర్దిలక్షణము

శ్లో॥ శూలాఽవిపాకాఽరుచి దాహ తృష్ణా
శ్వాస ప్రమోహ ప్రబలాప్రసక్తమ్।
ఛర్దిస్త్రిదోషాల్లవణామ్లనీల
సాన్ద్రోష్ణరక్తం వమతాం నృణాం స్యాత్ ॥ ౧౦ ॥

తా॥ శూల, అజీర్ణము, అరుచి, తాపము, దప్పి, శ్వాసము, మోహము, ఇవియన్నియు మిగుల నతిశయముగనుండి ఉప్పగను పులుసుగను దట్టముగను నీలవర్ణముగను ఉష్ణముగను రక్తవర్ణముగను వాంతియైనయెడ త్రిదోషముచే జనించిన ఛర్దియని యెరుంగునది.

## అసాధ్యచ్ఛర్దిరోగ లక్షణములు

శ్లో॥ విట్స్వేదమూత్రామ్బువహాని వాయు
స్స్రోతాంసి సంరుధ్య యదోర్ధ్వమేతి।
ఉత్సన్నదోషస్య సమాచితం తం
దోషం సముద్ధూయ నరస్యకోష్ఠాత్ ॥ ౧౧ ॥
విణ్మూత్రయో స్తత్సమగన్ధవర్ణం
తృట్ శ్వాసహిక్కార్తియుతం ప్రసక్తమ్।
ప్రచ్ఛర్దయేద్దుష్టమివాతివేగా
త్తయార్దితశ్చాశు వినాశమేతి ॥ ౧౨ ॥

తా॥ వాతము ప్రకుపితంబై మలమూత్రస్వేదజలముల వహించు స్రోతస్సుల నడ్డగించి యూర్ధ్వముఖంబైనపుడు అట్టి వాతము మనుజునియొక్క కోష్ఠముననుండి శరీరమునం దంతట వ్యాపించిన పిత్తమును కఫమును పైకివెడలించును; మలమూత్రాదిమార్గములు అడ్డగింపంబడియుండుటచేత వాంతియగు పిత్తకఫములు మలమూత్రములకు సమానమైన వర్ణంబును గంధంబును గల్గియుండును.

మరియు డప్పి, శ్వాసము, వెక్కిళ్ళు కూడ జనించి అతివేగముచే దుష్టంబై యుండును. ఈ లక్షణములతో గూడిన ఛర్దిరోగముచే పీడితుండగు మనుజుండు అతిశీఘ్రముగ మృతిజెందును.

## ఆగంతుచ్ఛర్దిలక్షణము

శ్లో॥ బీభత్సజా దౌహృదజాఽఽమజా చ
అసాత్మ్యజా చ క్రిమిజా చ యా హి।
సా పఞ్చమీ తాం చ విభావయేచ్ఛ
దోషోచ్ఛ్రయేణైవ యథోక్తమాదౌ ॥ ౧౩ ॥

తా॥ మనస్సునకు బీభత్సకరంబులగు (ఇంపుగాని) వస్తుదర్శనాదులచే గల్గినదియు, గర్భకాలమున గల్గిన కోర్కెల నొనకూర్పకపోవుటచేత జనించినదియు, అజీర్ణముచే గల్గినదియు, శరీరతత్వమునకు ఇమడని యన్నాదుల భుజించుటచే బుట్టినదియు, కోష్ఠగతక్రిములచే గల్గినదియు నైన ఛర్దిరోగము ఐదవదియని యెఱుంగునది. అట్టి యాగంతుకఛర్దిరోగమును మున్ను జెప్పిన వాతాది దోషములయొక్క ప్రాబల్యముచే నెఱుంగునది.

## క్రిమిజచ్ఛర్దిలక్షణము

శ్లో॥ శూలహృల్లాసబహులా క్రిమిజా చ విశేషతః।
క్రిమిహృద్రోగతుల్యేన లక్షణేన చ లక్షితా ॥ ౧౪ ॥

తా॥ శూలంబును, ఓకిలింతలును, విశేషముగా గల్గినది క్రిములచే గల్గిన ఛర్దియని యెఱుంగునది. మరియు నివ్యాధి క్రిమిహృద్రోగములకు సమానంబులైన లక్షణములు కల్గియుండును.

## అసాధ్యచ్ఛర్దిలక్షణము

శ్లో॥ క్షీణస్య యా చ్ఛర్దిరతిప్రసక్తా
సోపద్రవా శోణితపూయయుక్తా।
సచన్ద్రికాం తాం ప్రవదేదసాధ్యాం
సాధ్యాం చికిత్సేన్నిరుపద్రవాం చ ౧౫।

ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
ఛర్దినిదానం సమాప్తమ్

తా॥ శరీరము ధాతువులు క్షీణించినవానికి మిక్కిలి వేగముతో కూడి జనించినదియు, శ్వాసము మొదలైన ఉపద్రవములతో గూడినదియు, చీమునెత్తురులతో గూడినదియు, మేదస్సు మొదలగు ధాతువులయొక్క స్నేహముతో గూడినదియు నైన ఛర్దివ్యాధి చికిత్సల కసాధ్యంబు. ఉపద్రవరహితంబైన ఛర్ది సాధ్యంబుగాన చికిత్స జేయవలెనని భావము.

ఛర్ద్యుపద్రవములు గ్రన్థాన్తరమున నీరీతిగ నున్నవి "కాసశ్వాసౌ జ్వరో హిక్కా తృష్ణా వై చిత్యమేవచ । హృద్రోగ స్తమకశ్చైవ జ్ఞేయాశ్ఛర్దేరుపద్రవాః" కాస శ్వాసములు, జ్వరము, వెక్కిళ్ళు, దప్పి, చింత, హృద్రోగము, తమకము, ఇవియన్నియు ఛర్దిరోగ ముచే గల్గు నుపద్రవంబులని భావము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి వర
శారదివ్యసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్ర
విరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాండ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానార్థతాత్పర్యము

నందు ఛర్దినిదానము

సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# తృష్ణానిదానమ్



ఛర్దివ్యాధికి తృష్ణ ఉపద్రవము గాన ఛర్దినిదానమును చెప్పినపిదప తృష్ణానిదానము చెప్పట.



## తృష్ణాసంప్రాప్తి

శ్లో॥ భయశ్రమాభ్యాం బలసంక్షయాద్వా
ఊర్ధ్వం చితం పిత్తవివర్ధనైశ్చ।
పిత్తం సవాతం కుపితం నరాణాం
తాలుప్రపన్నం జనయేత్పిపాసామ్॥ ౧॥
స్రోతస్స్వపాం వాహిషు దూషితేషు
దోషైశ్చ తృట్సంభవతీహ జన్తోః॥

తా॥ భయము, శ్రమము, బలక్షయము, వీనిచేత వాతము ప్రకుపితంబై పిత్తవర్ధకంబులగు కట్వమ్లాదిపదార్థముల భుజించుటచే ప్రకుపితంబైన పిత్తముతోఁగలసి ఊర్ధ్వముగ వెడలి మనుజులయొక్క తాలువుల నాశ్రయించి దప్పిని కల్గించును. మరియు ఉదకవాహినులను స్రోతస్సులు వాతాదులచే దుష్టంబులైనయెడ మనుజునకు దప్పి జనించును. "రసవాహినీశ్చ ధమనీః జిహ్వామూలగల తాలుక్లోమ్నః। సంశోష్య నృణాం దేహే కురుతస్తృష్ణామతిబలౌ తౌ" అని చరకమున నుండుటంజేసి వాతపిత్తములు ప్రకుపితంబులై రసమును వహించు ధమనులు జిహ్వామూలమును కంఠమును తాలువులను ఎండించి తృష్ణ (దప్పి) యను వ్యాధిని కల్గించునవని యెఱుంగునది.

## తృష్ణాభేదములు

శ్లో॥ తిస్రస్స్మృతాస్తాః క్షతజా చతుర్థీ ।
క్షయాత్తథా హ్యామసముద్భవా చ ॥ ౧ ॥
భక్తోద్భవా సప్తమికేతి తాసాం
నిబోధ లిఙ్గాన్యనుపూర్వశస్తు ।

తా॥ పైఁజెప్పిన తృష్ణావ్యాధి వాతపిత్తశ్లేష్మములు, క్షతము, క్షయము, అజీర్ణము, ఆహారభేదము, ఈ యేడుకారణములచే వేర్వేరుగ జనించుటంజేసి ఏడువిధంబులగును. అట్టి తృష్ణా లక్షణములను వేర్వేరుగ వివరించెదనని భావము.

## వాతజతృష్ణాలక్షణము

శ్లో॥ క్షామాస్యతా మారుతసమ్భవాయాం
తోదస్తథా శఙ్ఖశిరస్సు చాపి ॥ ౩ ॥
స్రోతోనిరోధో విరసం చ వక్త్రం
శీతాభిరద్భిశ్చ వివృద్ధిమేతి ।

తా॥ నోరెండుట, కణతలయందును శిరమునందును పోటు, రసాదివహంబులగు స్రోతస్సులడ్డగింపబడి యుండుట, నోరు విరసముగ నుండుట, చల్లని నీళ్లను త్రాగినయెడ దప్పి వృద్ధినొందుట, ఈ లక్షణములుకల్గినది వాతముచే కల్గిన తృష్ణయని యెరుంగునది.

## పిత్తజతృష్ణాలక్షణము

శ్లో॥ మూర్ఛాఽన్నవిద్వేషవిలాపదాహా
రక్తేక్షణత్వం ప్రతతశ్చ శోషః ॥ ౪ ॥
శీతాభినన్దా ముఖతిక్తతా చ
పిత్తాత్మికాయాం పరిధూపనం చ ।

తా॥ పిత్తముచే గల్గిన పిపాసయందు మూర్ఛ, అన్నద్వేషము, అసంబద్ధముగ మాటలాడుట, తాపము, కన్నులెఱ్ఱగనుండుట, అధికమైనశోష, శీతోపచారములయం దిచ్ఛగల్గియుండుట, నోరు చేదుగనుండుట, సంతాపము గల్గుట, ఈలక్షణములు కల్గును.

## కఫజతృష్ణాలక్షణము

శ్లో॥ బాష్పావరోధాత్కఫసంవృతేఽగ్నౌ
తృష్ణా బలాసేన భవేత్తథాతు ॥ ౫ ॥
నిద్రా గురుత్వం మధురాస్యతా చ
తృష్ణార్దితః శుష్యతి చాతిమాత్రమ్ ।

తా॥ స్వవర్ధకంబులగు కారణములచే వృద్ధినొందిన కఫముచేత జాఠరాగ్ని యావరింపబడిన యెడ ఊర్ధ్వమున వెడలుచుండు వేడి యధోముఖముగ ప్రసరించి జలవహంబులగు స్రోతస్సులను శోషింపజేసి దప్పిని కల్గంజేయును. దీనిని కఫముచేజనించిన తృష్ణయని యెఱుంగునది. అట్టి తృష్ణ యందు నిద్ర, గురుత్వము, నోరు తీపిగనుండుట, ఈ లక్షణములు కలుగును. ఈ తృష్ణచే పీడింపబడిన మనుజుండు మిక్కిలి శోషనొందును. ఇచ్చట కఫము వృద్ధినొందినపుడు మిక్కిలి ద్రవరూపంబైనను అట్టి కఫము జఠరాగ్నిజ్వాలను నిరోధించుటచే నధోముఖంబైన యగ్నిజ్వాలల రసాదివహస్రోతస్సులను శోషింపజేసి తృష్ణను కల్గించుటకు జాఠరాగ్ని నిరోధము కఫకృతంబగాన కఫజతృష్ణయని వ్యవహరించబడునని యెఱుంగునది. కఫము పిత్తముతో చేరి తృష్ణను గల్గించునని ముఖ్యభావము. ఈ యర్థము తన్త్రాన్తరమునం దీరీతిగ చెప్పంబడినది. "స్వాద్వమ్లలవణాజీర్ణైః క్రుద్ధశ్శ్లేష్మా సహోష్మణా। ప్రపద్యాప్సువహం స్రోతస్తృష్ణాం సంజనయేన్నృణాం। శిరసో గౌరవం తన్ద్రా మాధుర్యం వదనస్య చ। భక్తద్వేషః ప్రసేకశ్చ నిద్రాధిక్యం తథైవ చ। ఏతైర్లిఙ్గైర్విజానీయాత్తృష్ణాం కఫసముద్భవామ్" మధురంబులును ఆమ్లంబులును లవణంబులును అజీర్ణకరంబులునైన యన్నాదుల భుజించుటచేత కఫము ప్రకోపించి యూష్మముతో గూడి జలవహంబులగు స్రోతస్సులచేరి మనుజులకు తృష్ణను గల్గించుననియు, అట్టి కఫతృష్ణయందు తల బరువుగనుండుట, కునికిపాటు, నోరు తీపిగనుండుట, అన్నద్వేషము, నోట నీరుగారుట, అధికమైన నిద్ర, ఈ లక్షణములు కల్గుననియు భావము.

క్షతజ క్షయజ తృష్ణా లక్షణములు

శ్లో॥ క్షతస్య రుక్ శోణితనిర్గమాభ్యాం
　తృష్ణా చతుర్థీ క్షతజా మతా తు। ౬ ॥
　రసక్షయాద్యా క్షయసంభవా సా
　తయాభిభూతశ్చ నిశాదినేషు।
　పేపీయతేఽమ్భః స సుఖం న యాతి
　తాం సన్నిపాతాదితి కేచిదాహుః। ౭ ।
　రసక్షయోక్తాని చ లక్షణాని
　తస్యామశేషేణ భిషగ్వ్యవస్యేత్।

తా॥ శస్త్రాదిప్రహారములచే గాయముకల్గిన మనుజునకు బాధచేతను రక్తము స్రవించుటచేతను దప్పి కల్గును; దానిని క్షతజతృష్ణయని వైద్యులు వచించెదరు. ఆహారముయొక్క రసము క్షయించుటచే జనించిన దప్పిని క్షయజతృష్ణయని చెప్పెదరు. అట్టి తృష్ణచే పీడింపబడిన మనుజుండు ఉదకమును రేయింబవలును మాటిమాటికి పానముజేయుచు ఇంచుకైనను సుఖము నొందక మిగుల శ్రమ నొందును. మరియు ని క్షయజతృష్ణను సన్నిపాతముచే జనించినదియని కొందరు వచించెదరు. ఈతృష్ణయందు హృత్పీడ కమ్పము మొదలగు రసక్షయలక్షణములన్నియు కానంబడును; గాన అట్టిలక్షణములచేత వైద్యుండు వ్యాధి నిర్ణయించవలెను. మరియు "సతతం యః పిబే

తోయం న తృప్తిమధిగచ్ఛతి । పునః కాఙ్క్షతి తోయం చ తం తృష్ణార్దిత మాది శేత్" అని సుశ్రుతమునందున్నది. ఎల్లప్పు డుదకమును మాటిమాటికి పానముజేయుచున్నను దప్పి యణగకుండుట తృష్ణావ్యాధియని భావము. ఈప్రమాణముచేత తృష్ణాసామాన్యమున జలపానం బధికముగ నావశ్యకంబై యున్నను క్షయజతృష్ణయందు తృష్ణాసామాన్యమునకన్నను మిక్కిలి యధికముగ నావశ్యకంబై యుండునని భావము.

## ఆ మ జ తృ ష్ణా ల క్ష ణ ము

శ్లో॥ త్రిదోషలిఙ్గాऽऽమసముద్భవా చ
హృచ్ఛూల నిష్ఠీవన సాదకర్త్రీ ॥ ౮ ॥

తా॥ త్రిదోషలక్షణములతోగూడి హృదయశూల, నోట నీరుగారుట, బడలిక, ఈ లక్షణములు కల్గిన దప్పి ఆమజతృష్ణయని యెరుంగునది. ఆమాజీర్ణమునందు దోషత్రయము ప్రకోపించును గాన అట్టి యజీర్ణముచే జనించిన తృష్ణయందు దోషత్రయలక్షణములు గానంబడునని యెరుంగునది.

## అన్నజతృష్ణాలక్షణము

శ్లో॥ స్నిగ్ధం తథాऽమ్లం లవణం చ భుక్తం
గుర్వన్న మే వాశు తృషాం కరోతి ॥

తా॥ స్నిగ్ధంబును, అమ్లలవణరసములతోగూడినదియు, ప్రమాణమున కధికంబును, గురుత్వమును కల్గించునదియునైన యన్నమును భుజించినయెడ అతిశీఘ్రముగ దప్పి కల్గును. దీనిని అన్నజతృష్ణయని చెప్పెదరు.

## ఉపసర్గజతృష్ణా లక్షణము

శ్లో॥ దీనస్వరః ప్రతామ్యన్ దీనస్సంశుష్కవక్త్రగలతాలుః ।
భవతి ఖలు యోపసర్గాత్తృష్ణా సా శోషిణీ కష్టా ॥౯ ॥

తా॥ హీనస్వరము, మూర్ఛనొందుట, బడలిక, నోరు కంఠము తాలువులు ఇవి యెండుట, ఈలక్షణములు కల్గిన తృష్ణ ఉపద్రవముచే జనించినదియని యెరుంగునది. ఈతృష్ణ వ్యాధిచే శరీరము మిగుల కృశించినపుడు జనించునుగాన కష్టసాధ్యంబై యుండును.

## అసాధ్యతృష్ణాలక్షణములు

శ్లో॥ జ్వర మోహ క్షయ కాస శ్వాసాద్యుపసృష్ట దేహానామ్ ॥
సర్వాస్త్వతిప్రసక్తారోగకృశానాం వమిప్రయుక్తానామ్ ॥ ౧౦ ॥
ఘోరోపద్రవయుక్తాస్తృష్ణా మరణాయ విజ్ఞేయాః ।



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
తృష్ణానిదానమ్ సమాప్తమ్

తా॥ జ్వరము, మోహము, క్షయము, దగ్గు, శ్వాసము, ఇవియున్నుగాగల వ్యాధులచే పీడించ బడినవారికిని, ఇతరరోగములచే। కృశించిన వారికిని, వమనవ్యాధితో గూడినవారికిని, మిగుల బలిష్ఠంబులైన ముఖశోషాద్యుపద్రవములతో గూడి జనించిన తృష్ణావ్యాధులన్నియు మరణము నొందించునని భావము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత ఆగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణాఖ్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానాన్ధ్ర తాత్పర్యమునందు
తృష్ణానిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# మూర్ఛా భ్రమ నిద్రా తన్ద్రా సన్న్యాస నిదానమ్



"తృషితో మోహమాయాతి" అను వాక్యముచేత మూర్ఛ తృష్ణకు ఉపద్రవమని తెలియబడుచున్నది. కాన తృష్ణానిదానమును జెప్పినపిదప దాని కుపద్రవమైన మూర్ఛానిదానంబును, అట్టి మూర్ఛకు సమానలక్షణంబులైన భ్రమ నిద్రా తన్ద్రా సన్న్యాసములయొక్క నిదానములును జెప్పబడుచున్నవి.



## మూర్ఛానిదాన సంప్రాప్తులు

శ్లో॥ క్షీణస్య బహుదోషస్య విరుద్ధాహార సేవినః।
వేగాఘాతాదభీఘాతాద్ధీనసత్త్వస్య వా పునః॥౧॥
కరణాయతనేషూగ్రా బాహ్యేష్వాభ్యన్తరేషు చ।
నివిశన్తే యదా దోషా స్తదా మూర్ఛన్తి మానవాః॥౨॥
సంజ్ఞావహాసు నాడీషు పిహితాస్వనిలాదిభిః।
తమోఽభ్యుపైతి సహసా సుఖదుఃఖవ్యపోహకృత్॥౩॥
సుఖదుఃఖవ్యపోహాచ్చ నరః పతతి కాష్ఠవత్।
మోహో మూర్ఛేతి తామాహుష్షడ్విధా సా ప్రకీర్తితా॥౪॥
వాతాదిభిశ్శోణితేన మద్యేన చ విషేణ చ।
షట్స్వప్యేతాసు పిత్తం తు ప్రభుత్వేనాఽవతిష్ఠతే॥౫॥

తా॥ క్షీణుండై మిగుల నధికమైన దోషముతోగూడిన మనుజునకు విరుద్ధాహారముల భుజించుట, మలమూత్రాదివేగములను నిరోధించుట, ప్రహారములు మున్నగాగల యభిఘాతముల నొందుట, ఈ కారణములచేతను సత్వగుణము నశించి బాహ్యంబులును ఆభ్యన్తరంబులు నైన యింద్రియముల వహించు నాడులయందు క్రూరంబులైన వాతాదిదోషములు ప్రవేశించినయపుడు

మనుజులు మూర్ఛనొందుదురు; సంజ్ఞను వహించి నాడులు వాతాదులచే నడ్డగింపబడినపుడు సుఖదుఃఖముల నెఱింపజేయు అజ్ఞానహేతుకంబైన తమోగుణమునొంది మైమరచి కొయ్యవలె క్రిందపడును. ఆవ్యాధిని మోహమనియు మూర్ఛయనియు వ్యవహరించెదరు. అట్టి మూర్ఛావ్యాధి వాత పిత్తశ్లేష్మరక్తములు, మద్యము, విషము, ఈయారిటిచే జనించుటంజేసి యారువిధంబులగును. వాతాదులలో పిత్తము ప్రధానంబై మిగుల నధికముగా నుండును.

## మూర్ఛారోగ పూర్వరూపములు

శ్లో॥ హృత్పీడా జృమ్భణం గ్లానిః సంజ్ఞాదౌర్బల్యమేవ చ।
సర్వాసాం పూర్వరూపాణి యథాస్వం చ విభావయేత్ ॥౬॥

తా॥ రొమ్మునొప్పి, ఒడలు విరుపులు, బడలిక, జ్ఞానము తగ్గియుండుట, ఇవి యన్నియు మూర్ఛావ్యాధులకు పూర్వరూపములు. వాతాదిభేదములను ఆయాలక్షణములం బట్టి నిర్ణయించవలెను.

## వాతజమూర్ఛా లక్షణము

శ్లో॥ నీలం వా యదివా కృష్ణం ఆకాశమథవాఽరుణమ్।
పశ్యం స్తమః ప్రవిశతి శీఘ్రం చ ప్రతిబుధ్యతే॥౭॥
వేపథుశ్చాఽఙ్గమర్దశ్చ ప్రపీడా హృదయస్య చ।
కార్శ్యం శ్యావారుణా ఛాయా మూర్ఛాయే వాతసమ్భవే॥౮॥

తా॥ వాతముచే జనించిన మూర్ఛయందు మనుజుండు ఆకసమును నీలవర్ణముగనైనను, కృష్ణవర్ణముగనైనను, అరుణవర్ణముగనైనను జూచుచు మూర్ఛనొంది శీఘ్రముగనే తెలివినొందును. మరియు శరీరకమ్పము, ఒడలునొప్పులు రొమ్మునొప్పి, కృశత్వము, శరీరచ్ఛాయ శ్యామలవర్ణంబుగ నుండుట, ఈ లక్షణములు కల్గును.

## పిత్తజ మూర్ఛా లక్షణము

శ్లో॥ రక్తం హరితవర్ణం వా వియత్పీతమథాపి వా।
పశ్యం స్తమః ప్రవిశతి సస్వేదశ్చ ప్రబుధ్యతే॥౯॥
సపిపాసస్ససన్తాపో రక్తపీతాఽరుణేక్షణః।
సంభిన్నవర్చాః పీతాభో మూర్ఛాయే పిత్తసమ్భవే॥౧౦॥

తా॥ పిత్తముచే సంభవించిన మూర్ఛయందు మానవుండు ఆకసమును రక్తవర్ణముగనైనను పచ్చనిరంగుకల్గినదిగనైనను, పసుపురంగు కల్గినదిగనైనను చూచుచు మూర్ఛనొందును. మూర్ఛదేరునపుడు చెమట, దప్పి, సంతాపము, ఈ లక్షణములతోఁగూడి యుండును. మరియు కన్నులు రక్తవర్ణంబులుగనైనను, పీతవర్ణంబులుగనైనను, అరుణవర్ణంబులుగనైన నుండును. మలము పచ్చగ వెడలును. శరీరచ్ఛాయ పచ్చగనుండును.

కఫజమూర్ఛా లక్షణము

శ్లో॥ మేఘసఙ్కాశమాకాశం ఆవృతం వా తమోఘనైః।
పశ్యం స్తమః ప్రవిశతి చిరాచ్చ ప్రతిబుధ్యతే॥౧౧॥
గురుభిః ప్రావృతైరఙ్గైర్యథైవార్ద్రేణ చర్మణా।
సప్రసేకస్సహృల్లాసో మూర్ఛాయే కఫసంభవే॥౧౨॥

తా॥ కఫముచే గల్గిన మూర్ఛయందు ఆకాశమును మేఘములచే నావృతంబుగనైనను, చీకటిచే నావరింపబడినట్లుగనైనను గాంచుచు మూర్ఛిల్లి చిరకాలమునకు ఒడలెరుంగును. మరియు శరీరముపైన బరువైనగుడ్డలనైనను తడిసియుండు చర్మమునైనను గప్పినట్లుండుట, నోట చొంగ కారుట, వాంతియగునట్లుండుట, ఈలక్షణములు కల్గును.

సన్నిపాతజ మూర్ఛా లక్షణము

శ్లో॥ సర్వాకృతిస్సన్నిపాతాదపస్మార ఇవాగతః।
స జన్తుం పాతయత్యాశు వినా బీభత్సచేష్టితైః॥౧౩॥

తా॥ సన్నిపాతముచే జనించినమూర్ఛ వాతాదిదోషత్రయ లక్షణములతోగూడి నోట నురుగు వెడలుట మొదలగు బీభత్సకరంబులైన చేష్టలుదక్క తక్కిన యపస్మారలక్షణములతోగూడి మనుజుని అతిశీఘ్రముగ క్రిందపడద్రోయును. ఇచ్చట నుద్దేశమున ఆరువిధంబులుగ మూర్ఛావ్యాధిని జెప్పియున్నను చరకమునందు సన్నిపాతముచేతగూడ మూర్ఛ జనించునని చెప్పియుండుటంజేసి తదనుసారముగ జెప్పినది గాన విరుద్ధము గాదని యెరుంగునది.

రక్తజమూర్ఛా లక్షణము

శ్లో॥ పృథివ్యాప స్తమోరూపం రక్తగన్ధ స్తదన్వయః।
తస్మాద్రక్తస్య గన్ధేన మూర్ఛన్తి భువి మానవాః॥౧౪॥
ద్రవ్యస్వభావ ఇత్యేకే దృష్ట్వా యదభిముహ్యతి॥

తా॥ పంచభూతములలో పృథ్వీజలంబులు రెండును తమోగుణభూయిష్ఠంబైనవి. రక్తమునందలి పరిమళము తమోగుణప్రధానంబైన భూమికి సంబంధించినది గాన రక్తముయొక్క పరిమళము నాఘ్రాణించిన మనుజులు మూర్ఛనొందుదురని యర్థము. పృథివీసంబంధమైనగంధమును మూర్కొనుటచే తమోబహుళంబగు మూర్ఛ జనించునని భావము. మరియు ద్రవ్యరూపమైనరక్తముయొక్క స్వభావముచేత ఒట్టిరక్తమును జూచినమాత్రనే మూర్ఛగల్గునని కొందరు వచించెదరు. ఇచ్చట ద్రవ్యస్వభావముచేత రక్తమునందలి గంధముచేతనే మూర్ఛజనించును గాని సంపంగిపువ్వులు మొదలగువానియందలి గంధముచేత మూర్ఛ గల్గదని యెరుంగునది. మరియు భోజుండు "స్తబ్ధాఙ్గదృష్టిర్భవతి గూఢోచ్ఛ్వాసస్తథైవచ।దర్శనాదస్సృజస్తజ్జాద్గన్ధాచ్చైవ ప్రముహ్యతి" అని చెప్పెను. రక్తమును జూచినను దానిగంధము నాఘ్రాణించినను మనుజుండు చేష్టలుడక్కి నిశ్చలంబులైన నేత్రములుకలవాడై మూర్ఛనొందునని భావము. ఈ ప్రమాణముచేతగూడ రక్తముయొక్క దర్శనముచేతను గంధాఘ్రాణముచేతను మూర్ఛగల్గునని దృఢముగా దెలియుచున్నది.

## విషజ మద్యజ మూర్ఛా లక్షణములు

శ్లో॥ గుణా స్తీవ్రతరత్వేన స్థితా స్తు విషమద్యయోః॥౧౫॥
త ఏవ తస్మాత్తాభ్యాన్తు మోహౌ స్యాతాం యథేరితౌ।

తా॥ విషమద్యములయందు లఘుత్వాదిగుణములు మిగుల తీక్ష్ణంబులై యుండును; దానంజేసి విషమద్యములచేత మూర్ఛ జనించును. అందు విషముచే జనించినది విషజమూర్ఛ యనియు, మద్యపానముచే జనించినది మద్యజమూర్ఛ యనియు నెఱుంగునది. అందు విషము తనంతట జీర్ణంబుగాదు కాన విషముచే జనించిన మూర్ఛ తనంతట శాంతినొందక బాధించును. మద్యము జీర్ణంబగును గాన మద్యపానముచే జనించిన మూర్ఛ మద్యము జీర్ణించిన పిదప తనంతట శమించును. విషమద్యగుణములు తన్త్రాన్తరమున నీక్రింది విధముగ నున్నవి: "లఘు రూక్షమాశు విశదం వ్యవాయి తీక్ష్ణం వికాసి సూక్ష్మం చ। ఉష్ణమనిర్దేశ్య రసం దశగుణయుక్తం విషం తజ్జ్ఞైః" లఘుత్వము, రూక్షత్వము, ఆశుకారిత్వము, విశదత్వము, వ్యవాయిత్వము, తీక్ష్ణత్వము వికాసిత్వము, సూక్ష్మత్వము, ఉష్ణత్వము, నిర్ణయములేనిరసము గల్గియుండుట, ఈ పదిగుణములును విషమునకు గల్గియుండునని భావము. మరియు "యే విషస్య గుణాః ప్రోక్తాః సన్నిపాతప్రకోపణాః। త ఏవ మద్యే దృశ్యన్తే విషే చ బలవత్తరాః" అనియుండుటచేత విషమునకు జెప్పియుండు గుణములన్నియు మద్యమునందు నుండుననియు, అట్టిగుణములు మద్యమునకంటె విషమున బలిష్ఠంబులై యుండుననియు నెఱుంగునది.

## రక్తజాదిమూర్ఛాత్రితయమునకు - స్వరూపము

శ్లో॥ స్తబ్ధాఙ్గదృష్టి స్త్వసృజా గూఢోచ్ఛ్వాసశ్చ మూర్ఛితః॥౧౬॥
మద్యేన విలపం శ్శేతే నష్ట విభ్రాన్త మానసః।
గాత్రాణి విక్షిపన్ భూమౌ జరాం యావన్న యాతి తత్॥౧౭॥
వేపథు స్స్వప్నతృష్ణా స్స్యు స్తమశ్చ విషమూర్ఛితే।
వేదితవ్యం తీవ్రతరం యథాస్వం విషలక్షణైః॥౧౮॥

తా॥ రక్తముచే జనించిన మూర్ఛ కల మనుజుండు నిశ్చలంబులైన యంగములును, నేత్రములును, స్పష్టముగ కనుబడని ఉచ్ఛ్వాసమును కలవాడై యుండును. మద్యపానముచేత పలువిధంగుల భాషించుచు జ్ఞానములేక భ్రమనొందిన మనస్సుకలవాడై మూర్ఛనొంది చేష్టలుదక్కి మద్యము జీర్ణంబగునంతవరకు అవయవములను భూమియందుంచి శయనించి యుండును. విషముచే మూర్ఛనొందినవానికి కంపము, స్వప్నము, దప్పి, కన్నులు కనుబడకుండుట, ఈ లక్షణములు కల్గియుండును. మరియు విషముచేగల్గిన మూర్ఛలను ఆయావిషయములకు జెప్పియుండు లక్షణములను బట్టి తీవ్రత్వము నెఱుంగునది.

## మూర్ఛాభ్రమాదులయొక్క పరస్పరభేదములు

శ్లో॥ మూర్ఛా పిత్తతమఃప్రాయా రజఃపిత్తానిలాద్భ్రమః।
తమోవాతకఫాత్తన్ద్రా నిద్రా శ్లేష్మతమోభవా॥౧౯॥
* * చక్రవద్భ్రమతో గాత్రం భూమౌ పతతి సర్వదా।
భ్రమరోగ ఇతి జ్ఞేయో రజఃపిత్తానిలాత్మకః * *

తా॥ పిత్తతమోగుణములచే మూర్ఛజనించును. రజోగుణము, పిత్తము, వాతము, ఈ మూడిటిచే భ్రమజనించును. తమోగుణము, వాతకఫములు, ఈ మూడిటిచే తన్ద్రిజనించును. శ్లేష్మతమోగుణములచేత నిద్ర జనించును. చక్రముపై గూర్చున్నవానివలె కంటికిగానంబడు వస్తువులను తిరుగుచున్నట్లు గాంచుట, ఎల్లప్పుడు భూమియందు పడియుండుట, ఇట్టి గుణములు కల్గినది భ్రమరోగంబని యెరుంగునది.

## తన్ద్రిలక్షణము

శ్లో॥ ఇన్ద్రియార్థేష్వసంవిత్తిః గౌరవం జృమ్భణం క్లమః।
నిద్రార్తస్యేవ యస్యేహా తస్య తన్ద్రీం వినిర్దిశేత్॥౨౦॥

తా॥ చక్షురాదీన్ద్రియములకు నాయావిషయములను గ్రహించు సామర్థ్యము లేకుండుట, శరీరము బరువుగ నుండుట, ఆవలింతలు కల్గుట, బడలిక బుట్టుట, ఇవియన్నియు మేల్కొనియుండు సమయమున నిదురించువానికి గల్గినట్లు జనించినయెడ తన్ద్రియని వ్యవహరించబడును. మరియు నిద్రాలక్షణము మిగుల ప్రసిద్ధంబగుటంజేసి చెప్పలేదు. చరకమునందు "యదా తు మనసి క్లాన్తే కర్మాత్మానః క్లమాన్వితాః। విషయేభ్యో నివర్తన్తే తదా స్వపితి మానవః" అని యున్నది. మనస్సు మిగుల శ్రమనొందియున్నపుడు ఇన్ద్రియము లన్నియు బడలి ఆయా యిన్ద్రియవిషయములగు శబ్దస్పర్శాదులను గ్రహింపంజాలకున్నయపుడు మనుజునకు నిదురవచ్చునని యర్థము. ఇన్ద్రియములకు సంబంధించిన శబ్దస్పర్శాదులును, మనోవ్యాపారంబులును లేకుండునది నిదురయనియు, ఇంద్రియవ్యాపారముల మాత్రము నెరుంగకుండునది తంద్రయనియు, దృశ్యంబులైన పదార్థములన్నియు తిరుగుచున్నట్లు దోచుట భ్రమమనియు పరస్పరభేదముల నెరుంగునది.

## సన్న్యాసమూర్ఛలయొక్క పరస్పరభేదము

శ్లో॥ దోషేషు మదమూర్ఛాయా కృతవేగేషు దేహినామ్।
స్వయమేవోపశామ్యన్తి సన్న్యాసో నౌషధైర్వినా॥౨౧॥

తా॥ వాతాదిదోషములు తమ తమ వేగముజూపి శాంతినొందినపుడు మదమూర్ఛలు తనంతనే శమించును. సన్న్యాసంబను వ్యాధి ఔషధములులేక శాన్తినొందుటలేదు.

## సన్న్యాసలక్షణము

శ్లో॥ వాగ్దేహమనసాం చేష్టా మాక్షిప్యాఽతిబలా మలాః।
సంన్యస్యన్త్యబలం జన్తుం ప్రాణాయతనమాశ్రితాః॥౨౨॥

స నా సన్న్యాససన్న్యస్తః కాష్ఠీభూతో మృతోపమః।
ప్రాణైర్విముచ్యతే శీఘ్రం ముక్త్వా సద్యఃఫలాం క్రియామ్॥౨౩॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
మూర్ఛాభ్రమనిద్రాతన్ద్రాసన్న్యాస
నిదానం సమాప్తమ్.

---

తా॥ మిక్కిలి బలవంతములగు వాతాదిదోషములు వాక్కు, దేహము, మనస్సు, ఈమూడిటికి సంబంధించిన వ్యాపారముల నిరోధించి ప్రాణముల కాధారమైన హృదయమునకేగి గుర్వ్యులుండగ మనుజుని సన్న్యాసపొందించును. వీని నాశ్రయించిన సన్న్యాసముచే పీడితుండై చేష్టలుడిగి కొయ్యవలె మృతునివలె నేలంబడును. ఆసమయమున సద్యఃఫలములగు నాసికాధమనము అంజనము మొదలగు క్రియల జేయకున్నయెడ ప్రాణములచే విడువంబడును. వీనిని చికిత్స జేసినయెడ బ్రతుకును గాని లేనియెడ శీఘ్రముగ మృతుండగునని భావము.

---

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత ... పుట్టిస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దీక్షిత... వంశ...
విధేయ "ఆయుర్వేదమార్తాండ" "భిషగ్వర" "పండిత" ...
లాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానాన్ధ్రతాత్పర్యము
నందు మూర్ఛాభ్రమనిద్రా
తన్ద్రాసన్న్యాస నిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# పానాత్యయ పరమద పానాజీర్ణపాన విభ్రమ నిదానమ్



మూర్ఛ మద్యపానముచేగూడ కల్గును గాన మూర్ఛాది నిదానానంతరము మద్యపానముచే జనించు మదాత్యయాది వికారములను వివరించుట.



## మద్యపానముచే మూర్ఛకల్గుటకు కారణములు

శ్లో॥ యే విషస్య గుణాః ప్రోక్తాస్తేపి మద్యే ప్రతిష్ఠితాః।
తేన మిథ్యోపయుక్తేన భవత్యుగ్రో మదాఽత్యయః॥౧॥
కిన్తు మద్యం స్వభావేన యథైవాన్నం తథా స్మృతమ్।
అయుక్తియుక్తం రోగాయ యుక్తియుక్తం యథాఽమృతమ్॥౨॥
ప్రాణాః ప్రాణభృతామన్నం తదయుక్త్యా హినస్త్యసూన్।
విషం ప్రాణహరం తచ్చ యుక్తియుక్తం రసాయనమ్॥3॥

తా॥ విషమునకు జెప్పిన లఘుత్వాదిగుణంబులన్నియు మద్యమునకుం గలవు గాన అట్టి మద్యమును శాస్త్రోక్తప్రకారము నతిక్రమించి సేవించినయెడ మిగుల తీవ్రంబైన మదాత్యయము జనించును. మరియు మద్యము స్వభావముచేత నన్నమునుబోలె మనుజులకు హితకరంబైయుండును. అట్టి మద్యమును శాస్త్రోక్తవిధానమునకు విరుద్ధముగ సేవించినయెడ రోగముల గల్గించును. శాస్త్రోక్తవిధి ననుసరించి సేవించినయెడల నమృతమునుబోలి శరీరమున కారోగ్యకరంబైయుండును. మనుజులకు యథావిధిగ నుపయోగింపబడిన యన్నము బలకరంబై యుండు. అటుగాక విషముగ భుజించినచో ప్రాణహరంబై యుండును. కాన అవ్విధంబుగనే మద్యముయొక్క గుణదోషముల నెరుంగవలెనని భావము. మరియు విషము స్వభావముచే ప్రాణహరంబైనను శాస్త్రోక్త ప్రకారము సేవించినయెడ రసాయనంబై (ఆయుర్బలముల వృద్ధినొందించునదియై, యుండును. ఇచ్చట "ద్వౌ యవావత్ర హేమ్నస్తు తిలం దద్యాద్విషస్య చ" అను చరకోక్త ప్రమాణము ననుసరించి తిలప్రమాణము విషమును సేవించినయెడ రసాయనంబనియు, అట్టి ప్రమాణమునకన్న నధికముగ సేవించినపుడు ప్రాణహరంబనియు నెరుంగునది.

మరియు మద్యపానముచే మదాత్యయము జనించుక్రమము చరకమునం దిత్తెరంగున గానంబడియెడు. "మద్యం హృదయమావిశ్య స్వగుణైరోజసో గుణాన్ । దశభిర్దశ సంక్షోభ్య చేతో నయతి విక్రియామ్ । లఘూష్ణతీక్ష్ణసూక్ష్మామ్లవ్యవాయ్యాశుగమేవ చ । రూక్షం వికాసి విశదం మద్యం దశగుణం స్మృతం । గురు శీతం మృదు శ్లక్ష్ణం బహలం మధురం స్థిరమ్ । ప్రసన్నం పిచ్ఛిలం స్నిగ్ధం ఓజో దశగుణం స్మృతం । గురుత్వం లాఘవాచ్ఛైత్యమౌష్ణ్యాదమ్లస్వభావతః । మాధుర్యం మార్దవం తైక్ష్ణ్యాత్ప్రసాదఞ్చాశుభావనాత్ । రౌక్ష్యాత్స్నేహం వ్యవాయిత్వాత్స్థిరత్వం శ్లక్ష్ణతామపి । వికాసిభావాత్పైచ్ఛిల్యం వైశద్యాత్సాన్ద్రతాం తథా । సౌక్ష్మ్యాన్మద్యం నిహన్త్యేవమోజసః స్వగుణైర్గుణాన్ । సత్త్వం తదాశ్రయఞ్చాశు సంక్షోభ్య జనయేన్మదమ్॥" మద్యము హృదయమునఁజొచ్చి తనయందలి పదిగుణములచేత ఓజస్సునందలి పదిగుణములను చెరిచి మనస్సును వికారము నొందించును. అది యెట్లులనిన; మద్యము లఘువును (చుల్కనైనది), ఉష్ణంబును (వేడిమికల్గినది), తీక్ష్ణంబును (మృదుత్వములేనిది), సూక్ష్మంబును (సూక్ష్మమైనయాకారము కల్గినది), అమ్లంబును (పులుపుకల్గినది), వ్యవాయియు (తొలుత శరీరమునం దెల్ల వ్యాపించి పిదప జీర్ణంబగునది), ఆశుగము (శీఘ్రముగ రోగములఁ గల్గించునది), రూక్షంబును (జిడ్డులేనిది), వికాసి (ఉదకమునను౦చఁబడిన తైలబిందువువలె పలుతెరంగుల విస్తీర్ణంబగునది), విశదంబును (వేరొందువస్తువునంటకుండునది) నై పదిగుణములు గల్గియుండును. ఓజస్సు, గురుత్వము, శీతలము, మృదుత్వము, శ్లక్ష్ణత్వము, (నునుపుకల్గియుండుట), మధురమైయుండుట, స్థిరత్వము (ఒక్కచోటనే నిలచియుండుట), ప్రసన్నత్వము, పిచ్ఛిలత్వము, స్నిగ్ధత్వము, (జిడ్డుకల్గియుండుట), అను నీపదిగుణములు కల్గియుండును. మద్యము పైఁజెప్పఁబడిన పదిగుణములలో లఘుత్వముచేత ఓజస్సునందలి గురుత్వమును, ఉష్ణముచే శీతలమును, అమ్లరసముచే మధురత్వమును, తీక్ష్ణత్వముచే మార్దవమును, ఆశుకారిత్వముచే ప్రసన్నత్వమును, రూక్షత్వముచేత స్నేహమును, వ్యవాయిత్వముచేత స్థిరత్వమును, వికాసిత్వముచేత శ్లక్ష్ణత్వమును, విశదత్వముచేత పైచ్ఛిల్యమును, సూక్ష్మత్వముచేత సాన్ద్రత్వమును వరుసగా చెరచి, అట్టి యోజస్సును ఆశ్రయించి యుండు సత్వగుణమునుగూడ చెరచి మదమును గల్గించును అని భావము.

మరియు సుశ్రుతమున నీవిషయము నిత్తెరంగున జెప్పెను: "ఔష్ణ్యాచ్ఛైత్యోపచారం చ తైక్ష్ణ్యాద్ధన్తి మనోగతిమ్ । విశత్యవయవాన్ సౌక్ష్మ్యాత్ వైశద్యాత్కఫశుక్రనుత్ । మారుతం కోపయేద్రౌక్ష్యా దాశుత్వాదాశుకర్మకృత్ । హర్షదఞ్చ వ్యవాయిత్వాద్వికాసిత్వాద్విసర్పతి॥" మద్యము ఉష్ణగుణముచేత శీతోపచారములను చెరచును. తీక్ష్ణత్వముచేత మనోగతిని పోగొట్టును. సూక్ష్మత్వముచేత అవయవములయందెల్ల వ్యాపించును. విశదత్వముచేత కఫశుక్రములను నశింపజేయును. రూక్షత్వముచేత వాతమును ప్రకోపింపజేయును. ఆశుకరంబగుటచేత శీఘ్రముగ మోహాదుల గల్గించును. వ్యవాయిత్వముచేత (తొలుత శరీరమున వ్యాపించుటచేత) రోమాంచమును గల్గించును. వికాసిత్వముచేత శరీరమున పలుతెరంగుల వ్యాపించును.

ఇత్తెరంగున మద్యము శరీరమునందెల్ల వ్యాపించునని భావము. ఈ సుశ్రుతవాక్యముచేత మద్యము నందు ఎనిమిదిగుణము లున్నట్టులు తెలియుచున్నది.

మద్యసేవచే జనించు గుణములు

శ్లో॥ విధినా మాత్రయా కాలే హితైరన్నైర్యథా బలమ్।
ప్రహృష్టో యః పిబేన్మద్యం తస్య స్యాదమృతోపమమ్॥౪॥
స్నిగ్ధైస్తదన్నైర్మాంసైశ్చ భక్ష్యైశ్చ సహ సేవితమ్।
భవేదాయుఃప్రకర్షాయ బలాయోపచయాయ చ॥౫॥
కామ్యతా మనసస్తుష్టి స్తేజో విక్రమ ఏవ చ।
విధివత్సేవ్యమానే తు మద్యే సన్నిహితా గుణాః॥౬॥

తా॥ విధిని ప్రమాణమును కాలమును అనుసరించి భుజించబడినవియు హితంబులునైన యన్నాదులచే మనుజునకు శరీరబలము కల్గు చందంబున విధిప్రమాణ కాలముల ననుసరించి సంతుష్టుండై మద్యమును పానముజేసినయెడ నమృతమునుబోలి శరీరమున కారోగ్యకరంబై యుండును. మరియు అట్టిమద్యమును స్నిగ్ధంబులగు భక్ష్యమాంసములతోగూడను నిర్దుష్టంబైన యన్నముతోడను పానముజేసినయెడ ఆయువు, శరీరబలము, శరీరపుష్టి, వీనిని వృద్ధినొందించును. మద్యమును విధిపూర్వకముగ సేవించినయెడ శరీరసౌందర్యము, మనస్సంతోషము, తేజస్సు, పరాక్రమము, ఈ గుణములన్నియు చెడలేగక నుండునని యర్థము. ఇచ్చట ఆహారమును పరిత్యజించి మద్యమును సేవించినయెడ శరీరము కృశతనొంది యనేక వ్యాధులు జనించును గాన నిర్దుష్టంబైన యన్నాదుల భుజించి మద్యమును సేవించవలెనని యెరుంగునది. మరియు "మైరేయం మదిరా శీధు చతుర్థం మధు చోచ్యతే। ఏకైకం షడ్రసం త్వత్ర రసతశ్చామ్లమిష్యతే" "సర్వేషామమ్లజాతీనాం మద్యం మూర్ధ్ని వ్యవస్థితమ్" అనియు గ్రంథాంతరముల గానంబడియెడు. మైరేయము, మదిర, శీధు, మధు, అని నాల్గువిధములైన మద్యములు ఒక్కొకటియు మధురాదిషడ్రసములు కల్గియుండుననియు, అందు అమ్లరసముమాత్రము ప్రధానంబై యుండుననియు, అమ్లరసముకలద్రవ్యములలోపల మద్యము ప్రధానంబై యుండుననియు భావము.

ప్ర థ మ మ ద ల క్ష ణ ము

శ్లో॥ బుద్ధిస్మృతిప్రీతికరస్సుఖశ్చ
పానాఽన్ననిద్రారతివర్ధనశ్చ।
సంపాఠగీతస్వరవర్ధనశ్చ
ప్రోక్తోఽతిరమ్యః ప్రథమో మదో హి॥౭॥

తా॥ మద్యపానముచే జనించు మత్తత మదమనందగు; అట్టి మదము ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థంబులను భేదములచే నాల్గు తెరంగులగును. అందు బుద్ధి, స్మృతి (పూర్వమునం దనుభవించిన

దానిని స్మరించుట), ప్రీతి, వీనిని కల్గించునదియు; సుఖకరంబును, అన్నపానములయందును నిద్రయం దును ప్రీతిని కల్గించునదియు, చదువుటయందును సంగీతమునందును కంఠస్వరమును వృద్ధినొందించు నదియునునై మిగుల రమ్యంబైనది ప్రథమమదంబని యెరుంగునది. మదము సామాన్యముగ మనోవికార జనకంబైనను ఈ ప్రథమమదము మనోవికారములను విశేషముగ గల్గనీయక బుద్ధ్యాదులను వృద్ధినొందించుచుండునని భావము.

## ద్వి తీ య మ ద ల క్ష ణ ము

శ్లో॥ అవ్యక్తబుద్ధిస్మృతివాగ్విచేష్టః
సోన్మత్తలీలాకృతిరప్రశాన్తః।
ఆలస్యనిద్రాభిహతో ముహుశ్చ
మధ్యేన మత్తః పురుషో మదేన॥౮॥

తా॥ ద్వితీయమదముచే మత్తిల్లిన మనుజునకు బుద్ధి స్మృతి వాక్కులు అస్ఫుటములుగ నుండు ట, పిచ్చివానివలె శరీరాకారంబు చేష్టలును గల్గియుండుట, శాన్తములేక కోపముకల్గియుండుట, ఆలస్యము, మాటిమాటికి నిదురగల్గియుండుట, ఈ లక్షణములు కల్గియుండును.

## తృ తీ య మ ద ల క్ష ణ ము

శ్లో॥ గచ్ఛేదగమ్యాన్న గురూంశ్చ మన్యేత్।
ఖాదేదభక్ష్యాణి చ నష్టసంజ్ఞః।
బ్రూయాచ్చ గుహ్యాని హృది స్థితాని
మదే తృతీయే పురుషోఽస్వతన్త్రః॥౯॥

తా॥ తృతీయమదమునందు పురుషుండు మదపరవశుండై పొందతగని గురుభార్య మొదలగు వారితో గలయ నుద్యమించును. పూజ్యులగు గురువులు మొదలగువారిని యవమానము చేయును. ఒడలెరుంగక మైమరచి యుండును. భుజింపదగని యశుద్ధపదార్థముల భుజించును. కృత్యాకృత్య వివేకము లేకుండును. మనంబుననుండు రహస్యవిషయముల నెల్ల వెల్లడిచేయును.

## చ తు ర్థ మ ద ల క్ష ణ ము

శ్లో॥ చతుర్థే తు మదే మూఢో భగ్నదార్వివ నిష్క్రియః।
కార్యాకార్యవిభాగాఽజ్ఞో మృతాదప్యపరో మృతః॥౧౦॥
కో మదం తాదృశం గచ్ఛేదున్మాదమివ చాపరమ్।
బహుదోషమివామూఢః కాన్తారం స్వవశః కృతీ॥౧౧॥

తా॥ నాల్గవ మదమునందు మనుజుండు విరిగి క్రిందపడిన కొయ్యవలె చేష్టారహితుండై కార్యాఽ కార్యజ్ఞాన మొకింతయైన లేక మృతునిభంగి పరవశుండై యుండును. లోకమునందే మనుజుండు స్వవశుండై పెద్దపులి మున్నగు క్రూరజంతువులచే నిండియుండు నరణ్యమున ప్రవేశించుకరణి

ఉన్మాదమును బోలియున్న పూర్వోక్తమదము నొందును! జ్ఞానియగు మనుజుం డట్టి మదము నొంద నుద్యమించడని భావము.

మరియు "ప్రధానాధమమధ్యానాం రుక్మాణాం వ్యక్తిదర్శకః। యథాఽగ్నిరేవం సత్త్వాదేర్మద్యం ప్రకృతిదర్శకమ్" అని చరకమునం దున్నది. ఉత్తమాఽధమ మధ్యంబులైన బంగారుయొక్క గుణములను అగ్ని విశదముగ దెలియజేయుకరణి మద్యము సత్వరజస్తమోగుణములచేత నానాప్రకృతులను దెలుపునని యర్థము. సత్వప్రధానులకు ప్రథమమదము జనించుననియు, రజోగుణప్రధానులకు ద్వితీయమదము జనించుననియు, తమోగుణప్రధానులకు తృతీయమదము జనించుననియు భావము. ఈ వాక్యములచేత మదము మూడు తెరంగులని దెలియుచున్నను ద్వితీయ తృతీయ మదములయొక్క అంతరావస్థను తృతీయమదమని సుశ్రుతాచార్యుండు పరిగణనము జేసి నాల్గుమదములను వచించెను. కాన తదనుసారముగ నిచ్చట నాల్గు మదభేదములు చెప్పంబడినవి యని యెరుంగునది. ద్వితీయ తృతీయ మదములయొక్క సంధ్యవస్థ నీరీతిగ వాగ్భటాచార్యుండు వచించెను. "మధ్యమోత్తమయోస్సన్ధిం ప్రాప్య రాజసతామసః। నిరంకుశ ఇవ వ్యాళో న కిఞ్చిన్నాఽఽచరేజ్జడః" రజోగుణంబైనను తమోగుణంబైనను కల మనుజుండు మధ్యమ తృతీయ మదములయొక్క సంధినొంది అంకుశములేని దుష్టగజముచందమున నానావిధ క్రూరచేష్టలం జేయునని భావము.

మరియు నీ త్రివిధమదములచే గల్గు చేష్టావిశేషములు గ్రన్థాన్తరమున నీవిధంబుగ గానంబడియెడు: "సాత్త్వికే శౌచ దాక్షిణ్య హర్ష మండనలాలసః। గీతాధ్యయనసౌభాగ్య సురతోత్సాహకృన్మతః। రాజసే దుఃఖశీలత్వమాత్మత్యాగం ససాహసమ్। కలహం సానుబన్ధం చ కరోతి పురుషే మదః। అశౌచనిద్రామాత్సర్యాఽగమ్యాగమనలోలతాః। అసత్యభాషణం చాపి కుర్యాద్వై తామసే మదే" సాత్వికపురుషునకు గల్గిన మదమునందు పరిశుద్ధత్వము, దాక్షిణ్యము, అలంకారములయం దిచ్ఛ, గానమునందును అధ్యయనమునందును రతిక్రీడలయందును ఉత్సాహము, శరీరసౌన్దర్యము, ఈ గుణములు కల్గుననియు; రాజసగుణముకల్గినవానికి జనించిన మదమునందు దుఃఖించుట, సాహసముచే ప్రాణత్యాగమున కుద్యమించుట, కలహమాడుట, ఈలక్షణములు కల్గుననియు; అపరిశుద్ధముగ నుండుట, నిద్ర, మాత్సర్యము, పొందదగని గురుభార్య మొదలగువారిని పొంద నిచ్ఛకల్గుట, అబద్ధములాడుట, ఈ లక్షణములు తామసగుణప్రధానులకు జనించుననియు భావము.

## అయుక్తమద్యసేవనముచే జనించు వికారములు

శ్లో॥ నిర్భక్తమేకాన్తత ఏవ మద్యం
నిషేవ్యమాణం మనుజేన నిత్యమ్।
ఆపాదయేత్కష్టతమాన్వికారా-
నాపాదయేచ్చాపి శరీరభేదమ్ ॥౧౨॥

తా॥ అన్నమును భుజించక కేవలమద్యమును ఎడలేక పానముచేసినయెడ మిగుల కష్టతరంబులగు వ్యాధులను గల్గించి శరీరమును నశింపజేయును.

మద్యపానాఽనర్హ కారణములు

శ్లో॥ క్రుద్ధేన భీతేన పిపాసితేన
శోకాభితప్తేన బుభుక్షితేన ।
వ్యాయామభారాధ్వపరిక్షతేన
వేగావరోధాఽభిహతేన చాపి॥౧౩॥
అత్యమ్లభక్షాఽవతతోదరేణ
సాఽజీర్ణభుక్తేన తథాఽబలేన ।
ఉష్ణాభితప్తేన చ సేవ్యమానం
కరోతి మద్యం వివిధాన్వికారాన్॥౧౪॥

తా॥ మనుజుండు క్రుద్ధుండై యున్నను, భీతిజెందినపుడును, దప్పిగొనియున్నపుడును, దుఃఖముచే తాపము నొంది యున్నను, ఆకలిగొనియున్నను, దేహపరిశ్రమచేతను మార్గము నడచుటచేతను భారమును మోచుటచేతను కృశతనొందియున్నను, మలమూత్రాదివేగముల నిరోధించుటచే శ్రమ జెందియున్నను, ఉదకము నధికముగా పానముచేయుటచే కడుపు పెరిగియున్నను, జీర్ణముకాక మున్నె భుజించియున్నను, బలహీనుండైయున్నను, ఉష్ణముచే తాపమునొందియున్నను, ఇట్టి సమయములయందు మద్యమును పానము జేసినయెడ పానాత్యయము మున్నగు వికారము లనేకముగ జనించును.

మదవికారభేదములు

శ్లో॥ పానాత్యయం పరమదం పానాఽజీర్ణమథాపి వా ।
పానవిభ్రమముగ్రం చ తేషాం వక్ష్యామి లక్షణమ్॥౧౫॥

తా॥ పానాత్యయమనియు, పరమదమనియు, పానాజీర్ణమనియు, పానవిభ్రమమనియు, మద్యపానముచే జనించు వ్యాధులు నాల్గువిధంబులు. వీనికన్నిటికి లక్షణముల వరుసగ జెప్పెదనని భావము.

వాతాధిక మదాత్యయ లక్షణము

శ్లో॥ హిక్కా-శ్వాసశిరఃకమ్పపార్శ్వశూలప్రజాగరైః ।
విద్యాద్బహుప్రలాపస్య వాతప్రాయం మదాత్యయమ్॥౧౬॥

తా॥ వెక్కిళ్లు, శ్వాసము, తలవణకు, ఇరుప్రక్కల నొప్పి, నిదురబట్టకుండుట, మితిమీరి మాటలాడుట, ఈ లక్షణములు కల్గినది వాతప్రకోపముచే జనించిన మదాత్యయమని యెరుంగునది.

పిత్తప్రాయ మదాత్యయ లక్షణము

శ్లో॥ తృష్ణాదాహజ్వరస్వేదమోహాఽతీసారవిభ్రమైః ।
విద్యాద్ధరితవర్ణస్య పిత్తప్రాయం మదాత్యయమ్॥౧౭॥

తా॥ దప్పి, వాతము, జ్వరము, చెమటబట్టుట, మోహము, అతిసారము, భ్రమము, శరీరము పచ్చగనుండుట, ఈ లక్షణములు కల్గినది పిత్తంబధికముగా గల మదాత్యయంబని యెరుంగునది.

కఫప్రాయ మదాత్యయ లక్షణము

శ్లో॥ ఛర్ద్యరోచకహృల్లాసతన్ద్రాస్తైమిత్యగౌరవైః ।
విద్యాచ్ఛీతపరీతస్య కఫప్రాయం మదాత్యయమ్॥౧౮॥

తా॥ వాంతి, అరోచకము, నోట నీరు వెడలుట, కునికిపాటు, శరీరము నీటదడసినట్లుండుట, శరీరము బరువై యుండుట, శరీరము చల్లనై చలిబుట్టుట, ఈలక్షణములు కల్గినది కఫప్రచురంబైన మదాత్యయమని తెలియందగినది.

సన్నిపాతజ మదాత్యయ లక్షణము

శ్లో॥ జ్ఞేయ స్త్రిదోషజశ్చాపి సర్వలిఙ్గైర్మదాత్యయః ।

తా॥ పైనజెప్పిన త్రిదోషలక్షణములతో గూడినది సన్నిపాతముచే జనించిన మతాద్యాయ మని యెరుంగునది.

మరియు చరకమునందు "యే విషస్య గుణాః ప్రోక్తాస్సర్వదోషప్రకోపణాః" అని యుపక్రమించి "సర్వం మదాత్యయం విద్యా త్త్రిదోషమ్" అని చెప్పియుండుటచే మదాత్యయము త్రిదోషజంబైనను అట్టి దోషత్రయములో నేది యధికముగా నుండునో దానినిపట్టి పైనజెప్పిన వాతాదిభేదములను, దోషత్రయము సమానముగ ప్రకుపితంబై యున్నయెడ సన్నిపాతజ భేదమును ఎరుంగునది.

పరమద లక్షణము

శ్లో॥ శ్లేష్మోచ్ఛ్రయోఽఙ్గగురుతా విరసాస్యతా చ
విణ్మూత్రసక్తిరథ తన్ద్రిరరోచకశ్చ ।
లిఙ్గం పరస్య చ మదస్య వదన్తి తజ్జ్ఞాః
తృష్ణా రుజా శిరసి సన్ధిషు చాపి భేదః ॥౧౮॥

తా॥ నాసాదిస్రోతస్సులయందు శ్లేష్మం బధికముగ స్రవించుట, శరీరము బరువుగానుండుట, నోరు రసహీనంబై యుండుట, మలమూత్రములు ప్రవర్తించకుండుట, కునికిపాటు, అరుచి, డప్పి, తలనొప్పి, సంధులు శిథిలముగా నుండుట, ఈ లక్షణములు కల్గినది పరమదంబని యర్థము.

పానాఽజీర్ణ పానవిభ్రమ లక్షణములు

శ్లో॥ ఆధ్మానముగ్రమథ చోద్గిరణం విదాహః
పానేఽజరాం సముపగచ్ఛతి లక్షణాని ।
హృద్గాత్రతోదకఫసంస్రవకంఠధూమా
మూర్ఛావమిజ్వరశిరోరుజసప్రదాహాః ॥౨౦॥

ద్వేషస్సురాన్నవికృతేష్వపి తేషుతేషు
తం పానవిభ్రమముశన్త్యఖిలేన ధీరాః ।

తా॥ కడుపుబ్బరము, త్రేనుపులువచ్చుట, సంతాపము కల్గుట, ఈ లక్షణములు పానముజేయబడిన మద్యము జీర్ణముగాకుండునపుడు సంభవించును. ఇదియే పానాజీర్ణంబని భావము. హృదయమునందును అవయవములయందును పోట్లు, స్రోతస్సులయందు కఫము స్రవించుట, కంఠముననుండి పొగవెడలునట్లుండుట, మూర్ఛగల్గుట, వాంతిగల్గుట, జ్వరము, తలనొప్పి, తలమంట, సురావికారములయందును, అన్నవికారములగు లడ్డుకాది పదార్థములయందును ద్వేషము, ఈ లక్షణములు కల్గినది పానవిభ్రమమని యెరుంగునది.

### అసాధ్య మదాత్యయలక్షణము

శ్లో॥ హీనోత్తరోష్ఠమతిశీతమమన్దదాహం
తైలప్రభాస్యమపి పానహతం త్యజేత్తు॥౨౧॥
జిహ్వౌష్ఠదన్తమసితం త్వథవాపి నీలం
పీతౌ చ యస్య నయనే రుధిరప్రభే వా ।
హిక్కా జ్వరౌ వమథువేపథుపార్శ్వశూలాః
కాసభ్రమావపి చ పానహతం భజన్తే॥౨౨॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
పానాత్యయ పరమద పానాజీర్ణ పాన
విభ్రమ నిదానం సమాప్తమ్

---

తా॥ పైపెదవి వ్రేలుచుండుట, శరీరమునకు పైభాగమున మిగులశీతము, లోప్రక్క మిక్కిలి సంతాపము, నోటియందు నూనెబూసినట్లుండుట, నాలుక, పెదవులు, దన్తములు, ఇవి నల్లగానుండుట, లేక నీలవర్ణముగనైన నుండుట, కన్నులు పచ్చగనైనను రక్తవర్ణముగనైన నుండుట, ఈ లక్షణములు మద్యపానముజేసినవానికి గల్గినయెడ ఆమనుజుండు బ్రతుకుటలేదు. ఇట్టి లక్షణములు కల మదాత్యయము కష్టసాధ్యంబని భావము. మరియు వెక్కిళ్లు, జ్వరము, వాన్తి, వణకు, ప్రక్కలనొప్పి, కాసము, భ్రమము, ఇవియన్నియు మదాత్యయమున కుపద్రవములని భావము. ఈ యుపద్రవములతో గూడిన మదాత్యయము కృచ్ఛ్రసాధ్యంబని భావము.

మరియు చరకము ధ్వంసకవిక్షేపకంబు లను రెండు మదాత్యయముల జెప్పియున్నది. అవి యెట్లులనిన "విచ్ఛిన్నమద్యస్సహసా యోఽతిమద్యం నిషేవతే । ధ్వంసో విక్షేపకశ్చైవ రోగస్తస్యోపజాయతే । శ్లేష్మప్రసేకః కణ్ఠాస్యశోషః శబ్దాసహిష్ణుతా । తన్ద్రానిద్రాభియోగశ్చ జ్ఞేయం ధ్వంసక లక్షణమ్ । హృత్కణ్ఠరోధస్స

మోహాశ్ఛర్దిరజ్గరుజాజ్వరః । తృష్ణా కాసశ్శిరశ్శూల మేతద్విక్షేప లక్షణమ్ ”
అని యున్నది. మద్యపానముచే జనించిన మదము కొంచెము శమించిన తోడనే మరల నధికముగ మద్యమును పానముజేసినయెడ వానికి ధ్వంసక విక్షేపకంబు లనురెండువ్యాధులు జనించును. అందు స్రోతస్సులనుండి శ్లేష్మము స్రవించుట, కంఠమును నోరును ఎండిపోవుట, ధ్వనిని విన సహించకుండుట, కునికిపాటు, అతినిద్ర ఈలక్షణములు కల్గినది ధ్వంసకమనియు, హృదయకంఠము లడచికొనియుండుట, మూర్ఛగల్గుట, వాంతియగుట, ఒళ్లునొచ్చుట, జ్వరము, దప్పి, దగ్గు, తలనొప్పి, ఈలక్షణములు కల్గినది విక్షేపకంబనియు భావము. మరియు “తయోః కర్మ చికిత్సాచ వాతికే యన్మదాత్యయే ”అని యుండుటంజేసి ధ్వంసకవిక్షేపకముల రెంటికిని వాతముచే జనించిన మదాత్యయమునకు జెప్పిన చికిత్సలనే జేయవలెనని యెరుంగునది.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి [illegible]
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్ర
విరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ “ఆయుర్వేదమార్తాణ్డ” “భిషఙ్మణి” “పణ్డిత” గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానధ్వని తాత్పర్యము
నందు పానాత్యయ పరమద
పానాజీర్ణ పానవిభ్రమ
ని దా న ము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# దాహనిదానమ్



పానాత్యయమున దాహముగూడ జనించును గాన పానాత్యయ నిదానానంతరము దాహనిదానమును జెప్పుట.



## మద్యజ దాహ లక్షణము

శ్లో॥ త్వచం ప్రాప్తస్సపానోష్మా పిత్తరక్తాభిమూర్ఛితః ।
దాహం ప్రకురుతే ఘోరం పిత్తవత్తత్ర భేషజమ్॥౧॥

తా॥ మద్యపానముచే ప్రకోపమునొందిన పిత్తముయొక్క ఉష్ణము రక్తముతోగూడి వృద్ధినొంది చర్మగతంబై క్రూరమైన తాపమును గల్గించును. అట్టి తాపమునకు పిత్తమునకు జేయు చికిత్సల జేయవలెనని భావము.

## రక్తజ దాహ లక్షణము

శ్లో॥ కృత్స్న దేహానుగం రక్తముద్రిక్తం దహతి ధ్రువమ్ ।
స ఉష్యతే తృష్యతే చ తామ్రాభస్తామ్రలోచనః॥౨॥
లోహగన్ధాఙ్గవదనో వహ్నినేవావకీర్యతే ।

తా॥ శరీరమునందంతట వ్యాపించిన రక్తము ప్రకుపితంబై శరీరమును దహించును; అట్టి మనుజుడు అగ్నిసమీపముననున్న చందంబున తాపమునొంది యధికముగ దప్పిగొని యుండును. మరియు శరీరంబును కన్నులును ఎఱ్ఱనై యుండును. శరీరంబును ముఖంబును లోహమునకు సమానమైన గంధముగల్గియుండును. శరీరముపైన యగ్నికణముల జల్లినట్లు మంట బుట్టును.

## పిత్తజ తృష్ణానిరోధజ దాహ లక్షణములు

శ్లో॥ పిత్తజ్వరసమః పిత్తాత్సచాప్యస్యవిధిస్స్మృతః॥3॥
తృష్ణానిరోధాదబ్ధాతౌ క్షీణే తేజసముద్ధతమ్ ।

స బాహ్యాభ్యన్తరం దేహం ప్రదహేన్మన్దచేతసః॥౪॥
సంశుష్కగలతాల్వోష్ఠో జిహ్వాం నిష్కృష్య వేపతే।

తా॥ పిత్తముచే జనించినదాహము పిత్తజ్వరమునకు సమంబులగు లక్షణములు కల్గియుండును, మఱియు నీదాహమునకు పిత్తజ్వరమునకు జేయు చికిత్స జేయవలెను. దప్పిని నిరోధించుటచేత జలవహంబైన ధాతువు క్షీణించి దానంజేసి యుష్ణము ప్రబలంబై శరీరమునందెల్ల వ్యాపించి శరీరముయొక్క బాహ్యాభ్యంతరములను దహింపజేయును. అట్టి దాహమునందు మనుజుండు ఎండిన కంఠమును తాలువులును పెదవులును కలవాడైయుండును. నాలుకను బైటసాచి వణకుచుండును.

## కో ష్ఠ జ దా హ ల క్ష ణ ము

శ్లో॥ అసృజః పూర్ణకోష్ఠస్య దాహోఽన్యస్స్యాత్సుదుస్తరః॥౫॥

తా॥ శస్త్రప్రహారాదులచే కల్గిన రక్తముచే నిండియున్న కోష్ఠముగల మనుజునకు మిగుల దుస్సాధ్యంబైన దాహము కల్గును. మఱియు సుశ్రుతమునందు "స్థానాన్యామాగ్నిపక్వానాం మూత్రస్య రుధిరస్యచ। హృదున్డుకః పుప్ఫుసశ్చ కోష్ఠ ఇత్యభిధీయతే" అని యున్నదిగాన ఇచ్చట కోష్ఠశబ్దముచేత ఆమాశయము, అగ్నిస్థానము, పక్వాశయము, మూత్రాశయంబైన వస్తి, రక్తమునకు స్థానంబులైన యకృత్ప్లీహములు, హృదయము, ఉండుకము, పుప్ఫుసము, ఇవి యన్నియు గ్రహించబడునని యెఱుంగునది.

## ధా తు క్ష య జ దా హ ము

శ్లో॥ ధాతుక్షయోక్తో యో దాహస్తేన మూర్ఛాతృడన్వితః।
క్షామస్వరః క్రియాహీనః స సీదేద్భృశపీడితః॥౬॥

తా॥ రసాదిధాతువులు క్షయించుటచే గల్గినదాహమునందు మూర్ఛ, డప్పి, స్వరహీనము, నిశ్చేష్టత్వము, ఇట్టిబాధలచే మిక్కిలి పీడింపబడి మనుజుండు మృతిజెందును.

## మ ర్మ జ దా హ ల క్ష ణ ము

శ్లో॥ మర్మాభిఘాతజోఽప్యస్తి సోఽసాధ్యస్సప్తమో మతః।
సర్వ ఏవ చ వర్జ్యాస్స్యుశ్శీతగాత్రస్య దేహినః॥౭॥



ఇతి శ్రీ మాంధవకరవిరచితే మాంధవనిదానే
దాహ నిదానం సమాప్తమ్

తా॥ మర్మస్థానంబులైన శిరస్సు, హృదయము, వస్తి మున్నగుస్థానములయందు అభిఘాతముచే నేడవదాహము జనించును. ఈచెప్పంబడిన దాహంబులన్నియు శీతలంబైన శరీరముకల మనుజునకు గల్గినయెడ నసాధ్యంబులై యుండునని భావము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్ర విరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపాలాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానాన్ధ్రి తాత్పర్యమునందు

దాహనిదానము

సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# ఉన్మాదనిదానమ్



మదాత్యయమునందు "ఉన్మాదమివచాపరమ్" అని యున్మాదసాదృశ్యమును జెప్పి యుండుటచే మదాత్యయానన్తరము ఉన్మాదనిదానమును చెప్పుట యావశ్యకంబైనను మదాత్యయ సంబద్ధమైన దాహలక్షణము మిగుల స్వల్పంబుగాన సూచీకటాహన్యాయము ననుసరించి అట్టి దాహలక్షణమును తొలుత నిరూపించి పిదప ఉన్మాదనిదానము జెప్పంబడుచున్నది.



## ఉన్మాదశబ్దమునకు అన్వర్థత్వ నిరూపణము

శ్లో॥ మదయన్త్యుద్గతా దోషా యస్మాదున్మార్గమాగతాః।
మానసోఽయమతో వ్యాధిరున్మాద ఇతి కీర్తితః॥౧॥

తా॥ మిగుల వృద్ధిజెంది హృదయమున కూర్ధ్వభాగము ననుసరించిన వాతాదిదోషములు మనోవహంబులగు ధమనుల నాశ్రయించి మనస్సు భ్రమింపజేయుటచే నున్మాదమని చెప్పంబడును. "ఉన్మాద్యతే అనేనేతి ఉన్మాదః" అను వ్యుత్పత్తిచేత మనస్సును చలింపం జేయు వ్యాధి ఉన్మాదమని భావము; దానంజేసి యీవ్యాధి మనస్సంబంధమైనది.

## ఉన్మాదభేదములు

శ్లో॥ ఏకైకశస్సర్వశశ్చ దోషైరత్యర్థమూర్ఛితైః।
మానసేన చ దుఃఖేన స చ పఞ్చవిధో మతః॥౨॥
విషాద్భవతి షష్ఠశ్చ యథాస్వం తత్ర భేషజమ్।
స చాఽప్రవృద్ధస్తరుణో మదసంజ్ఞాం బిభర్తి చ॥౩॥

తా॥ మరియు నాయున్మాదం బను వ్యాధి వాతపిత్తశ్లేష్మములచేతను, సన్నిపాతముచేతను, మనోగతదుఃఖముచేతను, విషముచేతను జనించుటంజేసి ఆరువిధంబులగును. అట్టి యున్మాదము వృద్ధినొందక బాల్యావస్థనొందియుండెనేని యది మదంబనికూడ జెప్పంబడును.

## ఉన్మాదసామాన్యహేతువులు

శ్లో॥ విరుద్ధదుష్టాఽశుచిభోజనాని
ప్రధర్షణం దేవగురుద్విజానామ్।

ఉన్మాదహేతుర్భయహర్షపూర్వో
మనోఽభిఘాతో విషమాశ్చ చేష్టాః॥౪॥

తా॥ విరుద్ధంబులును, విషానులచే దుష్టంబులును, అపరిశుద్ధంబులునైన యన్నాదుల భుజించుట, దేవతలను, గురువులను, బ్రాహ్మణులను అవమానించుట, భయసంతోషములచే గల్గిన మనోఽభిఘాతము, విరుద్ధంబులైన అవయవచేష్టలు, ఇవియన్నియు నున్మాదము జనించుటకు కారణములని భావము.

ఉన్మాదసంప్రాప్తి

శ్లో॥ తైరల్పసత్వస్య మలాః ప్రదుష్టాః
బుద్ధేర్నివాసం హృదయం ప్రదూష్య।
స్రోతాంస్యధిష్ఠాయ మనోవహాని
ప్రమోహయన్త్యాశు నరస్య చేతః॥౫॥

తా॥ పూర్వోక్తకారణములచేత దుష్టంబులైన వాతాదిదోషములు రజస్తమోగుణములచే నావృతమైన। సత్వగుణముగల మనుజునియొక్క బుద్ధికి నివాసంబైన హృదయమును దుష్టముగ జేసి మనోవహంబులగు పదిధమనుల వ్యాపించి మనుజునియొక్క మనస్సును మోహమునొందించును. ఇదియే ఉన్మాదవ్యాధియని భావము.

ఉన్మాదసామాన్యరూపము

శ్లో॥ ధీవిభ్రమః సత్వపరిప్లవశ్చ
పర్యాకులా దృష్టిరధీరతా చ।
అబద్ధవాక్త్వం హృదయం చ శూన్యం
సామాన్యమున్మాదగదస్య లిఙ్గమ్॥౬॥

తా॥ బుద్ధి భ్రమజెందుట, మనస్సు చంచలముగనుండుట, దృష్టి నిల్కడలేకుండుట, ధైర్యము దప్పి భయపడుట, అసంబద్ధముగ మాటలాడుట, హృదయమునకు విచారణశక్తిలేక శూన్యమైయుండుట, ఇవియన్నియు నున్మాదమునకు సామాన్యచిహ్నములని భావము.

వాతజఉన్మాదలక్షణము

శ్లో॥ రూక్షాల్పశీతాన్నవిరేకధాతు
క్షయోపవాసైరనిలోఽతివృద్ధః।
చిన్తాదిదుష్టం హృదయం ప్రదూష్య
బుద్ధిం స్మృతిం చాప్యుపహన్తి శీఘ్రమ్॥౭॥
అస్థానహాస్యస్మితనృత్యగీత
వాగఙ్గవిక్షేపణరోదనాని।

పారుష్యకార్శ్యాఽరుణవర్ణతాశ్చ
జీర్ణే బలం చాఽనిలజస్య రూపమ్॥౮॥

తా॥ రూక్షాన్నమును అల్పాన్నమును శీతాన్నమును భుజించుట, వమనవిరేచనముల జేయించుట, రసాది ధాతువులు క్షయించుట, ఉపవాసముల జేయుట, ఈ కారణములచేత వృద్ధినొందిన వాతము చింతాదులచే దుష్టమైన హృదయమును దుష్టముగజేసి బుద్ధిని స్మృతిని శీఘ్రముగ నశింపజేయును. మరియు హాస్యము, చిరునగవు, నృత్యము, గానము, మాటలు, అవయవవిన్యాసము, రోదనము, ఈ కృత్యములను కారణములేకనే చేయుట, దేహము పరుసంబై యుండుట, కృశత నొందుట, అరుణవర్ణముగనుండుట, ఆహారము జీర్ణంబైనయపుడు వ్యాధిబలమై యుండుట, ఈలక్షణములు కల్గినది వాతముచే జనించిన యున్మాదమని యెరుంగునది.

పి త్త జో న్మా ద ల క్ష ణ ము

శ్లో॥ అజీర్ణ కట్వమ్లవిదాహ్యశీతైః
భోజ్యైశ్చితం పిత్తముదీర్ణ వేగమ్।
ఉన్మాదమత్యుగ్రమనాత్మకస్య
హృది స్థితం పూర్వవదాశు కుర్యాత్॥౯॥
అమర్ష సంరమ్భవినగ్నభావాః
సన్తర్జనాఽతిద్రవణౌష్ణ్యరోషాః।
ప్రచ్ఛాయశీతాన్నజలాభిలాషః
పీతా చ భాః పిత్తకృతస్య లిఙ్గమ్॥౧౦॥

తా॥ పక్వముగాని యన్నము, కారము, పులుసు, తాపకరంబులైన పదార్థములు, ఉష్ణకర పదార్థములు, వీనిని భుజించుటచేత పిత్తము మిగుల వృద్ధినొంది తీవ్రవేగము గల్గినదియై యింద్రియముల జయించలేని పురుషునియొక్క హృదయమున వ్యాపించి పై జెప్పినరీతిగనే శీఘ్రముగ నున్మాదమును గల్గించును. దానంజేసి ఓర్పులేకుండుట, ఆర్భటముచేయుట, దిగంబరముగా నుండుట, ఇతరులను భయపెట్టుట, పరుగెత్తుట, శరీరం ఉష్ణముగనుండుట, కారణములేకనే కోపముగల్గుట, నీడయందును, చల్లనియన్నమునందును, చల్లనినీళ్లయందును అభిలాష గల్గుట, ముఖము పసపువర్ణము గల్గియుండుట, ఇట్టిలక్షణములు కల్గును.

క ఫ జో న్మా ద ల క్ష ణ ము

శ్లో॥ సంపూరణైర్మన్దవిచేష్టితస్య
సోష్మా కఫో మర్మణి సంప్రవృద్ధః।
బుద్ధిం స్మృతిం చాప్యుపహత్య చిత్తం
ప్రమోహయన్ సంజనయేద్వికారమ్॥౧౧॥

వాక్చేష్టితం మన్దమరోచకశ్చ
నారీవివిక్తప్రియతాఽతినిద్రా।
ఛర్దిశ్చ లాలా చ బలం చ భుక్తే
నఖాదిశౌక్ల్యం చ కఫాత్మకే స్యాత్॥౧౨॥

తా॥ దేహ పరిశ్రమము జేయకుండువానికి మిగుల తృప్తికరంబులైన పదార్థములను భుజించుటచే కఫము పిత్తముతోగూడి హృదయమున దుష్టంబై బుద్ధిని జ్ఞాపకశక్తిని నశింపంజేసి మనస్సును మోహింపంజేసి యున్మాదమును గల్గించును. ఇది కఫజోన్మాదమని యెఱుంగునది. ఈ యున్మాదమునందు మాటలాడుట మున్నగు వాగ్వ్యాపారములు మందములగుట, అరోచకము, స్త్రీలయందును విజనస్థలముననుండుటయందును అభిలాషగల్గుట, మిక్కుటమైన నిద్ర, వాంతిగల్గుట, నోట జొల్లుకారుట, భుజించినపిదప రోగము వృద్ధినొందుట, గోళ్లు చర్మము మూత్రము మొదలగునవి తెల్లగానుండుట, ఈలక్షణములు కల్గును.

ఇచ్చట కఫముచే జనించు ఉన్మాదమున వ్యాధిస్వభావముచే పిత్తముగూడ అనుబంధమైయుండునని యెఱుంగునది. కొందరు కఫపిత్తములు రెండునుకలిసి యున్మాదమును గల్గించుననియు, కొందరు ఊష్మశబ్దమునకు ప్రబలమైన శక్తిగల కఫము అని యర్థముచెప్పి బలిష్ఠమైన కఫముచే నున్మాదము గల్గుననియు వచించెదరు.

## సన్నిపాతజోన్మాదలక్షణము

శ్లో॥ యస్సన్నిపాతప్రభవోఽతిఘోరః
సర్వైస్సమస్తైస్సచ హేతుభిస్స్యాత్।
సర్వాణి రూపాణి బిభర్తి తాదృ
గ్విరుద్ధభైషజ్యవిధిర్వివర్జ్యః॥౧౩॥

తా॥ వాతాదిదోషత్రయము నానావిధంబులైన తమతమ కారణములచే ప్రకోపించి మిగుల భయంకరమైన ఉన్మాదవ్యాధిని కల్గించును; దీనిని సన్నిపాతోన్మాదమని వచించెదరు. ఈ యున్మాదమునందు వాతాద్యున్మాదములకు వేర్వేరుగ జెప్పంబడిన లక్షణములన్నియు గానంబడును, వాతాదులకు వేర్వేరుగ జెప్పంబడిన చికిత్సలు పరస్పరవిరుద్ధంబులుగాన నీ సన్నిపాతోన్మాదమునకు జికిత్సజేయం జనదు. ఉన్మాదవ్యాధియందు వాతాదిదోషములకు విరుద్ధంబులైన చికిత్సల జెప్పియున్నదిగాన సన్నిపాతజోన్మాదమునందు త్రిదోషములకు విరుద్ధంబులైన చికిత్సలు పరస్పర విరుద్ధంబులుగా నుండుటంజేసి యట్టి చికిత్సలచే నసాధ్యంబని భావము.

## శోకజోన్మాదలక్షణము

శ్లో॥ చోరైర్నరేన్ద్రపురుషైరరిభిస్తథాన్యై
ర్విత్రాసితస్య ధనబాన్ధవసంక్షయాద్వా।
గాఢం క్షతే మనసి చ ప్రియయా రిరంసో
ర్జాయేత చోత్కటతమో మనసో వికారః॥౧౪॥

చిత్రం బ్రవీతి చ మనోఽనుగతం విసంజ్ఞో
గాయత్యథో హసతి రోదితి చాపి మూఢః।

తా॥ దొంగలు, రాజభటులు, శత్రువులు మొదలగువారివలన భియమునొందుటచేనైనను, ధనంబును బంధువులును నశించుటచేనైనను, తనకు మిగుల ప్రియురాలైన స్త్రీతో సంభోగించ నిచ్ఛగొని యది లభించకపోవుటచేనైనను మనస్సు మిగుల ఖేదమునొందినపుడు దానంజేసి మిక్కిలి క్రూరంబైన ఉన్మాదము జనించును. అట్టిదుఃఖముచే జనించిన యున్మాదమునందు నానావిధములుగ మాటలాడుట, మనస్సునందు రహస్యాంశముల బైటచెప్పుట, విరుద్ధజ్ఞానము గల్గుట, గానముచేయుట, నవ్వుట, ఏడ్చుట, మూఢచిత్తుండగుట, ఈలక్షణములు గల్గును.

విషజోన్మాదలక్షణము

శ్లో॥ రక్తేక్షణో హతబలేన్ద్రియభాస్సుదీనః
శ్యావాననో విషకృతేఽథ భవేద్విసంజ్ఞః॥౧౫॥

తా॥ విషముచేగల్గిన ఉన్మాదమునందు కన్నులెఱ్ఱనగుట, దేహబలము, ఇంద్రియబలము, దేహకాంతి, ఇవి నశించుట, మిగుల దైన్యమునొందుట, ముఖమున శ్యావ (నలుపుపసుపుగలిసిన) వర్ణము గల్గుట, శరీరమున ప్రజ్ఞ లేకుండుట, ఈలక్షణములు కల్గును.

అసాధ్యోన్మాదలక్షణములు

శ్లో॥ అవాఙ్చ్వాప్యుదఙ్చ్వా క్షీణమాంసబలో నరః।
జాగరూకో హ్యసన్దేహ మున్మాదేన వినశ్యతి॥౧౬॥

తా॥ తలవాంచియైనను ఊర్ధ్వముఖముగనైనను నుండుట, మాంసబలము నశించుట, నిదుర బట్టకుండుట, ఈ లక్షణములు ఉన్మాదవ్యాధికలవానికి జనియించినయెడ మరణము నొందును. ఇచ్చట ''అవాఙ్ముఖస్తూన్ముఖో వా'' అను పాఠము మిక్కిలి సాధువుగా నుండును.

భూతోన్మాదసామాన్యలక్షణము

శ్లో॥ అమర్త్యవాగ్విక్రమవీర్యచేష్టో
జ్ఞానాదివిజ్ఞానబలాదిభిర్యః।
ఉన్మాదకాలోఽనియతశ్చ యస్య
భూతోత్థమున్మాదముదాహరేత్తమ్॥౧౭॥

తా॥ మనుష్యుల కసర్వాంబులైన వాక్కు, విక్రమము, బలము, చేష్టలు, ఇవి గల్గియుండుట, తత్త్వజ్ఞానంబును, శిల్పజ్ఞానంబును, శరీరబలంబును గల్గియుండుట, ఉన్మాదము జనించు కాలము నియతము గాకుండుట, ఈ లక్షణములు గల యున్మాదమును భూతావేశముచే జనించినది యని యెరుంగునది.

## దేవగ్రహోన్మాద లక్షణము

శ్లో॥ సంతుష్టశ్శుచిరతిదివ్యమాల్యగన్ధో
నిస్తన్ద్రీరవితథసంస్కృతప్రభాషీ।
తేజస్వీ స్థిరనయనో వరప్రదాతా
బ్రహ్మణ్యో భవతి నరస్స దేవజుష్టః॥౧౭॥

తా॥ ఎల్లప్పుడు సంతోషముతో గూడి యుండుట, పరిశుద్ధముగనుండుట, దేహమున దివ్యమైన పుష్పమాలికయొక్క పరిమళమును వహించి యుండుట, నిదురలేకుండుట, సత్యముగ సంస్కృతము మాటలాడుట, తేజస్సు గల్గి యుండుట, స్థిరమైన నేత్రములు గల్గియుండుట, వరముల నిచ్చుట, బ్రాహ్మణులయం దాసక్తి గల్గియుండుట, ఈ లక్షణములుగల యున్మాదవ్యాధి దేవతాగ్రహముచే గల్గినదని యెరుంగునది. మరియు గణమాత్రుకాదిగ్రహలక్షణములు గ్రన్థాన్తరమున నీరీతిగ గానంబడియెడు: "క్రోధనస్స్రీ స్తసర్వాఙ్గో లాలాఫేనావిలాననః । నిద్రాళుః కమ్పనో మూకో గణమాత్రాభిదర్శితః॥" మిగుల కోపము గల్గి యుండుట, అవయవములన్నియు శిథిలములై యుండుట, జొల్లుచేతను నురుగుచేతను ఆవరింపబడిన ముఖము గల్గి యుండుట, అధికముగ నిదురించుట, వణకుట, మాటలేక మూగిదై యుండుట, ఈ లక్షణములు కల మనుజుండు గణమాత్రుకాది గ్రహములచే పీడితుండని యెరుంగవలెను. ఇచ్చట "నిస్తన్ద్రీ స్త్వవితథసంస్కృతప్రభాషీ" అను పాఠము సాధువై యుండును.

## అసురగ్రహోన్మాద లక్షణము

శ్లో॥ సంస్వేదీ ద్విజగురు దేవదోషవక్తా
జిహ్మాక్షో విగతభయో విమార్గదృష్టిః।
సంతుష్టో న భవతి చాన్నపానజాతై
ర్దుష్టాత్మా భవతి స దేవశత్రుజుష్టః॥౧౯॥

తా॥ శరీరమున చెమట గారుట, బ్రాహ్మణులయందును గురువులయందును దేవతలయందును దోషముల జెప్పుట, వక్రముగ జూచుట, భయము లేకుండుట, శాస్త్రవిరుద్ధమైన మార్గమును జూచుట, అధికముగ నన్నపానాదుల సేవించినను తృప్తిజెందకుండుట, దుష్టమైన స్వభావము గల్గి యుండుట, ఈ లక్షణములు గల యున్మాదము అసురగ్రహముచే జనించినది యని యెరుంగునది.

## గన్ధర్వగ్రహోన్మాద లక్షణము

శ్లో॥ హృష్టాత్మా పులినవనాన్తరోపసేవీ
స్వాచారః ప్రియపరిగీతగన్ధమాల్యః।
నృత్యన్వై ప్రహసతి చారు చాల్పశబ్దం
గన్ధర్వగ్రహపరిపీడితో మనుష్యః॥౨౦॥

తా॥ మనస్సంతోషము గల్గియుండుట, ఇసుకదిన్నెలయందును, ఉద్యానవనములయందును సంచరించుట, సదాచారము గల్గి యుండుట, గానమునందును గంధపుష్ప మాలికలయందును ప్రీతిగల్గి యుండుట, నర్తనము చేయుట, సుందరముగ తిన్నని శబ్దముతోగూడినట్లు నవ్వుట, ఈ లక్షణములు కల యున్మాదము గంధర్వగ్రహముచే గల్గినది యని యెరుంగునది.

యక్షగ్రహోన్మాద లక్షణము

శ్లో॥ తామ్రాక్షః ప్రియతనురక్తవస్త్రధారీ
గమ్భీరో ద్రుతగతిరల్పవాక్సహిష్ణుః।
తేజస్వీ వదతి చ కిం దదామి కస్మై
యో యక్షగ్రహపరిపీడితో మనుష్యః॥ ౧౧॥

తా॥ కన్నులెఱ్ఱగనుండుట, మిగుల రమ్యంబులును సూక్ష్మంబులును రక్తవర్ణంబులునైన వస్త్రముల ధరించుట, గంభీరస్వభావముగల్గి యుండుట, శీఘ్రగమనముగల్గియుండుట, మితముగ సంభాషించుట, ఓర్పుగల్గియుండుట, ప్రశస్తంబైన తేజస్సుగల్గియుండుట, ఎవ్వనికేమి యిచ్చెదనని పల్కుట, ఈ లక్షణములు కల యున్మాదము యక్షగ్రహముచే జనించినది యని యెరుంగునది.

పితృగ్రహోన్మాద లక్షణము

శ్లో॥ ప్రేతానాం స దిశతి సంస్తరేషు పిండాన్
శాన్తాత్మా జలమపి చాఽపసవ్యవస్త్రః।
మాంసేప్సుస్తిలగుడపాయసాభికామ
స్తద్భక్తో భవతి పితృగ్రహాభిజుష్టః॥ ౧౨॥

తా॥ దర్భలపరచి అందు పితృదేవతలకు పిండముల నిడుట, శాంతమైన స్వభావము గల్గియుండుట, ఉత్తరీయము నపసవ్యముగా నిడుకొని జలముచే తర్పణము జేయుట, మాంసమును దిన్న గోరి యుండుట, నువ్వులయందును బెల్లమునందును పాయసమునందును అభిలాషకల్గియుండుట, పితృదేవతలయందు భక్తిగల్గియుండుట, ఈ లక్షణములు కల యున్మాదము పితృగ్రహముచే జనించినదియని యెరుంగునది.

నాగగ్రహోన్మాద లక్షణము

శ్లో॥ యస్తూర్వ్యాం ప్రసరతి సర్పవత్కదాచిత్
సృక్విణ్యౌ విలిహతి జిహ్వయా తథైవ।
క్రోధాలుర్గుడమధుదుగ్ధపాయసేప్సుః
జ్ఞాతవ్యో భవతి భుజఙ్గమేన జుష్టః॥ ౧౩॥

తా॥ భూమియందొకప్పుడు సర్పమువలె ప్రాకులాడుట, నాలుకచే పెదవుల వెలిప్రక్కలను నాకుట, మిగుల క్రోధముగల్గియుండుట, బెల్లము, తేనె, పాలు, పాయసము, వీనియందు మిక్కిలి యాసగొని యుండుట, ఈ లక్షణములు కల యున్మాదము నాగగ్రహముచే జనించినది యని యెరుంగునది.

### రాక్షసగ్రహోన్మాద లక్షణము

శ్లో॥ మాంసాసృగ్వివిధసురావికారలిప్సుః
　నిర్లజ్జో భృశమతినిష్ఠురోఽతిశూరః।
　క్రోధాఢ్యో విపులబలో నిశావిహారీ
　శౌచద్విడ్భవతి స రాక్షసైర్గృహీతః॥౧౪॥

తా॥ మాంసమునందును రక్తమునందును నానావిధమద్యములయందును అభిలాషగల్గియుండుట, లజ్జలేకుండుట, మిగులనిష్ఠురోక్తుల బల్కుట, అధికముగ శౌర్యము కల్గియుండుట, క్రోధము గల్గియుండుట, అధికమైన బలముతోగూడి యుండుట, రాత్రులయందు సంచరించుట, శారీరశుద్ధ్యమును సహించకుండుట, ఈ లక్షణములతో గూడిన యున్మాదము రాక్షసగ్రహములచే జనించినదని యెరుంగునది. మరియు బ్రహ్మరాక్షసగ్రహలక్షణము తన్త్రాన్తరమున నిట్లుగ నున్నయది. "దేవవిప్రగురుద్వేషీ వేదవేదాఙ్గవిచ్ఛుచిః । ఆత్మపీడాకరో మానీ బ్రహ్మరాక్షససేవితః" దేవతలను బ్రాహ్మణులను గురువులను ద్వేషించుట, వేదవేదాంగములను దెలిసి యుండుట, పరిశుద్ధముగనుండుట, ఉపవాసాదులచే నాత్మను పీడించుట, అధికముగ నహ్వుట, ఈ లక్షణములు గల్గియున్నయెడ బ్రహ్మరాక్షసగ్రహముచే గల్గిన యున్మాదమని భావము.

### పిశాచగ్రహోన్మాద లక్షణము

శ్లో॥ ఉద్ధస్తః కృశపరుషోఽచిరప్రలాపీ
　దుర్గన్ధో భృశమశుచిస్తథాఽతిలోలః।
　బహ్వాశీ విజనవనాన్తరోపసేవీ
　వ్యాచేష్టన్ భ్రమతి రుదన్ పిశాచజుష్టః॥౧౫॥

తా॥ హస్తములను పైకెత్తికొని యుండుట, శరీరము కృశించి పరుషముగ నుండుట, కొంతకాలమువరకు అసంబద్ధముగ మాటలాడుట, దుర్గన్ధముతో గూడియుండుట, మిక్కిలి అపరిశుద్ధముగ నుండుట, అన్నపానాదులయందు మిక్కిలి యాశగలిగి యుండుట, అధికముగ భుజించుట, నిర్జనప్రదేశమును వనమధ్యమును ఆశ్రయించి యుండుట, నానావిధములగు చేష్టలు జేయుచు తిరుగుచుండుట, ఏడ్చుట, ఈ లక్షణములుగల యున్మాదము పిశాచగ్రహముచే జనించినదని యెరుంగునది. ఇచ్చట "ఉద్వస్త్రః" అను పాఠము వివస్త్రుడై యుండును గాన యుక్తమై యుండును.

### అసాధ్యగ్రహ లక్షణము

శ్లో॥ స్థూలాక్షో ద్రుతమటనస్సఫేనలేహీ
　నిద్రాళుః పతతి చ కమ్పతే చ మోహీ।
　యశ్చాద్రిద్విరదనగాది విచ్యుతస్స్యాత్
　సోఽసాధ్యో భవతి తథా త్రయోదశాబ్దే॥౧౬॥

తా॥ మున్ను వచించిన గ్రహములచే పీడితుండగు మనుజుండు వికారముగ తెరవబడిన కన్నులు గలవాడును, శీఘ్రముగ పలుతెరంగుల సంచరించువాడును, నోట నురుగుగార్చుచు పెదవుల నాకుచుండువాడును, నిదురించుస్వభావముగలవాడునై క్రిందపడి పలుతెరంగుల వణకుచున్న యెడ అట్టిగ్రహము అసాధ్యంబై యుండును. మరియు పర్వతములు, ఏనుగులు, వృక్షములు మొదలగువానిపైనుండి క్రిందపడునప్పుడు అట్టి గ్రహములచే గ్రహింపబడినయెడ అట్టి గ్రహములుకూడ నసాధ్యంబులై యుండును. మరియు మున్ను వచించిన గ్రహములలో నేదైన పదిమూడవ సంవత్సరమున పట్టినయెడ నదియు నసాధ్యంబై యుండును. లోకమునందు నానావిధగ్రహములును మనుజుల హింసించుటకును, క్రీడాదుల ననుభవించుటకును, పూజల నొందుటకును మనుష్యుల గ్రహించును; అందు హింసార్థమై పట్టిన గ్రహములు పైజెప్పిన లక్షణములగల్గించును. కాన యవి యసాధ్యములనియు, క్రీడాపూజార్థమై పట్టిన గ్రహములు సాధ్యంబులనియు భావము. ఇందుకు ప్రమాణము "అనుచింభిన్నముర్యాదం క్షతంవా యదివాఽక్షతమ్। హింస్యుర్హింసావిహారార్థం సత్కారార్థమథాపి చ" అని తన్త్రాన్తరమున గానంబడియెడు.

## దేవగ్రహాదులు బట్టు కాలనిర్ణయము

శ్లో॥ దేవగ్రహాః పౌర్ణమాస్యాం అసురాస్సన్ధ్యయోరపి।
గన్ధర్వాః ప్రాయశోఽష్టమ్యాం యక్షాశ్చ ప్రతిపద్యథ॥౨౭॥
పిత్ర్యాః కృష్ణక్షయే హింస్యుః పంచమ్యామపి చోరగాః।
రక్షాంసి రాత్రౌ పైశాచాః చతుర్దశ్యాం విశన్తిహి॥౨౮॥

తా॥ పూర్ణిమనాడు దేవతాగ్రహంబులును, సంధ్యాకాలములయందు అసురగ్రహంబులును, అష్టమినాడు గంధర్వగ్రహంబులును, పాడ్యమినాడు యక్షగ్రహంబులును, అమవసనాడు పితృగ్రహంబులును, పంచమియందు నాగగ్రహములును, రాత్రులయందు రాక్షసగ్రహములును, చతుర్దశియందు పిశాచగ్రహములును, మనుజులబట్టి బాధించును.

## శరీరము నాశ్రయించిన గ్రహములు కనుబడకుండుటకు కారణములు

శ్లో॥ దర్పణాదీన్యథాఛాయా శీతోష్ణం ప్రాణినోయథా।
స్వమణిం భాస్కరార్చిశ్చ యథా దేహం చ దేహధృత్॥౨౯॥
విశన్తి చ న దృశ్యన్తే గ్రహాస్తద్వచ్ఛరీరిణః।



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
ఉన్మాదనిదానం సమాప్తమ్

---

తా॥ అద్దము మొదలగు వానియందు ప్రతిబింబంబును, ప్రాణులయందు శీతోష్ణంబులును, సూర్యకాన్తపుమణియందు సూర్యునికాన్తియు, దేహమునందు జీవుండును ప్రవేశించి కంటికి నగుపడకుండుచుండంబున నానావిధగ్రహంబులు మనుజులయందు ప్రవేశించి కంటికి కనుబడకుండును. ఇచ్చట దేవగ్రహంబులనగా దేవానుచరంబులైన గ్రహంబులని యర్థము. దేవతలు ప్రత్యక్షముగ మనుష్యుల స్పృశించుట లేదని సుశ్రుతాచార్యుండు వక్కాణించెను. అది యెట్లనిన "న తే మనుష్యైస్సహ సంవిశన్తి న తే మనుష్యాన్ క్వచిదావిశన్తి। యే త్వావిశన్తీతి వదన్తి మోహాత్ తే భూతవిద్యావిషయాదపోహ్యాః" దేవతలు ప్రత్యక్షముగ మనుజుల స్పృశించుటయైనను ఆవేశించుటయైనను లేదు. మనుష్యులయందు ఆవేశమునొందునని యజ్ఞానముచే వచించువారికి భూతవిద్య తెలియదని యర్థము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్రవిరాజమాన దివ్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషగ్మణి" "పణ్డిత" గోపాలాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానాన్వయతాత్పర్యము

నందు ఉన్మాదనిదానము

సమాప్తము



శ్రీ హ య గ్రీ వా య న మః

శ్రీ ర స్తు

# అ ప స్మా ర ని దా న మ్



ఉన్మాదమువలెనే అపస్మారముకూడ మనస్సంబంధమైన వ్యాధిగాన ఉన్మాదనిదానమును జెప్పినపిమ్మట అపస్మారనిదానమును చెప్పుట.



శ్లో॥ ** చిన్తాశోకాదిభిర్దోషాః క్రుద్ధా హృత్స్రోతసి స్థితాః।
కృత్వాస్మృతేరపధ్వంసం అపస్మారం ప్రకుర్వతే **

తా॥ చింత దుఃఖము మున్నగు కారణములచేత వాతాదిదోషములు ప్రకుపితంబులై హృదయమునందుండి స్మృతిని నశింపజేసి యపస్మారమను వ్యాధిని కల్గించును.

## అపస్మార సామాన్య లక్షణము

శ్లో॥ తమఃప్రవేశస్సంరమ్భో దోషోద్రేకహతస్మృతేః।
అపస్మార ఇతిజ్ఞేయో గదో ఘోరశ్చతుర్విధః॥౧

తా॥ వాతాది దోషములయొక్క ప్రాబల్యముచే శరీరస్మృతి తప్పిన మనుజునకు చీకటి యందు ప్రవేశించినటుల జ్ఞానములేక భీకరముగ కన్నులద్రిప్పుచు కాళ్లుచేతుల విదలించుచున్న యెడ అపస్మారవ్యాధి యని యెరుంగునది. ఈ వ్యాధి వాత పిత్త శ్లేష్మ సన్నిపాత భేదములచే నాల్గు విధంబు లగును. ఈ యపస్మారమున కన్వర్థకత్వమును సుశ్రుతాచార్యుం డివ్విధంబుగ వచించెను. "స్మృతిర్భూతార్థవిజ్ఞాన మపస్తత్పరివర్జనే। అపస్మార ఇతి ప్రోక్తస్తతోఽయం వ్యాధిరన్తకృత్" స్మృతియనగా మున్ను జరిగిన వృత్తాంతమును దలచుట; అట్టి జ్ఞానమును నివర్తింప జేయుటచే నీవ్యాధి యపస్మారమని చెప్పంబడునని భావము.

## అపస్మార పూర్వరూపములు

శ్లో॥ హృత్కమ్పశ్శూన్యతా స్వేదో ధ్యానం మూర్ఛా ప్రమూఢతా।
నిద్రానాశశ్చ తస్మింశ్చ భవిష్యతి భవత్యథ॥౨॥

తా॥ హృదయమునందు కంపము, మనస్సున కేమియు దోచకుండుట, చెమట బట్టుట, చిన్త, మూర్ఛగల్గుట, ఇంద్రియజ్ఞానము లేకపోవుట, నిదుర బట్టకుండుట, ఇవియన్నియు నపస్మారవ్యాధికి మున్ను జనించు పూర్వరూపములు.

### వాతాపస్మార లక్షణము

శ్లో॥ కమ్పతే ప్రదశేద్దన్తాన్ ఫేనోద్వామీ శ్వసిత్యపి।
పరుషారుణకృష్ణాని పశ్యేద్రూపాణి చాఽనిలాత్ ॥౩॥

తా॥ వణకు, పండ్లు కొరకుట, నోట నురుగు వెడలుట, శ్వాసమును విడుచుట, ప్రాణులను పరుషంబులుగను అరుణవర్ణంబులుగను కృష్ణవర్ణంబులుగను జూచుట, ఈ లక్షణములు కల్గినది వాతముచే జనించిన యపస్మారంబని యెరుంగునది.

### పిత్తాపస్మార లక్షణము

శ్లో॥ పీతఫేనాఙ్గవక్త్రాక్షిః పీతాసృగ్రూపదర్శనః।
సతృష్ణోష్ణానలవ్యాప్తలోకదర్శీ చ పైత్తికః॥౪॥

తా॥ నోట పసపురంగు కల నురుగు కారుట, శరీరంబును, ముఖంబును, కన్నులును పీతవర్ణములుగ నుండుట, రక్తము పీతవర్ణముగనుండుట, మనుజులరూపము పసపురంగుగ కనుపించుట, దప్పిచేతను ఉష్ణముచేతను వ్యాప్తంబై లోకమునెల్ల నగ్నిచే వ్యాప్తమైనదానివలె జూచుట; ఈ లక్షణములు కల్గినది పిత్తముచే జనించిన యపస్మారమని యెరుంగునది.

### శ్లేష్మజాపస్మార లక్షణము

శ్లో॥ శుక్లఫేనాఙ్గవక్త్రాక్షిః శీతహృష్టాఙ్గజో గురుః।
పశ్యేచ్ఛుక్లాని రూపాణి శ్లైష్మికో ముచ్యతే చిరాత్ ॥౫॥

తా॥ నోటయందు నురుగువెడలుట, శరీరము ముఖము కన్నులు ఇవియన్నియు తెల్లగనుండుట, శరీరము చల్లనై యుండుట, శరీరమున గగుర్పాటుకల్గి బరువుగానుండుట, మనుజులను శుక్లవర్ణముతో గూడినట్లు చూచుట, చిరకాలమునకు మూర్ఛ తెలియుట, ఈ లక్షణములు కల్గినది కఫముచే జనించిన అపస్మారమని యెరుంగునది. ఈ కఫజాపస్మారలక్షణమున "ముచ్యతేచిరాత్" అని చెప్పుటచేత వాతపిత్తాపస్మారములయందు శీఘ్రముగ మూర్ఛ తెలియునని తెలియుచున్నది.

### సన్నిపాతజాపస్మార లక్షణము

శ్లో॥ సర్వైరేతైస్సమస్తైశ్చ లిఙ్గైర్జ్ఞేయస్త్రిదోషజః।
అపస్మారస్సచాఽసాధ్యో యః క్షీణస్యాఽనవశ్చ యః॥౬॥
ప్రస్ఫురన్తం సుబహుశః క్షీణం ప్రచలితభ్రువమ్।
నేత్రాభ్యాం చ వికుర్వాణాం అపస్మారో వినాశయేత్ ॥౭॥

తా॥ మున్ను వచించిన వాతాదిలక్షణములతో గూడి దోషత్రయప్రకోపముచే జనించిన యపస్మారము సన్నిపాతజమని యెరుంగునది. ఈ యపస్మారంబును, దేహము కృశించినవానికి గల్గిన ఇతరాపస్మారంబులును అసాధ్యంబులు. మరియు చిరకాలమునుండి యనుసరించి యుండునది గూడ నసాధ్యంబగును. అనేకవిధములుగ వణకుచున్నను శరీరము కృశించి కనుబొమల వికారముగ గదలించుచున్నను, కన్నులను వికారముగ ద్రిప్పుచున్నను అపస్మారవ్యాధి మిక్కిలి యసాధ్యంబగును.

## అపస్మారప్రకోపకాల నిర్ణయము

శ్లో॥ పక్షాద్వా ద్వాదశాహాద్వా మాసాద్వా కుపితా మలాః।
అపస్మారాయ కుర్వన్తి వేగం కించిదథాన్తరమ్॥౮॥
దేవే వర్షత్యపి యథా భూమౌ బీజాని కానిచిత్।
శరది ప్రతిరోహన్తి తథా వ్యాధిసముచ్ఛ్రయాః॥౯॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
అపస్మారనిదానం సమాప్తమ్



తా॥ ఒకపక్షమునకైనను, పన్నెండుదినములకైనను ఒకమాసమునకైనను, వాతాదిదోషములు ప్రకోపమునొంది తమతమవేగమునుజూపి యపస్మారవ్యాధిని కల్గించును. ఈ చెప్పబడిన నిర్ణీతకాలమునకు కొంచెము ముందుగకూడ వేగమును జూపును. పిత్తాపస్మారము ఒకపక్షమునకు జనించుననియు, వాతాపస్మారము పన్నెండుదినములకు జనించుననియు, శ్లేష్మాపస్మారము ఒకనెలదినములకు జనించుననియు భావము. దేవుడు వర్షించుచున్నను భూమియందలి విత్తనములు స్వకాలమున మొలుచుచుండుయున దోషములు ప్రకోపించియున్నను వ్యాధిస్వభావముచే కాలానుసారముగ వృద్ధినొందునని భావము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్ర
విరాజమాన దివ్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపిక యను
మాధవనిదానార్థతాత్పర్యమునందు
అ ప స్మా ర ని దా న ము
సమాప్తము

శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# వాతవ్యాధినిదానమ్



వాతవ్యాధి అపస్మారవ్యాధినిబోలె మిగుల వేగముగ జేయును గాన అపస్మారనిదానము జెప్పిన పిదప వాతవ్యాధినిదానము జెప్పఁబడుచున్నది.



శ్లో॥ రూక్షశీతాల్పలఘ్వన్న వ్యవాయాతి ప్రజాగరైః।
విషమాదుపచారాచ్చ దోషాసృక్స్రవణాదపి॥౧॥
లఙ్ఘనప్లవనాత్యధ్వవ్యాయామాదివిచేష్టితైః।
ధాతూనాం సంక్షయాచ్చిన్తా శోకరోగాతికర్షణాత్॥౨॥
వేగసన్ధారణాదామాదభిఘాతాదభోజనాత్।
మర్మాబాధాద్గజోష్ట్రాశ్వ శీఘ్రయానాపతంసనాత్॥౩॥
దేహే స్రోతాంసి రిక్తాని పూరయిత్వాఽనిలో బలీ।
కరోతి వివిధాన్ వ్యాధీన్ సర్వాఙ్గైకాఙ్గ సంశ్రయాన్॥౪॥

తా॥ మిక్కిలి రూక్షంబును శీతంబునైనను యన్నమును భుజించుట, స్వల్పముగ భుజించుట, లఘ్వన్నమును భుజించుట, అధికముగ స్త్రీసంభోగము జేయుట, అధికముగ నిదుర మేల్కాంచి యుండుట, విషమంబులగు నుపచారముల జేసికొనుట, కఫపిత్తములను మూత్రరక్తములను వెడలింపజేయుట, మిట్టపల్లములయందు దాటుట, నీళ్లయందీదుట, అధికముగ త్రోవనడచుట, దేహపరిశ్రమను మున్నుగాగల పనుల చేయుట, రసాదిధాతువులు క్షయించుట, చింతచేతను, దుఃఖముచేతను, రోగములచేతను అధికముగ కృశించుట, మలమూత్రవేగములను నిరోధించుట, అన్నాదిరసము అపక్వంబై వాయువుసంచరించునాడుల నడ్డగించుట, ప్రహారాదులచే నభిఘాతము నొందుట, ఉపవాసము జేయుట, హృదయాది మర్మస్థానములయందు ప్రహారాదులచే బాధగల్గుట, ఏనుగులు ఒంటెలు గుఱ్ఱములు మొదలగువానిపై నెక్కి శీఘ్రముగ బోవుట, వానిపైనుండి క్రింద పడుట, ఈ కారణములచే ప్రకుపితంబైన వాతము శరీరమున శూన్యంబులైయుండు నాడులను పూరించి తాను మిగుల బలిష్ఠంబై ఏకాంగమునందైనను నిఖిలాంగములయందైనను నానావిధంబులైన వాతవ్యాధులను గల్గించును. ఇచ్చట "పిత్తం పంగుః కఫః పంగుః పంగవో మలధాతవః। వాయునా యత్ర నీయన్తే తత్ర గచ్ఛన్తి మేఘవత్" అని గ్రన్థాన్తరము

నందుండుటంజేసి కఫపిత్తముల ధాత్వాదులనన్నింటిని సంచరింపజేయుటచే ముఖ్యంబైన వాతము ప్రధానముగాగల వ్యాధి వాతవ్యాధి యని యెరుంగునది. మరియు వాతాదిదోషములలో వాతము మిగులబలిష్ఠంబును ఆశుకారియునై యుండును గాన అట్టివాతముచే జనించిన ఆక్షేపకాదివాతరోగములు మిగుల దుస్సాధ్యంబులై యుండును. అట్టిరోగములకు చికిత్సావిశేషములు స్పష్టముగ దెలియుటకై వాతవ్యాధినిదానము ప్రత్యేకముగ జెప్పంబడినది యని యెరుంగునది. ఈ యభిప్రాయముచే సుశ్రుతాచార్యుండు వాతరోగాధ్యాయమును ప్రత్యేకముగ జెప్పెను.

## వాతవ్యాధి పూర్వరూపాదులు

శ్లో॥ అవ్యక్తం లక్షణం తేషాం పూర్వరూపమితి స్మృతమ్।
ఆత్మరూపం తు యద్వ్యక్తం అపాయో లఘుతా పునః॥౫॥

తా॥ క్రిందవివరింపబడు వాతవ్యాధులయొక్క లక్షణములు అస్ఫుటముగ కనబడుటయే పూర్వరూపమనియు, అట్టి లక్షణములు స్ఫుటముగ కనుబడినయెడ నదియే వ్యాధిస్వరూపమనియు, అట్టిలక్షణములు స్వల్పముగ నుండుటయే వ్యాధినివృత్తి యనియు నెరుంగునది. ఆక్షేపకాదివాతవ్యాధులయందు ఆయావ్యాధులకు జెప్పబడు లక్షణములు అస్ఫుటంబులుగ గానంబడినచో నవియే పూర్వరూపంబులును, స్ఫుటంబులుగ గానంబడినచో రూపంబులును అగును గాని జ్వరాది రోగములయందు "శ్రమోఽరతిర్వివర్ణత్వం" ఇత్యాది మూలవాక్యములచేత ప్రత్యేకముగ పూర్వరూపముల జెప్పినట్లుగ వాతరోగములకు ప్రత్యేకముగ జెప్పుటలేదనియు, వాత లక్షణములు స్వల్పముగనుండుట వ్యాధినివృత్తియనియు, నితరవ్యాధులకంటె వాతవ్యాధియందు విశేషమని భావము.

## వాతవ్యాధి స్వరూపము

శ్లో॥ సంకోచః పర్వణాం స్తమ్భో భఙ్గోఽస్థ్నాం పర్వణామపి।
రోమహర్షః ప్రలాపశ్చ పాణిపృష్ఠశిరోగ్రహః॥౬॥
ఖాఞ్జ్యపాఙ్గుల్యకుబ్జత్వం శోషోఽఙ్గానామనిద్రతా।
గర్భశుక్రరజోనాశః స్పన్దనం గాత్రసుప్తతా॥౭॥
శిరోనాసాక్షిజత్రూణాం గ్రీవాయాశ్చాపి హుణ్డనమ్।
భేదస్తోదోఽర్తిరాక్షేపో ముహుశ్చాయాస ఏవ చ॥౮॥
ఏవంవిధాని రూపాణి కరోతి కుపితోఽనిలః।
హేతుస్థానవిశేషాచ్చ భవేద్రోగవిశేషకృత్॥౯॥

తా॥ కీళ్లు ముడుచుకొనుట, స్తంభించియుండుట, కీళ్లును ఎముకలును చీలుట, గగుర్పాటు గల్గుట, అసంబద్ధముగ మాటలాడుట, చేతులయందును వీపునందును శిరస్సునందును ఈడుపు బుట్టుట, గూని, కుంటితనము, గుజ్జారితనము, ముఖాద్యవయవములు శుష్కించుట, నిద్ర తగ్గియుండుట, గర్భము, శుక్రము, రజస్సు, ఇవి నశించుట, శరీరము వణకుట, శరీరమున స్పర్శజ్ఞానము లేకబోవుట, నాసిక, నేత్రములు, కంఠకూపాలము, కంఠము, ఇవి లోపలికి ఈడ్వ

బడుట, లేక వక్రంబులగుట, శూలముతో బొడిచినట్లుండుట, సూదులతో గ్రుచ్చినట్లుండుట, బాధగల్గుట, ఆక్షేపకవాతము, మోహము, శ్రమము, ఇవి మున్నగు గల లక్షణములను ప్రకోపమునొందిన వాతము కల్గించును. మరియు నట్టివాతము హేతువిశేషములచేతను కోష్ఠాదిస్థలవిశేషములచేతను విశేషరోగములను గల్గించును.

## కోష్ఠగతవాత లక్షణము

శ్లో॥ తత్ర కోష్ఠాశ్రితే దుష్టే నిగ్రహో మూత్రవర్చసోః।
బ్రధ్నహృద్రోగగుల్మార్శఃపార్శ్వశూలం చ మారుతే॥౧౦॥

తా॥ వాతము కోష్ఠము నాశ్రయించి దుష్టమైనయెడల మలమూత్రములు వెడలకుండుట, అండవృద్ధి, హృద్రోగము, గుల్మము, అర్శస్సు, పార్శ్వశూలము, ఈ వ్యాధులు కల్గును.

## సర్వాఙ్గవాత లక్షణము

శ్లో॥ సర్వాఙ్గకుపితే వాతే గాత్రస్ఫురణభఞ్జనమ్।
వేదనాభిః పరీతశ్చ స్ఫుటన్తీవాస్య సన్ధయః॥౧౧॥

తా॥ వాతము సకలావయవముల నాశ్రయించి ప్రకుపితంబైనయెడల గాత్రము అదురుట, పగులుట, నానావిధవేదనలు కల్గుట, అవయవసంధులన్నియు శిథిలములై పగులునట్లుండుట ఈ లక్షణములు కల్గును.

## గుదస్థితవాత లక్షణము

శ్లో॥ గ్రహో విణ్మూత్రవాతానాం శూలాధ్మానాశ్మశర్కరాః।
జఙ్ఘోరుత్రికపాత్పృష్ఠరోగశోషౌ గుదే స్థితే॥౧౨॥

తా॥ వాతము గుదము నాశ్రయించి ప్రకోపించినయెడల మలమూత్రవాతములు బైట వెడలక అడ్డగించబడుట, శూలము, కడుపుబ్బరము, మూత్రమున రాళ్ళును శర్కరయు పడుట, పిక్కలు, తొడలు, వెన్నముకకు క్రిందిప్రక్క, పాదములు, వీపు, ఈస్థలములయందు నొప్పిగల్గి శుష్కించుట, ఈ లక్షణములు కల్గును.

## ఆమాశయస్థవాత లక్షణము

శ్లో॥ రుక్పార్శ్వోదరహృన్నాభేస్తృష్ణోద్గారవిసూచికాః।
కాసః కణ్ఠాస్యశోషశ్చ శ్వాసశ్చామాశయస్థితే॥౧౩॥

తా॥ వాతము ఆమాశయమునుండి ప్రకుపితంబైనయెడ, పార్శ్వములయందును ఉదరమునందును హృదయమునందును నాభియందును బాధగల్గుట, దప్పి, వాంతి, విసూచి. దగ్గు, కుత్తుకయు నోరును యెండుట, శ్వాసను, ఈ లక్షణములు కల్గును.

## పక్వాశయస్థవాత లక్షణము

శ్లో॥ పక్వాశయస్థోఽన్త్రకూజం శూలాటోపౌ కరోతి చ।
కృచ్ఛ్రమూత్రపురీషత్వం ఆనాహం త్రికవేదనామ్॥౧౪॥

తా॥ పక్వాశయమున వాతము ప్రకుపితంబైనయపుడు ప్రేవులు అరచుట, పోట్లు, కడుపుబ్బరము, మూత్రకృచ్ఛ్రము, మలబంధము, ఆనాహము, వెన్నెముకక్రింద నొప్పి, ఈ లక్షణములు కల్గును.

## శ్రోత్రాదిగతవాత లక్షణము

శ్లో॥ శ్రోత్రాదిష్విన్ద్రియవధం కుర్యాద్దుష్టసమీరణః।

తా॥ చెవులు నేత్రములు మొదలగు ఇంద్రియములయందు వాతము ప్రకుపితంబైనయెడ ఆయా యింద్రియములకు పటుత్వము చెడును.

## త్వగ్గతవాత లక్షణము

శ్లో॥ త్వగ్రూక్షా స్ఫుటితా సుప్తా కృశా కృష్ణా చ తుద్యతే॥౧౫॥
ఆతన్యతే సరాగా చ పర్వరుక్త్వగ్గతేఽనిలే।

తా॥ త్వగ్గతమైన వాతము ప్రకుపితంబైనయపుడు చర్మము పరుషముగనుండి నానాట పగిలి స్పర్శజ్ఞానములేక కృశించును. నల్లనిరంగు కల్గి పోట్లతోగూడి యుండును. మరియు నాచర్మము విస్తరంబై యెఱ్ఱని రంగుకల్గియుండును. కీళ్ళయందు నొప్పులు బుట్టును.

## రక్తగతవాత లక్షణము

శ్లో॥ రుజస్తీవ్రాస్ససన్తాపా వైవర్ణ్యం కృశతాఽరుచిః॥౧౬॥
గాత్రేచారూంషి భుక్తస్య స్తమ్భశ్చాఽసృగ్గతేఽనిలే।

తా॥ రక్తగతమైన వాతము ప్రకుపితంబైనపుడు మిగుల తీవ్రంబులగు నొప్పులు, అధికమైన సన్తాపము, వివర్ణత్వము, కృశత్వము, అరోచకము, శరీరమున వ్రణములు, భుజించినపిదప శరీరస్తమ్భము, ఈలక్షణములు కల్గును. ఇచ్చట వాతము రక్తమునజేరి ప్రకోపించుననియు వాతరక్తమునందు వాతరక్తములు రెండును సమంబులుగ ప్రకోపించుననియు భేదము దెలియుచున్నది గాన వాతరక్తమునకన్న నీవ్యాధి వేరుగ జెప్పంబడియెనని యెరుంగునది.

## మాంసమేదోగతవాత లక్షణము

శ్లో॥ గుర్వఙ్గం తుద్యతేఽత్యర్థం దణ్డముష్టిహతం యథా॥౧౭॥
సరుక్శ్రమితమత్యర్థ మాంసమేదోగతేఽనిలే।

తా॥ వాతము మాంసమేదస్సుల నాశ్రయించి ప్రకుపితంబైనయపుడు శరీరము బరువైయుండుట, దండముచేతను పిడికిలిచేతను కొట్టినట్లు పోట్లుబుట్టుట, మిక్కిలి బాధతోగూడి బడలినట్లుండుట, ఈలక్షణములు కల్గును.

## అస్థిమజ్జాగతవాత లక్షణము

శ్లో॥ భేదోఽస్థిపర్వణాం సన్ధిశూలం మాంసబలక్షయః॥౧౮॥
అస్వప్నస్సన్తతా రుక్చ మజ్జాఽస్థికుపితేఽనిలే।

తా॥ వాతము అస్థిమజ్జల నాశ్రయించి ప్రకోపమునొందినపుడు అస్థులయొక్క కీళ్ళు సడలుట, అవయవసంధులయందు నొప్పికల్గుట, శరీరమునందలిమాంసము బలము నశించుట, నిదురబట్టకుండుట, ఎల్లప్పుడు శరీరమున బాధగల్గియుండుట, ఈ లక్షణములు కల్గును.

## శుక్రగత వాతలక్షణము

శ్లో॥ క్షిప్రం ముఞ్చతి బధ్నాతి శుక్రం గర్భమథాఽపివా॥౧౯॥
వికృతిం జనయేచ్చాపి శుక్రస్థః కుపితోఽనిలః।

తా॥ వాతము శుక్రగతమై ప్రకోపించినపుడు, శుక్రంబును, అట్టి దుష్టశుక్రముచేగల్గిన గర్భంబును శీఘ్రముగ జారిపోవును. లేక బద్ధంబై నిలచును, లేక ఆరెంటికిని వ్యాధికల్గును.

## సిరాగతవాత లక్షణము

శ్లో॥ కుర్యాత్సిరగతశ్శూలం సిరాకుఞ్చనపూరణమ్॥౨౦॥
సబాహ్యాభ్యన్తరాయామం ఖల్లీం కౌబ్జ్యమథాపి వా।

తా॥ సిరాగతంబైన వాతము ప్రకోపమునొందినపుడు సిరలయందు పోటు, సిరలు ముడుచుకొనుట, సిరలు స్థూలంబులై యుండుట బాహ్యాయామవాతము, అభ్యన్తరాయామవాతము, ఖల్లీవాతము, కుబ్జత్వము, ఈలక్షణములు కల్గును. బాహ్యాయామాదు లున్నను వ్యాధులను క్రిందచెప్పబడు లక్షణములచే నెరుంగునది. ఇచ్చట తన్త్రాన్తరమున "సుప్తాస్స్యుస్స్వవ్యాబ్యాకోత్యా వా సిరా వాతే సిరాగతే" అని తన్త్రాన్తరమున నుండుటంజేసి పూరణశబ్దమునకు స్థూలంబై యుండు ననే యర్థము నెరుంగునది.

## స్నాయుసంధిగత వాతలక్షణము

శ్లో॥ సర్వాఙ్గైకాఙ్గరోగాంశ్చ కుర్యాత్స్నాయుగతోఽనిలః॥౨౧॥
హన్తి సన్ధిగతస్సన్ధీన్ శూలాటోపౌ కరోతి చ।

తా॥ స్నాయుగతంబైన వాతము ప్రకోపించినపుడు సర్వాంగవాతవ్యాధులును ఏకాంగవాతవ్యాధులును కల్గును; సంధిగతంబైన వాతము ప్రకుపితంబై సంధిబంధములను సడలింపజేయును; సంధులయందు నొప్పిని ఆటోపమును కల్గించును.

## పిత్తకఫావృతప్రాణవాత లక్షణము

శ్లో॥ ప్రాణే పిత్తావృతే ఛర్దిర్దాహశ్చైవోపజాయతే॥౨౨॥
దౌర్బల్యం సదనం తన్ద్రా వైరస్యం చ కఫావృతే।

తా॥ ప్రాణవాయువు పిత్తముచే నావరింపబడినపుడు వాంతియు తాపంబును కల్గును. కఫము నాశ్రయించినపుడు బలహీనము, కునికిపాటు, విరసత్వము; ఈలక్షణములు కల్గును.

### కఫపిత్తములతోఁగూడిన యుదానవాత లక్షణము

శ్లో॥ ఉదానే పిత్తయుక్తే తు దాహో మూర్ఛా భ్రమః క్లమః॥ ౨౩॥
అస్వేదహర్షౌ మన్దోఽగ్నిశ్శీతతా చ కఫావృతే।

తా॥ ఉదానవాతము పిత్తముతోఁ గూడినపుడు తాపము, మూర్ఛ, భ్రమము, బడలిక, ఇవి కల్గును. కఫముతోఁ గూడినపుడు చెమటబట్టకుండుట, గగురుపాటు, అగ్నిమాన్ద్యము, శీతలత్వము, ఇవి జనించును.

### కఫపిత్తములతోఁ గూడిన సమానవాత లక్షణము

శ్లో॥ స్వేదదాహౌష్ణ్య మూర్ఛాస్స్యుస్సమానే పిత్తసంవృతే॥ ౨౪॥
కఫేన సక్తే విణ్మూత్రే గాత్రహర్షశ్చ జాయతే।

తా॥ సమానవాయువు పిత్తముతోఁగూడినపుడు చెమట, తాపము, ఉష్ణము, మూర్ఛ, ఇవి జనించును. కఫముతోఁగూడినపుడు మలమూత్రబంధము, శరీరమున గగురుపాటు ఇవి కల్గును.

### కఫపిత్తములతోఁ గూడిన అపానవాత లక్షణము

శ్లో॥ అపానే పిత్తయుక్తేతు దాహౌష్ణ్యం స్యాద్రక్తమూత్రతా॥ ౨౫॥
అధఃకాయే గురుత్వం చ శీతతా చ కఫావృతే।

తా॥ అపానవాతము పిత్తముతోఁగూడినపుడు తాపము, ఉష్ణము, రక్తము మూత్రముతోఁ గూడి వెడలుట, ఇవి కల్గును. కఫము నాశ్రయించినపుడు అధశ్శరీరము మిగుల బరువై శీతలముగ నుండును.

### పిత్తకఫములతోఁ గూడిన వ్యానవాత లక్షణము

శ్లో॥ వ్యానే పిత్తావృతే దాహో గాత్రవిక్షేపణం క్లమః॥ ౨౬॥
స్తమ్భనో దణ్డకశ్చాపి శూలశోథౌ కఫావృతే।

తా॥ వ్యానవాతము పిత్తముతోఁగూడినపుడు తాపంబును ఒడలువిరుపును, బడలికయు, జనించును. కఫముతోఁ గూడినపుడు శరీరస్తంభము, కట్టెవలె స్తంభించియుండుట, శరీరముపోటు, వాపు, ఈలక్షణములు కల్గును.

### ఆక్షేపకవాతసామాన్య లక్షణము

శ్లో॥ యదా తు ధమనీస్సర్వాః కుపితోఽభ్యేతి మారుతః॥ ౨౭॥
తదా క్షిపత్యాశు ముహుర్ముహుర్దేహం ముహుశ్చరః।
ముహుర్ముహుశ్చాక్షేపణాదాక్షేపక ఇతి స్మృతః॥ ౨౮॥

తా॥ వాతము దేహమునందలి సకలసిరలను వ్యాపించి ప్రకోపించినపుడు దేహమును మాటిమాటికి చలింపజేయును. అట్టి వాతము ఏనుగమీదనెక్కినవానివలె శరీరమును మాటిమాటికి చలింపజేయుటచే నాక్షేపకవాతమనంబడును.

## అపతన్త్రక వాతలక్షణము

శ్లో॥ క్రుద్ధస్స్వైః కోపనై ర్వాయుః స్థానాదూర్ధ్వం ప్రపద్యతే।
పీడయన్ హృదయం గత్వా శిరశ్శఙ్ఖౌ చ పీడయన్॥౨౯॥
ధనుర్వన్నమయేద్గాత్రా ణ్యాక్షిపేన్మోహయే త్తదా।
సకృచ్ఛ్రాదుచ్ఛ్వసేచ్చాపి స్తబ్ధాక్షోఽథ నిమీలకః॥3౦॥
కపోత ఇవ కూజేచ్చ నిస్సంజ్ఞస్సోఽపతన్త్రకః।

తా॥ వాతమును ప్రకోపింపజేయు కారణములచేత ప్రకుపితంబైన వాతము స్వస్థానమునుండి యూర్ధ్వభాగమునొంది హృదయస్థానమున నిలచి శిరస్సునందును కణతలయందును నొప్పిని కల్గించి శరీరమునందలి సకలావయవములను ధనుస్సువలె నొంచును. మరియు సకలావయవములయందు కంపంబును, మూర్ఛయు కల్గును. అట్టి మనుజుడు మిక్కిలి కష్టముచే నిట్టూర్పులు విడుచుచు నిశ్చలంబులైన నేత్రములుకలవాడై మెల్లమెల్లగ కన్నులదెరచును. దేహమునందు ప్రజ్ఞలేక పావురపిట్టవలె కూయుచు మూర్ఛనొందును. ఈవ్యాధి యపతన్త్రకవాతమని చెప్పంబడును.

## అపతానక వాతలక్షణము

శ్లో॥ దృష్టిం సంస్తభ్య సంజ్ఞాం చ హత్వా కణ్ఠేన కూజతి॥3౧॥
హృది ముక్తే నరస్స్వాస్థ్యం యాతి మోహం వృతే పునః।
వాయునా దారుణం ప్రాహురేకే తదపతానకమ్॥3౨॥

తా॥ పూర్వోక్తవాతము హృదయమునజేరి దృష్టిని స్తంభింపజేసి జ్ఞానమును పోనడచి కంఠమున ధ్వనిని కల్గించును. అట్టివాతము హృదయస్థానమును వదలినప్పుడు మనుజుండు స్వస్థత నొందును. మరల నా వాతము హృదయమును నొందినప్పుడు మూర్ఛిల్లును. దీనిని;యపతానకంబను క్రూరమైన వాతవ్యాధియని భిషగ్వరులు కొందరు వచించెదరు.

## దండాపతానకవాత లక్షణము

శ్లో॥ కఫాన్వితో భృశం వాయుస్తాస్వేవ యది తిష్ఠతి।
దణ్డవత్స్తమ్భయేద్దేహం స తు దణ్డాపతానకః॥33॥

తా॥ వాతము కఫముతోగూడి సిరలయందు వ్యాపించినపుడు దేహమును దండమువలె స్తంభింపజేయును. ఈవ్యాధి దండాపతానకమని చెప్పంబడును. మరియు "పాణిపాద శిరః పృష్ఠశ్రోణీః స్తభ్నాతి మారుతః। దణ్డవత్స్తబ్ధగాత్రస్య దణ్డకస్సోఽనుపక్రమః" అని చరకమున నున్నది. ఈ వచనముచేత వాతము మాత్రము శిరస్సు, వీపు, పిరుదులు ఈ యవయవములను దండమువలె స్తంభింపజేసినచో నయ్యది దండాపతానకమనియు అట్టి వ్యాధి చికిత్సకు నసాధ్యంబై యుండుననియు భావము.

## ధనుస్తమ్భ వాతలక్షణము

శ్లో॥ ధనుస్తుల్యం నమేద్యస్తు స ధనుస్తమ్భసంజ్ఞకః।

తా॥ పూర్వోక్తవాతముచేత శరీరము ధనుస్సువలె వంగినయెడ ధనుస్తమ్భకవాతమని చెప్పంబడును. ఈ లక్షణము అన్తరాయామ బహిరాయామంబులను వాతములకు సామాన్యలక్షణమని యెఱుంగునది.

## అన్తరాయామ వాతలక్షణము

శ్లో॥ అంగులీగుల్ఫజఠరహృద్వక్షోగలసంశ్రితః॥ ౩౪॥
స్నాయుప్రతానమనిలో యదా క్షిపతి వేగవాన్।
విష్టబ్ధాక్షస్తబ్ధహనుర్భగ్నపార్శ్వః కఫం వమన్॥ ౩౫॥
అభ్యన్తరం ధనురివ యదా నమతి మానవమ్।
తదాస్యాభ్యన్తరాయామం కురుతే మారుతో బలీ॥ ౩౬॥

తా॥ వాతము కుపితంబై వ్రేళ్లు, చీలమండ, జఠరము, హృదయకమలము, రొమ్ము, కంఠము ఈ స్థలముల నాశ్రయించి వేగముతోగూడి శరీరమునందలి స్నాయువులు (సన్నపువరములు), సిరలు, కండరములు, వీనిని వంకునటుల జేయును; దానంజేసి నేత్రములు నిశ్చలముగ నుండుట, తాలువులు పట్టుకొని యుండుట, పార్శ్వములయందు నొప్పి, నురుగు వాంతియగుట, ఇట్టి లక్షణములతోగూడి శరీరమధ్యభాగము ధనుస్సువలె లోప్రక్కకు వంగును. దీనిని వాతము శరీరమును లోప్రక్కకు వంచుటచే నభ్యన్తరాయామమని వచించెదరు. ఇచ్చట తన్త్రాన్తరమున "మహాహేతుర్బలీ వాయుస్సిరాస్స్నాయు కణ్డరాః। మన్యాపృష్ఠాశ్రితా బాహ్యస్సంశోష్యాయామ మేద్బహిః" అని యున్నదిగాన స్నాయుశబ్దము సిరాకండరములకుగూడ నుపలక్షణమని యెఱుంగునది.

## బాహ్యాయామవాత లక్షణము

శ్లో॥ బాహ్యస్నాయుప్రతానస్థో బాహ్యాయామం కరోతిచ।
తమసాధ్యం బుధాః ప్రాహుర్వక్షః కట్యూరుభఞ్జనమ్॥ ౩౭॥

తా॥ పూర్వోక్తప్రకారము వాతము ప్రకుపితంబై శరీరమున వెలిప్రక్కనుండు వీపును మెడను ఆశ్రయించిన స్నాయుసిరాకండరముల నాశ్రయించి శోషింపంజేసి వెలిప్రక్కకు వంచిన యెడ బాహ్యాయామంబను వాతవ్యాధి యని చెప్పంబడును. వక్షస్థలమును కటిప్రదేశమును ఊరువులను వంచుటచే నీవ్యాధి యసాధ్యంబు. మరియు తన్త్రాన్తరమున "హృదయం యదివా పృష్ఠం ఉన్నతం క్రమశస్సరుక్। క్రుద్ధో వాయుర్యదా కుర్యాత్తదా తం కుబ్జమా

దిశేత్'' అని యున్నది గాన పైజెప్పిన అన్తరాయామబహిరాయామ వాతములే కుబ్జవాతమని దెలియుచున్నయది.

శ్లో॥ కఫపిత్తాన్వితో వాయుర్వాయురేవ చ కేవలః।
కుర్యాదాక్షేపకం త్వస్యం చతుర్థమభిఘాతజమ్॥౩౮॥

తా॥ వాతము కఫపిత్తములతో గూడిదైనను కేవలవాతమైనను ప్రకుపితంబై యాక్షేపకమను వాతమును గల్గించును. మరియు దండాద్యభిఘాతములచే గల్గినది నాల్గవ యాక్షేపకవాతంబని యర్థము. ఇచ్చట దండాపతానక అన్తరాయామ బహిరాయామంబులు మూడును, అభిఘాతముచే జనించినదియు గలిసి ఆక్షేపకవాతము నాల్గువిధంబులని దెలియునది. అభిఘాతజాక్షేపక లక్షణమును ''యదా తు ధమనీః'' అను సామాన్య లక్షణముచే నెరుంగునది.

అసాధ్యాక్షేపక లక్షణము

శ్లో॥ గర్భపాతనిమిత్తశ్చ శోణితాతిస్రవాచ్చ యః।
అభిఘాతనిమిత్తశ్చ న సిధ్యత్యపతానకః॥౩౯॥

తా॥ గర్భము స్రవించుటచేతను రక్తం బధికముగ స్రవించుటచేతను దండాద్యభిఘాతముచేతను జనించిన యపతానకవాతము అసాధ్యము. మరియు పైజెప్పబడినరీతిగ వాతము కఫముతో గూడిదైనను, పిత్తముతో గూడిదైనను, కేవలవాతమైనను ఆక్షేపకవాతము గల్గించునుగాన అట్టి భేదములచేత మూడువిధంబులును, ఆగంతుభేదముచే నొకటియు, అన్నియుగలిసి ఆక్షేపకవాతము నాల్గుతెరంగులై యుండుననియు, గర్భపాత రక్తస్రావములచే జనించిన ఆక్షేపకము కేవలవాతముచే జనించుననియు గదాధరుండు జెప్పెను.

ఏకాఙ్గ సర్వాఙ్గవాత లక్షణము

శ్లో॥ గృహీత్వార్ధం తనోర్వాయుస్సిరాస్స్నాయుర్విశోష్య చ।
పక్షమన్యతరం హన్తి సన్ధిబన్ధాన్విమోక్షయన్॥౪౦॥
కృత్స్నోఽర్ధకాయ స్తస్య స్యాదకర్మణ్యో విచేతనః।
ఏకాఙ్గరోగం తం కేచిదన్యే పక్షవధం విదుః॥౪౧॥
సర్వాఙ్గరోగ స్తద్వచ్చ సర్వకాయాశ్రితేఽనిలే।

తా॥ వాతము ప్రకుపితంబై యర్ధశరీరమున వ్యాపించి యాభాగమునందలి సిరాస్నాయువులను శోషింపజేసి కుడియెడమలలో నొకభాగమునందలి సంధిబంధములను శిథిలములుగ జేసి స్పర్శజ్ఞానము కొంచమైన లేక చలనాదివ్యాపారములయందు సామర్థ్యము లేకుండునట్లు జేయును. అట్టి శరీరార్ధభాగమంతయు క్రియాసామర్థ్యములేక స్పర్శజ్ఞానము దక్కి యుండును. ఈ వ్యాధిని యేకాంగవాతమని కొందరును, పక్షవధవాతమని మరికొందరును వచించెదరు. మున్ను వచించిన రీతిగ వాతము ప్రకుపితంబై సర్వశరీరమున వ్యాపించినపుడు సర్వాంగవాతమని వచించెదరు.

## సాధ్యాసాధ్యైకాఙ్గవాత లక్షణము

శ్లో॥ దాహసన్తాపమూర్ఛాస్స్యుః వాయౌ పిత్తసమన్వితే॥౪౨॥
శైత్య శోథగురుత్వాని తస్మిన్నేవ కఫాన్వితే।
శుద్ధవాతహతం పక్షం కృచ్ఛ్రసాధ్యతమం విదుః॥౪౩॥
సాధ్యమన్యేన సంయుక్తం అసాధ్యం క్షయ హేతుకమ్।

తా॥ వాతము పిత్తముతోగూడి ప్రకోపించినయుపుడు మంట, సన్తాపము, మూర్ఛ ఈలక్షణములు కల్గును. కఫముతో గూడినపుడు శీతలత్వంబును, శోఫయు, శరీరగౌరవంబును కల్గును. ఈలక్షణములు సాధారణమైన వాతము పిత్త కఫములతో జేరినపుడు కూడ కల్గునని యెరుంగునది. మరియు కఫపిత్తసంసర్గములేక కేవలవాతముచే గల్గిన పక్షవాతము మిగుల కష్టసాధ్యంబై యుండును. కఫపిత్తములలో నొకదానితో గూడిన వాతముచే జనించినయెడ సాధింపదగును. ధాతుక్షయముచే శుద్ధవాతము ప్రకుపితంబై దాన జనించిన పక్షవాతము అసాధ్యంబై యుండునని భావము.

## అర్దితవాత లక్షణము

శ్లో॥ ఉచ్చైర్వ్యాహరతోఽత్యర్థం ఖాదతః కఠినాని వా॥౪౪॥
హసతో జృమ్భతో వాపి భారాద్విషమశాయినః।
శిరోనాసౌష్ఠచుబుకలలాటేక్షణసన్ధిగః॥౪౫॥
అర్దయత్యనిలో వక్త్రం అర్దితం జనయత్యతః।
వక్రీభవతి వక్త్రార్ధం గ్రీవాచాప్యపవర్తతే॥౪౬॥
శిరశ్చలతి వాక్సఙ్గో నేత్రాదీనాం చ వైకృతమ్।
గ్రీవాచుబుకదన్తానాం తస్మిన్పార్శ్వే చ వేదనా॥౪౭॥
* * యస్యాఽగ్రజో రోమహర్షో వేపథుర్నేత్రమావిలమ్॥
వాయురూర్ధ్వం త్వచి స్వాపః తోదో మన్యాహనుగ్రహః * *
తమర్దితమితి ప్రాహుర్వ్యాధిం వ్యాధివిచక్షణాః।

తా॥ మిగుల గట్టిగ మాటలాడుట, కఠినంబులైన పదార్థములు నములుట, అధికముగ నవ్వుట, నీల్గుట, భారమును మోయుట, నిమ్నోన్నతస్థలములయందు శయనించుట, ఈ కారణములచేత శిరస్సు, నాసిక, పెదవులు, గడ్డము, నుదురు, నేత్రమధ్యము, ఈ స్థలములయందలి వాతము ప్రకుపితంబై ముఖమునందు నొప్పిని కల్గించును. దానంజేసి నోటియందు సగము వక్రంబగుట, కంఠము వంకరగ నగుట, తలవణకు, నోట మాట వెడలక పట్టుకొనియుండుట, కన్నులు కనుబొమలు మొదలగునవి వక్రత్వము మొదలగు వికారముల నొందుట, అట్టి వ్యాధి కల్గినపార్శ్వమున కంఠము, గడ్డము, దన్తములు, వీనియందు వేదనగల్గుట, ఈ లక్షణములు కల్గును. దీనిని అర్దితవాతవ్యాధి యని వచించెదరు. మరియు మునుమున్ను రోమాంచముగల్గి పిదప, కంపము, కన్నులు కలకబారి యుండుట, వాతమూర్ధ్వముగ సంచరించుట, చర్మమునందు స్పర్శజ్ఞానము లేకుండుట, పోటు, శిరస్సునకు వెనుక

ప్రక్కనుండు నరంబును తాలువులును పట్టినట్లుండుట, ఈలక్షణములు కల్గినయెడ నిది యర్దితవాతం బని కొందరు వైద్యశాస్త్రజ్ఞులు వచించెదరు. మరియు "అర్ధే తస్మిన్ముఖార్ధే వా కేవలే స్యాత్తదర్దితమ్" అని దృఢబలుండు చెప్పియుండుటచేత శరీరార్ధమునందైనను ముఖార్ధమునందైనను వేదనాదులు జనించినయెడల నది యర్దితవాతమని యెరుంగునది. ఈ పక్షమున ఎల్లప్పుడు శరీరార్ధమున బాధకల్గినయెడ అర్ధాంగవాతమనియు, వాతాదివేగముల ననుసరించి యొకప్పుడు వేదన గల్గినయెడ అర్దితవాతమనియు అర్దితఅర్ధాంగవాతములకు పరస్పరభేదముల నెరుంగునది. మాధవకరుండు "అర్దయత్యనిలో వక్త్రమర్దితం జనయత్యతః" అను సుశ్రుతమతము ననుసరించి యీ యర్దితవాతము ముఖమునందే జనించునని చెప్పెనని యెరుంగునది.

## అసాధ్యార్దితవాత లక్షణము

శ్లో॥ క్షీణస్యాఽనిమిషాక్షస్య ప్రసక్తావ్యక్తభాషిణః॥౭౮॥
న సిధ్యత్యర్దితం గాఢం త్రివర్షం వేపనస్య చ॥

తా॥ అర్దిత వ్యాధిపీడితునకు బలక్షయము, రెప్పపాటులేకుండుట, నోరుపట్టుకొని పదములు స్ఫుటముగ దెలియక మాటలాడుట, ఈ లక్షణములు కల్గినయెడ సాధ్యంబుకాదు. మరియు మూడు సంవత్సరములనుండి యనుసరించి బాధించుచుండు నర్దితవాతముగూడ నసాధ్యంబని భావము. ఇచ్చట "త్రివర్షం వేపనస్యచ" అనుచోట నోటియందును, నాసికయందును, కన్నులయందును నీరుగారుచు తలవణకు కల్గినయెడ అట్టి యర్దితవాతము అసాధ్యంబని యర్థమును కొందరు చెప్పెదరు.

## ఆక్షేపకాదివాతవ్యాధులకు వేగనియమము

శ్లో॥ గతే వేగే భవేత్స్వాస్థ్యం సర్వేష్వాక్షేపకాదిషు॥౭౯॥

తా॥ ఆక్షేపకము మొదలుజేసి యర్దితమునకు లోనగు వాతవ్యాధులన్నిటియందును వాతవేగము శమించినపుడు స్వస్థత కల్గును. వేగము అధికముగనుండునెడ బాధగల్గును.

## హనుగ్రహవాత లక్షణము

శ్లో॥ జిహ్వానిర్లేఖనాచ్ఛుష్క భక్షణాదభిఘాతతః।
కుపితో హనుమూలస్థస్స్రంసయిత్వాఽనిలో హనూ॥౮౦॥
కరోతి వివృతాస్యత్వం అథవా సంవృతాస్యతామ్।
హనుగ్రహస్స తేన స్యాత్కృచ్ఛ్రాచ్చర్వణభాషణమ్॥౮౧॥

తా॥ నాలుకను మిక్కుటముగ గీచుట, ద్రవములేక కఠినంబులైన పదార్థములను భుజించుట, అభిఘాతము, ఈకారణములచేత దవడలక్రిందిప్రక్క వాతముజేరి ప్రకుపితంబై దౌడకీళ్ళను సడలింపజేసి నోరుదెరచిన మూసికొనజాలకను, మూసికొనిన దెరవజాలక యుండునటుల జేయును. ఈ వ్యాధి హనుగ్రహం బని చెప్పంబడును. ఈ వ్యాధిచేత నములుటకును మాటలాడుటకును మిగుల కష్టముగ నుండును.

మన్యాస్తంభవాత లక్షణము

శ్లో॥ దివాస్వప్నాఽసమస్థాన వివృతోర్ధ్వనిరీక్షణైః।
మన్యాస్తమ్భం ప్రకురుతే స ఏవ శ్లేష్మణావృతః॥౫౧॥

తా॥ పవటియందు నిదురించుట, నిమ్నోన్నతస్థలముల శయనించుట, కన్నుల మిక్కుటముగ దెరచిచూచుట, ఊర్ధ్వముగజూచుట, ఈకారణములచేత వాతము ప్రకుపితంబై కఫముతో గూడి శిరమునకు వెనుకప్రక్కనుండు పెద్దనరమును స్తంభింపజేయును. దీనిని మన్యాస్తమ్భవాతమని యెరుంగునది.

జిహ్వాస్తమ్భవాత లక్షణము

శ్లో॥ వాగ్వాహినీసిరాసంస్థో జిహ్వాం స్తమ్భయతేఽనిలః।
జిహ్వాస్తమ్భస్స తేనాన్నపాన వాక్యేష్వనీశతా॥౫౩॥

తా॥ వాక్కుల వహించు సిరల నాశ్రయించిన వాతము ప్రకుపితంబై నాలుకను కదలకుండగ జేయును. దీనిని జిహ్వాస్తంభవాతమని వచించెదరు. ఈ వ్యాధిచేత నన్నమును భుజించుటకును నీరు ద్రావుటకును మాటలాడుటకును సామర్థ్యము లేకుండును.

సిరాగ్రహవాత లక్షణము

శ్లో॥ రక్తమాశ్రిత్య పవనః కుర్యాన్మూర్ధధరాస్సిరాః।
రూక్షాస్సవేదనాః కృష్ణాః సోఽసాధ్యస్స్యాత్సిరాగ్రహః॥౫౪॥

తా॥ వాతము రక్తము నాశ్రయించి ప్రకుపితంబై శిరమును ధరించు కంఠమునందలి సిరలను మిగుల వేదనతోగూడి రూక్షంబులై కృష్ణవర్ణంబులగునట్లు చేయును. ఇదియే సిరాగ్రహవాతంబని చెప్పంబడును. ఈ వ్యాధి మిగుల నసాధ్యంబై యుండును.

గృధ్రసీవాత లక్షణము

శ్లో॥ స్ఫిక్పూర్వా కటిపృష్ఠోరుజానుజఙ్ఘాపదం క్రమాత్।
గృధ్రసీ స్తమ్భరుక్తోదైర్గృహ్ణాతి స్పన్దతే ముహుః॥౫౫॥
వాతాద్వాతకఫాత్తన్ద్రా గౌరవారోచకాన్వితా।

తా॥ పిరుదులయూర్ధ్వస్థలము, నడుము, పృష్ఠభాగము, తొడలు, మోకాళ్లు, పిక్కలు, పాదములు, ఈ యవయవములయందు వాతము ప్రకుపితంబై వరుసగ స్తంభమును నొప్పిని పోటును గల్గించి మాటిమాటికి కంపమునొందించినయెడ గృధ్రసీవాతమని చెప్పంబడును. ఈవ్యాధి కేవలవాతముచేతనే జనించినపుడు పైజెప్పంబడిన లక్షణములు కల్గును. వాతకఫములచే జనించినపుడు కునికిపాటు, గురుత్వము, అరోచకము, ఈ లక్షణములుకూడ కల్గును.

విశ్వచీవాత లక్షణము

శ్లో॥ తలం ప్రత్యఙ్గులీనాం యాః కణ్డరా బాహుపృష్ఠతః॥౫౬॥
బాహ్వోః కర్మక్షయకరీ విశ్వచీ చేతి సోచ్యతే।

తా॥ భుజములకు పైభాగము మొదలుజేసి మీఁజెయ్యివరకు వెనుప్రక్క వ్యాపించి వ్రేళ్ల యందు ప్రసరించియుండు కండరములను దుష్టంబులుగజేసి హస్తములకు ముడుచుట చాచుట మొదలగు చలనవ్యాపారములయందు పటుత్వములేకుండజేసినయెడ విశ్వాచియను వాతవ్యాధి యని యెరుంగునది. మరియు గయదాసాచార్యుండు "గృధ్రసీ విశ్వాచీ చోక్తా ఖల్వీ తీవ్రరుజాన్వితా" అని చెప్పియుండుటచేత విశ్వాచీ, గృధ్రసీ, అను వాతవ్యాధులు మిక్కిలితీవ్రంబైన వేదనతో గూడియున్నయెడ ఖల్వీవాతంబని యెరుంగునది.

క్రోష్టుకశీర్షవాత లక్షణము

శ్లో॥ వాతశోణితజశ్శోథో జానుమధ్యే మహారుజః ॥౫౭॥
జ్ఞేయః క్రోష్టుకశీర్షస్తు స్థూలః క్రోష్టుకశీర్షవత్।

తా॥ వాతరక్తవ్యాధివలన మోకాలునందు నక్కతలవలె స్థూలంబైన వాపు జనించి మిక్కుటంబైన వేదనతోగూడి యుండును. ఈ వ్యాధిని క్రోష్టుకశీర్ష వాతంబని యెరుంగునది. ఈ వ్యాధి వాతరక్తభేదములో జేరినదియైనను చికిత్సాభేదార్థము వేరుగా పఠించియున్నదని యెరుంగునది. ఈ వ్యాధి వాతరక్తములచే జనించునని జైజ్జటాచార్యుండు వక్కాణించెను.

ఖంజ పంగువాత లక్షణములు

శ్లో॥ వాయుః కట్యాశ్రితస్సక్థ్నః కణ్డరామాక్షిపేద్యదా ॥౫౮॥
ఖఞ్జస్తదా భవేజ్జన్తుః పఙ్గుస్సక్థ్నోర్ద్వయోర్వధాత్।

తా॥ కటిప్రదేశము నాశ్రయించిన వాతము ప్రకుపితంబై ఒకతొడయందలి కండరములను వ్యాపించి కుంటిగజేసినయెడ నవ్యాధి ఖంజవాతమనియు, తొడలరెంటియందుండు కండరముల వ్యాపించి రెండుకాళ్ళను కుంటిగజేసినయెడ పంగువాతమనియు నెరుంగునది. ఇచ్చట కండరములన "వృత్తాస్తు కండరాస్స్నాయ్వా విజ్ఞేయాః కుశలైరిహ" అని సుశ్రుతమున నుండుటచే వర్తులంబులైయుండు గొప్పస్నాయువులని యెరుంగునది.

కలాయఖంజవాత లక్షణము

శ్లో॥ ప్రక్రామన్వేపతే యస్తు ఖఞ్జన్నివ చ గచ్ఛతి॥౫౯॥
కలాయఖఞ్జం తం విద్యాత్ ముక్తసన్ధిప్రబన్ధనమ్।

తా॥ నడచుటకు ప్రారంభించుసమయమున వణకుట, కుంటుచు నడచుట, సన్ధిబంధములన్నియు శిథిలంబులగుట, ఈ లక్షణములు కల్గినది కలాయఖఞ్జమని యెరుంగునది. ఇచ్చట కలాయఖఞ్జమను సంజ్ఞ రూఢివాచకము.

వాతకంటకవాత లక్షణము

శ్లో॥ రుక్పాదే విషమన్యస్తే శ్రమాద్వా జాయతే యదా॥౬౦॥
వాతేన గుల్ఫమాశ్రిత్య తమాహుర్వాతకణ్టకమ్।

తా॥ విషమస్థలములయందు నడచుటచేతనైనను, శ్రమచేతనైనను వాతము ప్రకుపితంబై కాలిమడమ నాశ్రయించి బాధను కల్గజేయును. దీనిని వాతకంటక వ్యాధి యని వచించెదరు.

పాదదాహవాత లక్షణము

శ్లో॥ పాదయోః కురుతే దాహం పిత్తాసృక్సహితోఽనిలః॥౬౧॥
విశేషతశ్చంక్రమతః పాదదాహం తమాదిశేత్।

తా॥ పిత్తరక్తములతోఁగూడిన వాతము విశేషసంచారముచే ప్రకుపితంబై అరకాలులయందు మిక్కుటముగ మంట బుట్టించినయెడల దానిని పాదదాహమని యెరుంగునది.

పాదహర్షవాత లక్షణము

శ్లో॥ హృష్యేతే చరణౌ యస్య భవేతాం చాపి సుప్తకౌ॥౬౨॥
పాదహర్షస్స విజ్ఞేయః కఫవాతప్రకోపతః।

తా॥ చిరకాలము కూర్చుండి లేచి కాళ్ళను క్రిందబెట్టునపుడు కాళ్ళయందు సూదులగ్రుచ్చిన విధంబుగ వేదనగల్గి స్పర్శజ్ఞానము లేకున్నయెడ దానిని పాదహర్షంబని యెరుంగునది. ఈ వ్యాధి కఫముతో గూడిన వాతము ప్రకోపించుటచే గల్గునని యెరుంగునది.

అంసశోషావబాహుకవాత లక్షణములు

శ్లో॥ అంసదేశస్థితో వాయుశ్శోషయేదంసబన్ధనమ్॥౬౩॥
సిరాశ్చాకుఞ్చ్య తత్రస్థో జనయేదవబాహుకమ్।

తా॥ భుజశిరస్సులయందు వాతము ప్రకుపితంబై బాహుమూలములయొక్క కీలును బంధించి శోషింపజేయును. ఈ వ్యాధి అంసశోషమని చెప్పంబడును. మరియు నంసప్రదేశముననున్న వాతము బాహుమూలమునందలి నిరలను ముడుచుకున్నట్లు చేయును. ఇది అవబాహుకమని జెప్పంబడును. మరియు "బాహుప్రస్పందితహరం జనయేదవబాహుకమ్" అని వాగ్భటాచార్యుండు చెప్పియుండుటంజేసి యీవ్యాధియందు హస్తమునకు చలనాది వ్యాపారములయందు సామర్థ్యములేకుండునని యెరుంగునది.

మూకమిన్మినగద్గదవాత లక్షణములు

శ్లో॥ ఆవృత్య వాయుస్సకఫో ధమనీశ్శబ్దవాహినీః॥౬౪॥
నరాన్కరోత్యక్రియకాన్మూకమిన్మినగద్గదాన్।

తా॥ వాతము కఫముతోఁగూడి ప్రకుపితంబై శబ్దవహంబులగు శరీరోర్ధ్వగతధమనుల నడ్డగించి మనుజులను మూగివార్లనుగను ముక్కుడివారినిగను డగ్గుత్తుకతో మాటలాడువారినిగను జేయును.

తూనీవాత లక్షణము

శ్లో॥ యా వేదనా యాతి వర్చోమూత్రాశయోత్థితా॥౬౫॥
భిన్దతీవ గుదోపస్థం సా తూనీ నామ నామతః।

తా॥ మలమూత్రాశయములయందు వేదనజనించి గుదోపస్థలను భేదించునటుల నధోభాగమున వ్యాపించినయెడ నయ్యది తూనీవాతమని చెప్పంబడును. అచ్చట ఉపస్థశబ్దముచేత స్త్రీపురుష సాధారణంబైన గుహ్యస్థలంబని యర్థము నెరుంగునది.

## ప్రతితూనీవాత లక్షణము

శ్లో॥ గుదోపస్థోత్థితా యా తు ప్రతిలోమం ప్రధావితా॥౬౬॥
వేగైః పక్వాశయం యాతి ప్రతితూనీతి సోచ్యతే।

తా॥ గుదోపస్థలయందు వేదనజనించి వాతవేగముచే నూర్ధ్వముగ సంచరించి పక్వాశయమునం జేరినయెడ దానిని ప్రతితూనీవాతమని వచించెదరు.

## ఆధ్మానవాత లక్షణము

శ్లో॥ సాటోపమత్యుగ్రరుజమాధ్మాతముదరం భృశమ్॥౬౭॥
ఆధ్మానమితి తం విద్యాద్ఘోరం వాతనిరోధజమ్।
విముక్తపార్శ్వహృదయం తదేవామాశయోత్థితమ్॥౬౮॥
ప్రత్యాధ్మానం విజానీయాత్కఫ వ్యాకులితానిలమ్।

తా॥ పక్వాశయమునందు గుడుగుడు అను శబ్దంబును, మిగుల తీవ్రమైన నొప్పియు గల్గి గాలిచే నిండియున్న తోలుతిత్తివలె వాతపూరితంబై యున్నయెడ ఆధ్మానవాతమని చెప్పందగును. ఈ వ్యాధి వాతమును వెడలనీయక నిరోధించుటచే జనించును. మిగుల క్రూరంబై యుండును. మరియు వాతము కఫముతోగూడి ఆమాశయమునందు ఆటోపాదిలక్షణములతోగూడి పార్శ్వమును హృదయమును వదలి బాధించుచున్నయెడ ప్రత్యాధ్మానవాతమని చెప్పంబడును.

## అష్ఠీలావాత లక్షణము

శ్లో॥ నాభేరధస్తాత్సంజాతస్సంచారీ యది వాఽచలః॥౬౯॥
అష్ఠీలావద్ఘనో గ్రన్థిరూర్ధ్వమాయత ఉన్నతః।
వాతాష్ఠీలాం విజానీయాద్బహిర్మార్గావరోధినీమ్॥౭౦॥
ఏతామేవ రుజోపేతాం వాతవిణ్మూత్రరోధినీమ్।
ప్రత్యష్ఠీలామితి వదేజ్జఠరే తిర్యగుత్థితామ్॥౭౧॥
మారుతే విగుణే వస్తౌ మూత్రం సమ్యక్ప్రవర్తతే।
వికారా వివిధా శ్చాత్ర ప్రతిలోమే భవన్తిచ॥౭౨॥

తా॥ నాభికి క్రింద కంసాలవాని యినుపదాకలవలె కఠినంబును ఉన్నతంబును విస్తీర్ణంబును వర్తులంబునైన గ్రంథి జనించి చలించుచునైనను నిశ్చలంబుగనైన నున్నయెడ దానిని వాతముచే జనించిన అష్ఠీల యను వ్యాధియని వచించెదరు. మరియు నాగ్రంథి వాతమూత్రపురీషములయొక్క మార్గమును నిరోధించియుండును. ఈగ్రన్థియే జఠరమునందు అడ్డముగ బుట్టి నొప్పితోగూడి వాతమూత్రపురీషములయొక్క మార్గముల నడ్డగించియున్నయెడ ప్రత్యష్ఠీల యని వచించెదరు.

మరియు వాతము మూత్రశస్త్రియందు అనులోమముగ సంచరించునప్పుడు మూత్రము నిరోధములేక వెడలును. ప్రతిలోమముగ సంచరించునెడ మూత్రసంబంధంబులగు నానావిధవ్యాధులు జనించును.

## కంపవాతఖల్వీవాత లక్షణములు

శ్లో॥ సర్వాఙ్గకమ్పశ్శిరసో వాయుర్వేపథుసంజ్ఞకః।
ఖల్లీ తు పాదజంఘోరుకరమూలాఽవమోటనీ॥౭౩॥

తా॥ సర్వాంగములును శిరంబును వాతముచే కదలుచున్నయెడ కంపవాతమని చెప్పంబడును. చీలమండ, మోకాళ్ళు, గజ్జలు, మణికట్టు, ఈస్థలములయందలి సిరలను బంధించినయెడ ఖల్వీవాతమని చెప్పంబడును.

## అనుక్తవాతవ్యాధి నిర్ణయము

శ్లో॥ స్థాననామానురూపైశ్చ లిఙ్గైశ్శేషాన్వినిర్దిశేత్।
సర్వేష్వేతేషు సంసర్గం పిత్తాద్యైరుపలక్షయేత్॥౭౪॥
హనుస్తమ్భార్దితాక్షేపపక్షాఘాతాపతానకాః।
కాలేన మహతాఽఽఢ్యానాం యత్నాత్సిధ్యన్తి వా న వా॥౭౫॥
నరాన్బలవతస్త్వేతాన్ సాధయేన్నిరుపద్రవాన్।

తా॥ మరియు వాతవ్యాధి జనించు కుక్షినఖములు మున్నగు స్థలవిశేషములనుబట్టి కుక్షిశూల నఖభేదము మున్నగు వాతవ్యాధులను, బాధావిశేషములనుబట్టి శూలభేదతోదములు మున్నగాగల వాతవ్యాధులను నిర్ణయింపదగు. మరియు సకలవాతవ్యాధులయందును పిత్తకఫలక్షణములయొక్క సంసర్గముచేత తత్సంసృష్టవాతవ్యాధులనియు నెరుంగునది. మరియు హనుస్తంభము, అర్దితవాతము, ఆక్షేపకవాతము, పక్షాఘాతము, అపతానకము, ఈవ్యాధులు మిక్కిలి ద్రవ్యముగలవారు చిరకాలము ధనవ్యయముజేసి మిగులప్రయత్నముతో చికిత్సజేసికొనినయెడ ఒకవేళ నివర్తించును. నివర్తించక యసాధ్యంబులయ్యు నుండును. ఈవ్యాధులు మిక్కిలి బలవంతులైనవారికి ఉపద్రవములులేక జనించినయెడ సాధింపదగును.

## వాతవ్యాధ్యుపద్రవములు

శ్లో॥ విసర్పదాహరుక్సఙ్గమూర్ఛారుచ్యగ్నిమార్దవైః॥౭౬॥
క్షీణమాంసబలం వాతా ఘ్నన్తి పక్షవధాదయః।
శూనం సుప్తత్వచం భగ్నం కమ్పాధ్మాననిపీడితమ్॥౭౭॥
రుజార్తిమన్తం చ నరం వాతవ్యాధిర్వినాశయేత్।

తా॥ విసర్పము, మంట, నొప్పి, మూర్ఛ, అరుచి, అగ్నిమాంద్యము, మాంసబలములు క్షీణించుట, వాపుగల్గి స్పర్శజ్ఞానము లేకుండుట, భగ్నము, కమ్పాధ్మానములు, బాధచే మిగుల శ్రమనొందుట, ఈ యుపద్రవములతో గూడి శరీరమున మాంసబలములు క్షీణించియున్నపుడు పక్షవధము మున్నగు వాతవ్యాధులు మనుజులను హింసించును.

## ప్రకృతిస్థవాత గుణములు

శ్లో॥ అవ్యాహతగతిర్యస్య స్థానస్థః ప్రకృతిస్థితః।
వాయుస్స్యాత్సోఽధికం జీవేద్వీతరోగస్సమాశ్శతమ్॥౭౮॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
వాతవ్యాధినిదానం సమాప్తమ్

---

తా॥ వాతము స్వస్థానముననే వృద్ధిక్షయములులేక సమస్థితిగనుండి యడ్డములేక శరీరమునందు సంచరించుచున్నయెడ మనుజుండు నూటయిరువదిసంవత్సరములకుపైన నైదుదినములవరకు రోగములులేక జీవించును. ''సమాష్షష్టిర్ద్విఘ్నా మనుజకరిణాం పఞ్చ చ నిశాః'' అను ప్రమాణముచేత మనుజులకును ఏనుగులకును నూటయిరువది సంవత్సరముల ఐదుదినములవరకు పరమాయుస్సుగా నెఱుంగునది.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాపాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దీవ్యన్వనాయు రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ ''ఆయుర్వేదమార్తాణ్డ'' ''భిషజ్మణి'' ''పణ్డిత'' గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానార్థతాత్పర్యము
నందు వాతవ్యాధి నిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# వాతరక్తనిదానమ్



వాతవ్యాధినిదానానన్తరము వాతవ్యాధివిశేషంబైన వాతరక్తవ్యాధియొక్క నిదానమును వచించుట.

శ్లో॥ లవణామ్లకటుక్షారస్నిగ్ధోష్ణాజీర్ణభోజనైః।
క్లిన్నశుష్కామ్బుజానూపమాంసపిణ్యాకమూలకైః॥౧॥
కులత్థమాషనిష్పావశాకాదిపలలేక్షుభిః।
దధ్యారనాలసౌవీరశుక్తతక్రసురాసవైః॥౨॥
విరుద్ధాధ్యశనక్రోధదివాస్వప్నప్రజాగరైః।
ప్రాయశస్సుకుమారాణాం మిథ్యాహారవిహారిణామ్॥3॥
స్థూలానాం సుఖినాం చాపి కుప్యతే వాతశోణితమ్।

తా॥ ఉప్పు, పులుసు, చేదు, కారము, ఈరసములుగల పదార్థములను విశేషముగ భుజించుట, స్నిగ్ధంబులును, ఉష్ణకరంబులును, అజీర్ణకరంబులునైన పదార్థములను భుజించుట, పాసిన మాంసము, ఎండినమాంసము, మత్స్యములు మొదలగు జంతువులయొక్క మాంసము, చక్రవాకాది పక్షులయొక్క మాంసము, గానుగపిండి, ముల్లంగి, ఉలవలు మినుములు మొదలగు శింబీధాన్యములు ఆకుకూరలు మొదలగునవి, మాంసము, చెరకురసము, పెరుగు, గంజి, సౌవీరంబనుకాంజికభేదము, శుక్తము, మజ్జిగ, సారాయి, మద్యము, ఈద్రవ్యముల విశేషముగ సేవించుట, పరస్పరవిరుద్ధంబులైన పదార్థముల నొకటిగఁజేర్చి భుజించుట, అధికముగ భుజించుట, జీర్ణముగాని సమయమున భుజించుట, క్రోధము, పగటియందు నిదురించుట. రాత్రియందు నిదురమేల్కొని యుండుట, ఈ కారణములచేత వాతరక్తవ్యాధి జనించును. ఈ వ్యాధి విశేషముగ సుకుమారులకును, అపథ్యంబులైన యాహారవిహారముల సల్పువారికిని, స్థూలమైన శరీరముగలవారికిని, మిక్కిలి సుఖముననుభవించువారికిని సంభవించును.

## వాతరక్తసంప్రాప్తి

శ్లో॥ హస్త్యశ్వోష్ట్రైర్గచ్ఛతశ్చాశ్నతశ్చ
విదాహ్యన్నం సవిదాహాశనస్య।

కృత్స్నం రక్తం విదహత్యాశు తచ్చ
దుష్టం స్రుతం పాదయోశ్చీయతే తు॥౫॥
తత్సంపృక్తం వాయునా దూషితేన
తత్ప్రాబల్యాదుచ్యతే వాతరక్తమ్।

తా॥ ఏనుగులు గుఱ్ఱములు ఒంటెలు మొదలగువానిపై నెక్కి పోవువారును, మిక్కిలి దాహకరంబులైన యన్నము మొదలగుపదార్థములను భుజించువారునైన మనుజులయొక్క శరీరమునందలి రక్తమంతయు దుష్టంబై స్వవర్ధకంబులగు కారణములచే దుష్టమైన వాతముతోఁగూడి పాదములకు దిగినయెడ వాతరక్తమను వ్యాధియని యెరుంగునది. అందు రక్తమునకంటె వాతము అధికముగా నుండుటంజేసి వాతరక్తమని జెప్పంబడును. మరియు వాతరక్తసంప్రాప్తి చరకమున నీరీతిగ నున్నది: "వాయుః ప్రవృద్ధో వృద్ధేన రక్తేనాఽఽవారితః పథి। క్రుద్ధస్సన్దూషయేద్రక్తం తద్జ్ఞేయం వాతశోణితమ్" స్వవర్ధకంబులగు కారణములచే వృద్ధినొందిన వాతము దుష్టంబైన రక్తముచే నడ్డగింపబడి దానంజేసి ప్రకుపితంబై యారక్తమును జెరచును. దీనిని వాతరక్తమని వచించెదరని యర్థము. ఈవాక్యముచేత వాతరక్తమునందు రక్తము దుష్టంబై వాతము సంచరించు మార్గమును అడ్డగించినచో వాతము ప్రకుపితంబై వాతరక్తమను వ్యాధిని గల్గించునని యు, వాతవ్యాధియందు మున్ను జెప్పిన రక్తగతవాతమునందు వాతము దుష్టంబై నిర్దుష్టమైన రక్తముతోఁ జేరుననియు నీరెంటికిని భేదము నెరుంగునది.

## వాతరక్త పూర్వరూపములు

శ్లో॥ స్వేదోఽత్యర్థం న వా కార్ష్ణ్యం స్పర్శాఽజ్ఞత్వం క్షతేఽతిరుక్।
సన్ధిశైథిల్యమాలస్యం సదనం పిడకోద్గమః॥౬॥
జానుజఙ్ఘోరుకట్యంసహస్తపాదాఙ్గసన్ధిషు।
నిస్తోదస్స్ఫురణం భేదో గురుత్వం సుప్తిరేవ చ॥౭॥
కణ్డూస్సన్ధిషు రుగ్భూత్వా భూత్వా నశ్యతి చాఽసకృత్।
వైవర్ణ్యం మణ్డలోత్పత్తిర్వాతాసృక్పూర్వలక్షణమ్॥౮॥

తా॥ శరీరమునందు చెమట అధికముగ బట్టుట, లేక చెమ్మట బొత్తుగ లేక నే యుండుట, శరీరమున నలుపుగల్గుట, స్పర్శజ్ఞానము తెలియకుండుట, గాయముకల్గినయెడ అందు మిక్కుటముగ బాధకల్గుట, అవయవసంధులు శిథిలంబులుగ నుండుట, ఆలస్యము, శరీరముకృశించుట, పిడకలు జనించుట, మోకాళ్ళు, తొడలు, కటిస్థలము, భుజశిరస్సులు, హస్తములు, పాదములు, వీని సంధు లయందు సూదులతోఁబొడిచినట్లు బాధగల్గుట, శరీరము అదురుట, పగులుట, బరువుగనుండుట, స్పర్శజ్ఞానములేకుండుట, దురదపుట్టుట, సంధులయందు మాటిమాటికి నొప్పిపుట్టి తనంతటనే శమించుట, వర్ణము మారియుండుట, పొడలు బుట్టుట, ఈ లక్షణములన్నియు వాతరక్తవ్యాధికి మున్ను జనించు పూర్వరూపములని యెరుంగునది.

## వాతాధికవాతరక్త లక్షణము

శ్లో॥ వాతేఽధికేఽధికం తత్ర శూలస్ఫురణభఞ్జనమ్।
శోథస్య రౌక్ష్యం కృష్ణత్వం శ్యావతా వృద్ధిహానయః॥౯॥
ధమన్యఙ్గులిసన్ధీనాం సఙ్కోచోఽఙ్గగ్రహోఽతిరుక్।
శీతద్వేషానుపశయౌ స్తమ్భవేపథుసుప్తయః॥౧౦॥

తా॥ వాతరక్తమునందు వాతంబధికముగ నున్నపుడు శూల, అవయవము లదరుట, నొప్పి, వాపు మిక్కిలి రూక్షంబై కృష్ణవర్ణముగనైనను లేక శ్యామవర్ణంబుగనైన నుండి ఒకసమయమున వృద్ధినొందుచు నొకసమయమున క్షీణంబగుచు నుండుట, ధమనులయొక్కయు వ్రేళ్ళయొక్కయు సంధులు ముడుచుకొని యుండుట, సర్వావయవములు నీడ్చిపట్టినట్లుండుట, అధికముగ నొప్పి గల్గియుండుట, శీతపదార్థములయందు ద్వేషము, అట్టి శీతపదార్థముల సేవించుటచేత వ్యాధి బలిష్ఠమగుట, అవయవములు స్తంభించియుండుట, వణకు, స్పర్శజ్ఞానము లేకుండుట, ఈ లక్షణములు కల్గును.

## రక్తాధికవాతరక్త లక్షణము

శ్లో॥ రక్తే శోథోఽతిరుక్తోదస్తామ్రశ్చిమిచిమాయతే।
స్నిగ్ధరూక్షైశ్శమం నైతి కణ్డూక్లేద సమన్వితః॥౧౧॥

తా॥ వాతరక్తమునందు రక్తం బధికముగ నున్నపుడు అధికమైన వాపు, పోట్లు. వాపు, యెఱ్ఱగనుండి చిమచిమలాడుచుండుట, స్నిగ్ధంబులును రూక్షంబులునైన పదార్థముల సేవించుటచే శమించ కుండుట, దురదయు బంధనయు గల్గియుండుట, ఈ లక్షణములు గల్గును.

## పిత్తాధిక వాతరక్త లక్షణములు

శ్లో॥ పిత్తే విదాహసమ్మోహస్వేదో మూర్చ్ఛామదస్తృషా।
స్పర్శాసహత్వం రుగ్రాగః శోథః పాకో భృశోష్మతా॥౧౨॥

తా॥ వాతరక్తమునందు పిత్తంబధికముగ నున్నపుడు మిగులసంతాపము, మోహము, మూర్ఛ, చెమట, దప్పి, హస్తముచే స్పృశించిన నోరువలేకుండుట, పోట్లు, రక్తవర్ణముగలవాపు, పుండగుట, అధికముగ నుష్ణముగల్గుట, ఈ లక్షణములు జనించును.

## కఫాధికవాతరక్త లక్షణము

శ్లో॥ కఫే స్తైమిత్యగురుతా సుప్తిస్నిగ్ధత్వశీతతాః।
కణ్డూర్మన్దా చ రుగ్ద్వన్ద్వం సర్వలిఙ్గం చ సంకరాత్॥౧౩॥

తా॥ వాతరక్తమునందు కఫం బధికముగ నున్నపుడు శరీరము మొద్దుబారి బరువుగనుండుట, చేష్టలడక్కియుండుట, స్నిగ్ధంబును శీతంబునై యుండుట, దురద, కొంచెము నొప్పి, ఈ లక్షణములు కల్గియుండును. మరియు వాతాది దోషద్వయలక్షణములు గలిసి యున్న యెడ ద్వంద్వజమనియు, దోషత్రయలక్షణములతో గూడియున్నది సన్నిపాతజమనియు నెరుంగునది.

## వాతరక్తవ్యాధికి స్థలవిశేషముచే గమనభేదములు

శ్లో॥ పాదయోర్మూలమాస్థాయ కదాచిద్ధస్తయోరపి।
ఆఖోర్విషమివక్రుద్ధం తద్దేహముపసర్పతి ॥౧౪॥

తా॥ మున్ను వచించిన వాతరక్తవ్యాధి పాదములయొక్కయు హస్తములయొక్కయు మూలమున జనించి ఎలుకయొక్క విషమువలె మెలమెల్లగ ప్రకుపితంబై దేహమునందెల్ల వ్యాపించును. మరియు చరకాచార్యుండు "ఉత్తానమథగమ్భీరం ద్వివిధం వాతశోణితమ్। త్వఙ్మాంసాశ్రయముత్తానం గమ్భీరం త్వన్తరాశ్రయమ్" అని రెండువిధములుగ వచించెను. వాతరక్తవ్యాధి ఉత్తానమనియు గంభీరమనియు, రెండువిధములు. అందు చర్మమాంసముల నాశ్రయించినది యుత్తానంబనియు, శరీరాన్తర్భాగము నాశ్రయించినది గంభీరంబనియు భావము.

### అసాధ్యవాతరక్త లక్షణము

శ్లో॥ ఆజానుస్ఫుటితం యచ్చ ప్రభిన్నం ప్రసృతం చ యత్ ।
ఉపద్రవైశ్చ యజ్జుష్టం ప్రాణమాంసక్షయాదిభిః॥౧౫॥
వాతరక్తమసాధ్యం స్యాద్యాప్యం సంవత్సరోత్థితమ్ ।

తా॥ మోకాలివరకు వ్యాపించినను, పగిలినను, పగిలి నీరు గారుచున్నను, ఉపద్రవములతో గూడియున్నను, శరీరబలమాంసములు క్షయించినను, వాతరక్తవ్యాధి యసాధ్యము. సంవత్సరకాలమునకుమున్ను జనించినది యాప్యంబై యుండును. మరియు సంవత్సరకాలమునకు లోబడి పైజెప్పిన స్ఫుటితాదిలక్షణములు లేకున్నయెడ సాధ్యంబనిభావము.

శ్లో॥ అస్వప్నాఽరోచకశ్వాసమాంసకోథశిరోగ్రహాః॥౧౬॥
మూర్ఛాఽతిమదరుక్తృష్ణాజ్వరమోహప్రవేపకాః।
హిక్కాపాఙ్గుల్యవీసర్పపాకతోదభ్రమక్లమాః॥౧౭॥
అంగులీవక్రతాస్ఫోటదాహమర్మగ్రహార్బుదాః।
ఏతైరుపద్రవైర్వర్జ్యం మోహేనైకేన వాఽపి యత్ ॥౧౮॥
అకృతోఽన్నుపద్రవం యాప్యం సాధ్యం స్యాన్నిరుపద్రవమ్।
ఏకదోషానుగం సాధ్యం నవం, యాప్యం ద్విదోషజమ్ ॥౧౯॥
త్రిదోషజమసాధ్యంస్యాద్యస్య చ స్యురుపద్రవాః।



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
వాతరక్తనిదానం సమాప్తమ్

---

తా॥ నిదురబట్టకుండుట, అరోచకము, శ్వాసము, మాంసముకుళ్ళుట, తలపట్టుకొనియుండుట, మూర్ఛ, మదము, నొప్పి, దప్పి, జ్వరము. మోహము, వణకు, ఇవి మిగుల నధికముగనుండుట, వెక్కిళ్లు, కుంటితనము, విసర్పము, పుండగుట, పోటు, భ్రమము, బడలిక, వ్రేళ్లు వక్రంబులగుట, బొబ్బలు, తాపము, మర్మస్థానములయందు బాధ; అర్బుదవ్రణము, ఈ యుపద్రవములతోగూడిన వాతరక్తవ్యాధియు, పై జెప్పంబడినవి అన్నియు లేకున్నను మోహంబొక్కటితోడనే గూడియున్న వాతరక్తంబును అసాధ్యంబై యుండును. పైజెప్పబడిన యుపద్రవములలో కొన్నింటితో గూడియున్న యాప్యంబై యుండును. ఉపద్రవ మొక్కటిగూడ లేకున్న సాధ్యంబై యుండును. మరియు ఒక్క దోషముచే జనించి నవీనంబై యున్నయెడ సాధ్యంబై యుండును. రెండుదోషములచే జనించినయెడ యాప్యము. దోషత్రయముచే జనించినదియు, సర్వోపద్రవములతో గూడినదియు నసాధ్యము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రిచర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి," "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానాంధ్రతాత్పర్యము

నందు వాతరక్తనిదానము

సమాప్తము



శ్రీ హ య గ్రీ వా య న మః

శ్రీ ర స్తు

# ఊ రు స్త మ్భ ని దా న మ్

ఊరుస్తమ్భ వాతముగూడ వాతవ్యాధి విశేషముగాన వాతరక్త నిదానానన్తరము ఊరుస్తమ్భ నిదానమును వచించుట.



శ్లో॥ శీతోష్ణద్రవసంశుష్క గురుస్నిగ్ధైర్నిషేవితైః।
జీర్ణాజీర్ణే తథాఽఽయాస సంక్షోభస్వప్న జాగరైః॥౧॥
సశ్లేష్మమేదఃపవనః సామమత్యర్థ సంచితమ్।
అభిభూయేతరం దోషమూరూ చేత్ప్రతిపద్యతే॥౨॥
సక్థ్యస్థీని ప్రపూర్యాన్తః శ్లేష్మణా స్తిమితేన చ।
తదా స్తభ్నాతి తేనోరూ స్తబ్ధౌ శీతావచేతనౌ॥౩॥
పరకీయావివ గురూ స్యాతామతిభృశవ్యథౌ।
ధ్యానాఙ్గమర్దస్తైమిత్యతన్ద్రాచ్ఛర్ద్యరుచిజ్వరైః॥౪॥
సంయుక్తౌ పాదసదనకృచ్ఛ్రోద్ధరణ సుప్తిభిః।
తమూరుస్తమ్భ మిత్యాహు రాఢ్యవాతమథాఽపరే॥౫॥

తా॥ పరస్పర విరుద్ధంబులైన గుణములుకల శీతోష్ణపదార్థములను, ద్రవశుష్కపదార్థములను, గురులఘు పదార్థములను, స్నిగ్ధరూక్షపదార్థములను, రెండేసి నొకటిగఁజేర్చి అధికముగ భుజించుట, భుజించబడిన యన్నాదులు జీర్ణంబై కొంచము జీర్ణముగాక అజీర్ణశేషముండునపుడు భుజించుట, ఆయాసము, మనస్సంక్షోభము, అధికముగ నిదురించుట, నిదుర మేల్కొనియుండుట, ఈ కారణములచేత కఫముతోడను మేదస్సుతోడను గలసినవాతము ప్రకోపమునొంది సామంబయిన పిత్తమును నశింపంచేసి తొడలను జెంది తొడలయొక్క యెముకలయందలి ద్వారమున శ్లేష్మమేదస్సులచే నిండించి స్తంభింపజేయును. అట్టియూరువులు మిగుల శీతలంబులును చేతనారహితంబులునై స్వశరీరసంబంధములేక మరియొకనికి సంబంధించినవానివలె మిక్కిలిభారంబులై యధికమైన వేదనతోఁ గూడి యుండును. అట్టి వ్యాధియందు చింత, ఒడలినొప్పులు, జడత్వము, కునికిపాటు, వాంతి, అరోచకము,జ్వరము, కాళ్లు సన్నగించియుండుట, అతిప్రయాసచేనైనను కాళ్లనుకదలించలేకుండుట, స్పర్శజ్ఞానములేకుండుట, ఈ లక్షణములు కల్గియుండును. దీనిని ఊరుస్తంభవాతమని వచించెదరు.

కొందరు ఆఢ్యవాతమనియును వచించెదరు. ఈ వ్యాధి ప్రాప్తియందు వాతము ప్రధానమైయుండును. మరియు "ఊరుశ్లేష్మా సమేదస్కో వాతపిత్తేఽభిభూయ తు" అని చరకమునవనుండుటంజేసి శ్లేష్మము ప్రధానంబై వాతపిత్తములను వశింపంజేసి ఊరువులయందు స్తంభమును గల్గించునని తెలియందగినది.

## ఊరుస్తంభమునకు పూర్వరూపములు

శ్లో॥ ప్రాగ్రూపం తస్య నిద్రాతి ధ్యానం స్తిమితతా జ్వరః।
రోమహర్షోఽరుచిశ్ఛర్దిర్జఙ్ఘోర్వోస్సదనం తథా॥౬॥
వాతశఙ్కిభిరజ్ఞానా త్తస్య స్యాత్స్నేహనాత్పునః।
పాదయోస్సదనం సుప్తిః కృచ్ఛ్రాదుద్ధరణం తథా॥౭॥
జఙ్ఘోరుగ్లానిరత్యర్థం శశ్వచ్చాదాహవేదనే।
పాదం చ వ్యథయేన్న్యస్తం శీతస్పర్శం న వేత్తి చ॥౮॥
సంస్థానే పీడనే గత్యాం చాలనే చాప్యనీశ్వరః।
అన్యనేయౌ హి సంభగ్నౌ ఊరూ పాదౌ చ మన్యతే॥౯॥
యదా దాహార్తితోదార్తో వేపనః పురుషో భవేత్।
ఊరుస్తంభస్తదా హన్యాత్సాధయేదన్యథా నవమ్॥౧౦॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
ఊరుస్తమ్భనిదానం సమాప్తమ్



తా॥ అధికమైన నిద్ర, అతిచింత, జడత్వము, జ్వరము, గగురుపాటు, అరుచి, వాంతి పిక్కలును తొడలును కృశించుట, ఇవి ఊరుస్తమ్భమునకు మున్ను జనించు పూర్వరూపములు. మరియు నీవ్యాధి జనించునపుడు సంకోచము కంపము మొదలగు లక్షణములబట్టి వాతవ్యాధియని భ్రమసి స్నేహమును జేసినచో పాదములు కృశించుట, స్పర్శజ్ఞానము లేకపోవుట, మిక్కిలి కష్టముచే కాళ్లనుగదలించుట, పిక్కలయందును తొడలయందును బాధకల్గుట, కొంచెముగ తాపంబును వేదనయు మాటిమాటికి జనించుట, పాదములను క్రింద నుంచినప్పుడు బాధగల్గుట, శీతలమైన స్పర్శము నెరుంగకుండుట, కాళ్లను సమముగ నుంచుటకును పీడనమునకును నడచుటకును కదలించుటకును సామర్థ్యము లేకుండుట, తొడలు పాదములు స్వశరీరమునకు సంబంధములేనట్లును విరిగినట్లును దోచుట, ఈలక్షణములన్నియు నూరుస్తంభవ్యాధియందు జనించును. మరియు వ్యాధియందు తాపము, పోట్లు, సూదులగ్రుచ్చినట్లు బాధ, వణకు, ఈ గుణములు కల్గినయెడ నసాధ్యంబై

యుండుననియు, ఈగుణములు లేక నూతనమైనది సాధ్యంబనియు భావము. చరకమునందు ఊరుస్తంభవ్యాధిని ఒక్కటిగ పరిగణనముజేసియుండుటచేత నీ వ్యాధి త్రిదోషములచే జనించి యొక్కవిధంబుగనే యుండునని యెరుంగునది.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్ర విరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపాలాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు

ఊరుస్తమ్భ నిదానము

సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# ఆమవాతనిదానమ్

ఊరుస్తమ్భవాతమునందు సామత్వము అపేక్షితముగాన పిమ్మట ఆమవాతనిదానమును చెప్పుట.

శ్లో॥ విరుద్ధాహారచేష్టస్య మన్దాగ్నేర్నిశ్చలస్య చ।
స్నిగ్ధం భుక్తవతో హ్యన్నం వ్యాయామం కుర్వతస్తథా ॥౧॥
వాయునా ప్రేరితో హ్యామశ్లేష్మస్థానం ప్రధావతి।
తేనాత్యర్థం విదగ్ధోఽసౌ ధమనీః ప్రతిపద్యతే ॥౨॥
వాతపిత్తకఫైర్భూయో దూషితస్సోఽన్నజో రసః।
స్రోతాంస్యభిష్యన్దయతి నానావర్ణోఽతిపిచ్ఛిలః ॥౩॥
జనయత్యాశు దౌర్బల్యం గౌరవం హృదయస్య చ।
వ్యాధీనామాశ్రయో హ్యేష ఆమసంజ్ఞోఽతిదారుణః ॥౪॥
యుగపత్కుపితావన్తస్త్రికసన్ధిప్రవేశకౌ।
స్తబ్ధం వా కురుతో గాత్రం ఆమవాతస్స ఉచ్యతే ॥౫॥

తా॥ పరస్పరవిరుద్ధంబులైన యన్నాదుల భుజించుట, అజీర్ణసమయమున దేహపరిశ్రమము సంభోగము మున్నగు విరుద్ధకృత్యముల జేయుట. అగ్నిమాన్ద్యము, చలించకుండుట, స్నిగ్ధంబైన యన్నమును భుజించి వ్యాయామముజేయుట, ఈ కారణములచే ప్రకుపితంబైన వాతముచేత ఆమము (అపక్వంబైన యాహారరసము) ప్రేరితంబై శ్లేష్మస్థానమును జేరును. అట్టి వాతముచే దుష్టంబైన యామము ధమనులజేరి వాత పిత్త కఫములచే మరల దూషితంబై పిచ్ఛిలంబును నానావిధవర్ణంబునై స్రోతస్సులనన్నింటిని స్రవింపంజేయును. మరియు బలహీనము, హృదయము భారముగనుండుట, ఈ గుణములను గల్గించును. వాతకఫములు రెండును సమకాలమున ప్రకుపితంబులై త్రికముయొక్క సంధిస్థానమునజేరి శరీరమును స్తంభింపజేయును. దీనిని యామవాతమని వచించెదరు. ఆమవాతమును నీ క్రూరమైన వ్యాధి రోగములకన్నిటికిని ముఖ్యకారణమై యుండును.

## ఆమవాతసామాన్య లక్షణము

శ్లో॥ అఙ్గమర్దోఽరుచిస్తృష్ణా ఆలస్యం గౌరవం జ్వరః।
అపాకశ్శూనతాఙ్గానామామవాతస్య లక్షణమ్॥౬॥
స కష్టస్సర్వరోగాణాం యదా ప్రకుపితో భవేత్।
హస్తపాదశిరోగుల్ఫత్రికజానూరుసన్ధిషు॥౭॥
కరోతి సరుజం శోథం యత్ర దోషః ప్రపద్యతే।
స దేశో రుజ్యతేఽత్యర్థం వ్యావిద్ధ ఇవ వృశ్చికైః॥౮॥
జనయేత్సోఽగ్నిదౌర్బల్యం ప్రసేకారుచిగౌరవమ్।
ఉత్సాహహానిం వైరస్యం దాహం చ బహుమూత్రతామ్॥౯॥
కుక్షౌ కఠినతాం శూలం తథా నిద్రావిపర్యయమ్।
తృట్ఛర్దిభ్రమమూర్ఛాశ్చ హృద్గ్రహం విడ్విబద్ధతామ్॥౧౦॥
జాడ్యాన్త్రకూజమానాహం కష్టాంశ్చాన్యానుపద్రవాన్।

తా॥ ఒడలివిరుపులు, అరుచి, దప్పి, ఆలసత్వము, శరీరము బరువై యుండుట, జ్వరము, అజీర్ణము, వాపు, ఈ లక్షణములుకల్గినది యామవాతమని యెరుంగునది. అట్టి యామవాతము ప్రకోపించినపుడు రోగములన్నిటికంటె మిగుల కష్టసాధ్యంబై యుండును. మరియు హస్తములు, పాదములు, శిరస్సు, చీలమండ, వెన్నెముకకు క్రిందిభాగము, మోకాళ్లు, తొడలు, కీళ్లు, ఈస్థలములయందు పోటుతోగూడినవాపు జనించుట, వాతప్రేరితమై యామదోషముచేరినచోట్లయందు తేలుకుట్టిన చందమున మిక్కుటమైన బాధగల్గుట, అగ్నిమాన్ద్యము, నోట నీరూరుట, అరుచి, శరీరము భారమై యుండుట, ఉత్సాహము నశించుట, రసనేన్ద్రియమునకు రసపరిజ్ఞానములేకుండుట, మంట, అతిమూత్రము, కడుపుగట్టిగనుండుట, శూల, నిదురబట్టకుండుట, దప్పి, వాంతి, భ్రమము, మూర్ఛ, రొమ్మునొప్పి, మలబంధము, జడత్వము, ప్రేవులరచుట, కడుపుబ్బరము, ఇవి మొదలుగాగల కష్టంబులైన యుపద్రవములను ఆమవాతము కల్గించును.

## ఆమవాతవిశేష లక్షణము

శ్లో॥ పిత్తాత్సదాహరాగం చ సశూలం పవనానుగమ్॥౧౧॥
స్తిమితం గురుకణ్డూం చ కఫదుష్టం సమాదిశేత్।

తా॥ అందు పిత్తముచే జనించిన యామవాతము మంటతోగూడి యెఱ్ఱగానుండును. వాతముచే జనించినయెడ నొప్పితోగూడి యుండును. కఫముచే జనించినయెడ జడముగను భారముతోగూడి అధికమైన దురదకల్గియు నుండును.

## ఆమవాత సాధ్యాసాధ్య లక్షణము

శ్లో॥ ఏకదోషానుగస్సాధ్యః ద్విదోషో యాప్య ఉచ్యతే॥౧౨॥
సర్వదేహచరశ్శోథస్స కృచ్ఛ్రస్సాన్నిపాతికః।



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
ఆమవాతనిదానం సమాప్తమ్



తా॥ ఏకదోషముచే జనించిన యామవాతము సాధ్యంబును, దోషద్వయముచే జనించినది యాప్యంబును, సన్నిపాతముచే జనించి సర్వదేహమునందు సంచరించుశోఫ యసాధ్యంబునై యుండును.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్ర
విరాజమాన దివ్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషజ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానాన్ధ్రతాత్పర్యము
నందు ఆమవాతనిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# శూలపరిణామశూలాన్నద్రవశూల

# నిదానమ్

ఆమవాతమునందు "సశూలం పవనానుగమ్" అను వాక్యముచేత వాతముచే జనించిన ఆమవాతమున శూల జనించునని తెలియుటచేత ఆమవాతనిదానమును జెప్పినపిదప శూలనిదానమును జెప్పుట.

శూలభేదములు

శ్లో॥ దోషైః పృథక్సమస్తామద్వన్ద్వైః శూలోఽష్టధా భవేత్।
సర్వేష్వేతేషు శూలేషు ప్రాయేణ పవనః ప్రభుః॥౧॥

తా॥ వాతపిత్తశ్లేష్మదోషములచేతను సన్నిపాతముచేతను ఆమముచేతను దోషద్వయసంసర్గముచేతను జనించుటంజేసి శూలవ్యాధి యెనిమిది విధంబులగును. ఈయెనిమిది విధంబులగు శూలలయందును వాతము మిగుల ముఖ్యముగా నుండును. ఇచ్చట వాత పిత్త శ్లేష్మ సన్నిపాత ఆమంబులచే నైగువిధంబులును, వాతపిత్త వాతశ్లేష్మ పిత్తశ్లేష్మములచే మూడువిధంబులును, కలిసి యెనిమిదివిధంబు లగునని యెరుంగునది. మరియు గ్రన్థాన్తరమున హారీతుండు శూలవ్యాధికి జ్వరమునకువలె విప్రకృష్టకారణము నీరీతిగ వచించెను. "అనఙ్గనాశాయ హరస్త్రిశూలం ముమోచ కోపాన్మకరధ్వజశ్చ। తమాపతన్తం సహసా నిరీక్ష్య భయార్దితో విష్ణుతనుం ప్రవిష్టః। స విష్ణుహుఙ్కారవిమోహితాత్మా పపాత భూమౌ ప్రథితస్స శూలః। స పఞ్చభూతానుగతం శరీరం ప్రదూషయత్యస్య హి పూర్వసృష్టిః" ఈశ్వరుడు మన్మథునిపై కోపముచేత తనచేతి శూలమును ప్రయోగింప మదనుం డాశూలమును జూచి వెరగంది విష్ణుదేహమునం జొచ్చిన నద్దేవదేవుండు హుంకారముచే నాశూలమును నిరోధింప నాశూలము పుడమిం బడి పిదప మనుజులయొక్క పంచభూతాత్మకమైన శరీరమున వ్యాధిరూపమునొంది బాధింపం దొడంగెను. దానంజేసి యీవ్యాధి శూలంబని చెప్పంబడియెనని యర్థము. మరియు వృద్ధసుశ్రుతుండు శూలశబ్దమునకన్వర్థత్వము నీరీతిగ వచించెను: "శఙ్కుస్ఫోటనవత్తస్య యస్మాత్తీవ్రాతివేదనా। శూలాసక్తస్య భవతి తస్మాచ్ఛూలమి

హోచ్యతే". ఈ వ్యాధిచే శూలము గ్రుచ్చినటుల వేదనావిశేషము జనించునుగాన నీవ్యాధి శూలంబని వ్యవహరించబడునని భావము.

## వాతజశూల లక్షణము

శ్లో॥ వ్యాయామయానాదతిమైథునాచ్చ
ప్రజాగరాచ్ఛీతజలాతిపానాత్।
కలాయముద్గాఢకికోరదూషా
దత్యర్థరూక్షాధ్యశనాభిఘాతాత్ ॥౨॥
కషాయతిక్తాతివిరూఢజాన్న
విరుద్ధవల్లూరకశుష్క శాకాత్।
విట్ఛుక్రమూత్రానిలవేగరోధా
చ్ఛోకోపవాసాదతిహాస్యభాష్యాత్ ॥౩॥
వాయుః ప్రవృద్ధో జనయేద్ధిశూలం
హృత్పార్శ్వపృష్ఠత్రికవస్తిదేశే।
జీర్ణే ప్రదోషే చ ఘనాగమే చ
శీతే చ కోపం సముపైతి గాఢమ్॥౪॥
ముహుర్ముహుశ్చోపశమప్రకోపౌ
విడ్వాతసంస్తమ్భనతోదభేదైః।
సంస్వేదనాభ్యఞ్జనమర్దనాద్యైః
స్నిగ్ధోష్ణభోజ్యైశ్చ శమం ప్రయాతి॥౫॥

తా॥ దేహపరిశ్రమముజేయుట, దారినడచుట, అధికముగ స్త్రీసంభోగముజేయుట, నిద్ర లేకుండుట, శీతజలము నధికముగ త్రాగుట, లంకలు, పెసలు, కందులు, అరుకలు, ఈ ధాన్యముల భుజించుట, మిక్కిలి రూక్షంబులైన పదార్థములను భుజించుట, భుజించిన యాహారము జీర్ణము గాకుండునపుడు మరల భుజించుట, అభిఘాతము, కషాయతిక్తరసములుగల పదార్థములను భుజించుట, మొలకలెత్తిన ధాన్యముచే సిద్ధమైన యన్నమును భుజించుట, పరస్పరవిరుద్ధంబులైన క్షీర మత్స్యాదిపదార్థములను జేర్చి భుజించుట, ఎండినమాంసమును ఎండినకూరగాయలను భుజించుట, మలము, శుక్రము, మూత్రము, వాతము, వీనియొక్క వేగమును నిరోధించుట, దుఃఖము, ఉపవాసము, అధికముగ నవ్వుట, అధికముగ మాటలాడుట, ఈ కారణములచే వాతము ప్రకుపితంబై హృదయము, ఇరుప్రక్కలు, వీపు, వెన్నెముకకు క్రిందిభాగము, ఈస్థలములయందు శూలమును గల్గించును. ఈవ్యాధి జీర్ణకాలమునందును, ప్రభాతకాలమునందును, వర్షాకాలమునందును, చలికాలమునందును, విశేషముగ జనించును. వాతముచే జనించిన యీవ్యాధి మలమును వాతమును స్తంభింపజేయుచు పోటు నొప్పి మొదలగు ననేకబాధలతోగూడి మాటిమాటికి శమించి మరల

బాధించుచుండును. స్వేదనము అభ్యంజనము మర్దనము మొదలగు చికిత్సలచేతను, స్నిగ్ధంబులును ఉష్ణంబులునైన పదార్థములను సేవించుటచేతను శాంతినొందును. దీనిని వాతముచే జనించిన శూల వ్యాధియని యెరుంగునది.

## పిత్తజశూల లక్షణము

శ్లో॥ క్షారాతితీక్ష్ణోష్ణవిదాహితైల
నిష్పావపిణ్యాకకులుత్థయూషైః।
కట్వమ్లసౌవీరసురావికారైః
క్రోధానలాయాసరవిప్రతాపైః॥౬॥
గ్రామ్యాతియోగాదశనైర్విదగ్ధైః
పిత్తం ప్రకుప్యాశు కరోతి శూలమ్।
తృణ్మోహదాహార్తికరం హి నాభ్యాం
సంస్వేదమూర్ఛాభ్రమశోషయుక్తమ్।
మధ్యందినే కుప్యతి చార్ధరాత్రే
విదాహకాలే జలదాత్యయే చ।
శీతే చ శీతైః సముపైతి శాన్తిం
సుస్వాదుశీతైరపి భోజనైశ్చ॥౭॥

తా॥ యవక్షారాదిద్రవ్యములు, తీక్ష్ణంబులును ఉష్ణంబులునైన మిరియాలు మొదలగు ద్రవ్యములు, వెనుగుమోవులు మొదలగు విదాహకరపదార్థములు, నువ్వులచే జేయబడిన పదార్థములు, శింబీధాన్యములు, గానుగపిండి, ఉలవగంజి, కటురసంబును ఆమ్లరసంబును గల పదార్థములు, కాంజికము, నానావిధమద్యములు, ఈ ద్రవ్యములను సేవించుట, కోపము, అగ్నిచేనైన తాపము, శ్రమము, ఎండ, అధికముగ స్త్రీసంభోగముజేయుట, వేయించిన ధాన్యముచే సిద్ధమైన యన్నమును భుజించుట, ఈకారణములచేత పిత్తము ప్రకుపితంబై శీఘ్రముగ శూలవ్యాధిని కల్గించును. ఈ పిత్తముచే జనించిన శూలమునందు దప్పి, ఇంద్రియసంమోహము, తాపము, నొప్పి, ఈ బాధలు నాభిస్థానమున జనించును. చెమట, మూర్ఛ, భ్రమము, శోషము, ఇవి కల్గును. మరియు నీవ్యాధి మధ్యాహ్నకాలమునందును, అర్ధరాత్రికాలమునందును, ఉష్ణకాలమునందును, శరత్కాలమునందును, శీతకాలమునందును ప్రకోపమునొందును. శీతలపదార్థములను, మధురపదార్థములను సేవించుటచేత శాన్తినొందును. దీనిని పిత్తముచే జనించిన శూలవ్యాధియని వచించెదరు.

## శ్లేష్మజశూల లక్షణము

శ్లో॥ ఆనూపవారిజ కిలాటపయోవికారై
ర్మాంసేక్షు పిష్టకృసరాతిలశష్కులీభిః।

అన్యైర్బలాస జనకై రపి హేతుభిశ్చ
శ్లేష్మా ప్రకోపముపగమ్య కరోతి శూలమ్॥౯॥
హృల్లాసకాస సదనారుచిసంప్రసేకైః
ఆమాశయే స్తిమితకోష్ఠ శిరోగురుత్వైః।
భుక్తే సదైవ హి రుజం కురుతేఽతిమాత్రం
సూర్యోదయేఽథ శిశిరే కుసుమాగమే చ॥౧౦॥

తా॥ జలమునకు సమీపస్థలముననుండు హంసచక్రవాకాదిపక్షులయొక్క మాంసము, కిలాటము, క్షీరముతో జేయబడిన పదార్థములు, మాంసము, చెరకురసము, పిండితో జేసిన పదార్థములు, నువ్వులను బియ్యమును మినుముల నొకటిగ కలిపిచేసిన గంజి, నువ్వులు, చక్కిలములు, ఈ పదార్థములను సేవించుటచేతను, శ్లేష్మవర్ధకంబులగు పదార్థముల సేవించుటచేతను శ్లేష్మము ప్రకుపితంబై ఆమాశయమునందు శూలవ్యాధిని కల్గించును. ఈవ్యాధియందు ఓకలింతలు, దగ్గు, అగ్నిసాదము, అరోచకము, నోటనీరు వెడలుట, మలబంధము, శిరోభారము, ఈలక్షణములు జనించును. మరియు భుజించినయెడ అధికమైనబాధ కల్గును. ఈవ్యాధి సూర్యోదయకాలమునందును, శిశిరఋతువునందును, వసంతకాలమునందును, విశేషముగ గల్గును.

కిలాటలక్షణము భావప్రకాశికయం దిత్తెరంగున జెప్పంబడియె· "పక్వం దధ్నాసమం క్షీరం విజ్ఞేయా దధికూర్చికా । తక్రేణ తక్రకూర్చా స్యాత్తయోః పిండః కిలాటకః । గురుః కిలాటోఽనిలహా పుంస్త్వనిద్రాప్రదస్స్మృతః॥" పాలను పెరుగును సమభాగముగ జేర్చి కాచినయెడ నయ్యది దధికూర్చిక యనియు, పాలను మజ్జిగను, రెంటిని సమభాగముగ జేర్చి కాచబడినది తక్రకూర్చిక యనియు, అటు కాచబడిన దధికూర్చిక తక్రకూర్చికలయందు వడగట్టినచో ముద్దగానుండునది కిలాటకమనియు, అట్టి కిలాటకము అజీర్ణకరంబును, వాతహరంబును, ఇంద్రియపుష్టికరంబునై యుండుననియు భావము.

## సన్నిపాతజశూల లక్షణము

శ్లో॥ సర్వేషు దోషేషు చ సర్వలిఙ్గం
విద్యాద్భిషక్సర్వభవం హి శూలమ్।
సుకష్టమేనం విషవజ్రకల్పం
వివర్జనీయం ప్రవదన్తి తజ్జ్ఞాః॥౧౧॥

తా॥ వాతాదిదోషత్రయములు ప్రకోపించి దోషత్రయమునకు వేర్వేరుగ జెప్పబడిన లక్షణములతోగూడిన శూలవ్యాధిని కల్గించును. ఈ సన్నిపాతజ శూలవ్యాధి విషమును వజ్రాయుధమును బోలి మిగుల క్రూరంబై యుండును. కాన చికిత్సజేయం జనదు. అసాధ్యంబని భావము.

## ఆమజశూల లక్షణము

శ్లో॥ ఆటోపహృల్లాస వమీగురుత్వ
స్తైమిత్యకానాహకఫప్రసేకైః।

కఫస్య విశేష సమానలిఙ్గం
ఆమోద్భవం శూలముదాహర న్తి॥౧౨॥

తా॥ కడుపున గుడగుడయని శబ్దము కల్గుట, ఓకలింతలు, వమనము, శరీరము భారముగ నుండుట, జడత్వము, కడుపుబ్బరము, నోట కఫము వెడలుట, ఈ లక్షణములతో గూడి కఫజనిత శూలముయొక్క లక్షణములు కల్గినది ఆమముచే జనించిన శూలవ్యాధియని యెరుంగునది.

ద్వన్ద్వజశూల లక్షణము

శ్లో॥ వస్తౌ హృత్పార్శ్వపృష్ఠేషు స శూలః కఫవాతికః।
కుక్షౌ హృన్నాభిమధ్యేషు స శూలః కఫపైత్తికః॥౧౩॥
దాహ జ్వరకరో ఘోరో విజ్ఞేయో వాతపైత్తికః।

తా॥ వస్తి, హృదయము, పార్శ్వములు, వీపు, వీనియందు జనించిన శూలము కఫవాతములచే గల్గినదియనియు; కుక్షి, హృదయము, నాభి, ఈ స్థలముల జనించిన శూలము కఫపిత్తములచే జనించినది యనియు; తాపజ్వరములతో గూడి మిగుల క్రూరంబైనది వాతపిత్తములచే జనించిన శూల వ్యాధియనియు నెరుంగనగు. మరియు "సర్వేషు దేశేషుచ సన్నిపాతాత్" అని యుండు టచే పైజెప్పిన స్థలములన్నిటియందును సన్నిపాత శూల జనించునని యెరుంగునది.

సాధ్యాసాధ్య శూలవ్యాధి లక్షణము

శ్లో॥ ఏకదోషోత్థితస్సాధ్యః కృచ్ఛ్రసాధ్యో ద్విదోషజః॥౧౪॥
సర్వదోషోత్థితో ఘోర స్త్వసాధ్యో భూర్యుపద్రవః।

తా॥ మున్నుజెప్పిన శూలవ్యాధులయందు ఒక్కదోషముచే జనించినది సాధ్యంబై యుండు ననియు, దోషద్వయ సంసర్గముచే జనించినది కృచ్ఛ్రసాధ్యంబనియు, సకలదోషములచే జనించి అనేకోపద్రవములతో గూడినది అసాధ్యంబనియు భావము. మరియు శూలోపద్రవములు గ్రన్థాన్త రమున నీరీతిగ గానంబడియెడు: "వేదనా చ తృషా మూర్ఛా ఆనాహో గౌరవారుచీ। కాసశ్శ్వాసశ్చ హిక్కా చ శూలస్యోపద్రవాస్స్మృతాః" అధికమైన వేదన, దప్పి, మూర్ఛ, కడుపుబ్బరము, గురుత్వము, అరుచి, శ్వాసకాసములు, వెక్కిళ్లు, ఇవి యన్నియు శూలవ్యాధిచే గల్గు నుపద్రవములని భావము.

పరిణామశూల సామాన్య లక్షణము

శ్లో॥ స్వైర్నిదానైః ప్రకుపితో వాయుస్సన్నిహిత స్తదా॥౧౫॥
కఫపిత్తే సమావృత్య శూలకారీ భవేద్బలీ।
భుక్తే జీర్యతి యచ్ఛూలం తదేవ పరిణామజమ్॥౧౬॥

తా॥ స్వకారణములచే ప్రకోపమునొందిన వాతము కఫపిత్తములతో గూడి బలిష్ఠంబై భుజించబడిన యన్నము జీర్ణంబగుసమయమున శూలవ్యాధిని గల్గించును. దానిని పరిణామశూలయని వచించెదరు. ఈపరిణామశూలలక్షణము గ్రన్థాన్తరమున విస్తరంబుగ గానంబడియెడు: "బలాసః ప్రచ్యుతః

స్థానాత్పిత్తేన సహ మూర్ఛితః । వాయుమాదాయ కురుతే శూలం జీర్యతి భోజనే । కుక్షౌ జఠరపార్శ్వేషు నాభౌ వస్తౌ స్తనాన్తరే । పృష్ఠమూల ప్రదేశేషు సర్వేష్వేతేషు వా పునః । భుక్తమాత్రేఽథవా వాన్తే జీర్ణేఽన్నే చ ప్రశామ్యతి । షష్టికవ్రీహిశాలీనా మోదనేన వివర్ధతే । తత్పరిణా మజం శూలం దుర్విజ్ఞేయం మహాగదమ్ । తమాహూ రసవాహానాం స్రోతసాం దుష్టిహేతుకమ్ । కేచిదన్నద్రవం ప్రాహురన్యే తత్పక్తిదోషతః । పక్తిశూలం వదన్త్యేకే కేచిదన్నవిదాహజమ్॥'' కఫము స్వస్థానమునుండి చలించి పిత్తముతోగూడి వృద్ధినొంది వాతయుక్తంబై భుజించినపదార్థము జీర్ణించుసమయమునందు కుక్షి, జఠరము, పార్శ్వములు, నాభి, వస్తి, స్తనమధ్యప్రదేశము, పృష్ఠమూలము, ఈ స్థలములయందు శూలవ్యాధిని కల్గించును. భోజనోత్తరక్షణమునందును, భుజింపబడినయన్నమును వాన్తిచేసినను, జీర్ణంబైనను, అట్టి శూలము శాన్తినొందును. మరియు నీశూలము అరువదినాళ్ల సంబావువియ్యపు అన్నమును భుజించిన యెడ మిక్కిలి వృద్ధినొందును. దీనిని పరిణామశూలంబను గొప్పవ్యాధి యని వచించెదరు. ఈశూల వ్యాధి రసవహంబులైన స్రోతస్సులు దుష్టంబులగుటచే జనించునని కొందరును, భుజించబడిన అన్నము పచనంబునొందక దుష్టంబగుటచే జనించునని కొందరును, అన్నము పక్వముగాకపోవుటచే జనించునని కొందరును వచించెదరని యర్థము.

### వాతజనిత పరిణామశూల లక్షణము

శ్లో॥ తస్య లక్షణమప్యేతత్సమాసేనాభిధీయతే।
ఆధ్మానాటోపవిణ్మూత్రవిబన్ధారతివేపనైః॥౧౭॥
స్నిగ్ధోష్ణోపశమప్రాయం వాతికం తద్వదేద్భిషక్।

తా॥ అట్టిపరిణామశూలలక్షణము వాతాదిభేదములచే జెప్పంబడుచున్నది. అందు కడుపుబ్బరము, కడుపులో శబ్దముబుట్టుట, మలమూత్రబంధము, పనులయం దిచ్ఛలేకపోవుట, కంపము, స్నిగ్ధపదార్థములచేతను ఉష్ణపదార్థములచేతను తరుచుగ శాన్తినొందుట, ఇట్టి లక్షణములు కల్గినది వాతముచే జనించిన పరిణామశూలంబని యెరుంగునది.

### పిత్తజపరిణామశూల లక్షణము

శ్లో॥ తృష్ణాదాహారతిస్వేదం కట్వమ్లలవణోత్తరమ్॥౧౮॥
శూలం శీతశమప్రాయం పైత్తికం లక్షయేద్బుధః।

తా॥ దప్పి, తాపము, అరతి, చెమట, కటు ఆమ్ల లవణరసముల సేవించుటచే మిగుల వృద్ధినొందుట, శీతపదార్థములచే శాన్తినొందుట, ఈ లక్షణములు కల పరిణామశూల పిత్తముచే జనించినదియని యెరుంగునది.

### కఫజపరిణామశూల లక్షణము

శ్లో॥ ఛర్దిహృల్లాససమ్మోహం స్వల్పరుగ్దీర్ఘసన్తతి॥౧౯॥
కటుతిక్తోపశాన్తం చ తచ్చ జ్ఞేయం కఫాత్మకమ్।

తా॥ వాన్తి, ఓకలింతలు, మూర్ఛ, స్వల్పముగనొప్పి, చిరకాలమునుండి యనుసరించియుండుట, కటుతిక్తరసములచే శాన్తినొందుట, ఈ లక్షణములుకల్గినది కఫముచే జనించిన పరిణామశూలయని యెరుంగునది.

ద్విదోషజపరిణామశూల లక్షణము

శ్లో॥ సంసృష్టలక్షణం బుద్ధ్వా ద్విదోషం పరికల్పయేత్ ॥౨౧॥
త్రిదోషజమసాధ్యం తు క్షీణమాంసబలానలమ్।

తా॥ దోషద్వయలక్షణములు కలిసి యుండుటచే ద్విదోషజనిత పరిణామశూలంబనియు, దోషత్రయలక్షణములు కల్గినది త్రిదోషజమనియు నెరుంగునది. అందు త్రిదోషజపరిణామశూలయు, మాంసము, బలము, అగ్ని, ఇవి నశించియున్నను అసాధ్యంబని యర్థము.

అన్నద్రవశూల లక్షణము

శ్లో॥ జీర్ణే జీర్యత్యజీర్ణే వా యచ్ఛూలముపజాయతే ॥౨౨॥
పథ్యాపథ్యప్రయోగేణ భోజనాభోజనేన చ।
న శమం యాతి నియమాత్సోఽన్నద్రవ ఉదాహృతః ॥౨౩॥

* * అన్నద్రవాఖ్యశూలేషు న తావత్స్వాస్థ్యమశ్నుతే।
వాన్తమాత్రే జరత్పిత్తం శూలన్తాశు వ్యపోహతి * *

ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
శూలపరిణామశూలాన్నద్రవశూల
నిదానం సమాప్తమ్

తా॥ భుజించబడిన యాహారము జీర్ణంబైనపుడును, జీర్ణించుచుండు సమయమునను, జీర్ణముగాకుండునప్పుడును జనించినశూలము పథ్యకరంబులైన ద్రవ్యముల నుపయోగించినను, పథ్యంబులుగాని ద్రవ్యముల నుపయోగించినను, భోజనముచేసినను, భోజనముజేయకున్నను, శాన్తినొందక యెల్లప్పుడు బాధించుచున్నయెడ అది అన్నద్రవముచే జనించిన శూలవ్యాధియని యెరుంగునది. అట్టి అన్నద్రవముచే జనించిన శూలవ్యాధియందు మనుజుండు స్వస్థత నొందజాలడు. వాన్తి జేసినయెడ పిత్తము జీర్ణించి శూలమును శీఘ్రముగ తత్కాలమున శమింపజేయును.

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత ఆగరం పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్ర
విరాజమాన దీక్షన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేద మార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపిక యను
మాధవనిదానాన్ధ్ర తాత్పర్యమునందు
శూలపరిణామశూలాన్నద్రవశూలనిదానము
సమాప్తము

శ్రీ హయగ్రీవాయ నమః
శ్రీరస్తు

# ఉదావర్తానాహనిదానమ్

ఉదావర్తవ్యాధియందుగూడ శూల జనించును గాన శూలవ్యాధినిదానానన్తరము ఉదావర్తనిదానమును జెప్పుట.

శ్లో॥ వాతవిణ్మూత్ర జృమ్భాశ్రుక్షవోద్గారవమీన్ద్రియః।
క్షుత్తృష్ణోచ్ఛ్వాస నిద్రాణాం ధృత్యోదావర్త సమ్భవః॥౧॥

తా॥ వాతము, మలము, మూత్రములు, ఆవలింతలు, కన్నీళ్లు, తుమ్ములు, త్రేనుపులు, వమనము, శుక్రము, ఆకలి, దప్పి, శ్వాసము, నిద్ర, వీనినన్నింటిని నిరోధించుటచేత ఉదావర్తంబను వ్యాధి జనించును. మరియు "సర్వేష్వేతేషు విధివదుదావర్తేషు కృత్స్నశః। వాయోః క్రియా విధాతవ్యా స్వమార్గప్రతిపత్తయే" అని యున్న సుశ్రుతవాక్యముచేత ఉదావర్తము లన్నిటియందును వాతము ముఖ్యముగ నుండును గాన వాతమును శమింపజేయు చికిత్సలం జేయవలెనని యెరుంగునది. "వాయోరూర్ధ్వమావర్తః—ఉదావర్తః" అను వ్యుత్పత్తిచేత వాతం బూర్ధ్వముగ సంచరించునది ఉదావర్తవ్యాధియని యర్థము. మరియు సుశ్రుతమునందు "త్రయోదశవిధశ్చాసౌ భిన్న ఏతైస్తు కారణైః" అని యున్నది గాన పైజెప్పినరీతిగ వాతనిరోధము మున్నగు పదిమూడు కారణములచేత పదిమూడు విధములుగ నుదావర్తవ్యాధి జనించునని యెరుంగునది.

## వాతనిరోధజోదావర్త లక్షణము

శ్లో॥ వాతమూత్రపురీషాణాం సఙ్గో ధ్మానం క్లమో రుజా।
జఠరే వాతజాశ్చాన్యే రోగాస్స్యుర్వాతనిగ్రహాత్॥౨॥

తా॥ వాతమూత్రపురీషములయొక్క బంధము, కడుపుబ్బరము, బడలిక, నొప్పి, జఠరమునందు వాతజనితంబులైన పోటు శూల మొదలగు రోగములు కల్గుట, ఈ లక్షణములన్నియు వాతమును నిరోధించుటచే జనించిన ఉదావర్తవ్యాధియందు కల్గును.

## పురీషనిరోధముచే గల్గిన ఉదావర్తలక్షణము

శ్లో॥ ఆటోపశూలౌ పరికర్తికా చ సఙ్గః పురీషస్య తథోర్ధ్వవాతః।
పురీషమాస్యాదథవా నిరేతి పురీషవేగేఽభిహతే నరస్య॥౩॥

**తా॥ పురీషముయొక్క వేగమును నిరోధించుటచే గల్గిన ఉదావర్తవ్యాధియందు ఆటోపము, శూల, కడుపులో కోతగా నుండుట, మలబంధము, ఊర్ధ్వశ్వాసము, నోట పురీషము బైలువెడలుట, ఈ లక్షణములు కల్గును.**

మూత్రనిరోధముచే జనించిన ఉదావర్తలక్షణము

శ్లో॥ వస్తిమేహనయోశ్శూలం మూత్రకృచ్ఛ్రం శిరోరుజా।
వినామో వంక్షణానాహస్స్యాల్లిఙ్గం మూత్రనిగ్రహే॥౪॥

తా॥ వస్తియందును మేఢ్రమునందును శూల, మూత్రకృచ్ఛ్రము, తలనొప్పి, శరీరము వంగియుండుట, గజ్జలయందు పట్టుకొనినవిధముగ బాధగల్గుట, ఈ లక్షణములు మూత్రమును నిరోధించుటచే గల్గిన ఉదావర్తవ్యాధియందు జనించును.

జృంభానిరోధములచే గల్గు ఉదావర్తలక్షణములు

శ్లో॥ మన్యాగలస్తమ్భశిరోవికారా
జృమ్భోపఘాతాత్పవనాత్మకాస్స్యుః
తథాక్షినాసావదనామయాశ్చ
భవన్తి తీవ్రాస్సహ కర్ణరోగైః॥౫॥
ఆనన్దజం వాప్యథ శోకజం వా
నేత్రోదకం ప్రాప్తమముఞ్చతో హి।
శిరోగురుత్వం నయనామయాశ్చ
భవన్తి తీవ్రాస్సహ పీనసేన॥౬॥

తా॥ ఆవలింతను నిరోధించుటచే గల్గిన ఉదావర్తవ్యాధియందు పెడతలనరంబును కంఠంబును స్తంభించియుండుట, వాతాత్మకంబులగు శిరోరోగములు కల్గుట, అక్షిరోగములు, నాసికారోగములు, ముఖరోగములు, తీవ్రంబులగు కర్ణరోగములు, ఇవి జనించును. సంతోషముచేనైనను దుఃఖముచేనైనను జనించిన కన్నీళ్లను నిరోధించుటచే గల్గిన ఉదావర్తమునందు శిరోభారంబును, నేత్రరోగంబులును, పీనసవ్యాధియు జనించును.

క్షుతనిరోధముచే గల్గిన ఉదావర్తలక్షణము

శ్లో॥ మన్యాస్తమ్భశ్శిరశ్శూలం అర్దితార్ధావభేదకౌ।
ఇన్ద్రియాణాఞ్చ దౌర్బల్యం క్షవథోస్స్యాద్విధారణాత్॥౭॥

తా॥ తుమ్ములను నిరోధించుటచే జనించిన ఉదావర్తమునందు పెడతలనరము స్తంభించియుండుట, తలనొప్పి, అర్దితవాతంబును అర్ధావభేదకవాతంబును కల్గుట, చక్షురాదీన్ద్రియములు బలహీనములై యుండుట, ఈ లక్షణములు కల్గును.

## ఉద్గారనిరోధజనిత ఉదావర్త లక్షణము

శ్లో॥ కణ్ఠాస్యపూర్ణత్వ మతీవతోదః
కూజశ్చ వాయోరథవాఽప్రవృత్తిః।
ఉద్గారవేగేఽభిహతే భవన్తి
ఘోరా వికారాః పవనప్రసూతాః॥౮॥

తా॥ కంఠంబును ముఖంబును నిండియుండుట, అధికమైన పోటు, కడుపులో ధ్వనిబుట్టుట, శ్వాసవాతము వెడలకుండుట, క్రూరంబులైన వాతవ్యాధులు జనించుట, ఇవియన్నియు త్రేనుపు యొక్క వేగమును నిరోధించుటచే గల్గిన ఉదావర్తమునందు జనించును.

## ఛర్దినిగ్రహజోదావర్త లక్షణము

శ్లో॥ కణ్డూకోఠాఽరుచివ్యఙ్గ శోథపాణ్డ్వామయజ్వరాః।
కుష్ఠవీసర్పహృల్లాసాశ్ఛర్దినిగ్రహజా గదాః॥౯॥

తా॥ వమనమును నిరోధించుటచే గల్గిన ఉదావర్తనమునందు శరీరమున దురద, దద్దులు, అరుచి, వ్యంగము (మంగు), వాపు, పాండువు, జ్వరము, కుష్ఠము, విసర్పము, హృల్లాసము, ఇవియన్నియు గల్గును.

## శుక్రనిగ్రహజనిత ఉదావర్త లక్షణము

శ్లో॥ మూత్రాశయే వై గుదముష్కయోశ్చ
శోథో రుజా మూత్రవినిగ్రహశ్చ।
శుక్రాశ్మరీ తత్స్రవణం భవేచ్చ
తే తే వికారాః విహతే చ శుక్రే॥౧౦॥

తా॥ సంభోగకాలమున శుక్రమును వెడలనియ్యక చిరకాలమువరకు నిరోధించినయెడ శుక్రజోదావర్తము కల్గును. ఆ వ్యాధియందు మూత్రాశయము, గుదము, వృషణములు, వీనియందు వాపు, నొప్పి, మూత్రబంధము శుక్రాశ్మరీవ్యాధి, కారణములేకనే శుక్రస్రావము, ఈ వ్యాధులు జనించును.

## క్షుత్తృష్ణానిరోధములచే గల్గిన ఉదావర్త లక్షణము

శ్లో॥ తన్ద్రాఙ్గమర్దావరుచిశ్శ్రమశ్చ
క్షుధాభిఘాతాత్కృశతా చ దృష్టేః।
కణ్ఠాస్యశోషశ్శ్రవణావరోధ
స్తృష్ణాభిఘాతాద్ధృదయే వ్యథా చ॥౧౧॥

తా॥ ఆకలిని నిరోధించుటచేగల్గిన ఉదావర్తమునందు కునికిపాటు, ఒడలినొప్పులు, అరోచకము, బడలిక, దృష్టినాశము, ఈ వ్యాధులు కల్గును. దప్పిని నిరోధించుటచే గల్గిన ఉదావర్తము

నందు కంఠంబును నోరును యెండుట, చెవులు వినబడకుండుట, రొమ్మునందు నొప్పి, ఈలక్షణములు కల్గును.

### శ్వాసమును నిద్రను నిరోధించుటచే గల్గిన ఉదావర్త లక్షణములు

శ్లో॥ శ్రాన్తస్య నిశ్శ్వాసవినిగ్రహేణ
హృద్రోగమోహావథవాపి గుల్మః।
జృమ్భాఙ్గమర్దోఽక్షిశిరోఽతిజాడ్యం
నిద్రాభిఘాతాదథవాపి తన్ద్రా॥౧౨॥

తా॥ వ్యాయామాదులచే శ్రమనొందినశ్వాసమును నిరోధించుటచేగల్గిన ఉదావర్తమునందు హృదయరోగము, మూర్ఛ, గుల్మవ్యాధి, ఇవి జనించును. నిద్రను నిరోధించుటచేగల్గిన ఉదావర్తమునందు ఆవలింతలు, ఒడలివిరుపులు, కన్నులును శిరస్సును మిగుల బరువుగా నుండుట, కునికిపాటు, ఇవి కల్గుట.

### రూక్షాది కుపితవాతోదావర్త లక్షణము

శ్లో॥ వాయుః కోష్ఠానుగో రూక్షైః కషాయకటుతిక్తకైః।
భోజనైః కుపితస్సద్య ఉదావర్తం కరోతి చ॥౧౩॥
వాతమూత్రపురీషాసృక్కఫమేదోవహాని వై।
స్రోతాంస్యుదావర్తయతి పురీషం చాతివర్తయేత్॥౧౪॥
తతో హృద్వస్తిశూలార్తో హృల్లాసారతిపీడితః।
వాతమూత్రపురీషాణి కృచ్ఛ్రేణ లభతే నరః॥౧౫॥
శ్వాసకాసప్రతిశ్యాయదాహమోహతృషాజ్వరాన్।
వమిహిక్కాశిరోరోగమనశ్శ్రవణవిభ్రమాన్॥౧౬॥
బహూనన్యాంశ్చ లభతే వికారాన్వాతకోపజాన్।

తా॥ రూక్షంబులగు పదార్థములను భుజించుటచేతను, కషాయ కటు తిక్త రసములుగల పదార్థములను భుజించుటచేతను కోష్ఠగతంబైన వాతము ప్రకోపమునొంది వాతమూత్రపురీషరక్త కఫమేదస్సులను వహించు స్రోతస్సుల నడ్డగించి పురీషమును శోషింపంజేయును; దానంజేసి మను జుండు హృదయమునందును వస్తియందును శూల, హృల్లాసము, పనులయం దుత్సాహము లేకుం డుట, వాతమూత్ర పురీషములను మిక్కిలి కష్టముచే వెడలించుట, శ్వాసకాసములు, పడిశము, తాపము, మూర్ఛ, దప్పి, జ్వరము, వాంతి, వెక్కిళ్లు, శిరోరోగములు, మనోవిభ్రమము, కర్ణ విభ్రమము, ఇవి మున్నుగాగల నానావిధ వాతరోగములచే పీడింపబడును. ఇచ్చట కొందరు సుశ్రుతమున జెప్పిన అసాధ్యలక్షణముల నీరీతిగ పఠించెదరు: "తృష్ణార్దితం పరిక్లిష్టం క్షీణం శూలైరుపద్రుతమ్। శకృద్వమన్తం మతిమాన్ ఉదావర్తినముత్సృజేత్" అధికమైన దప్పి, క్లేశము, కృశత్వము, శూల, నోట పురీషము వాంతియగుట, ఈ యుపద్రవములు

ఉదావర్త వ్యాధియందు జనించినయెడ అసాధ్యంబగును గాన అట్టిరోగిని చికిత్స చేయం దగదని భావము.

## ఆనాహలక్షణము

శ్లో॥ ఆమం శకృద్వా నిచితం క్రమేణ
భూయో విబద్ధం విగుణానిలేన।
ప్రవర్తమానం న యథాస్వమేనం
వికారమానాహ ముదాహరంతి॥౧౭॥

తా॥ ఆమంబైనను లేక మలంబైనను నానాట బైలువెడలక నిలచి దుష్టవాతముచే శోషింపబడి మలద్వారమునుండి బైలువెడలకున్నయెడ ఆనాహంబను వాతవ్యాధి యని యెరుంగునది.

## ఆమజన్యంబైన ఆనాహ లక్షణము

శ్లో॥ తస్మిన్భవన్త్యామసముద్భవే తు
తృష్ణాప్రతిశ్యాయశిరోవిదాహాః।
ఆమాశయే శూలమథో గురుత్వం
హృత్స్తమ్భ ఉద్గారవిఘాతనం చ॥౧౮॥
స్తమ్భః కటీపృష్ఠపురీషమూత్రే
శూలోఽథ మూర్ఛా శకృతశ్చ ఛర్దిః।
శోథశ్చ పక్వాశయజే భవన్తి
తథాఽలసోక్తాని చ లక్షణాని॥౧౯॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
ఉదావర్తానాహనిదానం సమాప్తమ్



తా॥ అట్టి యానాహరోగము ఆమాశయమున జనించినయెడ దప్పి, పీనసము, శిరస్సున తాపము, ఆమాశయమున శూల, గురుత్వము, హృదయమున పట్టియుండుట, త్రేనుపులు బైలువెడలక హృదయముననే అణగి యుండుట, కటిప్రదేశమునందును వీపునందును పట్టుకొని యుండుట, మూత్రపురీషములు వెడలకుండుట, శూల, మూర్ఛ, మలముతోగూడి వాంతియగుట,

ఈ లక్షణములు కల్గును. పక్వాశయమునందు వ్యాధి జనించినప్పుడు శోఫయు, అలసకవ్యాధియందు జెప్పబడిన ఆధ్మాన వాతనిరోధాది లక్షణంబులును కల్గును.

---

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చ
రణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్ర
విరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపికయను
మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు
ఉదావర్తానాహనిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# గుల్మనిదానమ్

గుల్మవ్యాధియందు ఆనాహము జనించునుగాన ఆనాహనిదానమును వచించినపిదప గుల్మనిదానము చెప్పబడుచున్నది.

శ్లో॥ దుష్టా వాతాదయోఽత్యర్థం మిథ్యాహారవిహారతః।
కుర్వన్తి పఞ్చధా గుల్మం కోష్ఠాన్తర్గ్రన్థిరూపిణమ్॥౧॥
తస్య పఞ్చవిధం స్థానం పార్శ్వహృన్నాభివస్తయః।

తా॥ ఆపథ్యంబులైన యాహారవిహారములచే వాతపిత్తకఫరక్తములు దుష్టంబులై కోష్ఠమునందు గ్రన్థిరూపంబైన గుల్మమును గల్గించును. అట్టి గుల్మవ్యాధి వాత పిత్త కఫ సన్నిపాత రక్తములచే జనించుటంజేసి యైదువిధంబులగును. మరియు నీ వ్యాధికి ఇరుప్రక్కలును, హృదయంబును, నాభియు, వస్తియు, ఈ యైదును స్థానంబులై యుండును.

## గుల్మవ్యాధి స్వరూపము

శ్లో॥ హృన్నాభ్యోరన్తరే గ్రన్థిస్సంచారీ యది వాఽచలః॥౨॥
వృత్త * శ్చయాపచయవాన్ స గుల్మ ఇతి కీర్తితః।

తా॥ హృదయమునకును నాభికిని మధ్యభాగమునందు వర్తులాకారంబై యొకప్పుడు చలించుచు నొకప్పుడు నిశ్చలంబుగ నుండి వృద్ధిక్షయముల నొందుచుండు గ్రన్థి గుల్మంబని చెప్పంబడును.

## గుల్మవ్యాధి సామాన్య లక్షణము

శ్లో॥ స వ్యస్తైర్జాయతే దోషైస్సమస్తైరపి చోచ్ఛ్రితైః॥3॥
పురుషాణాం తథా స్త్రీణాం జ్ఞేయో రక్తేన చాపరః।

తా॥ పై వచింపబడిన గుల్మము వాతపిత్తశ్లేష్మములచే వేర్వేరుగను, దోషత్రయసన్నిపాతముచేతను పురుషులకు జనించును. స్త్రీలకు ఆర్తవరక్తముచేత గూడ జనించును. ఇచ్చట చరకమునందు "సంసృష్టలిఙ్గానపరాంశ్చ గుల్మాం స్త్రీనాదిశేదౌషధకల్పనార్థం" అని

* "చయోపచయవాన్" అను పాఠాన్తరమునందు దోషములు చేరియుండుటచే వృద్ధినొందినదియని భావము.

యుండుటచేత "వ్యస్తైః" అనుపదముచేత దోషద్వయ సంసర్గజనిత గుల్మ భేదముల మూడిటిని గ్రహించవలెను. మరియు "స్త్రీణామార్తవజో గుల్మో న పుంసాముపజాయతే। అన్యస్త్వస్రగ్భవో గుల్మః స్త్రీణాం పుంసాంచ జాయతే" అని తన్త్రాన్తరమునం దుండుటంజేసి ఆర్తవరక్తముచే స్త్రీలకు గుల్మము జనించుననియు, ధాతురూపంబైన రక్తముచేత స్త్రీపురుషులకు సామాన్యముగ గుల్మము జనించుననియు నెరుంగునది. ఇచ్చట వాతాదిదోషములచే జనించిన గుల్మము పైజెప్పినరీతిగ హృదయాదిస్థానములయందు జనించుననియు, ఋతురక్తముచే జనించు గుల్మము గర్భాశయమున జనించుననియు స్థానభేదము నెరుంగునది.

## గుల్మవ్యాధి పూర్వరూపములు

శ్లో॥ ఉద్గారబాహుల్య పురీషబన్ధ
తృప్త్యక్షమత్వాన్త్రవికూజనాని।
ఆటోపమాధ్మాన మపక్తిశక్తి
రాసన్నగుల్మస్య వదన్తి చిహ్నమ్॥౪॥

తా॥ ఓకిలింతలు అధికముగా వచ్చుట, మలబంధము, కడుపు నిండినట్లుండి యన్నమునం దిచ్ఛ లేకుండుట, కష్టమున కోరువలేకుండుట, ప్రేవు లరచుట, కడుపునందు నొప్పితోగూడి యారాటము గల్గుట, కడుపుబ్బరము, జీర్ణశక్తిలేక జఠరాగ్ని మందగించి యుండుట, ఈ లక్షణములు గుల్మవ్యాధి జనించుటకుమున్ను గల్గు పూర్వరూపములని యెరుంగునది.

## గుల్మసామాన్యరూపము

శ్లో॥ అరుచిః కృచ్ఛ్రవిణ్మూత్రవాతతాన్త్రవికూజనమ్।
ఆనాహశ్చోర్ధ్వవాతత్వం సర్వగుల్మేషు లక్షయేత్॥౫॥

తా॥ అరోచకము, మలమూత్రవాతములు మిగుల కష్టముచే వెడలుట, ప్రేవులరచుట, కడుపుబ్బరము, ఊర్ధ్వశ్వాసము కల్గుట, ఈ లక్షణములు గుల్మవ్యాధు లన్నిటియందును సామాన్యముగ జనించును.

## వాతజగుల్మ లక్షణము

శ్లో॥ రూక్షాన్నపానం విషమాతిమాత్రం
విచేష్టనం వేగవినిగ్రహశ్చ।
శోకోఽభిఘాతోఽతిమలక్షయశ్చ
నిరన్నతా చానిలగుల్మహేతుః॥౬॥
యః స్థాన సంస్థాన రుజావికల్పం
విడ్వాతసఙ్గం గలవక్త్రశోషమ్।
శ్యావారుణత్వం శిశిరజ్వరంచ

హృత్కుక్షి పార్శ్వాంసశిరోరుజం చ॥ ౭॥
కరోతి జీర్ణేత్వధికం ప్రకోపం
భుక్తేమృదుత్వం సముపైతి యశ్చ।
వాతాత్మగుల్మో న చ తత్ర రూక్షం
కషాయతిక్తం కటు చోపశేతే॥ ౮॥

తా॥ రూక్షంబులైన యన్నపానముల సేవించుట, న్యూనాధికముగ భుజించుట, బలవంతులతో యుద్ధము మొదలగు విరుద్ధచేష్టలజేయుట, మలమూత్రవాతములయొక్క వేగమును నిరోధించుట, దుఃఖము, అభిఘాతము, విరేచనాదులచే మలము మిక్కిలి నశించుట, అన్నమును భుజించకుండుట, ఇట్టి కారణములచేత వాతగుల్మము జనించును. మరియు వ్యవస్థలేక ఒకప్పుడు నాభియందును, ఒకప్పుడు ఇరుప్రక్కలయందును, ఒకప్పుడు వస్తియందును సంచరించుట, ఒకప్పుడు చిన్నదిగను, ఒకప్పుడు గొప్పదిగను, ఒకప్పుడు నిడుదగను, ఒకప్పుడు వర్తులముగను రూపనియమములేక యుండుట, ఒకప్పుడు అధికమైన వేదనయు, మరియొకప్పుడు స్వల్పమైనవేదనయు కల్గియుండుట, మలంబును అపానవాతంబును బంధంపబడియుండుట, కంఠంబును ముఖంబును ఎండుట, శరీరము నల్లగనైనను అరుణవర్ణముగనైన నుండుట, చలిజ్వరము గల్గుట, హృదయమునందును, కుక్షియందును, పార్శ్వములయందును, భుజశిరస్సులయందును, శిరమునందును నొప్పిగల్గుట, అన్నము జీర్ణంబైనపుడు మిక్కిలి ప్రకోపమునొందుట, అన్నమును భుజించునపుడు మృదుత్వమునొందుట, ఈ లక్షణములు కల్గినది వాతముచే జనించిన గుల్మవ్యాధియని యెరుంగునది. ఈ వ్యాధియందు రూక్షపదార్థములను కషాయ తిక్త కటురసములుగల పదార్థములను సేవింపందగదు.

## పిత్తజనితగుల్మ లక్షణము

శ్లో॥ కట్వమ్లతీక్ష్ణోష్ణ విదాహిరూక్ష
క్రోధాతిమద్యార్క హుతాశసేవా।
ఆమాభిఘాతో రుధిరం చ దుష్టం
పైత్తస్య గుల్మస్య నిమిత్తముక్తమ్॥ ౯॥
జ్వరః పిపాసా వదనాఙ్గరాగః
శూలం మహజ్జీర్యతి భోజనే చ।
స్వేదో విదాహో వ్రణవచ్చగుల్మ
స్స్పర్శాసహః పైత్తికగుల్మరూపమ్॥ ౧౦॥

తా॥ కటురసంబును అమ్లరసంబునుగల పదార్థములను భుజించుట, తీక్ష్ణంబును, ఉష్ణంబును, విదాహంబును, రూక్షంబును, ఈ గుణములుగల పదార్థములను భుజించుట, మద్యమును అధికముగ సేవించుట, ఎండయందును నిప్పుసెగయందును విశేషముగ సంచరించుట, విదగ్ధాజీర్ణముచేత జనించిన దుష్టరసముచే వ్యాపించియుండుట, రక్తము దుష్టంబగుట, ఈ కారణములచేత పిత్తగుల్మము జనించును. అట్టి పిత్తగుల్మమునందు జ్వరము, దప్పి, ముఖంబును శరీరంబును రక్తవర్ణంబుగానుం

దుట, అన్నమును భుజించునపుడును, జీర్ణంబగునపుడును అధికముగ శూలకల్గుట, చెమటబట్టుట, మిక్కిలి సంతాపముగల్గుట, వ్రణమువలె స్పర్శము నోరువలేకుండుట, ఈలక్షణములు కల్గును.

కఫజనితగుల్మ లక్షణము

శ్లో॥ శీతం గురు స్నిగ్ధమచేష్టనం చ
సంపూరణం ప్రస్వపనం దివా చ।
గుల్మస్య హేతుః కఫసంభవస్య
సర్వస్తు దిష్టో నిచయాత్మకస్య॥౧౧॥
స్తైమిత్య శీతజ్వరగాత్ర సాద
హృల్లాస కాసారుచి గౌరవాణి।
శైత్యం రుగల్పా కఠినోన్నతత్వం
గుల్మస్య రూపాణి కఫాత్మకస్య॥౧౨॥

తా॥ శీతలపదార్థములను అజీర్ణపదార్థములను జిడ్డుగల పదార్థములను భుజించుట, నిర్వ్యాపారముగ నుండుట, మిక్కుటముగ భుజించుట, పవటియందు నిదురించుట, ఈకారణములచేత కఫగుల్మము జనించును. పూర్వోక్త వాతాది గుల్మకారణములన్నిటిచేత సన్నిపాతగుల్మము జనించును. ఈకఫగుల్మమునందు శరీరము మొద్దుబారియుండుట, చలిజ్వరము, శరీరము కృశత నొందుట, హృల్లాసము, దగ్గు, అరుచి, గురుత్వము, శీతలత్వము, బాధ కొంచెముగ నుండుట, కఠినంబై మిక్కిలి యున్నతముగ నుండుట, ఈలక్షణములు కల్గును.

ద్విదోషజ గుల్మలక్షణము

శ్లో॥ నిమిత్తరూపాణ్యుపలభ్య గుల్మే
ద్విదోషజే దోషబలాబలం చ।
వ్యామిశ్రలిఙ్గానపరాంశ్చ గుల్మాం
స్త్రీనాదిశేదౌషధకల్పనార్థమ్॥౧౩॥

తా॥ వాతాది గుల్మములకు వేర్వేరుగ జెప్పిన కారణములలో రెండేసి దోషములయొక్క కారణములచే జనించి అట్టి దోషద్వయలక్షణములు కల్గియున్నగూడ అట్టి దోషములయొక్క బలాబలముల ననుసరించి ద్విదోషజ గుల్మములు వాతపిత్త వాతశ్లేష్మ పిత్తశ్లేష్మములచే మూడువిధములుగ జనించునని తెలియందగినది. ఇచ్చట నీభేదములు చికిత్సాభేదముల నెరుంగుటకై జెప్పబడినవి.

సన్నిపాతజనితగుల్మ లక్షణము

శ్లో॥ మహారుజం దాహపరీత మశ్మవ
ద్ఘనోన్నతం శీఘ్రవిదాహి దారుణమ్।

మనశ్శరీరాగ్ని బలాపహారిణం
త్రిదోషజం గుల్మమసాధ్యమాదిశేత్ ॥౧౮॥

తా॥ మిక్కిలి యధికమైన బాధ, తాపము, రాయివలె గట్టిగ నున్నతమై యుండుట, శీఘ్రముగ తాపముగల్గియుండుట, మిగుల దారుణముగ నుండుట, మనస్సు, శరీరము, జఠరాగ్ని, వీనియొక్క బలమును నశింపజేయుట, ఈలక్షణములుగల గుల్మము సన్నిపాతముచే జనించినది యని యెరుంగునది. ఈవ్యాధి మిగుల నసాధ్యంబై యుండును. ఇచ్చట "సన్నిపాతోత్థితే గుల్మే త్రిదోషఘ్నో విధిర్హితః" అను సుశ్రుతవాక్యముచేత సన్నిపాతముచే జనించు గుల్మవ్యాధికి త్రిదోషహరంబైన చికిత్సను జెప్పినది నూతనముగ జనించిన గుల్మము సాధ్యముగాన సన్నిపాతముచే నూతనముగ జనించిన గుల్మవ్యాధ నుద్దేశించి చెప్పినది యని యెరుంగునది.

రక్తగుల్మ లక్షణము

శ్లో॥ నవప్రసూతాఽహిత భోజనా యా
యాచామగర్భం విసృజేదృతౌ వా।
వాయుర్హి తస్యాః పరిగృహ్య రక్తం
కరోతి గుల్మం సరుజం సదాహమ్॥౧౫॥

పైత్తస్య లిఙ్గేన సమానలిఙ్గం
విశేషణం చాప్యపరం నిబోధ।
యస్స్పన్దతే పిణ్డిత ఏవ నాఙ్గై
శ్చిరాత్సశూలస్సమగర్భలిఙ్గః।
సరౌధిరస్త్రీభవ ఏవ గుల్మో
మాసే వ్యతీతే దశమే చికిత్స్యః॥౧౬॥

తా॥ ప్రథమగర్భ ప్రసవకాలమునందును, పరిపూర్ణముకాని గర్భము స్రవించినప్పుడును, ఋతుమతియై యున్న సమయమునందును అపథ్యంబులైన యాహారాదులజేసినయెడ వాతము ప్రకుపితంబై రక్తమును నిరోధించి నొప్పిమంటలతోగూడి పిత్తజగుల్మలక్షణములకు సమంబులగు చిహ్నములుగల రక్తగుల్మవ్యాధిని కల్గించును. మరియు నీ రక్తగుల్మము ఋతురక్తము వెడల కుండుట, నోట నీరు వెడలుట, స్తనాగ్రములు నల్లనై యుండుట, ఇవి మొదలగు గర్భచిహ్నములతోగూడి గర్భమునందు కరచరణాద్యవయవములు చలించుకరణి చలించక పిండాకారంబై శూలతోగూడి చిరకాలమునకు చలించుచుండును. అట్టి రక్తగుల్మము స్త్రీలకే జనించును. ఈ గుల్మవ్యాధి జనించిన పదినెలలకు పిమ్మట చికిత్సజేయందగునని యర్థము.

ఈ చెప్పిన లక్షణములచేతనే రక్తగుల్మము స్త్రీలకే జనించునని స్పష్టముగ దెలియుచున్నను "స్త్రీభవ ఏవ" అని చెప్పుటచేత యౌవనవతులగు స్త్రీలకే జనించునుగాని ఋతు

శోణితము జనించకుండు కన్యకాజనంబునకును, ఋతుశోణితము నశించిన వృద్ధస్త్రీలకును ఈ వ్యాధి గలుగదని భావము. మరియు నిచ్చట "రక్తగుల్మే పురాణత్వం సుఖసాధ్యస్య లక్షణమ్" అని తన్త్రాన్తరమున జెప్పినరీతిగ రక్తగుల్మము చిరకాలము గడచినపిదప సుఖసాధ్యంబుగాన పదిమాసములు గడచినపిదప చికిత్సజేయవలెనని చెప్పబడినదియని యెరుంగునది. కొందరు రక్తగుల్మము గర్భలక్షణములతో గూడియుండుటచే రక్తగుల్మంబనియు లేక గర్భంబనియు నిశ్చయజ్ఞానము జనించదుగాన ప్రసవమునకు నియతకాలంబైన పదినెలలు గడచినపిదప వ్యాధినిశ్చయమును దెలిసి చికిత్సజేయ నుచితంబని కారణమును వచించెదరు. చరకమునందు "తం స్త్రీ ప్రసూతే సుచిరేణ గర్భం పుష్టో యదా వర్షగణైరపిస్యాత్" అని చెప్పియుండుటచేత పదినెలలు గడచినపిమ్మట ననేకసంవత్సరములవరకు ప్రసవకాలము నియతిలేకున్నదిగాన పూర్వోక్తసంశయము పదిమాసములకు పిమ్మటగూడ ననుసరించి యుండును గనుక వ్యాధినిర్ణయమునకై కాలనియతి చెప్పబడినది యని వచించినది సయుక్తికముగాదని యెరుంగునది. మరియు గర్భము హస్తపాదాద్యవయవవిక్షేపముచే శూలలేక చలించుననియు, రక్తగుల్మము పిండాకారంబై శూలతోగూడి యొకానొకప్పుడు చలించుననియు గర్భమునకును గుల్మమునకును పరస్పరభేదముల నెరుంగునది. రక్తగుల్మమునందు పదిమాసములకు మునుపు చికిత్సజేసినచో నకాలమున రక్తము గర్భాశయమున జేరియుండుటంజేసి గర్భాశయమునకు నపాయము గల్గుననియు, పదునొకండవ మాసమున నట్టి రక్తము ఘనీభవించి యుండునుగాన నప్పుడు స్నేహనాదిచికిత్సల జేసినయెడ గర్భాశయమునకు హాని కల్గదనియు తలచి "మాసే వ్యతీతే దశమే చికిత్స్యః" అని కాలనియమము జేయబడినదియని యెరుంగునది.

## అసాధ్యగుల్మ లక్షణము

శ్లో॥ సఞ్చితః క్రమశో గుల్మో మహావాస్తుపరిగ్రహః।
కృతమూలస్సిరానద్ధో యదా కూర్మ ఇవోత్థితః॥౧౭॥
దౌర్బల్యారుచిహృల్లాసకాసచ్ఛర్ద్యరతిజ్వరైః।
తృష్ణాతన్ద్రాప్రతిశ్యాయైర్యుజ్యతే న స సిధ్యతి॥౧౮॥
గృహీత్వా సజ్వరం శ్వాసచ్ఛర్ద్యతీసారపీడితమ్।
హృన్నాభిహస్తపాదేషు శోథః కర్షతి గుల్మినమ్॥౧౯॥
శ్వాసశ్శూలం పిపాసాఽన్నవిద్వేషో గ్రన్థిమూఢతా।
జాయతే దుర్బలత్వం చ గుల్మినో మరణాయ వై॥౨౦॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
గుల్మనిదానం సమాప్తమ్

తా॥ గుల్మము నానాట వృద్ధినొంది యుదరమునం దంతట వ్యాపించి యంతర్ధాతువుల ప్రవేశించి సిరలచే కట్టంబడి తాబేటివీపువలె నున్నతంబై దుర్బలత్వము, అరోచకము, హృల్లాసము, దగ్గు, వాంతి, పనులయం దిచ్ఛలేకుండుట, జ్వరము, డప్పి, కునికిపాటు, పీనసము, ఈ లక్షణములతో గూడియున్నను; జ్వరము, శ్వాసము, వాంతి, అతిసారము, ఈ లక్షణములుగల్గినను; హృదయము, నాభి, హస్తములు, పాదములు, ఈ స్థలములయందు శోఫ జనించినను, శ్వాసము, శూలము, డప్పి, అన్నద్వేషము, ఒకప్పుడు గుల్మరూపమైన గ్రన్థి కానంబడకుండుట, బలహీనము, ఈ లక్షణములు కల్గినను; అట్టి గుల్మము మరణమునొందించును. మరియు సుశ్రుతమునందు "గుల్మస్తిష్ఠతి దోషే స్వే విద్రధిర్మాంసశోణితే । విద్రధిః పచ్యతే తస్మాద్గుల్మః క్వాపి న పచ్యతే" అని యుండుటంచేసి గుల్మము స్వోత్పత్తికారణంబులైన వాతాదిదోషముల నాశ్రయించియుండుటచే పరిపక్వముగాదనియు, అన్తర్విద్రధి మాంసరక్తముల నాశ్రయించి యుండునుగాన పరిపక్వంబగుననియు గుల్మవిద్రధులకు పరస్పరభేదముల నెఱుంగునది.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్ర
విరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపికయను
మాధవనిదానార్థతాత్పర్యము
నందు గుల్మనిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# హృద్రోగనిదానమ్

గుల్మమునకు హృదయము స్థానము గాన గుల్మనిదానానంతరము తదాశ్రయమైన హృదయమునకు సంబంధించిన హృద్రోగముయొక్క నిదానమును జెప్పుట.

శ్లో॥ అత్యుష్ణగుర్వన్నకషాయతిక్త
శ్రమాభిఘాతాధ్యశనప్రసఙ్గైః।
సఞ్చిన్తనైర్వేగవిధారణైశ్చ
హృదామయః పఞ్చవిధః ప్రదిష్టః॥౧॥

తా॥ మిగుల నుష్ణంబైన యన్నమును, అజీర్ణకరంబైన యన్నమును, కషాయతిక్తరసములుగలపదార్థములను విశేషముగ సేవించుట, దేహశ్రమము, అభిఘాతము, అధికముగ భుజించుట, ఎల్లప్పుడును మనస్సున యోచనచేయుట, మలమూత్రవాతములయొక్క వేగమును నిరోధించుట, ఈ కారణములచేత నైదువిధములైన హృద్రోగము జనించును.

## హృద్రోగ సంప్రాప్తి

శ్లో॥ దూషయిత్వా రసం దోషా విగుణా హృదయం గతాః।
హృది బాధాం ప్రకుర్వన్తి హృద్రోగం తం ప్రచక్షతే॥౨॥

తా॥ పై జెప్పబడిన కారణములచే ప్రకోపమునొందిన వాతపిత్తశ్లేష్మములు అన్నరసమును దుష్టముగజేసి హృదయస్థానమునొంది యచ్చోట నానావిధంబులైన బాధల గల్గించును. దానిని హృద్రోగమని భిషగ్వరులు వచించెదరు.

## వాతజహృద్రోగ లక్షణము

శ్లో॥ ఆయమ్యతే మారుతజే హృదయం తుద్యతే తథా।
నిర్మథ్యతే దీర్యతే చ స్ఫోట్యతే పాట్యతేఽపి చ॥3॥

తా॥ హృదయము నీడ్చినట్లుండుట, సూదుల బొడిచినట్లుండుట, కవ్వముతో చిలికినట్లుండుట, చీల్చినట్లుండుట, రంపముతో కోసినట్లుండుట, గొడ్డలిచే పగులదీసినట్లుండుట, ఈ లక్షణములుకల్గినది వాతముచే జనించిన హృద్రోగంబని యెరుంగునది.

### పిత్తజహృద్రోగ లక్షణము

శ్లో॥ తృష్ణోష్మదాహచోషాస్స్యుః పైత్తికే హృదయక్లమః।
ధూమాయనం చ మూర్ఛా చ స్వేదశ్శోషో ముఖస్య చ॥౪॥

తా॥ దప్పి, వేడిగనుండుట, మంట, ఎండిపోవుట, హృదయము వ్యాకులమైయుండుట, పొగ వెడలునట్లుండుట, మూర్ఛ, చెమట, నోరెండుట, ఈలక్షణములు కల్గినది పిత్తముచే జనించిన హృద్రోగమని యెరుంగునది.

### కఫజహృద్రోగ లక్షణము

శ్లో॥ గౌరవం కఫసంస్రావోఽరుచిస్తమ్భోఽగ్నిమార్దవమ్।
మాధుర్యమపి చాస్యస్య బలాసాఽవతతే హృది॥౫॥

తా॥ రొమ్ము బరువుగా నుండుట, నోట కఫము వెడలుట, అరోచకము, శరీరము స్తంభించియుండుట, అగ్నిమాంద్యము, నోరు తీపుగల్గి యుండుట, ఈలక్షణములు కల్గినది కఫముచే కల్గిన హృద్రోగమని యెరుంగునది.

### త్రిదోషజ క్రిమిజ హృద్రోగ లక్షణములు

శ్లో॥ విద్యాత్త్రిదోషం త్వపి సర్వలిఙ్గం
తీవ్రార్తితోదం క్రిమిజం సకణ్డూమ్।
ఉత్క్లేదష్ఠీవనం తోదశూలంహృల్లాసకస్తమః।
అరుచిశ్శ్యావనేత్రత్వం శోథశ్చ క్రిమిజే భవేత్॥౬॥

తా॥ వాతాదిత్రిదోషజనితహృద్రోగములకు వేర్వేరుగ జెప్పియుండు లక్షణములన్నియు కల్గినది సన్నిపాతముచే జనించిన హృద్రోగంబని యెరుంగునది. మరియు తీవ్రమైననొప్పి, పోటు, నోట నీరు వెడలుట, ఉమియుట, హృల్లాసము, మూర్ఛ, ఈలక్షణములుగూడ సన్నిపాతముచే జనించిన హృద్రోగమునందు కల్గును. అరోచకము, కన్నులు నల్లగనుండుట వాపు, పోటు, నొప్పి ఈ లక్షణములు కల్గినది క్రిములచే జనించిన హృద్రోగమని యెరుంగునది.

మరియు "త్రిదోషజే తు హృద్రోగే యో దురాత్మా నిషేవతే। తిలక్షీర గుడాదీని గ్రన్థిస్తస్యోపజాయతే। మర్మైకదేశే సంక్లేదం రసశ్చాస్యోపగచ్ఛతి। సంక్లేదాత్క్రిమయశ్చాస్య భవన్త్యుపహతాత్మనః॥" అని చరకమునందు జెప్పబడియున్నది. సన్నిపాతముచే జనించిన హృద్రోగమునందు మనుజుండు నువ్వులు, పాలు, బెల్లము మున్నగు పదార్థములను సేవించినచో హృదయమర్మమునం దొకస్థలమున రసముజేరి గ్రంథిజనించును. అట్టి గ్రంథియందు క్రిములు జనించును. అట్టి క్రిములు జనించునప్పుడు బాధావిశేషములు కల్గినచో నయ్యది క్రిమిజహృద్రోగంబని భావము. ఈవాక్యముచేత సన్నిపాతముచే జనించిన హృద్రోగమునందు అపథ్యాహారము జేయుటచే క్రిములు జనించి హృద్రోగము జనించినచో నయ్యది క్రిమిజహృద్రోగమని తెలియబడుచున్నది.

హృద్రోగోపద్రవములు

శ్లో॥ క్లమస్సాదో భ్రమశ్శోషో జ్ఞేయాస్తేషాముపద్రవాః।
క్రిమిజే క్రిమిజాతీనాం శ్లైష్మికాణాం చ యే మతాః॥౭॥

ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
హృద్రోగ నిదానం సమాప్తమ్



తా॥ బడలిక, కృశత్వము, భ్రమము, శోష, ఇవి హృద్రోగసామాన్యమున జనించు నుపద్రవములు. క్రిమిజనితహృద్రోగమునందు శ్లేష్మముచే గల్గిన క్రిమివ్యాధియందు జనించు నుపద్రవములు కూడ కల్గునని భావము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానార్థతాత్పర్యము
నందు హృద్రోగ నిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# మూత్రకృచ్ఛ్రనిదానమ్



శరీరముననుండు నూటయేడుమర్మములలో శిరస్సు, హృదయము, వస్తి, ఈ మూడుమర్మంబులును ముఖ్యములు గాన అందు హృదయమర్మగతహృద్రోగముయొక్క నిదానమును వచించిన పిదప వస్తిమర్మగతమూత్రకృచ్ఛ్రముయొక్క నిదానము చెప్పబడుచున్నది.



శ్లో॥ వ్యాయామతీక్ష్ణౌషధరూక్షమద్య
ప్రసఙ్గనిత్యద్రుతపృష్ఠయానాత్।
ఆనూపమాంసాధ్యశనాదజీర్ణా
త్స్యుర్మూత్రకృచ్ఛ్రాణి నృణాం తథాష్టౌ ॥౧॥

తా॥ దేహపరిశ్రమముజేయుట, తీక్ష్ణంబులైన ఔషధములను రూక్షమైన మద్యమును మిక్కుటముగ సేవించుట, అశ్వాదివాహనములపైనెక్కి యెల్లప్పుడు సంచరించుట, ఉదకసమీపమున సంచరించు పశ్వాదులయొక్క మాంసమును భుజించుట, అధికముగ భోజనముజేయుట, అజీర్ణకరపదార్థముల భుజించుట, ఈ కారణములచే మూత్రకృచ్ఛ్రవ్యాధి జనించును. మరియు నీవ్యాధి వాత పిత్త శ్లేష్మ సన్నిపాతములచే జనించుటంజేసి నాల్గువిధంబులును, శల్యజ పురీషజ శుక్రజ అశ్మరీజ భేదములచే నాల్గువిధంబులునై అన్నియుగలిసి యెనిమిది విధంబులగునని భావము.

## మూత్రకృచ్ఛ్ర సంప్రాప్తి

శ్లో॥ పృథఙ్మలాస్స్వైః కుపితా నిదానై
స్సర్వేఽథవా కోపముపేత్య వస్తౌ।
మూత్రస్య మార్గం పరిపీడయన్తి
యదా తదా మూత్రయతీహ కృచ్ఛ్రాత్ ॥౨॥

తా॥ వాతాదిదోషములు వేర్వేరుగనైనను అన్నియుగలిసియైనను తమతమకారణములచే ప్రకోపమునొంది వస్తి (మూత్రపు తిత్తి) నాశ్రయించి మూత్రమార్గమున భాధకల్గించినయెడ మూత్రము మిక్కిలి కష్టముచే బైలువెడలును. ఆవ్యాధి మూత్రకృచ్ఛ్రంబని వ్యవహరించబడును.

## వాతాదిజనిత మూత్రకృచ్ఛ్ర లక్షణములు

శ్లో॥ తీవ్రార్తి రుగ్వఙ్క్షణవస్తిమేఢ్రే
స్వల్పం ముహుర్మూత్రయతీహ వాతాత్।
పీతం సరక్తం సరుజం సదాహం
కృచ్ఛ్రం ముహుర్మూత్రయతీహ పిత్తాత్॥3॥
వస్తేస్సలిఙ్గస్య గురుత్వశోథౌ
మూత్రం సపిచ్ఛం కఫమూత్ర కృచ్ఛ్రే।
సర్వాణి రూపాణి తు సన్నిపాతా
ద్భవన్తి తత్కృచ్ఛ్రతమం హి కృచ్ఛ్రమ్॥౪॥

తా॥ లింగమూలమందును మూత్రాశయమునందును మేఢ్రమునందును మిగుల తీక్ష్ణంబైన వేదన, మిగుల కష్టముచే కొంచెముగ మాటిమాటికి మూత్రమును విడుచుట, ఈ లక్షణములు కల్గినది వాతముచే జనించిన మూత్రకృచ్ఛ్రంబని యెరుంగునది. మరియు పిత్తముచే జనించిన మూత్రకృచ్ఛ్రమునందు రక్తము, నొప్పి, మంట, [illegible]గూడి పసపురంగుకల మూత్రమును మిగుల కష్టముచే మాటిమాటికి విడుచును. శ్లేష్మజనిత మూత్రకృచ్ఛ్రమునందు వస్తియందును మేఢ్రమునందును గురుత్వంబును వాపునుగల్గి మిగుల చిక్కనైన మూత్రము వెడలును. సన్నిపాతముచే గల్గిన మూత్రకృచ్ఛ్రమునందు వాతాదిదోషములకు చెప్పంబడియుండు లక్షణములన్నియు కల్గును. మరియు నీ సన్నిపాతజ మూత్రకృచ్ఛ్రము మిగుల కష్టసాధ్యంబై యుండును.

## శల్యజ మూత్రకృచ్ఛ్ర లక్షణము

శ్లో॥ మూత్రవాహిషు శల్యేన క్షతేష్వభిహతేషు వా।
మూత్రకృచ్ఛ్రం తదాఘాతాజ్జాయతే భృశదారుణమ్॥౫॥
వాతకృచ్ఛ్రేణ తుల్యాని తస్య లిఙ్గాని నిర్దిశేత్।

తా॥ మూత్రమును వహించు స్రోతస్సులయందు ముల్లు మొదలగు శల్యములచే గాయము కల్గినను, అభిఘాతముకల్గినను మూత్రమును నిరోధించుటచే మిగుల కష్టంబైన మూత్ర కృచ్ఛ్రము కల్గును. ఈ మూత్రకృచ్ఛ్రమునందు వాతముచే జనించు మూత్రకృచ్ఛ్రముయొక్క లక్షణములు కల్గును. ఇది శల్యజ మూత్రకృచ్ఛ్రమని చెప్పంబడును.

## పురీషజ మూత్రకృచ్ఛ్ర లక్షణము

శ్లో॥ శకృతస్తు ప్రతీఘాతాత్ వాయుర్విగుణతాం గతః॥౬॥
ఆధ్మానం వాతశూలం చ మూత్రసంగం కరోతి చ।

తా॥ మలమును నిరోధించుటచే వాతము ప్రకుపితంబై కడుపుబ్బరమును వాతశూలను కల్గించి మూత్రకృచ్ఛ్రమును కల్గించును. దీనిని పురీషజ మూత్రకృచ్ఛ్రమని వచించెదరు.

## అశ్మరీజ మూత్రకృచ్ఛ్ర లక్షణము

శ్లో॥ అశ్మరీహేతు తత్పూర్వం మూత్రకృచ్ఛ్రముదాహరేత్ ॥౭॥

తా॥ అశ్మరీవ్యాధిచే జనించిన మూత్రకృచ్ఛ్రము అశ్మరీ మూత్రకృచ్ఛ్రంబని యెరుంగునది. ఈ వ్యాధియందు మూత్రమున జనించు అశ్మరి యను రాయి ముందువెడలి వెంటనే మూత్రము వెడలును.

## శుక్రజ మూత్రకృచ్ఛ్ర లక్షణము

శ్లో॥ శుక్రే దోషైరుపహతే మూత్రమార్గే విధావితే।
సశుక్రం మూత్రయేత్కృచ్ఛ్రాద్వస్తిమేహనశూలవాన్ ॥౮॥

తా॥ శుక్రము వాతాది దోషములచే దుష్టంబై మూత్రమార్గమునొందునపుడు శుక్రముతో గూడిన మూత్రము మిగుల కష్టముచే వెడలును. అట్టి సమయమున వస్తియందును మేఢ్రమునందును మిగుల వేదన జనించును. దీనిని శుక్రముచే జనించిన మూత్రకృచ్ఛ్రమని వచించెదరు.

## అశ్మరీశర్కరల పరస్పరభేదము

శ్లో॥ అశ్మరీ శర్కరాచైవ తుల్యసమ్భవలక్షణే।
విశేషణం శర్కరాయాశ్శృణు కీర్తయతో మమ ॥౯॥
పచ్యమానాశ్మరీ పిత్తాచ్ఛోష్యమాణాచ వాయునా।
విముక్తకఫసన్ధానా క్షరన్తీ శర్కరా మతా॥౧౦॥
హృత్పీడా వేపథుశ్శూలం కుక్షావగ్నిశ్చ దుర్బలః।
తయా భవతి మూర్ఛా చ మూత్రకృచ్ఛ్రం చ దారుణమ్॥౧౧॥
మూత్రవేగనిరస్తాభిః ప్రశమం యాతి వేదనా।
యావదస్యాః పునర్నైతి గుడికా స్రోతసో ముఖమ్॥౧౨॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
మూత్రకృచ్ఛ్రనిదానం సమాప్తమ్



తా॥ అశ్మరీవ్యాధియు శర్కరయు నీ రెండును సమానంబులైన ఉత్పత్తియు చిహ్నములును గల్గియుండును. అయినను పిత్తముచేత అశ్మరి పచింపబడి వాతముచే శుష్కించి కఫముతో సంబంధములేక స్రవించునది శర్కరయనందగునని భావము. అట్టి శర్కరచేత రొమ్మునొప్పి, వణకు, కడుపునొప్పి, అగ్నిమాంద్యము, మూర్ఛ, మూత్రకృచ్ఛ్రము, ఈ లక్షణములు కల్గును. అట్టి శర్క-

రలు మూత్రముయొక్క వేగములచే బైలువెడలినయెడ మరల శర్కర మూత్రద్వారము నడ్డగించు వంతవరకు వేదన శమించియుండును.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యన్న్వాము రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి," "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు
మూత్రకృచ్ఛ్ర నిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# మూత్రాఘాతనిదానమ్

(౦)

మూత్రాఘాతము మూత్రకృచ్ఛ్రమువలెనే మూత్రమునకు సంబంధించిన వ్యాధి గాన మూత్రకృచ్ఛ్రనిదానానన్తరము మూత్రాఘాతనిదానమును జెప్పుట.

శ్లో॥ జాయన్తే కుపితైర్దోషైర్మూత్రాఘాతాస్త్రయోదశ।
ప్రాయోమూత్ర విఘాతాద్యైర్వాత కుణ్డలికాదయః॥౧॥

తా॥ మూత్ర పురీష శుక్రాదులయొక్క వేగమును నిరోధించుటచే వాతాదిదోషములు ప్రకుపితంబులై కుండలిక మున్నగాగల పదిమూడు మూత్రాఘాతములను కల్గించునని భావము. ఇచ్చట మూత్రకృచ్ఛ్రమునందు మూత్రబంధము కొంచముగనుండి బాధ యధికముగా నుండునని యు, మూత్రాఘాతమున బాధ స్వల్పముగానుండి మూత్రబంధము విశేషముగ నుండునని యు మూత్రకృచ్ఛ్ర మూత్రాఘాతములకు పరస్పరభేదముల నెరుంగునది.

## వాతకుండలికా లక్షణము

శ్లో॥ రౌక్ష్యాద్వేగవిఘాతాద్వా వాయుర్వస్తౌ సవేదనః।
మూత్రమావిశ్య చరతి విగుణః కుణ్డలీకృతః॥౨॥
మూత్రమల్పాల్పమథవా సరుజం సంప్రవర్తతే।
వాతకుణ్డలికాం తాన్తు వ్యాధిం విద్యాత్సుదారుణమ్॥౩॥

తా॥ మిగుల రూక్షంబులగు పదార్థముల సేవించుటచేనైనను, మలమూత్ర శుక్రముల యొక్క వేగమును నిరోధించుటచేనైనను, వస్తియందుండు వాతము ప్రకోపించి వేదనతోగూడి మూత్రమున ప్రవేశించి సుడిగాలివలె మూత్రకోశమున మండలాకారంబై దిరుగుచుండును. దానం జేసి మూత్రము మిగుల స్వల్పముగ బాధతోగూడి బైలువెడలును. దీనిని వాతకుండలికయను మూత్రాఘాతవ్యాధి యనందగును.

## అష్ఠీలా లక్షణము

శ్లో॥ ఆధ్మాపయన్వస్తిగుదం రుద్ధ్వా వాయుశ్చలోన్నతామ్।
కుర్యాత్తీవ్రార్తిమష్ఠీలాం మూత్రవిణ్మార్గరోధినీమ్॥౪॥

తా॥ వాతము వస్తిని పూరించి గుదము నడ్డగించి చంచలంబును ఉన్నతంబునై తీవ్రంబైన వేదనతోఁగూడి మలమూత్రమార్గముల నిరోధించు అష్ఠీలను కల్గించును. దీనిని అష్ఠీల యను మూత్రాఘాతమని వచించెదరు. అష్ఠీల యనగ రాయివలె కఠినంబైన యాకారవిశేషంబని యెరుంగునది.

## వాతవస్తి లక్షణము

శ్లో॥ వేగం విధారయేద్యస్తు మూత్రస్యాకుశలో నరః।
నిరుణద్ధి ముఖం తస్య వస్తేర్వస్తిగతోఽనిలః॥౫॥
మూత్రసఙ్గో భవేత్తేన వస్తికుక్షినిపీడితః।
వాతవస్తిస్స విజ్ఞేయో వ్యాధిః కృచ్ఛ్రప్రసాధనః॥౬॥

తా॥ మూత్రముయొక్క వేగమును నిరోధించు మనుజునియొక్క వస్తిముఖమును వస్తిగతంబైన వాతము ప్రకోపించి యడ్డగించును. దానంజేసి మూత్రము బైలువెడలక వస్తియందును కుక్షియందును బాధను గల్గించును. దీనిని వాతవస్తి యని వచింతురు. ఈ వ్యాధి మిగుల కష్టసాధ్యంబై యుండును.

## మూత్రాతీత లక్షణము

శ్లో॥ చిరం ధారయతో మూత్రం త్వరయా న ప్రవర్తతే।
మేహమానస్య మన్దం వా మూత్రాతీతస్స ఉచ్యతే॥౭॥

తా॥ మూత్రమును చిరకాలమువరకు విసర్జించక నిరోధించు మనుజునకు మూత్రము శీఘ్రముగ వెడలక మెల్లమెల్లగ వెడలును. దీనిని మూత్రాతీతంబని వచించెదరు.

## మూత్రజఠర లక్షణము

శ్లో॥ మూత్రస్య వేగేఽభిహతే తదుదావర్తహేతుకః।
అపానః కుపితో వాయురుదరం పూరయేద్భృశమ్॥౮॥
నాభేరధస్తాదాధ్మానం జనయేత్తీవ్రవేదనమ్।
తన్మూత్రజఠరం విద్యాదధోవస్తినిరోధనమ్॥౯॥

తా॥ మూత్రవేగమును నిరోధించినయెడ దాన జనించిన యుదావర్తముచే నపానవాతము ప్రకుపితంబై యుదరమును నిండించి నాభికిక్రింద నధికముగా నుబ్బరమును, మిక్కిలి తీవ్రంబైన వేదనను కల్గించును. దీనిని వస్తికధోభాగము నడ్డగించు మూత్రజఠరంబని వచించెదరు.

## మూత్రోత్సఙ్గ లక్షణము

శ్లో॥ వస్తౌ వాఽప్యథవా నాలే మణౌ వా యస్య దేహినః।
మూత్రం ప్రవృత్తం సజ్జేత సరక్తం వా ప్రవాహతః॥౧౦॥

ప్రవేచ్ఛనైరల్పమల్పం సరుజం వాఽథ నీరుజమ్।
విగుణానిలజో వ్యాధిః స మూత్రోత్సఙ్గసంజ్ఞితః॥౧౧॥

తా॥ మనుజునకు మూత్రము బైలువెడలక వస్తియందైనను మూత్రనాళమునందైనను మేఢ్రాగ్రముననుండు మణియందైనను నిలచి యుండును; లేక బలాత్కారముగ ముక్కినయెడ శస్త్ర్యాదులయందభిఘాతముచేగల్గిన రక్తముతోగూడి కొంచముకొంచముగ బైలువెడలి స్రవించును; దీనిని వాతప్రకోపముచే జనించిన మూత్రోత్సఙ్గవ్యాధి యని వచించెదరు.

## మూత్రక్షయ లక్షణము

శ్లో॥ రూక్షస్య క్లాన్తదేహస్య వస్తిస్థౌ పిత్తమారుతౌ।
మూత్రక్షయం సరుగ్దాహం జనయేతాం తదాహ్వయమ్॥౧౨॥

తా॥ మిగులరూక్షుండై కృశతనొందిన దేహముకల మనుజునకు వాతపిత్తములు రెండును ప్రకోపమునొంది నొప్పిని మంటను కలుగజేసి మూత్రమును నశింపజేయును. దీనిని మూత్రక్షయం బని వచించెదరు.

## మూత్రగ్రన్థి లక్షణము

శ్లో॥ అన్తర్వస్తిముఖే వృత్తస్స్థిరోఽల్పస్సహసా భవేత్।
అశ్మరీతుల్యరుగ్గ్రన్థిర్మూత్రగ్రన్థిస్స ఉచ్యతే॥౧౩॥

తా॥ వస్తిముఖముయొక్క లోప్రక్కయందు వర్తులాకారంబును, కఠినంబును, మిక్కిలి సూక్ష్మాకారంబును, అశ్మరికి సమానమైన వేదనతో కూడినదియునైన గ్రన్థిజనించును. దీనిని మూత్ర గ్రన్థియని వచించెదరు. మరియు "రక్తం వాతకఫాద్దుష్టం వస్తిద్వారే సుదారుణమ్। గ్రన్థిం కుర్యాత్సకృచ్ఛ్రేణ సృజేన్మూత్రం తదావృతమ్। అశ్మరీసమమూలం తం రక్తగ్రన్థిం ప్రచక్షతే" అని తన్త్రాన్తరమున గానంబడియెడు. వాతముతోగూడిన కఫముచే రక్తము దుష్టంబై వస్తియొక్క ద్వారమునందు మిగుల క్రూరంబైన గ్రంథిని కల్గించును. దానంజేసి మూత్రము రక్తముతోగూడి మిక్కిలి కష్టముచే వెడలును. ఇయ్యది అశ్మరీతుల్యమైన రక్తగ్రన్థియని చెప్పఁబడునని భావము. ఈప్రమాణముచేత మూత్రగ్రంథియందు రక్తముమాత్రము ఘనీభవించు ననియు, అశ్మరీవ్యాధియందు పిత్తాదులు ఘనీభవించి యుండుననియు నీరెంటికిని పరస్పరభేదముల నెరుంగునది.

## మూత్రశుక్ర లక్షణము

శ్లో॥ మూత్రితస్య స్త్రియం యాతో వాయునా శుక్రముద్ధతమ్।
స్థానాచ్చ్యుతం మూత్రయతః ప్రాక్పశ్చాద్వా ప్రవర్తతే॥౧౪॥
భస్మోదకప్రతీకాశం మూత్రశుక్రం తదుచ్యతే।

తా॥ మూత్రమువెడలుట కుద్యమించినపుడు మూత్రమును విసర్జించక స్త్రీసంభోగముజేసిన యెడ శుక్రము వాతముచే స్వస్థానమునుండి చలింపబడి యూర్ధ్వముగ ప్రసరించి మూత్రమువెడ

లుటకు ముందుగనైనను వెనుకనైనను బూడిదెకలిసిన నీళ్లవలె స్రవించును. దీనిని మూత్రశుక్రమని వ్యవహరించెదరు.

## ఉష్ణవాత లక్షణము

శ్లో॥ వ్యాయామాధ్వాతపైః పిత్తం వస్తిం ప్రాప్యానిలాన్వితమ్॥౧౫॥
వస్తిం మేఢ్రం గుదం చైవ ప్రదహేత్స్రావయేదధః।
మూత్రం హారిద్రమథవా సరక్తం రక్తమేవ వా॥౧౬॥
కృచ్ఛ్రాత్పునః పునర్జంతో రుష్ణవాతం బ్రువన్తి తమ్।

తా॥ మిక్కుటముగ దేహపరిశ్రమముజేయుట, త్రోవనడచుట, ఎండలో సంచరించుట, ఈకారణములచే పిత్తము ప్రకుపితంబై వస్తియందుజేరి వాతముతోగూడి వస్తిమేఢ్రగుదములయందు మంటబుట్టించి పసపురంగుగల మూత్రమునైనను, రక్తవర్ణంబైన మూత్రమునైనను, లేక రక్తమునైనను మిగుల కష్టముచే మాటిమాటికి వెడలించును. దీనిని ఉష్ణవాతంబని వచించెదరు.

## మూత్రసాద లక్షణము

శ్లో॥ పిత్తం కఫో ద్వావపి వా సంహన్యేతేఽనిలేన చేత్॥౧౭॥
కృచ్ఛ్రాన్మూత్రం తదా పీతం శ్వేతం రక్తం ఘనం సృజేత్।
సదాహం రోచనాశంఖచూర్ణవర్ణం భవేత్తు తత్॥౧౮॥
శుష్కం సమస్తవర్ణం వా మూత్రసాదం వదన్తి తమ్।

తా॥ పిత్తకఫములు వేర్వేరుగనైనను రెండుకలిసియైనను వాతముచే ఘనీభావము నొందినయెడ పీతవర్ణంబైనను, శ్వేతవర్ణంబైనను, రక్తవర్ణంబైనను కల్గి చిక్కనైయుండు మూత్రము మిగుల కష్టముచే మంటతోగూడి వెడలును. అట్టి మూత్రము పుడమిపై బడి యెండినపుడు గోరోచనముయొక్క రంగుకల్గియైనను, శంఖముయొక్క చూర్ణమువంటి రంగుకల్గియైనను, నానావర్ణములు కల్గియైన నుండును. దీనిని మూత్రసాదంబని యెరుంగునది.

## విడ్విఘాత లక్షణము

శ్లో॥ రూక్షదుర్బలయోర్వాతేనోదావర్తం శకృద్యదా॥౧౯॥
మూత్రస్రోతోఽనుపద్యేత విట్సంసృష్టం తదా నరః।
విడ్గన్ధం మూత్రయేత్కృచ్ఛ్రాద్విడ్విఘాతం వినిర్దిశేత్॥౨౦॥

తా॥ అధికమైన రూక్షత్వము, బలము నశించియుండుట, ఈలక్షణములుగల మనుజులకు వాతముచేత మలము ఊర్ధ్వముగ వ్యాపించి మూత్రమార్గమున జేరినయెడ అట్టి మలముతోగూడి మలమువలె దుర్గంధంబైన మూత్రము మిక్కిలి కష్టముచే స్రవించును. దీనిని విడ్విఘాతంబని వచించెదరు.

## వస్తికుండలికా లక్షణము

శ్లో॥ ద్రుతాధ్వలఙ్ఘనాయాసైరభి ఘాతాత్ప్రపీడనాత్॥
స్వస్థానాద్వస్తి రుద్వృత్తః స్థూల స్తిష్ఠతి గర్భవత్॥౨౧॥
శూలస్పన్దనదాహార్తో బిన్దుం బిన్దుం స్రవత్యపి।
పీడితస్తు సృజేద్ధారాం సంస్తమ్భోద్వేష్టనార్తిమాన్॥౨౨॥
వస్తికుణ్డలమాహుస్తం ఘోరం శస్త్రవిషోపమమ్।
పవనప్రబలం ప్రాయో దుర్నివారమబుద్ధిభిః॥౨౩॥
తస్మిన్పిత్తాన్వితే దాహశ్శూలం మూత్రవివర్ణతా।
శ్లేష్మణా గౌరవం శోథః స్నిగ్ధం మూత్రం ఘనం సితమ్॥౨౪॥

తా॥ అతివేగముగ త్రోవనడచుట, దాటుట, ఆయాసము జెందుట, అభిఘాతమునొందుట, పిసికికొనుట, ఈకారణములచేత మూత్రాశయము స్వస్థానమునుండి యూర్ధ్వముగ వ్యాపించి గర్భమువలె స్థూలమై యుండును; దానంజేసి మూత్రము పోటు, నొప్పి, కంపము, మంట, ఈ బాధలతోగూడి యొక్కొక్కబొట్టుగ స్రవించును. అట్టి సమయమున వస్తిని చేతితో పిసికినయెడ మూత్రము ధారగ స్రవించును. మరియు వస్తియందు పట్టుకొని యుండుట, వస్తి పొరలునట్లుండుట, ఈలక్షణములు కల్గును. దీనిని వస్తికుండలిక యని వచించెదరు. ఈవ్యాధి శస్త్రమును విషమును బోలి మిగుల క్రూరంబై యుండును. అందు వాతము ప్రబలముగా నున్నయెడ మందమతులగు వైద్యులకు అనివార్యముగా నుండును. పిత్తముతో గూడియున్నయెడ మంట, పోటు, మూత్రము వివర్ణమైయుండుట, ఈ లక్షణములు కల్గును. కఫముతో గూడినపుడు గురుత్వము, వాపు, మూత్రము జిడ్డు గల్గి చిక్కనై తెల్లగనుండుట, ఈ లక్షణములు కలుగును.

## సాధ్యాసాధ్య వస్తికుండలికా లక్షణము

శ్లో॥ శ్లేష్మరుద్ధబిలో వస్తిః పిత్తోదీర్ణో న సిధ్యతి।
అవిభ్రాన్తబిలస్సాధ్యో న తు యః కుణ్డలీకృతః॥౨౫॥
స్యాద్వస్తౌ కుణ్డలీభూతే తృణ్మోహశ్శ్వాస ఏవ చ॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
మూత్రాఘాత నిదానం సమాప్తమ్



తా॥ వస్తియొక్క ద్వారము శ్లేష్మముచే మూయబడి పిత్తము ప్రకోపించియున్నయెడ మూత్రాఘాతము అసాధ్యంబనియు, వస్తిద్వారము మూయబడక వస్తి కుండలాకారము నొందకున్నయెడ సాధ్యంబై యుండుననియు, వస్తి కుండలీకృతంబైనపుడు దప్పి, మూర్ఛ, శ్వాసము, ఈలక్షణములు కల్గుననియు, అయ్యది అసాధ్యంబనియు భావము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత ఆగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్ర
విరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేద మార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపిక యను
మాధవనిదానార్థ తాత్పర్యమునందు
మూత్రాఘాత నిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీరస్తు

# అశ్మరీనిదానమ్

అశ్మరీవ్యాధి మూత్రాఘాతమువలెనే మూత్రము నడ్డగించునుగాన మూత్రాఘాత నిదానమును జెప్పినపిమ్మట తత్సమానధర్మంబైన అశ్మరీనిదానమును జెప్పట.

## అశ్మరీ నిదానము

శ్లో॥ వాతపిత్తకఫైస్తిస్రశ్చతుర్థీ శుక్రజాఽపరా।
ప్రాయశ్శ్లేష్మాశ్రయాస్సర్వా అశ్మర్యస్స్యుర్యమోపమాః॥౧॥

తా॥ అశ్మరి యను వ్యాధి వాతపిత్తకఫశుక్రములచే వేర్వేరుగ జనించుటంజేసి నాల్గువిధంబులై యుండును. అందు అన్నిటియందును ప్రాయికముగ కఫము ప్రధానముగ నుండును. ఈ యశ్మరీవ్యాధి చికిత్సజేయక యుపేక్షించినచో యమునివలె ప్రాణుల హింసించును.

## అశ్మరీ సంప్రాప్తి

శ్లో॥ విశోషయేద్వస్తిగతం సశుక్రం
మూత్రం సపిత్తం పవనః కఫం వా।
యదా తదాఽశ్మర్యుపజాయతే తు
క్రమేణ పిత్తేష్వివ రోచనా గోః ॥౨॥

తా॥ వాతము ప్రకుపితంబై వస్తిగతంబైన శుక్రమును, మూత్రమును, పిత్తమును, కఫమును. క్రమముగ శోషింపంజేసినయెడ గోవునందు గోరోచనము జనించుకరణి అశ్మరి జనించును.

## అశ్మరీ పూర్వరూపములు

శ్లో॥ నైకదోషాశ్రయాస్సర్వా అథాసాం పూర్వలక్షణమ్।
వస్త్యాధ్మానం తదాసన్నదేశేషు పరితోఽతిరుక్ ॥3॥
మూత్రే బస్తసగన్ధత్వం మూత్రకృచ్ఛ్రం జ్వరోఽరుచిః।

తా॥ పైజెప్పబడిన అశ్మరీవ్యాధు లన్నియు అనేకదోషముల నాశ్రయించియుండును. మరియు వస్తి యుబ్బియుండుట, వస్తికి సమీపస్థలమునందంతట అధికముగా బాధకల్గుట, మూత్రము

నంచు గోరియలమూత్రమునందు దుర్గన్ధము జనించుకరణి దుర్గంధము కల్గుట, మూత్రకృచ్ఛ్రము, జ్వరము, అరోచకము, ఈలక్షణములన్నియు అశ్మరీవ్యాధి జనించుటకుమున్ను కల్గు పూర్వ రూపములు.

## అశ్మరీసామాన్యలక్షణము

శ్లో॥ సామాన్యలిఙ్గం రుజ్నాభిసేవనీవస్తిమూర్ధసు॥౪॥
విశీర్ణధారం మూత్రం స్యాత్తయా మార్గే నిరోధితే।
తద్వ్యపాయాత్సుఖం మేహేదచ్ఛం గోమేదకోపమమ్ ॥౫॥
తత్సంక్షోభాత్క్షతే సాస్రమాయాసాచ్చాతిరుగ్భవేత్ ॥

తా॥ నాభియందును, సేవనియందును, వస్తియొక్క అగ్రభాగమునందును శూల జనించుట, అశ్మరి మూత్రము నడ్డగించునపుడు మూత్రధార పలు తెరంగులుగ చీలికలై స్రవించుట, అశ్మరి మూత్రద్వారము నడ్డగించకుండునపుడు మూత్రము ధారగా గోమేదకమణివలె స్వచ్ఛమై వెడలుట, అశ్మరివలనం గల్గిన సంక్షోభముచే వస్తి (మూత్రపుతిత్తి) యందు గాయమై మూత్రము రక్తముతోగూడి వెడలుట, బలాత్కారముగ మూత్రమును విడుచునప్పుడు అధికముగ బాధకల్గుట, ఇవియన్నియు అశ్మరీరోగ సామాన్య లక్షణములని యెరుంగునది.

## వాతజాశ్మరీ లక్షణము

శ్లో॥ తత్ర వాతాద్భృశం చార్తో దన్తాన్ఖాదతి వేపతే॥౬॥
గృహ్ణాతి మేహనం నాభిం పీడయత్యనిశం క్వణన్।
సానిలం ముఞ్చతి శకృత్ ముహుర్మేహతి బిన్దుశః॥౭॥
శ్యావారుణాశ్మరీ చాస్య స్యాచ్చితా కణ్టకైరివ।

తా॥ మిక్కుటముగ బాధ కల్గుట, పండ్లుకొరుకుట, వణకు, బాధ కోరువలేక మేఢ్రమును చేతబట్టుకొనుట, బొడ్డున పిసికికొనుట, రేయిబవలును బాధచే నరచుచుండుట, పురీషములు అపాన వాతముతో కూడినట్లు విసర్జించుట, బొట్టుబొట్టుగ మాటిమాటికి మూత్రమును విడుచుట, అశ్మరి నీలవర్ణంబును అరుణవర్ణంబునై ముండ్లతో గూడినట్లుండుట, ఈ లక్షణములు కల్గినది వాతముచే జనించిన అశ్మరీవ్యాధియని యెరుంగునది.

## పిత్తజాశ్మరీ లక్షణము

శ్లో॥ పిత్తేన దహ్యతే వస్తిః పచ్యమాన ఇవోష్మవాన్॥౮॥
భల్లాతకాస్థిసంస్థానా రక్తపీతాऽసితాశ్మరీ।

తా॥ పొత్తికడుపున మంట, పొత్తికడుపును తాకినయెడ ఉడుకుచున్నట్లు వేడిగల్గియుండుట, అశ్మరి రక్తవర్ణంబును పీతవర్ణంబును నల్లనిరంగు గల్గినదియునై జీడిగింజలోపల నుండు విత్తువలె కఠినముగ నుండుట, ఈ లక్షణములు కల్గినది పిత్తముచే జనించిన అశ్మరీవ్యాధి యని యెరుంగునది.

## శ్లేష్మజాశ్మరీ లక్షణము

శ్లో॥ వస్తిర్నిస్తుద్యత ఇవ శ్లేష్మణా శీతలో గురుః ॥౯॥
అశ్మరీ మహతీ శ్లక్ష్ణా మధువర్ణాఽథవా సితా।

తా॥ వస్తియందు సూదులు గ్రుచ్చినట్లు పోటుగల్గి మిక్కిలి శీతలంబును గురుత్వమునుకల్గినదియునై యుండుట, అశ్మరి మిగుల గొప్పదియై నునుపుగల్గి తేనెవంటివర్ణము కల్గియుండుట, లేక తెల్లనిరంగుకల్గి యుండుట, ఈలక్షణములుకల్గినది శ్లేష్మముచే జనించిన యశ్మరి యని యెరుంగునది.

శ్లో॥ ఏతా భవన్తి బాలానాం తేషామేవ చ భూయసా॥౧౦॥
ఆశ్రయోపచయాల్పత్వాద్గ్రహణాహరణే సుఖాః।

తా॥ పై జెప్పబడిన త్రిదోషజనితాశ్మరీవ్యాధులు తరుచుగ పసివాండ్రకు కల్గును. పెద్దవారికి నొకప్పుడు కల్గును. మరియు బాలులు స్వల్పమైన శరీరము కల్గియుండురుగాన అశ్మరీవ్యాధికి ఆశ్రయంబైన వస్తిగూడ మిక్కిలి వృద్ధినొందక స్వల్పంబైయుండును. దానంజేసి యశ్మరి సుఖముగ గ్రహింపదగినదియు, విడదీయదగినదియునై యుండును. మరియు సుశ్రుతమునందు "ప్రాయేణైతా స్త్రిస్రోఽశ్మర్యో దివాస్వప్నసమశనాధ్యశనశీతస్నిగ్ధమధురాహారప్రియత్వాద్విశేషేణ బాలానాం భవన్తి, తేషామేవాల్పవస్తికాయత్వాదల్పమాంసోపచయాచ్చ వస్తేః సుఖగ్రహణాహరణా భవన్తి" అని యుండుటచేత బాలురు తరుచుగ పగటియందు నిదురించుట, సమశనము, అధ్యశనము, శీతంబులును స్నిగ్ధంబులును మధురంబులునైన యాహారములు, వీనియందును మిగుల ప్రీతిగల్గియుందురు గాన వాతపిత్తశ్లేష్మములచే జనించిన అశ్మరీవ్యాధులుమూడును బాలురకు విశేషముగ జనించుననియు, అట్టిబాలురకు శరీరంబును వస్తియు స్వల్పాకారంబై స్వల్పంబైన మాంసముతోగూడి యుండును గాన అశ్మరిని సుఖముగ విడదీయుటకు సాధ్యంబై యుండుననియు నెరుంగునది.

## శుక్రాశ్మరీ లక్షణము

శ్లో॥ శుక్రాశ్మరీ తు మహతాం జాయతే శుక్రధారణాత్ ॥౧౧॥
స్థానాచ్చ్యుతమముక్తం హి ముష్కయోరన్తరేఽనిలః।
శోషయత్యుపసఙ్గృహ్య శుక్రం తచ్ఛుక్రమశ్మరీ॥౧౨॥
వస్తిరుఙ్మూత్రకృచ్ఛ్రత్వముష్కశ్వయథుకారిణీ।
తస్యాముత్పన్నమాత్రాయాం శుక్రమేతి విలీయతే॥౧౩॥
పీడితే త్వవకాశేఽస్మిన్నశ్మర్యేవ చ శర్కరా।

తా॥ యౌవనకాలమునందు శుక్రము అభివ్యక్తమగునపుడు స్త్రీసంభోగముచేయక శుక్రమును నిరోధించుటచేత స్వస్థానమునుండి చలనమునొంది బైలువెడలక మేఢ్రవృషణములకు మధ్యభాగముననుండు వస్తిముఖమునందు వాతముచే శుష్కంబైన శుక్రము మాత్రమును అడ్డగించును.

దీనిని శుక్రాశ్మరి యని వచించెదరు. మరియు నీవ్యాధి జనించినప్పుడు వస్తియందు పోటు, మూత్రము కష్టముచే వెడలుట, వృషణములయందు వాపు, ఈ లక్షణములు కల్గును. అట్టి శుక్రాశ్మరి జనించినతోడనే వస్తిముఖమునందు చేతితో మర్దనజేసినయెడ కఠినంబుగ నుండు శుక్రము కరగిపోవును. మరియు నీ శుక్రాశ్మరియే శర్కరయని వ్యవహరించబడును.

శర్కరా లక్షణము

శ్లో॥ అణుశో వాయునా భిన్నా సా తస్మిన్ననులోమగే॥౧౪॥
నిరేతి సహ మూత్రేణ ప్రతిలోమే విబధ్యతే।
మూత్రస్రోతః ప్రవృత్తా సా సక్తా కుర్యాదుపద్రవాన్ ॥౧౫॥
దౌర్బల్యం సదనం కార్శ్యం కుక్షిశూలమరోచకమ్।
పాణ్డుత్వ ముష్ణవాతం చ తృష్ణాం హృత్పీడనం వమిమ్ ॥౧౬॥

తా॥ కఠినంబుగనుండు శుక్రాశ్మరి వాయువుచే పలుచెరంగుల ఖండములై వాతంబనులోమముగ సంచరించునపుడు మూత్రముతోగూడ వెలువెడలును. వాతము ప్రతిలోమముగ సంచరించునపుడు వెలువెడలక నిలచియుండును. ఇదియే శర్కరయనంబడును. మరియు నాశకలములు మూత్రద్వారమున జేరి వెలువెడలక నిలచియున్నప్పుడు దుర్బలత్వము, బడలిక, కృశత్వము, కడుపున శూల, అరోచకము, పాండుత్వము, ఉష్ణవాతము, దప్పి, హృద్బాధ, వాంతి, ఈ యుపద్రవములు కల్గును. ఇచ్చట పై జెప్పిన శుక్రాశ్మరియే మిక్కిలి అణుస్వరూపముగ శకలములై మూత్రముతోడ వెడలినయెడ అదియే సికత యని యెరుంగునది.

అసాధ్యశర్కరాశ్మరీ లక్షణము

శ్లో॥ ప్రశూననాభివృషణం బద్ధమూత్రం రుజాన్వితమ్।
అశ్మరీ క్షపయత్యాశు సికతాశర్కరాన్వితా ॥౧౭॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
అశ్మరీ నిదానం సమాప్తమ్

తా॥ మరియు శుక్రాశ్మరి జనించినపుడు నాభియందును వృషణములయందును వాపుగల్గుట, మూత్రము వెడలక నిలచియుండుట, అధికముగ బాధ కల్గుట, ఈ లక్షణములుగల్గి సికతాశర్కరలతో గూడి యుండెనేని మనుజుండు బ్రతుకుటలేదని భావము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత ఆగరం పుట్టస్వామిశాస్త్రిచర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దీక్ష్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానాన్ధ్ర తాత్పర్యము
నందు అశ్మరీ నిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

---

# ప్రమేహనిదానమ్



ప్రమేహము అశ్మరివలెనే వస్తియందు జనించు వ్యాధి గాన అశ్మరీనిదానమును జెప్పినపిదప ప్రమేహనిదానమును జెప్పుట.

——(౦)——

శ్లో॥ ఆస్యాసుఖం స్వప్నసుఖం దధీని
గ్రామ్యౌదకానూపరసాః పయాంసి।
నవాన్నపానం గుడవైకృతం చ
ప్రమేహహేతుః కఫకృచ్చ సర్వమ్॥౧॥

తా॥ పనులజేయక యెల్లప్పుడు సుఖముగా కూర్చుని యుండుట, ఎల్లప్పుడు నిద్రాసుఖము ననుభవించుట, పెరుగును ద్రాగుట, గ్రామమునందును జలమునందును జలప్రాంతమునందునుండు జంతువులయొక్క మాంసరసమును సేవించుట, విశేషముగ పాలు ద్రాగుట, క్రొత్త బియ్యపు అన్నమును భుజించుట, క్రొత్తనీళ్లు ద్రావుట, బెల్లముచే జేయబడిన భక్ష్యముల దినుట, కఫవృద్ధికరంబులగు పదార్థముల సేవించుట, ఈకారణములచే ప్రమేహవ్యాధి జనించునని భావము.

## ప్రమేహసంప్రాప్తి

శ్లో॥ మేదశ్చ మాంసం చ శరీరజం చ
క్లేదం కఫో వస్తిగతః ప్రదూష్య।
కరోతి మేహాన్ సముదీర్ణముష్ణై
స్తానేవ పిత్తం పరిదూష్య చాపి॥౨॥
క్షీణేషు దోషేష్వవకృష్య ధాతూన్
సన్దూష్య మేహాన్కురుతేఽనిలశ్చ।
సాధ్యాః కఫోత్థా దశ పిత్తజాష్షట్
యాప్యా న సాధ్యాః పవనాచ్చతుష్కాః॥3॥

సమక్రియత్వాద్విషమక్రియత్వా
న్మహాత్యయత్వాచ్చ యథాక్రమం తే।

తా॥ కఫము వస్తిగతంబై ప్రకోపమునొంది మేదస్సు, మాంసము, శరీరజక్లేదము(శరీరమునందలి జిడ్డుతోగూడి ద్రవరూపంబైన నీరు,) వీనినన్నింటిని దుష్టములుగఁజేసి కఫజనితమేహవ్యాధులను గల్గించును. ఉష్ణంబైన వీర్యంబును స్వర్శంబును కల పదార్థముల సేవించుటచే పిత్తము ప్రకుపితంబై పైనజెప్పిన మేదస్సు మొదలగు వానిని జెరచి పిత్తజమేహవ్యాధులను గల్గించును. కఫపిత్తములు క్షీణించియున్నపుడు వాతము ప్రకుపితంబై వసామజ్జౌజస్సులను ధాతువులను జెరచి వస్తిముఖమునకు జేర్చి వాతజమేహవ్యాధులను గల్గించును. అందు కఫజనితంబులైన పది ప్రమేహములు కఫరూపమైన దోషమునకును, మేదోమాంసశరీరజరసంబులకును, కటుతిక్తాదిపదార్థములను సేవించుట విరుద్ధంబు గాకుండును గాన సాధ్యంబులై యుండును. పిత్తముచే జనించిన యారు ప్రమేహములు పిత్తరూపమైన దోషమునకును మేదస్సు మొదలగు దూష్యములకును మధురాదిపదార్థముల సేవించుట పరస్పరవిరుద్ధంబుగా నుండును గాన యాప్యంబులై యుండును. పిత్తశామకంబులగు మధురాది పదార్థములు మేదోవర్ధకంబులయ్యెను, మేదోహరంబులైన కటుకాది రసములుగల ద్రవ్యములు పిత్తవర్ధకంబులై యుండును గాన దోషదూష్యములకు చికిత్స పరస్పరవిరుద్ధంబుగా నుండునని భావము. వాతముచే జనించిన నాల్గువిధములైన ప్రమేహములు మిగుల గంభీరంబులగు మజ్జాది ధాతువులను క్షయము నొందజేయును గాన అసాధ్యంబులై యుండును. ఇచ్చట "జ్వరే తుల్యర్తుదోషత్వం ప్రమేహే తుల్యదూష్యతా। రక్తగుల్మే పురాణత్వం సుఖసాధ్యస్య లక్షణమ్।" అని తన్త్రాన్తరమున నుండుటచేత ప్రమేహములయందు దోష దూష్యములు సమానగుణములై యుండుట వ్యాధిస్వభావముచే సుఖసాధ్యలక్షణంబని యెరుంగునది.

## ప్రమేహములయందు దోష దూష్య విభాగము

శ్లో॥ కఫస్సపిత్తః పవనశ్చ దోషా
మేదోఽస్రశుక్రాంబు వసాలసీకాః।
మజ్జా రసౌజః పిశితం చ దూష్యాః
ప్రమేహిణాం వింశతిరేవ మేహాః॥౪॥

తా॥ ప్రమేహవ్యాధియందు కఫ పిత్త వాతములు దోషంబులును, మేదస్సు, రక్తము, శుక్రము, జలము, మాంసరసము, లసీక (మాంసచర్మములకు నడుమనుండు నీరు), క్రొవ్వు, ఆహారజరసము, అర్ధాంజలిపరిమిత శ్లేష్మరూపంబైన యోజస్సు, మాంసము, ఇవియన్నియు దూష్యంబులునై యుండును. అట్టి ప్రమేహము క్రింద వివరింపబడురీతిగ ఇరువదిభేదములు కల్గియుండును.

## ప్రమేహ పూర్వరూపములు

శ్లో॥ దన్తాదీనాం మలాఢ్యత్వం ప్రాగ్రూపం పాణిపాదయోః।
దాహశ్చిక్కణతా దేహే తృట్ స్వాద్వాస్యం చ జాయతే॥౫॥

తా॥ దన్తములు నేత్రములు మొదలగు స్థలములయందు మలము విశేషముగ జేరియుండుట, కాళ్లు, చేతులయందు మంట, దేహము బంకగ నుండుట, దప్పి, శ్వాసము, ఇవి ప్రమేహవ్యాధికి ముందు జనించు పూర్వరూపములు. ఇచ్చట మేదస్సు దుష్టమగుటచే దన్తాదులయందు మలము అధికమగుననియు, మేదస్సును కఫంబును దుష్టంబులగుటచే శరీరమున బంక కల్గుననియు నెరుంగునది.

## ప్రమేహ సామాన్య లక్షణము

శ్లో॥ సామాన్యం లక్షణం తేషాం ప్రభూతావిలమూత్రతా।
దోషదూష్యావిశేషేఽపి తత్సంయోగవిశేషతః॥౬॥
మూత్రవర్ణాదిభేదేన భేదో మేహేషు కల్ప్యతే।

తా॥ మూత్రము కలకబారి యధికముగ స్రవించుట ప్రమేహసామాన్యలక్షణము. మరియు నీ వ్యాధియందు దోషదూష్యములచే భేదములేకున్నను వాని పరస్పర సంసర్గభేదముచే కఫాది మేహములలో నవాన్తరభేదములు కల్గును. అట్టి భేదములను మూత్రవర్ణాదిభేదములచే నిర్ణయింపదగునని భావము.

## పది విధంబులైన కఫజనిత మేహములు వివరణము:
## అం ఉదకమేహలక్షణము

శ్లో॥ అచ్ఛం బహు సితం శీతం నిర్గంధముదకోపమమ్॥౭॥
మేహత్యుదకమేహేన కించిదావిలపిచ్ఛిలమ్।

తా॥ స్వచ్ఛంబును, మిగుల నధికంబును, తెల్లనిరంగు కల్గినదియు, చల్లగ నుండునదియు, గంధరహితంబును, ఉదకముతో సమానంబును, కొంచెము కలకబారి పిచ్ఛిలంబునగు మూత్రము వెడలినయెడ ఉదకమేహంబని యెరుంగునది.

## ఇక్షుమేహ లక్షణము

శ్లో॥ ఇక్షో రసమివాత్యర్థం మధురం చేక్షుమేహతః।

తా॥ ఇక్షుమేహముచేత చెఱకురసమువలె మిగుల మధురంబైన మూత్రము వెడలును.

## సాన్ద్రమేహ లక్షణము

శ్లో॥ సాన్ద్రీభవేత్పర్యుషితం సాన్ద్రమేహేన మేహతి।

తా॥ సాన్ద్రమేహమునందు మూత్రమును విడచినయెడ కొంతసేపటికి గట్టిగ పేరియుండును.

## సురామేహ లక్షణము

శ్లో॥ సురామేహీ సురాతుల్యముపర్యచ్ఛమధో ఘనమ్॥౯॥

తా॥ సురామేహముకల మనుజుండు కల్లును బోలి పైన స్వచ్ఛంబును అధోభాగమున మడ్డిగనుండు మూత్రమును విడచును.

## పిష్టమేహ లక్షణము

శ్లో॥ సంహృష్టరోమా పిష్టేన పిష్టవద్బహులం సితమ్।

తా॥ పిష్టమేహముచేత గగురుపాటుగల్గినవాడై పిండిగలిసిన విధంబుగ తెల్లనైన మూత్రమును అధికముగ విడలించును.

## శుక్రమేహ లక్షణము

శ్లో॥ శుక్రాభం శుక్రమిశ్రం వా శుక్రమేహీ ప్రమేహతి ॥౧౦॥

తా॥ శుక్రమేహముగల మనుజుండు శుక్రమును బోలిన మూత్రమునైనను శుక్రముతో గూడిన మూత్రమునైనను స్రవింపజేయును.

## సికతామేహ లక్షణము

శ్లో॥ మూర్తాణూన్ సికతామేహీ సికతారూపిణో మలాన్।

తా॥ సికతామేహముగలవాడు ఇసుకవలె సన్నగ కఠినంబులైన కఫఖండములతో గూడిన మూత్రము విసర్జించును.

## శీతమేహ లక్షణము

శ్లో॥ శీతమేహీ సుబహుశో మధురం భృశశీతలమ్॥౧౧॥

తా॥ శీతమేహమునందు మిగుల శీతలంబును మధురంబునైన మూత్రమును అధికముగ విసర్జించును.

## శనైర్మేహ లక్షణము

శ్లో॥ శనైశ్శనైశ్శనైర్మేహీ మన్దంమన్దం ప్రమేహతి॥

తా॥ మెల్లమెల్లగ కొంచెము కొంచెముగ మూత్రము విడలినయెడ శనైర్మేహమని యెరుంగునది.

## లాలామేహ లక్షణము

శ్లో॥ లాలాతన్తుయుతం మూత్రం లాలామేహేన పిచ్ఛిలమ్॥౧౨॥

తా॥ చొల్లువలె తీగగానుండి జిగటగనుండు మూత్రము స్రవించునెడ లాలామేహం బని యెరుంగునది.

( ఆరువిధంబులైన పిత్తజన్యమేహముల వివరణము:
అందు క్షారమేహలక్షణము )

శ్లో॥ గన్ధవర్ణరసస్పర్శైః క్షారేణ క్షారతోయవత్।

తా॥ గంధము, వర్ణము, రసము, స్పర్శము, ఈ నాల్గింటిచేత క్షారోదకమునకు సమంబైన మూత్రము విడలినయెడ క్షారమేహంబని యెరుంగునది.

## నీలమేహాది లక్షణములు

శ్లో॥ నీలమేహేన నీలాభం కాలమేహీ మషీనిభమ్॥౧౩॥
హారిద్రమేహీ కటుకం హరిద్రాసన్నిభం దహత్।
విస్రం మాఞ్జిష్ఠమేహేన మఞ్జిష్ఠాసలిలోపమమ్॥౧౪॥
విస్రముష్ణం సలవణం రక్తాభం రక్తమేహతః।

తా॥ నీలవర్ణముగ మూత్రము వెడలినయెడ నీలమేహంబనియు, బొగ్గువలె నల్లగ మూత్రము వెడలెనేని కాలమేహంబనియు, కారముగ పసపురంగుతోగూడ మండుచు మూత్రము వెడలినయెడ హారిద్రమేహంబనియు, మంజిష్ఠా కషాయమువంటి రంగుతోగూడి దుర్గంధయుక్తమైన మూత్రము వెడలినయెడ మాంజిష్ఠమేహంబనియు, దుర్గంధమును, ఉష్ణంబును, ఉప్పగనుండునదియు, రక్తమును బోలియున్నదియునైన మూత్రము వెడలినయెడ రక్తమేహంబనియు నెరుంగునది.

## నాల్గువిధంబులైన వాతజమేహములు

శ్లో॥ వసామేహీ వసామిశ్రం వసాభం మూత్రయేన్ముహుః॥౧౫॥
మజ్జాభం మజ్జమిశ్రం వా మజ్జమేహీ ముహుర్ముహుః।
కషాయం మధురం రూక్షం క్షౌద్రమేహం వదేద్బుధః॥౧౬॥
హస్తీ మత్త ఇవాజస్రం మూత్రం వేగవివర్జితమ్।
సలసీకం విబద్ధం చ హస్తిమేహీ ప్రమేహతి॥౧౭॥

తా॥ మాంసరసముతో గలసియైనను మాంసరసమును బోలియైనను మాటిమాటికి మూత్రము వెడలినయెడ వసామేహంబనియు, మజ్జతోగూడియైనను మజ్జతో సమంబుగనైనను మూత్రము మాటిమాటికి వెడలినయెడ మజ్జమేహంబనియు, కషాయంబును మధురంబును రూక్షంబునైన మూత్రము వెడలినయెడ క్షౌద్రమేహంబనియు, మూత్రవేగము లేక మాంసమునకును చర్మమునకును మధ్యభాగముననుండు నీరునుబోలి అప్పుడప్పుడు నిలచి మదించిన యేనుగవలె స్రవించుచుండుమున మూత్రము వెడలినయెడ హస్తిమేహంబనియు నెరుంగునది.

## కఫజప్రమేహోపద్రవములు

శ్లో॥ అవిపాకోఽరుచిశ్ఛర్దిర్నిద్రా కాసస్సపీనసః।
ఉపద్రవాః ప్రజాయన్తే మేహానాం కఫజన్మనామ్ ॥౧౮॥

తా॥ అజీర్ణము, అరోచకము, వాన్తి, అతినిద్ర, దగ్గు, పడిశము, ఇవి యన్నియు కఫముచే జనించిన ప్రమేహములయందు కల్గు నుపద్రవంబులని యెరుంగునది.

### పిత్తజప్రమేహోపద్రవములు

శ్లో॥ వస్తిమేహనయోస్తోదో ముష్కావదరణం జ్వరః।
దాహస్తృష్ణాఽమ్లికా మూర్ఛా విడ్భేదః పిత్తజన్మనామ్ ॥౧౯॥

తా॥ వస్తియందును మేఢ్రమునందును సూదుల గ్రుచ్చిన విధంబుగ పోటు, వృషణముల యందు చర్మము పగులుట, జ్వరము, మంట, దప్పి, పుల్లని త్రేనుపులు వచ్చుట, మూర్ఛ, మలము ఉండలై వెడలుట, ఇవి పిత్తజనితమేహములయందు గల్గు నుపద్రవములని భావము.

### వాతజ ప్రమేహోపద్రవములు

శ్లో॥ వాతజానాముదావర్తః కమ్పహృద్గ్రహలోలతాః।
శూలమున్నిద్రతా శోషః కాసశ్వాసశ్చ జాయతే ॥౨౦॥

తా॥ ఉదావర్తము, కంపము, రొమ్మున పట్టుకొనియుండుట, అన్నిరసములయందిచ్ఛ బొడముట, శూల, నిదురమేల్కొనియుండుట, శోష, కాసశ్వాసములు, ఇవి వాతజనితప్రమేహోపద్రవములని యెఱుంగునది.

### అసాధ్యప్రమేహ లక్షణము

శ్లో॥ యథోక్తోపద్రవావిష్టమతిప్రస్రుతమేవ చ।
పిడకాపీడితం గాఢః ప్రమేహో హన్తి మానవమ్॥౨౧॥

తా॥ పైచెప్పిన ఉపద్రవములతో గూడిన వాతాదిప్రమేహములు మిక్కిలి బాధకల్గించినను, మూత్రము అధికముగ స్రవించుచున్నను, పిడకావ్యాధిచే మిగుల బాధకల్గినను, మనుజుని ప్రాణముల హరించునని భావము.

### మరికొన్ని అసాధ్యప్రమేహ లక్షణములు

శ్లో॥ జాతః ప్రమేహీ మధుమేహినో వా
న సాధ్య ఉక్తస్స హి బీజదోషాత్।
యే చాపి కేచిత్కులజా వికారా
భవన్తి తాంస్తాన్ప్రవదన్త్యసాధ్యాన్ ॥౨౨॥

తా॥ మధుమేహముగల మనుజునకు జనించినవానికి మేహవ్యాధి కల్గినయెడ అట్టి ప్రమేహము బీజదోషముచే జనంచినది గాన నదియు నసాధ్యంబై యుండును. మరియు తాతముత్తాదుల నాటనుండి వంశపరంపరగా జనించిన ప్రమేహంబులు కుష్ఠములు మున్నగు వ్యాధులన్నియు నసాధ్యంబులని భిషగ్వరులు వచించెదరు.

### మధుమేహము జనించు క్రమము

శ్లో॥ సర్వ ఏవ ప్రమేహాస్స్యుః కాలేనాప్రతికారిణః।
మధుమేహత్వమాయాన్తి తదాఽసాధ్యా భవన్తి హి ॥౨౩॥

తా॥ కఫాదులచే జనించిన ప్రమేహములన్నియు తగిన కాలమున చికిత్సజేయకున్నయెడ కొంతకాలమునకు నవియెల్ల మధుమేహవ్యాధులుగ పరిణమించి మిక్కిలి యసాధ్యంబులై యుండును.

## మధుమేహ లక్షణము

శ్లో॥ మధుమేహో మధుసమం జాయతే స కిల ద్విధా।
క్రుద్ధే ధాతుక్షయాద్వాయౌ దోషావృతపథేఽథవా॥౨౪॥
ఆవృతో దోషలిఙ్గాని సోఽనిమిత్తం ప్రదర్శయన్।
క్షణాత్క్షీణః క్షణాత్పూర్ణః భజతే కృచ్ఛ్రసాధ్యతామ్॥౨౫॥
మధురం యచ్చ మేహేషు ప్రాయోమధ్వివ మేహతి।
సర్వేఽపి మధుమేహాఖ్యా మాధుర్యాచ్చ తనోరతః॥౨౬॥

తా॥ మధుమేహమునందు మూత్రము తేనెసమమైన వర్ణంబును రసంబును గల్గియుండును. అట్టి మధుమేహము రెండువిధములు. ధాతుక్షయమువలన ప్రకుపితంబైన వాతముచే జనించినది యొకటియు, వేరొకటి కఫాదిదోషములు వాతసంచారమార్గములు నడ్డగించుటచే జనించినదియునై యుండును. వాయుమార్గనిరోధముచే జనించిన మధుమేహమునందు కఫాదిదోషములలో నేదోషముచే వాతము అడ్డగించబడునో అట్టిదోషముయొక్క లక్షణములు కానంబడును. మరియు అట్టి నిరోధముచేత వాతము క్షణకాలము క్షీణించియు, క్షణకాలము పరిపూర్ణంబుగ నిండియు నుండును. అట్లుండుటచేత మిక్కిలి యసాధ్యంబైయుండును. కఫాదులచే జనించిన సకలమేహములయందును మూత్రము మధురంబై తేనెవంటి రంగుకల్గియుండెనేని అవి యన్నియు మధుమేహంబులని యెరుంగునది. ఈ మధుమేహము శరీరము మధురముగా నుండుటచే ప్రాయికముగ జనించునని యెరుంగునది.

## పిటకా భేదములు

శ్లో॥ శరావికా కచ్ఛపికా జాలినీ వినతాఽలజీ।
మసూరికా సర్షపికా పుత్రిణీ సవిదారికా॥౨౭॥
విద్రధిశ్చేతి పిటకాః ప్రమేహోపేక్షయా దశ।
సన్ధిమర్మసు జాయన్తే మాంసలేషు చ ధామసు॥౨౮॥

తా॥ శరావికయనియు, కచ్ఛపికయనియు, జాలినియనియు, వినతయనియు, అలజియనియు, మసూరికయనియు, సర్షపికయనియు, పుత్రిణియనియు, విదారికయనియు, విద్రధియనియు పిటకావ్యాధి పదితెరంగులై యుండును. ఈపదితెరంగులగు పిటకలు(రాచకురుపులు) ప్రమేహముల జికిత్స జేయక యుపేక్షించుటచే సన్ధిమర్మములయందును, బలిసియుండు అవయవములయందును జనించునని భావము. మరియు భోజుండు "శరావికా సర్షపికా కూర్మికా జాలినీ తథా। కులుత్థికాఽలజీ పుత్రీ విదారీ విద్రధీ తథా। నవైతాః పిటకాః జ్ఞేయాః" అని వచించెను. ఈ వాక్యముచేత ఇతనిమతమునందు వినత యనునది దక్క తక్కిన పిటకాభేదములు

తొమ్మిది కలవనియు, మసూరికయనునది కులత్థికయని వ్యవహరించబడినదియనియు దెలియబడు చున్నది. మరియు చరకమునందు "శరావికా కచ్ఛపికా జాలినీ సర్షపీ తథా । అలజీ వినతాఖ్యా చ విద్రధీ చేతి సప్తమీ" అని ఏడు విధములుగ పిటకాభేదముల జెప్పియున్నది. అయినను కియన్తశ్శిరసీయాధ్యాయమున "తథాన్యాః పిటకాస్సన్తి" అని యుండుటచేత చరకమునగూడ అనేక పిటకా భేదములు కలవు అని తెలియుచున్నది.

## శరావికాది దశవిధపిటకా లక్షణములు

శ్లో॥ అన్తోన్నతా తు తద్రూపా నిమ్నమధ్యా శరావికా।
గౌరసర్షపసంస్థానా తత్ప్రమాణా చ సర్షపీ॥౨౯॥
సదాహా కూర్మసంస్థానా జ్ఞేయా కచ్ఛపికా బుధైః।
జాలినీ తీవ్రదాహా తు మాంసజాలసమావృతా॥30॥
అవగాఢరుజాక్లేదా పృష్ఠే వాప్యుదరేఽపి వా।
మహతీ పిటకా నీలా వినతా నామ సా స్మృతా॥3౧॥
మహత్యల్పచితా జ్ఞేయా పిటకా చాపి పుత్రిణీ।
మసూరాకృతి సంస్థానా విజ్ఞేయా తు మసూరికా॥3౨॥
రక్తా సితా స్ఫోటచితా దారుణా త్వలజీ భవేత్।
విదారీకన్దవద్వృత్తా కఠినా చ విదారికా॥33॥
విద్రధేర్లక్షణైర్యుక్తా జ్ఞేయా విద్రధికా తు సా।

తా॥ చుట్టు ఉన్నతంబుగను మధ్యభాగమున పల్లముగనుండి మూకుడువలె నున్నది శరావికయనియు, ఎఱ్ఱని ఆవాలవంటి ఆకారంబును అంతియ పరిమాణంబును గల్గినది సర్షపికయనియు, మంటతోగూడి తాబేటివీపువలె నున్నతంబైనది కచ్ఛపికయనియు, అధికమైన మంట గల్గి దుర్మాంసముచే నావరింపబడి యుండునది జాలినియనియు, వీపులోనైనను ఉదరమునందైనను మిక్కిలి లోపలపోటుగల్గి ఆర్ద్రమై నీలవర్ణముగల్గి జనించినయెడ వినతయనియు, సన్నని బొబ్బలతోగూడి గొప్ప ఆకారము కల్గినది పుత్రిణి యనియు, చిరుసెనగలవంటి ఆకారంబును పరిమాణంబునుకల్గినది మసూరికయనియు, రక్తవర్ణంబును శ్వేతవర్ణంబునై బొబ్బలతోగూడి మిగుల క్రూరంబైనది అలజియనియు, నేలగుమ్మడిగడ్డవలె గుండ్రముగానుండి కఠినంబై యుండునది విదారికయనియు, విద్రధియొక్క లక్షణములతోగూడి యుండునది విద్రధికయనియు నెరుంగునది.

## పిటకోత్పత్తి కారణములు

శ్లో॥ యే యన్మయాస్స్మృతా మేహాస్తేషామేతాస్తు తన్మయాః॥3౪॥
వినా ప్రమేహమప్యేతా జాయన్తే దుష్టమేదసః।
తావచ్చైతా న లక్ష్యన్తే యావద్వాస్తు పరిగ్రహః॥3౫॥

తా॥ ఏ మేహములు ఏకారణములచే జనించునో అట్టి మేహములచే జనించిన పిటకావ్యాధులకుగూడ నవియే కారణములుగా నుండును. మరియు ప్రమేహవ్యాధి లేకున్నను మేదస్సు చెడినయెడ పైజెప్పిన పిటకావ్యాధులు జనించును. ఈ వ్యాధియందు ఉపరము మొదలగు నవయవముల వ్యాపించునంతవరకు వాని లక్షణములు స్ఫుటముగ గనుబడవు.

మరియు "పరస్పరాభిసన్ధానా పిటకా చైకదేశజా। పిత్తోత్కటా దాహవతీ భృశరుక్ జాలినీ మతా॥" అను భోజవచనముచేత బొబ్బలు ఒండొంట గలిసి ప్రబలమైన పిత్తముతోగూడి అధికమైన మంటయు నొప్పియు కల్గి ఒకచోట జనించిన పిటక జాలిని యని దెలియుచున్నది. ఈ వాక్యముచేత జాలిని యను పిటకావ్యాధియందు పిత్తము ప్రబలముగ నుండునని దెలియుచున్నది గాన ఇచ్చట ప్రమేహమును కల్గించిన దోషములే అట్టి ప్రమేహములవలన గలుగు పిటకలకు కారణములనుటది ప్రాయికంబని యెరుంగునది. చరకమునందు "శరావికా కచ్ఛపికా జాలినీ చేతి దుస్సహాః। జాయన్తే తా హ్యతిబలాః ప్రభూతశ్లేష్మమేదసామ్। స్తబ్ధా సిరాజాలవతీ స్నిగ్ధస్రావా మహాశయా। రుజానిస్తోదబహులా సూక్ష్మచ్ఛిద్రా చ జాలినీ॥" అని యున్నది. శరావిక, కచ్ఛపిక, జాలిని, అను నీ పిటకావ్యాధులు ప్రబలమైన శ్లేష్మంబును మేదస్సును కలవారికి జనించి దుస్సహ నశక్యముగ నుండుననియు; అందు సిరాసమూహముతో గూడి స్నిగ్ధంబైన పూయమును స్రవించుచు నొప్పియు పోటును గల్గి సూక్ష్మంబులగు రంధ్రములతో గూడి యుండునది జాలినియనియు భావము. ఈ చరకవాక్యమునుబట్టి పైజెప్పిన భోజవచనము పిత్తముచే జనించిన మేహమువలన గల్గు జాలినీ లక్షణంబనియు, ఈ చరకవచనము కఫప్రమేహముచే జనించిన జాలినీవ్యాధికి లక్షణంబనియు కొందరు వచించెదరు.

అసాధ్యపిటకా లక్షణములు

శ్లో॥ గుదే హృది శిరస్యంసే పృష్ఠే మర్మసు చోత్థితాః।
సోపద్రవా దుర్బలాగ్నేః పిటకాః పరివర్జయేత్ ॥౩౬॥

———(o)———

ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
ప్రమేహప్రమేహపిటకా నిదానం సమాప్తమ్

---

తా॥ గుదము, హృదయము, శిరస్సు, భుజశిరస్సులు, వీపు, మర్మములు, ఈ స్థానముల జనించి ఉపద్రవములతోగూడి అగ్నిమాంద్యముకల్గియుండెనేని అట్టి పిటకావ్యాధి అసాధ్యంబై యుండును గాన చికిత్స జేయంజనదని భావము.

పిటకోపద్రవములు చరకమున నీరీతిగ గానంబడియెడు: "తృట్కాసమాంససంకోచమోహహిక్కా మదజ్వరాః। విసర్పమర్మసంరోధాః పిటకానాముపద్రవాః॥" దప్పి, దగ్గు, మాంసము ముడుచుకొని యుండుట, మూర్ఛ, వెక్కిళ్లు, మదము, జ్వరము, విస

ర్పము, మర్మసంశోధము, ఇవియన్నియు పిటకావ్యాధిచే గల్గు నుపద్రవములని భావము. మరియు వాతాది దోషంబులును రసరక్తాదిదూష్యంబులును శరీరమునం దధోమార్గముగ సంచరించును గాన పిటకావ్యాధి శరీరమునం దధోభాగమున జనించును.

"రజః ప్రసేకాన్నారీణాం మాసిమాసి విశుధ్యతి। సర్వం శరీరం దోషాశ్చ న ప్రమేహాన్త్యతస్స్త్రియః" అని తన్త్రాన్తరమున నున్నది. స్త్రీలకు ప్రతిమాసము నందును ఋతురక్తము స్రవించుచుండుటంజేసి వాతాదిదోషంబులును సర్వశరీరంబును పరిశుద్ధం బగును గాన వారికి ప్రమేహము జనించదని భావము. ఈ వాక్యమునుబట్టి స్త్రీలకు ప్రమేహము కల్గదని దెలియుచున్నను స్త్రీలకుగూడ నొకప్పుడు ప్రమేహము జనించుట గానంబడుచున్నది గాన ఈ నిషేధము ప్రాయికమని యెరుంగునది. మేహవ్యాధినివృత్తిలక్షణములు సుశ్రుతమునం దిత్తెరంగున జెప్పంబడియె: "ప్రమేహిణో యదా మూత్రం అనావిలమపిచ్ఛిలమ్। విశదం తిక్తకటుకం తదారోగ్యం ప్రచక్షతే॥" ప్రమేహవ్యాధిచే పీడించబడిన వానికి మూత్రము కలకబారక పిచ్ఛిలముగాక విశదంబును, తిక్తకటురసములు గల్గినదియునై వెడలుచున్నయెడ ప్రమేహవ్యాధి నివర్తించినది యని దెలియనగునని భావము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్రవిరాజమాన దివ్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి," "పణ్డిత" గోపాలాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానార్థతాత్పర్యమునందు

ప్రమేహ ప్రమేహపిటకా నిదానము

స మా ప్త ము



శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీరస్తు

## మేదోనిదానమ్



పిటకానిదానమునందు "వినా ప్రమేహమప్యేతా జాయన్తే దుష్టమేదసః" అను వాక్యముచే మేదోదోషముచేత పిటకజనించునని జెప్పియుండుటంజేసి పిటకానిదానమును జెప్పినపిదప మేదోనిదానమును జెప్పుట.



శ్లో॥ అవ్యాయామదివాస్వప్నశ్లేష్మలాహారసేవినః।
మధురోఽన్నరసః ప్రాయః స్నేహాన్మేదః ప్రవర్ధయేత్ ॥౧॥

తా॥ దేహపరిశ్రమముజేయక పవటియందు నిదురించువానికిని, కఫమును వృద్ధినొందించు ఆహారములు సేవించువానికిని, భుజించిన యాహారముయొక్క రసము పక్వముగాక అట్టి రసమునందలి స్నిగ్ధత్వముచేత మేదస్సును వృద్ధినొందించును.

### మేదస్సంప్రాప్తి

శ్లో॥ మేదసావృతమార్గత్వాత్పుష్యన్త్యన్యే న ధాతవః।
మేదస్తు చీయతే తస్మాదశక్తస్సర్వకర్మసు॥౨॥

తా॥ పై జెప్పిన కారణములచే వృద్ధినొందిన మేదస్సు రసవహాదిస్రోతోమార్గముల నడ్డగించి యుండుటచేత తక్కిన రసాదిధాతువులన్నియు వృద్ధినొందక మేదస్సుమాత్రము వృద్ధినొందును; దానంజేసి మనుజుండు సకల వ్యాపారములయందును సామర్థ్యములేకుండును. మేదస్సు మిగుల సుకుమారమైనది గాన అయ్యది వృద్ధినొందినపుడు పనులయందు సామర్థ్యములేకుండునని భావము.

### మేదోవృద్ధిచే గల్గు నుపద్రవములు

శ్లో॥ క్షుద్రశ్వాసతృషామోహస్వప్నక్రథనసాదనైః।
యుక్తః క్షుత్స్వేదదుర్గన్ధైరల్పప్రాణోఽల్పమైథునః॥3॥

తా॥ కొంచెముగ శ్వాసము వెడలుట, దప్పి, మూర్ఛ, అతినిద్ర, తుమ్ములువచ్చుట, బడలిక, చెమట, శరీరమున దుర్గన్ధముగల్గుట, బలంబును సంభోగశక్తియు స్వల్పమగుట, ఈయుపద్రవములు మేదోవృద్ధిచే గల్గును.

## మేదస్స్థానములు

శ్లో॥ మేదస్తు సర్వభూతానాముదరేష్వస్థిషు స్థితమ్।
అత ఏవోదరే వృద్ధిః ప్రాయో మేదస్వినో భవేత్ ॥౪॥

తా॥ సకల ప్రాణులకును మేదస్సు ఉదరమునందును అస్థులయందునుండును గాన మేదోరోగముగల మనుజునకు తరుచుగా నుదరమునందే వృద్ధిగల్గును.

శ్లో॥ మేదసావృతమార్గత్వాద్వాయుః కోష్ఠే విశేషతః।
చరన్సంధుక్షయత్యగ్నిం ఆహారం శోషయత్యపి॥౫॥
తస్మాత్సశీఘ్రం జరయత్యాహార మభికాఙ్క్షతి।
వికారాంశ్చాప్నుతే ఘోరాన్ కాంశ్చిత్కాల
వ్యతి క్రమాత్ ॥౬॥

తా॥ వృద్ధినొందిన మేదస్సుచేత వాతసంచారమార్గము లడ్డగించబడినప్పుడు వాతము బైలువెడలుటకు తెరపులేనందున కోష్ఠమునందే విశేషముగ సంచరించుచు జాఠరాగ్నిని ప్రబలముగ జ్వలింపంజేయును; దానంజేసి భుజించబడిన యాహారము శీఘ్రముగ జీర్ణంబై మరల నాహారమును భుజించుట కిచ్ఛబొడమును. భోజనకాలం బతిక్రమించినయెడ ప్రమేహపిటకాది నానావిధ వ్యాధులు జనించును.

శ్లో॥ ఏతావుపద్రవాకారౌ విశేషాదగ్నిమారుతౌ।
ఏతౌ తు దహతస్స్థూలం వనదావో వనం యథా॥౭॥
మేదస్యతీవ సంవృద్ధే సహసైవానిలాదయః।
వికారాన్ దారుణాన్కృత్వా నాశయన్త్యాశు జీవితమ్॥౮॥
మేదోమాంసాతివృద్ధత్వాచ్చలస్ఫిగుదర స్తనః।
అయథోపచయోత్సాహో నరోఽతిస్థూల ఉచ్యతే॥౯॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
మేదో నిదానం సమాప్తమ్



తా॥ ఉపద్రవరూపంబులైన అగ్నివాతములు రెండును కార్చిచ్చు అడవిని దహించుభంగి స్థూలత్వమును నశింపంజేయును. మేదస్సు మిక్కిలి వృద్ధినొందినపుడు వాతాదులన్నియు వృద్ధినొంది క్రూరంబులైన ప్రమేహము, పిటక, జ్వరము, విద్రధి మున్నగాగల నానావిధవ్యాధులను గల్గించి ప్రాణములను హింసించును. మేదోమాంసములు మిక్కుటముగ వృద్ధినొంది యుండుట

వలన ఉదరము, పిరుదులు, స్తనములు, ఇవి మిక్కిలి బలిసియుండుటచే కదలుచు వికృతరూపముగ శరీరము వృద్ధి నొంది ఉత్సాహము లేకుండును. ఆట్టి మనుజుండు అతిస్థూలుండని చెప్పంబడును.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాపాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు

మేదో నిదానము

సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# ఉదరనిదానమ్

మేదోరోగమునం దుదరము స్థూలమైయుండునని చెప్పియుండుటచేత మేదోనిదానమును జెప్పినపిదప ఉదరమును స్థూలముగ జేయునట్టి ఉదరరోగనిదానము జెప్పబడుచున్నది.



శ్లో॥ రోగాస్సర్వేఽపి మన్దేఽగ్నౌ సుతరాముదరాణి చ।
అజీర్ణాన్మలినైశ్చాన్నైర్జాయన్తే మలసంచయాత్ ॥౧॥

తా॥ అగ్నిమాన్ద్యము, అజీర్ణము, పరస్పరవిరుద్ధంబులైన యన్నములను భుజించుట, పురీషాదిమలంబులును వాతాది దోషములును వృద్ధినొందుట, ఈకారణములచేత నుదరవ్యాధులును ఇతరరోగంబులును జనించును.

తన్త్రాన్తరమునందు "అతిసఞ్చితదోషాణాం పాపం కర్మ చ కుర్వతామ్। ఉదరాణ్యుపజాయన్తే మన్దాగ్నీనాం విశేషతః॥" అని యున్నది: వాతాదిదోషములు మిక్కిలి వృద్ధిజెందియున్న వారికిని, పాపకర్మముల జేయువారికిని, మందాగ్ని కల్గినవారికిని ఉదరవ్యాధులు జనించునని భావము. ఈ వచనమునుబట్టి ప్రకృతమూలమున "మలసంచయాత్" అనుచోట మలశబ్దముచేత పురీషాదిమలంబులును వాతాదిదోషంబులు గ్రహింపందగినది.

### ఉదరవ్యాధి సంప్రాప్తి

శ్లో॥ రుద్ధ్వా స్వేదామ్బువాహీని దోషాస్స్రోతాంసి సంచితాః।
ప్రాణాగ్న్యపానాన్ సందూష్య జనయన్త్యుదరం నృణామ్॥౨॥

తా॥ దేహమునందలి చెమటను జలమును వహించు స్రోతస్సులను వాతాదిదోషములు అడ్డగించి ప్రాణస్థానమును అగ్నిస్థానమును అపానస్థానమును ఆశ్రయించి వానిని దుష్టంబులుగ జేసి మనుజులకు ఉదరవ్యాధిని కల్గించును.

ఇచ్చట ఉదకవహంబులగు స్రోతస్సులకు తాలువులును క్లోమంబును స్థానమనియు, స్వేదవహంబులగు స్రోతస్సులకు మేదస్సును రోమకూపంబులును స్థానములనియు భేదము నెరుంగునది. మరియు ఉదరవ్యాధిపూర్వరూపములు సుశ్రుతమున నీరీతిగ గానంబడియెడు: "తత్పూర్వరూపం బలవర్ణకాఙ్క్షా వలీవినాశో జఠరే హి రాజ్యః। జీర్ణాపరిజ్ఞానవిదాహవత్యో

వస్తౌ రుజః పాదగతశ్చ శోఫః॥'' బలమునందును శరీరవర్ణమునందును కోరిక గల్గియుండుట, కడుపుపైనుండు వళులు (ముడతలు) లేకుండుట, కడుపుపై రేఖలు కల్గుట, ఆహారము జీర్ణంబైనదియని తెలియక మంటతోకూడి వస్తి (పొత్తికడుపు) యందు బాధగల్గుట, పాదములయందు వాపుగల్గుట, ఇవి యన్నియు ఉదరవ్యాధి జనించుటకుముందు గల్గు పూర్వరూపములని భావము.

## ఉదరసామాన్య రూపము

శ్లో॥ ఆధ్మానం గమనేఽశక్తిర్దౌర్బల్యం దుర్బలాగ్నితా।
శోథస్సదనమఙ్గానాం సఙ్గో వాతపురీషయోః॥౩॥
దాహస్తన్ద్రా చ సర్వేషు జఠరేషు భవన్తి హి।

తా॥ కడుపుబ్బరము, త్రోవనడచుటకు శక్తి లేకబోవుట, శరీరమున బలములేకుండుట, జఠరాగ్ని మందగించుట, వాపు, అవయవములు కృశించుట, వాతపురీషములు బంధించబడియుండుట, తాపము, కునికిపాటు, ఈలక్షణములు ఉదరవ్యాధులన్నింటియందును సామాన్యముగ జనించును.

## ఉదరవ్యాధి భేదములు

శ్లో॥ పృథగ్దోషైస్సమస్తైశ్చ ప్లీహాబద్ధక్షతోదకైః॥౪॥
సమ్భవన్త్యుదరాణ్యష్టౌ తేషాం లిఙ్గం పృథక్ శృణు।

తా॥ వాత పిత్త శ్లేష్మములు, సన్నిపాతము, ప్లీహము, బద్ధము, క్షతము, ఉదకము, ఈయెనిమిది కారణములచే నుదరములు ఎనిమిది తెరంగులగును. వానికన్నిటికి వేర్వేరుగ లక్షణముల వచించెద వినుము.

## వాతోదర లక్షణము

శ్లో॥ తత్ర వాతోదరే శోథః పాణిపాన్నాభికుక్షిషు॥౫॥
కుక్షిపార్శ్వోదరకటీ పృష్ఠరుక్పర్వభేదనమ్।
శుష్కకాసోఽఙ్గమర్దోఽధోగురుతా మలసంగ్రహః॥౬॥
శ్యావారుణత్వగాదిత్వమకస్మాద్వృద్ధిహ్రాసవత్।
సతోదభేదముదరం తను కృష్ణసిరాతతమ్॥౭॥
ఆధ్మాతదృతివచ్ఛబ్దమాహతం ప్రకరోతి చ।
వాయుశ్చాత్ర సరుక్ఛబ్దో విచరేత్సర్వతో గతిః॥౮॥

తా॥ అందు వాతోదరమున హస్తపాదములయందును, నాభికుక్షులయందును వాపు కల్గుట, కుక్షి, ఇరుప్రక్కలు, ఉదరము, కటిస్థలము, వీపు, ఈస్థలములయందు నొప్పి, కీళ్ళనొప్పులు, పొడిదగ్గు, ఒడలినొప్పులు, శరీరమునం దధోభాగమున బరువుగానుండుట, మలబంధము, చర్మము, ముక్కు, చెవులు, వీనియందు శ్యావారుణవర్ణంబులు గల్గియుండుట, ఉదరము కారణములేకనే వృద్ధినొంది తనంతటనే హ్రాస్వంబగుట, ఉదరమున సూదులతో గ్రుచ్చినట్లునుగొడ్డలితో పగల

ద్దీయున్నట్టులు నుండుట, సూక్ష్మంబులైన నల్లని సిరలచే నావరింపబడియుండుట, ఉదరముపై వాయించినయెడ గాలిచే నిండియుండు తిత్తివలె శబ్దముగల్గుట, వాతము శబ్దముతోగూడి నొప్పిని కల్గించుచు కుక్షియందంతట వ్యాపించుట, ఈ లక్షణములన్నియు కల్గును.

## పిత్తోదర లక్షణము

శ్లో॥ పిత్తోదరే జ్వరో మూర్ఛా దాహ స్తృట్కటుకాస్యతా।
భ్రమోఽతిసారః పీతత్వం త్వగాదావుదరం హరిత్ ॥౯॥
పీతతామ్రసిరానద్ధం సస్వేదం సోష్మదహ్యతే।
ధూమాయతే మృదుస్పర్శం క్షిప్రపాకం ప్రదూయతే॥౧౦॥

తా॥ జ్వరము, మూర్ఛ, తాపము, దప్పి, నోరు చేదుగనుండుట, భ్రమము, అతిసారము, చర్మము నాసిక చెవులు ఇవి పచ్చనై యుండుట, ఉదరము పచ్చనిరంగుగల్గి యుండుట, పీతవర్ణంబులును తామ్రవర్ణంబులునైన సిరలచే వ్యాప్తమై యుండుట, చెమటతో గూడియుండుట, అధికముగ వేడికల్గి దహించబడినట్లుండుట, నోట పొగ వెడలునట్లుండుట, హస్తముచే స్పృశించినయెడ మృదువుగా నుండుట, శీఘ్రముగ పరిపక్వంబగుట, నొప్పిగల్గి యుండుట, ఈ లక్షణములు కల్గినది పిత్తముచే జనించిన ఉదరంబని యెరుంగునది.

## కఫోదర లక్షణము

శ్లో॥ శ్లేష్మోదరేఽఙ్గసదనం స్వాపశ్వయథుగౌరవమ్।
నిద్రోత్క్లేశోఽరుచిశ్శ్వాసః కాసశ్శుక్లత్వగాదితా॥౧౧॥
ఉదరం స్తిమితం స్నిగ్ధం శుక్లరాజీతతం మహత్।
చిరాభివృద్ధం కఠినం శీతస్పర్శం గురు స్థిరమ్॥౧౨॥

తా॥ శరీరము కృశించుట, స్పర్శమును దెలియకుండుట, వాపు, శరీరము బరువై యుండుట, అతినిద్ర, వాంతియగునట్లుండుట, అరోచకము, శ్వాస కాసములు, చర్మము మొదలగునవి తెల్లగా నుండుట, ఉదరము నిశ్చలమై నిగనిగలాడుచు తెల్లని రేఖలు కల్గి గొప్పదిగా నుండుట, చిరకాలమునకు వృద్ధినొంది మిగుల కఠినంబుగనుండుట, స్పృశించినయెడ చల్లనై యుండుట, ఈలక్షణములు కల్గినది కఫముచే జనించిన ఉదరవ్యాధి యని యెరుంగునది.

## సన్నిపాతోదర లక్షణము

శ్లో॥ స్త్రియోఽన్నపానం నఖలోమమూత్ర
విడార్తవైర్యుక్తమసాధువృత్తాః।
యస్మై ప్రయచ్ఛన్త్యరయో గరాంశ్చ
దుష్టాంబుదూషీవిషసేవనాద్వా॥౧౩॥
తేనాశు రక్తం కుపితాశ్చ దోషాః
కుర్యుస్సుఘోరం జఠరం త్రిలిఙ్గమ్।

తచ్ఛీతవాతే భృశదుర్దినే చ
విశేషతః కుప్యతి దహ్యతే చ ॥౧౪॥
స చాతురో ముహ్యతి హి ప్రసక్తం
పాణ్డుః కృశశ్శుష్యతి తృష్ణయా చ।
దూష్యోదరం కీర్తితమేతదేవ

తా॥ దుష్టలైన స్త్రీలు నఖములు, వెంట్రుకలు, మూత్రము, మలము, ఋతురక్తము; వీనితో గూడిన యన్నమును బెట్టినయెడ నట్టియన్నమును భుజించినను, శత్రువులు బెట్టిన విషమును భుజించినను, విషాదులచే దుష్టంబైన జలమును ద్రావినను, దూషీవిషమును సేవించినను, ఈ కారణములచే వాతాదులు ప్రకోపమునొంది రక్తమును జెరచి మిగుల కఠినంబై దోషత్రయలక్షణములతో గూడిన ఉదరవ్యాధిని కల్గించును. ఇది సన్నిపాతముచే జనించిన ఉదరవ్యాధియని యెరుంగునది. ఈసన్నిపాతోదరవ్యాధి చలికాలమందును గాలి వీచుచుండు కాలమునందును మేఘములు ఆవరించియుండు దినములయందును మిగుల ప్రకోపమునొంది తాపమును గల్గించును. ఈ యుదరముచే పీడితుండైన మనుజుండు మాటిమాటికి మూర్ఛనొందుట, పాండురోగము, కార్శ్యము, దప్పిచే నోరెండుట, ఈలక్షణములు కల్గియుండును. ఇదియే దూష్యోదర మనియు జెప్పంబడును. దూష్యంబైన రక్తము దుష్టమగుటవలన జనించునది గాన దూష్యోదర మని భావము. దూషీవిషలక్షణము తన్త్రాన్తరమున నీరీతిగ జెప్పంబడియెడు “ జీర్ణం విషఘ్నౌషధిభిర్హతం వా దావాగ్నివాతాతపశోషితం వా। స్వభావతో వా గుణవిప్రహీనం విషం హి దూషీవిషతాముపైతి॥” ప్రాతదియు, విషహరంబులైన ఓషధులచే బలహీనంబైనదియు, కార్చిచ్చునందును ఎండయందును గాలియందును ఎండినదియు, స్వభావముచేత నే గుణహీనంబైనదియునైన విషము దూషీవిషంబని చెప్పంబడునని భావము.

ప్లీహోదర యకృద్దాల్యుదర లక్షణములు

శ్లో॥ ప్లీహోదరం కీర్తయతో నిబోధ ॥౧౫॥
విదాహ్యభిష్యన్దిరతస్య జన్తోః
ప్రదుష్టమత్యర్థమసృక్కఫశ్చ।
ప్లీహాభివృద్ధిం కురుతః ప్రవృద్ధౌ
ప్లీహోత్థమేతజ్జఠరం వదన్తి ॥౧౬॥
తద్వామపార్శ్వే పరివృద్ధిమేతి
విశేషతస్సీదతి చాతురోఽత్ర।
మన్దజ్వరాగ్నిః కఫపిత్తలిఙ్గై-
రుపద్రుతః క్షీణబలోఽతిపాణ్డుః।

సవ్యాన్యపార్శ్వే యకృతి ప్రవృద్ధే।
జ్ఞేయం యకృద్దాల్యుదరం తదేవ॥౧౭॥

తా॥ మిగుల సంతాపకరపదార్థంబులను ద్రవమును కల్గించుపదార్థములను మిగుల నాసక్తితో సేవించు పురుషునకు రక్తంబును కఫంబును మిక్కిలి దుష్టంబులై వృద్ధినొంది ప్లీహమును వృద్ధినొందించును. దీనిని ప్లీహముచే గల్గిన జఠరంబని వచించెదరు. ఈవ్యాధియందు ఎడమ ప్రక్క విశేషముగ నుదరము వృద్ధినొందును. మరియు శరీరము శిథిలముగ నుండుట, కఫ చిహ్నంబైన అగ్నిమాన్ద్యము, పిత్తలక్షణములు, బలక్షయము, శరీరపాండుత్వము, ఈలక్షణములు కల్గును. ఈప్లీహోదరమువలెనే కుడిప్రక్కనుండు యకృత్తు (కారిజము) వర్ధినొందినయెడ యకృద్దాలి యను ఉదరవ్యాధియని యెరుంగునది. యకృత్తును దోషములచే భేదించునుగాన యకృద్దాలియని చెప్పంబడునని భావము.

ప్లీహోదరమునందు వాతాదిసంబంధముచే గల్గు లక్షణములు

శ్లో॥ ఉదావర్తరుజానాహైర్మోహతృడ్దహనజ్వరైః।
గౌరవారుచికాఠిన్యైః విద్యాత్తత్ర మలాన్ క్రమాత్ ॥౧౮॥

తా॥ పైజెప్పిన ప్లీహోదరమునందు ఉదావర్తము, నొప్పి, కడుపుబ్బరము, ఈలక్షణములు కల్గినయెడ వాతము ప్రకోపించినదియనియు; మోహము, దప్పి, తాపము, జ్వరము యీలక్షణములు కల్గినయెడ పిత్తము ప్రకోపించి యున్నదియనియు; గురుత్వము, అరుచి, కఠినత్వము, ఈలక్షణములున్నయెడ కఫము ప్రకోపించి యున్నది యనియు నెరుంగునది.

బద్ధగుదోదర లక్షణము

శ్లో॥ యస్యాన్త్రమన్నైరుపలేపిభిర్వా
వాలాశ్మభిర్వా సహితం యథావత్।
సఞ్చీయతే యస్యమలస్సదోష
శ్శనైశ్శనైస్సఙ్కరవచ్చ నాడ్యామ్॥౧౯॥
నిరుధ్యతే తస్య గుదే పురీషం
నిరేతి కృచ్ఛ్రాదపి చాల్పమల్పమ్।
హృన్నాభిమధ్యే పరివృద్ధిమేతి
తస్యోదరం బద్ధగుదం వదన్తి ॥౨౦॥

తా॥ జిగటగల్గిన యన్నములను భుజించుటచేతను, వెంట్రుకలతోనైనను సన్నని రాళ్లతోనైనను కలసిన యన్నముల భుజించుటచేతను, ప్రేవు లడ్డగింపబడినయెడ పుడమింగల ధూళిని ప్రోవుజేసిన నానాట వృద్ధినొందుకరణి మలము నానాట వృద్ధినొంది మలమును వహించు నాడి యందు జేరి గుదద్వారమున పురీషము నడ్డగించును. లేక కొంచెము కొంచెముగనైనను బైలువెడలించును. దానంజేసిహృదయమునకును నాభికిని మధ్యమునందు వృద్ధినొందును. దీనిని బద్ధగుదోదర వ్యాధియని వచించెదరు. మరియు "వర్చః పిత్తకఫాన్ రుద్ధ్వా కరోతి కుపితోఽనిలః"

అని వాగ్భటాచార్యుండు చెప్పియుండుటచేత నీవ్యాధి వాతప్రకోపముచే జనించునని యెఱుంగునది. మరియు నీవ్యాధి ఆహారముతోగూడి భుజింపబడిన వెంట్రుకలు రాళ్లు మొదలగునవి గుదద్వారమునను పైనుండు ఆంత్రము నడ్డగించుటచే గల్గినది గాన బద్ధగుదోదరమని చెప్పంబడునని యెఱుంగునది.

## పరిస్రావ్యుదర లక్షణము

శ్లో॥ శల్యం తథాన్నోపహితం యదన్త్రం
భుక్తం భినత్త్యాగతమన్యథా వా।
తస్మాత్స్రుతోఽన్త్రాత్సలిలప్రకాశః
స్రావస్స్రవేద్వై గుదతస్తు భూయః॥౨౧॥
నాభేరధశ్చోదరమేతి వృద్ధిం
నిస్తుద్యతేదాల్యతిచాతిమాత్రమ్।
ఏతత్పరిస్రావ్యుదరం ప్రదిష్టమ్

తా॥ ముండ్లు రాళ్లు మొదలగు శల్యములతోగూడిన యన్నమును భుజించినయెడ ఆ శల్యము పక్వాశయమునుండి విలోమముగ వచ్చుచుండి ఆంత్రము (ప్రేగు)ను భేదించును; పిదప పగిలిన ఆంత్రమునుండి జలముతో సమమైన చీము స్రవించి గుదద్వారమునుండి బైలువెడలును; దానంజేసి నాభిక్రింద ఉదరము వృద్ధినొందును. ఆయుదరము సూదులగ్రుచ్చినవిధంబుగను చీలువబడిన చందముగను మిక్కుటమైన బాధగల్గియుండును దీనిని క్షతోదరంబనియు, పరిస్రావ్యుదరంబనియు వచించెదరు.

## జలోదర లక్షణము

శ్లో॥ దకోదరం కీర్తయతో నిబోధ॥౨౨॥
యస్స్నేహపీతోఽప్యనువాసితో వా
వాన్తో విరిక్తోఽప్యథవా నిరూఢః।
పిబేజ్జలం శీతలమాశు తస్య
స్రోతాంసి దూష్యన్తి హి తద్వహాని॥౨౩॥
స్నేహోపలిప్తేష్వథవాఽపి తేషు
దకోదరం పూర్వవదభ్యుపైతి।
స్నిగ్ధం మహత్తత్పరివృత్తనాభి
సమాంతతం పూర్ణమివామ్బునా చ॥౨౪॥
యథా దృతిః క్షుభ్యతి కమ్పతే చ
శబ్దాయతే చాపి దకోదరం తత్॥

తా॥ స్నేహపానము, అనువాసనవస్తి, వమనము, విరేచనము, నిరూహణవస్తి, ఈచికిత్సలో నెద్దానినైన జేసికొని చల్లని నీళ్లను విశేషముగ పానముజేసినయెడ బలవహంబులైన

స్రోతస్సులన్నియు దుష్టంబులై ఉపస్నేహన్యాయము ననుసరించి స్రవించు అన్నరసముతోగూడి యుండ పైన క్షతోదరమున జెప్పినవిధంబుగ నుదరము నానాట వృద్ధినొందును. దీనిని దకోదరమని వచించెదరు. అట్టి జలోదరము నూనెబూసినవిధంబుగ నిగనిగలాడుచు బొడ్డుచుట్టు విశాలముగ నావరించి నీళ్ళచే నిండియున్నట్లుండును. మరియు నుదకపూర్ణంబైన తిత్తివలె గుళగుళయను శబ్దముతోగూడి కదలుచుండును. దీనిని దకోదరమనియు జలోదరమనియు వ్యవహరించెదరు.

## సాధ్యాసాధ్యోదర లక్షణములు

శ్లో॥ జన్మనైవోదరం సర్వం ప్రాయః కృచ్ఛ్రతమం మతమ్।
బలినస్తదజాతామ్బు యత్నసాధ్యం నవోత్థితమ్॥౧౫॥
పక్షాద్బద్ధగుదం తూర్ధ్వం సర్వం జాతోదకం తథా।
ప్రాయో భవత్యభావాయ ఛిద్రాన్త్రం చోదరం నృణామ్॥౧౬॥
శూనాక్షం కుటిలోపస్థముపక్లిన్నతనుత్వచమ్।
బలశోణితమాంసాగ్ని పరిక్షీణం చ వర్జయేత్॥౧౭॥
పార్శ్వభఙ్గాన్నవిద్వేషశోథాతీసారపీడితమ్।
విరిక్తం చాప్యుదరిణం పూర్యమాణం వివర్జయేత్॥౧౮॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే

ఉదరనిదానం సమాప్తమ్

---

తా॥ ఉదరవ్యాధి ప్రాయికముగ స్వభావముచేతనే మిక్కిలి కష్టసాధ్యంబై యుండును. అందు మిక్కిలి బలముకలవానికి నూతనముగ జనించి జలపూరితముగాకుండు నుదరము - యత్నముచే సాధింపదగును. మరియు బద్ధగుదోదరము జనించిన పదునైదు దినములకు పిదప ప్రాయికముగ నసాధ్యంబై యుండును. ఉదకముచే పూర్ణంబులగు నుదరములన్నియును, ఛిద్రాన్త్రోదరంబును అసాధ్యంబులు. కన్నులు వాచియున్నను, శిశ్నము వక్రంబై యున్నను, చర్మము ఆర్ద్రంబై యున్నను, శరీరబలము, రక్తము, మాంసము, జఠరాగ్ని, ఇవియన్నియు నశించినను, ఇరుప్రక్కల నొప్పి, అన్నద్వేషము, శోథ, అతిసారము, ఈ యుపద్రవములచే పీడింపబడినను, విరేచనంబైనను మాటిమాటికి ఉదరము జలముచే నిండుచున్నను, ఉదరవ్యాధి కల మనుజుండు బ్రతుకుటలేదు గాన చికిత్సజేయంజనదని భావము.

ఇచ్చట "ప్రాయోభవత్యభావాయ" అని ప్రాయశ్శబ్దమును ప్రయోగించుటచేత క్షతోదర జలోదర బద్ధగుదోదరములు మూడును పక్షకాలము గడచినపిమ్మటగూడ నొకసమయమున శస్త్రాదిచికిత్సలచే సాధింపందగియుండునని యర్థవిశేషము నెరుంగునది. మరియు చరకమునందు "అశోథమరుణాభాసం సశబ్దం నాతిభారికమ్। నాభిం విష్టభ్య పాయాత్తు

వేగం కృత్వా ప్రణశ్యతి। హృద్వఙ్క్షణ కటీ నాభి గుద ప్రత్యేకశూలినః। కర్కశం సృజతో వాతం నాతిమన్దే చ పావకే। లాలయా విరసే చాస్యే మూత్రేఽల్పే సంహతే విశి। అజాతోదకమిత్యేతైః యుక్తం విజ్ఞాయ లక్షణైః॥" అని ఉదకములేని ఉదరలక్షణంబును; "కుక్షేరతిమాత్రం వృద్ధిః సిరాన్తర్ధానగమనం ఉదకపూర్ణదృతిసమానక్షోభ స్పర్శనం చ భవతి" అని జలముతోఁగూడిన ఉదరముయొక్క లక్షణంబులును చెప్పబడియున్నవి. నాపు లేకుండుట, ఎఱ్ఱని రంగు కల్గియుండుట, శబ్దముతోఁగూడియుండుట, కొంచెముగ భారము కల్గియుండుట, వాతము కర్కశముగ వెడలుట, అగ్ని కొంచెముగ మందమై యుండుట. నోరు జొల్లుకార్చుచు రసముల నెఱుంగకుండుట, మూత్రము స్వల్పముగ వెడలుట, మలము కఠినంబై యుండుట, ఈ లక్షణములతోఁగూడి నాభిస్థానమున పట్టినట్లుండి హృదయము, గజ్జలు, కటిస్థలము, నాభి, గుదము, ఈ స్థలములయందు బాధకల్గించి గుదస్థానమున వేగము నుజూపునది జలములేని ఉదరంబనియు; కుక్షి మిక్కిలి వృద్ధినొందుట, సిరలు కానరాకుండుట, చేతితో తాకినయెడ నీటిచే నిండియుండు తోలుతిత్తివలెనుండి కదలుచుండుట, ఈలక్షణములు కల్గినది జలముతోఁగూడిన ఉదరంబనియు భావము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్ర విరాజమాన దీక్షితాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపాలాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానాన్వితాత్పర్యము

నందు ఉదర నిదానము

**సమాప్తము**



శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీరస్తు

# శోథ నిదానమ్

ఉదరనిదానానంతరము ఉదరమున కుపద్రవంబైన శోథయొక్క నిదానమును జెప్పుట.

శ్లో॥ రక్తపిత్తకఫాన్ వాయు ర్దుష్టో దుష్టాన్బహిస్సిరాః।
నీత్వా రుద్ధగతిస్తైర్హి కుర్యాత్త్వఙ్మాంససంశ్రయమ్॥౧॥
ఉత్సేధం సంహతం శోథం తమాహుర్నిచయాదతః।
సర్వం హేతువిశేషైస్తు రూపభేదాన్నవాత్మకమ్॥౨॥
దోషైః పృథగ్ద్వయైస్సర్వై రభిఘాతాద్విషాదపి।

తా॥ వాతము దుష్టంబై స్వకారణములచే దుష్టంబులగు రక్తపిత్తకఫములను బాహ్యనాడుల యందు వ్యాపింపంజేసి వానిచే నడ్డగింపబడినమార్గము కల్గినదియై చర్మమాంసముల నాశ్రయించిన శోథను (వంజును) కల్గించును. అట్టివాపు ఉన్నతంబై కఠినంబుగనుండును. దీనిని శోథంబని వచించెదరు. మరియు నీశోథము వాతపిత్తకఫములయొక్క ప్రకోపముచే జనించుటంజేసి సన్నిపాతజమని యెరుంగునది. వాతపిత్తశ్లేష్మములచే వేర్వేరుగను దోషద్వయసంసర్గముచేతను సన్నిపాతముచేతను అభిఘాతముచేతను విషముచేతను జనించుటంజేసి తొమ్మిది విధంబులగును, శోథములన్నియు సన్నిపాతముచే జనించినను దోషత్రయములో నొకదోషము అధికముగా ప్రకోపమునొందినపుడు ఏకదోషజమనియు; రెండుదోషములయొక్క ప్రకోపముచే జనించినపుడు ద్విదోషజమనియు, దోషములన్నియు సమముగ ప్రకోపమునొందినపుడు సన్నిపాతజమనియు, ఇట్టి భేదములచేత తొమ్మిది విధంబులగువనియు భావము. మరియు "త్వఙ్మాంససిరాస్నాయ్వస్థిసన్ధికోష్ఠమర్మాణీత్యష్టౌ వ్రణవాస్తూని" అని సుశ్రుతమున నుండుటంజేసి త్వక్కు, మాంసము, సిరలు, స్నాయువులు, అస్థులు, కీళ్లు, కోష్ఠము, మర్మములు, ఈ యెనిమిదిస్థానములును వ్రణస్థానములు గాన త్వఙ్మాంసములయందు మాత్రము జనించునది శోథయనియు, పైజెప్పినరీతిగ నెనిమిదివిధములైన వ్రణస్థానములయందు జనించునది వ్రణశోథయనియు, వ్రణశోథకును, సామాన్యశోథకును పరస్పరభేదముల నెరుంగునది.

## శోఫ పూర్వరూపము

శ్లో॥ తత్పూర్వరూపం దవథుః సిరాయామోఽఙ్గ గౌరవమ్॥౩॥

తా॥ సంతాపము గల్గుట, నరముల నీడ్చిపట్టినట్లు బాధగల్గుట, శరీరము బరువుగానుండుట ఇవి యన్నియు శోఫము జనించుటకుముందు కల్గు పూర్వరూపములు.

## శోఫ జనించుటకు కారణములు

శ్లో॥ శుధ్యామయాభుక్తకృశాబలానాం
క్షారామ్లతీక్ష్ణోష్ణగురూపసేవా।
దధ్యామమృచ్ఛాకవిరోధి దుష్ట
గరోపసృష్టాన్న నిషేవణం చ॥౪॥
అర్శాంస్యచేష్టా న చ దేహశుద్ధి
ర్మర్మోపఘాతో విషమా ప్రసూతిః।
మిథ్యోపచారః ప్రతికర్మణాం చ
నిజస్య హేతుః శ్వయథోః ప్రదిష్టః॥౫॥

తా॥ వమనవిరేచనములచే దేహశోధన జేసికొనుటచేనైనను జ్వరాది రోగములచేనైనను ఉపవాసముచేనైనను శరీరము కృశించి బలము నశించుట, కారమును పులుసును విశేషముగ సేవించుట, తీక్ష్ణంబులును ఉష్ణంబులును అజీర్ణకరంబులునైన పదార్థములను విశేషముగ సేవించుట, పెరుగు, పక్వముగాని పదార్థములు, మట్టి, ఆకుకూరలు, క్షీరమత్స్యాది పరస్పరవిరుద్ధ పదార్థములు, విషముచే దుష్టంబైన యన్నము, ఈ ద్రవ్యములను విశేషముగ సేవించుట, మూలవ్యాధి కల్గియుండుట, పనులు లేకుండుట, విరేచనాదులచే దేహశోధన జేయవలసినప్పుడు శోధనజేయకుండుట, మర్మస్థలములయందు విరేచనాదులచే నభిఘాతము గల్గుట, విరుద్ధంబైన అకాలాది ప్రసవము గల్గుట, వమనవిరేచనాదులయందు అపథ్యములు జేయుట, ఇవి యన్నియు శోఫ జనించుటకు కారణములని యెఱుంగునది.

## శోఫ సామాన్యలక్షణము

శ్లో॥ సగౌరవం స్యాదనవస్థితత్వం
సోత్సేధ మూష్మాథ సిరాతనుత్వమ్।
సలోమహర్షశ్చ వివర్ణతా చ
సామాన్యలిఙ్గం శ్వయథోః ప్రదిష్టమ్॥౬॥

తా॥ వాపు మిగుల నున్నతంబై మొద్దుబారి చంచలముగ నుండుట, ఉష్ణము, సిరల వ్యాపించియుండుట, గగురుపాటు గల్గుట, శరీరము వివర్ణంబైయుండుట, ఇవి యన్నియు శోఫయందు సామాన్యముగ జనించు లక్షణములని యెఱుంగునది.

## వాతజనిత శోఫ లక్షణము

శ్లో॥ చల స్తనుత్వక్పరుషోఽరుణోఽసిత
స్ప్రసుప్తిహర్షార్తియుతోఽనిమిత్తతః।
ప్రశామ్యతి ప్రోన్నమతి ప్రపీడితో
దివా బలీ చ శ్వయథు స్సమీరణాత్ ॥౭॥

తా॥ వాపు నిల్కడలేక చంచలమై యుండుట, చర్మము పలచనై కఠినముగను అరుణ వర్ణంబుగను నల్లనిరంగు కల్గియు స్పర్శమును జాలియుక తిమురుగల్గి నొప్పితోగూడియు నుండుట, కారణములేకనే తనంతట శమించుట, పిసికినయెడ వృద్ధినొందుట, పగటియందు ప్రబలముగ నుండుట, ఈలక్షణములు కల్గినది వాతముచే జనించిన శోఫయని యెఱుంగునది.

## పిత్తజనితశోఫ లక్షణము

శ్లో॥ మృదుస్సగన్ధోఽసితపీతరాగవా
న్భ్రమజ్వరస్వేదతృషామదాన్వితః।
య ఉష్యతే స్పర్శరుగక్షిరాగకృ
త్సపిత్తశోఫో భృశదాహపాకవాన్ ॥౮॥

తా॥ వాపు మృదువై వాసనతో గూడియుండుట, నలుపు పసుపు ఎరుపు రంగులుకల్గియుండుట, భ్రమము, జ్వరము, చెమట, దప్పి, మదము, మంటయును నొప్పియు గల్గియుండుట, కన్నులెఱ్ఱనై యుండుట, మిక్కిలి మంట గల్గి పచుచుట, ఈలక్షణములు కల్గినది పిత్తముచే జనించిన శోఫయని యెఱుంగునది.

## కఫజనితశోఫ లక్షణము

శ్లో॥ గురుస్స్థిరః పాణ్డురరోచకాన్వితః
ప్రసేకనిద్రావమివహ్నిమాన్ద్యకృత్।
స కృచ్ఛ్రజన్మప్రశమో నిపీడితో
న చోన్నమేద్రాత్రిబలీ కఫాత్మకః ॥౯॥

తా॥ భారముగ కఠినమై యుండుట, పాండువర్ణము, అరోచకము, చొల్లుగారుట, అధికముగ నిదురవచ్చుట, వాంతి గల్గుట, అగ్నిమాంద్యము గల్గుట, మిగల కష్టముచే నుత్పత్తి నాశములు గల్గియుండుట, చేత నొత్తినపుడు పైకుబ్బక పల్లముబడుట, రాత్రివేళలయందు బలిష్ఠముగనుండుట, ఈలక్షణములు కల్గినది కఫముచే జనించిన శోఫయని యెఱుంగునది. ఇచ్చట రాత్రివేళలయందు స్రోతస్సులన్నియు నడ్డగించబడి యుండుటంజేసి కఫము మిక్కిలి వృద్ధినొందును గాన కఫముచే జనించిన శోఫ రాత్రులయందు వృద్ధినొందుననియు, పగటియందు స్రోతస్సులు తెరవబడియుండుటచేతను సంచారాది వ్యాపారములు కల్గియుండుటచేతను కఫము స్వల్పముగ నుండును గాన దాన జనించినశోఫకూడ స్వల్పముగ నుండుననియు నెఱుంగునది.

## ద్వంద్వజ సన్నిపాతజ శోఫలక్షణములు

శ్లో॥ నిదానాకృతి సంసర్గా చ్ఛ్వయథు స్స్యా ద్ద్విదోషజః।
సర్వాకృతి స్సన్నిపాతా చ్ఛోఫో వ్యామిశ్రలక్షణః॥౧౦॥

తా॥ రెండేసి దోషములయొక్క నిదానములును లక్షణములును ఒకటిగ జేరి జనించినది ద్విదోషజశోఫయనియు, త్రిదోషములయొక్క లక్షణములు కల్గియున్నయెడల సన్నిపాతజనితశోఫయనియు నెరుంగునది.

## ఆగంతుకశోఫ లక్షణము

శ్లో॥ అభిఘాతేన శస్త్రాదిచ్ఛేద భేదక్షతాదిభిః।
హిమానిలోదధ్యనిలై ర్భల్లాతకకపికచ్ఛుజైః॥౧౧॥
రసైః శూకైశ్చ సంస్పర్శాచ్ఛ్వయథుస్స్యా ద్విసర్పవాన్।
భృశోష్మా లోహితాభాసః ప్రాయశః పిత్తలక్షణః॥౧౨॥

తా॥ దండప్రహారాదులచే నభిఘాతము నొందుట, శస్త్రాదులచే భేదింపబడి గాయములగుట, మంచుగాలి, సముద్రపుగాలి, జీడిగింజలరసము, దురదగొండిరసము, ముల్లు, వీనిసంబంధము గల్గుట, ఈకారణములచేత వాపు జనించి శరీరమునందెల్ల వ్యాపించును. అట్టి శోఫ మిగుల నుష్ణంబై యెఱ్ఱని రంగుకల్గి తరుచుగ పిత్తశోఫలక్షణములతో గూడి యుండును. దీనిని యభిఘాతముచే జనించిన శోఫ యని వచించెదరు.

## విషజనితశోఫ లక్షణము

శ్లో॥ విషజ స్సవిషప్రాణిపరిసర్పణమూత్రణాత్।
దంష్ట్రాదన్తనఖాఘాతా దవిషప్రాణినామపి॥౧౩॥
విణ్మూత్రశుక్రోపహతమలవద్వస్త్రసంకరాత్।
విషవృక్షానిలస్పర్శా ద్గరయోగావచూర్ణనాత్॥౧౪॥
మృదు శ్చలోఽవలమ్బీ చ శీఘ్రో దాహరుజాకరః।

తా॥ విషజంతువులైన సర్పాదులు శరీరముపై ప్రాకుట, వాని మూత్రము శరీరముపై బడుట, విషరహితంబులగు జంతువులయొక్క కోరలు దంతములు గోళ్లు మొదలగువానిచే నభిఘాతము గల్గుట, విషయుక్తంబులగు సర్పాదులయొక్క మల మూత్ర శుక్రములతో గూడిన వస్త్రముల ధరించుట, మలినంబులగు వస్త్రముల ధరించుట, విషవృక్షములను స్పృశించుట, విషముతో గూడిన గాలిని స్పృశించుట, విషయుక్తంబైన ఔషధమును శరీరమున బూసికొనుట, ఈకారణముల చేత జనించు శోఫ విషముచే జనించినది యని యెరుంగునది. ఈ శోఫయందు మృదుత్వము, చలించుట, వ్రేలాడుట, శీఘ్రముగ వ్యాపించుట, మంటయు నొప్పియు విశేషముగ జనించుట, ఈలక్షణములు కల్గును.

## శోథోత్పత్తి క్రమము

శ్లో॥ దోషాశ్శ్వయథుమూర్ధ్వం హి కుర్వన్త్యామాశయస్థితాః॥౧౫॥
పక్వాశయస్థా మధ్యే తు వర్చస్థానగతాస్త్వధః।
కృత్స్నదేహ మను ప్రాప్తాః కుర్యుస్సర్వసరం తథా॥౧౬॥

తా॥ వాత పిత్త శ్లేష్మములు ఆమాశయమున నున్నయెడ రోమ్ముననుపైభాగమున శోఫను గల్గించును. పక్వాశయమున నున్నయెడ రొమ్మునకును పక్వాశయస్థానమునకును నడుమ శోఫను కల్గించును. మలకోశమున నున్నయెడ పక్వాశయమునకు క్రింద శోఫను కల్గించును. దేహమునందంతట వ్యాపించి యున్నయెడ సర్వావయవములయందును శోఫను కల్గించును. ఇట్లిదంబుగ శోఫోత్పత్తిక్రమము నెరుంగునది.

## అసాధ్యశోఫ లక్షణములు

శ్లో॥ యో మధ్యదేశే శ్వయథుః కష్టస్సర్వగశ్చ యః।
అర్ధాఙ్గేఽరిష్టభూతశ్చ యశ్చోర్ధ్వం పరిసర్పతి॥౧౭॥

తా॥ మధ్యభాగమున జనించిన శోఫయు, సకలావయవములయందు వ్యాపించియుండు శోఫయు, అర్ధశరీరమున రోగరూపమునొంది జనించిన శోఫయు, శరీరమునందధోభాగమున జనించి పైకి వ్యాపించు శోఫయు అసాధ్యంబని యెరుంగునది. ఇచ్చట "యస్తు పాదాభినిర్వృత్తః శోథస్సర్వాఙ్గగో భవేత్ । పురుషం హన్తి నారీం చ ముఖజో గుహ్యజో ద్వయమ్" అని తన్త్రాన్తరమున నుండుటచే పురుషులను పాదములయందు జనించి యూర్ధ్వముగ వ్యాపించు శోఫయు, స్త్రీలను ముఖమున జనించి క్రిందుగ వ్యాపించు శోఫయు, గుహ్యస్థలముల జనించు శోఫయు, అసాధ్యంబని యెరుంగునది.

శ్లో॥ శ్వాసః పిపాసా ఛర్దిశ్చ దౌర్బల్యం జ్వర ఏవ చ।
యస్య చాన్నే రుచిర్నాస్తి శ్వయథుం తం వివర్జయేత్॥౧౮॥

తా॥ మరియు శ్వాసము, దప్పి, వాన్తి, దుర్బలత్వము, జ్వరము, అన్నద్వేషము, ఈ యుపద్రవములతోఁగూడిన శోఫ అసాధ్యంబుగాన చికిత్స సేయం జనదని భావము.

శ్లో॥ అనన్యోపద్రవకృతః శోథః పాదసముత్థితః।
పురుషం హన్తి నారీం చ ముఖజో గుహ్యజో ద్వయమ్॥౧౯॥

తా॥ పాండువ్యాధులు మొదలగు ఇతరవ్యాధులకు నుపద్రవరూపంబుగాక స్వనిదానము చేత నేపాదములయందు బొడమిన శోఫ పురుషులను మరణము నొందించును. అవ్విధంబుగనే ముఖమున జనించిన శోఫ స్త్రీలను మరణము నొందించును. గుహ్యస్థలమున (వస్తియందు) జనించిన శోఫ స్త్రీపురుషుల నిరువురను మరణము నొందించునని భావము.

మరియు "ఊర్ధ్వగామీ నరం పద్భ్యామధోగామీ ముఖాత్స్త్రియమ్।
ఉభయం వస్తిసంజాతః శోథో హన్తి న సంశయః" అని తన్త్రాన్తరమున నుండుట

పురుషులకు పాదముల బొడమి యూర్ధ్వముగ వ్యాపించు శోఫయు, స్త్రీలకు ముఖమున జనించి పాదములకు వ్యాపించు శోఫయు అసాధ్యంబనియు; పొత్తికడుపున జనించిన శోఫ స్త్రీపురుష సామాన్యముగ నసాధ్యంబనియు భావము.

మరికొన్ని సాధ్యాసాధ్య లక్షణములు

శ్లో॥ సర్వోఽనుపద్రవశ్శోథస్సాధ్యోఽసాధ్యః పురేరితః॥
వివర్జయేత్కుక్ష్యుదరాశ్రితం చ
తథా గళే మర్మణి సంశ్రితం చ।
స్థూలః ఖరశ్చాపి భవేద్వివర్జ్యో
యశ్చాపి బాలస్థవిరాబలానామ్॥౨౦॥

ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
శోథనిదానం సమాప్తమ్



తా॥ మరియు నూతనముగ జనించి ఉపద్రవములు లేకుండు శోఫ సాధ్యంబైయుండును. ఉపద్రవములతోగూడిన శోఫయు, కుక్షి, ఉదరము, కంఠము, మర్మస్థలములు, ఈస్థలముల నాశ్రయించిన శోఫయు, మిగుల స్థూలంబై కఠినంబుగనుండు శోఫయు, పసివాండ్రకును ముసలివాండ్రకును దుర్బలులకును జనించిన శోఫయు నసాధ్యంబని భావము.

మరియు చరకమున శోథోపద్రవము లిత్తెరంగున నున్నవి—"ఛర్దిస్తృష్ణాఽరుచిశ్శ్వాసో జ్వరోఽతీసార ఏవ చ। సప్తకోఽయం సదౌర్బల్యశ్శోథోపద్రవసంగ్రహః" వాంతి, దప్పి, అరుచి, శ్వాసము, జ్వరము, అతిసారము, దుర్బలత్వము, ఇవి యేడును శోఫవ్యాధిచే గల్గు ఉపద్రవంబు లని భావము. సుశ్రుతమునందు శోథోపద్రవములు ప్రకారాన్తరముగ జెప్పంబడినవి. "శ్వాసః పిపాసా దౌర్బల్యం జ్వరశ్ఛర్దిరరోచకః। హిక్కాఽతీసారకాసశ్చ శోథినం క్షపయన్తి హి।" శ్వాసము, దప్పి, బలహీనము, జ్వరము, వాంతి, అరోచకము, వెక్కిళ్లు, అతిసారము, దగ్గు, ఇవి శోఫవ్యాధిచే గల్గు నుపద్రవములు గాన ఈ యుపద్రవములతోగూడిన శోఫ అసాధ్యంబని భావము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమగోత్ర
విరాజమాన దివ్యన్యహాయ రామకృష్ణార్యతనూభవ సకలసద్విద్యా
విధేయ "ఆయుర్వేద మార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపిక యను
మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు
శోఫనిదానము సమాప్తము

శ్రీసా॰య శ్రీవా॰య నమః

# శ్రీరస్తు



# వృద్ధి నిదానమ్



శోఫనిదానానన్తరము దానికి సమానరూపంబైన యండవృద్ధియొక్క నిదానమును జెప్పుట.



## అండవృద్ధి సంప్రాప్తి

శ్లో॥ క్రుద్ధోఽధోగామినో వాయు శ్శోఫ శూలకరశ్చరన్।
ముష్కౌ వఙ్క్షణతః ప్రాప్య ఫలకోశాభివాహినీః॥౧॥
ప్రపీడ్య ధమనీ ర్వృద్ధిం కరోతి ఫలకోశయోః।
దోషాస్రమేదోమూత్రాన్త్రైస్సవృద్ధిస్సప్తధా గదః ॥౨॥
మూత్రాన్త్రజావప్యనిలా ద్ధేతుభేదస్తు కేవలమ్।

తా॥ శరీరమునం దధోగమనముగల వాతము ప్రకుపితంబై వృషణములయందును గజ్జలయందును వ్యాపించుచు అండకోశములను అండములను వ్యాపించియుండు నాడులను దుష్టములుగ జేసి అండములయందును అండకోశములయందును వాపును పోటును కల్గించుచు వృద్ధినొందించును. దీనిని వృద్ధియను రోగమని చెప్పుదురు. ఈ వ్యాధి వాతము, పిత్తము, శ్లేష్మము, రక్తము, మేదస్సు, మూత్రము, అంత్రములు (పేగులు), అను నీయేడింటిచే వేర్వేరుగ జనించుట జేసి సప్తవిధంబులుగ నుండును. మూత్రాన్త్రములచే జనించిన వృద్ధియందు వాతము ముఖ్యకారణమై యున్నను చికిత్సాభేదముకొరకు కారణభేదముగ చెప్పంబడియెనని యెరుంగునది.

## వాతజాదివృద్ధి లక్షణములు

శ్లో॥ వాతపూర్ణ దృతిస్పర్శో రూక్షో వాతాదహేతుకమ్॥౩॥
పక్వోదుమ్బరసఙ్కాశః పిత్తా ద్దాహోష్మపాకవాన్।
కఫాచ్ఛీతో గురుస్స్నిగ్ధః కణ్డూమాన్కఠినోఽల్పరుక్॥౪॥
కృష్ణస్ఫోటావృతః పిత్తవృద్ధిలిఙ్గశ్చ రక్తజః।
కఫవన్మేదసా వృద్ధిర్మృదుస్తాలఫలోపమః॥౫॥

మూత్రధారణశీలస్య మూత్రజః సతు గచ్ఛతః।
అమ్భోభిః పూర్ణదృతివత్ క్షోభం యాతి సరుఙ్మృదుః॥౬॥
మూత్రకృచ్ఛ్ర మధస్స్వచ్ఛ చాలయేత్ ఫలకోశయోః।

తా॥ స్పృశించినయెడ వాతముచే నిండియుండు తిత్తివలెనుండి కారణములేకనే మిగుల రూక్షంబై యున్నయెడ వాతముచే జనించిన అండవృద్ధియనియు; పండిన మేడిపండువలెనుండి మంటయు ఉష్ణంబును కల్గినది పిత్తముచే జనించిన వృద్ధియనియు; శీతలము, భారముగ నుండుట, నునుపు గల్గియుండుట, దురదగల్గియుండుట, మిగుల కఠినంబుగ నుండుట, ఈ లక్షణములు కల్గినది కఫముచే జనించిన వృద్ధియనియు; నల్లని బొబ్బలతోగూడి పిత్తజవృద్ధిలక్షణములతో గూడియుండువది రక్తముచే జనించిన వృద్ధియనియు, మృదువై తాటిపండువలె వట్రువగానుండి కఫజనితవృద్ధి లక్షణములతో గూడియుండునది మేదస్సుచే జనించిన వృద్ధియనియు; మూత్రమును సకాలమున విసర్జించక నిరోధించువానికి అట్టి మూత్రనిరోధముచే జనించి నీళ్ళచే నిండియుండు తిత్తివలె చలించుచు వేదనకల్గి మృదువుగా నుండునది మూత్రవృద్ధియనియు నెరుంగునది. మరియు నీమూత్రజవృద్ధియందు అండకోశములక్రింద చలించుచు మూత్రకృచ్ఛ్రవ్యాధియందు జనించు బాధలు కల్గునని భావము.

## ఆన్త్రవృద్ధి లక్షణము

శ్లో॥ వాతకోపిభి రాహారైః శీతతోయావగాహనైః॥౭॥
ధారణేరణ భారాధ్వవిషమాఙ్గ ప్రవర్తనైః।
క్షోభణైః క్షోభితోఽన్యైశ్చ క్షుద్రాన్త్రావయవం యదా॥౮॥
పవనో విగుణీకృత్య స్వనివేశా దధో నయేత్।
కుర్యాద్వఙ్క్షణ సన్ధిస్థో గ్రన్థ్యాభం శ్వయథుం తదా॥౯॥

తా॥ వాతమును ప్రకోపింపంజేయు పదార్థముల భుజించుట, చల్లని నీళ్లయందు మునుగుట, మలమూత్రములను విసర్జించక నిరోధించుట, బలాత్కారముచే మలమూత్రములను వెడలించుట, భారమును మోయుట, త్రోవనడచుట, అవయవములను విషమములుగ నునిచి పొరలాడుట, బలవంతులతో యుద్ధముజేయుట, ధనువు నాకర్షించుట, ఇట్టి కారణములచేత వాతము ప్రకుపితంబై సన్నపు పేగులో నొకభాగమును సంకోచింపజేసి తననెలవునుండి క్రిందికి వెడలించును; అట్టి పేగు గజ్జలయందు జేరి గ్రన్థిరూపంబైన వాపును గల్గించునని యర్థము. మఱియు "ఆన్త్రం ద్విగుణమాదాయ జన్తోర్నయతి వఙ్క్షణమ్। వఙ్క్షణాత్తద్భుజాయుక్తం ఫలకోశం ప్రపద్యతే" అని భోజుండు చెప్పియుండుటంజేసి అట్టి పేగు గజ్జలలో గ్రంథిరూపమైన వాపును కల్గించి యా గ్రంథి కాలాన్తరమునం దండకోశమునజేరి బాధలను గల్గించి వృద్ధిరూపముగ పరిణమించునని భావము. మరియు నిది గ్రంథిరూపముగ నున్నపుడు సాధ్యంబనియు, వృద్ధిరూపము నొందినపుడు అసాధ్యంబనియు నెరుంగునది.

బ్రధ్న లక్షణము తన్త్రాన్తరమున నీరీతిగ గానంబడియెడు: "అత్యభిష్యన్ది గుర్వన్న సేవనా న్నిచయం గతః, కరోతి గ్రన్థివచ్ఛోథం దోషో వఙ్క్షణసన్ధిషు। జ్వర శూలాఙ్గసాదాఢ్యం తం బ్రధ్నమితి నిర్దిశేత్॥" మిక్కిలి అభిష్యంది (స్రోతస్సుల యందు ద్రవమును బుట్టించు) పదార్థముల సేవించుట, అజీర్ణకరంబులగు అన్నాదుల భుజించుట, ఇట్టి కారణములచేత దోషము వృద్ధినొంది గజ్జలయొక్క సంధియందు గ్రంథివలెనుండు శోఫను గల్గించును. అందు జ్వరము, శూల, ఒడలు కృశించుట, ఈ లక్షణములు కల్గును. దీనిని బ్రధ్నంబను వ్యాధియని వచించెదరు.

అండవృద్ధి నుపేక్షించుటచే గల్గు బాధలు

శ్లో॥ ఉపేక్ష్యమాణస్య చ ముష్కవృద్ధిం
ఆధ్మానరుక్ స్తమ్భవతీం స వాయుః।
ప్రపీడితోఽన్తః స్వనవా న్ప్రయాతి
ప్రధ్మాపయన్నేతి పునశ్చ ముక్తః॥౧౦॥

తా॥ పైజెప్పిన యండవృద్ధి వాపు, పోటు, ఈకువు, ఈ లక్షణములు కల్గియున్న పురుషుడు చికిత్సజేయక యుపేక్షించినయెడ చేతితో పిసికినప్పుడు గుడగుడయను శబ్దముతోగూడి వాతము పైకెగయును. చేతిని వదలినయెడ మరల నా వాతము అండకోశమున జేరి యుబికించును. అట్టి సమయమున నసాధ్యంబగునని భావము.

శ్లో॥ అంత్రవృద్ధి రసాధ్యోఽయం వాతవృద్ధి సమాకృతిః॥

---

ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
వృద్ధినిదానం సమాప్తమ్

---

తా॥ మున్ను వచించిన అంత్రవృద్ధి అండముల నాశ్రయించి వాతవృద్ధికి సమానమైన లక్షణములు గల్గియున్నయెడ నసాధ్యంబై యుండునని భావము.

---

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్రవిరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపాలాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానార్థతాత్పర్యమునందు

వృద్ధినిదానము

స మా ప్త ము

శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# గలగణ్డ గణ్డమాలాఽపచీ గ్రన్థ్యర్బుద నిదానమ్



వృద్ధినిదానానన్తరము తత్సమాన రూపంబైన గలగణ్డనిదానము చెప్పబడుచున్నది.

## గలగణ్డసామాన్య లక్షణము

శ్లో॥ నిబద్ధశ్శ్వయథుర్యస్య ముష్కవల్లమ్బతే గలే।
మహాన్వా యది వా హ్రస్వో గలగణ్డం తమాదిశేత్ ॥౧॥

తా॥ కంఠమునందు వాపు నిలచి అండమువలె గొప్పదిగనైనను స్వల్పంబుగనైనను వ్రేలుచున్నయెడ దానిని గలగణ్డమని వచించెదరు.

## గలగణ్డ సంప్రాప్తి

శ్లో॥ వాతః కఫశ్చాపి గలే ప్రదుష్టో
మన్యే చ సంశ్రిత్య తథైవ మేదః।
కుర్వన్తి గణ్డం క్రమశస్స్వలిఙ్గై
స్సమన్వితం తం గలగణ్డమాహుః ॥౨॥

తా॥ వాతము, కఫము, మేదస్సు, ఈమూడును వేర్వేరుగ దుష్టంబులై మెడనరముల నాశ్రయించి పైనచెప్పిన లక్షణములతోఁగూడిన వాపును నానాటకల్గించును, దీనిని గలగణ్డమని వచించెదరు. వాత కఫ మేదస్సులచే గలగణ్డము మూడువిధంబులనియు, వ్యాధిస్వభావముచేత పిత్త గలగణ్డము లేదనియు భావము.

## వాతజ గలగణ్డ లక్షణము

శ్లో॥ తోదాన్వితః కృష్ణసిరావనద్ధః
శ్యావోఽరుణో వా పవనాత్మకస్తు।
పారుష్యయుక్తశ్చిరవృద్ధ్యపాకో
యదృచ్ఛయా పాకమియాత్కదాచిత్ ॥౩॥

వై రస్యమాస్యస్య చ తస్య జన్తో
ర్భవేత్తథా తాలుగలప్రశోషః।

తా॥ పోటు గల్గియుండుట, నల్లనినరములతో జుట్టబడియుండుట, శ్యామారుణ వర్ణంబులు గల్గియుండుట, మిగుల పరుషముగ నుండుట, చిరకాలమునకు వృద్ధినొందుట, పగలకుండుట, ఒకానొకప్పుడు కారణములేకనే పగులుట, నోరు విరసముగ నుండుట, దాళువలును కంఠంబును ఎండిపోవుట, ఈలక్షణములు కల్గినది వాతముచేజనించిన గలగండమని యెరుంగునది.

కఫజ గలగణ్డ లక్షణము

శ్లో॥ స్థిరస్సవర్ణో గురు రుగ్ర కణ్డూ
శ్శీతో మహాంశ్చాపి కఫాత్మకస్తు॥౪॥
చిరాభివృద్ధిం భజతే చిరాద్వా
ప్రపచ్యతే మన్దరుజః కదాచిత్।
మాధుర్యమాస్యస్య చ తస్య జన్తో
ర్భవేత్తథా తాలుగలప్రలేపః॥౫॥

తా॥ కఠినంబుగనుండుట, కఫమునకు సమానమైన వర్ణముగల్గియుండుట, మిగుల బరువుగ నుండుట, తీవ్రమైన దురద కల్గియుండుట, చల్లనైయుండుట, గొప్పదిగనుండుట, ఈ లక్షణములు కల్గినది కఫముచే జనించిన గలగండమని యెరుంగునది. ఈ గలగండము చిరకాలమునకు వృద్ధినొంది చిరకాలమునకు పగులును. ఒకప్పుడు స్వల్పమైన బాధ కల్గియుండును. నోరు తీపిగల్గియుండును. తాలువులును కంఠంబును బంకగా నుండును.

మేదోజగలగణ్డ లక్షణము

శ్లో॥ స్నిగ్ధో గురుః పాణ్డురనిష్టగన్ధః
మేదోభవః కణ్డుయుతోఽల్పరుక్చ।
ప్రలమ్బతేఽలాబువదల్పమూలో
దేహానురూపక్షయవృద్ధియుక్తః॥౬॥
స్నిగ్ధాస్యతా తస్య భవేచ్చ జన్తో
ర్గలేఽనుశబ్దం కురుతే చ నిత్యమ్।

తా॥ నునుపుగల్గి నిగనిగలాడుచుండుట, భారముగనుండుట, పాండువర్ణముగల్గియుండుట, దుర్గంధముతో గూడియుండుట, మిక్కుటమైన దురదయు స్వల్పమైన బాధయు కల్గియుండుట, ఈలక్షణములుకల్గినది మేదస్సుచే జనించిన గలగండమని యెరుంగునది. మరియు దీని మొదలు మిగుల స్వల్పముగనుండి సొరకాయవలె వ్రేలాడుచు దేహము వృద్ధినొందునపుడు వృద్ధినొందుచు దేహము కృశించునపుడు కృశతనొందుచు నుండును. ఈ వ్యాధియందు నోరు జిడ్డుగల్గి కంఠమున మాటలాడునపుడు ప్రతిధ్వని కల్గియుండును.

### అసాధ్యగలగణ్డ లక్షణములు

శ్లో॥ కృచ్ఛ్రాచ్ఛ్వసన్తం మృదుసర్వగాత్రం।
సంవత్సరాతీత మరోచకార్తమ్॥౭॥
క్షీణం చ వైద్యో గలగణ్డయుక్తం
భిన్నస్వరం చాపి వివర్జయేచ్చ।

తా॥ మిగుల కష్టముచే శ్వాసమును విడుచుట, శరీరమంతయు మృదువై యుండుట, ఒక సంవత్సరముదాటియుండుట, శరీరము కృశించుట, కంఠస్వరము మారియుండుట, ఈ లక్షణములు గలగండవ్యాధికలవానికి జనించినయెడ నసాధ్యంబై యుండును గాన భిషగ్వరుండు చికిత్సజేయక వదలియుండవలెనని భావము.

### గణ్డమాలా లక్షణము

శ్లో॥ కర్కన్ధుకోలామలక ప్రమాణైః
కక్షాంసమన్యా గల వఙ్క్షణేషు॥౮॥
మేదఃకఫాభ్యాం చిరమన్దపాకైః
స్యాద్గండమాలా బహుభిశ్చగణ్డైః।

తా॥ రేగుపండు, కమ్మరేగుపండు, ఉసిరికకాయ, వీనికి సమానమైన ప్రమాణముకల గ్రన్థులు మేదఃకఫములచేత చంకలు, భుజశిరస్సులు, పెడతలనుండు నరము, కంఠము, గజ్జెలు, ఈ స్థలములయందు వరుసగ జనించినయెడ గండమాలయని చెప్పంబడును. ఈగ్రన్థులు చిరకాలమునకు మెలమెల్లగ కొంచెముగ పగులును. అనేకగ్రన్థులు వరుసగ మాలారూపమై యుండుటం జేసి యీ వ్యాధి గండమాలయని చెప్పంబడును.

గండమాలాలక్షణములను భోజుండిత్తెరంగున నుడివెను: "వాతపిత్తకఫా వృద్ధా మేదశ్చాపి సమాచితమ్ । జఙ్ఘయోః కణ్డరాం ప్రాప్య మత్స్యాణ్డసదృశాన్ బహూన్ । కుర్వన్తి గ్రథితాన్ తేభ్యః పునః ప్రకుపితోఽనిలః । తాన్ దోషానూర్ధ్వగో వక్షఃకక్షమన్యాగలాశ్రితః । నానాప్రకారాన్ కురుతే గ్రన్థీన్ సాత్వపచీ మతా । అపచీ కంఠమన్యాసు కక్షవఙ్క్షణసన్ధిషు । గణ్డమాలాం విజానీయాత్ అపచీతుల్యలక్షణామ్॥" వాత పిత్త కఫములును మేదస్సును వృద్ధినొంది పిక్కయందుండు కండరలజేరి మత్స్యములయొక్క గ్రుడ్డులంబోలిన గ్రంథులను కల్గించును; అట్టి గ్రంథులవలన వాతము మిక్కిలి ప్రకోపమునొంది శరీరమునం దూర్ధ్వభాగము వక్షఃస్థలము, కక్షములు, పెడతలనరము, కంఠము, ఈస్థలములయందు నానావిధంబులగు గ్రన్థులను కల్గించును; దీనిని అపచి యను వ్యాధియని వచించెదరు; అట్టి అపచీవ్యాధి కంఠము, పెడతలనరము, చంకలు, గజ్జలు, ఈ స్థలములయందు జనించి అపచీలక్షణములతో గూడియున్నయెడ గండమాల యని చెప్పంబడునని భావము. ఈ వచనముచేత వాతపిత్తములచే గూడ గండమాల జనించునని తెలియ

బడుచున్నది గాన ప్రకృతమూలమున "మేదః కఫాభ్యాం" అను పదమునకు ఈ వ్యాధియందు దూష్యంబైన మేదస్సును దోషంబైన కఫంబును ప్రధానంబులై యుండుననియు తక్కిన వాత పిత్తములు అప్రధానంబులై యుండుననియు భావము నెరుంగునది. మరియు "మేదఃకఫాత్ శోణితసంచయోత్థో గలస్య మధ్యే గలగండ ఏకః। స్యాద్గండమాలా బహుభిశ్చ గండైః" అని చరకమున నుండుటంజేసి మేదః కఫములచేత రక్తము వృద్ధినొంది కంఠమధ్యమున నొక్క గ్రంథి జనించినయెడ నయ్యది గలగండమనియు; మెడయందు అనేక గ్రంథులు జనించినచో గండమాలయనియు, గండమాలకు కంఠమే స్థానమనియు తెలియుచున్నది.

అపచీ లక్షణము

శ్లో॥ తే గ్రంథయః కేచిదవాప్తపాకాః స్రవన్తి
నశ్యన్తి భవన్తి చాన్యే॥౯॥
కాలానుబన్ధం చిరమాదధాతి
సైవాపచీతి ప్రవదన్తి తద్జ్ఞాః।
సాధ్యాస్స్మృతాః పీనసపార్శ్వశూలకాస
జ్వరచ్ఛర్దియుతాస్త్వసాధ్యాః॥౧౦॥

తా॥ పై చెప్పిన గండమాలారూపమైన గ్రంథులు చిరకాలమునుండి యనుసరించి అందు కొన్ని పగిలి స్రవించి కొన్ని నశించి మరల జనించుచున్నయెడ అపచియని చెప్పంబడునని భావము. ఈ యపచీగ్రంథులు సామాన్యముగ సాధ్యంబులై యుండును. పీనస, పక్కనొప్పి, దగ్గు, జ్వరము, వాంతి, ఈ యుపద్రవములతో గూడియున్న యెడ నసాధ్యంబులై యుండును. ఇచ్చట "అపరాపరోపచీయమానతయా అపచీ" అను వ్యుత్పత్తిచేత ఒకటివెనుక మరియొకటి జనించి వృద్ధినొందుచుండునది అపచియని యెరుంగునది. ఈయర్థము సుశ్రుతమునందు "చయప్రకర్షాదపచీం వదన్తి" అని చెప్పబడియున్నది. మాలికవలె వరుసగా జనించినది గండమాలయనియు, అట్టినియమములేక అనేకములుగ జనించునది అపచియనియు నీరెంటికిని భేదము నెరుంగునది.

గ్రంథి లక్షణము

శ్లో॥ వాతాదయో మాంసమసృక్ప్రదుష్టా
స్సన్దూష్య మేదశ్చ తథా సిరాశ్చ।
వృత్తోన్నతం విగ్రథితం చ శోథం
కుర్వన్త్యతో గ్రన్థిరితి ప్రదిష్టః॥౧౧॥

తా॥ వాత పిత్త కఫంబులు దుష్టంబులై మాంసము, రక్తము, మేదస్సు, సిరలు వీనినన్నింటిని దుష్టములుగజేసి వర్తులంబును ఉన్నతంబును కఠినంబునైన శోఫను కల్గించును. దానంజేసి గ్రంథియని చెప్పంబడును.

### వాతజగ్రన్థి లక్షణము

శ్లో॥ ఆయమ్యతే వృశ్చ్యతి తుద్యతే చ
ప్రత్యస్యతే మథ్యతి భిద్యతే చ।
కృష్ణో మృదుర్వ స్తిరివాతతశ్చ।
భిన్నస్స్రవేచ్చానిలజోఽస్రమచ్ఛమ్॥౧౨॥

తా॥ ఈడ్వబడినట్లుండుట, ఛేదింపబడినట్లుండుట, సూదుల బొడిచినట్లుండుట, కొట్టబడి నట్లుండుట, కలియబెట్టిన విధంబుగ నుండుట, పగలగొయునట్లుండుట, నల్లనిరంగుకల్గి మృదువైన తిత్తివలె విశాలమైయుండుట, ఈ లక్షణములతోగూడి పగిలినప్పుడు నిర్మలమైన రక్తమును స్రవించునది వాతముచే జనించిన గ్రన్థియని యెరుంగునది.

### పిత్తగ్రన్థి లక్షణము

శ్లో॥ దన్దహ్యతే ధూప్యతి చూష్యతే చ
పాపచ్యతే ప్రజ్వలతీవ చాపి।
రక్తస్సపీతోఽప్యథవాపి పిత్తా
ద్భిన్నస్స్రవేదుష్ణమతీవ చాస్రమ్॥౧౩॥

తా॥ అగ్నిచే మిక్కిలి కాల్చబడినట్లుండి లోపలినుండి పొగవెడలు విధంబుగ మంట గల్గుట, చీలువబడిన విధంబుగ నుండుట, క్షారాదులచే పక్వముచేయబడినట్లుండుట, జ్వలించు నట్లుండుట, ఈ లక్షణములతోగూడి రక్తవర్ణంబైనను పసుపురంగైనను కల్గి పగిలినప్పుడు మిగుల నుష్ణంబైన రక్తమును స్రవించునది పిత్తముచే జనించిన గ్రంథియని యెరుంగునది.

### కఫజగ్రన్థి లక్షణము

శ్లో॥ శీతోఽవివర్ణోఽల్పరుజోఽతికణ్డూః
పాషాణవత్సంహననోపపన్నః।
చిరాభివృద్ధశ్చ కఫప్రకోపాద్భిన్న
స్స్రవేచ్ఛుక్లఘనం చ పూయమ్॥౧౪॥

తా॥ చల్లగనుండుట, స్వాభావికమైన వర్ణము గల్గియుండుట, స్వల్పమైన బాధగల్గియుం డుట, అధికముగ దురద గల్గియుండుట, రాయివలె కఠినముగ నుండుట, ఈలక్షణములతోగూడి చిరకాలమువరకు వృద్ధినొంది పగిలినప్పుడు తెల్లని రంగుకల్గి చిక్కనై యుండు చీమును స్రవించు నది కఫప్రకోపముచే జనించిన గ్రన్థియని యెరుంగునది.

### మేదోజగ్రన్థి లక్షణము

శ్లో॥ శరీరవృద్ధిక్షయవృద్ధిహానిస్స్నిగ్ధో
మహాన్ కణ్డుయుతోఽరుజశ్చ।
మేదఃకృతో గచ్ఛతి చాత్ర భిన్నే
పిణ్యాకసర్పిఃప్రతిమన్తు మేదః॥౧౫॥

తా॥ శరీరమువృద్ధినొందినపుడు వృద్ధినొంది క్షీణంబగునెడ క్షయమునొందుచు నునుపు గల్గి యధికమైన దురదతోఁగూడి బాధలేక గొప్పదిగా నుండునది మేదస్సుచే జనించిన గ్రన్థియని యెరుంగునది. ఈ గ్రన్థి పగిలినపుడు గానుగపిండివలెను పేరిననేతివలె నుండు మేదస్సును స్రవించును. మరియు నీమేదోగ్రన్థిలక్షణమును భోజుం డీరీతిగ జెప్పెను. "మేదో వాయు ర్యదా మాంసే విక్షిపే దథవా త్వచి। తత్ర మేదోభవగ్రన్థిః శ్యావో భవతిపాణ్డురః॥ కృశేః కృశే మహాన్స్థూలే గ్రన్థిర్భిన్నశ్చ పీడితః। తిలకల్కనిభస్స్రావో ఘృతవచ్చాస్య జాయతే" వాతము ప్రకుపితంబై మేదస్సును మాంసమునందైనను చర్మమునందైనను చేర్చినపుడు అచ్చట మేదస్సుచే గ్రన్థి జనించును. ఆ గ్రన్థి శ్యామలవర్ణంబును పాండువర్ణంబునై యుండును. మరియు శరీరము వృద్ధినొందునపుడు వృద్ధినొందుచు కృశించునపుడు కృశతనొందుచుండును. పగిలినపుడు గానుగపిండివలెను పేరిననేతివలెనుండు చీము స్రవించునవి భావము.

## సిరాజ గ్రన్థి లక్షణము

శ్లో॥ వ్యాయామజాతైరబలస్య తైస్తై
రాక్షిప్యవాయుస్తు సిరాప్రతానమ్।
సంకుచ్య సంపిణ్డ్య విశోష్య చాపి
గ్రన్థిం కరోత్యున్నతమాశువృత్తమ్॥౧౬॥
గ్రన్థిస్సిరాజస్స తు కృచ్ఛ్రసాధ్యో
భవేద్యది స్యాత్సరుజ శ్చలశ్చ।
స చారుజశ్చాప్యచలో మహాంశ్చ
మర్మోత్థితశ్చాపి వివర్జనీయః॥౧౭॥

తా॥ బలహీనుండగు పురుషుండు శరీరమున కాయాసము కల్గించెడి నానావిధంబులైన పనుల జేయుటవలన వాతము ప్రకుపితంబై సిరాజాలము నీడ్చి సంకోచమునొందజేసి యొక్కచో గుమిగ కూర్చి శోషింపజేసి వర్తులంబును ఉన్నతంబునైన గ్రన్థిని కల్గించును. దీనిని సిరాజ గ్రన్థియని వచించెదరు. ఈ గ్రంథి కృచ్ఛ్రసాధ్యంబై యుండును. మరియు నీగ్రంథి నొప్పిగల్గి చంచలంబై యున్నయెడ సాధ్యంబై యుండును. బాధలేక నిశ్చలంబై యున్నను మర్మస్థానములయందు జనించినను అసాధ్యంబుగ నుండునని యెరుంగునది. మరియు "పఞ్చైతానరుజోగ్రన్థీన్మర్మజానచలాం స్త్యజేత్। కపోలగల మన్యాసు దుశ్చికిత్స్యాశ్చ సన్థిషు" అని భోజుండు వచించెను. పైజెప్పిన ఐదువిధంబులగు గ్రంథులును బాధలేక నిశ్చలంబులై యున్నయెడ నసాధ్యంబులనియు, గండస్థలములయందును కంఠమునందును పెడతలనరమునందును జనించిన గ్రంథు లసాధ్యంబులనియు భావము. ఈ వాక్యముచేత ప్రకృత గ్రన్థమునందును గ్రంథి సామాన్యముల బాధలేక నిశ్చలంబై యున్నయెడ నసాధ్యంబై యుండునని యర్థము చెప్పుట సమంజసమని యెరుంగునది.

అర్బుద సమ్ప్రాప్తి

శ్లో॥ గాత్రప్రదేశే క్వచిదేవ దోషాః
సంమూర్ఛితా మాంసమసృక్ప్రదూష్య।
వృత్తం స్థిరం మన్దరుజం మహాన్తమనల్ప
మూలం చిరవృద్ధ్య పాకమ్॥౧౮॥
కుర్వన్తి మాంసోచ్ఛ్రయ మత్యగాధం
తదర్బుదం శాస్త్రవిదో వదన్తి।

తా॥ శరీరమునందెచ్చటనైన నొకచోట వాతాది దోషములు ప్రకోపమునొంది రక్త మాంసములను చెరచి వర్తులంబును, కఠినంబును, స్వల్పబాధ కల్గినదియు, గొప్పదియు, గాఢమైన మూలముకల్గినదియు, చిరకాలమునకు వృద్ధినొంది పరిపక్వంబగునదియునైన మాంసపిండమును కల్గించును. దీనిని అర్బుదమని శాస్త్రజ్ఞులు వచించెదరు. ఈ వ్రణము మిగుల లోతులో కల్గును.

అర్బుదభేదములు

శ్లో॥ వాతేన పిత్తేన కఫేన చాపి
రక్తేన మాంసేన చ మేదసా వా॥౧౯॥
తజ్జాయతే తస్య చ లక్షణాని
గ్రన్థేస్సమానాని తదాభవన్తి।

తా॥ ఈయర్బుదవ్యాధి వాత పిత్త కఫ రక్త మాంస మేదస్సులచే వేర్వేరుగ జనించుటంజేసి ఆరువిధంబులగును. అందు వాత పిత్త కఫ మేదస్సులచే జనించిన యర్బుదములు వరుసగా నీనాల్గిటిచేజనించిన గ్రంథులతో సమానములైన లక్షణములుకల్గియుండునని భావము.

రక్తార్బుద లక్షణము

శ్లో॥ దోషః ప్రదుష్టో రుధిరం సిరాశ్చ
సంకుచ్య సంపిణ్డ్య తతస్త్వపాకమ్॥౨౦॥
నాస్రావమున్నహ్యతి మాంసపిండం
మాంసాఙ్కురైరాచితమాశు వృద్ధిమ్।
కరోత్యజస్రం రుధిరప్రవృత్తిం
అసాధ్యమేతద్రుధిరాత్మకం తు॥౨౧॥
రక్తక్షయోపద్రవపీడితత్వా
త్పాణ్డుర్భవేదర్బుదపీడితస్తు।

తా॥ దోషములు ప్రకోపమునొంది రక్తమును విశేషముగ చెరచి సిరలను సంకోచము నొందించి యొక్క చోట గుంపుగ జేర్చి మాంసపిండము నున్నతముగ జేయును. అట్టి మాంసపిండము

కొంచెముగ పగిలి స్రవించుచు మాంసపుముల్కలతో గూడి శీఘ్రముగ వృద్ధినొందును. ఎల్లప్పుడు రక్తమును స్రవించుచుండును. దీనిని రక్తముచే కల్గిన యర్బుదమని యెరుంగునది. ఈ వ్యాధి మిగుల నసాధ్యంబై యుండును. రక్తక్షయరూపమైన ఉపద్రవముచే పీడింపబడియుండుటచే నీ వ్యాధికల మనుజుండు పాండువర్ణముకల్గియుండును.

## మాంసార్బుద లక్షణము

శ్లో॥ ముష్టిప్రహారాదిభిరర్దితేఽఙ్గే
మాంసం ప్రదుష్టం జనయేద్ధి శోథమ్॥౨౨
అవేదనం స్నిగ్ధమనన్యవర్ణం
అపాకమశ్మోపమమప్రచాల్యమ్।
ప్రదుష్టమాంసస్య నరస్య గాఢ
మేతద్భవేన్మాంసపరాయణస్య॥౨౩॥
మాంసార్బుదం త్వేతదసాధ్యముక్తమ్

తా॥ శరీరమునందు పిడికిటిపోటు మొదలగు ప్రహారములచే మాంసము చెడి వాపు కల్గును; ఆట్టి వాపు నొప్పిలేక నునుపుగల్గి శరీరమునకు సమానమైన వర్ణముతో గూడి పగలక రాయివలె కఠినంబై నిశ్చలముగ నుండును దీనిని మాంసార్బుదమని వచించెదరు. ఈ వ్యాధి మాంసము చెడిన వానికిని ఎల్లప్పుడు మాంసమును భుజించువానికిని విశేషముగ జనించును. ఈ మాంసార్బుదము మిగుల నసాధ్యంబై యుండును. ఇచ్చట రక్తార్బుదమునందు పిత్తము కారణమనియు మాంసార్బుదమున వాతము కారణమనియు దోషము నెరుంగునది. మరియు అర్బుదసామాన్యముగ రక్తమాంసములు దుష్టంబులైనను రక్తార్బుదమున రక్తంబును మాంసార్బుదమున మాంసంబును విశేషముగ దుష్టంబులగునని భావము.

## అసాధ్యార్బుద లక్షణములు

శ్లో॥ సాధ్యేష్వపీమాని తు వర్జయేచ్చ।
సంప్రస్రుతం మర్మణి యచ్చ జాతం
స్రోతస్సు వా యచ్చ భవేదచాల్యమ్॥౨౪॥

తా॥ వ్యాధి స్వభావముచే పాకము నొందకున్నను, చర్మము పగిలి స్వల్పముగ స్రవించుచున్నను, మర్మస్థలములయందు జనించినను, నాసాద్వారమమున్నుగాగల స్రోతస్సులయందు జనించినను, చలనము లేక స్థిరమైయున్నను, సాధ్యలక్షణములతో గూడిన యర్బుదముకూడ నసాధ్యంబై యుండునని భావము.

## అధ్యర్బుద ద్విరర్బుద లక్షణములు

శ్లో॥ యజ్జాయతేఽన్యత్ఖలు పూర్వజాతే
జ్ఞేయం తదధ్యర్బుదమర్బుదజ్ఞైః।

యద్ద్వన్ద్వజాతం యుగపత్క్రమాద్వా
ద్విరర్బుదం తచ్చ భవేదసాధ్యమ్॥ ౨౫॥

తా॥ పూర్వోక్త లక్షణములతోఁగూడిన యర్బుదమునందు వేరొక యర్బుదము జనించిన యెడ దానిని అధ్యర్బుదమనియు, సమకాలముననైనను పర్యాయముగనైనను జంటగ రెండర్బుదములు జనించినయెడ ద్విరర్బుదమనియు వచించెదరు. ఈ యర్బుదము అసాధ్యంబై యుండును.

అర్బుదములు పక్వముగాకుండుటకు కారణములు

శ్లో॥ న పాకమాయాన్తి కఫాధికత్వా
న్మేదోబహుత్వాచ్చ విశేషతస్తు।
దోషస్థిరత్వాద్గ్రథనాచ్చ తేషాం
సర్వార్బుదాన్యేవ నిసర్గతస్తు॥ ౨౬॥



ఇతి శ్రీ మాధవకర విరచితే మాధవనిదానే
గలగణ్డ గణ్డమాలాఽపచీగ్రన్థ్యర్బుద
నిదానం సమాప్తమ్



తా॥ పైజెప్పిన యర్బుదములన్నియు కఫమేదస్సులు అధికముగ నుండుటచేతను, దోషములు స్థిరముగ నుండుటచేతను, కఠినముగ నుండుటచేతను, పాకము నొందకుండును. ఇట్టి కారణములు వ్యాధిస్వభావముచే గల్గునని భావము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రిచర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు
గలగణ్డగణ్డమాలా
పచీగ్రన్థ్యర్బుద నిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

---

# శ్లీపదనిదానమ్



అర్బుద నిదానానన్తరము అర్బుదమువలె నున్నతమై జనించుటంజేసి దానికి సమానమైన శ్లీపదముయొక్క నిదానము జెప్పుట.

———(౦)———

## శ్లీపద సంప్రాప్తి

శ్లో॥ యస్సజ్వరో వఙ్క్షణజో భృశార్తి
శ్శోథో నృణాం పాదగతః క్రమేణ।
తచ్ఛ్లీపదం స్యాత్కరకర్ణనేత్ర
శిశ్నోష్ఠనాసాస్వపి కేచిదాహుః॥౧॥

తా॥ జ్వరముతోడను మిక్కుటమైన వేదనతోడను గూడిన వాపు గజ్జలలో ముందు జనించి మెల్ల మెల్లగ పాదములకు దిగినయెడ నయ్యది శ్లీపదంబను (బోదకాలు) వ్యాధియని వచించెదరు. ఈ వ్యాధి హస్తములయందును, చెవులయందును, కన్నులయందును, శిశ్నమునందును, పెదవుల యందును, నాసికయందును, జనించునని కొందరు వచించెదరు. ఇచ్చట శ్లీపదము సంప్రాప్తిలో జెప్పిన రీతిగ హస్తములు మొదలగుచోట జనించుటలేదు గాన "కేచిదాహుః" అని పక్షాన్తరముగ జెప్పంబడెనని యెరుంగునది. "శిలావత్ పదం శ్లీపదం" అను వ్యుత్పత్తిచేత పాదమును రాయి వలె కఠినముగ జేయునది గాన శ్లీపద మనందగునని కొందరు వచించెదరు.

## వాతాదిశ్లీపద లక్షణములు

శ్లో॥ వాతజం కృష్ణరూక్షం చ స్ఫుటితం తీవ్రవేదనమ్।
అనిమిత్తరుజం తస్య బహుశో జ్వర ఏవ చ॥౨॥
పిత్తజం పీతసఙ్కాశం దాహజ్వరయుతం మృదు।
శ్లైష్మికం స్నిగ్ధవర్ణం చ శ్వేతం పాణ్డు గురు స్థిరమ్॥౩॥

తా॥ కృష్ణవర్ణంబును, రూక్షంబును, పగులునదియు, తీవ్రంబగు వేదనతో గూడినదియు, కారణములేకనే విశేషముగ నొప్పిగల్గినదియునైన శ్లీపదము వాతముచే జనించినదియని యెరుంగునది. ఈ వ్యాధియందు జ్వరము విశేషముగ నుండును. పచ్చని రంగుకల్గి తాపముతోడను జ్వరము

తోడను కూడి మృదువుగనుండు శ్లీపదము పిత్తముచే జనించినదనియు; నిగనిగలాడుచు శ్వేతవర్ణంబైనను, లేక, పాండువర్ణంబైనను కల్గి మిక్కిలి భారముతోగూడి కఠినంబై యుండు శ్లీపదము శ్లేష్మముచే జనించినది యనియు; శ్లీపదభేదముల నెరుంగునది.

## అసాధ్యశ్లీపద లక్షణము

శ్లో॥ వల్మీకమివ సఞ్జాతం కణ్టకైరుపచీయతే।
అబ్దాత్మకం మహత్తచ్చ వర్జనీయం విశేషతః॥౪॥

తా॥ పాముపుట్టవలె ననేక శిఖరములతోగూడి జనించి మాంసపుమొలకలచే వ్యాప్తంబై ఒక సంవత్సరముగడచి మిగుల గొప్పదిగానుండు శ్లీపదము అసాధ్యంబై యుండును గాన చికిత్స జేయం జనదని భావము.

## శ్లీపదములయందు కఫప్రాధాన్య నిర్ణయము

శ్లో॥ త్రీణ్యప్యేతాని జానీయాచ్ఛ్లీపదాని కఫోచ్ఛ్రయాత్।
గురుత్వం చ మహత్త్వం చ యస్మాన్నాస్తి కఫం వినా॥౫॥

తా॥ గురుత్వంబును మహత్త్వంబును కఫములేక జనించదు గాన వాతాదులచే జనించిన శ్లీపదముల మూటియందును కఫము ప్రధానముగ ప్రకుపితంబై యుండునని భావము.

## శ్లీపదజనక కారణంబులగు దేశాది నిర్ణయము

శ్లో॥ పురాణోదకభూయిష్ఠాః సర్వర్తుషు చ శీతలాః।
యే దేశాస్తేషు జాయన్తే శ్లీపదాని విశేషతః॥౬॥
యచ్ఛ్లేష్మలాహార విహారజాతం
పుంసః ప్రకృత్యా చ కఫాత్మకస్య।

తా॥ తటాకాదులయందు జలము ఎటువేసవిలకు ఎండిపోక చిరకాలమువరకు నిలచియుండుచోట్లయందును, అన్ని ఋతువులయందు మిక్కిలి శీతలము గానుండు ప్రదేశములయందును, శ్లీపదవ్యాధులు విశేషముగ జనించును. మరియు కఫప్రకృతిగల మనుజుండు శ్లేష్మను వృద్ధినొందించు నాహార విహారాదులను విశేషముగ జేసినను శ్లీపదవ్యాధి కల్గునని భావము.

## మరియొక అసాధ్య శ్లీపదలక్షణము

శ్లో॥ సాస్రావమత్యున్నత సర్వలిఙ్గం
సకణ్డురం శ్లేష్మయుతం వివర్జ్యమ్॥౭॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
శ్లీపదనిదానం సమాప్తమ్



**తా॥** మిక్కిలి యధికంబులైన వాతాది లక్షణములతో గూడి నీరు మొదలగునవి స్రవించుచు అధికమైన దురదకల్గి శ్లేష్మయుక్తంబైన శ్లీపదము అసాధ్యంబని యెరుంగునది.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషజ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపిక యను
మాధవనిదానార్థతాత్పర్యమునందు
శ్లీ ప ద ని దా న ము
స మా ప్త ము





శ్రీ హ య గ్రీ వా య న మః

శ్రీ ర స్తు

---

# విద్రధినిదానమ్

---

శ్లీపదమున జనించుకరణి విద్రధియందును శోఫకల్గును గాన శ్లీపదనిదానమును జెప్పినపిదప దానికి సమానరూపంబైన విద్రధయొక్క నిదానమును చెప్పట.



శ్లో॥ త్వగ్రక్తమాంసమేదాంసి సందూష్యాస్థిసమాశ్రితాః।
దోషాశ్శోథం శనైర్ఘోరం జనయన్త్యుచ్ఛ్రితా భృశమ్॥౧॥
మహామూలం రుజావన్తం వృత్తం వాప్యథవాఽఽయతమ్।
స విద్రధిరితి ఖ్యాతో విజ్ఞేయష్షడ్విధశ్చ సః ॥౨॥
పృథగ్దోషైస్సమస్తైశ్చ క్షతేనాప్యసృజా తథా।
షణ్ణామపి హి తేషాన్తు లక్షణం సమ్ప్రచక్ష్యతే॥ 3॥

తా॥ వాతాది దోషములు మిగుల ప్రకోపమునొంది చర్మము, రక్తము, మాంసము, ఈ మూడింటిని చెరచి వృద్ధినొంది అస్థులయందుజేరి ప్రబలమైనమూలము కల్గినదియు, నొప్పితోకూడినదియు, వర్తులంబును లేక నిడుదయునైన అతిక్రూరమైన వాపును కల్గించును. దీనిని విద్రధి (మేహకురుపు) యని వచించెదరు. మరియు నీవ్యాధి వాతపిత్తశ్లేష్మ సన్నిపాత క్షత రక్తములచే వేర్వేరుగ జనించుటంజేసి వరుసగ వాతవిద్రధియనియు, పిత్తవిద్రధియనియు, శ్లేష్మవిద్రధియనియు, సన్నిపాతవిద్రధియనియు, క్షతవిద్రధియనియు, రక్తవిద్రధియనియును, ఆరుతెరంగులై యుండును. ఈ యారిటికిని వేర్వేరుగ లక్షణముల నీక్రింద చెప్పెదనని భావము.

## వాతజవిద్రధి లక్షణము

శ్లో॥ కృష్ణోఽరుణో వా విషమో భృశమత్యర్థవేదనః।
చిత్రోత్థానప్రపాకశ్చ విద్రధిర్వాతసమ్భవః॥౪॥

తా॥ నల్లనిరంగు కల్గియుండుట, లేక అరుణవర్ణంబై యుండుట, ఒకప్పుడు స్వల్పంబును ఒకప్పుడు గొప్పదియునై యుండుట, మిక్కిలి యధికమైన వేదనకల్గి యుండుట, నానావిధంబులగు పుట్టుకయు పరిపాకంబును కల్గియుండుట, ఈలక్షణములు కల్గినది వాతముచే జనించిన విద్రధి యని యెరుంగునది.

## పిత్తవిద్రధి లక్షణము

శ్లో॥ పక్వోదుమ్బరసఙ్కాశశ్శ్యావో వా జ్వరదాహవాన్।
క్షిప్రోత్థానప్రపాకశ్చ విద్రధిః పిత్తసమ్భవః॥౫॥

తా॥ పండిన మేడిపండువంటి వర్ణంబైనను లేక శ్యామలవర్ణంబైనను కల్గి ఉత్పత్తికాలముననే జ్వరంబును మంటయు కల్గి శీఘ్రముగ జనించి పరిపాకము నొందినయెడ పిత్తముచే గల్గిన విద్రధియని యెరుంగునది. మరియు నీవిద్రధియందు ఉత్పత్తిసమయమున జ్వరదాహములు స్వల్పముగను, పరిపక్వంబగునపుడు అధికముగనుండును.

## కఫజవిద్రధి లక్షణము

శ్లో॥ శరావసదృశః పాణ్డుః శీతస్స్నిగ్ధోఽల్పవేదనః।
చిరోత్థానప్రపాకశ్చ విద్రధిః కఫసమ్భవః॥౬॥

తా॥ మూకుడువలె వర్తులంబును, పాండువర్ణంబును, శీతలంబును, నిగనిగలాడుచున్నదియు స్వల్పమైన బాధ కల్గినదియునై చిరకాలమునకు జనించి పరిపాకమునొందునది కఫముచేగల్గిన విద్రధియని యెరుంగునది.

శ్లో॥ తను పీత సితాశ్చైషామాస్రావాః క్రమశస్స్మృతాః।

తా॥ పైనచెప్పిన విద్రధుల మూటిలో వాతవిద్రధియందు పలచనైన యాస్రావంబును, (చీము మొదలగునవి కారుట), పిత్తవిద్రధియందు పచ్చని యాస్రావంబును, కఫవిద్రధియందు తెల్లని యాస్రావంబును కల్గునని భావము.

## సన్నిపాతజవిద్రధి లక్షణము

శ్లో॥ నానావర్ణరుజాస్రావో ఘటాలో విషమో మహాన్ ॥౭॥
విషమం పచ్యతే చాపి విద్రధిస్సాన్నిపాతికః।

తా॥ నానావిధంబులగు కృష్ణపీతశుక్లాది వర్ణంబులును అనేకవిధములగు వేదనలును ఆస్రావంబులును గల్గియుండుట, పెద్దతలవలె నున్నతమైయుండుట, మిగుల సాధ్యంబై యుండుట ఈలక్షణములుకల్గి ఒకచోట చిరకాలమునకు పరిపక్వంబై వేరొకచోట శీఘ్రముగ పరిపాకమునొందుచుండునది సన్నిపాతముచే కల్గిన విద్రధియని యెరుంగునది.

## ఆగంతుకవిద్రధి లక్షణము

శ్లో॥ శస్త్రైస్తైర్వాన్యైరభిహతే క్షతే వాఽపథ్యకారిణః॥౮॥
క్షతోష్మా వాయువిస్పృతస్సరక్తం పిత్తమీరయేత్।
జ్వరస్తృష్ణా చ దాహశ్చ జాయతే తస్య దేహినః ॥౯॥
ఆగన్తుర్విద్రధిర్హ్యేష పిత్తవిద్రధిలక్షణః।

తా॥ కట్టెలు మట్టిపెళ్లలు మొదలగువానిచే నగు ప్రహారములు కల్గినను, గాయముతగిలినప్పుడు పథ్యములుకాని యాహారాదుల జేసినను, గాయముచే గల్గిన యుష్ణము వాతముచే

శరీరమునందు వ్యాపింపంబడి రక్తముతోగూడిన పిత్తమును ప్రకోపము నొందించును; దానం జేసి జ్వరము, దప్పి, తాపము, ఈలక్షణములు కల్గును. ఈయది ఆగన్తుకవిద్రధి యని చెప్పంబడును. మరియు నిది పిత్తవిద్రధిలక్షణములతో గూడియుండును.

రక్తజవిద్రధి లక్షణము

శ్లో॥ కృష్ణస్ఫోటావృతశ్శ్యావ స్తీవ్రదాహరుజాకరః॥౧౦॥
పిత్తవిద్రధిలిఙ్గస్తు రక్తవిద్రధి రుచ్యతే।

తా॥ నల్లని బొబ్బలచే నావరింపబడి శ్యామవర్ణంబును మిగుల తీవ్రంబైన నొప్పియు మంటయు కల్గి పిత్తవిద్రధిలక్షణములతోగూడి యుండునది రక్తముచే కల్గిన విద్రధి యని యెఱుంగునది.

అన్తర్విద్రధి సంప్రాప్తి

శ్లో॥ పృథక్సమ్భూయ వా దోషాః కుపితా గుల్మరూపిణమ్॥౧౧॥
వల్మీకవత్సమున్నద్ధ మన్తః కుర్వన్తి విద్రధిమ్।
గుదే వస్తిముఖే నాభ్యాం కుక్షౌ వఙ్క్షణయో స్తథా॥౧౨॥
వృక్కయోః ప్లీహ్ని యకృతి హృది వా క్లోమ్ని వాఽప్యథ।

తా॥ వాతాది దోషములు ప్రకోపమునొంది శరీరమునందు లోప్రక్క పాముపుట్టవలె నున్నతంబును గుల్మమువంటి యాకారంబును కల విద్రధిని కల్గించును; దీనిని అన్తర్విద్రధి యని వచించెదరు. మరియు నిది గుదము, వస్తిద్వారము, నాభి, కుక్షి, గజ్జలు, వృక్కములు, ప్లీహము, యకృత్తు, హృదయకమలము, క్లోమము, ఈ స్థలములలో నెచ్చోటనైన జనించును.

అన్తర్విద్రధి లక్షణములు

శ్లో॥ తేషాముక్తాని లిఙ్గాని బాహ్యవిద్రధిలక్షణైః॥౧౩॥
అధిష్ఠాన విశేషేణ లిఙ్గం శ్రుణు విశేషతః।
గుదే వాతనిరోధశ్చ వస్తౌ కృచ్ఛ్రాల్పమూత్రతా॥౧౪॥
నాభ్యాం హిక్కా తథాఽఽటోపః కుక్షౌ మారుతకోపనమ్।
కటీపృష్ఠగ్రహ స్తీవ్రో వఙ్క్షణోత్థే తు విద్రధౌ॥౧౫॥
వృక్కయోః పార్శ్వసఙ్కోచః ప్లీహ్న్యుచ్ఛ్వాసావరోధనమ్।
సర్వాఙ్గ ప్రగ్రహ స్తీవ్రో హృది కాసశ్చ జాయతే॥౧౬॥
శ్వాసో యకృతి హిక్కా చ క్లోమ్ని పేపీయతే పయః।

తా॥ అన్తర్విద్రధులన్నియు పైన వచించిన వాతాదిజనిత బాహ్యవిద్రధులతో సమానంబులగు లక్షణములు కల్గి యుండును; ఐనను పైజెప్పిన స్థానభేదములచే గల్గు విశేషలక్షణముల వివరించెద. అందు గుదస్థానమున జనించిన విద్రధియందు అపానవాతము వెడలకుండును. వస్తి

యందు జనించినయెడ మిగుల కష్టముచే మూత్రము స్వల్పముగ వెడలును. నాభియందు జనించినయెడ వెక్కిళ్లును ఆటోపమును గల్గును. కుక్షిలో జనించునపుడు వాతప్రకోపము కల్గును. గజ్జలలో జనించునపుడు నడుము వీపు ఈ స్థలములయందు నొప్పికల్గును. వృక్కములయందు జనించినయెడ ఇరుప్రక్కలు ముడుచుకొనియుండును. ప్లీహమున జనించినయెడ శ్వాసము వెడలకుండును. హృదయమున జనించినయెడ అవయవములన్నింటియందు నొప్పియు దగ్గును జనించును. యకృత్తున జనించినయెడ శ్వాసంబును వెక్కిళ్లును కల్గును. క్లోమమునందు కల్గినయెడ మాటిమాటికి నీళ్లు ద్రాగుట కిచ్ఛబొడమును. ఇవ్విధంబుగ విద్రధి జనించు స్థానభేదములచే లక్షణ భేదముల నెరుంగునది. మరియు "న నిబన్ధోఽస్తి గుల్మస్య విద్రధిః సనిబంధనః। గుల్మస్తిష్ఠతి దోషేషు విద్రధిర్మాంసశోణితే । విద్రధిః పచ్యతే తస్మాత్ గుల్మః క్వాపి న పచ్యతే॥" అని సుశ్రుతమున నున్నయది. గుల్మము పాకమునొందుటకు కారణములైన రక్తమాంసాదుల సంబంధములేక వాతాది దోషముల మాత్రము నాశ్రయించి యుండును గాన పాకము నొందుటలేదనియు, విద్రధి రక్తమాంసముల నాశ్రయించి జనించునుగాన పరిపక్వం బగుననియు భావము. ఈవాక్యమునుబట్టి అన్తర్విద్రధి పాకము నొందుననియు, గుల్మము పాకమునొందకుండుననియు నీ రెంటికిని భేదముల నెరుంగునది.

## సాధ్యాసాధ్య విద్రధి లక్షణము

శ్లో॥ నాభేరుపరిజాః పక్వా యాన్త్యూర్ధ్వమితరే త్వధః॥౧౭॥
అధస్స్రుతేషు జీవేత్తు స్రుతేషూర్ధ్వం న జీవతి।
హృన్నాభివస్తి వర్జ్యా యే తేషు భిన్నేషు బాహ్యతః॥౧౮॥
జీవేత్కదాచిత్పురుషో నేతరేషు కదాచన।

తా॥ నాభికిపైన వృక్కప్లీహాది స్థానముల జనించిన విద్రధులు పక్వంబులైనపుడు ఊర్ధ్వమార్గమున చీము మొదలగునవి స్రవించును. నాభికి క్రింద వస్తిగుదముల జనించిన విద్రధి పగిలినపుడు గుదమార్గమునుండి చీము మొదలగునవి స్రవించును. అందు అధోమార్గమున స్రవించునెడ మనుజుండు జీవించును. ఊర్ధ్వద్వారమున వెడలునెడ జీవించుటలేదు. మరియు హృదయము, నాభి, వస్తి, ఈ స్థలములుదక్క తక్కినచోట్ల జనించిన విద్రధి పైకితేలి పగిలినయెడ నొకవేళ బ్రతుకును. హృదయనాభి వస్తులయందు జనించిన విద్రధి బాహ్యముగ పగిలినను జీవించుటలేదని భావము. మరియు "ఊర్ధ్వం ప్రభిన్నేషు ముఖాన్నరాణాం ప్రవర్తతేఽసృక్సహితోఽపి పూయః । అధఃప్రభిన్నేషు చ పాయుమార్గాత్ ద్వాభ్యాం ప్రవృత్తిస్త్విహ నాభిజేషు॥" అని తన్త్రాన్తరమున నుండుటచేత నాభిస్థానమున జనించిన విద్రధి పగిలినపుడు ఊర్ధ్వాధోమార్గముల రెంటియందును చీము మొదలగునవి స్రవించునని యెరుంగునది.

## సాధ్యాసాధ్య విద్రధి నిర్ణయము

శ్లో॥ సాధ్యా విద్రధయః పఞ్చ వివర్జ్యః సాన్నిపాతికః॥౧౯॥
ఆమపక్వవిదగ్ధత్వం తేషాం శోథవదాదిశేత్।

ఆధ్మాతం బద్ధనిష్యన్దం ఛర్దిహిక్కాతృషాఽన్వితమ్॥౨౦॥
రుజాశ్వాససమాయుక్తం విద్రధిర్నాశయేన్నరమ్।



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
విద్రధి నిదానం సమాప్తమ్



తా॥ వాత పిత్త కఫ రక్త ఆగంతువులను భేదములుకల విద్రధులు ఐదును సాధ్యంబులు. సన్నిపాతముచే గల్గిన విద్రధి యసాధ్యంబు. మరియు నీవిద్రధులన్నింటికిని ఆను పక్వ భేదములను శోఫకువలెనే యెరుంగునది. చీము మొదలగునవి స్రవించక పైకుబికియున్నను, వాంతి వెక్కిళ్లు, దప్పి, ఈయుపద్రవములతో గూడియున్నను, అధికమైన నొప్పియు, శ్వాసంబును కల్గియున్నను విద్రధి మనుజుని చంపునని యెరుంగునది. మరియు తంత్రాన్తరమున నీరీతిగ గొన్ని సాధ్యాసాధ్య లక్షణములు గానంబడియెడు: "అసాధ్యో మర్మజో జ్ఞేయః పక్వోఽపక్వోఽపి విద్రధిః। సన్నిపాతోత్థితోఽప్యేవం పక్వ ఏవ తు వస్తిజః। త్వగ్జో నాభేరధో యశ్చ సాధ్యో మర్మ సమీపజః। అపక్వశ్చైవ పక్వశ్చ సాధ్యో నోపరినాభిజః॥" మర్మస్థానముల జనించిన విద్రధియు సన్నిపాతముచే గల్గిన విద్రధియు పక్వంబైనను పక్వముగాకున్నను అసాధ్యంబనియు, వస్తియందు జనించిన విద్రధి పక్వంబైనయెడ నసాధ్యం బనియు, నాభికి క్రింద చర్మమున జనించిన విద్రధియు, మర్మసమీపమున జనించి పక్వముగాకుండు విద్రధియు సాధ్యంబులనియు, నాభికి నూర్ధ్వభాగమున జనించిన విద్రధి పక్వంబైనను పక్వముగాకున్నను అసాధ్యంబనియు భావము.

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి," "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపిక యను
మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు
విద్రధినిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీరస్తు

---

# వ్రణశోథనిదానమ్



విద్రధినిదానానన్తరము వ్రణసామాన్యమునకు సంబంధించిన వ్రణశోథనిదానమును జెప్పుట.

శ్లో॥ ఏకదేశోత్థితశ్శోథో వ్రణానాం పూర్వలక్షణమ్।
షడ్విధస్స్యాత్పృథక్సర్వ రక్తాఽఽగన్తు నిమిత్తజః॥౧॥
శోథాష్షడేతే విజ్ఞేయాః ప్రాగుక్తైశ్శోథలక్షణైః।
విశేషః కథ్యతే చైషాం పక్వాపక్వాది నిశ్చయే॥౨॥

తా॥ శరీరమునం దొక స్థలమున జనించిన శోఫ వ్రణములకు పూర్వరూపంబై యుండును. అట్టి శోఫ వాత పిత్త కఫ సన్నిపాత రక్త ఆగన్తువులు కారణంబులగుటంజేసి యారువిధంబులై యుండునని యెరుంగునది. ఈయారువిధంబులైన శోఫములు మున్నువచించిన శోఫ సామాన్య లక్షణములతో గూడియుండును. మరియు వీనికన్నింటికి పక్వాపక్వలక్షణంబుల దెలియుటకు విశేషముల జెప్పెదనని భావము.

### వ్రణశోఫ పరిపాక లక్షణములు

శ్లో॥ విషమం పచ్యతే వాతాత్పిత్తోత్థశ్చాచిరాచ్చిరమ్।
కఫజః పిత్తవచ్ఛోథో రక్తాగన్తు సముద్భవః॥౩॥

**తా॥ వాతముచే జనించిన వ్రణశోఫ విషమముగ పరిపాకము నొందును. పిత్తముచే జనించిన వ్రణశోఫ శీఘ్రముగ పరిపక్వంబగును. శ్లేష్మముచే జనించిన వ్రణశోఫ చిరకాలమునకు పరిపక్వంబగును. రక్తముచేతను ఆగన్తువుచేతను జనించిన వ్రణశోఫ పిత్తజశోఫవలె శీఘ్రముగ పరిపాకము నొందును.**

### అపక్వశోఫ లక్షణము

శ్లో॥ మన్దోష్మతాఽల్పశోథత్వం కాఠిన్యం త్వక్సవర్ణతా।
మన్దవేదనతా చైతచ్ఛోథానామామలక్షణమ్॥౪॥

తా॥ ఉష్ణము కొంచెముగ నుండుట, వాపు కొంచెముగ నుండుట, కఠినంబై యుండుట, చర్మమునకు సమానమైన వర్ణము కల్గియుండుట, నొప్పి కొంచెముగ నుండుట, ఇవియన్నియు శోథ పక్వముగాకుండుటకు చిహ్నములని యెరుంగునది.

శోథ పరిపాకము నొందునపుడు జనించు లక్షణములు

శ్లో॥ దహ్యతే దహనేనేవ క్షారేణేవ చ పచ్యతే।
పిపీలికాగణేనేవ దశ్యతే ఛిద్యతే తథా॥౫॥
భిద్యతే చైవ శస్త్రేణ దణ్డేనేవ చ తాడ్యతే।
పీడ్యతే పాణినేవాన్తః సూచీభిరివ తుద్యతే॥౬॥
సోషాచోషో వివర్ణస్స్యాత్ దఙ్గుల్యేవావఘట్యతే।
ఆసనే శయనే స్థానే శాన్తిం వృశ్చికవిద్ధవత్॥౭॥
న గచ్ఛేదాతతశ్శోథో భవేదాధ్మాతవస్తివత్।
జ్వరస్తృష్ణాఽరుచిశ్చైవ పచ్యమానస్య లక్షణమ్॥౮॥

తా॥ వ్రణము పరిపాకమునొందునెడ అగ్నిచే కాల్చబడినట్లుండుట, క్షారాదుల నునిచినటుల చిమచిమలాడుట, చీమలు కుట్టినవిధంబుగ నొచ్చుట, శస్త్రముచే ఛేదించబడిన విధంబుగను చీలువబడిన చందంబుగ నుండుట, కఱ్ఱలచే కొట్టినట్లుండుట, చేతి పిసికినట్లుండుట, లోపల సూదుల గ్రుచ్చినట్లుండుట, అగ్నిలో కాచబడినట్లు తాపముగల్గుట, అగ్నిసమీపమున నున్నట్లులు బాధగల్గుట, వర్ణము మారియుండుట, వ్రేళ్లతో పెకలించినట్లుండుట, కూర్చునియున్నను పరుండియున్నను నిలబడియున్నను తేలుకుట్టినవిధంబుగ బాధ శమించకుండుట, గాలిచే నిండియుండు తిత్తివలె నుబికి యుండుట, జ్వరము, దప్పి, అరుచి, ఈ యుపద్రవములు గల్గియుండుట, ఈ లక్షణములు శోథ పరిపాకమునొందునపుడు విశేషముగ జనించునని యెరుంగునది.

పక్వ లక్షణము

శ్లో॥ వేదనోపశమశ్శోథో లోహితోఽల్పో న చోన్నతః।
ప్రాదుర్భావో వలీనాం చ తోదః కణ్డూర్ముహుర్ముహుః॥౯॥
ఉపద్రవాణాం ప్రశమో నిమ్నతా స్ఫుటనం త్వచామ్।
వస్తావివామ్బుసఞ్చారః స్యాచ్ఛోథేఽఙ్గులిపీడితే॥౧౦॥
పూయస్య పీడయత్యేక మన్తమన్తే చ పీడితే।
భక్తాకాఙ్క్షా భవేచ్చైతచ్ఛోథానాం పక్వలక్షణమ్॥౧౧॥

తా॥ నొప్పి, పోటు మొదలగు వేదనలు శమించి యుండుట, వాపు రక్తవర్ణంబై స్వల్పముగ నణగియుండుట, ముడతలు బడుట, మాటిమాటికి సూదులబొడిచిన విధముగ పోటును దురదయు గల్గియుండుట, ఉపద్రవములన్నియు శమించియుండుట, ప్రకాగ్రమున పల్లముగనుండుట, చర్మము పగులుట, శోథను వ్రేలనొత్తినపుడు తిత్తిలో నుదకముకదలు చందంబున కదలుట,

వ్రణమునం దొకప్రక్క నదిమినపుడు వేరొకచోట చీము నిండియుండుట, అన్నమునం దిచ్ఛ బోడముట, ఈ లక్షణములన్నియు శోథ పక్వంబైనపుడు జనించును.

### పరిపాకకాలమున దోషత్రయ సంబంధమునకు కారణము

శ్లో॥ నర్తేఽనిలాద్రుఙ్న వినా చ పిత్తం
పాకః కఫం చాపి వినా న పూయః।
తస్మాద్ధి సర్వే పరిపాకకాలే
పచన్తి శోథాః త్రిభిరేవ దోషైః॥౧౨॥

తా॥ వాతప్రకోపములేక నొప్పి మొదలగు బాధలును, పిత్తప్రకోపములేక పాకంబును, కఫప్రకోపములేక పూయంబును జనించవు గాన శోథలన్నియు పరిపాకము నొందుకాలమున దోషత్రయము ప్రకోపము నొందునని యెరుంగునది.

మరియు కఫముచే జనించిన శోథయందు మిక్కిలి లోభాగమున పాకము జనించునుగాన పై జెప్పిన లక్షణములచే దెలియుటకు కష్టంబైయుండును. అట్టి గమ్భీరపాకలక్షణములు సుశ్రుతమున జెప్పంబడియె: “కఫజేషు ఖలు శోథేషు గమ్భీరగతిత్వాత్ అభిఘాతజేషు వా కేషుచి దసమస్తం పక్వలక్షణం దృష్ట్వా పక్వమపక్వమితి భిషజ్మోహముపైతి; తత్ర హి త్వక్సవర్ణతా శీతశోథతా అల్పరుజతా అశ్మవద్ఘనతా, న తత్ర మోహ ముపేయాత్” కఫముచే జనించిన శోథలయందు మిక్కిలి లోప్రక్క పాకము కల్గునుగాన అట్టి శోథలయందును అభిఘాతముచే గల్గిన కొన్ని శోథలయందును పక్వలక్షణములు సంపూర్ణముగ గానంబడకుండుటంజేసి పక్వమైన శోథను పక్వముకాలేదని వైద్యుండు భ్రమజెందును. అట్టియెడ ఎఱ్ఱనిరంగు మంట పోటు మొదలగు బాధలు జనించినపిదప చర్మమునకు సమానమైన వర్ణము గల్గియుండుట, వాపు చల్లనైయుండుట, బాధలు స్వల్పముగా నుండుట, రాయివలె కఠినమైయుండుట, ఈ లక్షణములు గానంబడినచో శోథ మిక్కిలి లోతులో పాకము నొందుచున్నది యని దృఢముగ దెలియందగునని భావము.

### చీమును వెడలించనియెడ గల్గు దోషములు

శ్లో॥ కక్షం సమాసాద్య యథైవ వహ్నిః
వాయ్వీరితః సందహతి ప్రసహ్య।
తథైవ పూయో హ్యవినిస్సృతో హి
మాంసం సిరాః స్నాయు చ ఖాదతీహ॥౧౩॥

తా॥ వ్రణము పక్వంబైన పిదప చీమును బైట వెడలించకున్నయెడ ఎండిన యడవిని కాల్చివ్వు గాలిచే ప్రేరితంబై దహించుకరణి పూయము వాతప్రేరితంబై మాంసము, సిరలు, స్నాయువులు, వీనినన్నింటిని నశింపజేయును; గాన పరిపాకము నొందిన వ్రణమునుండి చీమును బైట వెడలించవలెనని యర్థము.

పక్వాపక్వపరిజ్ఞానప్రాశస్త్యము

శ్లో॥ యశ్ఛినత్త్యామ మజ్ఞానాద్యో వా పక్వముపేక్షతే।
శ్వపచావివ మన్తవ్యౌ తావనిశ్చితకారిణౌ॥౧౪॥
ఆమం విదహ్యమానం చ సమ్యక్పక్వం చ యో భిషక్।
జానీయాత్స భవేద్వైద్యః శేషాస్తస్కరవృత్తయః॥౧౫॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
వ్రణశోథనిదానం సమాప్తమ్

—— (o) ——

తా॥ పక్వము గాని వ్రణమును తెలిసిలేక భేదించు వైద్యుండును, పక్వంబైన వ్రణమును భేదించక యుపేక్షించు వైద్యుండును, సిరిగుపురును మాదిగవానివలె క్రూరకృత్యముల జేయువారని యెరుంగునది. మరియు, పరిపాకము నొందని వ్రణముయొక్కయు, పరిపాకము నొందుచుండు వ్రణముయొక్కయు, పక్వంబైన వ్రణముయొక్కయు భేదముల నెరుంగు మనుజుండు వైద్యశ్రేష్ఠుండనియు; ఈ భేదముల నెరుంగక చికిత్సజేయ నుద్యమించు వైద్యులు దొంగలబోలె ద్రవ్యాభిలాషచే ప్రవర్తించువారనియు నెరుంగునది.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత ఆగరం పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దీవ్యన్నవాయు రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానాంధ్రతాత్పర్యమునందు
వ్రణశోథ నిదానము

సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీరస్తు

# శారీరవ్రణనిదానమ్



శోఫ నిదానమును జెప్పినపిదప అట్టి శోఫ నుపేక్షించుటచే గల్గు వ్రణముల యొక్క నిదానమును జెప్పుట.



శ్లో॥ ద్వివిధో వ్రణ స్స విజ్ఞేయశ్శారీరాగన్తు భేదతః।
దోషైరాద్యస్తయోరన్యశ్శస్త్రాదిక్షతసమ్భవః॥౧॥

తా॥ వ్రణములు శారీరంబులనియు, ఆగన్తుకములనియు రెండువిధములు; అందు వాతాది దోషములచే జనించిన వ్రణములు శారీరంబులనియు, శస్త్రాదిప్రహారములచే గల్గు వ్రణములు ఆగంతువులనియు పరస్పరభేదముల నెరుంగునది.

ఇచ్చట "వ్రణ సంచూర్ణనే" అను ధాతువువలన వ్రణశబ్దము నిష్పన్నమైనది గాన శరీరమున జనించి అవయవమునంగల మాంసాదులను చూర్ణముగ జేయునది వ్రణమని కొందరు వచించెదరు. సుశ్రుతమునందు "వృణోతి యస్మాద్రూఢేఽపి వ్రణవాస్తు న నశ్యతి। ఆదేహధారణాజ్జన్తోః వ్రణస్తస్మాన్నిరుచ్యతే॥" అని వ్రణశబ్దనిర్వచనము గానంబడుచున్నది. వ్రణము మానినపిమ్మటగూడ వ్రణముచే జనించిన మచ్చ శరీర ముండునంతవఱకు ఆవరించియుండును గాన వ్రణమని చెప్పబడును అని భావము.

## వాతజవ్రణ లక్షణము

శ్లో॥ స్తబ్ధః కఠినసంస్పర్శః మన్దస్రావో మహారుజః।
తుద్యతే స్ఫురతి శ్యావో వ్రణో మారుతసమ్భవః॥౨॥

తా॥ స్తంభించియుండుట, స్పృశించినపుడు కఠినముగ నుండుట, చీము మొదలగుదానిని మెల్లగ స్రవించుట, అధికమైన బాధ గల్గియుండుట, పోటుగల్గి అదరుచుండుట, శ్యావవర్ణము కల్గియుండుట, ఈ లక్షణములు కల్గిన వ్రణము వాతముచే జనించినది యని యెరుంగునది.

## పిత్తజవ్రణ లక్షణములు

శ్లో॥ తృష్ణా మోహజ్వరక్లేదదాహ దుష్ట్యవదారణైః।
వ్రణం పిత్తకృతం విద్యాద్గన్ధైః స్రావైశ్చ పూతికైః॥౩॥

తా॥ దప్పి, మూర్ఛ, జ్వరము, క్లేదము, తాపము, లోపల దుష్టంబై పగులదీయునట్లుండుట, దుర్గన్ధముతోఁగూడి దుర్గంధంబైన చీమును స్రవించుట, ఈ లక్షణములు కల్గినది పిత్తముచే జనించిన వ్రణంబని యెఱుంగునది.

## కఫజవ్రణ లక్షణము

శ్లో॥ బహుపిచ్ఛో గురుస్స్నిగ్ధస్స్తిమితో మన్దవేదనః।
పాణ్డువర్ణోఽల్ప సంక్లేదశ్చిరపాకీ కఫవ్రణః॥౪॥

తా॥ మిక్కిలి జిగటగనుండుట, భారముగనుండుట, నునుపుకల్గియుండుట, నిశ్చలంబైయుండుట, స్వల్పమైన వేదన కల్గియుండుట, పాండువర్ణము కల్గియుండుట, పూయాదులను కొంచెముగ స్రవించుట, చిరకాలమునకు పరిపాకము నొందుట, ఈ లక్షణములు కల్గినది కఫముచే జనించిన వ్రణంబని యెఱుంగునది.

## రక్తజ ద్విదోషజ సన్నిపాతజ వ్రణ లక్షణములు

శ్లో॥ రక్తో రక్తస్రుతీ రక్తాద్విత్రిజాస్స్యుస్తదన్వయైః।

తా॥ రక్తముచే జనించిన వ్రణము రక్తవర్ణంబై రక్తమును స్రవించుచుండును. మరియు దోషద్వయప్రకోపముచే జనించి దోషద్వయలక్షణములతో గూడియుండునది ద్విదోషజవ్రణంబనియు, దోషత్రయప్రకోపముచే జనించి త్రిదోషలక్షణములతో గూడియుండునది త్రిదోషజవ్రణంబనియు నెఱుంగునది.

## సాధ్యాసాధ్య వ్రణ లక్షణములు

శ్లో॥ త్వఙ్మాంసజస్సుఖే దేశే తరుణస్యానుపద్రవః॥౫॥
ధీమతోఽభినవః కాలే సుఖే సాధ్యస్సుఖం వ్రణః।
గుణైరన్యతమైర్హీనస్తతః కృచ్ఛ్రో వ్రణస్స్మృతః॥౬॥
సర్వైర్వివిహీనో విజ్ఞేయస్త్వసాధ్యో భూర్యుపద్రవః।

తా॥ యుక్తాయుక్తపరిజ్ఞానముకల్గి యౌవనమునసుండు మనుజునకు సుఖకరంబులైన హేమన్త శిశిరకాలములయందు మర్మస్థలంబులు దక్క తక్కిన శరీరావయవములయందలి చర్మమాంసములయందు జనించి జ్వరము దప్పి మొదలగు నుపద్రవములు లేకుండు వ్రణము సుఖముగ సాధింపందగియుండును. ఈ గుణములలో కొన్నిగుణములు లేకున్నయెడ కృచ్ఛ్రసాధ్యంబై యుండును. గుణములన్నియు లేకున్నను, ఉపద్రవములతో గూడియున్నను, మిగుల నసాధ్యంబైయుండునని యెఱుంగునది.

## దుష్టవ్రణ లక్షణములు

శ్లో॥ పూతిఃపూయాతిదుష్టాసృక్స్రావ్యుత్సఙ్గీ చిరస్థితిః ॥౭॥
దుష్టో వ్రణోఽతిగన్ధాదిః శుద్ధలిఙ్గవిపర్యయః।

తా॥ దుర్గంధయుక్తంబైన చీమును మిగుల దుష్టంబైన రక్తంబును స్రవించుట, మిగుల నున్నతంబుగ నుండుట, చిరకాలమునుండి యనువర్తించి యుండుట, గంధము వర్ణము వేదన ఇవి మిక్కిలి యధికముగ నుండుట, క్రిందజెప్పబడు శుద్ధవ్రణలక్షణములకు విరుద్ధంబులైన లక్షణములుకల్గి యుండుట, ఈలక్షణములు కల్గిన వ్రణము దుష్టవ్రణంబని యెరుంగునది.

## శుద్ధవ్రణ లక్షణము

శ్లో॥ జిహ్వాతలాభోఽతిమృదుః శ్లక్ష్ణస్స్నిగ్ధోఽల్పవేదనః ॥౮॥
సువ్యవస్థో నిరాస్రావశ్శుద్ధో వ్రణ ఇతి స్మృతః।

తా॥ నాలుకవలె మిక్కిలి మృదువై నునుపుకల్గి స్నిగ్ధంబుగ నుండుట, స్వల్పమైన వేదన కల్గియుండుట, మిగుల నున్నతంబును మిగుల నిమ్నంబును గాక సమముగ నుండుట, చీము మొదలగు దానిని స్రవించకుండుట, ఈలక్షణములు కల్గిన వ్రణము శుద్ధంబైనదియని యెరుంగునది. మరియు "నాతిరక్తో నాతిపాణ్డుః నాతిస్రావో న చాతిరుక్। న చోత్సన్నో న చోత్సఙ్గీ శుద్ధో రోప్యః పరం వ్రణః॥" అని చరకమునందు శుద్ధవ్రణలక్షణములున్నవి. మిగుల రక్తవర్ణంబును పాణ్డువర్ణంబును గాకుండునదియు, మిక్కిలి పల్లముగను ఉన్నతముగను గాక శరీరమునకు సమముగ నుండునదియునైన వ్రణము శుద్ధంబనియు, అట్టి వ్రణము మాన్పందగి యుండుననియు భావము. ఈవాక్యమునుబట్టి ప్రకృతగ్రన్థమున "నిరాస్రావః" అను పదమునకు దుష్టంబైన స్రావము లేనిది యని యర్థము చెప్పందగును.

## మానుచుండు వ్రణలక్షణము

శ్లో॥ కపోతవర్ణప్రతిమా యస్యాన్తాః క్లేదవర్జితాః ॥౯॥
స్థిరాశ్చ పిడకావన్తో రోహతీతి తమాదిశేత్।

తా॥ పావురమువలె పాణ్డు ధూసర వర్ణము కల్గి చీము మొదలగునవి లేక బిగువుకల్గి సన్నని బొబ్బలతోగూడి యుండు వ్రణము మానుచున్నదియని యెరుంగునది.

## మానిన వ్రణముయొక్క లక్షణములు

శ్లో॥ రూఢవర్త్మానమగ్రన్థిమశూన మరుజం వ్రణమ్ ॥౧౦॥
త్వక్సవర్ణం సమతలం సమ్యగ్రూఢం వినిర్దిశేత్।

తా॥ వ్రణమార్గము మూసికొని యుండుట, దుర్మాంసము లేకుండుట, వాపు లేకుండుట, నొప్పి పోటు మొదలగు బాధలు లేకుండుట, చర్మమునకు సమానమైన వర్ణముకల్గియుండుట, మిట్టపల్లములు లేక అరచేతివలె నుండుట, ఈలక్షణములు కల్గిన వ్రణము లెస్సగ మానినదియని యెరుంగునది.

## సాధ్యాసాధ్య వ్రణ లక్షణములు

శ్లో॥ కుష్ఠినాం విషజుష్టానాం శోషిణాం మధుమేహినామ్ ॥౧౧॥
వ్రణాః కృచ్ఛ్రేణ సిధ్యన్తి యేషాం చాపి వ్రణే వ్రణాః।

వసాం మేదోఽథ మజ్జానం మస్తులుఙ్గం చ యస్స్రవేత్ ॥౧౨॥
ఆగన్తుజో వ్రణస్సిధ్యే న్న సిధ్యేద్దోషసమ్భవః।

తా॥ దుష్టవ్యాధి కలవారికిని, విషముచే పీడింపబడినవారికిని, కృశతనొందినవారికిని, మధుమేహముకల్గినవారికిని జనించిన వ్రణంబులును; వ్రణములేచి మానిన మచ్చలలో మరల జనించిన వ్రణంబులును మిగుల కష్టసాధ్యంబులై యుండును. మరియు క్రొవ్వు, మేదస్సు, మజ్జ, మస్తులుంగము (శిరమునందలి మెదడు), వీనిని స్రవించుచున్నను ఆగంతుకవ్రణము సాధింపందగి యుండును. వాతాది దోషములచే జనించిన వ్రణములు పైజెప్పిన వసాదులను స్రవించుచున్న యెడ అసాధ్యంబులై యుండును.

## గంధవిశేషముచే నసాధ్యంబులగు వ్రణముల లక్షణములు

శ్లో॥ మద్యాగుర్వాజ్య సుమనః పద్మచమ్పక చన్దనైః ॥౧౩॥
సగన్ధా దివ్యగన్ధాశ్చ ముమూర్షూణాం వ్రణాస్స్మృతాః।

తా॥ మద్యము, అగరు, నెయ్యి, జాజిపువ్వులు, తామరపువ్వులు, సంపంగిపువ్వులు, చన్దనము, వీనితో సమానమైన పరిమళము గల్గియున్నను, దేవలోకముననుండు పారిజాతాది పుష్పముల యొక్క వాసనగల్గియున్నను, అట్టివ్రణములు మరణమునొందువారికి కల్గినవియని యెరుంగునది.

## అసాధ్యవ్రణ లక్షణములు

శ్లో॥ యే చ మర్మస్వసమ్భూతా భవన్త్యత్యర్థవేదనాః ॥౧౪॥
దహ్యన్తే చాన్తరత్యర్థం బహిశ్శీతాశ్చ యే వ్రణాః।
దహ్యన్తే బహిరత్యర్థం భవన్త్యన్తశ్చ శీతలాః ॥౧౫॥
ప్రాణమాంసక్షయశ్వాసకాసారోచక పీడితాః।
ప్రవృద్ధపూయరుధిరా వ్రణా యేషాం చ మర్మసు ॥౧౬॥
క్రియాభిస్సమ్యగారబ్ధా న సిధ్యన్తి చ యే వ్రణాః।
వర్జయేదపి తాన్ వైద్యః సంరక్షన్నాత్మనో యశః ॥౧౭॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
శారీరవ్రణనిదానం
సమాప్తమ్

---

తా॥ మర్మస్థలముల జనించకున్నను అపారమైన వేదనకల్గియుండు వ్రణంబులును, వ్రణము లోపల మిగుల తాపముగల్గి పైభాగమున మిగుల శీతలముగనుండు వ్రణంబులును, పైభాగమున

మిగుల సంతాపముకల్గి, లోపల మిక్కిలి శీతలంబులై యుండు వ్రణంబులును, శరీరబలంబును పుష్టియు నశించి శ్వాసకాసంబులును అరోచకంబును కల్గియుండువానికి జనించిన వ్రణంబులును, చీము నెత్తురులు మిగుల వృద్ధినొందియుండు వ్రణంబులును, మర్మస్థానములయందు జనించిన వ్రణంబులును, తగిన చికిత్సల ననేకవిధములుగ జేయుచున్నను శమించకుండు వ్రణంబులును, ఇవియన్నియు మిక్కిలి యసాధ్యంబులై యుండును గాన యశంబునుగోరు వైద్యుండు ఈవ్రణములకు చికిత్సజేయక విడువవలెనని భావము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానాన్ధ్రతాత్పర్యము నందు
శారీరవ్రణనిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# సద్యోవ్రణనిదానమ్

శారీరవ్రణనిదానానన్తరము ఆగన్తువ్రణరూపంబులైన సద్యోవ్రణముల (దెబ్బలు మొదలగు కారణములచేత గలిగిన గాయముల) యొక్క నిదానమును జెప్పుట.

శ్లో॥ నానాధారాముఖైశ్శస్త్రైర్నానాస్థాననిపాతితైః।
భవన్తి నానాకృతయో వ్రణాస్తాంస్తాన్నిబోధ మే॥౧॥
ఛిన్నం భిన్నం తథా విద్ధం క్షతం పిచ్చితమేవ చ।
ఘృష్టమాహుస్తథా షష్ఠం తేషాం వక్ష్యామి లక్షణమ్॥౨॥

తా॥ నానావిధంబులైన అంచులుకల్గి పలుతెరంగులైన ముఖములుకల శస్త్రములచే నానావిధంబులైన అవయవములయందు ప్రహారములు కల్గినయెడ పలుతెరంగులైన వ్రణములు కల్గును; వాని భేదంబుల నన్నింటిని వివరించెద వినుము. ఆ వ్రణములు ఛిన్నంబనియు, భిన్నంబనియు, విద్ధంబనియు, క్షతంబనియు, పిచ్చితంబనియు, ఘృష్టంబనియు నారువిధంబులై యుండును.

ఛిన్నవ్రణ లక్షణము

శ్లో॥ తిర్యక్ఛిన్న ఋజుర్వాపి యో వ్రణస్త్వాయతో భవేత్।
గాత్రస్య పాతనం తద్ధి ఛిన్నమిత్యభిధీయతే॥3॥

తా॥ శరీరమునందు అడ్డముగనైనను నిడుపుగనైనను శస్త్రాదులచే ఛేదింపఁబడిన వ్రణ నయ్యది ఛిన్న (నరకబడుటచేగల్గిన) వ్రణంబని చెప్పంబడును.

భిన్నవ్రణ లక్షణము

శ్లో॥ శక్తి దన్తేషుఖడ్గాగ్రవిషాణై రాశయో హతః।
యత్కిఞ్చిత్ప్రస్రవేత్తద్ధి భిన్నలక్షణముచ్యతే॥౪॥

తా॥ శక్తి యను నాయుధము, దన్తములు, బాణములు, కత్తియొక్క కొన, కొమ్ము, ఈ యాయుధములచే దేహమునందలి మూత్రాద్యాశయములయందు అభిఘాతముకల్గి పగిలి మూత్రాదులను స్రవించుచుండును; దీనిని భిన్న (పగులుటచేగల్గిన) వ్రణంబని వచించెదరు.

## భిన్నవ్రణ సామాన్య లక్షణములు

శ్లో॥ స్థానాన్యామాగ్నిపక్వానాం మూత్రస్య రుధిరస్య చ।
హృదుణ్డుకః ఫుప్ఫుసశ్చ కోష్ఠ ఇత్యభిధీయతే॥౫॥
తస్మిన్భిన్నే రక్తపూర్ణే జ్వరో దాహశ్చ జాయతే।
మూత్రమార్గగుదాస్యేభ్యో రక్తం ఘ్రాణాచ్చ గచ్ఛతి॥౬॥
మూర్ఛా శ్వాసస్తృషాధ్మానం అభక్తచ్ఛన్ద ఏవ చ।
విణ్మూత్రవాతసఙ్గశ్చ స్వేదాస్రావోఽక్షిరక్తతా॥౭॥
లోహగన్ధిత్వమాస్యస్య గాత్రదౌర్గన్ధ్యమేవ చ।
హృచ్ఛూలం పార్శ్వయోశ్చాపి విశేషం చాత్ర మే శృణు॥౮॥

తా॥ ఆమాశయము, అగ్న్యాశయము, పక్వాశయము, మూత్రాశయము, రక్తమునకు స్థానంబైన యకృత్ప్లీహములు, హృదయము, రక్తముయొక్క మలరూపంబైన ఉణ్డుకము, ఎడమప్రక్క రక్తమునకాధారంబైన పుప్ఫుసము, ఇవియన్నియు కోష్ఠములనఁబడును; అట్టికోష్ఠములు భిన్నంబులైనచో రక్తముచే నిండియున్నప్పుడు జ్వరతాపములుకల్గి; మూత్రమార్గము, గుదము, ముఖము, నాసాద్వారములు, వీనినుండి రక్తము స్రవించును. మరియు, మూర్ఛ, శ్వాసము, దప్పి, కడుపుబ్బరము, అన్నద్వేషము, మలమూత్రవాతములయొక్క నిరోధము, చెమటగారుట, కన్నులెఱ్ఱనైయుండుట, నోట రక్తమువలె దుర్గంధము గల్గియుండుట, శరీరమున దుర్గంధము కల్గుట, రొమ్మునొప్పి, ఇరుప్రక్కల శూల, ఈ లక్షణములన్నియు భిన్నవ్రణసామాన్యముగ కల్గును. మరియు నామాశయాది స్థానవిశేషములచే గల్గు విశేషలక్షణముల వచించెదనని యర్థము.

## భిన్నవ్రణ విశేషలక్షణములు

శ్లో॥ ఆమాశయస్థే రుధిరే రుధిరం ఛర్దయత్యపి।
ఆధ్మానమతిమాత్రం చ శూలం చ భృశదారుణమ్॥౯॥
పక్వాశయగతే చాపి రుజా గౌరవమేవ చ।
అధఃకాయే విశేషేణ శీతతా చ భవేదిహ॥౧౦॥

తా॥ మున్ను వచించిన రీతిగ కోష్ఠమున భిన్నవ్రణము కల్గుటచే స్రవించిన రక్తము ఆమాశయమున జేరినయెడ అధికముగ రక్తము వమనమగును; మరియు అధికముగ కడుపుబ్బరంబును మిక్కిలి క్రూరంబైన శూలయు జనించును. అట్టి రక్తము పక్వాశయమున జేరినపుడు అధికముగ బాధయు, గురుత్వంబును, నాభికిక్రిందిశరీరమున శీతలంబును జనించును.

## విద్ధవ్రణ లక్షణము

శ్లో॥ సూక్ష్మాస్యశల్యాభిహతం యదఙ్గం త్వాశయం వినా।
ఉత్తుణ్డితం నిర్గతం వా తద్విద్ధమితి నిర్దిశేత్॥౧౧॥

తా॥ సూక్ష్మంబైన యగ్రముకల ముల్లు మొదలుగాగల శల్యములు మున్నువచించిన ఆమాశయ పక్వాశయాదులుదక్క తక్కిన అవయవములలో నెచ్చోటనైన నాటి అట్టి శల్యము విరిగి బైలువెడలకున్నను, బైలువెడలినను, ఆవ్రణము విద్ధ (శల్యములు గ్రుచ్చుకొనుటచే గల్గిన వ్రణ) మని చెప్పంబడును. మరియు తన్త్రాన్తరమున ''విద్ధముత్తుణ్డితమనుత్తుణ్డితం భిన్నం నిర్భిన్నం'' అని విద్ధవ్రణము నాల్గు తెరంగులని చెప్పియున్నది. ముల్లు మొదలగునవి అవయవమున జొచ్చి విరిగినచో ఉత్తుండితమనియు, విరగక ఖండము బైలువెడలినచో అనుత్తుండితమనియు అడ్డముగ అవయవమున చీలినయెడ భిన్నమనియు, నిలువున చీలినయెడ నిర్భిన్నమనియు విద్ధవ్రణము నాల్గు తెరంగులని భావము. ఈ చెప్పబడిన నాల్గువిధములైన విద్ధవ్రణములు ఇచ్చట గ్రహించబడువని తెలియునది.

/ క్షతవ్రణ లక్షణము

శ్లో॥ నాతిచ్ఛిన్నం నాతిభిన్నం ఉభయోర్లక్షణాన్వితమ్।
విషమం వ్రణమఙ్గే యత్తత్క్షతం త్వభిధీయతే॥౧౨॥

తా॥ అధికముగ ఛిన్నంబును భిన్నంబును గాక పైజెప్పంబడిన చిన్నభిన్నలక్షణములు సూక్ష్మముగగల్గి శరీరమునందు నిమ్నోన్నతంబైయుండు వ్రణము క్షత (గాయ) మని జెప్పంబడును.

పిచ్చితవ్రణ లక్షణము

శ్లో॥ ప్రహారపీడనాభ్యాం తు యదఙ్గం పృథుతాం గతమ్।
సాస్థి తత్పిచ్చితం విద్యాన్మజ్జరక్తపరిప్లుతమ్॥౧౩॥

తా॥ ఇనుపగుదియ మొదలైన ఆయుధములవలన గల్గు ప్రహారములచేనైనను, బండి మొదలగు వానియొక్క ఒరుబిడిచేనైనను, అవయవములు నలిగి అస్థులు మజ్జ రక్తములచే దడిసి అణగి విశాలముగ కనబడుచున్నయెడ నయ్యది పిచ్చితంబను (నలుగుటచేగల్గిన) వ్రణంబని యెరుంగునది.

ఘృష్ట వ్రణము

శ్లో॥ ఘర్షణాదభిఘాతాద్వా యదఙ్గం విగతత్వచమ్।
ఉషాస్రావాన్వితం తచ్చ ఘృష్టమిత్యభిధీయతే॥౧౪॥

తా॥ కర్కశంబులైన వస్తువులయొక్క ఒరుబిడిచేనైనను, అభిఘాతముచేనైనను, శరీరమునందలి చర్మము పైతోలు ఊడి మంటగల్గి స్రవించుచున్నయెడ నయ్యది ఘృష్టమను (రాబిడిచే గల్గిన) వ్రణంబని యెరుంగునది.

శల్యాయుక్తవ్రణ లక్షణము

శ్లో॥ శ్యావం సశోథం పిడకాచితం చ
ముహుర్ముహుశ్శోణితవాహినం చ।
మృదూద్గతం బుద్బుదతుల్యమాంసం
వ్రణం సశల్యం సరుజం వదన్తి॥౧౫॥

తా॥ శ్యాములవర్ణంబును శోఫయు పిటకలును గల్గి యుండుట, మాటిమాటికి రక్తమును స్రవించుచుండుట, మాంసము మృగువై నీటిబుగ్గవలె పైకి ఉబికియుండుట, ఈ లక్షణములుగల్గి మిక్కిలి వేదనతోగూడియుండు వ్రణము శల్యముతోగూడియుండునదియని యెఱుంగునది.

కోష్ఠభేద లక్షణము

శ్లో॥ త్వచోఽతీత్య సిరాదీని భిత్త్వా వా పరిహృత్య వా।
కోష్ఠే ప్రతిష్ఠితం శల్యం కుర్యాదుక్తానుపద్రవాన్॥౧౬॥

తా॥ శల్యము శరీరముపైనుండు ఏడుపొరలను అతిక్రమించి సిరలను ఛేదించియైనను, తొలగించియైనను, కోష్ఠమున ప్రవేశించినయెడ ప్రణష్టశల్యవిజ్ఞానీయాధ్యాయమున జెప్పిన యుపద్రవములన్నియు కల్గును. ఆట్టి యుపద్రవములు గ్రన్థాన్తరమున నీరీతిగ గానంబడియెడు: "కోష్ఠగతే త్వాటోపానాహౌ మూత్రపురీషాఽహారదర్శనంచ వ్రణముఖాద్భవతి" శల్యము కోష్ఠమున జేరియున్నపుడు ఆటోపంబును కడుపుబ్బరంబును కల్గి వ్రణద్వారము నుండి మూత్రపురీషాహారములు స్రవించుచుండునని భావము.

అసాధ్యకోష్ఠభేదలక్షణములు

శ్లో॥ తత్రాన్తర్లోహితం పాణ్డు శీతపాదకరాననమ్।
శీతోచ్ఛ్వాసం రక్తనేత్రమానద్ధం చ వివర్జయేత్॥౧౭॥

తా॥ పైజెప్పిన కోష్ఠభేదమునందు లోపల రక్తము నిలచియుండి పైభాగమున పాండువర్ణము కల్గియుండుట, హస్తపాదములు ముఖము ఇవి చల్లనై యుండుట, శ్వాసము చల్లగా వెడలుట, కన్నులెఱ్ఱగ నుండుట, కడుపుబ్బరము, ఈ లక్షణములు కల్గినయెడ నసాధ్యంబై యుండును.

మర్మక్షతసామాన్య లక్షణము

శ్లో॥ భ్రమః ప్రలాపః పతనం ప్రమోహో
విచేష్టనం గ్లానిరథోష్ణతా చ।
స్రస్తాఙ్గతా మూర్ఛనమూర్ధ్వవాత
స్తీవ్రా రుజా వాతకృతాశ్చ తాస్తాః॥౧౮॥
మాంసోదకాభం రుధిరం చ గచ్ఛే
త్సర్వేన్ద్రియార్థోపరమస్తథైవ।
దశార్ధసఙ్ఖ్యేష్వథ విక్షతేషు
సామాన్యతో మర్మసు లిఙ్గముక్తమ్॥౧౯॥

తా॥ భ్రమము, అసంబద్ధముగ మాటలాడుట, క్రిందపడుట, మనస్సు భ్రమజెందియుండుట, కాళ్లుచేతులను విదలించుట, బలహీనము, ఉష్ణము, అవయవములు సడలి యుండుట, మూర్ఛ

అస్థివిద్ధ లక్షణము

శ్లో॥ ఘోరా రుజో యస్య నిశాదినేషు
సర్వాస్వవస్థాసు చ నైతి శాన్తిమ్।
భిషగ్విపశ్చిద్విదితార్థసూత్ర
స్తమస్థివిద్ధం పురుషం వ్యవస్యేత్॥౨౩॥

తా॥ రేయింబవలును బాధలు మిగుల క్రూరంబులై శాంతి నొందకున్నయెడ అస్థులయందు గాయము తగిలినదియని పండితుండగు వైద్యుండు నిశ్చయించవలెను.

సిరాది మర్మవిద్ధ లక్షణము

శ్లో॥ యథాస్వమేతాని విభావయేచ్చ
లిఙ్గాని మర్మస్వభితాడితేషు।
పాణ్డుర్వివర్ణస్స్పృశితం న వేత్తి
యో మాంసమర్మణ్యభిపీడితస్స్యాత్॥౨౪॥

తా॥ సిరాదులయొక్క మర్మస్థానములయందు గాయములు తగిలినయెడ మున్ను చెప్పిన భ్రమప్రలాపాదులును, సిరాదులకు వేర్వేరుగ జెప్పిన లక్షణంబులును గానంబడునని యెరుంగునది. మరియు మాంసగతమర్మములయం దభిఘాతము కల్గినయెడ పాండువు, వివర్ణత్వము, స్పర్శము నెరుంగజాల కుండుట, ఈ లక్షణములు కల్గునని యెరుంగునది.

వ్రణోపద్రవములు

శ్లో॥ విసర్పః పక్షఘాతశ్చ సిరాస్తమ్భోఽపతానకః।
మోహోన్మాదవ్రణరుజో జ్వరస్తృష్ణా హనుగ్రహః॥౨౫॥
కాసశ్ఛర్దిరతీసారో హిక్కా శ్వాసస్సవేపథుః।
షోడశోపద్రవాః ప్రోక్తా వ్రణానాం వ్రణచిన్తకైః॥౨౬॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
సద్యోవ్రణ నిదానం సమాప్తమ్



తా॥ విసర్పము, పక్షాఘాతము, సిరాస్తంభము, అపతానకము, మోహము, ఉన్మాదము, వ్రణమునందు బాధ, జ్వరము, దప్పి, తాలువులు పట్టియుండుట, దగ్గు, వాంతి, అతిసారము,

ఎక్కిళ్లు, శ్వాసము, కంపము, ఈ పదునారు ఉపద్రవములు వ్రణములయందు కల్గునని యెరుంగునది.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత ఆగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్ర
విరాజమాన దివ్యన్వవాయ రామకృష్ణాగ్ర్యతమాధవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేద మార్తాణ్డ" "భిషజ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానాన్వర్థతాత్పర్యమునందు
సద్యోవ్రణ నిదానము
సమాప్తము

---



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

---

# భగ్ననిదానమ్



భగ్నములు (ఎముకలువిరుగుట మొదలగునవి) గూడ ఆగంతువులైన శస్త్రప్రహారములు (ఆయుధములచే దగిలెడి దెబ్బలు) మున్నగు కారణములచే జనించుటంజేసి ఆగంతువ్రణములతో సమానంబులైనవి గాన ఆగంతువ్రణనిదానమును జెప్పినపిదప భగ్ననిదానము జెప్పబడుచున్నది.

---

శ్లో॥ భగ్నం సమాసాద్ద్వివిధం హుతాశ
కాణ్డే చ సన్ధౌ చ హి తత్ర సన్ధౌ।
ఉత్పిష్ట విశ్లిష్ట వివర్తితం చ
తిర్యగ్గతం క్షిప్తమధశ్చ షట్చ॥౧॥

తా॥ భగ్నంబనునది ఎముకలయందును కీళ్లయందును జనించుటంజేసి రెండువిధములు; ఆరెంటిలో సన్ధిగతభగ్నము ఉత్పిష్టంబనియు, విశ్లిష్టంబనియు, వివర్తితమనియు, తిర్యగ్గతమనియు, క్షిప్తమనియు, అధోగతమనియు నారువిధంబులు.

## సన్ధిగత భగ్న సామాన్య లక్షణము

శ్లో॥ ప్రసారణాకుఞ్చనవర్తనోగ్రా
రుక్స్పర్శవిద్వేషణమేతదుక్తమ్।
సామాన్యతస్సన్ధిగతస్య లిఙ్గమ్

**తా॥ హస్తపాదాదులను చాచునపుడును ముడుచునపుడును కదలించుచున్నపుడును కదలించకున్నపుడును మిగుల తీవ్రంబైన బాధ కల్గుట, హస్తముచే స్పృశించిన నోరువజాలకుండుట, ఈలక్షణములు సన్ధిగతభగ్నమునందు (కీళ్లువిరిగినప్పుడు) సామాన్యముగ గల్గునని యెరుంగునది.**

## ఉత్పిష్టాది సంధిభగ్నములకు వేర్వేరుగ లక్షణములు

శ్లో॥ ఉత్పిష్టసన్ధే శ్శ్వయథు స్సమన్తాత్॥౨॥
విశేషతో రాత్రిభవా రుజా చ
విశ్లిష్టజే తౌ చ రుజా చ నిత్యమ్।

తా॥ అవయవములు సడలియుండుట, వాపును బాధయు విశేషముగ వృద్ధినొందుట, చేత మర్దనజేసినపుడు శబ్దముకల్గుట, చేత తాకిన నోరువజాలకుండుట, విరిగినయెముకలు కదలుచుండుట, సూదులగ్రుచ్చినట్లు పోటు, శూల, ఎల్లప్పుడును శరీరమునకు సుఖములేక వేదనకల్గియుండుట, ఇవియన్నియు కాణ్డభగ్న సామాన్యలక్షణములని యెరుంగునది.

## కాణ్డభగ్న విశేషలక్షణములు

శ్లో॥ భగ్నం తు కాణ్డే బహుధా ప్రయాతి
సమాసతో నామభిరేవతుల్యమ్।

తా॥ పై జెప్పిన కాణ్డభగ్నము నానావిధంబులై యుండును గాన ఆయా నామానుసారముగ నాయా లక్షణముల నెరుంగునది యని భావము. పై జెప్పబడిన కాణ్డభగ్నములకు పంద్రెండింటికిని సుశ్రుతమునందు వివ్వేరుగ లక్షణములున్నని. దాని నిచ్చట సులభముగ దెలియుటకై వివరించెద. ఎముకకు నిరుప్రక్కల విరిగి మధ్యమున నున్నతంబై పైకికనబడుచుండునది కర్కటకమను భగ్నంబనియు, ఎముకవిరిగి గుఱ్ఱపు చెవివలె నున్నతముగ నుండునది యశ్వకర్ణంబనియు, ఎముక నలిగి స్పృశించినయెడ మృదువుగ నుండునది విచూర్ణితంబనియు, ఎముక నలిగి వెడలుపుగనుండి అధికమైన వాపుకల్గినది పిచ్చితంబనియు, ఎముకవిరిగి మధ్యమున పల్లముగనుండి యిరుప్రక్కల నున్నతంబై యుండునది అస్థిచ్ఛల్లికమనియు, ఎముకవిరిగి కదలించినయెడ పైకి పొడుచుకొని యుండునది కాండభగ్నంబనియు,యెముకలో నొకభాగము విరిగి యెముకలోపలనుండు మజ్జతో గలిసి మజ్జను సంచరించనీయక నడ్డగించునది మజ్జానుగతంబనియు, ఎముక పలువెరంగుల నలిగి రూపులేకుండునది అతిపాతితమనియు, ఎముక పగిలి ముండ్లతో నిండియున్నవిధంబుగ నున్నది స్ఫుటితంబనియు, ఎముక రెండు తునియలుగ విరగక వంగియుండునది వక్రంబనియు, ఎముకకు నొకభాగమున విరిగి మరియొక భాగమున జేరియుండునది ఛిన్నంబనియు, ఎముకకొకభాగమున పలువెరంగులచీలి యుండునది పాటితమనియు పంద్రెండింటి లక్షణముల నెరుంగునది. ప్రకృతమూలమున పాటితమను భగ్నమును ఛిన్నభేదంబుగ జెప్పెనని యెరుంగునది.

## కృచ్ఛ్రసాధ్య భగ్న లక్షణము

శ్లో॥ అల్పాశినోఽనాత్మవతో జన్తోర్వాతాత్మకస్య చ
ఉపద్రవైర్వా జుష్టస్య భగ్నం కృచ్ఛ్రేణ సిధ్యతి॥౭॥

తా॥ స్వల్పముగ భుజించువానికిని, ఇంద్రియముల నిగ్రహించలేనివానికిని, వాతప్రకృతిగలవానికిని జనించిన భగ్నంబును, ఉపద్రవములతోగూడిన భగ్నంబును గుల కష్టసాధ్యంబై యుండునని యెరుంగునది.

## అసాధ్యభగ్న లక్షణము

శ్లో॥ భిన్నం కపాలం కట్యాన్తు సన్ధిముక్తం తథా చ్యుతమ్॥
జఘనం ప్రతిపిష్టం చ వర్జయేద్ధి విచక్షణః॥౮॥

తా॥ కపాలంబులను పేరుకల యెముకలు భిన్నంబులైనను, కటిస్థలమునందలి యెముకలు భిన్నంబులైనను, కీళ్లువదలినను, ఎముక విరిగి తనచోటనుండి జారినను, కటిపురోభాగమున నుండు యెముకలు చూర్ణంబైనను అసాధ్యంబులగును గాన చికిత్సజేయుం జనదని భావము. ఇచ్చట ''జానునితమ్బాంసగణ్డతాలుశఙ్ఖవఙ్క్షణశిరస్సు కపాలాని'' అని సుశ్రుతమున జెప్పిన కపాలాస్థిలక్షణము నెరుంగునది. మోకాళ్లు, పిరుదులు, భుజశిరస్సులు, చెక్కిళ్లు, తాలువులు, కంఠము, గజ్జలు, శిరస్సు, ఈ స్థలములయందుండు యెముకలు కపాలము లనం జనునని భావము.

శ్లో॥ అసంశ్లిష్టకపాలం చ లలాటే చూర్ణితం చ యత్।
భగ్నం స్తనాన్తరే పృష్ఠే శఙ్ఖే మూర్ధ్ని చ వర్జయేత్॥౯॥

తా॥ కపాలాస్థులొండొంట గలియక తునియలైనను, నుదుటి కపాలాస్థి చూర్ణంబైనను, స్తనముల రెంటికి నడమనుండు యెముకలు విరిగినను, వెన్నెముక విరిగినను కంఠమునందును శిరస్సునందును కల యెముకలు విరిగినను అసాధ్యంబులు గాన చికిత్స జేయుంజనదని భావము.

శ్లో॥ సమ్యక్సంధితమప్యస్థి దుర్న్యాసనిబన్ధనాత్।
సంక్షోభాద్వాపి యద్గచ్ఛేద్విక్రియాం తచ్చ వర్జయేత్॥౧౦॥

తా॥ విరిగిన యెముకల నొకటిగ జేర్చి కట్టుగట్టి హెచ్చుతక్కువలైన స్థలములయందునిచినను, సమముగ జేర్చి యుక్తముగ కట్టుగట్టకున్నను, సమముగ చేర్చి కట్టుగట్టినను భయము అభిఘాతము మొదలగునవి కల్గినను కట్టుబడక చెడిపోవును. అట్లు విషమంబైనదియు నసాధ్యంబగునని భావము.

అస్థివిశేషములయందు కల్గు భగ్నభేదములు

శ్లో॥ తరుణాస్థీని నమ్యన్తే భిద్యన్తే నలకాని చ।
కపాలాని విభజ్యన్తే స్ఫుటన్తి రుచకాని చ॥౧౧॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
భగ్ననిదానం సమాప్తమ్



తా॥ తరుణాస్థులు వంగును. నలకంబులను యెముకలు పగులును. కపాలాస్థులు తునియలగును. రుచకములు చిట్లును. ఇచ్చట నాసికయందును కర్ణములయందును కన్నులయందు నుండు యెముకలు తరుణాస్థులనియు, మోకాళ్లయందును పిరుదులయందును భుజశిరస్సులయందును చెక్కిళ్లయందును తాలువులయందును కణతలయందును శిరస్సునందు నుండునవి కపాలాస్థులనియు, దన్తములు రుచకములనియు, హస్తములు, పాదములు, ఇరుప్రక్కలు, వీపు, ఉదరము, వక్షస్స్థలము, ఈ స్థలములనుండునవి వలయాస్థులనియు, ఈనాల్గుదక్క తక్కిన శరీరమునందలి యెముకలయున్ని

వలకములనియు సుశ్రుతమున జెప్పియున్నది. మరియు "రుచకాని చ" అనుచోట చకారము చేత రుచకములవలెనే వలయాస్థులుగూడ చిట్లుననియు నెరుంగవలెను.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్రవిరాజమాన దీవ్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపాలాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానార్థతాత్పర్యమునందు

భగ్ననిదానము

సమాప్తము





శ్రీహయగ్రీవాయ నమః

# శ్రీరస్తు



# నాడీవ్రణనిదానమ్



భగ్నవ్రణము నుపేక్షించుటచేగూడ నాడీవ్రణము (నారికురుపు) కల్గును గాన భగ్న నిదానమును జెప్పినపిదప నాడీవ్రణనిదానము జెప్పబడుచున్నది.



శ్లో॥ యశ్శోథమామమితి పక్వముపేక్షతేఽజ్ఞో
యో వా వ్రణం ప్రచురపూయమసాధువృత్తః।
అభ్యన్తరం ప్రవిశతి ప్రవిదార్య తస్య
స్థానాని పూర్వవిహితాని తతస్సపూయః॥౧॥

తా॥ పక్వంబైన వాపును పరిపక్వము గానిదియని తలచి చికిత్సజేయక యుపేక్షించినను, అధికముగ చీముచే నిండియుండు వ్రణములను పీడనశోధనాది చికిత్సల జేయక అపథ్యంబులగు నాహారాదులజేయుచు నుపేక్షించినను, అట్టి చీము చర్మము, మాంసము, సిరలు, స్నాయువులు, సంధులు, యెముకలు, కోష్ఠము, మర్మములు, వీనినన్నింటిని భేదించి లోనికి ప్రవేశించును. దీనిని నాడీవ్రణము (నారికురుపు) అని వ్యవహరించెదరు.

## నాడీవ్రణ భేదములు

శ్లో॥ తస్యాతిమాత్రగమనాద్గతిరిష్యతే తు
నాడీవ యద్వహతి తేన మతా తు నాడీ।
దోషైస్త్రిభిర్భవతి సా పృథగేకశశ్చ
సమ్మూర్ఛితైరపి చ శల్యనిమిత్తతోఽన్యా॥౨॥

తా॥ అట్టి చీము తీగ నాసాట ప్రబలమగు ఛందంబున శరీరములోనికి ప్రవేశించుట జేసి యిది నాడీవ్రణంబని చెప్పందగును. మరియు నీనాడీవ్రణము ప్రకోపమునొందిన వాతాదులచే వెవ్వేరుగను త్రిదోషముల చేతను శల్యము చేతను జనించుటంజేసి ఐదువిధంబులగునని యెరుంగునది.

మరియు తన్త్రాన్తరమున "దోషద్వయాభిహిత లక్షణదర్శనేన విద్యాద్ గతీర్వ్యతికరప్రభవాస్తు విద్యాత్" అని యున్నది. నాడీవ్రణములయందు రెండేసి దోషముల యొక్క లక్షణములు చేరియున్నయెడ రెండుదోషములుకలిసి ప్రకోపము నొందుటచే జనించిన

నాడీ వ్రణంబులుగా తెలియవలెనని భావము. ఈ వాక్యమునుబట్టి ప్రకృతమూలమున "ఏకశః" అనుపదమునకు మూడుదోషము లొక్కొకటి ప్రకోపించుటచే గల్గినది సన్నిపాతనాడీవ్రణం బనియు, "సమ్మూర్ఛితైః" అను పదమునకు రెండుదోషములు ఒకటిగ జేరి ప్రకోపించుటచే గల్గినది ద్వంద్వజనాడీ వ్రణంబనియు అర్థవిశేషము జెప్పి రెండుదోషములయొక్క సంసర్గముచే జనించు మూడువిధములైన నాడీవ్రణంబులును కలవని కొందరు వచించెదరు.

వాతికపైత్తిక నాడీవ్రణముల లక్షణములు

శ్లో॥ తత్రానిలాత్పరుష సూక్ష్మముఖీ సశూలా
ఫేనానువిద్ధమధికం స్రవతి క్షపాసు।
పిత్తాత్తృషా జ్వరకరీ పరిదాహయుక్తా
పీతం స్రవత్యధిక ముష్ణమహస్సు చాపి॥౩॥

తా॥ వ్రణద్వారము మిగుల సూక్ష్మంబును పరుషంబునై యుండుట, అధికముగ పోటు, రాత్రులయందు శీతలంబధికముగ నుండుటంజేసి వాతము మిగుల ప్రకోపమునొంది అధికముగ చీము గారుట, ఈ లక్షణములు కల్గినది వాతముచే జనించిన నాడీవ్రణంబని యెరుంగునది. దప్పియు జ్వరంబును మంటయు కల్గి మిగుల నుష్ణంబును పీతవర్ణంబునైన చీమును స్రవించుచున్న యెడ పిత్తముచే జనించిన నాడీవ్రణంబని యెరుంగునది.

కఫజ సన్నిపాతజ నాడీవ్రణ లక్షణములు

శ్లో॥ జ్ఞేయా కఫాద్బహుఘనార్జునపిచ్ఛిలాస్రా
స్తబ్ధాసకణ్డురరుజా రజనీప్రవృద్ధా।
దాహజ్వరశ్వసన మూర్ఛనవక్త్రశోషా
యస్యాం భవన్త్యభిహితాని చ లక్షణాని॥౪॥
తామాదిశేత్పవన పిత్తకఫ ప్రకోపాత్
ఘోరామసుక్షయకరీమివ కాళరాత్రిమ్।

తా॥ మిగుల చిక్కనై తెల్లని రంగుకల్గి పిచ్ఛిలంబైన చీముగారుట, స్తంభించియుండుట, దురదకల్గియుండుట, నొప్పిలేకుండుట, రాత్రులయందు వృద్ధినొందుట, ఈ లక్షణములు కల్గినది కఫముచే గల్గిన నాడీవ్రణంబని యెరుంగునది. తాపము, జ్వరము, శ్వాసము, మూర్ఛ, నోరెండుట, ఈ లక్షణంబులును, వాతాదులకు వేర్వేరుగ జెప్పియుండు లక్షణంబులును కల్గినది సన్నిపాతముచే జనించిన నాడీవ్రణంబని యెరుంగునది. అట్టి సన్నిపాతముచే జనించిన నాడీవ్రణము ప్రళయకాల రాత్రివలె మిగుల క్రూరంబై ప్రాణాంతకరంబై యుండునని యెరుంగునది.

శల్యజనాడీ వ్రణలక్షణము

శ్లో॥ నష్టం కథంచి దనుమార్గముదీరితేషు
స్థానేషు శల్యమచిరేణ గతిం కరోతి॥ ౫॥

సా ఫేనిలం కుథితముష్ణమసృగ్విమిశ్రం
స్రావం కరోతి సహసా సరుజా చ నిత్యమ్।

తా॥ కంటకము మున్నగాగల శల్యములు త్వక్మాంసాదులయందు ప్రవేశించి కొన్నికారణములచే కనుబడకుండి శీఘ్రముగ వ్రణమును కల్గించును. అయ్యది శల్యముచే గల్గిన నాడీవ్రణం బని చెప్పబడును. ఈ వ్రణమునందు నురుగుతో గూడినదియు, కలియబెట్టినట్లుండునదియు, ఉష్ణంబును, రక్తముతో గూడినదియునైన చీము స్రవించును. ఎల్లప్పుడు నెడలేని బాధ గల్గియుండును.

సాధ్యాసాధ్య నాడీవ్రణ లక్షణము

శ్లో॥ నాడీ త్రిదోషప్రభవా న సిధ్యేత్
శేషాశ్చతస్రః ఖలు యత్నసాధ్యాః॥౬॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
నాడీవ్రణ నిదానం సమాప్తమ్



తా॥ పై జెప్పబడిన నాడీవ్రణములలో సన్నిపాతముచే జనించిన నాడీవ్రణము మిగుల నసాధ్యంబై యుండును. తక్కిన నాల్గువిధములగు నాడీవ్రణంబులును కష్టసాధ్యంబులై యుండును.

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రిచర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యన్వాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపిక యను
మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు
నాడీవ్రణ నిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# భగన్దర నిదానమ్



నాడీవ్రణనిదానమును జెప్పినపిదప నాడీవ్రణవిశేషములోఁ జేరిన భగందరముయొక్క నిదానము జెప్పబడుచున్నది.



శ్లో॥ గుదస్య ద్వ్యఙ్గులే క్షేత్రే పార్శ్వతః పిడకార్తికృత్।
భిన్నో భగన్దరో జ్ఞేయస్స చ పఞ్చవిధో మతః॥౧॥

తా॥ గుదస్థానమునకు ప్రక్కన రెండంగులముల దూరమున మిగుల వేదనతోఁగూడిన పిటక (బొబ్బ) జనించి యట్టి పిటక పగిలినయెడ నయ్యది భగందరమని చెప్పందగును. అట్టి భగందరము ఐదువిధంబులై యుండును. తన్త్రాన్తరమునందు "భగం పరిసమన్తాచ్చ గుదం వస్తిం తథైవ చ। భగవద్దారయేద్యస్మాత్తస్మాద్జ్ఞేయో భగందరః॥" అని భగందరమున కన్వర్థసంజ్ఞ జెప్పియున్నది. భగము, గుదము, వస్తి, ఈమూడిటిని పగులదీసి లోపలనుండు మలమూత్రాదులను వెడలించుటంజేసి యీ వ్యాధి భగందరమని చెప్పందగునని భావము. మరియు నీ భగందరమునకు పూర్వరూపము సుశ్రుతమున నీవిధంబుగ జెప్పంబడియె: "కటీకపాలవేదనా గుదకణ్డూర్దాహశ్శోథశ్చ గుదస్య భవతి" కటిస్థలమున పలకవలెనుండు అస్థులయందు వేదనయు, గుదస్థానమున దురదయు, మంటయు, వాపును, భగందరము జనించుటకుమున్ను కల్గునని భావము.

శతపోనకంబను భగందర లక్షణము

శ్లో॥ కషాయరూక్షైస్త్వతికోపితోఽనిల।
స్త్వపానదేశే పిడకాం కరోతి యామ్।
ఉపేక్షణాత్పాకముపైతి దారుణం।
రుజా చ భిన్నారుణ ఫేనవాహినీ॥౨॥
తత్రాఽఽగమో మూత్రపురీషరేతసాం
వ్రణైరనేకైశ్శతపోనకం వదేత్।

తా॥ కషాయరసంబులును మిగుల రూక్షంబులునైన పదార్థములను సేవించుటచే వాతము మిగుల ప్రకుపితంబై గుదస్థలమున బొబ్బను కల్గించును; అట్టి బొబ్బను తగిన చికిత్సచేయక నుపే క్షించినయెడ పరిపక్వంబై పగిలి మిగుల క్రూరంబైన బాధతోగూడి యరుణవర్ణంబైన నురుగును వెడలించును. మరియు నచ్చోట జల్లెడవలె ననేకరంధ్రములుకల్గి యీ రంధ్రములనుండి మలమూ త్రములును శుక్రంబును స్రవించును. ఈయది జల్లెడవలె ననేకరంధ్రములు గల్గియుండుటంజేసి శతపోనకమని జెప్పందగును.

## ఉష్ట్రముఖభగన్దర లక్షణము

శ్లో॥ ప్రకోపణైః పిత్తమతిప్రకోపితం।
కరోతి రక్తాం పిడకాం గుదాశ్రితామ్॥౩॥
తదాశుపాకాహిమపూతివాహినీం
భగన్దరన్తూష్ట్రశిరోధరం వదేత్।

తా॥ పిత్త ప్రకోపకరంబులైన యాహారాదులచే పిత్తము మిగుల ప్రకుపితంబై గుదస్థాన మున రక్తవర్ణంబైన బొబ్బను కల్గించును. ఆ బొబ్బ జనించినతోడనే శీఘ్రముగ పరిపక్వంబై పగిలి మిగుల నుష్ణంబైన చీమును స్రవించుచుండును. దీనిని ఒంటెముఖమువలె మిగుల వక్రంబై యుండుటంజేసి ఉష్ట్రముఖంబను భగంధరమని వచించెదరు.

## పరిస్రావి భగన్దర లక్షణము

శ్లో॥ కణ్డూయనో ఘనస్రావీ కఠినో మన్దవేదనః।
శ్వేతావభాసః కఫజః పరిస్రావీ భగన్దరః॥

తా॥ దురదగల్గియుండుట, చిక్కనైయుండు చీమును స్రవించుట, కఠినంబుగనుండుట, స్వల్పమైన బాధ కల్గియుండుట, తెల్లనిరంగు కల్గియుండుట, ఈ లక్షణములు కల్గినది కఫముచే జనించిన పరిస్రావియను భగన్దరమని యెరుంగునది.

## శంబూకావర్త భగన్దర లక్షణము

శ్లో॥ బహువర్ణరుజాస్రావా పిడకా గోస్తనోపమా।
శంబూకావర్తవన్నాడీ శమ్బూకావర్తకో మతః॥౫॥

తా॥ నానావిధవర్ణంబులును నానావిధంబులగు బాధలనుకల్గి ఆవుచన్నువలె నిడుపుగల్గి జలపూర్ణంబులగు నదులలోనుండు నత్తగుల్లలయందలి సుడివలె ఆవర్తముగల్గి యుండు వ్రణము శంబూకావర్తంబను భగందరమని యెరుంగునది. ఈ వ్రణము సన్నిపాతముచే జనించును. మరియు “నదీనాం పరిపూర్ణానాం శమ్బూకావర్తకాయథా। సముత్తిష్ఠన్తి వేగేన తోయ వేగ సమీరితాః॥” అని భోజుండు జెప్పెను. జలముచే నిండియుండు నదులయందు ఉదక వేగముచేత సుడులు జనించుకరణి వ్రణము జనించినచో శంబూకావర్త భగందరమని భావము.

## ఉన్మార్గిభగన్దర లక్షణము

శ్లో॥ క్షతాద్గతిః పాయుగతే వివర్ధతే।
హ్యుపేక్షణాత్స్యుః క్రిమయో విదార్యతే।
ప్రకుర్వతే మార్గమనేకధా ముఖై।
ర్వ్రణై స్తమున్మార్గిభగన్దరం వదేత్॥౬॥

తా॥ కంటకాదులచే గుదస్థానమున గల్గిన గాయమును చికిత్సజేయక యుపేక్షించుటచేత నానాట వృద్ధినొంది క్రిములు కల్గును; ఆ పురుగులు అనేక ద్వారములు కల్గిన వ్రణములను కల్గించును. గాన ఈ వ్రణము ఉన్మార్గి యను భగందరమని యెరుంగునది.

మరియు అర్శోభగందరము గ్రన్థాన్తరమున నీరీతిగ జెప్పంబడియె: ''కఫపిత్తే తు పూర్వోత్థే దుర్నామాశ్రిత్య కుప్యతః। అర్శోమూలే తతశ్శోథం కణ్డూదాహార్తిమాన్ భవేత్। స శీఘ్రం పక్వభిన్నోఽస్య క్లేదయన్ మూలమర్శసః। స్రవత్యజస్రం గతిభిరయ మర్శోభగన్దరః॥'' కఫపిత్తములు రెండును ప్రకోపము నొంది అర్శస్సులయొక్క మూలస్థానము నాశ్రయించి యచ్చోట వాపును కల్గించును; పిమ్మట నా వాపు శీఘ్రముగ పక్వంబై పగిలి చీము నెత్తురు మొదలగువానిని ఎల్లప్పుడు స్రవింపజేయును. దీనిని అర్శోభగందరమని వచించెదరని భావము.

## సాధ్యాసాధ్య భగందర లక్షణములు

శ్లో॥ ఘోరాస్సాధయితుం దుఃఖాస్సర్వ ఏవ భగన్దరాః।
తేష్వసాధ్యస్త్రిదోషోత్థః క్షతజశ్చ విశేషతః॥౭॥
వాతమూత్ర పురీషాణి క్రిమయశ్శుక్రమేవ చ।
భగన్దరాత్స్రవన్తస్తు నాశయన్తి తమాతురమ్॥౮॥



ఇతి శ్రీ మాధవకర విరచితే మాధవనిదానే
భగన్దరనిదానమ్
సమాప్తమ్



తా॥ భగన్దరములన్నియు మిక్కిలి క్రూరంబులు గాన సామాన్యముగ కష్టసాధ్యంబులై యుండును. అందును త్రిదోషములచే జనించిన శంబూకావర్తంబను భగందరంబును, గాయముచే గల్గిన ఉన్మార్గి యను భగందరంబును, అసాధ్యంబులై యుండును. మరియు భగందరద్వారము

నుండి వాతము, మూత్రపురీషములు, పురుగులు, శుక్రము, ఇవి స్రవించుచున్నయెడ అట్టి భగందరము మనుజుని మరణము నొందించునని భావము.

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్ద సంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్రవిరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపాలాచార్య విరచితంబైన నిదానదీపిక యను మాధవనిదానార్థతాత్పర్యమునందు భగన్దర నిదానము సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః
శ్రీరస్తు

# ఉపదంశ నిదానమ్

భగన్దరనిదానమును జెప్పినపిదప అట్టి భగన్దరము జనించు స్థానమునకు సమీపస్థలమున జనించుటంజేసి భగందరమునకు సమానంబైన ఉపదంశ (కొరుకుసవాయి) రోగనిదానమును జెప్పుట.

శ్లో॥ హస్తాభిఘాతాన్నఖదన్తపాతా
దధావనాదత్యుపసేవనాద్వా।
యోనిప్రదోషాచ్చ భవన్తి శిశ్నే
పఞ్చోపదంశా వివిధోపచారైః॥౧॥

తా॥ హస్తములచేత మర్దనాద్యభిఘాతముల సేయుట, రతిసేయుకాలమున ననురాగాతిశయముచే నఖదన్తక్షతముల సేయుట, సంభోగము జేసినపిదప కడగకుండుట, అధికముగ సంభోగముచేయుట, భగమునందలి దోషములు కారణముగనుండు నీళ్లతో ప్రక్షాళనము మున్నగు విరుద్ధక్రియలజేయుట, ఈ కారణములచేత పురుషులయొక్క మేఢ్రమునందు ఐదువిధంబులైన ఉపదంశంబు లను వ్యాధులు జనించును.

వాతాదులచే జనించిన యుపదంశములకు సామాన్యలక్షణములు

శ్లో॥ సతోదభేదైస్స్ఫురణైస్సకృష్ణైః
స్ఫోటైర్వ్యవస్యేత్పవనోపదంశమ్।
పీతైర్బహుక్లేదయుతైస్సదాహైః
పిత్తేన రక్తాత్పిశితావభాసైః॥౨॥
స్ఫోటైస్సకృష్ణై రుధిరం స్రవన్తం
రక్తాత్మకం పిత్తసమానలిఙ్గమ్।
సకణ్డురైశ్శోథయుతైర్మహద్భిః
శుక్లైర్ఘనైః స్రావయుతైః కఫేన॥3॥

తా॥ సూదుల బొడిచిన విధంబుగ బాధకల్గుట, పగులుట, అదరుట, ఈలక్షణములతో గూడిన నల్లనిబొబ్బలు శిశ్నమునందు కల్గినయెడ వాతముచే జనించిన యుపదంశమనియు, మిక్కిలి

తడిగలిగి మంటతోఁగూడి పచ్చగనుండు బొబ్బలు కల్గినయెడ పిత్తముచే జనించిన యుపదంశమనియు; రక్తమువంటి రంగుకల్గి కృష్ణవర్ణంబులై రక్తమును స్రవించుచు పిత్తలక్షణములతోఁ గూడియుండు బొబ్బలు కల్గినయెడ రక్తముచే జనించిన యుపదంశమనియు; దురదయు వాపునుకల్గి బొబ్బలుకల్గినది కఫముచే జనించిన యుపదంశమనియు నెరుంగునది.

### సన్నిపాతోపదంశ లక్షణము

శ్లో॥ నానావిధస్రావరుజోపపన్న
మసాధ్యమాహుస్త్రిమలోపదంశమ్।

తా॥ నానావిధంబులైన స్రావంబును, పోటు, దప్పి మొదలగు బాధలను, కల్గియున్నయెడ త్రిదోషములచే జనించిన యుపదంశంబని యెరుంగునది. ఈ యుపదంశము మిగుల నసాధ్యంబని యెరుంగునది.

### అసాధ్యోపదంశ లక్షణము

శ్లో॥ విశీర్ణమాంసం క్రిమిభిః ప్రపన్నం
ముష్కావశేషం పరివర్జయేచ్చ ॥౪।

తా॥ మేఢ్రమునందలి మాంసము ఖండములుగ నున్నను, మేఢ్రమంతయు పురుగులచే నమలబడి వృషణములుమాత్రము మిగిలియున్నను, అట్టి యుపదంశముగల మనుజుండు బ్రతుకఁడు గాన చికిత్సజేయం జనదని భావము.

### ఉపదంశము న చికిత్సజేయనియెడ గల్గు బాధలు

శ్లో॥ సంజాతమాత్రే న కరోతి మూఢః
క్రియాం నరో యో విషయే ప్రసక్తః।
కాలేన శోథక్రిమిదాహపాకై
ర్విశీర్ణశిశ్నో మ్రియతే స తేన ॥౫॥

తా॥ పై జెప్పబడిన యుపదంశవ్యాధి జనించినయెడనే సంభోగమునందలి యాసకల్గి తగినచికిత్స జేయకున్నయెడ కొంతకాలమునకు వాపు పురుగులు మంట ఇవికల్గి అట్టివాపు పక్వంబై మేఢ్రము పలుదెరంగుల తునియలై మనుజుడు మరణము నొందును.

### లిఙ్గార్శో లక్షణము

శ్లో॥ అంకురైరివ సఞ్జాతైరుపర్యుపరి సంస్థితైః।
క్రమేణ జాయతే వర్తిస్తామ్రచూడశిఖోపమా॥౬॥
కోశస్యాభ్యన్తరే సన్ధౌ సర్వసన్ధిగతాఽపి వా।

* * స వేదనా పిచ్ఛిలా చ దుశ్చికిత్స్యా త్రిదోషజా। * *
లిఙ్గవర్తిరితి ఖ్యాతా లిఙ్గార్శ ఇతి చాపరే ॥౭॥

———(౦)———

ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
ఉపదంశనిదానం సమాప్తమ్



తా॥ శిశ్నముమీద కోడితలమీదనుండు జుట్టువలె తీక్ష్ణాగ్రంబులైన మొలకలు గుమిగూడిన చందమున నొకదానిపై నొకటి మాంసపుమొలకలు వరుసగానుండి నానాటికి వత్తివలె నేర్పడి యుండును. మేఢ్రముపైనుండు చర్మమునకు లోపలిసంధియందైనను, శిశ్నద్వారముయొక్క సంధియందైనను, ఈ రెంటియొక్క సంధులయందైనను ఈ వ్యాధి జనించి వేదనతో గూడి పిచ్ఛిలంబై యుండును. దీనిని లింగవర్తియనియు లింగార్శస్సు అనియు వచించెదరు. ఈ వ్యాధి సన్నిపాతముచే జనించును గాన మిక్కిలి యసాధ్యంబై యుండును. మరియు "స్త్రీణాం పుంసాం చ జాయన్తే ఉపదంశాస్సుదారుణాః" అని సుశ్రుతమున నుండుటంజేసి ఈవ్యాధి స్త్రీలకును పురుషులకును జనించుననియు సుశ్రుతమునకు భిన్నమగు చరకాది గ్రంథములయందు ఉపదంశము పురుషులకుమాత్రము గలుగునని యెరుంగునది.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యస్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపిక యను
మాధవనిదానార్థతాత్పర్యమునందు
ఉపదంశనిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః
శ్రీరస్తు

# శూకదోషనిదానమ్

ఉపదంశనిదానానన్తరము తత్సమానదేశమున జనించు శూకదోషనిదానమును చెప్పుట.

శ్లో॥ అక్రమాచ్ఛేఫసో వృద్ధిం యోఽభివాంఛతి మూఢధీః।
వ్యాధయస్తస్య జాయన్తే దశ చాష్టౌ చ శూకజాః॥౧॥

తా॥ మందమతియగు మనుజుండు అక్రమముగ మేఢ్రమును వృద్ధినొందించుటకై నీటియందు కప్పవలె నుండు విషజంతువును చేర్చిన ఔషధమును మేఢ్రమునకు లేపనము జేయుటచేత పదునెనిమిదివిధంబులైన శూకదోషము (పొక్కు-సవాయి మొదలగువ్యాధులు) జనించునని భావము.

## సర్షపికా లక్షణము

శ్లో॥ గౌరసర్షపసంస్థానా శూకదుర్భగ్నహేతుకా।
పిడకా శ్లేష్మవాతాభ్యాం జ్ఞేయా సర్షపికా తు సా॥౨॥

తా॥ పైజెప్పిన విధంబుగ మేఢ్రవృద్ధిజేయ నుద్యమించి శూకసంబంధమైన ఔషధమును శాస్త్రవిరుద్ధముగ లేపనము జేయుటచే కఫవాతములు ప్రకోపమునొంది తెల్లఆవాలవలె సన్నమై యుండు పొక్కులను కల్గించును; దానిని సర్షపిక యను శూకదోషంబని యెరుంగునది. ఇచ్చట "శూకదుర్భగహేతునా" అని పాఠాన్తరమును కొందరు వచించెదరు. శూకదోషముచే నైనను, దుష్టమైన భగముగలజవరాండ్రయొక్క సంబంధముచేనైనను సర్షపిక యను వ్యాధి జనించునని భావము.

## అష్ఠీలికా గ్రథితంబులను శూకదోషముల లక్షణము

శ్లో॥ కఠినా విషమైర్భుగ్నైర్వాయునాఽష్ఠీలికా భవేత్।
శూకైర్యత్పూరితం శశ్వద్గ్రథితం నామ తత్కఫాత్॥3॥

తా॥ ప్రశస్తములుకాని శూకములతోగూడిన ఔషధములను పూయుటచే వాతము ప్రకోపించి మిగుల కఠినంబులైన కురుపులు కల్గించును. ఇయ్యది అష్ఠీలికయను శూకదోషంబని యెరుంగునది. శూకములచే నెల్లపుడు నిండియున్నయెడ గ్రథితంబను శూకదోషమని యెరుంగునది. ఇయ్యది కఫప్రకోపముచే గల్గును.

## కుంభికా లక్షణము

శ్లో॥ కుమ్భికా రక్తపిత్తోత్థా జామ్బవాస్థినిభాఽశుభా।

తా॥ రక్తపిత్తములయొక్క ప్రకోపముచేత నేరేడుగింజవలె నుండు కురుపులు కల్గినయెడ కుంభి యను శూకదోషమని యెరుంగునది. ఇయ్యది మిక్కిలి బాధనుకల్గించును.

## అలజీ లక్షణము

శ్లో॥ తుల్యజాన్త్వలజీం విద్యాద్యథాప్రోక్తాం విచక్షణః॥౪॥

తా॥ ప్రమేహపిడకానిదానమునజెప్పిన అలజీలక్షణములతో గూడియుండునది అలజి యను శూకదోషంబని యెరుంగునది. అచ్చట "రక్తాసితాస్ఫోటచితా దారుణాత్త్వలజీభవేత్" అని మున్నువచించిన అలజీలక్షణముల నెరుంగునది. కొంచెముగ రక్తవర్ణముకల్గి తెల్లనైయుండు పొక్కులు కల్గినది అలజియని యర్థము.

## సంమూఢపిడకా లక్షణము

శ్లో॥ మృదితం పీడితం యచ్చ సంరబ్ధం వాతకోపతః।
పాణిభ్యాం భృశసమ్మూఢే సంమూఢపిడకా భవేత్ ॥౫॥

తా॥ శూకలేపనమును జేసినపిదప శిశ్నమును మిక్కిలి మర్దనజేయుటవలన వాపు కల్గినయెడ నయ్యది మృదితమని యెరుంగునది. ఇది వాతప్రకోపముచే గల్గును. మరియు శూకలేపనము జేసినవెనుక రెండుచేతులతో నధికముగ నలిపినయెడ ముఖంబేర్పడని కురుపును కల్గును. దీనిని సంమూఢ పిడకయను శూకదోషంబని యెరుంగునది.

## అధిమంథ లక్షణము

శ్లో॥ దీర్ఘా బహ్వ్యశ్చ పిడకా దీర్యన్తే మధ్యతస్తుయాః।
సోఽధిమన్థః కఫాసృగ్భ్యాం వేదనా రోమహర్షకృత్ ॥౬॥

తా॥ శూకలేపమువలన కఫరక్తములు ప్రకుపితంబులై మిగుల నిడుదలై మధ్యమున చీలియుండు పొక్కులు ననేకముగ శిశ్నమున గల్గించును. ఇయ్యది అధిమంథంబను శూకదోషంబని యెరుంగునది; మరియు నీవ్యాధియందు మిగుల తీవ్రంబైన వేదనయు గగురుపాటును కల్గును.

## పుష్కరికా లక్షణము

శ్లో॥ పిడకా పిడకావ్యాప్తా పిత్తశోణితసమ్భవా।
పద్మకర్ణికసంస్థానా జ్ఞేయా పుష్కరికా తు సా॥౭॥

తా॥ శూకలేపమువలన పిత్తరక్తములు ప్రకోపమునొంది సన్నని కురుపులచే వ్యాప్తంబైన కురుపు శిశ్నమున కల్గును. ఇయ్యది తామరమిద్దెవలె నుండుటంజేసి పుష్కరిక యను శూకదోషంబని యెరుంగునది.

## స్పర్శహాని లక్షణము

శ్లో॥ స్పర్శహానిం తు జనయేచ్ఛోణితం శూకదూషితమ్।

తా॥ శూకలేపనమువలన రక్తము దుష్టంబై స్పర్శజ్ఞానమును జెరచును. దీనిని స్పర్శహాని యను శూకదోషంబని యెరుంగునది.

ఉత్తమా లక్షణము

శ్లో॥ ముద్గమాషోపమా రక్తా రక్తపిత్తోద్భవా తు యా॥౮॥
వ్యాధిరేషోత్తమా నామ శూకాజీర్ణనిమిత్తతః।

తా॥ పలుమారు శూకలేపము జేయుటవలన రక్తపిత్తములు ప్రకుపితంబులై పెసలవలెను, మినుములవలె నుండు రక్తవర్ణంబైన కురుపును కల్గించును. ఈ వ్యాధి ఉత్తమ యను శూకదోషం బని యెరుంగునది.

శతపోనక లక్షణము

శ్లో॥ ఛిద్రైరణుముఖైర్లిఙ్గం చితం యస్య సమన్తతః॥౯॥
వాతశోణితజో వ్యాధిస్స జ్ఞేయశ్శతపోనకః।

తా॥ శూకలేపమును విపరీతముగ జేయుటచే వాతరక్తములు ప్రకుపితంబులై శిశ్నమునందు సూక్ష్మంబులైన ఛిద్రముల కల్గించును. దానంజేసి మేఢ్రము ఛిన్నభిన్నంబుగా నుండును. ఈ వ్యాధి జల్లెడవలె ననేకరంధ్రములుకల్గియుండుటంజేసి శతపోనక మనంబను.

త్వక్పాక లక్షణము

శ్లో॥ వాతపిత్తకృతో జ్ఞేయస్త్వక్పాకో జ్వరదాహకృత్।

తా॥ వాతపిత్తములు శూకలేపమువలన ప్రకోపించి శిశ్నముపై చర్మమును పుండుగ జేయును. దానంజేసి జ్వరంబును మంటయు కల్గును. దీనిని త్వక్పాకంబను శూకదోషమని వచించెదరు.

శోణితార్బుద లక్షణము

శ్లో॥ కృష్ణైస్స్ఫోటైస్సరక్తాభిః పిడకాభిర్నిపీడితమ్।
యస్య వాస్తురుజశ్చోగ్రా జ్ఞేయం తచ్ఛోణితార్బుదమ్॥౧౧॥

తా॥ కొంచెముగ రక్తవర్ణంబులును కొంచెము కృష్ణవర్ణంబులునైన బొబ్బలు శిశ్నమున కల్గి వ్రణముకల్గినచోట మిగుల తీవ్రంబైన వేదనకల్గినయెడ నయ్యది రక్తార్బుద మను శూకదోష మని యెరుంగునది.

మాంసార్బుద లక్షణము

శ్లో॥ మాంసదోషేణ జానీయాదర్బుదం మాంససమ్భవమ్।

తా॥ శూకలేపముచేసినపిదప అభిఘాతముచే మాంసము దుష్టంబై శిశ్నమున కురుపులు కల్గినయెడ నయ్యది మాంసార్బుదంబను శూకదోషంబని యెరుంగునది.

## మాంసపాక లక్షణము

శ్లో॥ శీర్యన్తే యస్య మాంసాని యస్య సర్వాశ్చ వేదనాః॥౧౨॥
విద్యాత్తం మాంసపాకం తు సర్వదోషకృతం భిషక్।

తా॥ శూకలేపముచేత శిశ్నమునందలి మాంసము కుళ్లి నానాటికి నూడిపోవుచు వాతపిత్త కఫములచే జనించు నొప్పి పోటు మంట మొదలగు వేదనలన్నియు కల్గినయెడ నయ్యది మాంస పాకమని చెప్పంబడును. ఈవ్యాధి దోషములన్నింటిచే కల్గునని యెరుంగునది.

## విద్రధి లక్షణము

శ్లో॥ విద్రధిం సన్నిపాతేన యథోక్తమితి నిర్దిశేత్॥౧౩॥

తా॥ శూకలేపముచేత సన్నిపాతముచే జనించు విద్రధియొక్క లక్షణములతోగూడి శిశ్న మున కురుపు లేచినయెడ విద్రధ యను శూకదోషంబని యెరుంగునది. ఇచ్చట "నానావర్ణరుజా స్రావో ఘటాలీ విషమో మహాన్। విషమం పచ్యతే చాపి విద్రధిస్సాన్నిపాతికః" అని మున్నువచించిన సన్నిపాతవిద్రధిలక్షణముల నెరుంగునది. నానావిధవర్ణవేద నలును స్రావంబును కల్గి పెడతలవలె నున్నతంబై విషమమును పాకమునొందునది సన్నిపాతజవిద్రధి యని యర్థము.

## తిలకాలక లక్షణము

శ్లో॥ కృష్ణాని చిత్రాణ్యథవా శూకాని సవిషాణి వా।
పాతితాని పచన్త్యాశు మేఢ్రం నిరవశేషతః॥౧౪॥
కాలాని భూత్వా మాంసాని శీర్యన్తే యస్య దేహినః।
సన్నిపాతసముత్థాంస్తు తాన్విద్యాత్తిలకాలకాన్॥౧౫॥

తా॥ కృష్ణవర్ణంబైనను లేక నానావర్ణంబులైనను కల్గి విషముతోగూడిన శూకములను లేపముచేయుటచేత శిశ్నమంతయు పాకమునొంది మాంసము నువ్వులవలె నల్లనై నానాటికి నూడి పడినయెడ నయ్యది నువ్వులవలె నల్లగానుండుటంజేసి తిలకాలకమనంబడును. ఈ వ్యాధి సన్నిపాత ముచే జనించును.

## అసాధ్య శూకదోష లక్షణము

శ్లో॥ తత్ర మాంసార్బుదం యచ్చ మాంసపాకశ్చ యస్స్మృతః।
విద్రధిశ్చ న సిధ్యన్తి యే చ స్యుస్తిలకాలకాః॥౧౬॥



ఇతి శ్రీ మాధవకర విరచితే మాధవనిదానే
శూకదోష నిదానం సమాప్తమ్



తా॥ పైజెప్పిన శూకదోషములలో మాంసార్బుదంబును, మాంసపాకంబును, విద్రధియు, తిలకాలకంబులును, అసాధ్యంబులని భావము.

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్ద సంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణాఖ్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు

శూకదోష నిదానము

సమాప్తము





శ్రీ హయగ్రీవాయనమః

శ్రీరస్తు

# కుష్ఠనిదానమ్

ఇవ్విధంబుగ పదునెనిమిది విధంబులైన శూకదోషముల నిదానమును జెప్పి పిదప శూక దోషములకు సమానమైన సంఖ్యకల కుష్ఠములయొక్క నిదానమును చెప్పుట.

శ్లో॥ విరోధీన్యన్నపానాని ద్రవస్నిగ్ధగురూణిచ।
భజతామాగతాం ఛర్దిం వేగాంశ్చాన్యాన్ప్రతిఘ్నతామ్॥౧॥
వ్యాయామమతిసన్తాపమతిభుక్త్వా నిషేవిణామ్।
ఘర్మశ్రమభయార్తానాం ద్రుతం శీతామ్బుసేవినామ్॥౨॥
అజీర్ణాధ్యశినాం చైవ పఞ్చకర్మాపచారిణామ్।
నవాన్నదధిమత్స్యాతిలవణామ్లనిషేవిణామ్॥౩॥
మాషమూలకపిష్టాన్న తిలక్షీరగుడాశినామ్।
వ్యవాయం చాప్యజీర్ణేఽన్నే నిద్రాం చ భజతాం దివా॥౪॥
విప్రాన్ గురూన్ధర్షయతాం పాపం కర్మ చ కుర్వతామ్।
వాతాదయస్త్రయో దుష్టాః త్వగ్రక్తం మాంసమమ్బుచ॥౫॥
దూషయన్తి స కుష్ఠానాం సప్తకో ద్రవ్యసంగ్రహః।
అతః కుష్ఠాని జాయన్తే సప్త చైకాదశైవచ॥౬॥

తా॥ ఒకటికొకటి విరుద్ధంబులైన క్షీరమత్స్యాదులగు అన్నపానములను సేవించుట, ద్రవములోగూడినవియు స్నిగ్ధంబులును గురుత్వమును చేయునవియు నైన పదార్థముల సేవించుట, పైకివెడలుచున్న వాంతిని మలమూత్రాది వేగములను నిరోధించుట, అధికముగ భుజించి దేహపరిశ్రమమును సంతాపకరంబులైన పనులను జేయుట, ఎండచేతను శ్రమచేతను భయముచేతను మిక్కిలి బడలియుండి విశ్రమించకయే శీఘ్రముగ మిగుల శీతంబగు జలమును పానముచేయుట, అజీర్ణపదార్థముల భుజించుట, అధికముగ భుజించుట, వమనము, విరేచనము, వస్తి, స్వేదనము, నస్యము, అను నీ పంచకర్మలను శాస్త్రపద్ధతి ననుసరించక విరుద్ధముగ జేసికొనుట, క్రొత్తబియ్యపు అన్నము, పెరుగు, మత్స్యములు ఈ పదార్థములను భుజించుట ఉప్పు పులుసును విశేషముగ భుజిం

చుట, మినుములు, ముల్లంగి, పిష్టాన్నము, నువ్వులు, పాలు, బెల్లము ఈ వస్తువులను విశేషముగ సేవించుట, అన్నము జీర్ణముగాకుండునపుడు స్త్రీసంభోగమును జేయుట, పవటియందు నిదురించుట, బ్రాహ్మణులను గురువులను ధిక్కరించుట, పాపకృత్యములజేయుట, ఇట్టి కారణములచేత వాతపిత్తశ్లేష్మములు మూడును ప్రకోపమునొంది చర్మము, రక్తము, మాంసము, రసము, ఈ నాల్గింటిని చెరచి కుష్ఠములను కల్గించును. మరియు వాత పిత్త శ్లేష్మంబులు, చర్మము, రక్తము, మాంసము, నీరు, ఈ యేడును ఏడువిధములైన మహాకుష్ఠములకును పదునొకండు విధంబులైన క్షుద్రకుష్ఠములకును ముఖ్యకారణములని యెరుంగునది.

మరియు "రక్తం లసీకా త్వఙ్మాంసం దూష్యం దోషాస్త్రయో మలాః। విసర్పాణాం సముత్పత్తౌ విజ్ఞేయాః సప్తధాతవః॥" అని యుండుటచేత విసర్పవ్యాధి యందును రక్తము, చర్మమున నుండు నీరు, చర్మము, మాంసము, వాత పిత్తశ్లేష్మములు, అనునీ యేడును కారణములై యుండును. ఈ వాక్యమునుబట్టి విసర్పములయందును కుష్ఠములయందును దోషదూష్యములు సమంబులై యున్నను చిరకాలమునకు వ్యాధిని కల్గించునవియు, స్థిరంబులును, బలిష్ఠములుకాని రక్తపిత్తములతో గూడినవియునైన దోషములచేత కుష్ఠములు జనించునవియు; అతిశీఘ్రముగ వ్యాధిని కల్గించునవియు, శరీరమునందంతట సంచరించు స్వభావము కల్గినవియు, బలిష్ఠంబులైన రక్తపిత్తములతో గూడినవియునైన దోషములచే విసర్పములు జనించునవియు కుష్ఠ విసర్పముల రెండింటికిని కారణభేదముల నెరుంగునది. మరియు కుష్ఠములకు పరద్రవ్యముల నపహరించుట గురువులను ధిక్కరించుట మున్నగునవిగూడ కారణములై యుండును. విసర్పమునకు కారణములు లేవు.

## కుష్ఠ భేదములు

శ్లో॥ కుష్ఠాని సప్తధా దోషైః పృథగ్ద్వన్ద్వైస్సమాగతైః।
సర్వేష్వపి త్రిదోషేషు వ్యపదేశోఽధికత్వతః॥౨॥

తా॥ మరియు కుష్ఠవ్యాధి వాత పిత్త శ్లేష్మములచేతను దోషద్వయసంసర్గముచేతను, సన్నిపాతముచేతను, జనించుటంజేసి యేడువిధంబులగును. కుష్ఠములన్నియు త్రిదోష సముదాయముచే జనించినను, దోషత్రయములో నెయ్యది మిగుల నధికముగా నుండునో అట్టి దోషముచే జనించినదియని యెరుంగునది.

## కుష్ఠపూర్వరూపములు

శ్లో॥ అతిశ్లక్ష్ణఖరస్పర్శస్వేదాస్వేదవివర్ణతాః।
దాహః కణ్డూస్త్వచి స్వాపః తోదః కోఠోన్నతిర్భ్రమః॥౮॥
వ్రణానామధికం శూలం శీఘ్రోత్పత్తిశ్చిరస్థితిః।
రూఢానామపిరూక్షత్వం నిమిత్తేఽల్పేఽతికోపనమ్॥౯॥
రోమహర్షోఽసృజః కార్ష్ణ్యం కుష్ఠలక్షణమగ్రజమ్।

తా॥ కుష్ఠము జనించుచోట హస్తముచే స్పృశించినయెడ నునుపుగల్గియుండుట, లేక గరగరలాడుచుండుట, అధికముగ చెమటబట్టుట, లేక చెమట బట్టకుండుట, వర్ణము మారియుండుట, మంటయు దురదయు కల్గుట, స్పర్శము నెరుంగకుండుట, సూదుల బొడిచిన విధంబుగ పోటుగల్గుట, కందిరీగలు కుట్టినరీతిగ దద్దులుకల్గుట, చిత్తభ్రమము కల్గుట, వ్రణములు అతిబాధతో గూడి శీఘ్రముగ జనించి చిరకాలము అనుసరించి యుండుట, వ్రణములు మానినను మిగుల రూక్షముగనుండుట, స్వల్పకారణముచేనైనను ప్రకోపము నొందుట, రోమాంచము కల్గుట, రక్తము నల్లగనుండుట, ఈ లక్షణములన్నియు కుష్ఠములు జనించుటకు మున్ను కల్గు పూర్వరూపములని యెరుంగునది.

## కపాలకుష్ఠ లక్షణము

శ్లో॥ కృష్ణారుణ కపాలాభం యద్రూక్షం పరుషం తను॥౧౦॥
కాపాలం తోదబహుళం తత్కుష్ఠం విషమం స్మృతమ్।

తా॥ నల్లనిరంగుకల్గియైనను ఎఱ్ఱనిరంగు కల్గియైనను కుండపెంకువలె మిగుల రూక్షంబును కఠినంబునై అధికమైన పోట్లుకల్గియున్నయెడ నయ్యది కపాలకుష్ఠంబని యెరుంగునది. ఈ కుష్ఠము మిగుల నసాధ్యంబై యుండును. ఈ కుష్ఠము వాతాధిక్యముచే గల్గునని యెరుంగునది.

## ఔదుంబరకుష్ఠ లక్షణము

శ్లో॥ రుగ్దాహరాగ కణ్డూభిః పరీతం రోమపిఙ్గరమ్॥౧౧॥
ఉదుమ్బరఫలాభాసం కుష్ఠమౌదుమ్బరం వదేత్।

తా॥ నొప్పి, మంట, ఎఱ్ఱనిరంగు, దురద, వీనిచే వ్యాప్తమై కపిలవర్ణంబులైన రోమములు కల్గి మేడిపండువలెనుండు కుష్ఠము ఔదుమ్బరంబని యెరుంగునది. మరియు నీ కుష్ఠము పిత్తాధిక్యముచే గల్గును.

## మండలకుష్ఠ లక్షణము

శ్లో॥ శ్వేతం రక్తం స్థిరం స్త్యానం స్నిగ్ధముత్సన్నమణ్డలమ్॥౧౨॥
కృచ్ఛ్రమన్యోన్యసంయుక్తం కుష్ఠం మణ్డలముచ్యతే।

తా॥ శ్వేతవర్ణంబైనను రక్తవర్ణంబైనను కల్గి కఠినంబై నీరుతోగూడి ఉన్నతంబైన పొడలుకల్గి యొకటిలోనొకటి కలిసియుండినయెడ ఆ కుష్ఠము మండలమని చెప్పందగును. ఈ కుష్ఠము కఫాధిక్యముచే గల్గును. మరియు నీ కుష్ఠము మిగుల నసాధ్యంబై యుండును.

## ఋష్యజిహ్వాకుష్ఠ లక్షణము

శ్లో॥ కర్కశం రక్తపర్యన్తం అన్తశ్శ్యావం సవేదనమ్॥౧౩॥
యదృష్యజిహ్వా సంస్థానమృష్యజిహ్వం తదుచ్యతే।

తా॥ మిగుల కర్కశంబై చుట్టు ఎఱ్ఱగను నడుమ నల్లగనుండి పోటుకల్గి దుప్పినాలుక వంటి యాకారము కల్గినది ఋష్యజిహ్వంబను కుష్ఠమని యెరుంగునది.

## పుండరీకకుష్ఠ లక్షణము

శ్లో॥ సశ్వేతం రక్తపర్యన్తం పుండరీకదలోపమమ్॥౧౪॥
సోత్సేధం చ సరాగం చ పుండరీకం తదుచ్యతే।

తా॥ నడుము తెల్లగను చుట్టు ఎఱ్ఱగనుండి తామరాకువలె గుండ్రనై యున్నతముగ నుండి ఎఱ్ఱగనుండునది పుండరీకంబను కుష్ఠంబని యెఱుంగునది.

## సిధ్మకుష్ఠ లక్షణము

శ్లో॥ శ్వేతం తామ్రం తను చ యద్రజో ఘృష్టం విముఞ్చతి॥౧౫॥
ప్రాయశ్చోరసి తత్సిధ్మ మలాబుకుసుమోపమం।

తా॥ శ్వేత రక్తవర్ణములు కలిగి సూక్ష్మాకారంబులై చేత రుద్దినయెడ పిండివలె పొట్టు రాలుచు సొరపువ్వులతో సమానముగ నుండునది సిధ్మకుష్ఠంబని యెఱుంగునది. ఈకుష్ఠము తఱుచుగ రొమ్మున కల్గును.

## కాకణాన్తికాకుష్ఠ లక్షణము

శ్లో॥ యత్కాకణన్తికావర్ణం సపాకం తీవ్రవేదనమ్॥౧౬॥
త్రిదోషలిఙ్గం తత్కుష్ఠం కాకణం నైవ సిధ్యతి।

తా॥ గురిగింజవలె నడుము నల్లగను చుట్టు రక్తవర్ణము కల్గి కొంచెముగ పుండగుచు తీక్ష్ణంబైన వేదన కల్గియుండునది కాకణాన్తిక యను కుష్ఠంబని యెఱుంగునది. ఈ కుష్ఠమునందు దోషత్రయంబును మిగుల ప్రకోపమునొంది యుండును గాన మిక్కిలి యసాధ్యంబై యుండును. ఇచ్చట కుష్ఠ సామాన్యముగ దోషత్రయములు ప్రకోపము నొందియున్నను కాకణంతిక యను కుష్ఠమున మిగుల క్రూరముగ ప్రకోపమునొంది యుండునని యెఱుంగునది. ఈ చెప్పంబడినకుష్ఠంబులేడును రసాదిధాతువులను శీఘ్రముగ వ్యాపించి యనేక దోషములచే జనించుటంజేసి మహాకుష్ఠంబులని చెప్పందగును. ఇచ్చట రసాదిధాతువులను శీఘ్రముగ వ్యాపించుచు అనేక దోషములచే జనించి బహువిధంబులగు చికిత్సలచే నసాధ్యంబులైనవి మహాకుష్ఠములని లక్షణము నెఱుంగునది.

## ఏకకుష్ఠ చర్మకుష్ఠ లక్షణము

శ్లో॥ అస్వేదనం మహావాస్తు యన్మత్స్యశకలోపమమ్॥౧౭॥
తదేకకుష్ఠం చర్మాఖ్యం బహులం హస్తిచర్మవత్।

తా॥ చమటబట్టకుండుట, విశాలంబైన తావున జనించుట, మత్స్యముయొక్క ఖండమువలె నుండుట, ఈలక్షణములు కల్గినది ఏకకుష్ఠంబనియు; గజచర్మమువలె మిగుల కర్కశంబై యుండునది చర్మకుష్ఠంబనియు నెఱుంగునది.

## కిటిభకుష్ఠ లక్షణము.

తా॥ శ్యావవర్ణంబై కురుపుయొక్క మచ్చవలె మిగుల కఠినమైన స్పర్శముకల్గి పరుషంబై యుండునది కిటిమంబను కుష్ఠమని యెరుంగునది.

వైపాదికకుష్ఠ లక్షణము

శ్లో॥ వైపాదికం పాణిపాదస్ఫుటనం తీవ్రవేదనమ్।

తా॥ హస్తములయందును పాదములయందును పగులుచు మిగుల తీవ్రంబయిన బాధకల్గి యున్నయెడ వైపాదికమను కుష్ఠంబని యెరుంగునది.

అలసకకుష్ఠ లక్షణము

శ్లో॥ కణ్డూమద్భిస్సరాగైశ్చ గణ్డైరలసకం చితమ్॥ ౧౯॥

తా॥ దురదకల్గి యెఱ్ఱనై యుండు దద్దుతోగూడి యుండునది అలసకంబను కుష్ఠంబని యెరుంగునది.

దద్రుమండల కుష్ఠ లక్షణము

శ్లో॥ సకండూరాగపిడకం దద్రుమణ్డలముద్గతమ్।

తా॥ దురదకల్గి యెఱ్ఱగానుండు సన్నని బొబ్బలతోగూడి పైకెత్తిగలదు మున్నది దద్రుమండల కుష్ఠంబని యెరుంగునది.

చర్మదల కుష్ఠ లక్షణము

శ్లో॥ రక్తం సశూలం కండూమత్ సస్ఫోటం యద్దలత్యపి।
తచ్చర్మదలమాఖ్యాతం సంస్పర్శాసహముచ్యతే ॥ ౨౦॥

తా॥ ఎఱ్ఱని మచ్చలు కల్గియుండుట, నొప్పియు దురదయు కల్గియుండుట, పగిలి నీరు గారుచుండుట, హస్తముచే స్పృశించినను ఓరువలేకుండుట, ఈ లక్షణములు కల్గియుండునది చర్మదలంబను కుష్ఠంబని యెరుంగునది.

పామా కచ్ఛు లక్షణములు

శ్లో॥ సూక్ష్మా బహ్వ్యః పిడకాస్స్రావవత్యః
పామేత్యుక్తాః కణ్డుమత్యస్సదాహాః।
సైవస్ఫోటైస్తీవ్రదాహైరుపేతా
జ్ఞేయాపాణ్యోః కచ్ఛురుగ్రాస్ఫిచోశ్చ ॥ ౨౧॥

తా॥ మిగుల స్వల్పంబైన యాకారముకల్గి చీము మొదలగునవి స్రవించుచు దురదయు మంటయు కల్గి యనేకములైన బొబ్బలుకల్గినయెడ నయ్యది పామయను కుష్ఠంబని చెప్పందగును. మిగుల తీవ్రంబైన మంటకల్గిన బొబ్బలు చేతులయందును గొంతియందును కల్గినయెడ కచ్ఛువను కుష్ఠంబని యెరుంగునది.

### విస్ఫోట కుష్ఠ లక్షణము

శ్లో॥ స్ఫోటాః శ్యావారుణాభాసా విస్ఫోటాస్స్యుస్తనుత్వచః।

తా॥ శ్యామవర్ణంబును అరుణవర్ణంబును కల్గి మిగుల సూక్ష్మముగా నుండు చర్మమున బొబ్బలు జనించినయెడ విస్ఫోటంబను కుష్ఠంబని యెఱుంగునది.

### శతారు కుష్ఠ లక్షణము

శ్లో॥ రక్తం శ్యావం సదాహార్తి శతారుస్స్యాద్బహువ్రణమ్॥౨౨॥

తా॥ రక్తవర్ణంబును శ్యామవర్ణంబునై మంటయు నొప్పియు కల్గి యనేక వ్రణములతో గూడి యుండునది శతారువను కుష్ఠంబని యెఱుంగునది.

### విచర్చికా కుష్ఠ లక్షణము

శ్లో॥ సకణ్డూః పిడకా శ్యావా బహుస్రావా విచర్చికా।

తా॥ దురదతోకూడి శ్యామవర్ణంబై అనేకద్వారములనుండి పూయాగులను స్రవించుచున్నయెడ విచర్చికయనంజను. ఇచ్చట "దోషాః ప్రదూష్య త్వఙ్మాంసం పాణిపాదసమాశ్రితాః। పిడకాం జనయన్త్యాశు దాహకండూసమన్వితామ్। దాల్యతే త్వఖరారూక్షా పాణ్యోర్జ్ఞేయా విచర్చికా। పాదే విపాదికా జ్ఞేయా స్థానాన్యత్వాద్విచర్చికా" అని భోజుండు తన్త్రాన్తరమున జెప్పెను. వాతాదిదోషములు ప్రకుపితంబులై చర్మమాంసములను చెరచి హస్తపాదముల నాశ్రయించి మంటయు దురదయు కల్గిన కురుపులను కల్గించును; దానంజేసి హస్తములయందు చర్మము మిగుల కర్కశంబై పగిలినయెడ విచర్చికయనియు, పాదములయందు జనించి పగిలినయెడ విపాదికయనియు చెప్పంబడును. ఈ వ్యాధి స్థానభేదముచే నామభేదము కల్గియుండును గాని పరస్పరభేదము వాస్తవముగ లేదని యర్థము. ఈవాక్యముచేత ప్రకృతగ్రన్థమున విచర్చికా విపాదికా వ్యాధులకు పరస్పరభేదములు లేవుగాన ఏకకుష్ఠము మొదలుజేసి విచర్చికాపర్యంతముననుండు కుష్ఠములు అన్నియుజేరి పదునొకండగును గాన సంఖ్యాభేదము లేదని యెఱుంగునది.

### వాతాదులచే జనించిన కుష్ఠ లక్షణము

శ్లో॥ ఖరం శ్యావారుణం రూక్షం వాతకుష్ఠం సవేదనమ్॥౨౩॥
పిత్తాత్ప్రకుథితం దాహరాగస్రావాన్వితం మతమ్।
కఫాత్క్లేది ఘనం స్నిగ్ధం సకండూశైత్యగౌరవమ్॥౨౪॥
ద్విలిఙ్గం ద్వన్ద్వజం కుష్ఠం త్రిలిఙ్గం సాన్నిపాతికమ్।

తా॥ కఠినంబును, శ్యామారుణవర్ణంబును, రూక్షంబునై వేదనతో గూడియుండునది వాతముచే జనించిన కుష్ఠమనియు; కుళ్లియుండుట, తాపము, ఎఱ్ఱనిరంగు కల్గియుండుట, చీము మొదలగునవి స్రవించుట, ఈ లక్షణములతో గూడియుండునది పిత్తముచే జనించిన కుష్ఠంబనియు;

ద్రవముతో కూడి మిగుల ఘనంబును నునుపు గల్గి దురదయు శీతలత్వంబును గురుత్వంబును కల్గినది కఫముచే జనించిన కుష్ఠంబనియు; వాతాదులు ప్రత్యేకముగ జెప్పిన లక్షణములలో రెండేసి దోషములయొక్క లక్షణములు కల్గినది ద్వంద్వముచే జనించిన కుష్ఠంబనియు; దోషత్రయలక్షణములు కల్గినది సన్నిపాతముచే జనించిన కుష్ఠంబనియు నెఱుంగునది.

## రసరక్తాది ధాతుగత కుష్ఠ లక్షణము

శ్లో॥ త్వక్స్థే వైవర్ణ్యమఙ్గేషు కుష్ఠే రౌక్ష్యం చ జాయతే॥ ౨౫॥
త్వక్స్వాపో రోమహర్షశ్చ స్వేదస్యాతిప్రవర్తనం।
కణ్డూర్విపూయకశ్చైవ కుష్ఠే శోణితసంశ్రితే॥ ౨౬॥
బాహుల్యం వక్త్రశోషశ్చ కార్కశ్యం పిడకోద్గమః॥
తోదస్స్ఫోటస్స్థిరత్వం చ కుష్ఠే మాంససమాశ్రితే॥ ౨౭॥
కౌణ్యం గతిక్షయోఽఙ్గానాం సంభేదః క్షతసర్పణమ్।
మేదస్స్థానగతే లిఙ్గం ప్రాగుక్తాని తథైవ చ॥ ౨౮॥
నాసాభఙ్గోఽక్షిరాగశ్చ క్షతేషు క్రిమిసమ్భవః।
స్వరోపఘాతశ్చ భవేదస్థిమజ్జసమాశ్రితే॥ ౨౯॥

తా॥ కుష్ఠము రసధాతువు నాశ్రయించినపుడు శరీరమున వర్ణము మారియుండుట, రూక్షముగనుండుట, స్పర్శము నెఱుంగకుండుట, గగుర్పాటు కల్గుట, అధికముగ చెమటబట్టుట ఈ లక్షణములు కల్గును. రక్తధాతువు నాశ్రయించినపుడు మిగుల దురద కల్గి అధికముగ చీము కారుచుండును. కుష్ఠము మాంసము నాశ్రయించియున్నపుడు కుష్ఠంబధికముగనుండుట, నోరెండుట, గరగర లాడుచుండుట, బొబ్బలు కల్గుట, పోటు, పగులుట, చిరకాలము అనుసరించియుండు ఈ లక్షణములు కల్గును. మేదస్సు నాశ్రయించినపుడు హస్తపాదములు చేష్టలు దక్కియుండుట, అవయవము లన్నియు నొచ్చుట, శరీరమంతయు పగిలి వ్రణంబులు గల్గుట, రసరక్తమాంసగత కుష్ఠలక్షణములు కల్గియుండుట, ఈ లక్షణములు కల్గును. అస్థిమజ్జల నాశ్రయించియున్నపుడు ముక్కు పగులుట, కన్నులెఱ్ఱగనుండుట, వ్రణములయందు పురుగులు పుట్టుట, కంఠస్వరము నశించియుండుట, ఈ లక్షణములు కల్గును.

## శుక్రజ కుష్ఠ లక్షణము

శ్లో॥ దమ్పత్యోః కుష్ఠబాహుల్యాద్దుష్టశోణితశుక్రయోః।
యదపత్యం తయోర్జాతం జ్ఞేయం తదపి కుష్ఠితమ్ ॥౩౦॥

తా॥ దంపతుల కిరువురకు కుష్ఠము ప్రబలముగా నున్నయెడ దానంజేసి వారి శుక్రశోణితములు దుష్టంబులై యుండును; వారికి జనించిన శిశువు కుష్ఠరోగముచే పీడింపబడును. ఇది శుక్రగత కుష్ఠమని యెఱుంగునది. ఇచ్చట పురుషులకు శుక్రమువలెనే స్త్రీలకు ఋతుశోణితము పుత్రోత్పాదకము గాన అట్టి యార్తవము కుష్ఠవ్యాధిచే దుష్టంబైనచో దాన జనించు శిశువునకు కుష్ఠము

కల్గునని యెరుంగునది. మరియు "తదపి" అను నట్టి అపిశబ్దమువలన పైజెప్పబడిన రసరక్తమాంస మేదోఽస్థిమజ్జల నాశ్రయించిన కుష్ఠముల లక్షణములు గూడ శుక్రగతకుష్ఠమునందు గానంబడు నని భావము.

## సాధ్యాసాధ్య కుష్ఠ లక్షణములు

శ్లో॥ సాధ్యం త్వగ్రక్తమాంసస్థం వాతశ్లేష్మాధికం చ యత్।
మేదసి ద్వంద్వజం యాప్యం వర్జ్యం మజ్జాస్థిసంశ్రితమ్॥౩౦॥
క్రిమితృడ్దాహమందాగ్నిసంయుక్తం యత్త్రిదోషజమ్।
ప్రభిన్నం ప్రస్రుతాంగం చ రక్తనేత్రం హతస్వరమ్॥౩౧॥
పంచకర్మగుణాతీతం కుష్ఠం హంతీహ మానవమ్।

తా॥ త్వగ్రక్తమాంసముల నాశ్రయించిన కుష్ఠంబును, వాతకఫములు ప్రధానముగానుండు కుష్ఠంబును, సాధ్యంపడగియుండును. మేదోగతంబైన కుష్ఠంబును, దోషద్వయసంసర్గముచే గల్గిన కుష్ఠంబును యాప్యంబై యుండును. మజ్జను అస్థులను ఆశ్రయించిన కుష్ఠంబు అసాధ్యంబుగానుండును, మరియు పురుగులు వ్రణములయందు గల్గి దప్పి, తాపము, అగ్నిమాంద్యము, ఈ లక్షణములతో గూడిన కుష్ఠంబును, సన్నిపాతముచే జనించిన కుష్ఠంబును, శరీరము పగిలి నీరుకారుచుండు కుష్ఠంబును, కన్ను లెఱ్ఱనై హీనస్వరము కల్గిన కుష్ఠంబును, వమనవిరేచనాది పంచకర్మలజేసినను స్వస్థముగాకుండు కుష్ఠంబును మనుజుని చంపును. కావున యిగుల నసాధ్యంబులని భావము.

## వాతాది జనితకుష్ఠ విభాగము

శ్లో॥ వాతేన కుష్ఠం కాపాలం పిత్తేనౌదుంబరం కఫాత్॥౩౩॥
మండలాఖ్యం విచర్చీ చ ఋష్యాఖ్యం వాతపిత్తజమ్।
చర్మైకకుష్ఠం కిటిభం సిధ్మాలసవిపాదికాః॥౩౪॥
వాతశ్లేష్మోద్భవాః శ్లేష్మపిత్తాద్దద్రుశతారుషీ।
పుండరీకం సవిస్ఫోటం పామా చర్మదలం తథా॥౩౫॥
సర్వైస్స్యాత్కాకణం పూర్వత్రికం దద్రు సకాకణమ్।
పుండరీకర్ష్యజిహ్వే చ మహాకుష్ఠాని సప్త తు॥౩౬॥

తా॥ కపాలకుష్ఠము వాతముచే జనించుననియు, ఔదుమ్బరకుష్ఠము పిత్తముచే జనించుననియు, మండలకుష్ఠము కఫముచే జనించుననియు, విచర్చికా ఋష్యంబులనుకుష్ఠములు వాతపిత్తములచే జనించుననియు, చర్మకుష్ఠము, ఏకకుష్ఠము, కిటిమకుష్ఠము, సిధ్మము, అలసము, విపాదిక, ఈ కుష్ఠములన్నియు వాతశ్లేష్మములచే జనించుననియు; దద్రుకుష్ఠము, శతారుషకుష్ఠము; పుండరీకము, విస్ఫోటము, పామ, చర్మదలము, అను నీకుష్ఠములారును కఫపిత్తములచే జనించుననియు, కాకణాంతికకుష్ఠము సన్నిపాతముచే జనించుననియు భావము. మరియు కపాల, ఔదుం

బర, మండల, దద్రు, కాకణ, పుండరీక, ఋష్యజిహ్వాంబులను కుష్ఠంబులేడును మహాకుష్ఠంబులు. తక్కిన పదునొకండు కుష్ఠములు క్షుద్రకుష్ఠంబులని భావము.

శ్విత్ర లక్షణము

శ్లో॥ కుష్ఠైకసమ్భవః శ్విత్రం కిలాసం వారుణం భవేత్।

నిర్దిష్టమపరిస్రావి త్రిధాతూద్భవ సంశ్రయమ్॥32॥

తా॥ కుష్ఠమునకు సమాన నిదానముకల్గినది శ్విత్రమనియు, కిలాసమనియు, వారుణమనియు, చెప్పందగును. ఇయ్యది వాతపిత్తశ్లేష్మములచేత రక్తమాంసమేదస్సుల నాశ్రయించి జనించును; రక్తాదిస్రావము లేకుండును. ఇచ్చట, "త్రిధాతూద్భవ సంశ్రయమ్" అన్నచోట ధాతుశబ్దమునకు వాతపిత్తశ్లేష్మములనియు రక్తమాంసమేదస్సులనియు అర్థము గాన వాతాదులచే రక్తాదుల నాశ్రయించి జనించునది శ్విత్రమని యర్థము నెరుంగునది.

శ్విత్రములయందు దోషభేదముచేగల్గు వర్ణభేదములు

శ్లో॥ వాతాద్రూక్షారుణం పిత్తాత్తామ్రం కమలపత్రవత్।

సదాహం రోమవిధ్వంసి కఫాచ్ఛ్వేతం ఘనం గురు॥33॥

సకణ్డూరం క్రమాద్రక్తమాంసమేదస్సుచాదిశేత్।

తా॥ అందు వాతముచే జనించిన శ్విత్రము రూక్షంబును, అరుణవర్ణంబునై యుండును. పిత్తముచే జనించినది ఎఱ్ఱదామరరేకువలె రక్తవర్ణంబును మంటతో గూడినదియు, రోమములను నశింపజేయునదియునై యుండును. కఫముచే జనించినది శ్వేతవర్ణంబును, మిగుల ఘనంబును, భారముగనుండునదియు, దురదతో గూడినదియునై యుండును. పై జెప్పబడిన వాతపిత్తశ్లేష్మములచేత వరుసగా రక్తమాంసమేదస్సులయందు జనించునని యర్థము. వాతముచేత అరుణవర్ణంబైన శ్విత్రము రక్తమున జనించుననియు, పిత్తముచేత తామరరేకువలె తామ్రవర్ణంబైన శ్విత్రము మాంసమున జనించుననియు, కఫముచేత శ్వేతవర్ణంబైన శ్విత్రము మేదస్సున జనించుననియు భావము. మరియు నీయర్థము చరకునకూడ కొనంబడియెడు "దోషే రక్తాశ్రితే రక్తం తామ్రం మాంససమాశ్రితే। శ్వేతం మేదశ్రితే శ్విత్రం గురు తచ్చోత్తరోత్తరమ్" అని యున్నది. దోషము రక్తము నాశ్రయించినపుడు రక్తవర్ణంబైన శ్విత్రంబును, మాంసము నాశ్రయించినపుడు తామ్రవర్ణమైన శ్విత్రంబును, మేదస్సునాశ్రయించినపుడు శ్వేతవర్ణంబైన శ్విత్రంబును కల్గుననియు; ఈమూడిటిలో నొకటికన్న నొకటి బలిష్ఠంబై యుండుననియు భావము.

శ్లో॥ వర్ణేనైవేదృగుభయం కృచ్ఛ్రం తచ్చోత్తరోత్తరమ్ ॥34॥

తా॥ దోషజ వ్రణజ భేదములచేత రెండువిధములైన శ్విత్రములను అరుణ తామ్ర శ్వేతవర్ణముల మూడిటిచేత వరుసగ రక్తమాంసమేదస్సులయందు జనించినదియని యెరుంగునది. మరియు రక్తజ శ్విత్రమునకంటె మాంసజము కృచ్ఛ్రసాధ్యంబనియు దానికన్న మేదస్సునకల్గినది కృచ్ఛ్రసాధ్యతమంబనియు భావము. మరియు శ్విత్రమునకు భోజుండు భేదద్వయమును జెప్పెను. "శ్విత్రం తు ద్వివిధం విద్యాద్దోషజం వ్రణజం తథా। తత్ర మిథ్యోపచారాద్ధి వ్రణస్య

వ్రణజం స్మృతమ్। దోషజం తు ద్విధా ప్రోక్తం ఆత్మజం పరజం తథా। పరసంస్కారసంస్పర్శాద్యత్తత్పరజముచ్యతే। తదాత్మజం విజానీయాద్యద్దేహేష్వనిలాదిజమ్'' అని యున్నది. శ్విత్రము దోషజమనియు వ్రణజమనియు రెండువిధములు. అందు వ్రణము కల్గినప్పుడు అపథ్యాహారాదులచే జనించిన దోషజశ్విత్రము ఆత్మజమనియు, పరజమనియు, రెండు విధంబులు. అందు శ్విత్రము కల్గినవారికి శుశ్రూషాదులజేయుట వారిని స్పృశించుట మొదలగు కారణములచే జనించినది పరజమనియు, స్వదేహమునందు వాతాదిదోషములయొక్క ప్రకోపముచే జనించినది ఆత్మజమనియు నెరుంగవలెనని భావము.

## సాధ్యాసాధ్యశ్విత్ర లక్షణములు

శ్లో॥ అశుక్లరోమాబహుళం అసంశ్లిష్టమథో నవమ్।
అనగ్నిదగ్ధజం సాధ్యం శ్విత్రం వర్జ్యమతోఽన్యథా॥౮౦॥
గుహ్యపాదతలౌష్ఠేషు జాతమప్యచిరన్తనం।
వర్జనీయం విశేషేణ కిలాసం సిద్ధిమిచ్ఛతా॥౮౧॥

తా॥ మచ్చలయందలి వెంట్రుకలు నెరసియుండక నల్లగానున్నను, మచ్చలు స్వల్పముగనున్నను, మచ్చలొకటితో నొకటి కలియకున్నను, నూతనముగ జనించినను, నిప్పునకాలి జనించక వాతాదిదోషములచే జనించినను, అట్టి శ్విత్రములు సాధింపందగియుండును. అటుగాక, మచ్చలలో వెంట్రుకలు నెరసినను, అతివిశాలముగా నున్నను, మచ్చలొండొంట కలిసినను, నిప్పునకాలి మచ్చలు జనించినను, శ్విత్రము మిగుల నసాధ్యంబని భావము. మరియు గుహ్యస్థలమునందును, అరచేతులయందును, పెదవులయందును, జనించిన శ్విత్రము చిరకాలము గడవక నూతనముగ జనించినను సాధ్యంబుగాదు కాన వైద్యునిచే విడువందగును. చరకమునం దసాధ్యశ్విత్ర లక్షణము లిట్లెరంగున నున్నవి: ''యచ్ఛుక్లరోమబహుళం యత్సంలగ్నం పరస్పరమ్। యచ్చ వర్షగణోపేతం తచ్ఛ్విత్రం నైవ సిధ్యతి॥'' తెల్లని రోమములతోగూడిన శ్విత్రంబును, మిక్కిలి విశాలమై యుండు శ్విత్రంబును, మచ్చలొండొంట గలిసిన శ్విత్రంబును, చిరకాలము గడచిన శ్విత్రంబును సాధ్యముగాదని భావము.

## సంసర్గముచే జనించు వ్యాధులు

శ్లో॥ ప్రసఙ్గాద్గాత్రసంస్పర్శా న్నిశ్వాసాత్సహ భోజనాత్।
ఏకశయ్యాసనాచ్చైవ వస్త్రమాల్యానులేపనాత్॥౮౨॥
కుష్ఠం జ్వరశ్చ శోషశ్చ నేత్రాభిష్యన్ద ఏవ చ।
ఔపసర్గికరోగాశ్చ సఙ్క్రామన్తి నరాన్నరమ్॥౮౩॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే

కుష్ఠనిదానం సమాప్తమ్



తా॥ కుష్ఠము, జ్వరము, శోష, నేత్రరోగము, పిశాచాదులచే గల్గు వ్యాధులు, ఈ రోగములన్నియు ఇట్టి రోగములుగల వారితో సంభోగముచేయుట, శరీరస్పర్శకల్గుట, నిట్టూర్పుగాలి సోకుట, ప్రక్కనకూర్చుండి భుజించుట, ఒక్కశయ్యయందు పరుండుట, ఒక్క ఆసనమున కూర్చుండుట, వారు ధరించిన వస్త్రములను పుష్పమాలికలను చందనాదులను ఉపయోగించుట, ఇట్టి కారణములచేత ఒకనికి కల్గినవ్యాధి మరియొకనికి సంబంధించి వచ్చునని యెరుంగునది.

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్రవిరాజమాన దీవ్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపాలాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానాంధ్రతాత్పర్యమునందు

కుష్ఠనిదానము

సమాప్తము





శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# శీతపిత్తోదర్దకోఠనిదానమ్

శీతపిత్తాదులు కుష్ఠమునుబోలె త్రిదోషముచే జనించి చర్మమును చేరచును గాన కుష్ఠనిదానమును జెప్పినపిదప శీత పిత్త ఉదర్ద కోఠనిదానములు వివరించబడుచున్నవి.

శ్లో॥ శీతమారుత సంస్పర్శాత్ప్రదుష్టౌ కఫమారుతౌ।
పిత్తేన సహ సంభూయ బహిరన్త ర్విసర్పతః॥౧॥

తా॥ దేహమునందు చల్లని గాలియొక్క స్పర్శము కల్గుటచే కఫవాతంబులు రెండును దుష్టంబులై పిత్తమును వృద్ధినొందించు కారణములచే ప్రకోపమునొందిన పిత్తముతోగూడి చర్మయునందును శరీరమునకు లోప్రక్క రక్తమాంసాదులయందును వ్యాపించును. ఈ వ్యాధి శీతపిత్తమని చెప్పంబడును.

## శీతపిత్తాది పూర్వరూపములు

శ్లో॥ పిపాసారుచి హృల్లాస దేహసాదాఙ్గగౌరవం।
రక్తలోచనతా తేషాం పూర్వరూపస్య లక్షణమ్॥౨॥

తా॥ దప్పి, అరుచి, ఓకరింతలు, శరీరము కృశించుట, హస్తపాదాద్యవయవములు బరువుగా నుండుట, కన్ను లెఱ్ఱగ నుండుట, ఇవి యన్నియు శీతపిత్తాది వ్యాధుల మూడిటికిని ముందు గల్గు పూర్వరూపంబులని యెరుంగునది.

## ఉదర్ద లక్షణము

శ్లో॥ వరటీదష్టసంస్థానః శోథస్సఞ్జాయతే బహిః।
సకణ్డూస్తోదబహుళ శ్ఛర్దిజ్వరవిదాహవాన్॥౩॥
ఉదర్దమితి తం విద్యాచ్ఛీత పిత్తమథాపరే।
వాతాధికం శీతపిత్త ముదర్దస్తు కఫాధికః॥౪॥

తా॥ కణితిరీగలు కుట్టినవిధంబుగ చర్మముపై దద్దులు కల్గి దురదయు నూదులగ్రుచ్చిన రీతిగ పోటును విశేషముగ కల్గి వాంతియు జ్వరంబును మిక్కిలి మంటయు కల్గినయెడ దానిని

ఉదర్ద మను వ్యాధియని వచించెదరు. ఈ వ్యాధినే శీతపిత్తంబనియు కొందరు వచించెదరు. అందు త్రిదోషములలో వాతము ప్రబలముగా నున్నయెడ శీతపిత్తంబనియు, కఫంబధికముగ నున్నయెడ ఉదర్దమనియు నెరుంగునది.

## ఉదర్ద విశేష లక్షణము

శ్లో॥ సోత్సఙ్గైశ్చ సరాగైశ్చ కణ్డూమద్భిశ్చ మణ్డలైః।
శైశిరః కఫజో వ్యాధి రుదర్ద ఇతి కీర్తితః॥౫॥

తా॥ దద్దుల నడుమ పల్లముగను చుట్టు ఎత్తుగనుండి అధికముగ దురదకల్గియున్నయెడ ఉదర్దమను వ్యాధియని యెరుంగునది.

## ఉత్కోఠ లక్షణము

శ్లో॥ అసమ్యగ్వమనోదీర్ణ పిత్తశ్లేష్మాన్ననిగ్రహైః।
మణ్డలాని సకణ్డూని రాగవన్తి బహూని చ॥౬॥
ఉత్కోఠస్సానుబన్ధశ్చ కోఠ ఇత్యభిధీయతే।
ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
శీతపిత్తోదర్దకోఠ నిదానమ్
సమాప్తమ్

———(०)———

తా॥ వమనమునకు ఔషధమును సేవించినపుడు చక్కగా వమనము కాకుండినను, ఊర్ధ్వముగ ప్రేరితంబులైన పిత్తశ్లేష్మములను అన్నమును నిరోధించినను, శరీరమునందు దురదతోగూడ రక్తవర్ణంబులైన దద్దులు అనేకములుగ జనించును. దీనిని ఉత్కోఠమనియు; అట్టి దద్దులు పలుమారు కల్గి తనంతనే శమించుచున్నయెడ కోఠంబనియు వచించెదరు.

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్రవిరాజమాన దివ్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపాలాచార్య విరచితంబైన నిదానదీపిక యను మాధవనిదానార్థతాత్పర్యమునందు శీతపిత్తోదర్దకోఠనిదానము సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

## శ్రీరస్తు

# అమ్లపిత్తనిదానమ్



కోఠనిదానమునందు. పిత్తశ్లేష్మముల రెంటిని గ్రహించి యుండుటంజేసి కోఠనిదానమును చెప్పిన పిదప అట్టి పిత్తశ్లేష్మముల సంసర్గముచే జనించు అమ్లపిత్తముయొక్క నిదానమును చెప్పుట.



శ్లో॥ విరుద్ధదుష్టామ్లవిదాహిపిత్తప్రకోపిపానాన్నభుజో విదగ్ధమ్।
పిత్తం స్వహేతూపచితం పురాయత్తదమ్లపిత్తం ప్రవదన్తి సన్తః॥౧॥

తా॥ పరస్పరవిరుద్ధంబులైన క్షీరమత్స్యాదిపదార్థములు, చెడిన యన్నము, పులుసుకల పదార్థములు, సంతాపకరంబులును పిత్తవర్ధకంబులునైన యన్నపానంబులు వీనిని సేవించుటచేత వర్షాకాలమున స్వకారణముచే వృద్ధినొందిన పిత్తము ప్రకుపితంబైనయెడ దానిని అమ్లపిత్తమని వచించెదరు.

### అమ్లపిత్త సామాన్య లక్షణము

శ్లో॥ అవిపాక క్లమోత్క్లేశ తిక్తామ్లోద్గార గౌరవైః।
హృత్కణ్ఠదాహారుచిభిశ్చామ్లపిత్తం వదేద్భిషక్॥౨॥

తా॥ భుజించిన యాహారము జీర్ణము గాకుండుట, బడలిక, ఓకిరింతలు వచ్చుట, చేదుగను పుల్లగను త్రేనుపులు వచ్చుట, శరీరము బరువుగ నుండుట, హృదయమునందును కంఠమునందును తాపము కల్గుట, అరుచి, ఈ లక్షణములు కల్గినది యమ్లపిత్తంబని యెరుంగునది.

### అధోగతామ్లపిత్త లక్షణము

శ్లో॥ తృడ్దాహమూర్ఛాభ్రమమోహకారి
ప్రయాత్యధో వా వివిధప్రకారమ్।
హృల్లాసకోఠానలసాద హర్ష
స్వేదాఙ్గ పీతత్వకరం కదాచిత్॥౩॥

తా॥ దప్పి, తాపము, మూర్ఛ, భ్రమము, మనోవికారము, నోట నీరూరుట, శరీరమున దద్దులు కల్గుట, అగ్నిమాంద్యము, రోమాంచము కల్గుట, చెమట బట్టుట, శరీరము పచ్చగనుండుట, ఇట్టి లక్షణములుకల్గి శరీరమువం దధోభాగమున నానావిధంబులుగ నొకప్పుడు మలాదులు పడలుటచేత అధోగత అమ్లపిత్తమని వచించెదరు.

## ఊర్ధ్వగతామ్ల పిత్త లక్షణము

శ్లో॥ వాన్తం హరిత్పీతక నీలకృష్ణ
మారక్త రక్తాభమతీవ చామ్లమ్।
మాంసోదకాభం త్వతిపిచ్ఛిలాచ్ఛం
శ్లేష్మానుజాతం వివిధం రసేన॥౪॥

భుక్తే విదగ్ధే త్వథవాప్యభుక్తే
కరోతి తిక్తామ్లవమిం కదాచిత్।
ఉద్గారమేవంవిధమేవ కంఠ
హృత్కుక్షిదాహం శిరసో రుజం చ॥౫॥

కరచరణదాహమౌష్ణ్యం
మహతీ మరుచిం జ్వరం చ కఫపిత్తమ్।
జనయతి కండూమండల పిడకాశత
నిచిత్రగాత రోగచయమ్॥౬॥

తా॥ అమ్లపిత్తము ఊర్ధ్వగతమగునపుడు పచ్చగానైనను, పసపురంగు కల్గియైనను, నీల వర్ణంబుగానైనను, కృష్ణవర్ణముగానైనను, కొంచెము రక్తవర్ణముగానైనను, మాంసమును కడిగిన నీళ్లవలెనైనను, మిక్కిలి అమ్లరసముకల రసము వాంతియగును. లేక మిగుల పిచ్ఛిలంబై స్వచ్ఛముగనుండు శ్లేష్మతోగూడి పులుసు తీపు చేదు మొదలగు నానావిధరసములతోగూడి వాంతియగును. ఒకప్పుడు భుజించినను ఆహారము జీర్ణించినను భోజనము చేయకున్నను చేదుగ నైనను పులుసుగనైనను వాన్తియగును. చేదును పులుసును కల్గి త్రేనుపులు వచ్చును. మరియు కంఠము హృదయము కుక్షి ఈ స్థలములయందు తాపము, తలనొప్పి, అరకాలులయందును అర చేతులయందును మంట, ఉష్ణము, అధికమైన అరోచకము, జ్వరము, దేహమునందు దురద, పొడలు, బొబ్బలు, మొదలగు శరీరరోగము లనేకముగ కల్గును. ఈ లక్షణములు కఫపిత్తముల ప్రకోపముచే కల్గునని యర్థము.

## సాధ్యాసాధ్యామ్లపిత్త లక్షణములు

శ్లో॥ రోగోఽయమమ్లపిత్తాఖ్యో యత్నాత్సంసాధ్యతే నవః।
చిరోత్థితో భవేద్యాప్యః కృచ్ఛ్రసాధ్యస్స కస్యచిత్॥౭॥

తా॥ పైజెప్పబడిన అమ్లపిత్తంబను వ్యాధి నూతనముగ జనించినయెడ యత్నముచే సాధింప దగి యుండును. చిరకాలమునుండి యనుసరించి యున్నయెడ యాప్యంబై యుండును. అప థ్యాహారాదుల జేయుచుండువానికి నొకప్పుడు కృచ్ఛ్రసాధ్యంబై యుండును.

## అమ్లపిత్తమునకు వాతాదులచే భేదములు

శ్లో॥ సానిలం సానిలకఫం సకఫం తస్య లక్షయేత్।
దోషలిఙ్గేన మతిమాన్ భిషఙ్మోహకరం హి తత్॥౮॥

తా॥ మరియు నీ యమ్లపిత్తము వాతమున జనించినది యనియు, వాతకఫములచే జనించినది యనియు, కఫముచే జనించినదియనియు, ఆయాదోషములయొక్క చిహ్నములబట్టి బుద్ధిమంతుండగు వైద్యుం డెరుంగవలెను. అమ్లపిత్తము వమన అతిసారములను బోలి యూర్ధ్వాధఃప్రసారము కల్గియుండును గాన భేదమును కనిపెట్టుట మిగుల కష్టంబై వైద్యుని భ్రమింపంజేయును. కావున బుద్ధికౌశలముచే నెరుంగవలెనని భావము.

## వాతజామ్లపిత్త లక్షణము

శ్లో॥ కమ్పప్రలాప మూర్ఛా చిమిచిమిగాత్రావసాదశూలాని।
తమసో దర్శనవిభ్రమప్రమోహహర్షాణ్యనిలకోపాత్ ॥౯॥

తా॥ వణకు, అనర్థకముగ మాటలాడుట, మూర్ఛ, ఒడలు చిమచిమలాడుచుండుట, శరీరము కృశించుట, నొప్పికల్గుట, చీకటిలోనున్నరీతిగ నుండుట, చిత్తభ్రమము, అతిసంతోషము, గగురుపాటు, ఈ లక్షణములన్నియు వాతప్రకోపముచే కల్గును.

## కఫజనితామ్లపిత్త లక్షణములు

శ్లో॥ కఫనిష్ఠీవనగౌరవజడతాఽరుచి శీతసాదవమిలేపాః।
దహనబలసాదకణ్డూనిద్రాచిహ్నం కఫానుగతే॥౧౦॥

తా॥ కఫము నుమియుట, శరీరము బరువై మొద్దుగనుండుట, అరోచకము, శరీరము చల్లనై యుండుట, కృశత్వము, వాంతి, నోట కఫముచుట్టుకుని బంధనగ యుండుట, అగ్నిమాంద్యము శరీర బలము నశించుట, దురద, నిద్ర, ఈ లక్షణములన్నియు కఫముచే జనించిన యమ్లపిత్తమునందు కల్గును.

## ద్వన్ద్వజామ్లపిత్త లక్షణము

శ్లో॥ ఉభయమిదమేవ చిహ్నం మారుతకఫసమ్భవే భవత్యమ్లే।

తా॥ పై చెప్పబడిన వాతకఫములయొక్క లక్షణములు రెండును కలిసియున్నయెడ వాతకఫ సంసర్గముచే జనించిన యమ్లపిత్తమని యెరుంగునది.

## శ్లేష్మపిత్త లక్షణములు

శ్లో॥ తిక్తామ్లకటూద్గారహృత్కుక్షికణ్ఠదాహకృత్ ॥౧౧॥
భ్రమో మూర్ఛాఽరుచిశ్ఛర్దిరాలస్యం చ శిరోరుజా।
ప్రసేకో ముఖమాధుర్యం శ్లేష్మపిత్తస్య లక్షణమ్॥౧౨॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
అమ్లపిత్త నిదానం సమాప్తమ్



తా॥ చేదుగను ఉప్పగను కారముగను త్రేనుపులు వెడలుట, హృదయమునందును కుక్షి యందును కణ్ఠమునందును తాపముకల్గుట, భ్రమను, మూర్ఛ, అరుచి, వాన్తి, ఆలస్యము, తలనొప్పి నోట నీరూరుట, నోరు తీపిగల్గియుండుట, ఈ లక్షణములు కల్గియున్నయెడల శ్లేష్మపిత్తంబని యెరుంగునది.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం ఘట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యాన్వాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపికయను
మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు
అమ్లపిత్త నిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# విసర్పనిదానమ్



"ఛర్ది వేగప్రతీఘాతాత్ కాలే చానవసేచనాత్। శరత్కాల ప్రభావాచ్చ శోణితం సంప్రదూష్యతి॥" వమనవేగమును నిరోధించుట, కాలమున స్నానము చేయకుండుట, ఈ కారణములచేతను శరత్కాలప్రభావముచేతను రక్తము దుష్టంబగును అను నట్టి చరకవచనమునుబట్టి వమనమును నిరోధించుటచే అమ్లపిత్త నిదానానంతరము రక్తము దుష్టం బగునని తెలియుచున్నది. అమ్లపిత్తమువలన కల్గు వమనమును నిరోధించుటచే జనించు రక్తదోషము కారణముగాగల విసర్పవ్యాధి నిదానమును జెప్పుట.



శ్లో॥ లవణామ్ల కటూష్ణాది సంసేవా దోషకోపతః।
విసర్పస్సప్తధా జ్ఞేయస్సర్వతః పరిసర్పణాత్ ॥౧॥
పృథక్త్రయస్త్రిభిశ్చైవ విసర్పా ద్వన్ద్వజాస్త్రయః।
వాతికః పైత్తికశ్చైవ కఫజస్సాన్నిపాతికః॥ ౨॥
చత్వార ఏతే వీసర్పా వక్ష్యన్తే ద్వన్ద్వజాస్త్రయః।
ఆగ్నేయో వాతపిత్తాభ్యాం గ్రన్థ్యాఖ్యః కఫవాతజః॥3॥
యస్తు కర్దమకో ఘోరః సపిత్తకఫ సమ్భవః।

తా॥ ఉప్పు, పులుసు, కారము, ఉష్ణపదార్థములు వీనిని అధికముగ సేవించుటచే వాతాది దోషములు ప్రకోపమునొంది విసర్పవ్యాధిని కల్గించును. ఈ వ్యాధి దేహమునందు పలుతెరంగుల సంచరించుటంజేసి విసర్పంబని చెప్పందగును. మరియు నీవ్యాధి వాతాదిదోష త్రయముచే వెవ్వేరుగను సన్నిపాతముచేతను దోషద్వయ సంసర్గముచేతను జనించుటంజేసి వాతజ మనియు, పిత్తజమనియు, కఫజమనియు, సన్నిపాతజమనియు, ఆగ్నేయంబనియు, గ్రన్థివిసర్పం బనియు, కర్దమకంబనియు, నేడు తెరంగులగును. అందు వాతపిత్తములచే జనించినది ఆగ్నేయ విసర్పంబనియు, కఫవాతములచే జనించినది గ్రంథివిసర్పంబనియు, పిత్తకఫములచే జనించినది కర్దమక విసర్పంబనియు నెరుంగునది. కర్దమకంబనునది మిగుల క్రూరంబై యుండును. మరియు విసర్పశబ్దమునకు చరకమునందీరీతిగ నిర్వచనము కానంబడియెడు: "వివిధం సర్పతి యతో

విసర్ప స్తేన స స్మృతః। పరిసర్పోఽథవా నామ్నా సర్వతః పరిసర్పణాత్" శరీరమునం దనేకవిధంబులుగ సంచరించుటచే విసర్పంబనియు, దేహమునం దెల్లెడల సంచరించుటచే పరిసర్పంబనియు జెప్పంబడునని భావము. ఇచ్చట సుశ్రుతమున జెప్పిన విసర్పసంప్రాప్తి యీరీతిగ నెరుంగునది: "త్వఙ్మాంస శోణితగతాః కుపితాస్తు దోషాః సర్వాఙ్గ సారిణమిహాస్థితమాత్మ లిఙ్గమ్। కుర్వన్తి యం విస్తృతమున్నతమాశు శోఫం తం సర్వతో విసరణాచ్చ విసర్పమాహుః" వాతాది దోషములు ప్రకోపమునొంది త్వఙ్మాంస రక్తముల నాశ్రయించి దేహమునం దొకచోటనైన నిల్కడలేక సకలావయవములయందు సంచరించునదియు, వాతాది లక్షణములతో గూడినదియు, విస్తీర్ణంబును, ఉన్నతంబునైన శోఫను శీఘ్రముగ కల్గించును. ఇది ఒక్కచోటనైన నిల్కడలేక పలుతెరంగుల సంచరించుటంజేసి విసర్పంబని వచించెదరని భావము.

శ్లో॥ రక్తం లసీకా త్వఙ్మాంసం దూష్యం దోషాస్త్రయో మలాః॥౪॥
విసర్పాణాం సముత్పత్తౌ విజ్ఞేయాస్సప్తధాతవః।

తా॥ విసర్పవ్యాధులకు రక్తము, లసీక, (త్వగ్గతమైన జలము) చర్మము, మాంసము, ఇవి దూష్యములు, శరీరమున మాలిన్యముగల్గించు వాతపిత్తశ్లేష్మములు మూడును దోషములు. ఈయేడు ధాతువులును జేరి విసర్పవ్యాధి జనించుటకు కారణములని భావము. మరియు "సర్వాత్మకః క్షతకృతశ్చ న సిద్ధిమేతి" అని తన్త్రాన్తరమునందుండుటచే సన్నిపాతముచే జనించిన విసర్పంబును క్షతముచేజనించిన విసర్పంబును అసాధ్యంబులని యెరుంగునది.

వాతజవిసర్ప లక్షణము

శ్లో॥ తత్ర వాతాత్స వీసర్పో వాతజ్వరసమవ్యథః ॥౫॥
శోథస్ఫురణనిస్తోదభేదాయాసార్తిహర్షవాన్।

తా॥ వాతముచే జనించిన విసర్పమునందు వాతజ్వరమునకు సమమైన బాధ, శోఫ, అదురుట, సూదులగ్రుచ్చినరీతిగ పోటు, పగలదీసినట్లుండుట, ఆయాసము, నొప్పి, రోమాఞ్చము, ఈలక్షణములు కల్గును.

పిత్తవిసర్ప లక్షణము

శ్లో॥ పిత్తాద్ద్రుతగతిః పిత్తజ్వరలిఙ్గోఽతిలోహితః ॥౬॥

తా॥ అతిశీఘ్రముగ నొకచోటనుండి వేరొకచోటికి పోవుట, పిత్తజ్వరచిహ్నములు కల్గియుండుట, మిక్కిలి రక్తవర్ణంబై యుండుట, ఈ లక్షణములు కల్గినది పిత్తముచే జనించిన విసర్పంబని యెరుంగునది.

కఫజవిసర్ప లక్షణము

శ్లో॥ కఫాత్కణ్డూయుతస్స్నిగ్ధః కఫజ్వరసమానరుక్।

తా॥ కఫముచే జనించిన విసర్పము దురదకల్గినదియు, స్నిగ్ధంబును, కఫజ్వరమునకు సమంబులగు చిహ్నములు కల్గినదియునై యుండును.

సన్నిపాతవిసర్ప లక్షణము

శ్లో॥ సన్నిపాతసముత్థశ్చ సర్వలిఙ్గసమన్వితః ॥౭॥

తా॥ పైనజెప్పిన వాతాది దోషత్రయలక్షణములతో గూడినది సన్నిపాతముచే జనించిన విసర్పంబని యెరుంగునది.

అగ్ని విసర్ప లక్షణము

శ్లో॥ వాతపిత్తాజ్జ్వరచ్ఛర్దిమూర్ఛాతీసారతృడ్భ్రమైః।
గ్రన్థిభేదాగ్నిసదనతమకారోచకైర్యుతః॥౮॥
కరోతి సర్వమఙ్గం చ దీప్తాఙ్గారావకీర్ణవత్।
యం యం దేశం విసర్పశ్చ విసర్పతి భవేత్స సః॥౯॥
శాన్తాఙ్గారాసితో నీలో రక్తో వాఽశు చ చీయతే।
అగ్నిదగ్ధ ఇవ స్ఫోటైః శీఘ్రగత్వాద్ద్రుతం స చ॥౧౦॥
మర్మానుసారీ వీసర్పస్స్యాద్వాతోఽతిబలస్తతః।
వ్యథతేఽఙ్గం హరేత్సంజ్ఞాం నిద్రాం చ శ్వాసమీరయేత్॥౧౧॥
హిక్కాం చ స గతోఽవస్థాం ఈదృశీం లభతే న నా।
క్వచిచ్ఛర్మారతిగ్రస్తో భూమిశయ్యాఽఽసనాదిషు॥౧౨॥
చేష్టమానస్తతః క్లిష్టో మనోదేహప్రమోహవాన్।
దుష్ప్రబోధోఽశ్నుతే నిద్రాం సోఽగ్నివీసర్ప ఉచ్యతే॥౧౩॥

తా॥ వాతపిత్తములచే జనించిన విసర్పము. జ్వరము, వాంతి, మూర్ఛ, అతిసారము, దప్పి, భ్రమము, గ్రన్థిభేదము, (కీళ్లు సడలియుండుట) అగ్నిమాన్ద్యము, తమకము, అరోచకము, ఈ లక్షణములతో గూడి శరీరమునంతెల్ల జ్వలించు అగ్నికణంబుల జల్లినవిధంబుగ బాధ కల్గించును. మరియు నీవిసర్పము దేహమునం దెచ్చటెచ్చట సంచరించునో ఆయా స్థలము బొగ్గువలె నల్లగనైనను, నీలవర్ణంబుగనైనను, రక్తవర్ణంబుగనైన నుండి నిప్పున కాలినవిధంబుగ బొబ్బలచే నతిశీఘ్రముగ వ్యాప్తంబై యుండును. అట్టి విసర్పము స్వభావముచే నతిశీఘ్రముగ గమనము కల్గియుండుటంజేసి, శీఘ్రముగ హృదయాది మర్మముల నావరించును. దానంజేసి వాతము మిక్కిలి బలిష్ఠంబై యంగముల నన్నిటిని బాధించుచు శరీరమునందలి ప్రజ్ఞను హరించి నిద్రను నశింపంజేయును. శ్వాసమును వెక్కిళ్లను కల్గించును. ఇట్టి యవస్థను బొందిన మనుజుండు ఒకవిషయము నందైన ఇచ్ఛలేక నిలచియున్నను పరుండినను కూర్చునియున్నను ఒకప్పుడు నొకింతయైన సుఖములేక భూమిశయనము ఆసనము మొదలగు వానియందు పొరలాడుచు మనస్సుచేతను దేహము

చేతను మిగుల క్లేశములనొంది మరోదేహములయొక్క భ్రమముచే జనించిన మోహముకలవాడై మరల మేల్కొనుటకసాధ్యంబైన గాఢనిద్రను బొందును. (అనగా మరణము నొందుననుట) ఈ వ్యాధి అగ్నివిసర్పంబని చెప్పందగును.

## గ్రంథివిసర్ప లక్షణము

శ్లో॥ కఫేన రుద్ధః పవనో భిత్త్వా తం బహుధా కఫమ్।
రక్తం వా వృద్ధర క్తస్య త్వక్సిరాస్నాయుమాంసగమ్॥౧౪॥
దూషయిత్వా తు దీర్ఘాణువృత్తస్థూలఖరాత్మనామ్।
గ్రన్థీనాం కురుతే మాలాం సరక్తాం తీవ్రరుగ్జ్వరామ్॥౧౫॥
శ్వాసకాసాతిసారాస్య శోషహిక్కావమిభ్రమైః।
మోహవైవర్ణ్యమూర్ఛాఽఙ్గభఙ్గాగ్నిసదనైర్యుతామ్॥౧౬॥
ఇత్యయం గ్రన్థివీసర్పః కఫమారుతకోపజః।

తా॥ కఫమును వృద్ధినొందించు కారణములచే ప్రకుపితంబైన కఫముచేత స్వకారణముచే ప్రకోపమునొంద్గిన వాతము నిరోధంపబడి యా కఫమును పలుదెరంగుల భేదించి వృద్ధినొందిన రక్తముకల మనుజునియొక్క చర్మసిరాస్నాయువుల నాశ్రయించియుండు రక్తమును దుష్టముగ జేసియు మిగుల దీర్ఘంబులును సూక్ష్మరూపంబులును వర్తులంబులును స్థూలంబులునై కఠినంబులుగానుండు గ్రంథులయొక్క పఙ్క్తిని కల్గించును. అట్టి గ్రంథిమాల రక్తవర్ణంబై మిగుల తీవ్రంబైన వేదనయు జ్వరంబును కల్గియుండును. మరియు నీవ్యాధియందు శ్వాసకాసములు, అతిసారము, నోరెండుట, వెక్కిళ్లు, వాంతి, భ్రమము, ఇన్ద్రియసంమోహము, శరీరవర్ణము మారియుండుట, మూర్ఛ, ఒడలివిరుపులు, అగ్నిమాన్ద్యము, ఈ లక్షణములు కల్గియుండును. ఈ వ్యాధ కఫవాతములయొక్క ప్రకోపముచే జనించిన గ్రన్థివిసర్పంబని చెప్పంబడును.

## కర్దమవిసర్ప లక్షణము

శ్లో॥ కఫపిత్తజ్వర స్తమ్భో నిద్రా తన్ద్రా శిరోరుజా॥౧౭॥
అఙ్గావసాదవిక్షేపౌ ప్రలేపారోచకభ్రమాః।
మూర్ఛాఽగ్నిహానిర్భేదోఽస్థ్నాం పిపాసేన్ద్రియగౌరవమ్॥౧౮॥
ఆమోపవేశనం లేప స్స్రోతసాం స చ సర్పతి।
ప్రాయేణామాశయం గృహ్ణ న్నేకదేశం న చాతిరుక్॥౧౯॥
పిడకైరవకీర్ణోఽతిపీతలోహితపాణ్డురైః।
స్నిగ్ధోఽసితో మేచకాభో మలినశ్శోథవాన్గురుః॥౨౦॥
గమ్భీరపాకః ప్రాజ్యోష్మా స్పృష్టః క్లిన్నోఽవదీర్యతే।

[illegible] ॥౨౧॥
[illegible] త్రిదోషజమ్।

తా॥ కఫపిత్తములయొక్క ప్రకోపముచేత కర్దమంబను విసర్పము జనించును; ఈ విసర్పమునందు జ్వరము, శరీరస్తంభము, నిద్ర, [illegible], తలనొప్పి, శరీరకృశత్వము, అవయవముల పలుమారు విసిరించుట, శరీరమున జిగటకల్గియుండుట, అరుచి, భ్రమము, మూర్ఛ, అగ్నిమాంద్యము, అస్థులు భిన్నంబులగుట, దప్పి, చక్షురాదీంద్రియములు బరువుగ నుండుట, భుజించిన యాహారము పక్వముగాకనే వెడలుట, స్రోతోరంధ్రములయందు జిగటకల్గి యుండుట, ఈ లక్షణములు కల్గియుండును. అట్టి విసర్పము కఫపిత్తములకు ఆమాశయము స్థానంబుగాన ప్రాయికముగ నాభికి స్తనములకు నడుమనుండు ఆమాశయమునందొకస్థలమున వ్యాపించుచు శరీరమున వ్యాపించును. మిగుల పచ్చనిదైనను రక్తవర్ణంబైనను పాండువర్ణంబైనను కల బొబ్బలచే నావరింపబడి స్వల్పమైన వేదనకల్గియుండును. మరియు నీ విసర్పము స్నిగ్ధత్వంబును కృష్ణవర్ణంబును నీలవర్ణంబును కల్గి మలినంబై వాపుతోగూడి మిగుల భారముగ నుండుననియు, మిగుల లోభాగమున పరిపాకము గల్గినదియు, ఉష్ణంబధికముగ కల్గినదియు, హస్తముచే స్పృశించినయెడ అడుసువలె చెడి యూడుచుండు మాంసము కల్గినదియు, మాంసము నశించుటచే స్పష్టముగ కనబడుచుండు స్నాయుసిరాసమూహము కల్గినదియునై పీనుగవలె దుర్గంధముతో గూడి యుండును. దీనిని కర్దమంబను విసర్పంబని వచించెదరు.

క్షతజవిసర్ప లక్షణము

శ్లో॥ బాహ్యహేతోః క్షతాత్క్రుద్ధస్స రక్తం పిత్తమీరయన్॥౨౨॥
విసర్పం మారుతః కుర్యాత్కులుత్థ సదృశైశ్చితమ్।
స్ఫోటైశ్శోథజ్వరరుజాదాహాఢ్యం శ్యావశోణితమ్॥౨౩॥
జ్వరాతిసారౌ వమథుస్త్వఙ్మాంసదరణం క్లమః।
అరోచకావిపాకౌచ విసర్పాణా ముపద్రవాః॥౨౪॥

తా॥ శస్త్రాది ప్రహారములు మొదలగు బాహ్యకారణములచేత వాతము ప్రకుపితంబై రక్తపిత్తములను ప్రేరేపించి ఉలవలవంటి పొక్కులచే వ్యాప్తంబైన విసర్పమును కల్గించును. మరియు నా విసర్పము శోఫ, జ్వరము, నొప్పి, మంట ఈ లక్షణములతోగూడి శ్యామారుణ వర్ణంబులు కల్గియుండును. ఇది క్షతజవిసర్పంబని యెరుంగునది. మరియు జ్వరము, అతిసారము, వాంతి, చర్మ మాంసములు పగులుట, బడలిక, అరుచి, అజీర్ణము, ఇవియన్నియు విసర్పముచే జనించు ఉపద్రవంబులని యెరుంగునది. మరియు క్షతవిసర్పలక్షణమును భోజుం డీరీతిగ వచించెను:
"శస్త్రప్రహారైస్తైస్తైస్తు వ్యాళదన్తనఖైరపి। క్షతే వాఽప్యథవా భగ్నే బహుదోషస్య దేహినః। రక్తం పిత్తం చ కుపితం వ్రణమాశు ప్రపద్యతే। కురుతస్తే సమేతే తు వ్రణశోథం సుదారుణమ్। ఆచితం తను విస్ఫోటైః కృష్ణైః పీతకసన్నిభైః। పిత్తవీసర్పవల్లిఙ్గం తస్య శేషం వినిర్దిశేత్" శస్త్రప్రహారములచేతను,

క్రూరమృగములయొక్క దంతనఖములచేతను, గాయము కల్గినను విరిగినను రక్తపిత్తములు రెండును ప్రకోపమునొంది వ్రణస్థానమునజేరి మిగుల క్రూరంబైన వ్రణశోఫను కల్గించును; ఆ శోఫ నల్లని బొబ్బలతోగూడి పిత్తవిసర్పలక్షణములతోగూడియుండునని భావము. ఈ వాక్యము చేత క్షతవిసర్పము పిత్తవిసర్పభేదంబని తెలియుచున్నది గాన ప్రకృతగ్రన్థమున సంఖ్యావిరోధము లేదని యెరుంగునది.

సాధ్యాసాధ్య విసర్ప లక్షణములు

శ్లో॥ సిధ్యన్తి వాతకఫపిత్తకృతా విసర్పా
సర్వాత్మకః క్షతకృతశ్చ న సిద్ధిమేతి।
పిత్తాత్మకోఽఞ్జనవపుశ్చ భవేదసాధ్యః
కృచ్ఛ్రాశ్చ మర్మసు భవన్తి హి సర్వ ఏవ॥౨౫॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
విసర్పనిదానం సమాప్తమ్



తా॥ వాత పిత్త కఫములచే జనించిన విసర్పములు మూడును సాధింపందగియుండును. సన్నిపాతముచే జనించిన విసర్పంబును, క్షతముచే జనించిన విసర్పంబును, పిత్తాధిక్యముచే జనించి కాటుకవలె నల్లగా నుండు అగ్నివిసర్పంబును అసాధ్యంబై యుండును. మరియు పైజెప్పబడిన విసర్పములలో నెద్దియైన మర్మస్థలముల జనించినయెడ నసాధ్యంబై యుండును. మరియు "శీర్ణస్నాయు సిరామాంసాః ప్రక్లిన్నాశ్శవగన్ధయః" అని యష్టాంగహృదయమున నుండుటంజేసి స్నాయుసిరామాంసములు శీర్ణంబులై స్రవించుచు శవముతో సమానమైన దుర్గంధముకల విసర్పములు గూడ అసాధ్యంబులని యెరుంగునది.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్రవిరాజమాన దివ్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపాలాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానార్థతాత్పర్యమునందు
విసర్పనిదానము
సమాప్తము

శ్రీ హాయగ్రీవాయ నమః

శ్రీరస్తు



# విస్ఫోటకనిదానమ్



విస్ఫోటంబను వ్యాధికిని విసర్పమునకును దోషదూష్యంబులును చికిత్సలును సమానంబులై యుండును గాన విసర్పనిదానానన్తరము విస్ఫోటనిదానము చెప్పబడుచున్నది.



శ్లో॥ కట్వమ్ల తీక్ష్ణోష్ణ విదాహిరూక్ష
క్షారై రజీర్ణాధ్యశనాతపైశ్చ।
తథర్తుదోషేణ విపర్యయేణ
కుప్యన్తి దోషాః పవనాదయస్తు॥౧।
త్వచమాశ్రిత్య తే రక్తమాంసాస్థీని ప్రదూష్య చ।
ఘోరాన్కుర్వన్తి విస్ఫోటాన్సర్వాన్ జ్వరపురస్సరాన్॥౨॥

తా॥ కటురసంబును అమ్లరసంబును గల పదర్థములను భుజించుట, తీక్ష్ణంబులును, ఉష్ణంబులును, సంతాపకరంబులును, రూక్షంబులును, క్షారంబులునైన పదార్థములను భుజించుట, అజీర్ణకరంబులగు పదార్థములను భుజించుట, భుజించిన యాహారము జీర్ణముగాకుండు నపుడు మరల భుజించుట, ఎండలో సంచరించుట, ఋతుధర్మంబులైన శీతోష్ణాదుల నధికముగ సేవించుట, శీతోష్ణాది ఋతుధర్మంబులు వ్యత్యస్తముగా నుండుట, ఈ కారణములచేత వాతాది దోషములు ప్రకోపమునొంది రక్తమును మాంసమును అస్థులను జెరచి చర్మము నాశ్రయించి జ్వరము మున్నుగాగల భయంకరములగు బొబ్బలను కల్గించును. ఇచ్చట "జ్వరపురస్సరాః" అని చెప్పుటచేత విస్ఫోటమునకు జ్వరము పూర్వరూపంబని యెరుంగునది.

## విస్ఫోట సామాన్య లక్షణము

శ్లో॥ అగ్నిదగ్ధనిభాః స్ఫోటాస్సజ్వరా రక్తపిత్తజాః।
క్వచిత్సర్వత్ర వా దేహే విస్ఫోటా ఇతి తే స్మృతాః॥3॥

తా॥ దేహమునందొకచోటనైనను, సర్వశరీరమునందైనను రక్తపిత్తములచేత నిప్పున కాలిన విధంబుగ జ్వరముతోగూడి బొబ్బలు కల్గును. దీనిని విస్ఫోటకము లనంబడును.

వాతవిస్ఫోట లక్షణము

శ్లో॥ శిరోరుక్శూలభూయిష్ఠం జ్వరతృట్పర్వభేదనమ్।
సకృష్ణవర్ణతా చేతి వాతవిస్ఫోటలక్షణమ్॥౪॥

తా॥ తలనొప్పి, శూల, జ్వరము, దప్పి, కీళ్ల నొప్పులు, నల్లగానుండుట, ఈ లక్షణములు కల్గినది వాతముచే జనించిన విస్ఫోటంబని యెరుంగునది.

పిత్తజవిస్ఫోట లక్షణము

శ్లో॥ జ్వరదాహరుజాస్రావపాకతృష్ణాభిరన్వితమ్।
పీతలోహితవర్ణం చ పిత్తవిస్ఫోటలక్షణమ్॥౫॥

తా॥ జ్వరము, మంట, నొప్పి, స్రావము, పక్వంబగుట, దప్పి, పీతవర్ణంబును రక్తవర్ణంబును కల్గియుండుట, ఈ లక్షణములు కల్గినది పిత్తముచే జనించిన విస్ఫోటంబని యెరుంగునది.

కఫజవిస్ఫోట లక్షణము

శ్లో॥ ఛర్ద్యరోచకజాడ్యాని కండూకాఠిన్యపాండుతాః।
అవేదనశ్చిరాత్పాకీ స విస్ఫోటః కఫాత్మకః॥౬॥

తా॥ వాంతి, అరోచకము, జడత్వము, దురద, కఠినత్వము, పాండుత్వము, బాధలేకుండుట, చిరకాలమునకు పక్వంబగుట, ఈలక్షణములుకల విస్ఫోటము కఫముచే జనించినదియని యెరుంగునది.

ద్వన్ద్వజ విస్ఫోట లక్షణము

శ్లో॥ వాతపిత్తకృతో యస్తు కురుతే తీవ్రవేదనామ్।
కణ్డూస్తైమిత్యగురుభిర్జానీయాత్కఫవాతికమ్॥౭॥
కణ్డూర్దాహో జ్వరశ్ఛర్దిరేతైస్తు కఫపైత్తికః।

తా॥ మిక్కిలి తీవ్రంబైన వేదన కల్గియున్నయెడ వాతపిత్తముల సంసర్గముచే జనించిన విస్ఫోటంబనియు, దురద, జడత్వము, గురుత్వము, ఈలక్షణములు కల్గినది కఫవాతములచే జనించిన విస్ఫోటంబనియు, దురద, మంట, జ్వరము, వాంతి, ఈలక్షణములతో గూడియున్నయెడ కఫపిత్తములచే జనించిన విస్ఫోటంబనియు నెరుంగునది.

సన్నిపాతజ విస్ఫోట లక్షణము

శ్లో॥ మధ్యేనిమ్నోన్నతో౽న్తే చ కఠినో౽ల్పప్రపాకవాన్॥౮॥
దాహరాగతృషామోహచ్ఛర్దిమూర్ఛారుజాజ్వరాః।
ప్రలాపో వేపథుస్తన్ద్రా సో౽సాధ్యస్స్యాత్త్రిదోషజః॥౯॥

తా॥ మధ్యమునందు పల్లముగను చుట్టు ఉన్నతంబును మిగుల కఠినంబును స్వల్పముగా పాకము నొందునదియునై మంట, ఎరుపు, దప్పి, ఇంద్రియజ్ఞానము లేకపోవుట, వాంతి,

మూర్ఛ, నొప్పి, జ్వరము, అసంబద్ధముగ మాటలాడుట, వణకు, కునికిపాటు, ఈ లక్షణములతో గూడియుండునది సన్నిపాతముచే జనించిన విస్ఫోటంబని యెరుంగునది. ఈ విస్ఫోటము అసాధ్యంబై యుండును. మరియు విస్ఫోటసంప్రాప్తిని భోజుండీరీతిగ వచించెను: యదా రక్తం చ పిత్తం చ వాతేనానుగతం త్వచి। అగ్నిదగ్ధనిభాన్ స్ఫోటాన్ కురుతస్సర్వదేహగాన్ । సజ్వరాన్ సపరీదాహాన్ విద్యాద్విస్ఫోటకాంస్తు తాన్'' రక్తపిత్తములు రెండును వాతముతో జేరి చర్మము నాశ్రయించి సర్వశరీరమునందును జ్వరముతోడను మంటతోడను గూడి నిప్పునకాలిన బొబ్బలవలె బొబ్బలు జనించినయెడ అవి విస్ఫోటకము లనందగునని భావము. ఈ వాక్యమునుబట్టి వాతాది విస్ఫోటములయందును రక్తపిత్తములు ముఖ్యముగా నుండునని యెరుంగునది.

## రక్తజవిస్ఫోట లక్షణము

శ్లో॥ రక్తా రక్తసముత్థానా గుఞ్జావిద్రుమసన్నిభాః।
పీడితవ్యాస్తు రక్తేన పైత్తికేన చ హేతునా॥౧౧॥
న తే సిద్ధిం సమాయాన్తి సిద్ధైర్యోగశతైరపి।

తా॥ గురుగింజలను పవడములను బోలి రక్తవర్ణంబులై యుండునది రక్తముచే జనించిన విస్ఫోటంబని యెరుంగునది. ఈ రక్తవిస్ఫోటము రక్తముచేతను పిత్తముచేతను జనించునని యెరుంగునది. మరియు నీరక్తవిస్ఫోటము అనేకవిధంబులైన సిద్ధౌషధములచే చికిత్సచేసినను నివర్తించుట దుర్ఘటంబై యుండును.

## సాధ్యాసాధ్యవిస్ఫోట లక్షణములు

శ్లో॥ ఏకదోషోత్థితస్సాధ్యః కృచ్ఛ్రసాధ్యో ద్విదోషజః ।
సర్వదోషోత్థితో ఘోరస్త్వసాధ్యో భూర్యుపద్రవః॥౧౧॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
విస్ఫోటకనిదానం సమాప్తమ్



తా॥ పై జెప్పిన విస్ఫోటములలో నొకదోషముచే గల్గిన విస్ఫోటము సాధ్యంబనియు, దోషద్వయముచే జనించినది కష్టసాధ్యంబనియు, సన్నిపాతముచే జనించిన విస్ఫోటంబును, పెక్కోపద్రవములతోగూడిన విస్ఫోటంబును, మిగుల దుఃఖకరంబులై యుండును గాన అసాధ్యంబు

లనియు భావము. మరియు నీవ్యాధియందు విసర్పమున జెప్పిన జ్వరము అతిసారము మున్నగాగల ఉపద్రవములు జనించునని యెరుంగునది.

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్ర
రాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేద మార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపా
లాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానార్థతాత్పర్యమునందు
విస్ఫోటకనిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# మసూరికానిదానమ్



మసూరికావ్యాధి విస్ఫోటభేదంబును, తరుచుగ విస్ఫోటమునకు సమానమైన నిదానము కల్గి నదియునై యుండును కాన విస్ఫోటనిదానమును జెప్పినపిదప మసూరికా నిదానమును జెప్పుట.



శ్లో॥ కట్వమ్లలవణక్షారవిరుద్ధాధ్యశనాశనైః।
దుష్టనిష్పావశాకాద్యైః ప్రదుష్టపవనోదకైః॥౧॥
క్రూరగ్రహేక్షణాచ్చాపి దేశే దోషాస్సముత్థితాః।
జనయన్తి శరీరేఽస్మిన్ దుష్టరక్తేన సఙ్గతాః॥౨॥
మసూరాకృతిసంస్థానాః పిడకాస్స్యుర్మసూరికాః।

తా॥ చేదు, పులుసు, ఉప్పు, కారము, ఈ రసములుగల పదార్థముల నధికముగ భుజించుట, పరస్పర విరుద్ధంబులగు క్షీరమత్స్యాదుల భుజించుట, భుజించిన యన్నము జీర్ణము గాకుండునపుడు మరల భుజించుట, దుష్టంబైన యన్నమును, అనుములను, శాకములు మొదలగు ద్రవ్యములను భుజించుట, విషసంబంధంబులైన పుష్పములు మొదలగువానిచే దుష్టంబైన గాలిని ఉదకమును సేవించుట, శని అంగారకుడు మొదలగు క్రూరగ్రహములచే దేశమునందు వీక్షణము కల్గుట, ఈ కారణములచేత వాతాదిదోషములు ప్రకోపమునొంది దుష్టంబైన రక్తములోగూడి మసూరములవలె(చిరుశనగలు)నుండు బొబ్బలను శరీరమున కల్గించును. దీనిని మసూరికయను వ్యాధియని వచించెదరు. మరియు తన్త్రాన్తరమున మసూరికాలక్షణం బివ్విధంబుగ గానంబడియెడు: "పిత్తం శోణితసంసృష్టం యదా దూషయతి త్వచమ్। తదా కరోతి పిడకాః సర్వగాత్రేషు దేహినామ్। మసూరముద్గమాషాణాం తుల్యాః కోలోపమా అపి। మసూరికాస్తు తా జ్ఞేయాః పిత్తరక్తాధికా బుధైః" పిత్తము రక్తముతోగూడ గలిసి చర్మము చెరచి శరీరమునందెల్ల చిరుశనగలు, పెసలు, మినుములు, రేగుపండ్లు, వీనికి సమానంబైన ప్రమాణముగల బొబ్బలను కల్గించును; అట్టి బొబ్బలు మసూరికలనంబడును. ఈ వ్యాధియందు

రక్తపిత్తము మిగుల నధికముగా నుండునని భావము. ఈ వాక్యముచేత ప్రకృతమూలమున "దుష్టరక్తేన సంగతాః" అను వాక్యమునకు వాతాది ప్రకోపమునకు ముక్తే కట్వమ్లాది కారణములచే దుష్టంబైన రక్తముతోజేరి వాతాదులుగూడ ప్రకోపమునొంది మసూరికావ్యాధిని కల్గించునని యర్థము చేయుట యుక్తంబని యెరుంగునది.

## మసూరికా పూర్వరూపము

శ్లో॥ తాసాం పూర్వం జ్వరః కణ్డూః గాత్రభఙ్గోఽరతిర్భ్రమః॥౩॥
త్వచి శోథస్సవైవర్ణ్యో నేత్రరాగశ్చ జాయతే।

తా॥ మసూరికావ్యాధి జనించుటకుమున్ను జ్వరము, గురద, ఒడలినొప్పులు, పనులయం దిచ్ఛ లేకుండుట, భ్రమము, చర్మమున వాపు, శరీరవర్ణము మారియుండుట, కన్నులు ఎఱ్ఱగ నుండుట, ఈ లక్షణములు కల్గును.

## వాతజమసూరికా లక్షణము

శ్లో॥ స్ఫోటాః శ్యావారుణా రూక్షా స్తీవ్రవేదనయాఽన్వితాః॥౪॥
కఠినాశ్చిరపాకాశ్చ భవన్త్యనిలసమ్భవాః।
సన్ధ్యస్థిపర్వణాం భేదః కాసః కమ్పోఽరతిః క్లమః॥౫॥
శోషస్తాల్వోష్ఠజిహ్వానాం తృష్ణా చారుచిసంయుతా।

తా॥ వాతముచే జనించిన విస్ఫోటములందు బొబ్బలు శ్యావారుణవర్ణంబులు కల్గినవియు, రూక్షంబులును, మిక్కిలి తీవ్రమైన వేదనకల్గినవియు, కఠినంబులును, చిరకాలమునకు పరిపాకము నొందునవియునై యుండును. ఈ వ్యాధియందు అవయవసంధులయందును అస్థిసంధులయందును నొప్పి, దగ్గు, వణకు, పనులయం దిచ్ఛలేకుండుట, బడలిక, తాలువులు పెదవులు నాలుక ఇవి యెండుట, దప్పి, అరోచకము. ఈ లక్షణములు కల్గును.

## పిత్తజ మసూరికా లక్షణము

శ్లో॥ రక్తాః పీతాస్సితాః స్ఫోటాః సదాహా స్తీవ్రవేదనాః।
భవన్త్యచిరపాకాశ్చ పిత్తకోపసముద్భవాః।
విడ్భేదశ్చాఙ్గమర్దశ్చ దాహ స్తృష్ణాఽరుచి స్తథా॥౬॥
ముఖపాకోఽక్షిపాకశ్చ జ్వర స్తీవ్రః సుదారుణః।

తా॥ బొబ్బలు రక్తవర్ణంబైనను పీతవర్ణంబైనను శ్వేతవర్ణంబైనను కల్గి మంటతోడను తీవ్రంబైన వేదనతోడనుగూడి చిరకాలమునకు పాకము నొందకయున్నయెడల పిత్తప్రకోపముచే జనించిన విస్ఫోటంబులని యెరుంగునది. మరియు నీ వ్యాధియందు మలభేదము, ఒడలినొప్పులు,

తాపము, దప్పి, అరుచి, నోరు పుండగుట, కన్నులెఱ్ఱగ నుండుట, మిక్కిలి తీవ్రంబును దుఃఖకరంబునైన జ్వరము, ఈ లక్షణములు కల్గును.

రక్తజమసూరికా లక్షణము

శ్లో॥ రక్తజాయాం భవన్త్యేతా వికారాః పిత్తలక్షణాః॥౮॥

తా॥ రక్తముచే జనించిన మసూరికయందు పై జెప్పబడిన పిత్తలక్షణములన్నియు జనించును. రక్తమసూరికయందు పిత్తలక్షణములు గల్గియుండును గాన, పిత్తమసూరికా లక్షణమును జెప్పిన పిదప కఫజమసూరికను వదలి రక్తజమసూరికా లక్షణమును జెప్పెనని యెఱుంగునది.

కఫజమసూరికా లక్షణము

శ్లో॥ కఫప్రసేకస్తైమిత్యం శిరోరుగ్గాత్రగౌరవమ్।
హృల్లాసస్సారుచి ర్నిద్రా తన్ద్రాఽఽలస్యసమన్వితాః॥౯॥
శ్వేతాస్స్నిగ్ధా భృశం స్థూలాః కణ్డూరా మన్దవేదనాః।
మసూరికాః కఫోత్థాశ్చ చిరపాకాః ప్రకీర్తితాః॥౧౦॥

తా॥ నోట కఫము వెడలుట, శరీరము జడముగ నుండుట, తలనొప్పి, శరీరము బరువుగా నుండుట, హృల్లాసము, అరుచి, నిద్ర, కునికిపాటు, పనులయందు సామర్థ్యము లేకుండుట, ఈ లక్షణములతోగూడి శ్వేతవర్ణంబులును, నునుపుకల్గినవియు, మిక్కిలి స్థూలంబులును, దురదకల్గినవియు, స్వల్పమైనవేదన కల్గినవియు, చిరకాలమునకు పరిపాకమునొందునవియునైన బొబ్బలు గల్గినయెడ కఫప్రకోపముచే జనించిన మసూరికయని యెఱుంగునది.

సన్నిపాతజ మసూరికా లక్షణము

శ్లో॥ నీలాశ్చిపిటవిస్తీర్ణా మధ్యే నిమ్నా మహారుజః।
చిరపాకాః పూతిస్రావాః ప్రభూతాస్సర్వదోషజాః॥౧౧॥
కణ్ఠరోధారుచిస్తమ్భప్రలాపారతిసంయుతాః।
దుశ్చికిత్స్యాస్సముద్దిష్టాః పిడకాశ్చర్మసంజ్ఞితాః॥౧౨॥

తా॥ నీలవర్ణంబులును, అటుకులవలె విస్తీర్ణంబును, నడుమ పల్లముగనుండునవియు, అధికమైన బాధకల్గినవియు, చిరకాలమునకు పాకమునొందునవియు, దుర్గంధముతోగూడిన చీముగారుచుండునవియునై అనేకములైన బొబ్బలుకల్గినయెడ సన్నిపాతముచే జనించిన మసూరికయని యెఱుంగునది. మరియు నీవ్యాధియందు కంఠమునందడచుకొనియుండుట, అరుచి, శరీరము స్తంభించియుండుట, అనర్థముగ మాటలాడుట, పనులయం దిచ్ఛలేకుండుట, ఈ లక్షణములు కల్గియుండును. పైజెప్పిన బొబ్బలు చర్మదలంబులను పేరుగల్గి మిగుల నసాధ్యంబులై యుండును.

రోమాన్తిక లక్షణము

శ్లో॥ రోమకూపోన్నతిసమా రాగిణ్యః కఫపిత్తజాః।
కాసారోచక సంయుక్తా రోమాన్త్యో జ్వరపూర్వికాః॥౧౩॥

తా॥ శరీరమునందలి రోమకూపములయందు మున్నతంబులును, సమంబులును, రక్తవర్ణంబులునై కఫపిత్తములచే జనించిన బొబ్బలు రోమాన్తికము లనంజను. ఈ వ్యాధి కఫపిత్తములచే జనించును. మరియు నీవ్యాధియందు దగ్గు, అరుచి, ఈ లక్షణములు కల్గును. ఈ వ్యాధిగల్గుటకు, మున్ను జ్వరము కల్గును.

రసగత మసూరికా లక్షణము

శ్లో॥ తోయబుద్బుదసఙ్కాశా స్త్వగ్గతాస్తు మసూరికాః।
స్వల్పదోషాః ప్రజాయన్తే భిన్నా స్తోయం స్రవన్తి చ ॥౧౪॥

తా॥ నీటిబుగ్గలవలెనుండి స్వల్పమైన దోషముకల్గి పగిలినప్పుడు నీరుగారుచుండు మసూరికలు రసధాతువున జనించినవి యని యెరుంగునది. ఇచ్చట త్వక్‌శబ్దముచేత ప్రకరణము ననుసరించి రసమని యర్థమును చెప్పందగును.

రక్తగత మసూరికా లక్షణము

శ్లో॥ రక్తస్థా లోహితాకారా శ్శీఘ్రపాకా స్తనుత్వచః।
సాధ్యా నాత్యర్థదుష్టాశ్చ భిన్నా రక్తం స్రవన్తి చ ॥౧౫॥

తా॥ రక్తవర్ణంబులై శీఘ్రముగ పక్వంబులగునవియు, సూక్ష్మమైన చర్మము కల్గినవియు, కొంచముగ దుష్టంబులునైనవియు రక్తమున జనించిన మసూరికలని యెరుంగునది. ఈ మసూరికలు పగిలినయెడ రక్తమును స్రవించును. ఈ మసూరికలును పైజెప్పబడిన రసజమసూరికలును సాధ్యంబులై యుండును.

మాంసగత మసూరికా లక్షణము

శ్లో॥ మాంసస్థాః కఠినాస్స్నిగ్ధాశ్చిరపాకా ఘనత్వచః।
గాత్రశూల తృషాకణ్డూజ్వరారతి సమన్వితాః॥౧౬॥

తా॥ మాంసమున జనించిన మసూరికలు కఠినంబులును, స్నిగ్ధంబులును, చిరకాలమునకు పరిపాకము నొందునవియు, ఘనంబైన చర్మము కల్గినవియు,ఒడలినొప్పులు, డప్పి, దురద, జ్వరము పనులయం దిచ్చలేకుండుట ఈలక్షణములతో గూడియుండునవియునైన మసూరికలు మాంసమున జనించినవి యని యెరుంగునది. ఈ మసూరికలు మిగుల నంతశ్శరీరమున జనించును గాన కృచ్ఛ్రసాధ్యంబులై యుండునని యెరుంగునది.

మేదోగత మసూరికా లక్షణము

శ్లో॥ మేదోజా మణ్డలాకారా మృదవః కిఞ్చిదున్నతాః।
ఘోరాత్యర్థజ్వరాః స్థూలాః స్నిగ్ధాస్సవేదనాః ॥౧౭॥
సమ్మోహారతిసన్తాపాః కశ్చిదాభ్యో వినిస్తరేత్।

తా॥ మేదస్సున జనించిన మసూరికలు నుండలాకారంబులును, మృదువుగా నుండునవియు, కొంచెముగ నున్నతంబులును, మిగుల క్రూరంబైన జ్వరముతో గూడినవియు, స్థూలంబులును, మెరపుకల్గినవియు, వేదనతో గూడినవియునై యుండును. మరియు నీవ్యాధియందు మూర్ఛయు, అరతియు, సంతాపంబును జనించును. ఈమసూరికలచే నొకానొకడు విడువంబడును గాన కష్టసాధ్యంబని భావము.

మజ్జగత మసూరికా లక్షణము

శ్లో॥ క్షుద్రా గాత్రసమా రూక్షా శ్చిపిటాః కిఞ్చిదున్నతాః।
మజ్జోత్థా భృశసమ్మోహా వేదనాఽరతిసంయుతాః।
ఛిన్దన్తి మర్మధామాని ప్రాణానాశు హరన్తి చ॥౧౯॥
భ్రమరేణేవ విద్ధాని కుర్వన్త్యస్థీని సర్వతః।

తా॥ స్వల్పాకారంబులును, రూక్షంబులును, శరీరమునకు సమముగ కొంచము ఉన్నతంబులునై యుండు మసూరికలు మజ్జయందు జనించినవియని యెరుంగునది. ఈమసూరికలు మూర్ఛయు, అధికమైనవేదనయు, అరతియు కల్గి మర్మస్థానములను ఛేదించుచు తుమ్మెదలు తొలిచిన కొయ్యలయందు రంధ్రములజేయువిధంబుగ అస్థులయందు రంధ్రములజేయుచు శీఘ్రముగ ప్రాణముల హరించును. ఈ వ్యాధి మిగుల నసాధ్యంబని భావము. ఇచ్చట "భ్రమరేణేవ విద్ధాని" అను వాక్యము చేత అస్థులు మజ్జకు ఆధారంబులు గాన ఇట్టి మజ్జయందు జనించిన మసూరికలు అస్థులనుగూడ చెరచునని భావము. గాన అస్థిగతమసూరికాలక్షణముగూడ దీనిచే గతార్థంబని యెరుంగునది.

శుక్రగతమసూరికా లక్షణము

శ్లో॥ పక్వాభాః పిహితాః స్నిగ్ధాః స్థూలాశ్చాత్యర్థవేదనాః॥౨౦॥
స్తైమిత్యారతి సమ్మోహదాహోన్మాద సమన్వితాః।
శుక్రజాయాం మసూర్యాం తు లక్షణాని భవన్తి హి॥౨౧॥
నిర్దిష్టం కేవలం చిహ్నం దృశ్యతే న తు జీవితమ్।
దోషమిశ్రాస్తు సప్తైతా ద్రష్టవ్యా దోషలక్షణైః॥౨౨॥

తా॥ బొబ్బలు పరిపక్వంబులును, స్నిగ్ధంబులును, మిగుల సూక్ష్మాకారంబులునై అపారమైన వేదనకల్గి జడత్వము, అరతి, మూర్ఛ, తాపము, చిత్తభ్రమము, ఈ లక్షణములు కల్గియున్న యెడల శుక్రధాతువున జనించిన మసూరికలని యెరుంగునది. ఈ చెప్పిన లక్షణములన్నియు శుక్రజమసూరికలయందు గానంబడినయెడల ఇట్టి రోగియందు బ్రతుకుట దుర్ఘటంబని యెరుంగునది. త్వక్ రక్తమాంసాదిసప్తధాతువులయందు జనించిన మసూరికలయందు వాతాది దోషలక్షణములు గూడ గానంబడినయెడల వానిని దోషసంసృష్టములుగ తెలియవలెనని యెరుంగునది. దోషసంబంధము లేక రసాదిధాతువులు దుష్టంబులగుటలేదు గాన రసాదిధాతువుల లక్షణములలో నొకధాతువుయొక్క

**లక్షణంబులతోఁగూడ ముస్నువచించిన దోషలక్షణములలో నొకదాని లక్షణములు గలసియున్న యెడ నట్టి దోషముచే నాధాతువున జనించిన మసూరిక యని నిర్ణయించవలెనని భావము.**

### సుఖసాధ్య మసూరికా లక్షణము

శ్లో॥ త్వగ్గతా రక్తజాశ్చైవ పిత్తజాశ్లేష్మజాస్తథా।
శ్లేష్మపిత్త కృతాశ్చైవ సుఖసాధ్యా మసూరికాః॥ ౧౩॥

**తా॥** రసధాతువునందును రక్తధాతువునందును జనించిన మసూరికయు, పిత్తముచే గల్గిన మసూరికయు, శ్లేష్మముచే జనించిన మసూరికయు, శ్లేష్మపిత్తములచే జనించిన మసూరికయు, సుఖసాధ్యంబులై యుండును.

### కృచ్ఛ్రసాధ్య మసూరికా లక్షణము

శ్లో॥ వాతజా వాతపిత్తోత్థా శ్లేష్మవాతకృతాశ్చ యాః।
కృచ్ఛ్రసాధ్యా మతాస్తస్మాద్యత్నాదేతా ఉపాచరేత్॥ ౧౪॥

**తా॥** వాతముచే జనించిన మసూరికయు, వాతపిత్తసంసర్గముచే జనించిన మసూరికయు, వాతశ్లేష్మసంసర్గముచే జనించినమసూరికయు, మిగులకష్టసాధ్యంబులై యుండును గాన వైద్యుండు మిగుల యత్నముచే నీవ్యాధియందు చికిత్సజేయవలెనని భావము.

### అసాధ్య మసూరికా లక్షణములు

శ్లో॥ అసాధ్యాస్సన్నిపాతోత్థాస్తాసాం వక్ష్యామి లక్షణమ్।
ప్రవాలసదృశాః కాచిత్కాచిజ్జమ్బూఫలోపమాః॥ ౧౫॥
లోహజాలసమాః కాశ్చిదతసీఫలసన్నిభాః।
ఆసాం బహువిధా వర్ణా జాయన్తే దోషభేదతః॥ ౧౬॥

**తా॥ సన్నిపాతముచే జనించిన మసూరిక అసాధ్యంబై యుండును. మరియు సన్నిపాతముచే జనించిన మసూరికలు కొన్ని పవడములబోలియు, కొన్ని నేరేడుపండ్లనుబోలియు, కొన్ని యినుపగుండ్లను బోలియు, కొన్ని నల్లఅగిసికాయలనుబోలి నల్లనిరంగుకల్గియు నుండునని భావము. దీనియందు వాతాదిదోషత్రయములు కలిసియుండుటచేత, ఆయాదోషానుసారముగ ననేకవర్ణములు కల్గియుండునని యెరుంగునది.**

### మసూరికా సామాన్యంబులగు అసాధ్య లక్షణములు

శ్లో॥ కాసో హిక్కా ప్రమోహశ్చ జ్వరస్తీవ్రస్సుదారుణః।
ప్రలాపశ్చారతిర్మూర్ఛా తృష్ణాదాహోఽతిఘూర్ణతా॥ ౧౭॥

ముఖేన ప్రస్రవేద్రక్తం తథా ఘ్రాణేన చక్షుషా।
కణ్ఠే ఘుర్ఘురకం కృత్వా శ్వసిత్యత్యర్థవేదనమ్॥౨౮॥
మసూరికాభిభూతస్య యస్యైతాని భిషగ్వరైః।
లక్షణాని చ దృశ్యన్తే న దద్యాత్తత్ర భేషజమ్॥౨౯॥

తా॥ దగ్గు, వెక్కిళ్లు, ఇంద్రియజ్ఞానము లేకుండుట, తీవ్రమైన జ్వరము, మిగుల క్రూరంబైన ప్రలాపము, అరతి, మూర్ఛ, దప్పి, తాపము, అధికముగ పొరలాడుట, నోటియందును ముక్కునందును కన్నులయందును రక్తము స్రవించుట, కంఠమున గుఱ్ఱు గుఱ్ఱుమని కూయుచు తీవ్రమైన వేదనతోఁగూడి శ్వాసమును వెడలించుట, ఈ లక్షణములు మసూరికావ్యాధి జనించిన మనుజునకు కల్గినయెడ అట్టి మనుజునకు వైద్యుండు చికిత్సజేయుంజనదని భావము.

మరికొన్ని యసాధ్య లక్షణములు

శ్లో॥ మసూరికాభిభూతో యో భృశం ఘ్రాణేన నిశ్వసేత్।
స భృశం త్యజతి ప్రాణాన్ తృష్ణార్తో వాయుదూషితః॥30॥

తా॥ మసూరికచే పీడింపబడిన మనుజుండు శ్వాసమును నోట వెడలించక నాసాద్వారముననే వెడలించినయెడ దప్పిచేతను వాతముచేతను పీడితుండై ప్రాణములను విడచును.

మసూరికోపద్రవ లక్షణము

శ్లో॥ మసూరికాన్తే శోఫస్స్యాత్కూర్పరే మణిబన్ధకే।
తథాంసఫలకే చాపి దుశ్చికిత్స్యస్సుదారుణః॥3౧॥

-oOo-

ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే

మసూరికానిదానమ్

సమాప్తమ్

-oOo-

తా॥ మసూరిక జనించినపిదప మోచేతియందును మణికట్టునందును భుజశిరస్సులయందును క్రూరమైన వాపు కల్గినయెడ మసూరిక మిగుల నసాధ్యంబై యుండును.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్ద సంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు

మసూరికా నిదానము

సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీరస్తు

# క్షుద్రరోగనిదానమ్

బలిష్ఠంబులైన హేతులక్షణ చికిత్సలుకల వ్యాధుల వివరించినపిదప స్వల్పములైన హేతు లక్షణ చికిత్సలుకల క్షుద్రరోగములయొక్క నిదానమును చెప్పుట.



## అజగల్లికా లక్షణము

శ్లో॥ స్నిగ్ధాస్సవర్ణా గ్రథితా నీరుజా ముద్గసన్నిభాః।
కఫవాతోత్థితా జ్ఞేయా బాలానా మజగల్లికాః॥౧॥

తా॥ స్నిగ్ధంబులును, కఫవాతములకు సమానవర్ణంబులును, పెసలతో సమానమైన యాకారములు కల్గినవియు, బాధారహితంబులునైన బొబ్బలు దట్టముగ జనించినయెడ అజగల్లిక యని చెప్పందగును. ఈ వ్యాధి కఫవాతములచేత తరుచుగ బాలురకు జనించును. ఇచ్చట స్వల్పంబులగు హేతువులును లక్షణంబులును చికిత్సయు కల్గిన వ్యాధులు క్షుద్రరోగములని యెరుంగునది. మరియు అగ్నిరోహిణీ వల్మీకాదిరోగములు సన్నిపాతజములగుటంజేసి యనేకంబులైన హేతు లక్షణములు కల్గియున్నను ఈ ప్రకరణమున ఛత్రిన్యాయము ననుసరించి స్వల్పములైన హేతు లక్షణములుకల వ్యాధులు తరుచుగ చెప్పంబడునని యర్థము గాన అగ్నిరోహిణి మొదలగు వ్యాధుల నిచ్చట చెప్పినను విరోధములేదని యెరుంగునది.

## యవప్రఖ్యా లక్షణము

శ్లో॥ యవాకారా సుకఠినా గ్రథితా మాంససంశ్రితా।
పిడకా కఫవాతాభ్యాం యవప్రఖ్యేతి సోచ్యతే॥౨॥

తా॥ యవలను బోలిన యాకారముకల్గి కఠినంబైన బొబ్బ కఫవాతములచే మాంసమున గ్రంథిరూపముగ జనించును; ఈవ్యాధి యవప్రఖ్యయని చెప్పందగును.

## అన్త్రాలజీ లక్షణము

శ్లో॥ ఘనా మవక్త్రాం పిడకాం ఉన్నతాం పరిమణ్డలామ్।
అన్త్రాలజీమల్పపూయాం తాం విద్యాత్కఫవాతజాం॥3॥

తా॥ మిగుల కఠినంబును, వక్రముగానుండునదియు, ఉన్నతంబును, మండలాకారంబును, స్వల్పమైన పూయము కల్గినదియునైన బొబ్బ కఫవాతములచే జనించినయెడ అన్త్రాలజి యని చెప్పందగును. మరియు అన్త్రాలజీలక్షణము నీరీతిగ భోజుండు వచించెను. "శ్లేష్మానిలా శ్రితౌ స్నాయుం పిడకాం పరిమణ్డలామ్ । దుష్టౌ జనయతోఽవక్రామల్పపూయా మకణ్డురామ్ । ఆమోదుమ్బరసంకాశాం విద్యాదన్త్రాలజీం తు తామ్॥" శ్లేష్మవాతములు రెండును స్నాయువులజేరి ప్రకుపితంబులై మండలాకారంబును, అకుటిలంబును, కొంచెముగ చీము కల్గినదియు, దురదలేనిదియు, పక్వముగాని మేడికాయవలె నుండునదియునైన బొబ్బను కల్గించును. ఇయ్యది అన్త్రాలజి యని చెప్పందగునని భావము. ఈ వాక్యముచేత నీ వ్యాధి స్నాయువుల ననుసరించి జనించునని యెరుంగునది.

వివృతా లక్షణము

శ్లో॥ వివృతాస్యాం మహాదాహాం పక్వోదుమ్బరసన్నిభాం।
వివృతామితి తాం విద్యాత్పిత్తోత్థాం పరిమణ్డలాం॥౪॥

తా॥ విశాలమైన ద్వారముకల్గి అధికమైన మంటతోగూడి పండిన మేడిపండువలె గుండ్రముగా నుండు బొబ్బ కల్గినయెడ నయ్యది వివృత యని చెప్పందగును. ఇది పిత్తముచే జనించునని యెరుంగునది. మరియు నిది పిత్తముచే నధికముగ పక్వంబై ద్వారము తెరచియుండుటం జేసి వివృత యని చెప్పంబడునని యెరుంగునది.

కచ్ఛపిక లక్షణము

శ్లో॥ గ్రథితాః పఞ్చ వా షడ్వా దారుణాః కచ్ఛపోపమాః।
కఫానిలాభ్యాం పిడకా జ్ఞేయా కచ్ఛపికా బుధైః॥౫॥

తా॥ కఫవాతములచేత మిక్కిలి కఠినంబులును, తాబేటివలె నడుమ నున్నతంబులునైన గ్రంథులు ఐదైనను ఆరైనను కల్గినయెడ నయ్యది తాబేటివలె నుండుటంజేసి కచ్ఛపిక యని చెప్పందగును.

వల్మీక లక్షణము

శ్లో॥ గ్రీవాంసకక్షాకరపాదదేశే
సన్ధౌ గలే వా త్రిభిరేవ దోషైః।
గ్రన్థిస్స వల్మీకవదక్రియాణాం
జాతః క్రమేణైవ గతః ప్రవృద్ధిమ్॥౬॥
ముఖై రనేకైస్స్రుతితోదవద్భి
ర్విసర్పవత్సర్పతి చోన్నతాగ్రైః।
వల్మీకమాహుర్భిషజో వికారం
నిష్ప్రత్యనీకం చిరజం విశేషాత్॥౭॥

తా॥ కంఠము, భుజసంధులు, చంకలు, పార్శ్వములు, పాదములు, శిరస్సు, మెడ ఈ స్థలములలో నెప్పుకలిగిన త్రికోణాకారముగా నున్నతంబైన గ్రంథి జనించును. మరియు నిది నిర్జ్వరముగా నుండి సంగ్రహములు కల్గి పోటులోగూడి పూయాగల ప్రవహించుచు ఉన్నతంబులైన బొబ్బలు కల్గి దేహమునందెల్లెడల సంచరించును. వైద్యులు దీనిని కక్షాకంటకమని వచించెదరు. ఇయ్యది యసాధ్యంబై యుండును. చిరకాలమునకుముందు జనించినయెడ నిక్కముగ యసాధ్యంబనియు వచించెదరు.

ఇన్ద్రవిద్ధా లక్షణము

శ్లో॥ పద్మకర్ణికవన్మధ్యే పిడకాభిస్సమాచితామ్।
ఇన్ద్రవిద్ధాన్తు తాం విద్యాద్వాతపిత్తోత్థితాం భిషక్॥౮॥

తా॥ తామరపువ్వునందు మధ్యమందుండు కర్ణికవలె మధ్యభాగమున ననేకంబులైన బొబ్బలుకల్గిన గ్రన్థి జనించినయెడ దానిని ఇంద్రవిద్ధ యని వచించెదరు. ఇయ్యది వాతపిత్తములచే జనించును.

గర్దభికా లక్షణము

శ్లో॥ మణ్డలం వృత్తముత్సన్నం సరక్తం పిడకాచితమ్।
రుజాకరీం గర్దభికాం తాం విద్యాద్వాతపిత్తజామ్॥౯॥

తా॥ మండలాకారంబును, ఉన్నతంబును, రక్తవర్ణంబునై అనేకంబులైన పిడకలతోగూడి బాధకల్గించునది గర్దభిక యని యెరుంగునది ఈ వ్యాధి వాతపిత్తములచే జనించును.

పాషాణగర్దభ లక్షణము

శ్లో॥ వాతశ్లేష్మసముద్భూతః శ్వయథుర్హనుసన్ధిజః।
స్థిరో మన్దరుజస్స్నిగ్ధో జ్ఞేయః పాషాణగర్దభః॥౧౦॥

తా॥ తాలువులయొక్క సంధియందు కఠినంబును, స్వల్పమైన వేదనకల్గినదియు, స్నిగ్ధంబునునైన శోఫ వాతశ్లేష్మములచేత జనించును. ఇయ్యది రాతివలె మిగుల కఠినముగ నుండును గాన పాషాణగర్ధభంబని చెప్పందగును.

పనసికా లక్షణము

శ్లో॥ కర్ణస్యాభ్యన్తరే జాతాం పిడకాముగ్రవేదనామ్।
స్థిరాం పనసికాం తాం తు విద్యాద్వాతకఫోత్థితామ్॥౧౧॥

తా॥ చెవులయొక్క లోప్రక్క మిగుల తీవ్రమైన వేదనతోగూడి కఠినంబైన బొబ్బ కల్గును. దీనిని పనసిక యను వ్యాధియని వచించెదరు. ఇయ్యది వాతకఫములచే జనించును. మరియు భోజుండు ''కఫవాతౌ ప్రకుపితౌ మాంసమాశ్రిత్య కర్ణయోః। సమన్తతః పరిస్తబ్ధాం కురుతః పిడకాం స్థిరామ్ । విషమాం దాహసంయుక్తాం విద్యా

త్పనసికాం తు తామ్॥'' అని పనసికాలక్షణమును జెప్పెను. కఫవాతములు రెండును ప్రకోపమునొంది మాంసము నాశ్రయించి స్తంభించియుండునదియు, కఠినంబైనదియు, నిమ్నోన్నతంబైనదియు, మంటతో గూడినదియునైన బొబ్బను చెవియొక్క లోభాగమునం దంతట కల్గించును. ఇయ్యది పనసిక యను వ్యాధియని చెప్పంబడునని యర్థము. ఈ వాక్యముచేత నీవ్యాధి మాంసమున జనించునని తెలియబడుచున్నది.

## జాలగర్దభ లక్షణము

శ్లో॥ విసర్పవత్సర్పతి యః శోఫ స్తను రపాకవాన్।
దాహజ్వరకరః పిత్తాత్స జ్ఞేయో జాలగర్దభః॥౧౨॥

తా॥ దేహమునందెచ్చటనైన స్వల్పముగ శోఫ జనించి పాకమునొందక తాపజ్వరములతో గూడి శరీరమున సంచరించుచున్నయెడ నయ్యది జాలగర్దభంబను వ్యాధియని వచించెదరు. ఈ వ్యాధి పిత్తప్రకోపముచే జనించును. మరియు ''పిత్తోత్కటాస్త్రయో దోషా జనయన్తి త్వగాశ్రితాః। శ్యావం రక్తం తనుం శోథమపాకం బహువేదనమ్। విసర్పిణం సదాహం చ తృష్ణాజ్వరసమన్వితమ్ । విసర్పమాహు స్తం వ్యాధిమపరే జాలగర్దభం॥'' అని జాలగర్దభలక్షణమును భోజుండు జెప్పెను. పిత్తము అధికముగాగల వాతకఫములు ప్రకుపితంబులై చర్మము నాశ్రయించి శ్యామవర్ణంబును, రక్తవర్ణంబును, సూక్ష్మాకారంబునైన శోఫను కల్గించును. అట్టి శోఫ పాకమునొందక అనేక వేదనలతో గూడి తాపము, దప్పి, జ్వరము, ఈ యుపద్రవములుకల్గి దేహమునందు సంచరించును. ఈ వ్యాధిని విసర్పంబనియు జాలగర్దభంబనియు వచించెదరని యర్థము. ఈ వాక్యము ననుసరించి ప్రకృతమూలము నందును పిత్తం బధికముగనుండు త్రిదోష ప్రకోపముచే నీ వ్యాధి జనించునని యర్థము జేయుట సమంజసంబై యుండును. ఈ వాక్యమునుబట్టి యీ వ్యాధి త్రిదోషజన్యంబని స్థిరమగుచున్నది. కావున పిత్తముచే జనించిన యీ వ్యాధియందు పాకము సిద్ధముగ జనించుచుండ ''అపాకవాన్'' అను పదమునకు సూక్ష్మపాకము కల్గినది అని వచించుట యనుగతంబని యెరుంగునది.

## ఇరివేల్లికా లక్షణము

శ్లో॥ పిడకాముత్తమాఙ్గస్థాం వృత్తాముగ్రరుజాన్వితామ్।
సర్వాత్మికాం సర్వలిఙ్గాం జానీయా దిరివేల్లికామ్॥౧౩॥

తా॥ శిరస్సునందు వర్తులంబై తీవ్రమైన వేదనతో గూడి బొబ్బ జనించినయెడ నయ్యది ఇరివేల్లిక యను వ్యాధియని యెరుంగునది. ఇది దోషత్రయముచే జనించి త్రిదోషలక్షణములతో గూడియుండును.

## కక్షా లక్షణము

శ్లో॥ బాహుపార్శ్వాంసకక్షేషు కృష్ణస్ఫోటాం స వేదనామ్।
పిత్తప్రకోపసంభూతాం కక్షామిత్యభినిర్దిశేత్॥౧౪॥

తా॥ బాహువులయందును, పార్శ్వములయందును, భుజశిరస్సులయందును, చంకలయందును, నల్లనిబొబ్బలతో గూడి అధికమైన వేదనగల పిడక జనించినయెడ దానిని కక్ష యని వచించెదరు. ఈ వ్యాధి పిత్తప్రకోపముచే కల్గునని యెరుంగునది.

### గంధమాలా లక్షణము

శ్లో॥ ఏకామేతాదృశీం దృష్ట్వా పిడకాం స్ఫోటసన్నిభామ్ ।
త్వగ్గతాం పిత్తకోపేన గన్ధమాలాం ప్రచక్షతే॥౧౫॥

తా॥ పైజెప్పబడిన విధంబుగ బొబ్బలతోగూడిన పిడక యొక్కటి జనించినయెడ దానిని గన్ధమాల యని వచించెదరు. ఈ వ్యాధి పిత్తప్రకోపముచేత చర్మమున జనించును.

### అగ్నిరోహిణీ లక్షణము

శ్లో॥ కక్షభాగేషు యే స్ఫోటా జాయన్తే మాంసదారణాః ।
అన్తర్దాహజ్వరకరా దీప్తపావకసన్నిభాః॥౧౬॥
సప్తాహాద్వా దశాహాద్వా పక్షాద్వా ఘ్నన్తి మానవమ్।
తామగ్నిరోహిణీం విద్యాదసాధ్యాం సర్వదోషజామ్॥౧౭॥

తా॥ మాంసమును పగలదీయునవియు,లోపల తీవ్రమైన మంటను జ్వరమును కల్గించునవియు, జ్వలించుచుండు అగ్నికణములబోలి రక్తవర్ణంబులునైన బొబ్బలు చంకలయందు జనించిన యెడ దీనిని అగ్నిరోహిణి యను వ్యాధి యని యెరుంగునది. ఇది త్రిదోషముచే జనించును గాన మిగుల నసాధ్యంబై యుండును. మరియు త్రిదోషములలో వాతంబధికముగనున్న యెడ ఏడుదినములకు పిదప మరణమునొందుననియు, పిత్తం బధికముగ నుండునేడ పదిదినములకు మృతుండగుననియు, కఫం బధికముగ నుండె నేని ఒక పక్షమునకు పిమ్మట మరణము నొందుననియు నెరుంగునది. మరియు చరకమునందు "సన్తి హ్యేవంవిధా రోగా స్సాధ్యా దారుణసమ్మతాః । యే హన్యురనుపక్రాన్తా మిథ్యారమ్భేణ వా పునః" అని యుండుటచేత నీ వ్యాధియందు చికిత్సజేయక నుపేక్షించినను, శాస్త్రోక్త ప్రమాణముదప్పి చికిత్సజేసినను, పైజెప్పిన "సప్తాహాద్వా దశాహాద్వా" అను రీతిగ నసాధ్యంబగుననియు, సప్తాహ దశాహ పక్షములకు లోపల చికిత్సజేయునెడ సాధ్యంబనియు నెరుంగునది. మరియు తన్త్రాన్తరమున నీ విషయము స్ఫుటముగ గానంబడియెడు. అది యెట్లనిన "పిత్తే రక్తోత్కటా దోషాః ప్రదీప్తాఙ్గారసన్నిభాన్ । కక్షభాగేషు కుర్వన్తి తీవ్రదాహరుజాజ్వరాన్ । మాంసావదారణాన్ స్ఫోటాన్ యే హన్యురనుపక్రమాత్ । పక్షాద్దశాహాద్ద్వాగ్వా సాజ్ఞేయా హ్యగ్నిరోహిణీ" అని యున్నది. ఈ వాక్యముచేత అగ్నిరోహిణి యను వ్యాధి త్రిదోషముచే జనించినను రక్తపిత్తములు అధికముగ నుండుననియు, చికిత్సజేయక నుపేక్షించినచో పక్షమునకు పిదపనైనను పదిదినములకు పిమ్మటనైనను అసాధ్యం బగుననియు తెలియుచున్నది.

### చిప్ప లక్షణము

శ్లో॥ నఖమాంసమధిష్ఠాయ వాయుః పిత్తం చ దేహినామ్।
కుర్వాతే దాహపాకౌ చ తం వ్యాధిం చిప్పమాదిశేత్ ॥౧౮॥

తా॥ వాతపిత్తములు రెండును నఖములకు సమీపమునయుండు మాంసమునజేరి ప్రకోపము నొంది మంట బుట్టించి పాకము నొందించును. ఈ వ్యాధిని చిప్పమని వచించెదరు. ఇదియే లోకమున గోరుచుట్టు అని వ్యవహరింపబడును. మరియు "రోగో ఽఙ్గుళికోణేష్వన్నఖాన్తే స్యాత్ మాంసప్రకోపశ్వయథుస్సదాహపాకః" అను వాక్యముచే ఈ వ్యాధిని అక్షతం బను నామాన్తరముచే చరకాచార్యులు వ్యవహరించెను.

### కునఖ లక్షణము

శ్లో॥ తదేవాల్పతరైర్దోషైః పరుషం కునఖం వదేత్।

తా॥ పైజెప్పిన వ్యాధియే స్వల్పదోషములతోగూడియున్నయెడ కునఖంబనియు అట్టి వ్యాధిగల మనుజుండు కునఖియనియు చెప్పంబడునని భావము.

### అనుశయీ లక్షణము

శ్లో॥ గమ్భీరామల్పసంరమ్భాం సవర్ణాముపరి స్థితామ్।౧౯॥
పాదస్యానుశయీం తాన్తు విద్యాదన్తః ప్రపాకినీమ్।

తా॥ మిక్కిలి లోతులో విశేషదోషముకల్గి శరీరమునకు సమానమైన వర్ణముతోగూడి లోపలనే పాకమునొందు స్వల్పమైన శోఫ మీగాలిమీద జనించినయెడ దానిని అనుశయి యను వ్యాధి యని వ్యవహరించెదరు.

### విదారికా లక్షణము

శ్లో॥ విదారీకన్దవద్వృత్తాం కక్షావఙ్క్షణసన్ధిషు॥౨౦॥
విదారికా భవేద్రక్తా సర్వజా సర్వలక్షణా।

తా॥ చంకలయందైనను గజ్జలయందైనను నేలగుమ్మడిగడ్డవలె వర్తులంబును కఠినంబునై రక్తవర్ణంబైన శోఫ జనించినయెడ దానిని విదారిక యను వ్యాధియని వచించెదరు. ఈ వ్యాధి త్రిదోషముచే జనించి త్రిదోషలక్షణములతోగూడి యుండును. ఇచ్చట కొందరు "సర్వజా సర్వలక్షణా" అనుచోట "అసర్వజా అసర్వలక్షణా" అని నఞ్ శబ్దమును చేర్చి ఈ వ్యాధి సర్వదోషములచే జనించక ఏకదోషముచేతను దోషద్వయసంసర్గముచేతను జనించి ఆరుభేదములుకల్గి యుండుననియు వచించెదరు. ఈ మతము చరకవాగ్భటాదిగ్రంథములకు విరుద్ధంబగుటంజేసియు, అవాంతరభేదములు లేకుండుటయే క్షుద్రరోగలక్షణమని చెప్పియుండు క్షుద్రరోగలక్షణమునకు విరుద్ధంబగుటంజేసియు భిషగ్వరులచే నాదరణీయంబుగాదు. మరియు, చరకమునందు "జ్వరాన్వితా వఙ్క్షణకక్షసన్ధౌ వృత్తిర్నిరాత్రిః కఠినా మతా యా । విదారికా సా కఫమారుతా

భ్యామ్" అనియున్నది. "ఉష్మా పిత్తాదృతే నాస్తి జ్వరో నాస్త్యూష్మణా వినా" అనితన్త్రాన్తరమునను౦డుటచేత పిత్తముచేజనించిన యూష్మము లేక జ్వరము జనించుటలేదుగాన పైనుదహరించిన చరకవాక్యమునందు "జ్వరాన్వితా" అనుపదముచేత జ్వరమునకు కారణంబైన పిత్తంబును "కఫమారుతాభ్యాం" అనుటచేత కఫవాతంబులును గలసి విదారిక యను వ్యాధిం గల్గించునని చరకాచార్యుని యభిప్రాయము. వాగ్భటమునందు "విదారీకన్దకఠినా విదారీ కక్షలక్షణా" అనియున్నదిగాని దోషభేదములచే నీవ్యాధికి ప్రకారభేదముల జెప్పియుండలేదు. ఇదియునుంగాక ఈ గ్రన్థకర్తయగు మాధవకరునకే ఈ యర్థము అభిమతంబైయున్నయెడ "విదారికా భవేద్రక్తా పఞ్చధా ద్వ్యేకదోషజా" అని స్పష్టార్థముగ పఠించియుండును. గాన ఇట్టి కుత్సిత కల్పనములన్నియు మూలకారుని హృదయము తెలియక బోవుటచే గల్గినవియని పండితులచే నూహింపందగినది. మరియు నిచ్చట వికల్పకల్పనంబులను గ్రన్థాన్తరమున తెలియందగినది.

### శర్కరార్బుద లక్షణము

శ్లో॥ ప్రాప్య మాంససిరాస్నాయూః శ్లేష్మా మేదస్తథానిలః॥౨౧॥
గ్రన్థిం కరోత్యసౌ భిన్నో మధుసర్పిర్వసానిభం।
స్రవత్యాస్రావ మనిల స్తత్ర వృద్ధిం గతః పునః॥౨౨॥
మాంసం సంశోష్య గ్రథితాం శర్కరాం జనయేత్తతః।
దుర్గన్ధిక్లిన్న మత్యర్థం నానావర్ణం తతస్సిరాః।౨౩।
స్రవన్తి రక్తం సహసా తం విద్యాచ్ఛర్కరార్బుదమ్।

తా॥ కఫవాతములు రెండును ప్రకుపితంబులై మాంసము, సిరలు, స్నాయువులు, మేదస్సు, వీనిని దుష్టంబులుగజేసి గ్రన్థిని కల్గించును. ఆ గ్రన్థి పగిలి తేనె, నెయ్యి, వస, వీనికి సమానమైన వర్ణముగల రక్తమును స్రవించును. అట్టి గ్రంథి కల్గినపుడు ధాతుక్షయముచే వాతము మిగుల వృద్ధినొంది మాంసమును శోషింపజేసి కఠినంబైన శర్కరను కల్గించును. పిదప కుళ్లి దుర్గంధంబును నానావిధవర్ణంబులైన రక్తమును సిరలనుండి స్రవించును. దానిని శర్కరార్బుదముగా నెరుంగునది. ఇచ్చట అవస్థాభేదముచేత శర్కరార్బుదమని నామాన్తరము కల్గినది గాని వ్యాధిభేదము లేదని యెరుంగునది. మరియు "తమేవ భిన్నం దుర్గన్ధం స్రుతమేదోనిభం సిరాః। స్రవన్తి స్రావమనిశం తదా స్యాచ్ఛర్కరార్బుదమ్" అని చరకమున నున్నది. పూర్వోక్తంబైన గ్రంథి పగిలి నెయ్యి క్రొవ్వు ఈ రెంటివలె నుండి దుర్గంధంబైన రక్తమును సిరలు స్రవింపం జేయుచున్నయెడ ఆగ్రన్థియే శర్కరార్బుదమని చెప్పంబడునని యర్థము.

### పాదదారీ లక్షణము

శ్లో॥ పరిక్రమణశీలస్య వాయురత్యర్థ రూక్షయోః॥౨౪॥
పాదయోః కురుతే దారీం పాదదారీం తమాదిశేత్।

తా॥ ఎల్లప్పుడును త్రోవనడచు మనుజునియొక్క పాదములు మిగుల రూక్షంబులై వాత ప్రకోపముచేత పగులును. ఈ వ్యాధిని పాదదారి యని చెప్పందగును. ఇచ్చట విపాదికా కుష్ఠమున కాళ్లయందు బొబ్బలుకల్గి పగులుననియు, ఈ వ్యాధియందు బొబ్బలులేకనే పగులుననియు, పరస్పర భేదము నెరుంగునది.

కదర లక్షణము

శ్లో॥ శర్కరోన్మథితే పాదే క్షతే వా కణ్టకాదిభిః॥౨౫॥
గ్రన్థిః కోలవదుత్సన్నో జాయతే కదరం హి తత్॥

తా॥ పాదములయందు రాళ్లు మొదలగువానిచే నభిఘాతముకల్గి నలిగినను, ముండ్లు మొదలగునవి గ్రుచ్చుకొని గాయముకల్గినను, ఆ స్థలమునందు రేగుపండువలె నున్నతంబైన గ్రంథి జనించును. ఇయ్యది కదరంబని చెప్పంజనును. "హస్తయోః పాదయోశ్చాపి గమ్భీరానుగతం ఖరమ్। మాంసకీలం జనయతః కుపితౌ కఫమారుతౌ। సశల్యమివ తం దేశం మన్యతే తేన పీడితః। శర్కరాకదరం కించిత్తస్య స్తే వాతకణ్టకమ్" అని తంత్రాన్తరమున భోజుండు వచించెను. కఫవాతములు ప్రకుపితంబులై మిక్కిలి లోతులో జనించి కఠినంబైన మాంసపుచీలను హస్తములయందును పాదములయందును కల్గించును. అచ్చోట సమ్మర్దముకల్గినప్పుడు ముండ్లు మొదలగు శల్యములు౦డువిధంబుగ కలుకకలుక్కు మనుచుండును. దీనిని శర్కరాకదరమని కొందరును, వాతకంటకమని మరికొందరును వచించెదరు అని యర్థము. ఈ వాక్యముచేత ఈ వ్యాధి హస్తములయందును జనించునని తెలియుచున్నయది.

అలసక లక్షణము

శ్లో॥ క్లిన్నాఙ్గుల్యన్తరౌ పాదౌ కణ్డూదాహరుజాన్వితౌ॥౨౬॥
దుష్టకర్దమసంస్పర్శాదలసం తం విభావయేత్।

తా॥ పాదమునందలి వ్రేళ్లనడుము దుష్టంబైన అడుసుయొక్క స్పర్శముకల్గుటచే రక్తము చెడి నీరుగారుచు దురదయు, మంటయు, నొప్పియు, కల్గినయెడ అలసకం బను వ్యాధియని యెరుంగునది. ఈ వ్యాధి కఫరక్తములచే జనించును. అందు దురద కఫముచే గల్గుననియు, మంటయు నొప్పియు రక్తముచే జనించుననియు నెరుంగునది.

ఇంద్రలుప్త లక్షణము

శ్లో॥ రోమకూపానుగం పిత్తం వాతేన సహ మూర్ఛితమ్।
ప్రచ్యావయతి రోమాణి తతశ్శ్లేష్మా సశోణితః॥౨౭॥
రుణద్ధి రోమకూపాంస్తు తతోఽన్యేషామసమ్భవః।
తదిన్ద్రలుప్తం ఖాలిత్యం రుహ్యేతి చ విభావ్యతే॥౨౮॥

తా॥ పిత్తము వాతముతోజేరి ప్రకోపమునొంది రోమములయొక్క మొదళ్ల నాశ్రయించి యారోమముల రాలించును. పిదప శ్లేష్మము రక్తముతోగూడి రోమరంధ్రముల నడ్డగించును;

దానంజేసి యచ్చోట మరల వెండ్రుకలు మొలవకుండును. ఈ వ్యాధిని ఇంద్రలుప్తంబనియు ఖాలిత్యంబనియు, రుహ్యాయనియు, వచించెదరు. మరియు "అత్యన్త సుకుమారాంగో్య రజో దుష్టం స్రవన్తిచ । అవ్యాయామరతా యస్మాత్తస్మాన్నఖలితి స్త్రియాః" అని విదేహుడు వచించెను గాన స్త్రీలు మిగుల సుకుమారంబైన శరీరముగల్గియుండుటచేతను, ప్రతిమాసమునందును దుష్టమైనరక్తము రజోరూపముగ బైలువెడలుటచేతను, మిగుల దేహపరిశ్రమము లేకుండుటచేతను, స్త్రీలకు పైజెప్పిన వ్యాధి తరుచుగ జనించుటలేదని తెలియుచున్నయది. ఇచ్చట పరిశ్రమము లేకుండుటచేతను, సౌకుమార్యముచేతను, వాతపిత్తములు ప్రకోపము నొందవు కాన వెండ్రుకలు రాలకుండుననియు, ఒకవేళ స్వల్పముగ రాలినను దుష్టరక్తము స్రవించుట చేత రక్తము రోమరన్ధ్రముల నష్టగించకుండును. కావున మరల మొలచుననియు భావము. మీస ములు రాలినయెడ ఇంద్రలుప్తమనియు, శిరస్సున వెండ్రుకలు రాలి మరల మొలవకున్నయెడ ఖాలిత్యమనియు, తక్కినదేహమునందెల్ల రాలినయెడ రుహ్యాయనియు కార్తికుండు జెప్పెను. ఈ విభాగమునకు ప్రమాణము గానంబడుటలేదు.

## దారుణక లక్షణము

శ్లో॥ దారుణా కణ్డురా రూక్షా కేశభూమిః ప్రపాట్యతే॥౨౯॥
కఫవాతప్రకోపేన విద్యాద్దారుణకం తు తమ్।

తా॥ శిరస్సునందలి చర్మము మిక్కిలి కఠినంబును రూక్షంబునై దురదతోగూడి పగులును. ఈ వ్యాధి దారుణకమని చెప్పంబడు. ఈ వ్యాధి కఫవాతములయొక్క ప్రకోపముచే జనించును. తన్త్రాన్తరమందు "యస్మిన్ [illegible] త్వచి। [illegible] జాయతే జన్తోస్తస్య [illegible] విశేషః । [illegible] వాతాత్ సకణ్డూ గౌరవం కఫాత్ । [illegible]" అని యున్నది. శిరస్సునం దలి చర్మమున మిక్కిలి బాధతోగూడి సూక్ష్మముల [illegible] పగులు గల్గి పరుషంబైన పట లము జనించును. ఈ వ్యాధియందు వాతప్రకోపముచేత పొల్లును, కఫప్రకోపముచేత దురదయు, గురుత్వంబును, పిత్తరక్తములయొక్క ప్రకోపముచేత నెప్పియు, నొప్పియు, రక్తవర్ణంబును, కల్గు నని యర్థము. ఈ వాక్యముచేత కఫవాతములతోగూడ పిత్తరక్తములనుబంధముగ నుండి యీ వ్యాధిని కల్గించునని యెరుంగనగు.

## అరూంషికా లక్షణము

శ్లో॥ అరూంషి బహువక్త్రాణి బహుక్లేదీని మూర్ధని తు॥౩౦॥
కఫాసృక్క్రిమికోపేన నృణాం విద్యాదరూంషికామ్।

తా॥ కఫము, రక్తము, క్రిములు, వీనియొక్క ప్రకోపముచేత అనేకముఖంబులును అనేక విధంబులైన స్రావము కల్గినవియునైన వ్రణములు జనించును; ఇయ్యది యరూంషికయను వ్యాధి యని యెరుంగునది.

క్షయములు గల్గియుండునని యు, అభేదపక్షమున మున్ను వచించిన యుక్తులకు సమాధానము నెరుంగునది. ఇవ్విధంబుగ పిత్తాగ్నులకు భేదము కలదను నభిప్రాయముచేత నే ప్రకృతమూలమున "శరీరోష్మా శిరోగతః పిత్తంచ" అని వేర్వేరుగ జెప్పెనని యెరుంగునది. ఇదియునుంగాక "తేజోఽనిలాద్యైః సహ కేశభూమిం దగ్ధ్వా తు కుర్యాత్ఖలితిం నరస్య। కించిత్తు దగ్ధ్వా పలితాని కుర్యాత్ హరిత్ప్రభత్వం చ శిరోరుహాణామ్" అని చరకమునందున్నది. అగ్ని వాతాదిదోషత్రయముతోగూడి శిరస్సునజేరి పచింపజేసినయెడ వెండ్రుకలూడి బట్టతల యగును. కొంచెముగ పచించెనేని వెండ్రుకలు నెరసిపోవును. లేక పింగళవర్ణంబులగునని భావము. ఈ వాక్యము ననుసరించి ప్రకృతమూలమునను క్రోధముచే ప్రకోపమునొందిన పిత్తము శరీరోష్మముతోగూడి శోకభయములచే జనించిన వాతముచే ప్రేరితంబై శిరస్సునజేరి శ్లేష్మముతో గలసి పలితము కల్గించునని యర్థము చెప్పవలెను. "పిత్తంచ" అనుచోట చకారముచేత కఫమునకుగూడ గ్రహణమని భావము.

## యువానపిడకా లక్షణము

శ్లో॥ శాల్మలీకణ్టకప్రఖ్యాః కఫమారుతరక్తజాః ॥౩౨॥
యువానపిడకా యూనాం విజ్ఞేయా ముఖదూషికాః।

తా॥ కఫవాత రక్తములయొక్క ప్రకోపముచేత యౌవనవంతులగు స్త్రీపురుషులకు ముఖమునందు బూరుగముండ్లవలె కఠినంబులైన పొక్కులు కల్గును. ఇయ్యవి యువానపిడకలని చెప్పంబడును. వీనినే మొటిమలని లోకమున వ్యవహరించెదరు. ఈ వ్యాధి స్వభావముగ యౌవనవంతులకు ముఖమునందు జనించునని యెరుంగునది.

## పద్మినీకంటక లక్షణము

శ్లో॥ కణ్టకైరాచితం వృత్తం మణ్డలం పాణ్డు కణ్డురమ్ ॥౩౩॥
పద్మినీకణ్టకప్రఖ్యైస్తదాఖ్యం కఫవాతజమ్।

తా॥ తామరకాడలయందలి ముండ్లవలె నుండు ముండ్లుకల్గి పాండువర్ణంబై దురదతోగూడి వర్తులాకారంబులగు పొడలు కల్గినయెడ దానిని పద్మినీకంటకంబను వ్యాధియని వచించెదరు. ఈ వ్యాధి కఫవాతములచే జనించును.

## జతుమణి లక్షణము

శ్లో॥ సమముత్సన్నమరుజం మణ్డలం కఫరక్తజమ్ ॥౩౪॥
సహజం లక్ష్మచైకేషాం లక్ష్యో జతుమణిస్తు సః।

తా॥ సమముగనుండి శరీరమునందు కొంచెముగ నున్నతంబైన మచ్చ జనించినయెడ దానిని కఫవాతములచే జనించిన జతుమణియని వచించెదరు. దీనిని కొందరు శరీరముతోగూడ జననకాలమున బుట్టిన పుట్టుమచ్చ యని వచించెదరు. మరియు "కృష్ణస్స్నిగ్ధో జతుమణిర్జ్ఞేయో

వాతోత్తరైస్త్రిభిః। అరుజం త్వపరైర్వ్యక్తం లక్ష్మైత్యాహుర్భిషగ్వరాః '' అని చరకమున నుండుటంజేసి జతుమణి యను వ్యాధి వాతోల్బణంబైన త్రిదోషముచే జనించునని యెరుంగునది.

### మషక లక్షణము

శ్లో॥ అవేదనం స్థిరం చైవ యస్మిన్గాత్రే ప్రదృశ్యతే ॥౩౫॥
మాషవత్కృష్ణముత్సన్నమనిలాన్మషకం తు తత్।

తా॥ వాతప్రకోపముచేత, శరీరమునందు వేదనారహితంబును, నిశ్చలంబును, మినుములబోలి కృష్ణవర్ణంబును, ఉన్నతంబైన మచ్చ జనించినయెడ దానిని మషకమని వచించెదరు. మరియు ''వాతేరతే త్వచి యదా దూష్యేతే కఫమేదసీ। శ్లక్ష్ణం మృదు సవర్ణం చ కురుతే మషకం వదేత్ '' అని చరకమున నున్నది. వాతముచే వ్యాప్తమైన చర్మమునందు కఫమేదస్సులు రెండును దుష్టంబులై నునుపుగల్గి మృదువై మినుములతో సమానమైన కృష్ణవర్ణము గల మచ్చను కల్గించును. దానిని మషకమని వచించెదరని యర్థము. ఈవాక్యమునుబట్టి కఫమేదో వాతములచే మషకము జనించునని తెలియుచున్నది.

### తిలకాలక లక్షణము

శ్లో॥ కృష్ణాని తిలమాత్రాణి నీరుజాని సమానిచ ॥౩౬॥
వాతపిత్తకఫోచ్ఛోషాత్తాన్విద్యాత్తిలకాలకాన్।

తా॥ వాతపిత్తములచే కఫము శోషించుటవలన కృష్ణవర్ణంబులును, నువ్వులయంతేసి పరిమాణము కల్గినవియు, వేదనారహితంబులును, శరీరమునకు సమంబులునైన మచ్చలు జనించును. నువ్వులవలె నల్లగా నుండుటంజేసి వీనిని తిలకాలకములని వచించెదరు. '' మారుతః పిత్తమాదాయ కఫరక్తసమాశ్రితః। చినోతి తిలమాత్రాణి త్వచి తే తిలకాలకాః '' అని తన్త్రాన్తరమున తిలకాలకలక్షణము గానంబడియెడు. వాతము పిత్తముతోగూడి కఫరక్తముల నాశ్రయించి చర్మమునందు తిలప్రమాణంబులగు మచ్చలను కల్గించును, అవి తిలకాలకములని చెప్పంబడునని భావము.

### న్యచ్ఛ లక్షణము

శ్లో॥ మహద్వా యది వా చాల్పం శ్యావం వా యది వాఽసితమ్ ॥౩౭॥
నీరుజం మండలం గాత్రే న్యచ్ఛమిత్యభిధీయతే॥

తా॥ శరీరమునందు గొప్పదిగనైనను, స్వల్పముగనైనను, శ్యామవర్ణంబుగనైనను, కృష్ణవర్ణంబుగనైనను, వేదనారహితంబై మండలాకారంబైన పొడ జనించినయెడ న్యచ్ఛమని చెప్పందగును. మరియు '' రక్తపిత్తాన్వితో వాయుస్త్వక్ప్రదేశాశ్రితో యదా। జనయేన్మండలం కృష్ణం శ్యావం వా న్యచ్ఛమాదిశేత్ '' అను భోజవచనముచేత రక్తపిత్త

మూలతోఁగూడిన వాతముచే నీ వ్యాధి జనించునని తెలియుచున్నది. ఈ మచ్చ జననకాలమునందే శరీరముతో జనించుననియు, లాంఛనమని వ్యవహరింపబడుననియు, తన్త్రాన్తరమున గానంబడియెడు.

## వ్యంగ లక్షణము

శ్లో॥ క్రోధాయాస ప్రకుపితో వాయుః పిత్తేన సంయుతః॥౩౮॥
ముఖమాగత్య సహసా మండలం విసృజత్యతః।
నీరుజం తనుకం శ్యావం ముఖే వ్యఙ్గం తమాదిశేత్॥౩౯॥

తా॥ క్రోధముచేతను, ఆయాసముచేతను, వాతము ప్రకుపితంబై పిత్తముతోఁగూడి ముఖమును జెంది బాధారహితంబును, సూక్ష్మాకారంబును, శ్యామవర్ణంబునైన పొడను కల్గించును. దీనిని వ్యంగమని వచించెదరు. ఇదియే లోకమునందు మంగు అని చెప్పంబడును. న్యచ్ఛము శరీరమునం దెచ్చటనైన జనించుననియు వ్యంగము ముఖమునందే జనించుననియు నీ రెంటికిని పరస్పరభేదముల నెరుంగునది.

## నీలికా లక్షణము

శ్లో॥ కృష్ణమేవంగుణాం గాత్రే ముఖే వా నీలికాం విదుః।

తా॥ పై జెప్పిన వ్యఙ్గలక్షణములతోఁగూడి మిక్కిలి నల్లనిరంగుకల్గిన మచ్చ ముఖమునందైనను శరీరమునందైనను జనించినయెడ నీలిక యని చెప్పంబడును. ఇచ్చట శ్యామవర్ణంబైనది వ్యంగమనియు, కృష్ణవర్ణంబై శరీరమున జనించినది కృష్ణన్యచ్ఛమనియు, కృష్ణన్యచ్ఛమునకన్న మిగుల కృష్ణవర్ణంబై శరీరమునందైనను ముఖమునందైనను జనించినది నీలికయనియు భేదముల నెరుంగునది. మరియు "మారుతః క్రోధహర్షాభ్యామూర్ధ్వగో ముఖమాశ్రితః । పిత్తేన సహ సంయుక్తః కరోతి వదనత్వచి । నీరుజం తనుకం శ్యావం వ్యఙ్గం తమితి నిర్దిశేత్ । కృష్ణమేవంగుణాం గాత్రే నీలికాం తాం వినిర్దిశేత్" అని భోజుండు వచించెను. క్రోధహర్షములచేత ఊర్ధ్వముననున్న వాతము ప్రకుపితంబై ముఖమునంజేరి పిత్తముతో గలిసి ముఖమునందలి చర్మమున బాధలేకుండునదియు, మిగుల సూక్ష్మంబైనదియు, శ్యామవర్ణంబునైన మచ్చను కల్గించును; ఇయ్యది వ్యంగమని చెప్పబడును. ఇట్టిగుణములుకల్గి నల్లనిరంగుకల్గిన మచ్చ దేహమునం దెచ్చటనైన జనించినయెడ దానిని నీలిక యని జెప్పెదరనిభావము. ఈ భోజవచనముచేత ముఖమున వ్యంగము జనించుననియు, నీలిక శరీరమునందే జనించుననియు, వ్యవస్థ తెలియుచున్నది.

## పరివర్తికా లక్షణము

శ్లో॥ మర్దనాత్పీడనాద్వాపి తథైవాప్యభిఘాతతః॥౪౦॥
మేఢ్రచర్మ యదా వాయుర్భజతే సర్వతశ్చరః।
తదా వాతోపసృష్టం తత్ చర్మ పరివర్తతే॥౪౧॥

మణేరధస్తాత్కోశశ్చ గ్రథితరూపేణ లక్ష్యతే।
సరుజాం వాతసమ్భూతాం తాం విద్యాత్పరివర్తికామ్॥౪౨॥
సకణ్డూః కఠినా వాऽపి సైవ శ్లేష్మసముత్థితా।

తా॥ మేఢ్రమును మర్దనచేయుట, పిసుకుట, అభిఘాతము కల్గుట, ఈ కారణములచేత సర్వశరీరమున సంచరించు వ్యానవాతము ప్రకుపితంబై మేఢ్రముపై చర్మము నాశ్రయించును; అట్టి వాతసంబంధముచేత చర్మము వెలకిల తిరుగంబడును. మణికి క్రిందనుండు చర్మకోశము గ్రంథిరూపంబై మిక్కుటమైన బాధతోగూడి వ్రేలుచుండును. దీనిని పరివర్తిక యని వచింతురు. మరియు నా గ్రంథి దురదతోగూడి కఠినముగనున్నయెడ శ్లేష్మముచే జనించినదిగా నెరుంగునది. మరియు "మణేరధో మేఢ్రచర్మ వ్యానస్తు పరివర్తయేత్ । సశూలతోదదాహార్తి ర్విజ్ఞేయా పరివర్తికా। శ్లైష్మికీ కఠినా స్నిగ్ధా కణ్డూయుక్తాల్పవేదనా॥" అని పరివర్తికా లక్షణమును భోజుండు వచించెను. మేఢ్రముయొక్క మణికి క్రిందిభాగమున నుండు చర్మమును వ్యానవాతము ప్రకుపితంబై వెలికల ముడుంగునట్లు చేయును. దానంజేసి శూల, నొప్పి, పోటు మున్నగు బాధలు కల్గును. ఇయ్యది పరివర్తికయని చెప్పంబడును. అట్టి చర్మము మిక్కిలి కఠినంబును, స్నిగ్ధంబును, దురదతోగూడినదియు, స్వల్పమైన వేదనకల్గినదియునై యుండెనేని కఫముచే జనించినది యని భావము.

అవపాటిక లక్షణము

శ్లో॥ అల్పీయఃఖాం యదా హర్షాద్బాలాద్గచ్ఛేత్స్త్రియం నరః॥౪౩॥
హస్తాభిఘాతాదపివా చర్మణ్యుద్వర్తితే బలాత్।
యస్యావపాట్యతే చర్మ తాం విద్యాదవపాటికామ్॥౪౪॥

తా॥ ఋతుమతి కాకుండుటచే సూక్ష్మమైన యోనిద్వారముగల కన్యకయందు కామముచే బలాత్కారముగ సంభోగముచేసినను, హస్తాదులచే నభిఘాతము కల్గినను, మేఢ్రముపై చర్మము వెలికిలబడి పలుచెరంగుల చీలినయెడ దానిని అవపాటికయని వచించెదరు. "మర్దనా దభిఘాతాద్వా కన్యాయోనిప్రపీడనాత్ । లక్ష్యతే యది మేఢ్రస్య చర్మ దర్భైరివ క్షతమ్ । అవపాటికేతి తామాహుః పృథగ్దోషైస్సమన్వితామ్ । వాతాత్సా పరుషా రూక్షా శూలనిస్తోదకారిణీ । పిత్తాత్సదాహా రక్తాద్వా దాహతృష్ణా సమన్వితా । శ్లైష్మికీ కఠినా స్నిగ్ధకణ్డూమత్యల్ప వేదనా" అని భోజోక్తి ననుసరించి అవపాటికావ్యాధి వాతాదిభేదములచే నాల్గువిధంబులై యుండునని యెరుంగునది. మర్దనము, అభిఘాతము, కన్యాసంభోగము, ఈ కారణములచేత మేఢ్రముపై చర్మము దర్భలచే గీచుకొనిన విధంబుగ పుండైనయెడ అవపాటికయనంజను. ఈ వ్యాధి పరుషంబును రూక్షంబునై నొప్పియు పోటును కల్గియున్నయెడ వాతముచే జనించినదిగానియు, అధికమైన మంటయు తాపంబును

### అహిపూతన లక్షణము

శ్లో॥ శకృన్మూత్ర సమాయుక్తేఽధౌతేఽపానే శిశోర్భవేత్ ।
స్విన్నే వాఽస్నాప్యమానే వా కండూ రక్తకఫోద్భవా॥౫౦॥
కండూయనాత్తతః క్షిప్రం స్ఫోటస్స్రావశ్చ జాయతే।
ఏకీభూతం వ్రణైర్ఘోరం తం విద్యాదహిపూతనమ్॥౫౧॥

తా॥ శిశువులయొక్క గుదస్థానము మూత్రపురీషములతో గూడియున్నను, కడగకున్నను, చెమటబట్టుచున్నను, శిశువులకు స్నానము జేయించకున్నను, కఫరక్తములచేత గుదస్థానమునందు దురదకల్గును. గోకుటచేత నచ్చోట బొబ్బలులేచి చితికి పూయములు స్రవించుచు గుదస్థానము వ్రణములతో నేకముగ నుండును. ఈ వ్యాధి అహిపూతనమని చెప్పంబడును. ఈ వ్యాధి బాలురకే కల్గును. మరియు "దుష్టస్తన్యస్య పానేన మలస్యాత్యాశనేన చ । కట్వా దాహారజావన్యైః పిత్తైశ్చ సముపాచితాః। సమ్భవన్తి యథాదోషం దారుణా హ్యహిపూతనా" అను శ్లోకోక్తి ననుసరించి ఈ వ్యాధి దుష్టస్తన్యమును పానముచేయుటచే గూడ కల్గుననియు, ఆయాదోషముల ననుసరించి దురద మంట, నొప్పి, కల్గియుండుననియు నెరుంగునది.

### వృషణకచ్ఛూ లక్షణము

శ్లో॥ స్నానోత్సాదనహీనస్య మలో వృషణసంస్థితః।
యదా ప్రక్లిద్యతే స్వేదాత్ కండూం జనయతే తదా॥౫౨॥
కండూయనాత్తతః క్షిప్రం స్ఫోటాస్స్రావశ్చ జాయతే।
ప్రాహుర్వృషణకచ్ఛూం తాం శ్లేష్మరక్తప్రకోపజామ్॥౫౩॥

తా॥ ఒడలుతోమి స్నానముజేయకున్నయెడ వృషణములయందు మురికిజేరి చెమటబట్టినచో నామురికి తడసి దానివలన దురదకల్గును, గోకినయెడల బొబ్బలుకల్గి స్రవించుచుండును. దానిని వృషణకచ్ఛువని వచించెదరు. ఈ వ్యాధి శ్లేష్మరక్తముచే కల్గును. కుష్ఠమునందు జెప్పిన కచ్ఛూవ్యాధి శరీరమునందెల్ల జనించుననియు, ఈ వ్యాధి ప్రాయికముగ వృషణములయందే జనించుననియు పరస్పరభేదముల నెరుంగునది.

### గుదభ్రంశ లక్షణము

శ్లో॥ ప్రవాహణాతిసారాభ్యాం నిర్గచ్ఛతి గుదం బహిః।
రూక్షదుర్బలదేహస్య గుదభ్రంశం తమాదిశేత్ ॥౫౪॥

తా॥ పురీషమును విసర్జించునపుడు మిక్కిలి బలాత్కారముగ ముక్కుటచేతను, అతిసారముచేతను, గుదము స్వస్థానమునుండి బైలువెడలినయెడ నయ్యది గుదభ్రంశంబని యెరుంగునది. ఈ వ్యాధి రూక్షంబై బలహీనమైన శరీరముగలవానికి జనించునని భావము.

వరాహ దంష్ట్రక లక్షణము

దాహో రక్తపర్యన్తస్త్వక్పాకీ తీవ్రవేదనః।
కణ్డూజ్వరకారీ చ స స్యాద్వారాహదంష్ట్రకః॥౪౪॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
క్షుద్రరోగ నిదానమ్
సమాప్తమ్



తా॥ మంటతోఁగూడి రక్తమును స్రవించుచు చర్మమునందు పుండై తీవ్రమైన వేదనయు దురదయు జ్వరమును కల్గించునది వరాహదంష్ట్రికంబను వ్యాధియని యెఱుంగునది. ఈ వ్యాధి గూడ గుదస్థానమున జనించును.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దీక్షితవంశ్యానాం దామోదరశాస్త్రి తనూభవ సకలసంప్రదాయ
సిద్ధ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్యవిరచితమైన నిదానదీపిక యను

మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు
క్షుద్రరోగ నిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# ముఖరోగనిదానమ్

క్షుద్రరోగనిదానానన్తరము క్రమప్రాప్తంబగు ముఖరోగనిదానము చెప్పఁబడుట.

శ్లో॥ "ఓష్ఠౌ చ దన్తమూలాని దన్తా జిహ్వా చ తాలు చ। ముఖంచ సకలం సప్తాఙ్గం ముఖముచ్యతే॥" అను ప్రమాణము ననుసరించి, పెదవులు దన్తమూలములు, దన్తములు, నాలుక, తాలువులు, గొంతు, ఇవిగాక ముఖమునందు మిగిలినభాగము, ఈ ఏడును చేరి ముఖమనంబరగు.

## ముఖరోగములలో చేరిన ఓష్ఠగతరోగనిదానమ్

శ్లో॥ ఆనూపపిశిత క్షీర దధి మత్స్యాతిసేవనాత్।
ముఖమధ్యే గదాన్కుర్యుః క్రుద్ధా దోషాః కఫోత్తరాః॥౧॥

తా॥ జలప్రాన్తమున జనించిన మృగాదులయొక్క మాంసము, పాలు, పెరుగు, మత్స్యములు వీనిని అధికముగ సేవించుటచేత వాతాదిదోషములు ప్రకుపితంబులై ముఖమధ్యమునందు రోగములను కల్గించును. ఈ వ్యాధియందు వాతాదిదోషములలో కఫము ప్రధానంబై యుండును. మరియు "దన్తేష్వష్టౌ వోష్ఠయోశ్చ మూలేషు దశ పఞ్చ చ। నవ తాలుని జిహ్వాయాం పఞ్చ సప్తదశామయాః। కణ్ఠే త్రయస్సర్వసరా ఏక షష్టిశ్చతుః పరాః" అను భోజోక్తిననుసరించి దన్తములయందును పెదవులయందును వేర్వేరుగ నెనిమిదేసి విధంబులును, దన్తమూలములయందు పదునైదువిధంబులును, తాలువులయందు తొమ్మిదివిధంబులును, నాలుకయందు ఐదువిధంబులును, కణ్ఠమునందు పదునేడువిధంబులును, ముఖమునందెల్ల వ్యాపించునవి మూడువిధంబులును, ఇవియన్నియుకలిసి ముఖరోగములు అరువదియైదు విధంబులని యెఱుంగునది.

## వాతజోష్ఠగత వ్యాధి. లక్షణము

శ్లో॥ కర్కశౌ పరుషౌ స్తబ్ధౌ సంప్రాప్తానిలవేదనౌ।
దాల్యేతే పరిపాట్యేతే ఓష్ఠౌ మారుతకోపతః॥౨॥

తా॥ వాతప్రకోపముచేత పెదవులు మిగుల కర్కశంబులును, పరుషంబులునై స్తంభించి వాతముచే జనించు వేదనలుకల్గి పగిలియుండును. ఇది వాతముచే జనించిన ఓష్ఠవ్యాధి యని యెఱుంగునది.

## పిత్తజోష్ఠవ్యాధి లక్షణము

శ్లో॥ చీయేతే పిడకాభిశ్చ సరుజాభిస్సమన్తతః।
సదాహపాకపిడకౌ పీతాభాసౌ చ పిత్తతః॥౩॥

తా॥ పిత్తప్రకోపముచేత పెదవులయందు పిత్తజనిత వేదనలతోఁగూడిన బొబ్బలు జనించును; ఒకప్పుడు మంటతోఁ కూడి పుండైన బొబ్బలు కల్గి పీతవర్ణములుగా నుండును. ఇది పిత్తముచే జనించిన ఓష్ఠవ్యాధి యని యెరుంగునది.

## కఫముచే జనించిన ఓష్ఠవ్యాధి లక్షణము

శ్లో॥ సవర్ణాభిశ్చ చీయేతే పిడకాభి రవేదనౌ।
భవతస్తు కఫాదోష్ఠౌ పిచ్ఛిలౌ శీతలౌ గురూ॥౪॥

తా॥ పెదవులకు సమానమైన వర్ణముకల్గిన బొబ్బలతోఁగూడి పెదవులు స్వల్ప వేదనతోఁ గూడి పిచ్ఛిలంబులును శీతలంబులునై భారముగల్గియున్నయెడ కఫముచే జనించిన ఓష్ఠవ్యాధి యని యెరుంగునది.

## సన్నిపాతముచే జనించిన ఓష్ఠవ్యాధి లక్షణము

శ్లో॥ సకృత్కృష్ణౌ సకృత్పీతౌ సకృచ్ఛ్వేతౌ తథైవ చ।
సన్నిపాతేన విజ్ఞేయా అనేకపిడకాచితౌ॥౫॥

తా॥ పెదవులు ఒకప్పుడు కృష్ణవర్ణంబులును, ఒకప్పుడు పీతవర్ణంబులును, ఒకప్పుడు శ్వేతవర్ణంబులునై యనేకవ్రణములతోఁ గూడియున్నయెడ సన్నిపాతముచే జనించిన ఓష్ఠవ్యాధి యని యెరుంగునది.

## రక్తముచే జనించిన ఓష్ఠవ్యాధి లక్షణము

శ్లో॥ ఖర్జూరఫలవర్ణాభిః పిడకాభిర్నిపీడితౌ।
రక్తోపసృష్టౌ రుధిరం స్రవతశ్శోణితప్రభౌ॥౬॥

తా॥ పెదవులు రక్తముచే దుష్టంబులైనయెడ ఖర్జూరపుపండ్లతోఁ సమానములైన బొబ్బలతోఁ గూడి రక్తమువంటి కాంతికల్గినవియై రక్తమును స్రవించుచుండును.

## మాంసజనిత ఓష్ఠవ్యాధి లక్షణము

శ్లో॥ గురూ స్థూలౌ మాంసదుష్టౌ మాంసపిణ్డవదుద్గతౌ।
జన్తవశ్చాత్ర మూర్ఛన్తి నరస్యోభయతో ముఖాత్॥౭॥

తా॥ మాంసముచే పెదవులు దుష్టంబులైనయెడ మిగుల భారముకల్గినవియు, స్థూలంబులును, మాంసపు ముద్దలవలె నున్నతంబులునై యుండును. మరియు నోటికిరుచెంతలనుండు పెదవులయొక్క సంధులయందు క్రిములు విశేషము వృద్ధి నొందును.

### మేదస్సుచే జనించిన ఓష్ఠవ్యాధి లక్షణము

శ్లో॥ సర్పిర్మణ్డప్రతీకాశౌ మేదసా కణ్డురౌ గురూ।
అచ్ఛం స్ఫటికసంకాశం అస్రావం స్రవతో భృశమ్॥౮॥
తయోర్వ్రణో న సంరోహేత్ మృదుత్వం చ న గచ్ఛతి।

తా॥ పెదవులు మేదస్సుచే దుష్టంబులైనయెడ పేరిన నేతివంటి కాంతిగల్గినవియు, దురదతోఁగూడి నేతివంటి కాంతిగల్గినవియు, దురదతోఁ గూడినవియు, గురుత్వము కల్గినవియునై స్ఫటికమువలె మిగుల స్వచ్ఛంబైన నీరు కార్చుచుండును. పెదవులయందు జనించిన యీ వ్రణములు మానవు. ఒకవేళ మానినను మార్దవము లేకుండును.

### అభిఘాతోష్ఠవ్యాధి లక్షణము

శ్లో॥ క్షతజాభౌ విదీర్యేతే పాట్యేతే చాభిఘాతతః॥౯॥
గ్రథితౌ చ తథాస్యాతామోష్ఠౌ కణ్డూసమన్వితౌ।

తా॥ అభిఘాతముచేత పెదవులు రక్తమునకు సమానమైన వర్ణముకల్గి ప్రస్ఫుటములుగ పగిలి గ్రంథిరూపంబులై దురదతోఁగూడి యుండును. ఇది యభిఘాతముచే జనించిన ఓష్ఠవ్యాధి యని యెఱుంగునది. మఱియు "క్షతజాభిహతౌ వా౽పి రక్తావోష్ఠౌ సవేదనౌ। భవతస్సపరిస్రావౌ కఫరక్తప్రమాణితౌ" అను శ్లోకమున కనుసరించి ఈ వ్యాధియందు కఫరక్తములు అనుబంధములుగ నుండునని యెఱుంగునది. ఇవ్విధంబుగ నోష్ఠగతవ్యాధులు ఎనిమిదివిధంబులని యెఱుంగునది.

### ముఖరోగములకు చేరిన పదునైదువిధములగు దన్తమూలగత వ్యాధులలో శీతాద లక్షణము

శ్లో॥ శోణితం దన్తవేష్టేభ్యో యస్యాకస్మాత్ప్రవర్తతే।౧౧।
దుర్గన్ధీని సకృష్ణాని ప్రక్లేదీని మృదూని చ।
దన్తమాంసాని శీర్యన్తే పచన్తి చ పరస్పరమ్।౧౨॥
శీతాదో నామ స వ్యాధిః కఫశోణితసమ్భవః॥

తా॥ దన్తముల కొనలయందుండు మాంసము లకస్మాత్తుగా [illegible] కారణములు లేకనే రక్తము స్రవించును. ఆ దన్తముల కొనలయందలి మాంసము దుర్గంధముతోఁగూడి కృష్ణవర్ణంబులై మెత్తనై [illegible] ఒకటితో నొకటి కలిసి పుండగును. దీనిని కఫరక్తములచే జనించిన శీతాదమను వ్యాధి యని యెఱుంగునది.

### [illegible] లక్షణము

శ్లో॥ [illegible]॥౧౩॥
[illegible]।

తా: దన్తములలో రెంటికైనను, మూడిటికైనను సంబంధించియుండు మాంసమున వాపు జనించిన యెడ దన్తపుప్పుటకంబను వ్యాధియని యెరుంగునది. ఈ వ్యాధి కఫరక్తములచే జనించును.

## దన్తవేష్టలక్షణము

శ్లో॥ స్రవన్తి పూయరుధిరం చలా దన్తా భవన్తి చ॥౧౩॥
దన్తవేష్టస్స విజ్ఞేయో దుష్టశోణితసమ్భవః।

తా॥ దన్తములు కదలుచు దన్తమూలములనుండి చీమును నెత్తురును గారుచుండి యున్నయెడ నవ్యాధి దన్తవేష్టంబను వ్యాధియని యెరుంగునది. ఈ వ్యాధి రక్తదోషముచే జనించును.

## సౌషిర లక్షణము

శ్లో॥ శ్వయథుర్దన్తమూలేషు రుజావాన్ కఫరక్తజః॥౧౪॥
లాలాస్రావీ స విజ్ఞేయస్సౌషిరో నామ నామతః।

తా॥ దన్తమూలములయందు వాపుకల్గి నొప్పిగలిగి బొల్లు కారుచున్న యెడ సౌషిరంబను వ్యాధియని యెరుంగునది. ఈవ్యాధి కఫరక్తములచే జనించును. దన్తపుప్పుటకముగూడ కఫరక్తములచే జనించినను లాలాస్రావము లేకుండుననియు, ఈవ్యాధియందు బొల్లు కారుచుండుననియు నీరెండిటికిని భేదము నెరుంగునది.

## మహాసౌషిర లక్షణము

శ్లో॥ దన్తాశ్చలన్తి వేష్టేభ్యస్తాలు చాప్యవదీర్యతే॥౧౫॥
యస్మిన్స సర్వజో వ్యాధిర్మహాసౌషిరలక్షణః।

తా॥ దన్తములు చిగుళ్లనుండి కదలుచు తాలువులును చిగుళ్లును పెదవులును పగులుచున్న యెడ మహాసౌషిరంబని యెరుంగునది. ఈ వ్యాధి సన్నిపాతముచే జనించును. మరియు "సన్నిపాతో దన్తమూలేషు శోథః [illegible] । [illegible] కఫం [illegible] [illegible] । [illegible] । [illegible]" అని మహాసౌషిరలక్షణమును [illegible] వచించెను. [illegible] దన్తమూలములయందు మంటతో గూడి వాపుకల్గును. [illegible] రక్తము [illegible] దన్తముల చలనము నొంది తాలువులను పెదవులను పగిలించును. ఈ వ్యాధి మహాసౌషిరంబని చెప్పంబడును. ఈవ్యాధి కల్గిన యెడల [illegible] మరణము నొందును [illegible].

## పరిదర లక్షణము

శ్లో॥ దన్తమాంసాని శీర్యన్తే యస్మిన్ ష్ఠీవతి చాప్యసృక్॥౧౬॥
[illegible] వ్యాధిర్జ్ఞేయః పరిదరో హి సః।

తా॥ దన్త మాంస శిథిలంబై యూడుచు ఉమియునపుడు రక్తము వెడలుచున్నయెడ చిగుళ్లను చీల్పుటంజేసి యీ వ్యాధి పరిదరంబని చెప్పందగును. ఈ వ్యాధి పిత్త రక్త కఫములచే జనించును.

## ఉపకుశ లక్షణము

శ్లో॥ వేష్టేషు దాహః పాకశ్చ తాభ్యాం దన్తాశ్చలన్తి చ॥౧౭॥
యస్మిన్ సోపకుశో నామ పిత్తరక్తకృతో గదః।

తా॥ దన్తముల కాధారంబైన మాంసమునందు మంటయు పుండును కల్గి దానంజేసి దన్తములు కదలుచున్నయెడ ఉపకుశంబను వ్యాధి యని యెరుంగునది. ఈ వ్యాధి పిత్తరక్తములచే జనించును.

## వైదర్భ లక్షణము

శ్లో॥ ఘృష్టేషు దన్తమాంసేషు సంరమ్భో జాయతే మహాన్॥౧౮॥
చలా భవన్తి దన్తాశ్చ స వైదర్భోఽభిఘాతజః।

తా॥ దన్తధావనము జేయునపుడు కల్గిన యభిఘాతముచే దన్తమాంసములయందు వాపు కల్గి దంతములు కదలుచున్నయెడ వైదర్భంబను వ్యాధి యని యెరుంగునది. ఈ వ్యాధి యభిఘాతముచే జనించును.

## ఖలివర్ధన లక్షణము

శ్లో॥ మారుతేనాధికో దన్తో జాయతే తీవ్రవేదనః॥౧౯॥
ఖలివర్ధనసంజ్ఞోఽసౌ జాతే రుక్చ ప్రశామ్యతి।

తా॥ వాతప్రకోపముచేత మిక్కిలి తీవ్రంబైన వేదనతోగూడి ఒకదన్తము అధికముగ మొలచినయెడ ఖలివర్ధనంబను వ్యాధియని యెరుంగునది. జనించు సమయమున వాతము అచ్చోటు నాశ్రయించి మెలమెల్లగ వేదన కల్గించి జనించినపిదప నానాట శమించును. ఈవ్యాధిని వాగ్భటాచార్యుండు అధిదన్తమను నామాన్తరముచే వ్యవహరించెను.

## కరాళ లక్షణము

శ్లో॥ శనైశ్శనైః ప్రకురుతే వాయుర్దన్తసమాశ్రితః॥౨౦॥
కరాళాన్వికటాన్దన్తాన్కరాలో న స సిధ్యతి।

తా॥ వాతము ప్రకోపమునొంది దన్తముల నాశ్రయించి వికృతాకారములుగ జేయును. దీనిని కరాలంబని చెప్పంజనును. ఈవ్యాధి మిగుల నసాధ్యంబై యుండును.

## అధిమాంసక లక్షణము

శ్లో॥ హానవ్యే పశ్చిమే దన్తే మహాన్ శోథో మహారుజః॥౨౧॥
లాలాస్రావీ కఫకృతో విజ్ఞేయస్సోఽధిమాంసకః।

తా॥ తాలుస్థానమున కఠిన జనించిన దన్తమునందు అధికమైన బాధతోఁగూడి గొప్ప వాపు జనించును. పలుమారు జొల్లుకారుచుండును. ఇది కఫముచే జనించిన అధిమాంసంబను వ్యాధియని యెఱుంగునది.

## దన్తనాడీ లక్షణము

శ్లో॥ దన్తమూలగతానాడ్యః పఞ్చ జ్ఞేయా యథేరితాః॥౧౨॥

తా॥ నాడీవ్రణనిదానమున జెప్పిన వాత పిత్త కఫ సన్నిపాతాగంతుభేదములచే నైదు విధంబులైన నాడీవ్రణముల, బోలి దన్తమూలములయందును ఐదువిధంబులైన నాడీవ్రణములు జనించును. ఇవియన్నియు గలిసి దన్తమూలగతవ్యాధులు పదునైదువిధంబులగునని యెఱుంగునది. దన్తమూలగతనాడీవ్రణంబులైనను నాడీవ్రణములకు సమానమైన లక్షణము కల్గియున్నను చికిత్సాభేదమునకై వేఱుగ జెప్పంబడినవని యెఱుంగునది. పైజెప్పబడిన పదునైదును దన్తమూలముల నాశ్రయించిన వ్యాధులని భావము.

## ముఖరోగములలోఁ జేరిన అష్టవిధంబులగు దన్తగత రోగములలో దాలనంబను వ్యాధి లక్షణము

శ్లో॥ దీర్యమాణేష్వివ రుజా యస్య దన్తేషు జాయతే।
దాలనో నామ స వ్యాధిః సదాగతినిమిత్తజః॥౧౩॥

తా॥ దన్తములయందు పగులదీయునటుల బాధ జనించినయెడ నవ్యాధి దాలనంబను వ్యాధియని యెఱుంగునది. ఈ వ్యాధి వాతముచే జనించును.

## క్రిమిదన్తక లక్షణము

శ్లో॥ కృష్ణచ్ఛిద్రశ్చలస్స్రావీ ససంరమ్భో మహారుజః।
అనిమిత్తరుజో వాతాద్విజ్ఞేయః క్రిమిదన్తకః॥౧౪॥

తా॥ నల్లని రంధ్రము కల్గి చలించుచు దంతమూలములయందు వాపుగల్గి పూయాదుల స్రవించుచు కారణములేకనే వేదనకల్గియున్నయెడ క్రిమిదన్తకంబని యెఱుంగునది. ఈ వ్యాధి వాతముచే జనించును. దంతములయందు ద్రవము లేమింజేసి దంతమూలములయందు స్రావము కల్గునని యెఱుంగునది.

## భంజనక లక్షణము

శ్లో॥ వక్త్రం వక్రం భవేద్యస్య దన్తభఙ్గశ్చ జాయతే।
కఫవాతకృతో వ్యాధిః స భఞ్జనకసంజ్ఞితః॥౧౫॥

తా॥ నోరు వక్రంబై దన్తములూడిపోయినయెడ భఞ్జనకంబను వ్యాధియని యెఱుంగునది, ఈ వ్యాధి కఫవాతములచే జనించును.

## దన్తహర్ష లక్షణము

శ్లో॥ శీతరూక్షప్రవాతామ్లస్పర్శానామసహా ద్విజాః।
పిత్తమారుతకోపేన దన్తహర్షస్స నామతః॥ ౨౬ ॥

తా॥ శీతపదార్థములు, రూక్షపదార్థములు, గాలిని, పులుసు, వీనియొక్క స్పర్శమును దన్తములు ఓరువలేకున్నయెడ దన్తహర్షంబను వ్యాధి యని యెరుంగునది. ఈ వ్యాధి పిత్తవాతములయొక్క ప్రకోపముచే గల్గునని యెరుంగునది. ఇచ్చట "శీతముష్ణం చ దశనాః సహన్తే స్పర్శనం న చ। యస్య తం దన్తహర్షం తు వ్యాధిం విద్యాత్సమీరణాత్ ॥" అని పాఠాన్తరమును కొందరు వచించెదరు. దన్తములు శీతంబును ఉష్ణంబును గల ద్రవ్యముల స్పర్శము నోరువలేకున్నచో నయ్యది దన్తహర్షంబను వ్యాధి యని యర్థము. ఇచ్చట నీ వ్యాధి వాతముచే జనించినను వ్యాధిప్రభావముచేత ఉష్ణస్పర్శము నోరువజాలకుండునని యెరుంగునది.

## దన్తశర్కరా లక్షణము

శ్లో॥ మలో దన్తగతో యస్తు పిత్తమారుతశోషితః।
శర్కరేవ ఖరస్పర్శా సా జ్ఞేయా దన్తశర్కరా॥ ౨౭॥

తా॥ దన్తములయందుండు మలము పిత్తవాతములచే శోషింపబడి కఠినంబై సున్నపురాతివలె గరగరలాడుచున్నయెడ దన్తశర్కర యనంబడును.

## కపాలికా లక్షణము

శ్లో॥ కపాలేష్వివ దీర్యత్సు దన్తానాం సైవ శర్కరా।
కపాలికేతి విజ్ఞేయా సదా దన్తవినాశినీ॥ ౨౮ ॥

తా॥ పైజెప్పిన దంతశర్కర పెంకులవలె పగిలి యూడిపోవుచున్నయెడ కపాలిక యనంబడును. ఇది యెల్లప్పుడు దన్తముల నశింపజేయుచుండును.

## శ్యావదన్తక లక్షణము

శ్లో॥ అసృఙ్మిశ్రేణ పిత్తేన దగ్ధో దన్తస్త్వశేషతః।
శ్యావతాం నీలతాం వాపి గతస్స శ్యావదన్తకః॥ ౨౯ ॥

తా॥ రక్తముతోగూడిన పిత్తముచేత దన్తము దగ్ధంబై శ్యామవర్ణమునైనను నీలవర్ణమునైనను బొందును. ఇది శ్యావదంతక మను వ్యాధి యని యెరుంగునది.

## దన్తవిద్రధి లక్షణము

శ్లో॥ దన్తమాంసే మలైస్సాస్రైర్బాహ్యాన్తశ్శ్వయథుర్గురుః।
సదాహరుక్స్రవేద్భిన్నః పూయాస్రం దన్తవిద్రధిః॥ ౩౦॥

తా॥ దన్తమున కొంశయందైన మాంసమునందు మలములతోడను పూయాగులతోడను కూడి బైటను లోపలను వాపుగల్గి మిగుల భారంబై యుండును. అట్టి వాపు పగిలి మంటయు నొప్పియు కల్గి చీము నెత్తురులను స్రవించుచుండును. దీనిని దన్తవిద్రధియని వచించెదరు. పై జెప్పిన యెనిమిది వ్యాధులును దన్తగతరోగంబులని యెరుంగునది.

ముఖరోగములలో చేరిన జిహ్వాగత పంచవిధ

రోగముల లక్షణములు

శ్లో॥ జిహ్వాఽనిలేన స్ఫుటితా ప్రసుప్తా
భవేచ్చ శాకచ్ఛదనప్రకాశా।
పిత్తేన దహ్యేత్యుపచీయతే చ
దీర్ఘైస్సరక్తైరపి కణ్టకైశ్చ॥31॥
కఫేన గుర్వీ బహులా చితా చ
మాంసోచ్ఛ్రయైశ్శాల్మలికణ్టకాభైః।

తా॥ నాలుక వాతప్రకోపముచే కొంచెముగ పగిలి రసముల నెరుంగజాలక టేకాకువలె గరగర లాడుచుండును. పిత్తప్రకోపముచేత దహింపబడి నిడువులై రక్తవర్ణంబులైన ముండ్లచే వ్యాప్తంబై యుండును. కఫప్రకోపముచేత మిగుల లావెక్కి బూరుగముండ్లవలె నుండు మాంసాంకురములచే నధికముగ వ్యాప్తంబై యుండును.

అలాస లక్షణము

శ్లో॥ జిహ్వాతలే యశ్శ్వయథుః ప్రగాఢః
సోఽలాససంజ్ఞః కఫరక్తమూర్తిః॥32॥
జిహ్వాం స తు స్తమ్భయతి ప్రవృద్ధో
మూలే చ జిహ్వా భృశమేతి పాకమ్।

తా॥ నాలుకయందు కఫరక్తములయొక్క ప్రకోపముచే మిగుల క్రూరంబైన వాపు జనించును; అట్టివాపు వృద్ధినొంది నాలుకను కదలనీయక స్తంభింపజేయును. నాలుకయొక్క మొదట పుండగును. ఈ వ్యాధి అలాసమని చెప్పంబడును. మరియు నీ వ్యాధియందు వాతప్రకోపముచే మొద్దుబారియుండుటయు పిత్తప్రకోపముచే పుండగుటయు కల్గును గాన ఈ వ్యాధి సన్నిపాత జనితంబని యెరుంగునది. సన్నిపాతజనితంబౌటచేతనే యసాధ్యంబై యుండును.

ఉపజిహ్వికా లక్షణము

శ్లో॥ జిహ్వాగ్రరూపశ్శ్వయథుర్హి జిహ్వా
మున్నమ్యజాతః కఫరక్తమూలః॥33॥
లాలాకరః కణ్డుయుతః సచోషః సా
తూపజిహ్వా పఠితా భిషగ్భిః।

తా॥ నాలుకకు క్రింద నాలుకకొనవలె నుండు వాపు కఫరక్తములయొక్క ప్రకోపముచే జనించి జొల్లుకారుచు దురదయు, నిప్పున కాలిన విధంబుగ తాపంబును గల్గి యుండును. ఈ వ్యాధి ఉపజిహ్వక యని వైద్యులచే జెప్పందగును.

ముఖరోగములలో చేరిన తాలుగతనవవిధ వ్యాధులలో

కంఠశుండీ లక్షణము

శ్లో॥ శ్లేష్మాసృగ్భ్యాం తాలుమూలే ప్రవృద్ధో
దీర్ఘశ్శోథో ధ్మాతవస్తి ప్రకాశః॥3౪॥
తృష్ణాకాస శ్వాసకృత్తం వదన్తి
వ్యాధిం వైద్యాః కణ్ఠశుణ్డీతి నామ్నా।

తా॥ తాలుమూలమునందు శ్లేష్మరక్తములు రెండును ప్రకుపితంబులై గాలిచే నిండియుండు తిత్తివలె దీర్ఘంబైన వాపును కల్గించును. అట్టి శోఫ వృద్ధినొంది దప్పి, శ్వాసకాసములను, కల్గించును. ఈ వ్యాధిని కంఠశుండి యని వైద్యులు వ్యవహరించెదరు.

తుణ్డికేరీ లక్షణము

శ్లో॥ శోథస్స్థూలస్తోదదాహ ప్రపాకీ
ప్రాగుక్తాభ్యాం తుణ్డికేరీతి నామ్నా॥3౫॥

తా॥ తాలుదేశమునందు ప్రత్తికాయవలె స్థూలంబైన వాపు జనించి పోటును మంటయు కల్గి పుండగును. ఈ వ్యాధియు పైజెప్పినరీతిగ కఫరక్తములయొక్క ప్రకోపముచే జనించును. దీనిని తుండికేరియను వ్యాధియని వచించెదరు.

అధ్రుష లక్షణము

శ్లో॥ మృదుశ్శోథో లోహితశ్శోణితోత్థో
జ్ఞేయోఽధ్రుషస్స జ్వర స్తీవ్రరుక్చ।

తా॥ తాలుమూలమున మృదువై రక్తవర్ణంబైన వాపు రక్తముయొక్క ప్రకోపముచే జనించును. జ్వరంబును తీవ్రంబైన వేదనయు కల్గును. దీనిని అధ్రుషంబను వ్యాధియని యెరుంగునది.

కచ్ఛప లక్షణము

శ్లో॥ కూర్మోత్సన్నశ్శోథోఽవేదనోఽశీఘ్రజన్మా
రోగో జ్ఞేయః కచ్ఛపశ్శ్లేష్మణా తు॥3౬॥

తా॥ తాలుదేశమున తాబేలువలె నున్నతంబై వేదనారహితంబైన వాపు శ్లేష్మముయొక్క ప్రకోపముచేత చిరకాలమునకు జనించును. దీనిని కచ్ఛపంబను వ్యాధియని యెరుంగునది.

తాల్వర్బుద లక్షణము

శ్లో॥ పద్మాకారం తాలుమధ్యే తు శోఫం
విద్యాద్రక్తాదర్బుదం ప్రోక్తలిఙ్గమ్।

తా॥ పిత్తము ప్రకోపమునొంది తాలువునందు మిగుల క్రూరంబైన పాకమును (పుండును) కల్గించును. దీనిని తాలుపాకమని వచించెదరు. పై జెప్పిన తొమ్మిదివిధములైన వ్యాధులు తాలుగతంబులని యెరుంగునది.

### కంఠగతంబులగు పదునేడువ్యాధులలో రోహిణీవ్యాధి సంప్రాప్తి

శ్లో॥ గలేఽనిలః పిత్తకఫౌ చ మూర్ఛితౌ
ప్రదూష్య మాంసం చ తథైవ శోణితమ్॥౩౯॥
గలోపసంరోధకరై స్తథాఙ్కురై
ర్నిహన్త్యసూన్ వ్యాధిరియం హి రోహిణీ।

తా॥ వాత పిత్త కఫములు మూడును ప్రకోపమునొంది కంఠమునందలి మాంసరక్తములను చెరచి కంఠబిలమును అడ్డగించు మాంసపు మొలకలను కల్గించును. దీనిని రోహిణి యను వ్యాధియని యెరుంగునది. ఈ వ్యాధి స్వభావముచేతనే ప్రాణాంతకరంబై యుండును. ఇచ్చట రోహిణీవ్యాధి సామాన్యముగ త్రిదోషసన్నిపాతముచే జనించినను త్రిదోషములలో వాతంబధికముగ నున్నపుడు వాతజమనియు, కఫం బధికముగ నున్నపుడు శ్లేష్మజమనియు, మూడు దోషంబులును సమానబలంబులై యున్నయపుడు త్రిదోషజమనియు భేదముల నెరుంగునది. ఇదియునుంగాక "పృథక్ సమస్తాశ్చ తథైవ శోణితమ్" అని సుశ్రుతమునందును "వాతః పిత్తం కఫో రక్తం చైకశ స్సర్వశోఽపివా। కణ్ఠం యదా నిషేవన్తే" అని భోజుండును చెప్పియుండుటం జేసి ఈ రోహిణీవ్యాధి వాతాదిదోషములచే వేర్వేరుగను సన్నిపాతముచేతను జనించునని తెలియుచున్నయది. మరియు వాతముచే జనించిన రోహిణీవ్యాధి ఏడుదినములవరకు చికిత్స జేయకున్నయెడ మరణమునొందించునని యు, పిత్తముచే జనించినది నాల్గుదినములకు పిమ్మట మరణము నొందించు ననియు, కఫముచే గల్గినపుడు మూడునాళ్లలోపల చికిత్సజేయనియెడ మరణము నొందించుననియు, త్రిదోషసన్నిపాతముచే జనించినయెడ అప్పుడే మరణము నొందించుననియు, భోజోక్తి ననుసరించి వాతాదిదోష భేదముచేనీ వ్యాధికి అసాధ్యత్వకాలనియమము నెరుంగునది. ఈ యర్థము ఖరనాదము నందు "సద్యస్త్రిదోషజా హన్తి త్ర్యహాత్ శ్లేష్మసముద్భవా। పంచాహాత్పిత్తసంభూతా సప్తాహాత్పవనోత్థితా" అని చెప్పంబడియె.

### వాతజరోహిణీ లక్షణము

శ్లో॥ జిహ్వాసమన్తాద్భృశవేదనాస్తు
మాంసాఙ్కురాః కంఠనిరోధినో యే॥౪౦॥
సా రోహిణీ వాతకృతా ప్రదిష్టా
వాతాత్మకోపద్రవగాఢయుక్తా।

తా॥ మిక్కిలి వేదనతోగూడి కంఠబిలము నడ్డగించు మాంసపు మొలకలు నాలుకయంతట జనించి కంపము మొదలగు వాతోపద్రవములతో గూడియున్నయెడ వాతముచే జనించిన రోహిణీవ్యాధి యని యెరుంగునది. మరియు "తాలుశ్శుష్యతి కంఠశ్చ వాతేనాయ

మ్యతే యదా। కణ్ఠోఽస్యాన్నం ప్రసజ్యేత సప్తాహాత్స జహాత్యసూన్'' అని వాత రోహిణీలక్షణమును భోజుండు వచించెను. ఈ వ్యాధియందు తాలువులు శోషించి కంఠము యూడ్వబడి కంఠబిలమునందు అన్నము లోనికి జనక నిలచియుండుననియు, ఈ రోగము జనించిన దినము మొదలు ఏడుదినములవరకు చికిత్సజేయకున్న యెడ మరణము నొందించుననియు భావము.

పిత్తజనితరోహిణీ లక్షణము

శ్లో॥ క్షిప్రోద్గమా క్షిప్రవిదాహపాకా
తీవ్రజ్వరా పిత్తనిమిత్తజా తు ॥౮౧॥

తా॥ పైజెప్పినరీతిగా మాంసాంకురములు నాలుకయం దతిశీఘ్రముగా జనించి శీఘ్రముగనే మంటతోగూడ పరిపాకమునొంది తీవ్రంబైన జ్వరముతోకూడియున్నయెడ పిత్తముచే జనించిన రోహిణీవ్యాధియని చెప్పంబడును. మరియు "ఉష్యతే చుష్యతే పిత్తాత్ ధూప్యతే పరిదహ్యతే। అఙ్గారైరివ స జహ్యాత్ ప్రాణానాసు చతుర్దినాత్॥" అని పిత్తజరోహిణీలక్షణమును భోజుండు వచించెను. తాపముకల్గుట, గొట్టముచే పిలువబడినట్లుండుట, పొగవెడలునట్లుండుట, నిప్పులచే కాలువబడినట్లుండుట, ఇట్టి లక్షణములతో గూడినది పిత్తముచే జనించిన రోహిణియనంబడును. ఈ వ్యాధియందు నాల్గుదినములవరకు చికిత్సజేయకున్నచో మరణము నొందించునని భావము.

కఫజనిత రోహిణీవ్యాధి లక్షణము

శ్లో॥ స్రోతోనిరోధిన్యచలోద్గతా చ
స్థిరాఙ్కురా యా కఫసంభవా సా।

తా॥ నాలుకయందు నిశ్చలంబులును కఠినంబులునైన మాంసాంకురములు జనించి కణ్ఠద్వారము నడ్డగించియున్నయెడ కఫముచేజనించిన రోహిణీవ్యాధియని యర్థము. మరియు ''కఫాదంతర్బహిశ్శోథః శ్వాసః కణ్ఠశ్చ బాధ్యతే। యస్య సోఽసూంస్త్యజేద్రోగీ త్ర్యహాద్రోహిణీపీడితః॥' అని కఫజరోహిణీ లక్షణమును భోజుండు చెప్పెను. కఫముచే జనించిన రోహిణీవ్యాధియందు నాలుకకు లోప్రక్కయు వెలిప్రక్కయు వాపు కలిగియుండుట, శ్వాసముజనించుట, కణ్ఠమునందు నొప్పిగల్గుట, ఈలక్షణములుగల్గి మూడుదినములవరకు చికిత్సజేయకున్నయెడ మరణము నొందించుననియు భావము.

సన్నిపాతజనిత రోహిణీ లక్షణము

శ్లో॥ గంభీరపాకిన్యనివార్యవీర్యా
త్రిదోషలిఙ్గా త్రితయోత్థితా చ ॥౮౨॥

తా॥ నాలుకయందు మాంసాఙ్కురములు జనించి మిగుల లోతున పరిపక్వంబై దోషత్రయములను వేర్వేరుగ పై జెప్పబడిన లక్షణములన్నింటితో గూడియున్నయెడ సన్నిపాతముచే జనించిన రోహిణీవ్యాధియని యెరుంగునది. మరియు "సర్వదోషకృతా యా తు

సర్వలిఙ్గసమన్వితా। అసాధ్యాం తాం విజానీయాత్ రోహిణీం సన్నిపాతజామ్॥"

అని భోజుండు వచించెను. సన్నిపాతముచే జనించిన రోహిణీవ్యాధి దోషత్రయ లక్షణములతో గూడి మిక్కిలి యసాధ్యంబై యుండునని భావము.

రక్తజనిత రోహిణీ లక్షణము

శ్లో॥ స్ఫోటైశ్చితా పిత్తసమానలిఙ్గా
సాధ్యా ప్రదిష్టా రుధిరాత్మికా తు।

తా॥ పిత్తముతో సమానములైన లక్షణములతో గూడిన బొబ్బలు నాలుకయందు జనించిన యెడ రక్తమువలన పుట్టిన రోహిణీవ్యాధి యని యెఱుంగునది. ఇవ్యాధి సుఖసాధ్యంబై యుండునని వచించెను. పై జెప్పిన ఐదువిధంబులైన రోహిణీవ్యాధులు జిహ్వాగతరోగములలో జేరినవి యని యెఱుంగునది.

కంఠశాలూక లక్షణము

శ్లో॥ కోలాస్థిమాత్రః కఫసంభవో యో
గ్రన్థిర్గలే కంటకశూకభూతః ॥౪౩॥
ఖరస్థిరశ్శస్త్రనిపాతసాధ్య
స్తంకణ్ఠశాలూకమితి బ్రువన్తి।

తా॥ రేగుపండులోనుండు విత్తనమును బోలిన పరిమాణంబుకల్గి కఠినంబై ముండ్లవలెను జలశూకమువలెను బాధ గల్గించుచు గరుసుకల్గిన గ్రంథి కఫప్రకోపముచేత కంఠమున జనించిన యెడ కంఠశాలూకంబని చెప్పంబడును. ఈ వ్యాధి శస్త్రచికిత్సచే సాధింపందగియుండును.

అధిజిహ్వ లక్షణము

శ్లో॥ జిహ్వాగ్రరూపశ్శ్వయథుః కఫాత్తు
జిహ్వోపరిష్టాదపి రక్తమిశ్రాత్ ॥౪౪॥
జ్ఞేయోఽధిజిహ్వః ఖలు రోగ ఏష
వివర్జయేదాగతపాకమేనమ్।

తా॥ జిహ్వామూలమునం దూర్ధ్వభాగమున రక్తముతో గూడిన కఫముయొక్క ప్రకోపముచేత నాలుకయొక్క కొసవలెనుండు వాపు జనించును. ఈ వ్యాధి అధిజిహ్వంబని చెప్పంబడును. ఇది పాకమునొందినయెడ నసాధ్యంబై యుండును గాన చికిత్సజేయంజనదని భావము. నాలుక యందధోభాగమున జనించిన శోఫ ఉపజిహ్వికంబనియు, ఊర్ధ్వభాగమున జనించిన శోఫ అధిజిహ్వం బనియు, పరస్పర భేదముల నెఱుంగునది.

వలయలక్షణము

శ్లో॥ బలాస ఏవాయతమున్నతం చ
శోఫం కరోత్యన్నగతిం నివార్య ॥౪౫॥

తం సర్వథైవాప్రతివార్యవీర్యం
వివర్జనీయం వలయం వదన్తి।

తా॥ కఫము ప్రకోపమునొంది కంఠమునందు విశాలంబును ఉన్నతంబునైన వాపును కల్గించును. దానివలన ఆహారము లోనికి ప్రవేశింపజేయు బిలము నిరోధింపబడును. ఈ వ్యాధి వలయంబని చెప్పంబడును. ఇది కఫముచే జనించినను వ్యాధిప్రభావముచే మిక్కిలి యసాధ్యంబై యుండును గాన చికిత్స జేయంజనదు.

బలాస లక్షణము

శ్లో॥ గలే తు శోఫం కురుతః ప్రవృద్ధౌ
శ్లేష్మానిలౌ శ్వాసరుజోపపన్నమ్॥౭౬॥
మర్మచ్ఛిదం దుస్తరమేతదాహుః
బలాససంజ్ఞం నిపుణా వికారమ్।

తా॥ కఫవాతములు రెండును వృద్ధినొంది శ్వాసముతోడను నొప్పితోడనుగూడి హృదయమర్మమును భేదించు వాపును కంఠబిలమునందు కల్గించును. దీనిని బలాసంబను వ్యాధియని వచించెదరు. ఈ వ్యాధి మిగుల దుస్సాధ్యంబై యుండును.

ఏకవృంద లక్షణము

శ్లో॥ వృత్తోన్నతో౽న్తశ్శ్వయథుస్సదాహః
స్సకణ్డురో౽పాక్యమృదుర్గురుశ్చ౭౭।
నామ్నైకవృన్దః పరికీర్తితో౽సౌ
వ్యాధిర్బలాసక్షతజప్రసూతః।

తా॥ కంఠబిలమునకు లోపల వర్తులంబును, ఉన్నతంబును, కొంచెముగ మంటకల్గినదియు, దురదతోగూడినదియు, పాకము నొందనిదియు, కఠినంబును, గురుత్వము కల్గినదియునైన వాపు కఫరక్తములయొక్క ప్రకోపముచే జనించును. దీనిని ఏకబృందమని వచించెదరు.

బృంద లక్షణము

శ్లో॥ సమున్నతం వృత్తమమన్దదాహం
తీవ్రజ్వరం బృన్దముదాహరన్తి॥౭౮॥
తచ్చాపి పిత్తక్షతజప్రకోపాత్
జ్ఞేయం సతోదం పవనాత్మకన్తు।

తా॥ రక్తపిత్తములయొక్క ప్రకోపముచేత కంఠబిలమునందు ఉన్నతంబును, వర్తులంబునైన వాపు జనించి అధికమైన మంటయు, తీవ్రంబైన జ్వరంబును కల్గియున్నయెడ దానిని బృందమను వ్యాధయనియు, తీవ్రమైన పోటుకల్గియున్నయెడ వాతముచే జనించిన బృందమనియు

గారుంగునది. ఇచ్చట ఏకబృందమునకును బృందమునకును స్థానాకృతులొకటిగనుండుటంజేసి అవస్థా భేదముచే భేదంబుగాని విశేషభేదము లేదుగాన పదునేడు కంఠరోగములను సంఖ్యకు విరోధము లేదని యెరుంగునది. మరియు "శ్లేష్మరక్త సముత్థానమేకబృన్దం విభావయేత్। తుల్యస్థానాకృతిర్బృన్దో బృన్దజో రక్తపిత్తజః॥" అని భోజుండు వచించెను. కఫరక్తములచే జనించినది యేకబృన్దమనియు, అట్టి యేకబృందమునకు సమానమైన స్థానంబును ఆకృతియు కల్గి రక్తపిత్తములను కారణములుగజేసి ఏకబృందముచే జనించినది బృందమనియు భావము. ఈ వాక్యమునుబట్టి యేకబృందమునకును బృందమునకును విశేషభేదము లేదని తెలియబడుచున్నయది.

## శతఘ్ని లక్షణము

శ్లో॥ వర్తిర్ఘనా కణ్ఠనిరోధినీ యా
చితాఽతిమాత్రం పిశితప్రరోహైః ॥౭౯॥
అనేకరుక్ప్రాణహరీ త్రిదోషాత్
జ్ఞేయా శతఘ్నీ చ శతఘ్నిరూపా।

తా॥ కంఠమునందు త్రిదోషసన్నిపాతముచేత మిక్కిలి ఘనంబును, మాంసాంకురములచే నిండినదియు, వాతాది త్రిదోషములచే జనించిన పోటు నొప్పి మంట మొదలగు బాధల గల్గించునదియునైన వర్తి యొకటి జనించి కంఠబిలమును అడ్డగించి ప్రాణహరంబై యుండును. ఇయ్యది శతఘ్ని యను రాయివలె కఠినంబై యుండుటంజేసి శతఘ్ని యనంజనును.

## గలాయు లక్షణము

శ్లో॥ గ్రన్థిర్గలే త్వామలకాస్థిమాత్రః
స్థిరోఽతిరుగ్యః కఫరక్తమూర్తిః॥౮౦॥
సంలక్ష్యతే సక్తమివాశనం చ
స శస్త్రసాధ్యస్తు గలాయు సంజ్ఞః।

తా॥ ఉసిరికకాయలోపలనుండు విత్తనమంత పరిమాణము కల్గి కఠినంబును, అధికమైన బాధతో గూడినదియునైన గ్రంథి కఫరక్తములయొక్క ప్రకోపముచే కంఠబిలమునందు జనించును. దానిచే కంఠమునందు అన్నపుముద్ద చిక్కియుండు విధంబుగ నుండును. దీనిని గలాయు వను వ్యాధియని వచించెదరు.

## గలవిద్రధి లక్షణము

శ్లో॥ సర్వం గలం వ్యాప్య సముత్థితో యః
శోథో రుజస్సన్తి చ యత్ర సర్వాః॥౮౧॥
స సర్వదోషైర్గలవిద్రధిస్తు
తస్యైవ తుల్యః ఖలు సర్వజస్య

తా॥ కంఠమునందు త్రిదోషములచే వాపు జనించి కంఠమునం దంతట వ్యాపించి వాతాది దోషములచే గల్గు నొప్పి మంట మున్నగు బాధలతోగూడియుండును. దీనిని గలవిద్రధి యని వచించెదరు. మరియు నిది సన్నిపాతముచే జనించిన విద్రధికి సమానంబులైన లక్షణములు గల్గి యుండును.

## గలౌఘ లక్షణము

శ్లో॥ శోథో మహానన్నజలావరోధీ
తీవ్రజ్వరో వాయుగతేర్నిహన్తా॥౫౨॥
కఫేన జాతో రుధిరాన్వితేన
గలే గలౌఘః పరికీర్త్యతే తు।

తా॥ రక్తముతోగూడిన కఫముచేత కంఠమునందు గొప్ప వాపు జనించి తీవ్రమైన జ్వరముతోగూడి అన్నము జలము వాతము వీనిమార్గముల నడ్డగించి యున్నయెడ గలౌఘంబను వ్యాధి యని యెరుంగునది.

## స్వరఘ్న లక్షణము

శ్లో॥ యస్తామ్యమానశ్శ్వసితి ప్రసక్తం
భిన్నస్వరః శుష్కవిముక్తకణ్ఠః॥౫౩॥
కఫోపదిగ్ధేష్వనిలాయనేషు
జ్ఞేయస్స రోగశ్శ్వసనాత్స్వరఘ్నః।

తా॥ వాతమును వహించు నాడులు కఫముతోగూడియున్నపుడు మనుజునకు మూర్ఛ, ఎల్లప్పుడు నిట్టూరుపు నిగుడించుట, స్వరభేదము, నోరెండుట, నోరు భుజించుటకు స్వాధీనము లేకుండుట, ఈలక్షణములు కల్గును. దీనిని వాతముచే జనించిన స్వరఘ్నంబను వ్యాధియని చెప్పంజనును.

## మాంసతాన లక్షణము

శ్లో॥ ప్రతానవాన్యశ్శ్వయథుస్సుకష్టో
గలోపరోధం కురుతే క్రమేణ॥౫౪॥
స మాంసతానః కథితోऽవలమ్బీ
ప్రాణప్రణుత్సర్వకృతో వికారః।

తా॥ కంఠమునందు వాపు జనించి నానాట వృద్ధినొంది కంఠబిలమును అడ్డగించుచు గొంతున పిడచ బెట్టినట్లున్నయెడ మాంసతానంబను వ్యాధియని యెరుంగునది. ఈ వ్యాధి దోషత్రయముచే జనించినది గాన శరీరమునకు మిగుల కష్టముల గల్గించి ప్రాణాన్తకరంబై యుండును.

## విదారీ లక్షణము

శ్లో॥ సదాహతోదం శ్వయథుం సుతామ్రం
అన్తర్గలే పూతివిశీర్ణమాంసమ్॥౫౫॥
పిత్తేన విద్యాద్వదనే విదారీం
పార్శ్వే విశేషాత్స తు యేన శేతే।

తా॥ కంఠబిలమునందు మంటయు పోటునుంగల్గి రక్తవర్ణంబై దుర్గంధయుక్తంబై శిథిలమైన మాంసముతోఁగూడిన వాపు పిత్తముచే జనించును. దీనిని విదారియనంబడును. ఈ వ్యాధి తరుచుగ మనుజుం డేప్రక్క పరుండునో ఆ ప్రక్కనే విశేషముగ జనించును. మరియు "పిత్తేన జాతో వదనే వికారః పార్శ్వే విశేషాత్స తు యేన శేతే। స్నాయుప్రతానప్రభవో విశేషాద్దాహప్రపాకప్రచురో విదారీ॥" అని భోజుండు వచించెను. మనుజుం డేపార్శ్వమున పరుండునో ముఖమునం దాప్రక్క పిత్తప్రకోపముచేత స్నాయువుల నాశ్రయించి వాపు జనించును. దానిని విదారి యనందగుననియు, ఈవ్యాధియందు తాపపాకములు విశేషముగ జనించుననియు భావము.

## సర్వసర లక్షణము

శ్లో॥ స్ఫోటైస్సతోదైర్వదనం సమన్తా
ద్యస్యాఽచితం సర్వసరస్స వాతాత్॥౫౬॥
రక్తైస్సదాహైస్తనుభిస్సపీతై
ర్యస్యాఽచితం చాపి స పిత్తకోపాత్।
అవేదనైః కణ్డుయుతైస్సవర్ణై
ర్యస్యాఽచితం చాపి సవై కఫేన॥౫౭॥

తా॥ పోటుతోఁగూడిన బొబ్బలు ముఖమునం దంతట జనించినయెడ వాతముచే జనించిన సర్వసరంబనియు; రక్తవర్ణంబులును, మంటతోఁ గూడినవియు, మిగుల సూక్ష్మాకారంబులును, కొంచెముగ పీతవర్ణంబులునైన బొబ్బలు ముఖమునందంతట జనించినయెడ పిత్తముచే జనించిన సర్వసరంబనియు, వేదనలేక తీవ్రమైన దురదకల్గి దేహముతో సమానమైన వర్ణముగల్గిన బొబ్బలు ముఖమునందంతట గల్గినయెడ కఫముచే జనించిన సర్వసరంబనియు నెరుంగునది. నోటియందంతట వ్యాపించియుండు పుండు సర్వసరంబని భావము. మరియు "రక్తేన పిత్తోదిత ఏవ చాపి కైశ్చిత్ప్రయుక్తో ముఖపాకసంజ్ఞః" అని రక్తముచే జనించిన సర్వసరలక్షణమును భోజుండు వచించెను. పిత్తలక్షణములతోఁ గూడియుండునది రక్తముచే జనించిన సర్వసరంబని కొందరిచే జెప్పంబడియెనని భావము. ఇయ్యది పిత్తముచే జనించిన సర్వసరలక్షణముచే గతాగంబని ప్రకృతమూలమున వేరుగ జెప్పబడలేదని యెరుంగునది.

## అసాధ్యముఖరోగ పరిగణనము

శ్లో॥ ఓష్ఠప్రకోపే వర్జ్యాస్స్యుర్మాంసరక్తత్రిదోషజాః।
దన్తమూలేషు వర్జ్యౌ చ త్రిలిఙ్గగతిసౌషిరౌ॥౫౮॥
దన్తేషు చ న సిధ్యన్తి శ్యావదాలనభఞ్జనాః।
జిహ్వారోగే బలాసస్తు తాలవ్యేష్వర్బుదం తథా॥౫౯॥
స్వరఘ్నో వలయో బృన్దో బలాసశ్చ విదారికా।
గలౌఘో మాంసతానశ్చ శతఘ్నీ రోహిణీ గలే॥౬౦॥
అసాధ్యాః కీర్తితా హ్యేతే రోగా నవదశైవ తు।
తేషు చాపి క్రియాం వైద్యః ప్రత్యాఖ్యాయ సమాచరేత్॥౬౧॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
ముఖరోగ నిదానమ్
సమాప్తమ్



తా॥ ఓష్ఠవ్యాధులలో మాంసరక్తత్రిదోషములచే జనించిన వ్యాధులును, దన్తమూల వ్యాధులయందు త్రిదోషములచే జనించిన నాడీవ్రణంబును, మహాసౌషిరంబును, దన్తవ్యాధులలో శ్యావదన్తదాలన భఞ్జనంబులను వ్యాధులును, జిహ్వారోగములలో బలాసంబను వ్యాధియు, తాలువ్యాధులలో నర్బుదంబును, కంఠవ్యాధులలో స్వరఘ్నము, వలయము, బృందము, బలాసము, విదారిక, గలౌఘము, మాంసతానము, శతఘ్ని, రోహిణి, అను నీ వ్యాధులును; ఈ పందొమ్మిది వ్యాధులును అసాధ్యంబులు. ఈ వ్యాధులయందును వైద్యుడు నిషేధించి చికిత్స చేయవలెను.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్రవిరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత" గోపాలాచార్య విరచితంబైన నిదానదీపిక యను మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు ముఖరోగనిదానము సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# కర్ణరోగనిదానమ్



ముఖరోగములయందు ఇంద్రియముల కధిష్ఠానంబైన జిహ్వకు సంబంధించిన వ్యాధులను జెప్పియుండుటంజేసి తదనంతరము ఇంద్రియములలో కర్ణములయందు జనించు వ్యాధుల నిదానమును జెప్పట.



## కర్ణశూల లక్షణము

శ్లో॥ సమీరణశ్శ్రోత్రగతోఽన్యథా చరన్
సమన్తత శ్శూలమతీవ కర్ణయోః।
కరోతి దోషైశ్చ యథాస్వమావృత
స్సకర్ణశూలః కథితో దురాచరః॥౧॥

తా॥ వాతము ప్రకుపితంబై చెవులయందు ప్రతిలోమముగ సంచరించుచు పిత్తకఫరక్తములతోగూడి తత్తదనుగుణముగ శూలను గల్గించును. దీనిని కర్ణశూలంబని వచించెదరు. ఈ వ్యాధి మిక్కిలి కష్టసాధ్యంబై యుండును. ఇచ్చట వాతాదులనుబోలి రక్తముగూడ వ్యాధికరంబు గాన దోషపదముచే వ్యవహరింపబడును. మరియు "మూర్ఛా దాహో జ్వరః కాసో హృల్లాసో వమథుస్తథా। ఉపద్రవాః కర్ణశూలే భవన్త్యేతే మరిష్యతః" అని భోజుండు జెప్పెను గాన మూర్ఛ, తాపము, జ్వరము, దగ్గు, హృల్లాసము, వమనము, ఇవి కర్ణశూలమున నుపద్రవంబులనియు; ఈ యుపద్రవములతోగూడిన కర్ణశూల అసాధ్యంబనియు నెరుంగునది. ఇదియునుంగాక, "ఏకః ప్రకుపితో దోషస్సర్వానేవ ప్రకోపయేత్" అని చెప్పినరీతిగ ఒకదోషము ప్రకుపితంబై తక్కిన దోషములను ప్రకోపము నొందించినయెడ ముందు ప్రకోపమునొందిన దోషమునకు తక్కినదోషములు అనుబంధములనియు, దోషములన్నియు తమతమ కారణములచే ప్రకోపము నొంది ఒకటిగ జేరినయెడ సంసర్గమనియు నెరుంగునది.

## కర్ణనాద లక్షణము

శ్లో॥ కర్ణస్రోతస్స్థితే వాతే శృణోతి వివిధాన్ స్వరాన్।
భేరీమృదఙ్గశఙ్ఖానాం కర్ణనాదస్స ఉచ్యతే॥౨॥

తా॥ వాతము ప్రకుపితంబై కర్ణరంధ్రమున జేరినపుడు, భేరి, మద్దెల, శంఖము, మొదలగు వానియొక్క నానావిధంబులగు ధ్వనులన్నియు వినంబడును. దీనిని కర్ణనాదమని జెప్పంబడును. మరియు "శిరోగతో యదా వాయుః శ్రోత్రయోః ప్రతిపద్యతే। తదా తు వివిధాన్ శబ్దాన్ సమీరయతి కర్ణయోః। భృఙ్గారక్రౌఞ్చనాదం వా కాక మండూకయోస్తథా। తన్త్రీమృదఙ్గశబ్దం వా సామతూర్యస్వనం తథా। గీతాధ్యయన వంశానాం నిర్ఘోషం క్ష్వేడనం తథా। అపామివ పతన్తీనాం శకటస్యేవ గచ్ఛతః। శ్వసతామివ సర్పాణాం సదృశశ్శ్రూయతే స్వనః॥" అని భోజుండు జెప్పెను. శిరోగతంబైన వాతము ప్రకోపమునొంది శ్రోత్రములయందు జేరి చెవులయందు బంగరుగిన్నె మ్రోయువిధంబైన ధ్వనియు, కొంగ, కప్ప, కాకి, వీనియొక్క ధ్వనియు, తంబురమీటిన విధంబుగ ధ్వనియు, మృదంగధ్వనియు, సామగానంబును, మంగళవాద్య ఘోషంబును, గాన అధ్యయన వేణువులయొక్క ధ్వనియు, సింహనాదంబును, పైనుండి రాళ్లమీద నుదకము పడునపుడు కల్గు ధ్వనియు, బండి పరువిడునపుడు కల్గు ధ్వనియు, సర్పములు బుసకొట్టినవిధంబుగ ధ్వనియు ఇవి మున్నుగాగల నానావిధశబ్దంబులు చెవుల వినబడునని భావము.

## బాధిర్య లక్షణము

శ్లో॥ యదా శబ్దవహం వాయుః స్రోత ఆవృత్య తిష్ఠతి।
శుద్ధశ్శ్లేష్మాన్వితో వాపి బాధిర్యం తేన జాయతే॥౩॥

తా॥ చెవులయందుండు శబ్దవహంబగు స్రోతస్సును వాతముమాత్రమైనను కఫముతో గూడిన వాతంబైనను ఆవరించి యున్నయెడ బాధిర్యము (చెవుడు) కల్గును.

## కర్ణక్ష్వేడ లక్షణము

శ్లో॥ వాయుః పిత్తాదిభిర్యుక్తో వేణుఘోషోపమం స్వనమ్।
కరోతి కర్ణయోః క్ష్వేడం కర్ణక్ష్వేడస్స ఉచ్యతే॥౪॥

తా॥ వాతము ప్రకుపితంబై కఫపిత్తరక్తములం గలసి వేణునాదముతో సమానమైన ధ్వనిని చెవులయందు గల్గించును. దీనిని కర్ణక్ష్వేడంబని జెప్పంబడును. ఈ యర్థమును భోజుండు "మారుతః కఫపిత్తాభ్యాం సంసృష్టశ్శోణితేన చ। కర్ణక్ష్వేడం సఞ్జనయేత్ క్ష్వేడనం వేణుఘోషవత్॥" అని వచించెను. కర్ణశూలమునందు నానావిధధ్వనులు వినబడుననియు, కర్ణనాదమునందు వేణునాదం బొక్కటియే నియతముగ వినంబడుననియు నీరెంటికిని పరస్పరభేదముల నెరుంగునది.

## కర్ణసంస్రావ లక్షణము

శ్లో॥ శిరోభిఘాతాదథవా నిమజ్జతో
జలే ప్రపాకాదథవాపి విద్రధేః।

ప్రవేద్ధి పూయం శ్రవణోఽనిలార్దితః
స కర్ణసంస్రావ ఇతి ప్రకీర్తితః ॥౫॥

తా। శిరస్సునందభిఘాతముగల్గుట, జలమునందధికముగ మునుగుట, విద్రధి జనించి పగులుట, ఈకారణములచేత శ్రవణము వాతపీడితంబై చీముగార్చును. దీనిని కర్ణసంస్రావంబను వ్యాధియని వచించెదరు. ఇచ్చట పూయంబనునది యుపలక్షణము గాన రక్తంబును నీరును కారునని యెరుంగునది.

కర్ణప్రతినాహ లక్షణము

శ్లో॥ మారుతః కఫసంయుక్తః కర్ణకణ్డూం కరోతి చ।
పిత్తోష్మశోషితశ్శ్లేష్మా కురుతే కర్ణగూథకమ్ ॥౬॥
స కర్ణగూథో ద్రవతాం గతో యదా
విలాయితో ఘ్రాణముఖం ప్రపద్యతే।
తదా స కర్ణప్రతినాహసంజ్ఞితో
భవేద్వికారశ్శిరసోఽర్ధభేదకృత్ ॥౭॥

తా॥ వాతము కఫముతో కలిసి చెవులయందు దురదను కల్గించును. పిత్తోష్మములచే శ్లేష్మము శోషింపబడి చెవులయందు కర్ణగూథంబను వ్యాధిని కల్గించును. ఆ మలము కరిగి ద్రవీభూతంబై నాసారంధ్రమును ముఖమును పొందినపుడు చెవులయందు ప్రతిధ్వని కల్గును. శిరమునందు సగపాలున బాధకల్గును. ఈ వ్యాధి కర్ణప్రతినాహమని చెప్పంబడును. మరియు నిది సన్నిపాతముచే జనించునని యెరుంగునది.

క్రిమికర్ణ లక్షణము

శ్లో॥ యదా తు మూర్ఛన్త్యథవాపి జన్తవ
స్సృజన్త్యపత్యాన్యథవాపి మక్షికాః।
తద్వ్యఞ్జనత్వాచ్ఛ్రవణో నిరుచ్యతే
భిషగ్భిరాద్యైః క్రిమికర్ణకో గదః॥౮॥

తా॥ చెవులయందు మాంసరక్తములు కుళ్లి క్రిములు కల్గి వృద్ధినొందినను, చెవులలో ఈగలు జొరబడి పిల్లలజేసినను, నానావిధవేదనలు కల్గియుండును. దీనిని క్రిమికర్ణంబను వ్యాధియని భిషగ్వరులు వచించెదరు. మరియు "శ్లేష్మపిత్తజలోన్మిశ్రే కోథే శోణితమాంసజే। జాయన్తే జన్తవస్తత్ర కృష్ణాస్తామ్రాస్సితారుణాః। భక్షయన్తీవ తే కర్ణం కుర్వన్తో వివిధా రుజః। క్రిమికర్ణం తు తం విద్యాత్సన్నిపాత ప్రకోపజమ్॥" అని తన్త్రాన్తరమున నున్నయది. 'శ్లేష్మము పిత్తజలములతోగూడి కుళ్లిన మాంసరక్తములయందు కృష్ణవర్ణంబులును, తామ్రవర్ణంబులును, శ్వేతవర్ణంబులును, అరుణవర్ణంబులునైన క్రిములు జనించి నానావిధవేదనలతోగూడి చెవులను తినుచుండును. దీనిని క్రిమికర్ణంబను వ్యాధియని వచించెదరు. ఈ వ్యాధి సన్నిపాతముచే జనించునని యర్థము.' ఈ ప్రమాణమునుబట్టి యీవ్యాధి సన్నిపాతముచే జనించునని యెరుంగునది.

## చెవులయందు కీటములు జేరినందుకు లక్షణము

శ్లో॥ పతఙ్గాశ్శతపద్యశ్చ కర్ణస్రోతః ప్రవిశ్య హి।
అరతిం వ్యాకులత్వం చ భృశం కుర్వన్తి వేదనామ్॥౯॥
కర్ణస్సన్తుద్యతే తస్య తథా ఫరఫరాయతే।
కీటే చరతి రుక్తీవ్రా నిష్పన్దే మన్దవేదనా॥౧౦॥

తా॥ మిడతలు జెఱ్ఱులు మొదలగునవి కర్ణరంధ్రములయందు ప్రవేశించినయెడ అరతి, మనోవ్యాకులము, అధికమైన వేదన, మొదలగు బాధలు గల్గించును. అట్టి కీటములు చెవియందు కదలుచున్నను చెవియందు పోటు, పనపనలాడుచుండుట, తీవ్రమైన బాధ, ఈ లక్షణములు కల్గును. నిశ్చలంబై యున్నపుడు స్వల్పమైన వేదన కల్గును.

## కర్ణవిద్రధి లక్షణము

శ్లో॥ క్షతాభిఘాతప్రభవస్తు విద్రధి
ర్భవేత్తథా దోషకృతోఽపరః పునః।
సరక్తపీతారుణమస్రమాస్రవే
త్ప్రతోదధూమాయనదాహచోషవాన్ ॥౧౧॥

తా॥ చెవులయందు క్షతముచేతను అభిఘాతముచేతను విద్రధి జనించును. వాతాది దోషత్రయములచేగూడ విద్రధి జనించును. అందు వాతముచే జనించిన విద్రధియందు రక్తవర్ణంబైన యాస్రావంబును, పిత్తముచే జనించిన విద్రధియందు పీతవర్ణంబైన యాస్రావంబును, కఫముచే జనించిన విద్రధియందు అరుణవర్ణంబైన యాస్రావంబును కల్గి, పోటు, పొగవెడలు విధంబుగ నుండుట, మంట, చోషము, ఈ లక్షణములు కల్గును. దీనిని కర్ణవిద్రధియని యెఱుంగునది.

## కర్ణపాక లక్షణము

శ్లో॥ కర్ణపాకస్తు పిత్తేన కోథవిక్లేదకృద్భవేత్।
కర్ణవిద్రధిపాకాద్వా జాయతే చామ్బుపూరణాత్॥౧౨॥

తా॥ పిత్తప్రకోపముచేతనైనను, కర్ణవిద్రధి పక్వంబగుటచేనైనను, జలము నిలచియుండుటచేనైనను, చెవిలోని మాంసము కుళ్లి యార్ద్రంబై యుండును. దీనిని కర్ణపాకంబని వచించెదరు.

## పూతికర్ణ లక్షణము

శ్లో॥ పూయం స్రవతి యః పూతి స జ్ఞేయః పూతికర్ణకః।

తా॥ చెవియందు దుర్గంధముతోగూడిన చీము గారుచున్నయెడ పూతికర్ణమనంబడును. మఱియు సుశ్రుతమునందు "స్రోతస్స్థితే శ్లేష్మణి పిత్తతేజసా విలీయమానే భృశసంప్రతాపితే। అవేదనో వాఽథ సవేదనో వా ఘనం స్రవేత్పూతి చ పూతికర్ణః॥" అని యున్నది. కర్ణరంధ్రములోనుండు శ్లేష్మము పిత్తముయొక్క తేజస్సుచే తపింపబడి వేదనకల్గియైనను, వేదన జనించకయైనను, మిగుల గట్టిగనుండి దుర్గంధముతో గూడిన చీము గారుచుండును.

ఈ వ్యాధి పూతికర్ణంబనదగునని భావము. ఈ వాక్యమునుబట్టి ఘనంబైన స్రావము కల్గినది పూతికర్ణంబనియు, కర్ణస్రావమునం దీ నియమము లేదనియు నీ రెంటికిని పరస్పరభేదముల నెరుంగునది.

కర్ణశోథకర్ణార్బుద కర్ణార్శో లక్షణములు

శ్లో॥ కర్ణశోథార్బుదార్శాంసి
జానీయాదుక్తలక్షణైః ॥౧౩॥

తా॥ కర్ణశోఫ, కర్ణార్బుదము, కర్ణార్శస్సులు, అను నీవ్యాధులను ఆయాలక్షణముల ననుసరించి పూర్వోక్తలక్షణములచే నెరుంగునది. ఇచ్చట వాతపిత్తకఫరక్తములచే వేర్వేరుగ జనించుటంజేసి నాల్గువిధంబులైన శోఫలును, నాల్గువిధంబులైన అర్శస్సులును, వాతపిత్తకఫరక్తమాంసమేదస్సిరారూపంబులైన కారణములచే నేడు తెరంగులునైన యర్బుదంబులును, కర్ణములయందు జనించునని యెరుంగునది. మరియు సహజ సన్నిపాతజార్శస్సులును, సన్నిపాతాగంతుజశోఫలును, ఆశ్రయప్రభావముచే కర్ణములయందు గల్గుటలేదు. ఇవ్విధంబుగ కర్ణశూల మొదలు జేసి యిరువది యెనిమిది కర్ణరోగములు సుశ్రుతమతము ననుసరించి చెప్పంబడియె.

చరకోక్తచతుర్విధ కర్ణరోగముల లక్షణములు

శ్లో॥ నాదోఽతిరుక్కర్ణమలస్య శోషః
స్రావస్తనుశ్చాశ్రవణం చ వాతాత్।
శోఫస్సరాగో దరణం విదాహః
సపీతపూతిస్రవణం చ పిత్తాత్ ॥౧౪॥
వైశ్రుత్య కండూస్థిర శోఫశుక్ల
స్నిగ్ధస్రుతిః స్వల్పరుజః కఫాచ్చ।
సర్వాణి రూపాణి చ సన్నిపాతాత్
స్రావశ్చ తత్రాధికదోషవర్ణః ॥౧౫॥

తా॥ చెవులయందు కారణములేకయే ధ్వని వినబడుట, అధికమైన పోటు, కర్ణములయందలి మలము శోషించి యుండుట, స్వల్పమైన స్రావము కల్గియుండుట, చెవులు వినబడకుండుట, ఈ లక్షణములు గల్గినది వాతముచే జనించిన కర్ణరోగంబనియు, వాపు ఎఱ్ఱగానుండుట, పగులుట, అధికమైన మంట, పచ్చనై దుర్గంధముతోగూడిన చీము గారుట, ఈ లక్షణములు గల్గినది పిత్తముచే జనించిన కర్ణరోగంబనియు; చెవులకు విరుద్ధముగ వినబడుట, దురద, కఠినంబైన వాపు, శుక్లవర్ణంబును స్నిగ్ధంబునైన స్రావము గల్గియుండుట, స్వల్పమైన బాధ కల్గియుండుట, ఈలక్షణములు కల్గినది కఫముచే జనించిన కర్ణరోగంబనియు; పైజెప్పిన లక్షణములన్నియు గల్గి వాతాదిదోషములలో నధికముగనుండు దోషముయొక్క వర్ణముకల్గినది సన్నిపాతముచే జనించిన కర్ణరోగంబనియు నెరుంగునది. ఇవి చరకమతము ననుసరించిన కర్ణరోగలక్షణములు.

## కర్ణపాలీగతవ్యాధి లక్షణములు

శ్లో॥ సౌకుమార్యా చ్చిరోత్సృష్టే సహసాఽతి ప్రవర్ధితే।
కర్ణశోథో భవేత్పాల్యాం సరుజః పరిపోటవాన్ ॥౧౬॥
కృష్ణారుణ నిభస్స్తబ్ధస్స వాతాత్పరిపోటకః।

తా॥ శరీరము మిగుల సుకుమారంబై యుండుటవలన కుట్టిన చెవులను పెంచక చిరకాలము నుండి వదలియుండి మరల శీఘ్రముగ పెంచుటచేత చెవి తమ్మెయందు పగిలి కృష్ణవర్ణంబును అరుణవర్ణంబునై స్తంభించియుండు వాపు కల్గును. దానంజేసి మిగుల తీవ్రంబైన బాధ కల్గును. దీనిని వాతముచే జనించిన పరిపోటకంబను వ్యాధియని వచించెదరు.

## ఉత్పాత లక్షణము

శ్లో॥ గుర్వాభరణ సంయోగాత్తాడనాద్ఘర్షణాదపి ॥౧౭॥
శోథః పాల్యాం భవేచ్ఛ్యావో దాహపాకరుజాన్వితః।
రక్తో వా రక్తపిత్తాభ్యా ముత్పాతస్స నిగద్యతే ॥౧౮॥

తా॥ మిగుల గొప్పవైన ఆభరణముల నుంచుటచేనైనను, కొట్టుటచేనైనను, అధికముగ తోముటచేనైనను, కర్ణమునందు మంటతోగూడి పుండై నొప్పి కల్గి శ్యామవర్ణంబైనను రక్తవర్ణంబైనను కల వాపు జనించును. దీనిని ఉత్పాతకంబను వ్యాధియని వచించెదరు. ఈ వ్యాధి రక్తపిత్తములచే జనించును.

## ఉన్మన్థన దుఃఖవర్ధన లక్షణములు

శ్లో॥ కర్ణం బలాద్వర్ధయతః పాల్యాం వాయుః ప్రకుప్యతి।
కఫం సంగృహ్య కురుతే శోథం స్తబ్ధమవేదనమ్ ॥౧౯॥
ఉన్మన్థకస్సకణ్డూకో వికారః కఫవాతజః।
సంవర్ధ్యమానే దుర్వృద్ధే కణ్డూదాహరుజాన్వితః ॥౨౦॥
శోథో భవతి పాకశ్చ త్రిదోషో దుఃఖవర్ధనః।

తా॥ చెవులను బలాత్కారముగ పెంచినయెడ వాతము ప్రకుపితంబై కఫముతోగూడి స్తబ్ధంబై వేదనారహితంబై దురదతోగూడిన వాపును గల్గించును. ఇది కఫవాతములచే గల్గిన ఉన్మన్థకంబను వ్యాధియని యెరుంగునది. చెవులను విరుద్ధస్థలమునందు కుట్టినయెడ దురదయు మంటయుకల వాపు గల్గి పుండగును. ఇది త్రిదోషములచే జనించిన దుఃఖవర్ధనంబను వ్యాధియని యెరుంగునది.

## పరిలేహి లక్షణము

శ్లో॥ కఫాసృక్క్రిమయః క్రుద్ధాస్సర్షపాభా విసర్పిణః ॥౨౧॥
కుర్వన్తి పాల్యాం పిడకాః కణ్డూదాహరుజాన్వితాః।

కఫాసృక్క్రిమిసంభూతః స విసర్పన్నితస్తతః ॥౨౨॥
లిహేత్సశష్కులీం పాలీం పరిలేహీతి స స్మృతః॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
కర్ణరోగ నిదానం సమాప్తమ్



తా॥ కర్ణపాలియందు కఫరక్తక్రిములు వృద్ధినొంది నురదయు, మంటయు, నొప్పియుగల్గి ఆవాలపరెనుండు బొబ్బలు లేచి చెవులయందెల్ల వ్యాపించును. మరియు నిది చెవియందు వ్యాపించి మాంసమును నిశ్శేషముగ తినును. దీనిని కఫరక్తక్రిములచే జనించిన పరిలేహి యను వ్యాధియని యెరుంగునది.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవింద సంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యస్వామి రామకృష్ణాశ్రమాధిప సకలసన్న్యాసి
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపిక యను

మాధవనిదానార్థతాత్పర్యమునందు
కర్ణరోగ నిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# నాసారోగనిదానమ్



శ్రవణేన్ద్రియమున కాధారంబులైన కర్ణములకు సంబంధించిన వ్యాధులను జెప్పినపిదప ఘ్రాణేన్ద్రియమున కాధారంబగు నాసికయందు జనించు వ్యాధులయొక్క నిదానము జెప్పబడు చున్నది.



### పీనస లక్షణము

శ్లో॥ ఆనహ్యతే యస్య విశుష్యతే చ
ప్రక్లిద్యతే ధూప్యతి చాపి నాసా।
న వేత్తి యో గన్ధరసాంశ్చ జన్తు
ర్జుష్టం వ్యవస్యేదిహ పీనసేన ॥౧॥
తం చానిల శ్లేష్మభవం వికారం
బ్రూయాత్ప్రతిశ్యాయసమానలిఙ్గమ్।

తా॥ ముక్కులయందు వాతముచేత కఫము శుష్కంబైనపుడు శ్వాసము వెడలక బంధించి యుండుట, ముక్కులయందు ద్రవము గల్గియుండుట, మంటబుట్టుట, ఘ్రాణేన్ద్రియమునకు సుగంధదుర్గంధములును, రసనేన్ద్రియమునకు మధురాది రసంబులును దెలియకుండుట, ఇట్టి లక్షణములు కల్గి యున్నయెడ పీనసంబని యెరుంగునది. మరియు నీవ్యాధి ప్రతిశ్యాయమునకు సమానములైన లక్షణంబులు గల్గి కఫవాతములచే జనించును. ఇచ్చట నాసారోగములకు కారణంబైన దోషముచే రసనేన్ద్రియముగూడ దుష్టంబగును గాన రసముల నెరుంగకుండునని యెరుంగునది. మరియు తన్త్రాన్తరమున "మస్తులుఙ్గో చితశ్శ్లేష్మా యదా పిత్తాద్విదహ్యతే। తదాఽసృక్పిచ్ఛిలం నాసా బహు సిఙ్ఘాణకం స్రవేత్। సకణ్డూదాహపాకం చ తంతు విద్యాద్ధి పీనసమ్॥" అని పీనసలక్షణము కానంబడియెడు. శిరమునందలి మస్తులుంగంబను మెదడును శ్లేష్మంబును పిత్తముచే దహింపఁబడి నాసాద్వారమునుండి రక్తముతోఁగూడి పిచ్ఛిలంబైన శ్లేష్మము స్రవించును. దురదయు మంటయు గల్గి నాసాద్వారములు పుండగును. దీనిని పీనసవ్యాధియని యెరుంగవలెనని భావము. ఈ వాక్యమునందు ఈ వ్యాధిసంప్రాప్తికాలమున పిత్తముచే దహింపబడునని యర్థము గాన ప్రకృతమూలమునందు "అనిలశ్లేష్మభవమ్" అను వచనమునకు విరోధములేదని యెరుంగునది.

## పూతీనస్య లక్షణము

శ్లో॥ దోషైర్విదగ్ధైర్గల తాలుమూలే
సంమూర్ఛితో యస్యసమీరణస్తు ॥౨॥
నిరేతి పూతిర్ముఖనాసికాభ్యాం
తం పూతినస్యం ప్రవదన్తి రోగమ్।

తా॥ ఉష్ణముచే పరిపక్వంబులైన పిత్తకఫరక్తములు మూడింటిచేత కంఠతాలువులయందలి వాతము వృద్ధినొంది దుర్గంధముతోగూడి నాసాద్వారమునుండియు ముఖద్వారమునుండియు బైలువెడలును. దీనిని పూతినస్యంబను వ్యాధియని యెఱుంగునది. పూతినస్యంబన దుర్గంధముతో గూడి నాసారంధ్రమునబుట్టిన వాతముతోగూడిన వ్యాధియని భావము. మరియు దీని లక్షణమును భోజుండీరీతిగ జెప్పెను: "కఫపిత్తమసృక్చోగ్రం సన్చితం మూర్ధ్ని దేహినామ్। విదగ్ధమూష్మణా గాఢం రుజాం కృత్వాఽక్షికర్ణజామ్। తతః ప్రస్యన్దతే ఘ్రాణాత్ సరక్తం పూతి పీతకమ్। పూతినస్యం తు తం విద్యాద్ఘ్రాణకణ్డూజ్వరప్రదమ్।" కఫపిత్తములు రక్తముతో గలిసి శిరంబున వృద్ధినొంది ఉష్ణముచే మిగుల పరిపక్వంబై కన్నులయందును కర్ణతలయందును బాధను గల్గించును; పిదప నాసాద్వారమునుండి రక్తముతోగూడి దుర్గంధంబై పీతవర్ణంబైన నీరు స్రవించును; దీనిని పూతినస్యంబనంజను. ఈ వ్యాధియందు నాసాద్వారమున దురదయు, జ్వరంబును కల్గునని యర్థము.

## నాసికాపాక లక్షణము

శ్లో॥ ఘ్రాణాశ్రితం పిత్తమరూంషి కుర్యాత్
యస్మిన్ వికారే బలవాంశ్చ పాకః ॥3॥
తం నాసికాపాకమితి వ్యవస్యేత్
విక్లేద కోథావథవాఽపి యత్ర।

తా॥ పిత్తము ప్రకుపితంబై నాసికనాశ్రయించి వ్రణముల గల్గించును. నాసికయందు బలమైన పుండు గల్గియున్నను, దుర్గంధముతోగూడి యార్ద్రంబై యున్నను, నాసికాపాకమను వ్యాధియని నిర్ణయింపందగును.

## పూయరక్త లక్షణము

శ్లో॥ దోషైర్విదగ్ధైరథవాపి జన్తో
ర్లలాటదేశేఽభిహతస్యతైస్తైః ॥౪॥
నాసా స్రవేత్పూయమసృగ్విమిశ్రం
తం పూయరక్తం ప్రవదన్తి రోగమ్।

తా॥ పిత్తరక్తము లధికంబగుటచేనైనను నుదుటియందు దెబ్బతగులుట మున్నగు కారణములచేనైనను వాతాదిదోషములు విదగ్ధముగ పరిపాకమునొంది రక్తముతోఁగూడిన చీమును నాసాద్వారమునుండి స్రవింపఁజేయును. దీనిని పూయరక్తంబని వచించెదరు.

## దోషజ క్షవథు లక్షణము

శ్లో॥ ఘ్రాణాశ్రితే మర్మణి సంప్రదుష్టో
యస్యానిలో నాసికయా నిరేతి ॥౫॥
కఫానుయాతో బహుశోఽతిశబ్ద
స్తం రోగమాహుః క్షవథుం విధిజ్ఞాః।

తా॥ నాసికను ఆశ్రయించిన మర్మమునందు వాతము దుష్టంబై కఫముతోఁగూడి మిగుల తీవ్రంబైన శబ్దముగల్గి నాసాద్వారమునుండి వెలువెడలినయెడ దానిని క్షవథువను రోగమని వైద్యులు వచించెదరు. దీనిని తుమ్ము అని లోకమున వ్యవహరించెదరు. ఇచ్చట ఘ్రాణేంద్రియమును తృప్తినొందించు నాసామధ్యమునందుండు సిరయందు ఇతరసిరలు జేరుస్థలము శృంగాటకంబను నాసామర్మంబని సుశ్రుతోక్తిచే నెరుంగునది.

## ఆగన్తుకక్షవథు లక్షణము

శ్లో॥ తీక్ష్ణోపయోగాదభిజిఘ్రతో వా
భావాన్కటూనర్కనిరీక్షణాద్వా ॥౬॥
సూత్రాదిభిర్వా తరుణాస్థిమర్మ
ణ్యుద్ఘాటితేఽన్యః క్షవథుర్నిరేతి।

తా॥ మిగుల తీక్ష్ణంబులైన పదార్థముల భుజించుటచేనైనను, మిగుల కారముకల్గిన ద్రవ్యములను పలుమారు మూర్కొనుటచేనైనను, సూర్యుని చిరకాలము ఊర్ధ్వముగ జూచుటచేనైనను, తరుణాస్థి (ముక్కుదూలము) రూపంబైన మర్మమునందు త్రాడు మొదలగువానిచే నభిఘాతము కల్గి చలించుటచేనైనను తుమ్ములు కల్గును. దీనిని ఆగంతుక్షవథువని వచించెదరు.

## భ్రంశథు లక్షణము

శ్లో॥ ప్రభ్రశ్యతే నాసికయా తు యస్య
సాన్ద్రో విదగ్ధో లవణః కఫస్తు ॥౭॥
ప్రాక్సంచితో మూర్ధని సూర్యతప్త
స్తం భ్రంశథుం రోగముదాహరన్తి।

తా॥ కఫము శిరమునందు వృద్ధినొంది ఘనీభావమునొంది పరిపక్వంబై లవణరూపమునొంది ఎండచే తాపమునొంది నాసాద్వారమునుండి వెడలును. దీనిని భ్రంశథు అను రోగంబని వచించెదరు. ఇచ్చట "ప్రాక్ సఞ్చితః" అనుటచేత కఫము తొలుత శిరస్సున చయము (స్వస్థానవృద్ధి) నొంది పిమ్మట ప్రకోపము నొందునని భావము. మరియు "న కేవలం చయం ప్రాప్య దోషాః

కుప్యన్తి దేహినామ్ । అన్యతోఽపి హి కుప్యన్తి హేతుబాహుల్యతో బలాత్ ॥''
అని తన్త్రాన్తరమున నున్నది. మనుజులయొక్క శరీరమునందు వాతాది దోషములు, చయము నొందియే ప్రకోపమునొందునని నియమము లేదు. ప్రకోపమునొందించు హేతువు లనేకము లున్న యెడ చయమునొందకయే ప్రకోపము నొందునని భావము. ఈ వచనమునుబట్టి కారణములు కొద్దిగ నున్నచో దోషములు చయమునొంది పిదప ప్రకోపము నొందుననియు, అనేకకారణము లున్నచో చయమునొందకయే ప్రకోపము నొందుననియు తెలియుచున్నది. గాన ప్రకృతమూల మున చయమునొంది ప్రకోపమునొందునని చెప్పినది సంగతంబని యెరుంగునది.

### దీప్త లక్షణము

శ్లో॥ ఘ్రాణే భృశం దాహసమన్వితే తు
వినిస్సరేద్ధూమ ఇవేహ వాయుః ॥౮॥
నాసాప్రదీప్తేవ చ యస్య జన్తో
ర్వ్యాధిం తు తం దీప్తముదాహరన్తి।

తా॥ నాసికయందు మిక్కిలి అధికమైన మంటగల్గి పొగ వెడలు విధంబుగ నిట్టూర్పు వెడలుచు నాసికయం దగ్నిజ్వాలవలె మండుచున్నయెడ దీప్తంబను వ్యాధియని యెరుంగునది.

### ప్రతీనాహ లక్షణము

శ్లో॥ ఉచ్ఛ్వాసమార్గం తు కఫస్సవాతో
రున్ధ్యాత్ప్రతీనాహ ముదాహరేత్తమ్ ॥౯॥

తా॥ వాతముతో గూడిన కఫము శ్వాసము వెడలుమార్గమును అడ్డగించియున్నయెడ ప్రతీనాహమని చెప్పంబడును.

### నాసాస్రావ లక్షణము

శ్లో॥ ఘ్రాణాద్ఘనః పీతసితస్తనుర్వా
దోషస్స్రవేత్స్రావముదాహరేత్తమ్।

తా॥ మిగుల చిక్కనై పీతవర్ణంబును శ్వేతవర్ణంబునైన కఫము నాసాద్వారమునుండి వెడలిన యెడ నయ్యది స్రావంబను వ్యాధియని యెరుంగునది.

### నాసాపరిశోష లక్షణము

శ్లో॥ ఘ్రాణాశ్రితే స్రోతసి మారుతేన
గాఢం ప్రతప్తే పరిశోషితే చ ॥౧౦॥
కృచ్ఛ్రాచ్ఛ్వసేదూర్ధ్వమధశ్చ జన్తు
ర్యస్మిన్స నాసాపరిశోష ఉక్తః।

తా॥ నాసికనాశ్రయించిన స్రోతస్సు వాతముచే మిగుల శోషింపబడి పిత్తముచే తపింపబడిన యెడ స్రోతస్సుననుండు కఫము ఎండును. దానంజేసి-ఉచ్ఛ్వాసనిశ్వాసములు మిగుల కష్టముచే వెడలుచుండును; దీనిని నాసాపరిశోషంబను వ్యాధియని వచించెదరు. ఇచ్చట పిత్తసంబంధములేకయే తాపము గల్గుట లేదు గాన పిత్తము అనుబంధరూపముగ నుండునని యెరుంగునది. ఈయర్థమును "ఘ్రాణాశ్రితే శ్లేష్మణి మారుతేన పిత్తేన గాఢం పరిశోషితే చ" అని పాఠాన్తరముచేత స్ఫుటముగ నుడివిరి.

ఆమపక్వపీనస లక్షణము

శ్లో॥ శిరోగురుత్వమరుచిర్నాసాస్రావ స్తనుస్స్వరః ॥౧౧॥
క్షామః ష్ఠీవతి చాభీక్ష్ణ మామపీనసలక్షణమ్।
ఆమలిఙ్గాన్వితశ్శ్లేష్మా ఘనః ఖేషు నిమజ్జతి ॥౧౨॥
స్వరవర్ణవిశుద్ధిశ్చ పక్వస్య లక్షణమ్।

తా॥ తల బరువై యుండుట, పలచనై శ్లేష్మము మిగుల సూక్ష్మముగ మాటిమాటికి నాసారంధ్రములనుండి వెడలుట, భాషించునపుడు మాటలు స్పష్టముగ వెలువడకుండుట ఈ లక్షణములు కల్గినది ఆమ (పక్వముగాని) పీనసంబనియు; శ్లేష్మము కఠినంబై నాసారంధ్రములనుండి స్రవించక లీనమై పైజెప్పిన శిరోభారము మున్నగు ఆమలక్షణములు లేకున్నయెడ పరిపక్వంబైన పీనసమనియు నెరుంగునది. మరియు నీవ్యాధియందు స్వరభేదంబును వర్ణభేదంబును గలుగకుండును. సుశ్రుతమున "తనుత్వమామలింగానామ్" అని యున్నది గాన శిరోభారము మొదలగు ఆమపీనసలక్షణములు సూక్ష్మముగ గానంబడునని యెరుంగునది.

ప్రతిశ్యాయనిదానపూర్వక సంప్రాప్తి

శ్లో॥ సన్ధారణాజీర్ణరజోఽతిభాష్య
క్రోధర్తువైషమ్యశిరోఽభితాపైః ॥౧౩॥
ప్రజాగరాతిస్వపనామ్బుశీతై
రవశ్యయా మైథునబాష్పధూమైః।
సంస్త్యానదోషే శిరసి ప్రవృద్ధో
వాయుః ప్రతిశ్యాయముదీరయేత్తు ॥౧౪॥
చయం గతా మూర్ధని మారుతాదయః
పృథక్సమస్తాశ్చ తథైవ శోణితమ్।
ప్రకుప్యమాణా వివిధైః ప్రకోపణై
ర్నృణాం ప్రతిశ్యాయకరా భవన్తి హి ॥౧౫॥

తా॥ మలమూత్రాదివేగములను నిరోధించుట, అజీర్ణకరపదార్థములను సేవించుట, దుమ్ము నాసారంధ్రముల ప్రవేశించుట, అధికముగ సంభాషించుట, మిక్కిలి కోపపడుట, ఋతుధర్మ

ములు విరుద్ధములుగ నుండుట, పొగ మొదలగునవి నాసారంధ్రములం బ్రవేశించి శిరంబున సంతాపమును గల్గించుట, రాత్రులయం దధికముగ నిదుర మేల్కాంచి యుండుట, పవటియందు మిగుల నిదురించుట, చల్లనినీళ్లను సేవించుట, మంచున వసించుట, అధికముగ సంభోగము జేయుట, కన్నీళ్లవిడుచుట, పొగయందుండుట, ఇట్టి కారణములచేత వాతము ప్రకుపితంబై ఘనీభావము నొందిన శ్లేష్మతోగూడి శిరస్సునందు ప్రతిశ్యాయంబను వ్యాధిని కల్గించును. మరియు "ఘ్రాణమూలే స్థితశ్శ్లేష్మా రుధిరం పిత్తమేవ వా। మారుతాధ్మాతశిరస శ్స్యాయతే మారుతం ప్రతి॥" అని చరకమున నుండుటంజేసి కఫరక్తపిత్తములలో నేదైనను నాసామూలమునుండి వాతపూరితంబైన శిరస్సునందు వాతమున కభిముఖముగ సంచరించునదియే ప్రతిశ్యాయంబని యెరుంగునది.

ప్రతి అను ఉపసర్గమును పూర్వమునగల "శ్యైఙ్ — గతౌ" అను ధాతువుచే "ప్రతిశ్యాయః" అను రూపము సిద్ధమైనది గాన పైజెప్పిన యర్థము లభించునని భావము.

మరియు వాత పిత్త కఫరక్తములు తమతమ స్థానములయందు వృద్ధినొంది వేర్వేరుగనైనను అన్నియుంగలసియైనను తమతమకారణములచేత ప్రకుపితంబులై శిరంబునజేరి పైజెప్పిన ప్రతిశ్యాయంబను వ్యాధిని కల్గించును. ఇచ్చట "స్వస్థానవృద్ధిర్దోషాణాం చయ ఇత్యభిధీయతే" అను వచనమునుబట్టి వాతాదిదోషములు మూడును స్వస్థానములయందు వృద్ధినొందుటయే చయంబని యెరుంగునది. మరియు వాతపిత్తకఫరక్తసన్నిపాతభేదములచే నైదువిధంబులైన ప్రతిశ్యాయమునకు వాతాదులను చయాదిక్రమము నపేక్షించకయే ప్రకోపింపఁజేసి ప్రతిశ్యాయమును గల్గించునది సద్యోజనకనిదానంబనియు, చయాదిక్రమము ననుసరించి ప్రకోపింపంజేసి కల్గించునది రెండవ నిదానమనియు నిదానములు రెండువిధంబులు; అందు "సంధారణాజీర్ణ" అని యుపక్రమించి చెప్పబడినది సద్యోనిదానంబనియు "చయం గతాః" అని యుపక్రమించి చెప్పినది చయాదిక్రమముననుసరించిన నిదానంబనియు నెరుంగునది. సద్యోనిదానము సుశ్రుతమునం దివ్విధంబుగ గానంబడియెడు; "నారీప్రసంగశ్శిరసోఽభితాపో ధూమోరజశ్శీతమతిప్రతాపః। సన్ధారణం మూత్రపురీషయోశ్చ సద్యః ప్రతిశ్యాయనిదానముక్తమ్॥" స్త్రీ సంభోగము, శిరస్సంతాపము, పొగయు రజస్సును నాసాద్వారముల జొరంబడుట, అధికమైన శీతము, అధికమైన సంతాపము, మూత్రపురీషములను నిరోధించుట, ఇవి యన్నియు ప్రతిశ్యాయమునకు సద్యోనిదానంబులని యర్థము.

## ప్రతిశ్యాయ పూర్వరూపములు

శ్లో॥ క్షువప్రవృత్తిశ్శిరసోఽతిపూర్ణతా
స్తమ్భోఽఙ్గమర్దః పరిహృష్టరోమతా।
ఉపద్రవాశ్చాప్యపరే పృథగ్విధాః
నృణాం ప్రతిశ్యాయపురస్సరాస్స్మృతాః ॥౧౬॥

తా॥ తుమ్ములు వెడలుట, శిరస్సు నిండినట్లుండుట, శరీరము స్తంభించి యుండుట, ఒడలినొప్పులు, రోమాంచము కల్గుట, ఈ లక్షణంబులును; తత్కాలమున జనించు ముక్కునందు మంట మొదలగు నుపద్రవంబులును, ఇవియన్నియు ప్రతిశ్యాయము జనించుటకుమున్ను కల్గు పూర్వరూపములని యెరుంగునది. మరియు "పూర్వరూపాణి దృశ్యన్తే ప్రతిశ్యాయే భవిష్యతి। ఘ్రాణధూమాయనం మర్ధః క్షవథుస్తాలుదారణమ్। కంఠధ్వంసో ముఖస్రావః శిరసః పూరణంతథా॥" అని ప్రతిశ్యాయపూర్వరూపములను విదేహుండు వచించెను. నాసారంధ్రములయందు పొగ వెడలునట్లు బాధ కల్గుట, పుల్లతో కలియబెట్టినట్లుండుట, తుమ్ములు వెడలుట, తాలువులయందు పగులుట, గొంతెండుట, నోట నీరు స్రవించుట, శిరస్సు బరువై యుండుట, ఇవి యన్నియు ప్రతిశ్యాయము జనించుటకుమున్ను కల్గు పూర్వరూపములని భావము.

## వాతజప్రతిశ్యాయ లక్షణము

శ్లో॥ ఆనద్ధా పిహితా నాసా తనుస్రావప్రసేకినీ।
గలతాల్వోష్ఠ శోషశ్చ నిస్తోదశ్శఙ్ఖయో స్తథా ॥౧౭॥
క్షవప్రవృత్తి రత్యర్థం వక్త్రవైరస్య మేవ చ।
భవేత్స్వరోపఘాతశ్చ ప్రతిశ్యాయేఽనిలాత్మకే॥౧౮॥

తా॥ నాసారంధ్రములు బిగిసి మూయబడినట్లుండుట, పలచనైన శ్లేష్మము స్రవించుట, కంఠంబును తాలువులును పెదవులును ఎండుట, కణతలయందు పోటు బుట్టుట, అధికముగ తుమ్ములు వెడలుట, నోరు రసముల నెరుంగకుండుట, కంఠస్వరము బైలువెడలక యడ్డగించబడి యుండుట, ఈ లక్షణములు వాతముచే జనించిన ప్రతిశ్యాయమునందు కల్గును.

## పిత్తముచే జనించిన ప్రతిశ్యాయ లక్షణము

శ్లో॥ ఉష్ణస్సపీతకస్స్రావో ఘ్రాణాత్స్రవతి పైత్తికే।
కృశోఽతిపాణ్డుస్సన్తప్తో భవేదుష్ణాభిపీడితః॥౧౯॥
సధూమమగ్నిం సహసా వమతీవ స మానవః।

తా॥ పిత్తముచే జనించిన ప్రతిశ్యాయమునందు ఉష్ణంబై కొంచెము పచ్చగనుండు శ్లేష్మము నాసారంధ్రములనుండి వెడలును. ఈ వ్యాధికల మనుజుండు మిగుల కృశతనొంది పాండువర్ణము కలవాడును, మిగుల సంతాపము నొందినవాడును, ఉష్ణముచే పీడితుండునై పొగతోగూడిన యగ్నిని గ్రక్కు విధంబుగ నుండును.

## కఫజనిత ప్రతిశ్యాయ లక్షణము

శ్లో॥ ఘ్రాణాత్కఫః కఫకృతే శీతః పాణ్డుస్స్రవేద్బహు ॥౨౦॥
శుక్లావభాసశ్శుక్లాక్షో భవేద్గురుశిరా నరః।
కణ్ఠతాల్వోష్ఠశిరసాం కణ్డూభిరభిపీడితః ॥౨౧॥

తా॥ కఫముచే జనించిన ప్రతిశ్యాయమునందు మిగుల శీతలంబును, పాండువర్ణంబునైన కఫము అధికముగ నాసారంధ్రమునుండి వెడలును. ఈ వ్యాధికల మనుజుండు తెల్లని దేహచ్ఛాయయు తెల్లని కన్నులును కలవాఁడును, మిగుల బరువైన శిరస్సుకలవాఁడునై కంఠమునందును, తాలువులయందును, శిరస్సునందును మిక్కుటమైన దురదచే బాధింపబడును.

## సన్నిపాతజ ప్రతిశ్యాయ లక్షణము

శ్లో॥ భూత్వా భూత్వా ప్రతిశ్యాయో యస్యాకస్మాన్నివర్తతే।
సంపక్వో వాఽప్యపక్వో వా స సర్వప్రభవస్స్మృతః॥ ౨౨॥

తా॥ ప్రతిశ్యాయము పక్వంబైనను పక్వము గాకున్నను మాటిమాటికి జనించి చికిత్స జేయకున్నను తనంతట నివర్తించి మరల కల్గుచున్నయెడ సన్నిపాతముచే జనించిన ప్రతిశ్యాయంబని యెరుంగునది. మరియు "నృణాం దుష్టప్రతిశ్యాయ స్త్వసాధ్యస్సర్వజస్స్మృతః" అను విదేహవచనము ననుసరించి సన్నిపాతముచే జనించిన ప్రతిశ్యాయము అసాధ్యంబని యెరుంగునది.

## దుష్టప్రతిశ్యాయ లక్షణము

శ్లో॥ ప్రక్లిద్యతే పునర్నాసా పునశ్చ పరిశుష్యతి
పునరానహ్యతే వాఽపి పునర్విమ్రియతే తథా॥ ౨౩॥
నిశ్శ్వాసో వాతి దుర్గన్ధో నరో గన్ధాన్న వేత్తి చ।
ఏవం దుష్టప్రతిశ్యాయం జానీయాత్కృచ్ఛ్రసాధనమ్॥ ౨౪॥

తా॥ ప్రతిశ్యాయవ్యాధి కల్గినప్పుడు నాసారంధ్రము లొకప్పుడు ఆర్ద్రంబులును, మరియొకప్పుడు శుష్కంబులునై యొకప్పుడు మూసికొనియుండి వేరొకప్పుడు శ్లేష్మచే నడ్డగింపబడకుండి దుర్గంధముతోఁగూడిన నిశ్శ్వాసము వెలువెడలుచు • గంధాదుల నెరుగకున్నయెడ అట్టి ప్రతిశ్యాయము ఏకదోషముచే జనించినను అపథ్యాహారాదులచే తక్కిన దోషములుగూడ ప్రకోపము నొందియున్నవి యని యెరుంగునది. ఇట్టి దోషసంకరముచే దుష్టంబైన ప్రతిశ్యాయమునందు పరస్పరవిరుద్ధంబులైన చికిత్సల జేయవలసియుండును గాన మిగుల కష్టసాధ్యంబై యుండును. ఇదియు అవస్థాభేదముచే పైజెప్పిన ప్రతిశ్యాయభేదములతో జేరినది గాన సంఖ్యాభేదము లేదని యెరుంగునది.

## రక్తజ ప్రతిశ్యాయ లక్షణము

శ్లో॥ రక్తజే తు ప్రతిశ్యాయే రక్తస్రావః ప్రవర్తతే।
తామ్రాక్షశ్చ భవేజ్జన్తురురోఘాతప్రపీడితః॥ ౨౫॥
దుర్గన్ధోచ్ఛ్వాసవదనో గన్ధానపి న వేత్తి సః।

తా॥ రక్తముచే జనించిన ప్రతిశ్యాయమునందు నాసారంధ్రములనుండి రక్తం బధికముగ స్రవించుట, కన్ను లెఱ్ఱగ నుండుట, ఉరోఘాతంబను వ్యాధి కల్గుట, దుర్గంధయుక్తమైన శ్వాసము వెడలుట, నోరు దుర్గంధముతో గూడియుండుట, వాసనల దెలియకుండుట, ఈ లక్షణములు

కల్గును. మరియు "పిత్తప్రతిశ్యాయక్రుతైః లిఙ్గైశ్చాపి సమన్వితః" అని ఇతరగ్రన్థములయందున్నది గాన రక్తపిత్తములు రెండును సమానంబులై యుండుటంజేసి రక్తప్రతిశ్యాయమునందు పిత్తప్రతిశ్యాయలక్షణములుగూడ కల్గునని యెరుంగునది.

## అసాధ్యప్రతిశ్యాయ లక్షణము

శ్లో॥ సర్వ ఏవ ప్రతిశ్యాయా నరస్యాప్రతికారిణః॥ ౨౬ ॥
దుష్టతాం యాన్తి కాలేన తదాఽసాధ్యా భవన్తి హి।
మూర్ఛన్తి చాత్ర క్రిమయః శ్వేతాస్స్నిగ్ధా స్తథాఽణవః ॥ ౨౭॥
క్రిమితో యశ్శిరోరోగస్తుల్యం తేనాస్య లక్షణమ్।

తా॥ పై జెప్పిన ప్రతిశ్యాయములన్నియు సకాలమున చికిత్సజేయక యుపేక్షించినయెడ కొంతకాలమునకు మిక్కిలి దుష్టంబులై యసాధ్యంబు లగును. మరియు నీవ్యాధులయందు కాలక్రమముగ శ్వేతవర్ణంబులును, స్నిగ్ధంబులును, మిక్కిలి సూక్ష్మాకారంబులునైన పురుగులు బుట్టును. క్రిములు జనించినప్పుడు క్రిములచే గల్గిన శిరోవ్యాధికి సమానంబులైన లక్షణములు కల్గియుండును.

## పీనసముచే కల్గు వ్యాధులు

శ్లో॥ బాధిర్యమాన్ధ్యమఘ్రత్వం ఘోరాంశ్చ నయనామయాన్ ॥ ౨౮ ॥
శోథాగ్నిసాదకాసాంశ్చ వృద్ధాః కుర్వన్తి పీనసాః।

తా॥ చెవుడు, అంధత్వము, గంధమును గ్రహించు శక్తిలేకబోవుట, క్రూరంబులైన నేత్రరోగములు, వాపు, అగ్నిమాంద్యము, దగ్గు ఈవ్యాధులను పీనసములు వృద్ధినొంది కల్గించును. ఇచ్చట "ఘోరాంశ్చ నయనామయాన్" అనువాక్యముచేతనే నేత్రరోగాన్తర్గతంబైన అంధత్వముగూడ గ్రహించబడినను మరల అన్ధ్యపదమును గ్రహించుటవలన పీనసవ్యాధిచేత అంధత్వము విశేషముగ జనించునని భావము.

## నాసార్బుదాది లక్షణములు

శ్లో॥ అర్బుదం సప్తధాశోథాశ్చత్వారోఽర్శశ్చతుర్విధమ్ ॥ ౨౯ ॥
చతుర్విధం రక్తపిత్త ముక్తం ఘ్రాణేఽపి తద్విదుః।



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
నాసారోగ నిదానమ్
సమాప్తమ్



తా॥ ఏడువిధంబులైన అర్బుదంబులును, నాల్గువిధంబులైన శోఫలును, నాల్గుతెరంగులైన అర్శస్సులును, నాల్గువిధంబులగు రక్తపిత్తంబులును. ఇవియన్నియు నాసికయందును కల్గును. వాని లక్షణములను మున్ను చెప్పినరీతిగ నూహింపందగినది.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దీవ్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్యవిరచితంబైన నిదానదీపిక యను
మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు
నాసారోగనిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

---

# నేత్రరోగనిదానమ్



నేత్రములు నాసికబోలె ఇంద్రియమున కధిష్ఠానంబులు గాన నాసారోగముల నిదానమును జెప్పినపిదప నేత్రరోగముల నిదానమును జెప్పుట.

శ్లో॥ ఉష్ణాభితప్తస్య జలే ప్రవేశా
ద్దూరేక్షణాత్స్వప్నవిపర్యయాచ్చ।
స్వేదాద్రజోధూమనిషేవణాచ్చ
ఛర్దేర్విఘాతాద్వమనాతియోగాత్ ॥౧॥
ద్రవాత్తథాన్నాన్నిశి సేవితాచ్చ
విణ్మూత్రవాతక్రమనిగ్రహాచ్చ।
ప్రసక్తసంరోదనకోపశోకా
చ్ఛిరోఽభిఘాతాదతిమద్యపానాత్ ॥౨॥
తథా ఋతూనాం చ విపర్యయేణ
క్లేశాభిఘాతాదతిమైథునాచ్చ।
బాష్పగ్రహాత్సూక్ష్మనిరీక్షణాచ్చ
నేత్రే వికారాన్ జనయన్తి దోషాః॥3॥

తా॥ ఎండ మొదలగువానిచే దేహమునందు మిగుల సంతాపము గలిగియుండునపుడు జలమునందు చిరకాలముప్రవేశించియుండుట, దూరముననుండువస్తువులను జూచుట, రాత్రులయందు నిదుర మేల్కాంచి పవటియందు నిదురించుట, కన్నులయందు చెమట పొగ దుమ్ము మొదలగునవి చేరుట, వమనమును నిరోధించుట, అధికముగ వమనము జేయుట, ఆర్ద్రంబైన యన్నమును రాత్రులయందు భుజించుట, మలమూత్రవాతములను నానాట నిగ్రహించుట, ఎల్లప్పుడును రోదనంబును కోపంబును దుఃఖంబును కల్గియుండుట, శిరంబున నధికముగ సంతాపము కల్గుట, అధికముగ మద్యపానము జేయుట, ఒకఋతుచర్యలను వేరొకఋతువున జేయుట, శరీరశ్రమము, అభిఘాతము, అధికముగ స్త్రీసంభోగము జేయుట, కన్నీళ్లను నిరోధించుట, మిగుల సూక్ష్మంబులైన వస్తువులను జూచుట, ఈ కారణములచేత వాతపిత్తశ్లేష్మంబులు మూడును ప్రకోపమునొంది

నేత్రములయందు నానావిధరోగములను గల్గింపును. నేత్రరోగభేదములను సుశ్రుతుండివ్విధంబుగ వచించెను: "తైస్త్రిభిస్త్రింశదుక్తాస్తే కఫేనాత్యధికాస్త్రయః। రక్తజాష్షోడశ ప్రోక్తాః సర్వజాః పఞ్చవింశతిః। బాహ్యౌ పునర్ద్వౌ చ తథా రోగాష్షట్సప్తతి స్స్మృతాః। నవ సన్ధ్యాశ్రయాస్తేషు వర్త్మజాస్త్వేకవింశతిః। శుక్లభాగే దశైకశ్చ చత్వారః కృష్ణభాగజాః। సర్వాశ్రయాస్సప్తదశ దృష్టిజా ద్వాదశైవ తు। ద్వౌ చ బాహ్యాశ్రయావన్యౌ రోగౌ పరమదారుణౌ। షట్సప్తతిర్నేత్రరోగాస్సంగ్రహేణ ప్రకీర్తితాః॥" వాతాది దోషత్రయములచే జనించినవి (౩౦) ముప్పదియు, దోషములలో కఫాధిక్యముచే జనించినవి (౩) మూడును, రక్తముచే జనించినవి (౧౬) పదునారును, సన్నిపాతముచే జనించినవి (౨౫) ఇరువదియైదును, నేత్రములకు వెలిప్రక్క జనించినవి (౨) రెండును, ఇవియన్నియు గలసి నేత్రరోగములు డెబ్బదియారువిధంబులగును. అందు నేత్రములయందలి సంధుల నాశ్రయించినవి (౯) తొమ్మిదియు, రెప్పల నాశ్రయించినవి(౨౧) యిరువది యొకటియు, శుక్లభాగము నాశ్రయించినవి (౧౧) పదునొకండును, కృష్ణభాగము నాశ్రయించినవి (౪) నాల్గును, అన్నింటి నాశ్రయించినవి (౧౭) పదునేడును, దృష్టినాశ్రయించినవి (౧౨) పండ్రెండును, నేత్రముల వెలిప్రక్క నాశ్రయించినవి (౨) రెండునై, యుండును. ఇవ్విధంబుగ డెబ్బదియారు విధంబులైన నేత్రరోగముల విభాగము నెరుంగునది. నేత్రరోగ సంప్రాప్తి సుశ్రుతమునం దిత్తెరంగున గానంబడియె "సిరానుసారిభిర్దోషైర్విగుణైరూర్ధ్వమాగతైః। జాయన్తే నేత్రభాగేషు రోగాః పరమదారుణాః॥" సిరల ననుసరించియుండు వాతపిత్తశ్లేష్మములు మూడును ప్రకోపమునొంది శరీరమునం దూర్ధ్వభాగము నాశ్రయించి మిగుల క్రూరంబులగు నేత్రరోగములను గల్గించునని భావము. మరియు నేత్రపరిమాణము సుశ్రుతమున నివ్విధంబుగ జెప్పంబడియె: "విద్యాద్ద్వ్యఙ్గుల బాహుల్యం స్వాఙ్గుష్ఠోదరసమ్మితమ్। ద్వ్యఙ్గులం సర్వతస్సార్ధం భిషఙ్నయనబుద్బుదమ్॥" రెండంగుళముల విస్తారంబును, లోప్రక్క బొటనవ్రేలి పరిమాణంబును, చుట్టు రెండున్నర అంగుళముల పరిమాణంబును కల్గి గ్రుడ్డువలె నుండునది నేత్రంబని భావము.

## అభిష్యన్దభేదములు

శ్లో॥ వాతాత్పిత్తాత్కఫాద్రక్తాదభిష్యన్ద శ్చతుర్విధః।
ప్రాయేణ జాయతే ఘోరస్సర్వనేత్రామయాకరః॥౪॥

తా॥ నేత్రరోగములలో నభిష్యన్ద మనునది వాతపిత్త కఫ రక్తములచే వేర్వేరుగ జనించుటంజేసి నాల్గుతెరంగులగును. ఈ నేత్రాభిష్యన్దమను వ్యాధి తరుచుగ నేత్రరోగముల కన్నింటికి నుత్పత్తికారణముగాన మిగుల కష్టప్రదంబై యుండును. అభిష్యన్దము నేత్రరోగముల కన్నింటికిని కారణంబని సుశ్రుతమున నిత్తెరంగున జెప్పంబడియె, "ప్రాయేణ సర్వే నయనామయాస్తే భవన్త్యభిష్యన్దనిమిత్తమూలాః" నానావిధములగు నేత్రరోగము లన్నియు నభిష్యన్దవ్యాధిచే తరుచుగ జనించునని భావము.

## వాతాభిష్యన్ద లక్షణము

శ్లో॥ నిస్తోదనస్తమ్భనరోమహర్షసఙ్ఘర్షపారుష్య శిరోఽభితాపాః।
విశుష్కభావశ్శిశిరాశ్రుతా చ వాతాభిపన్నే నయనే భవన్తి॥౫॥

తా॥ కన్నులయందు సూదుల బొడిచిన విధంబుగ పోటు, జడముగ నుండుట, రోమాంచము కల్గుట, కన్నులయందు మెరమెరలాడుచుండుట, మిగుల పరుషముగ నుండుట, తలనొప్పి గల్గుట, పుసులుగట్టకుండుట, చల్లని కన్నీళ్లు గారుట, ఈ లక్షణములు కల్గినది వాతముచే గల్గిన యభిష్యన్దమని తెలియునది.

## పిత్తాభిష్యన్ద లక్షణము

శ్లో॥ దాహప్రపాకౌ శిశిరాభినన్దా
ధూమాయనం బాష్పసముచ్ఛ్రియశ్చ।
ఉష్ణాశ్రుతా పీతకనేత్రతా చ
పిత్తాభిపన్నే నయనే భవన్తి॥౬॥

తా॥ కన్నులయం దధికమైన మంటకల్గి పుండగుట, చలవ గోరుట, పొగ వెడలుచ ట్లుండుట, కన్నీళ్ళధికముగ వెడలుట, కన్నీళ్లు మిక్కిలి ఉష్ణముగ నుండుట, కన్నులు పచ్చగ నుండుట, ఈలక్షణములు పిత్తముచే జనించిన యభిష్యన్దమున గల్గునని యెరుంగునది.

## కఫాభిష్యన్దలక్షణము

శ్లో॥ ఉష్ణాభినన్దా గురుతాఽక్షిశోథః
కణ్డూపదేహావతిశీతతా చ।
స్రావో ముహుః పిచ్ఛిల ఏవ చాపి
కఫాభిపన్నే నయనే భవన్తి॥౭॥

తా॥ ఉష్ణస్పర్శమునం దభిలాష కల్గుట, కన్నులు బరువై యుండుట, కనురెప్పలయందు వాపుకల్గుట, దురదపుట్టుట, కణితికల్గుట, మిగుల చల్లనై యుండుట, పిచ్ఛిలంబైన కన్నీరు మాటిమాటికి గారుచుండుట, ఈలక్షణములన్నియు కఫముచే జనించిన యభిష్యన్దమున జనించును.

## రక్తాభిష్యన్ద లక్షణము

శ్లో॥ తామ్రాశ్రుతా లోహితనేత్రతా చ
నాడ్యస్సమన్తాదతిలోహితాశ్చ।
పిత్తస్య లిఙ్గాని చ యాని తాని
రక్తాభిపన్నే నయనే భవన్తి॥౮॥

తా॥ ఎఱ్ఱని కన్నీరు వెడలుట, కన్నులు రక్తవర్ణంబులై యుండుట, కన్నులయందు మిక్కిలి రక్తవర్ణంబులైన నాడులు వ్యాపించి యుండుట, ఈలక్షణములు కల్గి పిత్తాభిష్యందమున గల్గు దాహపాకాది లక్షణములు కల్గియున్నయెడ రక్తముచే జనించిన యభిష్యందమని యెరుగునది.

అధిమన్థసామాన్య లక్షణము

శ్లో॥ వృద్ధైరేతై రభిష్యన్దైర్నరాణామక్రియావతామ్।
తావన్తస్త్వధిమన్థాస్స్యుర్నయనే తీవ్రవేదనాః॥౯॥
ఉత్పాట్యత ఇవాత్యర్థం నేత్రం నిర్మథ్యతే తథా।
శిరసోఽర్ధం చ తం విద్యాదధిమన్థం స్వలక్షణైః॥౧౦॥

తా॥ పైజెప్పిన అభిష్యన్దములు జనించినప్పుడు చికిత్సజేయక యుపేక్షించుచునెడ నానాట వృద్ధినొంది వాతాభిష్యన్దముచే వాతాధిమన్థంబును, పిత్తాభిష్యన్దముచే పిత్తాధిమన్థంబును, కఫాభిష్యన్దముచే కఫాధిమన్థంబును గల్గును. ఈ యభిష్యన్దములు కన్నులయందు మిగుల తీవ్రమైన వేదనను గల్గించును. మరియు కన్నులు పెకలించువిధంబుగ నుండి కలియబెట్టినరీతిగ బాధ కల్గి శిరస్సునందు సగపాలున మిక్కుటమైన వేదనకల్గి పగులదీయునట్లుండి వాతాద్యభిష్యన్ద లక్షణములతోగూడి యున్నయెడ అధిమన్థంబని యెరుంగునది.

అధిమన్థమునందు దోషభేదముచే కాలనిర్ణయము

శ్లో॥ హన్యాద్దృష్టిం శ్లైష్మికస్సప్తరాత్రా
దధీమన్థో రక్తజః పంచరాత్రాత్।
షడ్రాత్రాద్వై వాతికో వా నిహన్యాత్
మిథ్యాచారాత్పైత్తికస్సద్య ఏవ॥౧౧॥

తా॥ శ్లేష్మముచే జనించిన యధిమంథమున నపథ్యసేవజేసినయెడ ఏడురాత్రులలోపల దృష్టిని చెరచును. రక్తముచే గల్గిన యధిమన్థమున అపథ్యముల సేవించునెడ నైదురాత్రులలో దృష్టిని చెరచును. వాతాధిమన్థమున నపథ్యముల జేసినయెడ ఆరునాళ్లలోపల దృష్టిని చెరచును. పిత్తాధిమన్థమున నపథ్యముల జేసినయెడ మూడురాత్రులలో దృష్టిని చెరచును. పైజెప్పబడిన కాలనియమము వ్యాధిస్వభావముచే గల్గునని భావము.

ఆమనేత్రరోగలక్షణము

శ్లో॥ ఉదీర్ణవేదనం నేత్రం రాగశోథసమన్వితమ్।
ఘర్షనిస్తోదశూలాశ్రు యుక్తమామాన్వితం విదుః॥౧౨॥

తా॥ మిగుల నుద్రేకమునొందిన వేదనతోగూడి కన్నులయందు అధికమైన యెరుపును వాపును కల్గి కరకరలాడుచు పోటును నొప్పియు కల్గి కన్నీళ్లు గారుచున్నయెడ ఆమంబైన నేత్రరోగమని యెరుంగునది. మరియు తన్త్రాన్తరమునందు "స్వేదః ప్రలేప స్తిక్తాన్నం

ధూమో దినచతుష్టయమ్। లఙ్ఘనం చాక్షిరోగాణాం ఆమానాం పాచనాని షట్। అఞ్జనం సర్పిషః పానం కషాయం గురుభోజనమ్। నేత్రరోగేషు సామేషు స్నానం చాపి వివర్జయేత్॥" అని చెప్పియున్నది. స్వేదనము, ప్రలేపము, తిక్తంబైన యన్నము, ధూమపానము, నాలుగుదినములవరకు లంకణము అను నీ చికిత్సలను నేత్రరోగములు పక్వములుగాకుండునపుడు పక్వంబులగుటకై జేయవలెననియు; అంజనము, సర్పిఃపానము, (నెయ్యి త్రాగుట,) కషాయము, అగ్నికరంబైనభోజనము, ఈకృత్యములను నేత్రరోగములు సామంబులై (పక్వములుగాక) యుండునపుడు జేయఁగదనియు భావము. ఇట్టి చికిత్సాభేదముల జేయుటకై ప్రకృతమున నేత్రరోగములయొక్క పక్వాపక్వభేదములు జెప్పంబడెనని యెఱుంగునది.

## పక్వనేత్రరోగ లక్షణము

శ్లో॥ మన్దవేదనతా కణ్డూః సంరమ్భాశ్రుప్రశాన్తతా।
ప్రశాన్తవర్ణతా చాక్ష్ణోః సంపక్వం దోషమాదిశేత్॥ ౧౩॥

తా॥ కన్నులయందు పోటు మొదలగు వేదనలు స్వల్పములుగ నుండుట, దురదకల్గుట, వాపును కన్నీళ్లును తగ్గియుండుట, ఎఱుపు మొదలగు వర్ణాన్తరములు లేక స్వాభావికవర్ణము కల్గియుండుట, ఈ లక్షణము కల్గియున్నయెడ నేత్రరోగము పక్వంబైనది యని యెఱుంగునది.

## వాపుతో గూడిన పాకలక్షణము

శ్లో॥ కణ్డూపదేహాశ్రుయుతః పక్వోదుంబరసన్నిభః।
సంరమ్భో పచ్యతే యస్తు నేత్రపాకస్స శోథజః।
శోథహీనాని లిఙ్గాని నేత్రపాకే త్వశోథజే॥ ౧౪॥

తా॥ నేత్రములయందు దురదయు, దుర్మాంసంబును, కన్నీళ్లును కల్గి పండిన మేడిపండు వంటి రంగుకల్గి వాపుతోగూడి పుండైనయెడ వాపుతోగూడి జనించిన నేత్రపాకమనియు, వాపు యొక్క చిహ్నములులేకయే పుండైనయెడ వాపు లేక జనించిన నేత్రపాకమనియు నెరుంగునది.

## హతాధిమన్థ లక్షణము

శ్లో॥ ఉపేక్షణాదక్షి యదాధిమన్థో
వాతాత్మకస్సాదయతి ప్రసహ్య।
రుజాభి రుగ్రాభి రసాధ్య ఏష
హతాధిమన్థః ఖలు నామ రోగః॥ ౧౫॥

తా॥ వాతముచే జనించిన అధిమన్థమును చికిత్సజేయక యుపేక్షించినయెడ మిగుల తీక్ష్ణంబులైన పోటు నొప్పి మొదలగు బాధలగల్గించి దృష్టిని చెరచి నేత్రమును నశింపంజేయును. దీనిని హతాధిమన్థంబను వ్యాధియని వచించెదరు. ఈ వ్యాధి మిగుల నసాధ్యంబై యుండును. మరియు "అన్తర్గతస్సిరాణాం తు యదా తిష్ఠతి మారుతః। స తదా నయనం ప్రాప్య శీఘ్రం దృష్టిం నిరస్యతి। తస్యాం నిరస్యమానాయాం నిర్మన్థన్నివ మారుతః।

నయనం నిర్వ్రమత్యాశు శూలతోదాది మన్థనైః। అథవా శోషయేదక్షి క్షీణ తేజోబలాదయమ్। తత్పద్మమివ సంశుష్కం అవసీదతి లోచనమ్। హతాధిమన్థం తం విద్యాదసాధ్యం వాతకోపతః॥" అను గ్రన్థాన్తరమున విదేహోక్త శ్లోకములబట్టి హతాధిమన్థంబను వ్యాధిని దృష్ట్యుత్క్షేపలక్షణం (కన్నులను వెలికి ద్రోయునది) బనియు, సకలనయనశోష (కన్నులను స్వరూపములేక నశింపజేయునది) లక్షణంబనియు రెండు విధములుగ జెప్పిరి. నేత్రములలోపలనుండు సిరలయొక్క అన్తర్భాగము నాశ్రయించిన వాతము ప్రకుపితంబై నేత్రములంజేరి దృష్టిని పోనడచి నేత్రములను మథించువిధంబుగ నొప్పి పోటు మొదలగు బాధలం గల్గించి వెలికిం ద్రోయును. ఇయ్యది దృష్ట్యుత్క్షేపంబను అధిమంథంబనియు, పై జెప్పినవిధంబుగ బాధల గల్గించి దృష్టిని జెరచి తేజోబలము నశించుటంజేసి ఎండిన తామరపువ్వునుంబోలి కన్నులను నశింపంజేయును. ఇది నయనశోషంబను అధిమంథంబనియు, వాతప్రకోపముచే జనించిన నీరెండు విధంబులగు హతాధిమంథంబులను వ్యాధులు మిగుల నసాధ్యంబులై యుండుననియు భావము. ప్రకృతమూలమునందు "ఉపేక్షణాత్" అను శ్లోకమున నయనశోషంబను రెండవ హతాధిమన్థలక్షణము జెప్పంబడియెనని యెరుంగునది.

## వాతపర్యాయ లక్షణము

శ్లో॥ వారంవారం చ పర్యేతి భ్రువౌ నేత్రే చ మారుతః।
రుజశ్చ వివిధాస్తీవ్రాస్స జ్ఞేయో వాతపర్యయః॥౧౬॥

తా॥ వాతము ప్రకోపమునొంది ఒకప్పుడు కనుబొమలయందును మరియొకప్పుడు కన్నులయందును జేరి మిక్కిలి తీవ్రంబులైన పోటు నొప్పి మొదలగు నానావిధవేదనల మాటిమాటికి గల్గించుచున్నయెడ వాతపర్యాయం బను వ్యాధియని యెరుంగునది. కనుబొమలను కన్నులను మార్చి మార్చి వాతము బాధించుటచే నీవ్యాధి వాతపర్యాయమనంబడునని భావము.

## శుష్కాక్షిపాక లక్షణము

శ్లో॥ యత్కూణితం దారుణరూక్షవర్త్మ
సందహ్యతే చావిలదర్శనం యత్।
సుదారుణం యత్ప్రతిబోధనే చ
శుష్కాక్షిపాకోపహతం తదక్షి॥౧౭॥

తా॥ కన్నులను మూయునపుడు కనురెప్పలు మిగుల కఠినంబులును రూక్షంబులునై మంట గల్గి చూచుటకు మిగుల కష్టముగ నున్నను, కన్నులను దెరచునప్పుడు మిగుల కఠినంబై యున్నను అట్టి నేత్రములు శుష్కంబైన నేత్రవ్రణముచే పీడింపబడినవియని యెరుంగునది. మరియు "కూణితం ఖరవర్త్మాక్షికృచ్ఛ్రోన్మీలావిలేక్షణమ్। సదాహం సాసృజో వాతాత్ శుష్కపాకాన్వితం వదేత్॥" అని తన్త్రాన్తరమున నుండుటంజేసి యీవ్యాధి రక్తముతోగూడిన వాతముచే జనించునని యెరుంగునది. కన్నుల మూయునపుడు మిగుల కర్కశంబును

తెరచుటకు మిగుల సాధ్యము గాకుండునదియు, కన్నులు కలకబారి మంటతో గూడియుండు నదియు నైనది శుష్కాంబులగు వ్రణములతో గూడిన నేత్రంబని భావము.

## అన్యతో వాతలక్షణము

శ్లో॥ యస్యావటూకర్ణశిరోహనుస్థో
మన్యాగతో వాఽప్యనిలోఽన్యతో వా।
కుర్యాద్రుజం వై భ్రువి లోచనే చ
తమన్యతోవాతముదాహరన్తి ॥౧౮॥

తా॥ పెడతల, చెవులు, శిరస్సు, అంకిళ్లు, పెడతలనుండు మన్య యను నరము, ఈ స్థలముల యందైనను వేరొకచోటనైనను వాతము ప్రకుపితంబై కనుబొమలయందైనను కన్నులయందైనను బాధను గల్గించును. దీనిని అన్యతోవాతమని యెఱుంగునది. మరియు దీని లక్షణమును విదేహుం డిద్విధంబుగ జెప్పెను "మన్యాపాను స్థగో వాయుః కుపితః పృష్ఠతోఽపి వా । కరోతి భేదం నిస్తోదం శంఖే చాక్ష్ణోర్భ్రువోస్తథా । తమాహురన్యతోవాతం రోగం దృష్టివిదో జనాః॥" పెడతలనుండు నరములయందైనను వీపునందైనను వాతము ప్రకుపితంబై కణతలయందును కనుబొమలయందును కన్నులయందును మిగుల నధికముగ నొప్పిని పోటును కల్గించును. ఇయ్యది వాతము ఒకచోట ప్రకుపితంబై వేరొకచోట బాధను గల్గించుటంజేసి అన్యతోవాతమని చెప్పందగునని యర్థము.

## అమ్లాధ్యుషిత లక్షణము

శ్లో॥ శ్యావం లోహితపర్యన్తం సర్వం చాక్షి ప్రపచ్యతే।
సదాహశోథం సాస్రావం అమ్లాధ్యుషిత మమ్లతః॥౧౯॥

తా॥ ఆమ్లపదార్థములను భుజించుటచేత నేత్రము శ్యామవర్ణంబును, రక్తవర్ణంబైన కన్గొనలు కల్గినదియునై మంటయు, వాపును, అస్రావంబులును కల్గి పరిపక్వంబైనయెడ అమ్లాధ్యుషితం బను వ్యాధియని యెరుంగునది. ఈ వ్యాధి పిత్తముచే జనించును.

## సిరోత్పాత లక్షణము

శ్లో॥ అవేదనా వాఽపి సవేదనా వా
యస్యాక్షిరాజ్యో హి భవన్తి తామ్రాః।
ముహుర్విరజ్యన్తి చ యాస్సమన్తా
ద్వ్యాధిస్సిరోత్పాత ఇతి ప్రదిష్టః॥౨౦॥

తా॥ కన్నులయందుండు రేఖలు వేదనతో గూడినవైనను, వేదన లేకయైనను, మాటిమాటికి రక్తవర్ణంబులై యుండునెడ సిరోత్పాతంబను వ్యాధియని యెరుంగునది.

### సిరాప్రహర్ష లక్షణము

శ్లో॥ మోహాత్సిరోత్పాత ఉపేక్షితస్తు
జాయేత రోగస్తు సిరాప్రహర్షః।
తాభ్రమాభమస్రం స్రవతి ప్రగాఢం
తథా న శక్నోత్యభివీక్షితుం చ ॥౨౧॥

తా॥ పైజెప్పిన సిరోత్పాతంబను వ్యాధిని చికిత్సజేయక యుపేక్షించినయెడ ఎఱ్ఱనైన నీరు కన్నులనుండి స్రవించి చూచుటకు సాధ్యము గాకుండును. ఈ వ్యాధి సిరాప్రహర్షంబని చెప్పం దగును. ఇవియన్నియు సర్వగత నేత్రరోగములు.

### నల్లగ్రుడ్డున జనించు నేత్రరోగములలో సవ్రణశుక్ల లక్షణము

శ్లో॥ నిమగ్నరూపం తు భవేద్ధి కృష్ణే
సూచ్యేవ విద్ధం ప్రతిభాతి యద్వై।
స్రావం స్రవేదుష్ణమతీవ యచ్చ
తత్సవ్రణం శుక్లముదాహరన్తి ॥౨౨॥

తా॥ నల్లగ్రుడ్డునందు సూదితో గ్రుచ్చినవిధంబుగ వర్తులమైన వ్రణము కల్గి మిగుల నుష్ణంబైన కన్నీరుగారుచున్నయెడ వ్రణముతోగూడిన శుక్లంబని యెఱుంగునది. "రక్తరాజీనిభం కృష్ణే చ్ఛిన్నాభం యచ్చ లక్ష్యతే । సూచ్యగ్రేణేవ తచ్ఛుక్లం ఉష్ణాశ్రుస్రావి సవ్రణమ్॥" అని విదేహుండు వచించెను. ఎఱ్ఱని యావగింజవలె గుండ్రముగ సూదితో పొడిచిన విధంబుగ తెల్లని మచ్చ నల్లగ్రుడ్డున కనుపించి ఉష్ణంబైన కన్నీరు గారుచున్నయెడ వ్రణముతోగూడిన శుక్లంబని భావము.

### సాధ్యాసాధ్యశుక్ల లక్షణము

శ్లో॥ దృష్టేస్సమీపే న భవేత్తుయచ్చ
న చావగాఢం న చ సంస్రవేద్ధి।
అవేదనం వా న చ యుగ్మశుక్లం
తత్సిద్ధిమాయాతి కదాచిదేవ ॥౨౩॥

తా॥ దృష్టికి సమీపమున లేక దూరముగనుండు శుక్లంబును, మిగుల లోతున జనించక పై భాగమున జనించిన శుక్లంబును, అధికమైన స్రావము లేకుండు శుక్లంబును, స్వల్పమైన వేదనకల్గిన శుక్లంబును ఒకప్పుడు సాధింపందగియుండును. రెండుశుక్లములు జంటగ జనించియున్నయెడ అసాధ్యంబులై యుండును.

### అవ్రణశుక్ల లక్షణము

శ్లో॥ స్యన్దాత్మకం కృష్ణగతం సతోషం
శఙ్ఖేన్దుకున్దప్రతిమావభాసమ్।

వైహాయసాభ్రప్రతనుప్రకాశం
అథావ్రణం సాధ్యతమం వదన్తి ॥ ౨౪॥

తా॥ దోషములతోగూడి శంఖమును చంద్రుని మొల్ల మొగ్గనుబోలి తెల్లనికాన్తి కల్గినదియు, ఆకసమునకు నడుమనుండు మబ్బువలె సూక్ష్మమైన యాకారము కల్గినదియు నైన తెల్లని చుక్క నల్లగ్రుడ్డునందు జనించినయెడ అభిష్యన్దవ్యాధిచే జనించి వ్రణములేకుండు శుక్లంబని యెఱుంగునది. ఇది సులభసాధ్యంబై యుండును.

సాధ్యాసాధ్య అవ్రణశుక్ల లక్షణము

శ్లో॥ గమ్భీరజాతం బహుళం చ శుక్లం
చిరోత్థితం చాపి వదన్తి కృచ్ఛ్రమ్।
విచ్ఛిన్నమధ్యం పిశితావృతం వా
చలంసిరాసూక్ష్మమదృష్టికృచ్చ ॥ ౨౫॥
ద్విత్వగ్గతం లోహితమన్తతశ్చ
చిరోత్థితం చాపి వివర్జనీయమ్।

తా॥ రెండు మూడు పొరలకు లోపల జనించిన శుక్లంబును, మిక్కిలి ఘనంబైన శుక్లంబును, చిరకాలమునకు మున్ను జనించిన శుక్లంబును, కష్టసాధ్యంబై యుండును. మాంసము పగిలి నడుమ రంధ్రముకల్గిన శుక్లంబును, మాంసముచే నావృతంబైన శుక్లంబును, చంచలంబైన శుక్లంబును, సిరలచే గప్పబడి మిగుల సూక్ష్మమైన శుక్లంబును, దృష్టిని పోగొట్టు శుక్లంబును, రెండు పొరలయందు వ్యాపించిన శుక్లంబును, అన్తమునందు రక్తముతోకూడిన శుక్లంబును, అసాధ్యంబై యుండును గాన చికిత్స జేయంజనదు.

మరికొన్ని యసాధ్య లక్షణములు

శ్లో॥ ఉష్ణాశ్రుపాతః పిడకా చ నేత్రే
యస్మిన్భవేత్ ముద్గనిభం చ శుక్లమ్॥ ౨౬ ॥
తదప్యసాధ్యం ప్రవదన్తి కేచి
దన్యచ్చ యత్తిత్తిరిపక్షతుల్యమ్।

తా॥ ఉష్ణంబైన కన్నీళ్లు గారుచు కన్నులయందు బొబ్బలు కల్గినను, పెసరగింజవంటి యాకారముకల్గిన తెల్లని మచ్చ కల్గినను, మిక్కిలి యసాధ్యంబై యుండును. మరియు తీతువు పక్షిరెక్కవంటి రంగుకల్గిన శుక్లంబుగూడ నసాధ్యంబని కొందరు వచించెదరు. ఇచ్చట "ఏకత్వగ్గతమేవంస్యాద్ద్విత్వగ్గతమిదం భవేత్ । చోషోష్ణస్రావదాహాస్తు తృష్ణా చ పిడకోద్గమః॥" అనియు "వ్యక్తముద్గఫలాకారం శుక్లం ద్విత్వగ్గతం భవేత్" అనియు విదేహుండు వచించెను. గాన "ఉష్ణాశ్రుపాతః" అనునట్టి శ్లోకముచే చెప్పబడిన రెండు విధములైన శుక్లములు రెండుపొరల నాశ్రయించి యుండునని యెఱుంగునది.

## అక్షిపాకాత్యయ లక్షణము

శ్లో॥ శ్వేతస్సమాక్రామతి సర్వతో హి
దోషేణ యస్యాసిత మణ్డలం చ ॥౨౭॥
తమక్షిపాకాత్యయ మక్షిరోగం
సర్వాత్మకం వర్జయితవ్య మాహుః।

తా॥ నేత్రదోషముచేత కన్నులయందు శ్వేతము జనించి నల్లగ్రుడ్డు నంతట వ్యాపించిన యెడ దానిని అక్షిపాకాత్యయంబను వ్యాధియని వచించెదరు. ఈ వ్యాధి సన్నిపాతముచే జనించినది గాన చికిత్స జేయంజనదు.

## అజాకాజాత లక్షణము

శ్లో॥ అజాపురీషప్రతిమో రుజావాన్
సలోహితో లోహితపిచ్ఛిలాస్రః ॥౨౮॥
విగృహ్య కృష్ణం ప్రచయోఽభ్యుపైతి
తచ్చాజకాజాతమితి వ్యవస్యేత్ ॥

తా॥ ఎండిన మేడిపండువలెనుండి కొంచెము రక్తవర్ణంబును, పిచ్ఛిలంబునైన కన్నీళ్లు గారుచు నల్లనిగ్రుడ్డునంతయు వ్యాపించియున్నయెడ అజకాజాతంబను వ్యాధియని యెఱుంగునది. మరియు "కృష్ణేఽక్ష్ణోర్యద్ధ వేచ్ఛుక్లం ఛాగలీవిట్సమప్రభమ్। సాన్ద్రపిచ్ఛిలరక్తాస్రం త్రిత్వగ్గతమజాజకమ్॥" అను విదేహోక్తి ననుసరించి యీవ్యాధి మూడుపొరల ననుసరించి కల్గినదియని యెఱుంగునది.

## దృష్టిరోగములలో ప్రథమపటలము నాశ్రయించిన రోగ లక్షణము

శ్లో॥ ప్రథమే పటలే దోషా యస్య దృష్ట్యాం వ్యవస్థితాః।
అవ్యక్తాని సరూపాణి కదాచిదథ పశ్యతి ॥౨౯॥

తా॥ "పఞ్చభూతాత్మికా దృష్టిర్మసూరార్ధదలోన్మితిః" అనునట్టి తన్త్రాన్తరప్రమాణము ననుసరించి నేత్రమునందు నల్లగ్రుడ్డులో చిరుసెనగపప్పంతపరిమాణముకల్గి నేత్రమధ్యమున పంచభూతాత్మకమైన దృష్టియుండును. అట్టి దృష్టియందు నాల్గుపటలములుండును. "తేజోజలాశ్రితం బాహ్యం తేష్వన్యత్పిశితాశ్రితమ్। మేదస్తృతీయం పటలం ఆశ్రితం త్వస్థిచాపరమ్। పంచమాంశసమం దృష్టేస్తేషాం బాహుల్య మిష్యతే" అను సుశ్రుతవచనమునుబట్టి నాల్గుపటలములలో చర్మమునందలి పటలము తేజోజలముల నాశ్రయించియుండు ననియు, రెండవపటలము మాంసము నాశ్రయించి యుండుననియు, మూడవపటలము మేదస్సు నాశ్రయించియుండుననియు, నాల్గవ పటలము అస్థినాశ్రి

యించి యుండుననియు, ఈ పటలములలో నొక్కొకటి దృష్టియొక్క ఐదవభాగమంత పరిమాణము కల్గియుండుననియు తెలియుచున్నది. అట్టి పటలములలో మొదటింటి పటలమును వాతాదిదోషము లాశ్రయించి యున్నపుడు రూపముతోగూడిన వస్తువులన్నియు అవ్యక్తరూపంబులుగ గానంబడును. ఇచ్చట అభ్యన్తరపటలమును వాతం బాశ్రయించినపుడు అరుణవర్ణంబులై భ్రమించుచున్నట్లు వస్తుజాలము కనుబడుననియు, పిత్తం బాశ్రయించి యుండునపుడు సూర్యుడు మున్నగాగల వస్తుసంఘములు నీలపీతవర్ణంబులుగను, కఫం బాశ్రయించియున్నపుడు శ్వేతవర్ణంబులుగను, రక్తం బాశ్రయించినపుడు రక్తవర్ణంబులుగను, దోషములన్నియు నాశ్రయించినపుడు చిత్రవర్ణంబులుగను కనుపించునని యెరుంగునది. మరియు "దృష్టేరన్తరమాద్యం తు పటలం సమభిద్రుతాః। ఏకైక మనుపద్యన్తే పర్యాయాత్పటలాన్తరమ్॥" అను విదేహోక్తి ననుసరించి వాతాది దోషములు తొలుత లోపలనుండు మొదటింటి పటలము నాశ్రయించి నానాట వరుసగ తక్కిన పటలముల నన్నింటి నొక్కొకటిగ నాశ్రయించునని యెరుంగునది. అభ్యన్తరమునందుండు మొదటిపటలమున నేత్రరోగము జనించి తక్కిన పటలములయందు వ్యాపించును గాన ప్రథమపటలము నాశ్రయించినది స్వల్పదోషంబనియు, తక్కినవి యొకటికన్న నొకటి బలీయంబులై యుండుననియు భావము.

## ద్వితీయపటలగత దృష్టిరోగ లక్షణము

శ్లో॥ దృష్టిర్భృశం విహ్వలతి ద్వితీయం పటలం గతే।
మక్షికామశకాంశ్చాపి జాలకాని చ పశ్యతి॥౩౦॥
మణ్డలాని పతాకాంశ్చ మరీచిం కుణ్డలాని చ।
పరిప్లవాంశ్చ వివిధాన్వర్షమభ్రం తమాంసి చ॥౩౧॥
దూరస్థాని చ రూపాణి మన్యతే స సమీపతః।
సమీపస్థాని దూరే చ దృష్టేర్గోచర విభ్రమాత్॥౩౨॥
యత్నవానపి చాత్యర్థం సూచీపాశం న పశ్యతి।

తా॥ వాతాదిదోషములు రెండవపటలము నాశ్రయించినపుడు చూపు రూపాదులను చూచుటకు మాటిమాటికి మిగుల శ్రమజెందును. ఈగలు, దోమలు, వలలు, మండలములు, పతాకములు, కిరణములు, కుండలములు, కప్పలు మొదలగువానియొక్క నానావిధంబులైన గతివిశేషములు, వర్షము, మేఘములు, చీకటి, ఇవియన్నియు లేకున్నను కండ్లకు కనబడువిధంబుగ నుండును. దూరముగనుండు రూపములు సమీపమున నుండునట్లు కనబడును. సమీపముననున్న వస్తువులు దూరమున నుండువిధంబుగ గానంబడును. పైజెప్పినవిధంబుగ దృష్టిప్రసార భేదముచేత కనబడును. మిగుల ప్రయత్నముతో చూచినను సూదియందలి రంధ్రమును కనుంగొనజాలకుండును.

## తృతీయపటలగత దృష్టిరోగ లక్షణము

శ్లో॥ ఊర్ధ్వం పశ్యతి నాధస్తాత్తృతీయం పటలం గతే॥౩౩॥
మహాన్త్యపి చ రూపాణి చ్ఛాదితానీవ చామ్బరైః।

కర్ణనాసాక్షిహీనాని వికృతానీవ పశ్యతి॥౩౪॥
యథాదోషం చ రజ్యేత దృష్టిర్దోషే బలీయసి।

తా॥ దోషములు మూడవపటలము నాశ్రయించి యున్నపుడు ఊర్ధ్వభాగముననుండు వస్తువులను జూచును. అధోభాగముననుండు వస్తువులు కనబడకుండును. గొప్ప యాకారముగల వస్తువులన్నియు గుడ్డలచే గప్పబడినవిధంబుగ నగుపడును. వికలంబులు గాక పూర్ణంబులైన రూపములుగూడ చెవులు ముక్కులు కన్నులు మొదలైన యవయవములచే హీనంబులై వికృతరూపములుగ గానంబడును. దోషము రక్తమాంసమేదస్సులతోగూడి మిక్కిలి బలిష్ఠంబై యున్నపుడు దృష్టిగూడ నాయాదోషముల ననుసరించి అరుణపీతసితాది వర్ణములు కల్గియుండును.

## దృష్టియందూర్ధ్వాది స్థానములను దోషము లాశ్రయించుటచే గల్గు వికారభేదములు

శ్లో॥ అధస్స్థితే సమీపస్థం దూరస్థం చోపరిస్థితే॥౩౫॥
పార్శ్వస్థితే తథా దోషే పార్శ్వస్థం నైవ పశ్యతి।
సమన్తతస్స్థితే దోషే సంకులానీవ పశ్యతి॥౩౬॥
దృష్టిమధ్యస్థితే దోషే మహద్ధ్రస్వం చ పశ్యతి।
ద్విధా స్థితే ద్విధా పశ్యేత్ బహుధా చానవస్థితే॥౩౭॥
దోషే దృష్ట్యాశ్రితే తిర్యక్ స ఏకం మన్యతే ద్విధా।

తా॥ దృష్టియం దధోభాగమున దోషంబున్నయెడ సమీపముననుండు వస్తువులను, ఊర్ధ్వభాగమున దోషమున్నయెడ దూరముననుండు వస్తువులను, పార్శ్వములయందు దోషం బున్నయెడ ఇరుప్రక్కలనుండు వస్తువులను, కనుంగొన జాలకుండును. దృష్టియందంతట దోషము వ్యాపించి యున్నపుడు వస్తుసంఘము లొండొంట గలిసిన విధంబుగ గానంబడును. దృష్టిమధ్యమున దోషం బున్నయెడ గొప్పవైన వస్తువులు మిగుల హ్రస్వములుగ గానంబడును. ఊర్ధ్వాధోభాగముల రెంటియందును దోషము వ్యాపించి యున్నపుడు ఒకవస్తువు రెండురూపములుగ గానంబడును. పలుచెరంగుల దోషము వ్యాపించి యున్నపుడు వస్తుసంఘములు చంచలంబులై గానంబడును. దృష్టియందు దోషము అడ్డముగ వ్యాపించి యున్నపుడు ఒకవస్తువు రెండుగ గానంబడును.

## చతుర్థపటలగత దృష్టిదోష లక్షణము

శ్లో॥ తిమిరాఖ్యస్స వై దోషశ్చతుర్థం పటలం గతః॥౩౮॥
రుణద్ధి సర్వతో దృష్టిం లిఙ్గనాశమతః పరమ్।
అస్మిన్నపి తమోభూతే నాతిరూఢే మహాగదే॥౩౯॥
చన్ద్రాదిత్యౌ సనక్షత్రావన్తరిక్షే చ విద్యుతః।
నిర్మలాని చ తేజాంసి భ్రాజిష్ణూన్యథ పశ్యతి॥౪౦॥

తా॥ దృష్టియందు నాల్గవపటలమున దోషం బాశ్రయించి యుండునెడ చీకటిగ్రమ్మిన విధంబుగ కన్నులు గానరాకుండును. ఇవ్వ్యాధి తిమిరంబను వ్యాధియని యెరుంగునది. ఈ వ్యాధి యందు దృష్టి యెచ్చోటను ప్రసరించక రూపముల దెలిసికొనుశక్తి నానాట నశించును. ఈ వ్యాధి మిక్కిలి వృద్ధినొందక చీకటిగ్రమ్మినవిధంబుగ లోకము కనబడును. సూర్యచంద్రులును నక్షత్రంబులును మెఱుపులును ఆకసమునందు కానంబడును. మరియు నిర్మలంబులైన తేజస్సులును కాంతియుక్తంబులగు మణులు మున్నగు వస్తుసంఘంబులును గానంబడును.

### లింగనాశాది సంజ్ఞాభేదములు

శ్లో॥ స ఏవ లిఙ్గనాశస్తు నీలికా కాచసంజ్ఞితః।

తా॥ దృష్టియొక్క తృతీయ పటలమునందు జనించిన కాచంబను పేరంబరగు నేత్రదోషము చతుర్థపటలము నాశ్రయించినపుడు లిఙ్గనాశమనియు, నీలికయనియు జెప్పంబడును. తన్త్రాన్తరమున నిమి యీరీతిగ వచించెను: "కాచ ఇత్యేష విజ్ఞేయో యాప్యస్త్రిపటలోత్థితః। చతుర్థపటలప్రాప్తే లిఙ్గనాశస్య ఉచ్యతే। ప్రత్యాఖ్యేయశ్చ కఫజో వ్యాధిస్సాధ్యస్తు తద్విదా।" మూడవపటలమున జనించిన దృష్టిదోషము కాచంబని జెప్పంబడును; ఇవ్వ్యాధి యాప్యము. అట్టి కాచమను వ్యాధి నాల్గవపటలము నాశ్రయించినయెడ లిఙ్గనాశంబని చెప్పంబడును. ఇది యసాధ్యము. ఈ వ్యాధి కఫముచే జనించినయెడ సాధ్యంబై యుండునని భావము. ఈ వచనముచేత మూడవపటలము నాశ్రయించినది కాచమనియు, అట్టికాచము నాల్గవపటలము నాశ్రయించినయెడ లింగనాశమనియు దెలియుచున్నది. ఇచ్చట లింగనాశమనగా "లింగ్యతే (జ్ఞాయతే) అనేన లిఙ్గం" అను వ్యుత్పత్తిచేత రూపాదులను దెలియుటకు సాధనమైనది లింగమనందగు (అనగా గ్రహణశక్తి రూపమైన ఇంద్రియము) అట్టి ఇన్ద్రియనాశము కల్గిన వ్యాధి లింగనాశమని యెరుంగునది.

### వాతజ తిమిరరోగ లక్షణము

శ్లో॥ వాతేన చాపి రూపాణి భ్రమన్తీవ చ పశ్యతి॥౪౧॥
ఆవిలాన్యరుణాభాని వ్యావిద్ధానీవ మానవః।

తా॥ వాతముచే జనించిన దృష్టిరోగమునందు రూపములతోగూడిన వస్తువులన్నియు దిరుగుచున్నట్లు కనబడును. మలినంబులును అరుణవర్ణంబులును వక్రంబులునైన విధంబుగ కానంబడును.

### పిత్తజ తిమిరరోగ లక్షణము

శ్లో॥ పిత్తేనాదిత్యఖద్యోత శక్రచాపతటిద్గుణాన్॥౪౨।
నృత్యతశ్చైవ శిఖినః సర్వం నీలం చ పశ్యతి।

తా॥ పిత్తముచే జనించిన దృష్టిరోగమునందు సూర్యునియొక్కయు, మిణుగురుపురుగులయొక్కయు, ఇంద్రధనుస్సుయొక్కయు రూపములు కనబడును. నాట్యముజేయుచుండు నెమలియొక్క రూపమున్ను కనబడును. తక్కిన వస్తుసంఘమెల్ల నీలవర్ణముగ కనబడును.

## కఫజ తిమిరరోగ లక్షణము

శ్లో॥ కఫేన పశ్యేద్రూపాణి స్నిగ్ధాని చ సితాని చ॥౪౩॥
* * పశ్యేదసూక్ష్మాణ్యత్యర్థం వ్యభ్రమేవాభ్రసంప్లవమ్ * *
సలిలప్లావితానీవ పరిజాడ్యాని మానవః।

తా॥ కఫముచే కల్గిన దృష్టిరోగమునందు రూపములోగూడిన వస్తుసంఘములన్నియు స్నిగ్ధంబులును, శ్వేతవర్ణంబులును, ఉదకమున దడిసినదానివలె జడంబులునై గానంబడును. మరియు ఆకసమునందు మేఘములు లేకున్నను మబ్బుచే నావరింపబడిన విధంబుగ కనబడును. మిగుల గొప్పలైన వస్తువులు కానంబడును.

## రక్తజ తిమిర రోగ లక్షణము

శ్లో॥ పశ్యేద్రక్తేన రక్తాని తమాంసి వివిధాని చ॥౪౪॥
ససితాన్యపి కృష్ణాని పీతాన్యపి చ మానవః।

తా॥ రక్తముచే జనించిన దృష్టిరోగమునందు చీకటిని రక్తవర్ణంబుగను, శ్వేతవర్ణంబులైన నానావిధ ద్రవ్యములను కృష్ణవర్ణంబులుగను, పీతవర్ణంబులుగను చూచును.

## సన్నిపాతజ తిమిరరోగ లక్షణము

శ్లో॥ సన్నిపాతేన చిత్రాణి విప్లుతానీవ పశ్యతి॥౪౫॥
బహుధా చ ద్విధా చాపి సర్వాణ్యేవ సమన్తతః।
హీనాధికాఙ్గాన్యపి వా జ్యోతీంష్యపి చ భూయసా॥౪౬॥

తా॥ సన్నిపాతముచే జనించిన తిమిరరోగమునందు సకలవస్తువులను నానావిధవర్ణంబులుగను, ఒకొక్కటి రెండేసి విధంబులుగను, పలువిధంబులుగను, సకలవస్తువులు అంతట వ్యాపించిన విధంబుగను, మనుష్యులు మొదలగు జంతువులయొక్క యాకారములు హీనాధికాంగములుగను, మిక్కిలి తేజోవంతములైన ద్రవ్యములును గానంబడును.

## పరిమ్లాయి తిమిర లక్షణము

శ్లో॥ పిత్తం కుర్యాత్పరిమ్లాయి మూర్ఛితం పిత్తతేజసా।
పీతాదిశస్తు ఖద్యోతాన్ భాస్కరం చాపి పశ్యతి॥౪౭॥
వికీర్యమాణాన్ ఖద్యోతైర్వృక్షాం స్తేజోభిరేవ వా।

తా॥ పిత్తముయొక్క తేజోరూపమైన రక్తముతోగూడిన పిత్తము ప్రకుపితంబై పరిమ్లాయి యను తిమిరవ్యాధిని కల్గించును. ఈ వ్యాధియందు దిక్కులన్నియు పచ్చనిరంగుతో గూడినవిధంబుగ గానంబడును. మరియు మిణుగురు పురుగులు కానంబడును, సూర్యుడు పచ్చని రంగు కల్గినట్లు కానంబడును. వృక్షములన్నియు మిణుగురుపురుగులచేతనైనను తేజస్సుచేతనైనను వ్యాప్తంబులుగ గానంబడును, మరియు ''ఏవమేవ తు విజ్ఞేయాః నీలాః పిత్తసముత్థితాః।

రక్తపిత్తోత్థితాః పీతాః" అను తన్త్రాన్తరవచనమునుబట్టి ఈ వ్యాధి రక్తపిత్తములచే జనించినదిగాన వస్తుసంఘమెల్ల పీతవర్ణముగ గానంబడును. "విదధాతి పరిమ్లాయి పిత్తం రక్తేన సంగతమ్। తేన పీతా దిశః పశ్యే దుద్యన్తమివ భాస్కరమ్॥" అని యితరతన్త్రమునందున్నది గాన ఈ వ్యాధి రక్తముతోగూడిన పిత్తముచే జనించుననియు, దానంజేసి దిక్కులన్నియు పచ్చగను, సూర్యుండుదయకాలముననుండువిధంబుగను గానంబడుననియు నెరుంగనగు. మరియు "తృతీయం పటలం ప్రాప్తే తిమిరే రోగి జాయతే। అరోగి తిమిరం సాధ్యమాద్యం పటలమాశ్రితమ్॥ కృచ్ఛ్రం ద్వితీయే రోగి స్యాత్తృతీయే యాప్యముచ్యతే" అని సాత్యకి వచించెను. మొదటి పటలము నాశ్రయించిన తిమిరవ్యాధియందు దృష్టి పీతాదివర్ణములు లేకుండును గాన సాధ్యంబనియు, రెండవపటలము నాశ్రయించినది నీలపీతాది వర్ణములు కల్గియుండును గాన కృచ్ఛ్రసాధ్యంబనియు, మూడవ పటలము నాశ్రయించిన తిమిరవ్యాధి యాప్యంబనియు భావము. ఈ వాక్యముచే నీ వ్యాధి యాప్యంబని యెరుంగనగు.

వర్ణభేదముచేగల్గు తిమిరరోగ భేదములు

శ్లో॥ వక్ష్యామి షడ్విధం రాగై ర్లిఙ్గనాశమతః పరమ్॥౪౮॥

తా॥ పై జెప్పబడిన తిమిరవ్యాధికి అరుణాది వర్ణభేదములచే గల్గు ఆరువిధములైన రూపభేదములను జెప్పెదనని భావము.

శ్లో॥ రాగోఽరుణో మారుతజః ప్రదిష్టో
మ్లాయీ చ నీలశ్చ తథైవ పిత్తాత్।
కఫాత్సితశ్శోణితజస్స రక్త
స్సమస్తదోషప్రభవో విచిత్రః॥౪౯॥

తా॥ వాతముచే జనించిన తిమిరరోగమున కన్నులయందరుణవర్ణము కల్గుననియు, పిత్తముచే జనించిన మ్లాయియను తిమిరవ్యాధియందు నీలపీతవర్ణములు కల్గియుండుననియు, కఫముచే గల్గిన తిమిరమునందు శ్వేతవర్ణము కల్గుననియు, రక్తముచే జనించిన తిమిరమునందు రక్తవర్ణము కల్గుననియు, త్రిదోషములచే జనించిన తిమిరమునందు నానావర్ణములు కల్గుననియు భావము.

శ్లో॥ అరుణం మణ్డలం దృష్ట్యాం స్థూలకాచారుణప్రభమ్।
పరిమ్లాయిని రోగే స్యాన్మ్లాయి నీలం చ మణ్డలమ్॥౫౦॥
దోషక్షయాత్స్వయం తత్ర కదాచిత్స్యాత్తు దర్శనమ్।

తా॥ దృష్టియందు స్థూలంబై యరుణవర్ణంబైన గాజుపెంకువలె అరుణవర్ణంబైన మండలము జనించును. ఇది వాతముచే జనించిన తిమిరవ్యాధియందు కల్గునని భావము. పై జెప్పిన పరిమ్లాయియను తిమిరవ్యాధియందు నీలవర్ణంబైన మండలము జనించును. అట్టి మండలము కొంతకాలమునకు వాతాదిదోషములు క్షీణించినయెడ నశించి దృష్టి చక్కగ గానంబడును.

శ్లో॥ అరుణం మణ్డలం వాతాచ్చఞ్చలం పరుషం తథా॥౧౧॥
పిత్తాన్మణ్డలమానీలం కాంస్యాభం పీతమేవ చ।
శ్లేష్మణా బహులం పీతం శఙ్ఖకున్దేన్దుపాణ్డురమ్॥౧౨॥
చలత్పద్మపలాశస్థశ్శుక్లోబిన్దురివామ్భసః।
మృజ్యమానే చ నయనే మణ్డలం తద్విసర్పతి॥౧౩॥
ప్రవాళపద్మపత్రాభం మణ్డలం శోణితాత్మకమ్।
దృష్టిరాగో భవేచ్చిత్రో లిఙ్గనాశే త్రిదోషజే॥౧౪॥
యథాస్వం దోషలిఙ్గాని సర్వేష్వేవ భవన్తి హి।

తా॥ దృష్టియందు వాతముచే జనించిన మణ్డలము అరుణవర్ణంబును, చంచలంబును, పరుషంబునై యుండును. పిత్తముచే జనించిన మణ్డలము కొంచెముగ నీలవర్ణముతో గూడిన పీతవర్ణము కల్గియుండును. శ్లేష్మముచే జనించిన మండలము మిక్కిలి విశాలంబును, పీతవర్ణంబును శంఖము మొల్లలు చంద్రుడు వీనినిబోలి పాండువర్ణంబునై తామరాకులోనుండు నీటిబిందువును బోలె శుక్లవర్ణంబును, చంచలంబునై కన్నులను చేత తుడిచినప్పుడు దృష్టియందుండు చుక్క కదలుచుండును. రక్తముచే జనించిన మండలము పవడమును ఎఱ్ఱదామరపువ్వుయొక్క రేకును బోలి రక్తవర్ణంబై యుండును. సన్నిపాతముచే జనించిన లింగనాశమునందు దృష్టియందు నానావిధ వర్ణంబులు కల్గియుండును. పై జెప్పిన వాతాదిదోషముల ననుసరించి యరుణాది వర్ణభేదములను పై జెప్పినరీతిగ నెరుంగునది.

## దృష్టిగతరోగభేద పరిగణనము

శ్లో॥ షడ్లిఙ్గనాశాః షడిమే చ రోగాః।
దృష్ట్యాశ్రయాష్షట్చ షడేవ వాచ్యాః॥౧౫॥

తా॥ పూర్వోక్తప్రకారముగ వాత పిత్త కఫ సన్నిపాత రక్తములచే జనించిన తిమిర రోగంబులును, రక్తపిత్తములయొక్క సంసర్గముచే జనించిన పరిమ్లాయియను తిమిరరోగంబును కలసి యారువిధంబులును, క్రిందజెప్పంబడురీతిగ, పిత్తవిదగ్ధ, కఫవిదగ్ధ, ధూమదర్శి, హ్రస్వజాడ్య. నకులాన్ధ్య, గంభీరంబులను భేదములచే నారువిధంబులునై దృష్టిగతరోగములు పండ్రెండు విధంబులగునని యెరుంగునది.

## పిత్తవిదగ్ధ దృష్టిలక్షణము

శ్లో॥ పిత్తేన దుష్టేన సదా తు దృష్టిః
పీతా భవేద్యస్య నరస్య కించిత్।
పీతాని రూపాణి చ తేన పశ్యేత్
స వై నరః పిత్తవిదగ్ధదృష్టిః॥౧౬॥

ప్రాప్తే తృతీయం పటలం తు దోషే
దివా న పశ్యేన్నిశి వీక్షతే సః।
రాత్రౌ చ శీతానుగృహీతదృష్టిః
పిత్తాల్పభావాదపి తాని పశ్యేత్ ॥౫౬॥

తా॥ ప్రకోపము నొందిన పిత్తముచే దృష్టి కొంచెముగ పచ్చనిరంగు కల్గియుండును; దానం జేసి ఆ మనుజుడు రూపముగల వస్తువులనన్నింటిని పచ్చని రంగుతో గూడినవానిగ జూచును. ఈ వ్యాధి నేత్రమునందలి మూడవపటలము నాశ్రయించియున్నపుడు పగటియందు కన్నులు గానరాకుండును. రాత్రులయందు శీతలముచేత పిత్తము శాన్తమై స్వల్పముగ నుండును. గాన రూపములను జూచుటకు సామర్థ్యము కల్గియుండును. ఈ వ్యాధి పిత్తవిదగ్ధదృష్టియని చెప్పంజనును.

## కఫవిదగ్ధ దృష్టిలక్షణము

శ్లో॥ తథా నరశ్శ్లేష్మవిదగ్ధదృష్టిః
తాన్యేవ శుక్లాని తు మన్యతే సః।
త్రిషు స్థితోఽల్పః పటలేషు దోషో
నక్తాన్ధ్యమాపాదయతి ప్రసహ్య ॥౫౭॥
దివా స సూర్యానుగృహీతదృష్టిః
పశ్యేత్తు రూపాణి కఫాల్పభావాత్।

తా॥ ప్రకోపమునొందిన శ్లేష్మముచేత దృష్టి దుష్టంబైనయెడ రూపవంతములగు వస్తువులను శుక్లవర్ణములుగ జూచును. మరియు కఫము నేత్రమునందలి మూడుపటములయందును వ్యాపించియుండునపుడు పగటియందు సూర్యునియొక్క ఉష్ణముచే కఫము శాన్తినొంది స్వల్పముగ నుండును గాన కన్నులు కనబడును. రాత్రులయందు కఫము వృద్ధినొందియుండుటంజేసి కనబడకుండును. ఇచ్చట "త్రిషు స్థితోఽల్పః" అని యుండుటంజేసి మూడు పటలములయందును కఫము స్వల్పముగ వ్యాపించియున్నపుడు రేజీకటి కల్గుననియు, కఫంబధికముగ వ్యాపించియున్నపుడు పగటియందును కన్నులు కానరాకుండుననియు నెరుంగునది. ఈ వ్యాధి కఫవిదగ్ధదృష్టియను పేరం బరగునని భావము.

## ధూమదర్శి లక్షణము

శ్లో॥ శోకజ్వరాయాసశిరోఽభితాపై
రభ్యాహతా యస్య నరస్య దృష్టిః ॥౫౮॥
ధూమ్రాంస్తథా పశ్యతి సర్వభావా
న్స ధూమదర్శీతి నరః ప్రదిష్టః।

తా॥ దుఃఖము, జ్వరము, దేహశ్రమము, శిరస్సంతాపము, ఈ కారణములచే పిత్తము ప్రకుపితంబై చూపును చెరచును. దానంజేసి మనుజుండు సకలవస్తుసంఘములను పొగ గ్రమ్మినవానిని

బోలె చూచును. ఈవ్యాధి ధూమదర్శి యని జెప్పంజనును. రాత్రులయందు పిత్తము స్వల్పముగ నుండును గాన వస్తుసంఘములు పొగగ్రమ్మినట్లుండక స్వాభావికములుగనే గబడునని భావము.

## హ్రస్వజాడ్య లక్షణము

శ్లో॥ యో హ్రస్వజాడ్యో దివసేషు కృచ్ఛ్రాత్
హ్రస్వాని రూపాణి చ తేన పశ్యేత్ ॥౬౦॥

తా॥ హ్రస్వజాడ్యముకల మనుజుడు పగటియందు మిక్కిలిగొప్పవైన వస్తువులను హ్రస్వంబులైన, పదార్థములుగ కష్టముచే గన్గొనును. దీనిని హ్రస్వజాడ్యంబను వ్యాధియని యెరుంగునది. మరి "దృష్టిమధ్యగతే దోషే మహద్ధ్రస్వం చ పశ్యతి" అని తన్త్రాన్తరమున నుండుటంజేసి ఈ వ్యాధి దృష్టిమధ్యమున నుండు దోషముచే గల్గునని యెరుంగునది.

## నకులాన్ధ్య లక్షణము

శ్లో॥ విద్యోతతే యస్య నరస్య దృష్టి
ర్దోషాభిపన్నా నకులస్య యద్వత్।
చిత్రాణి రూపాణి దివా స పశ్యే
త్సవై వికారో నకులాన్ధ్య సంజ్ఞః॥౬౧॥

తా॥ మనుజునిదృష్టి వాతాదిదోషములచే దుష్టంబై ముంగిసయొక్క చూపులనుబోలి చిత్రవర్ణముతోగూడి ప్రకాశించుచు సకలవస్తువులును నానావర్ణములతో గూడినట్లు పగటియందు కనబడుచున్నయెడ నకులాన్ధ్యంబను వ్యాధియని యెరుంగునది. ఈ వ్యాధి త్రిదోష ప్రకోపముచె జనించును. మరియు "నక్తమన్ధాస్తు చత్వారో యే పురస్తాత్ప్రకీర్తితాః। తేషామసాధ్యో నకులో హ్రస్వజాడ్యస్తథైవ చ। విశేషేణ భవేయాతాం ద్వౌ చతుఃపటలాశ్రితౌ। తౌ చ సంప్రాప్తరాగత్వాదసాధ్యౌ పరికీర్తితౌ॥" అని విదేహుండు వచించెను గాన హ్రస్వజాడ్యనకులాన్ధ్యంబులను వ్యాధులు రెండును నాల్గవపటలము నాశ్రయించి జనించుననియు, ఎరుపుతోగూడియుండుటంజేసి మిక్కిలి యసాధ్యంబులనియు నెరుంగునది. ఈవ్యాధికల్గినపుడు పగటియందు హ్రస్వాకారంబులుగను చిత్రవర్ణంబులుగను కనబడుటచే రాత్రులయందు బొత్తిగ కన్నులు కానరాకుండును గాన రేజీకటిలో జేరినదియని నక్తాన్ధవ్యాధులలో విదేహుండు పరిగణనము జేసెను.

## గంభీరికాలక్షణము

శ్లో॥ దృష్టిర్విరూపా శ్వసనోపసృష్టా
సఙ్కోచమభ్యన్తరతస్తు యాతి।
రుజాఽవగాఢా చ తమక్షిరోగం
గంభీరికేతి ప్రవదన్తి తజ్జ్ఞాః॥౬౨॥

తా॥ దృష్టి వాతముతోగూడి వికృతరూపంబై లోపలనే యణంగి మిగుల నంతర్భాగమున మున బాధ కల్గియున్న యెడ గంభీరిక యను వ్యాధియని వచింతెదరు. ఈవ్యాధి దృష్టియందలి నాల్గు పటలములయందును వ్యాపించియుండు వాతముచే జనించుటంజేసి యసాధ్యంబై యుండును. పై జెప్పంబడిన పండ్రెండు విధంబులైన వ్యాధులు దృష్టిగతరోగంబులని యెరుంగునది.

## ఆగంతునేత్రవ్యాధి లక్షణము

శ్లో॥ బాహ్యౌ పునర్ద్వావిహ సంప్రదిష్టౌ
నిమిత్తతశ్చాప్యనిమిత్తతశ్చ।
నిమిత్తతస్తత్ర శిరోభితాపాత్
జ్ఞేయస్త్వభిష్యన్దనిదర్శనస్సః॥౬౯॥
సురర్షి గన్ధర్వమహోరగాణాం
సన్దర్శనేనాపి చ భాస్కరస్య।
హన్యేత దృష్టిర్మనుజస్య యస్య
స లిఙ్గనాశస్త్వనిమిత్తసంజ్ఞః॥౭౦॥

తా॥ ఆగంతువులైన నేత్రరోగములు నిమిత్తజములనియు అనిమిత్తజములనియు రెండువిధములు. శిరస్సునందంతట సంతాపము కల్గుటచే కన్నులయందలి రక్తము ప్రకోపమునొంది చూపు దెలియకున్నను, రక్తాభిష్యన్దముచే దృష్టికి భంగము కల్గినను, ఇయ్యది నిమిత్తజ ఆగంతు నేత్రరోగంబనియు, కన్నులచే జూచుటకు సాధ్యంబుకాని దేవతలు, ఋషులు, గన్ధర్వులు, నాగులు మొదలగు వారిని గన్గొనుటకు యత్నించి నిరంతరము చూచుచున్నను, సూర్యుని విశేషముగ జూచుచున్నను మనుజులయొక్క చూపును భంగముకల్గును. ఇయ్యది అనిమిత్తజాగంతుక నేత్రరోగంబనియు నెరుంగునది. ఇచ్చట లిఙ్గనాశపదము దృష్టినాశరూపమైన యర్థమునందు యౌగికముగ జెప్పబడినది యని యెరుంగునది.

## అనిమిత్త ఆగంతునేత్రరోగ లక్షణము

శ్లో॥ తత్రాక్షివిస్పష్టమివావిభాతి
వైదూర్యవర్ణా విమలా చ దృష్టిః।

తా॥ పై జెప్పబడిన అనిమిత్తబాహ్యాక్షిరోగమునందు కన్నులు మిక్కిలి నిర్మలంబులై యుండును. దృష్టియందు రూపాదులనుగ్రహించు శక్తి నశించినను కన్పాపలయందు పువ్వులు మొదలగు మలినములులేక వైడూర్యమణిబోలె శ్యామలవర్ణంబై నిగనిగలాడుచుండును. మరియు "దేవాదయోఽఽష్టా హి మహానుభావా న దూషయన్తః పురుషస్య దేహమ్। విశన్త్యదృశ్యాస్తరసా యథైవ చ్ఛాయాతపౌ దర్పణసూర్యకాన్తౌ॥" అని చరకమున జెప్పినప్రకారము దేవదానవాదులు పురుషుని దేహమును చెరచకయే కన్నులకగుపడక ప్రతిబింబము అద్దమున ప్రవేశించుభంగి, సూర్యుండు సూర్యకాంతపుమణుల జేరుకరణి పురుషులయొక్క శరీరమునంజేరుదురు గాన అవ్విధంబుగనే దేవాదులను జూడ యత్నించిన మనుజుని నేత్రగోళమును

వైరూప్యము నొందించకయే దర్శనశక్తిని నశింపజేయుదురని భావము. ఆగంతుకములగు నీ రెండువ్యాధులును అసాధ్యంబులు.

దృష్టిగతదోషములను వచించినపిదప శుక్లవర్త్మపక్ష్మమణ్డలములలో దృష్టిసమీపవర్తియగు శుక్లమండలమున జనించు పదునొకండువ్యాధులయొక్క నిదానమును జెప్పుట

అందు ప్రస్తార్యర్మ లక్షణము

శ్లో॥ ప్రస్తార్యర్మ తను స్తీర్ణం శ్యావం రక్తనిభం సితే॥౬౫॥

తా॥ కంటిలోనుండు తెల్లగ్రుడ్డునందు మిగుల సూక్ష్మంబై శ్యామవర్ణంబైనను లేక రక్తవర్ణంబైనను గల్గి విస్తీర్ణంబైన పొర గప్పియున్నయెడ ప్రస్తార్యర్మమను వ్యాధియని యెరుంగునది. మరియు "సమన్తాద్విస్తృతశ్శ్యావో రక్తో యో మాంససఞ్చయః। సన్నిపాతేన దోషాణాం ప్రస్తార్యర్మ తదుచ్యతే॥" అని తంత్రాన్తరమునను న్నది. నేత్రమునందలి తెల్లగ్రుడ్డునందంతట శ్యామవర్ణంబును, రక్తవర్ణంబునైన మాంసపుపొర దోషములయొక్క సన్నిపాతముచే జనించి గ్రుడ్డుపైగప్పియున్నయెడ ప్రస్తార్యర్మమని చెప్పంబడునని భావము. ఈ వాక్యమునుబట్టి ప్రకృతమూలమున "శ్యావం రక్తనిభం" అన్నచోట శ్యావవర్ణంబైనను రక్తవర్ణంబైనను గల్గియుండునని యర్థము.

శుక్లార్మ లక్షణము

శ్లో॥ సశ్వేతం మృదు శుక్లార్మ శుక్లే తద్వర్ధతే చిరాత్।

తా॥ తెల్లగ్రుడ్డునందు కొంచెముగ శ్వేతవర్ణంబై మృదువుగనుండు మాంసపుపొర గల్గి చిరకాలమునకు వృద్ధినొందును. ఇది శుక్లార్మంబను వ్యాధియని యెరుంగునది.

రక్తార్మ లక్షణము

శ్లో॥ పద్మాభం మృదు రక్తార్మ యన్మాంసం చీయతే సితే॥౬౬॥

తా॥ ఎఱ్ఱతామరరేకువలె రక్తవర్ణంబును, మృదులంబునైన మాంసము తెల్లగ్రుడ్డునందు జనించి వృద్ధినొందినయెడ రక్తార్మంబని యెరుంగునది. ఇది రక్తముచే జనించినది.

అధిమాంసార్మ లక్షణము

శ్లో॥ పృథు మృద్వధిమాంసార్మ బహులం చ యకృన్నిభమ్।

తా॥ విస్తీర్ణంబును, మృదులంబును, మిగుల స్థూలంబునై యకృత్తునుబోలి రక్తవర్ణంబైన మాంసము తెల్లగ్రుడ్డునందు జనించినయెడ అధిమాంసార్మంబని యెరుంగునది. మరియు "విస్తీర్ణం మృదు బహుళం యకృత్ప్రకాశం శ్యావం వా తమధిమాంసజార్మ విద్యాత్" అని సుశ్రుతమున నుండుటంజేసి ఈ యధిమాంసార్మంబునది కొంచెముగ రక్తవర్ణము కలిసిన శ్యామవర్ణముకల్గియుండునని యెరుంగునది. మరియు సుశ్రుతమున సన్నిపాతప్రకరణమున దీని జెప్పియున్నది గాన సన్నిపాతముచే జనించును.

## స్నాయ్వర్మ లక్షణము

శ్లో॥ స్థిరం ప్రస్తారి మాంసాఢ్యం శుష్కం స్నాయ్వర్మ పంచమమ్ ॥౬౭॥

తా॥ కఠినంబై యధికమైన మాంసముతోఁగూడి స్రావములేక శుష్కంబై తెల్లగుడ్డునందు వ్యాపించి యున్నయెడ స్నాయ్వర్మంబని యెఱుంగునది. మఱియు "ప్రస్తారిణోఽర్మణ స్స్రావం నిరుణద్ధి యదాఽనిలః। వినా స్రావం హి శుష్కం తత్స్నాయ్వర్మేతి ప్రకీర్తితమ్॥" అని తన్త్రాన్తరమున నుండుటచే పైఁజెప్పబడిన ప్రస్తార్యర్మంబను వ్యాధియందు వాతము స్రావము నడ్డగించుటచే శుష్కంబై యున్నయెడ స్నాయ్వర్మంబని జెప్పందగునని భావము. ఈ వ్యాధి సన్నిపాతముచే జనించినను స్వభావముచే సాధ్యంబై యుండును.

## శుక్తికా లక్షణము

శ్లో॥ శ్యావాస్స్యుః పిశితనిభాశ్చ బిన్దవో యే
　　శుక్త్యాభాః సితనియతాః స శుక్తి సంజ్ఞః।

తా॥ శ్యావవర్ణంబులును, మాంసపుముద్దలవంటి యాకారము కల్గినవియు, ముత్యపుచిప్పల బోలిన వర్ణము కల్గినవియునైన చుక్కలు తెల్లగుడ్డునందు నియతముగ జనించినయెడ ముత్యపు చిప్పలబోలియుండుటంజేసి శుక్తిక యని చెప్పందగును. మఱియు "పిత్తం కుర్యాత్సితే బిన్దూనసితశ్యావపీతకాన్" అని వాగ్భటుండు వచించెను గాన ఈవ్యాధి పిత్తముచే జనించునని యెఱుంగునది.

## అర్జున లక్షణము

శ్లో॥ ఏకో యశ్శశరుధిరోపమశ్చ బిన్దు
　　శ్శుక్లస్థో భవతి తమర్జునం వదన్తి ॥౬౮॥

తా॥ కుందేటినెత్తురునుబోలి రక్తవర్ణంబైన చుక్క యొక్కటి తెల్లగుడ్డున జనించినయెడ దానిని అర్జునంబను వ్యాధియని వచించెదరు. మఱియు తంత్రాన్తరమునందు "కృష్ణభాగే సితం బిన్దుం శుక్లం విద్యాత్కఫాత్మకమ్। రక్తంచ శుక్లభాగస్థమర్జునం శోణితోద్భవమ్॥" అని యున్నది. నల్లగుడ్డునందు కఫప్రకోపముచేత తెల్లని చుక్క కల్గినయెడ నయ్యది శుక్లంబనియు, తెల్లగుడ్డునందు రక్తవర్ణంబైన చుక్క రక్తముచే జనించినయెడ అర్జునంబనియు వచించెదరని యర్థము. మఱియు "శక్రగోపనిభం శుక్లేఽర్జునం రక్తప్రకోపతః" అని తన్త్రాన్తరమున అర్జునలక్షణము గానంబడియెడు. రక్తప్రకోపముచేత ఇంద్రగోపంబను పురుగు (ఆరుద్రపురుగు) వలె రక్తవర్ణంబైన మచ్చ తెల్లగుడ్డున కల్గినచో నయ్యది అర్జునంబని చెప్పంబడునని యర్థము.

## పిష్టక లక్షణము

శ్లో॥ శ్లేష్మమారుతకోపేన శుక్లే పిష్టం సమున్నతమ్।
　　పిష్టవత్పిష్టకం విద్ధి మలాక్తాఽదర్శసన్నిభమ్ ॥౬౯॥

తా॥ కఫవాతములయొక్క ప్రకోపముచేత తెల్లగ్రుడ్డునందు పిండివలె శ్వేతవర్ణంబును, ఉన్నతంబునై మలినము గమ్మిన అద్దమువలె నున్నయెడ నయ్యది పిష్టకంబను వ్యాధియని యెఱుంగునది.

## సిరాజాల లక్షణము

శ్లో॥ జాలాభః కఠినసిరో మహాన్ సరక్తః
సన్తానస్స్మృత ఇహ జాలసంజ్ఞితస్తు।

తా॥ తెల్లగ్రుడ్డునందు పలుచెరంగుల సిరలు వ్యాపించియుండుటచే గవాక్షిని బోలిన యాకారముకల్గి కఠినంబులైన సిరలతోగూడి రక్తవర్ణంబులగు చుక్కలు వ్యాపించియున్నయెడ సిరాజాలంబను వ్యాధియని చెప్పంజనును. ఈ వ్యాధి రక్తముచే జనించును.

## సిరాజ పిడకా లక్షణము

శ్లో॥ శుక్లస్థాస్సితపిడకాస్సిరావృతాయా
స్తా బ్రూయాదసితసమీపజాస్సిరాజాః ॥౨౦॥

తా॥ నల్లగ్రుడ్డునకు సమీపమున తెల్లగ్రుడ్డునందు తెల్లని బొబ్బలు జనించి సిరలచే గప్పబడియున్నయెడ సిరలచే నావరింపబడియుండుటంజేసి సిరాజపిడకయని చెప్పంజనును. ఈ వ్యాధిని సుశ్రుతుండు త్రిదోషజ సాధ్యప్రకరణమున పఠించెను గాన సన్నిపాతముచే జనించినదియని యెఱుంగునది.

## బలాసగ్రథిత లక్షణము

శ్లో॥ కాంస్యాభోఽమృదురథ వారిబిన్దుకల్పో
విజ్ఞేయో నయనసితే బలాససంజ్ఞః।

తా॥ నేత్రమునందలి శుక్లభాగమున కంచువలె కొంచెముగ పచ్చనైన కాంతి గల్గి మిగుల కఠినంబై ఉదకబిందువునుబోలె వర్తులంబైన బొబ్బ గల్గినయెడ బలాసగ్రథితంబను వ్యాధియని యెఱుంగునది. మఱియు "మారుతోత్పీడితశ్శ్లేష్మా శుక్లభాగే వ్యవస్థితః। జలబిన్దురివోచ్ఛూనో హ్యామృదుః కఫసమ్భవః। బలాసగ్రథితం నామ తం శోఫం వృత్తమాదిశేత్॥" అని విదేహుండు వచించెను గాన ఈవ్యాధి కఫవాతములచే జనించినది యని యెఱుంగునది. ఇవ్విధంబుగ ప్రస్తార్యర్మము మొదలుజేసి చెప్పిన పదునొకండు వ్యాధులును శుక్లగత నేత్రరోగములని యెఱుంగునది. మఱియు వాగ్భటుండు సిరోత్పాత సిరాహర్ష లక్షణముల నీకతిగ జెప్పెను. "రక్తరాజీనిభం శుక్లముష్యతే ససవేదనమ్। లోహితాభ్రాంతరూపదేహం చ సిరోత్పాతస్స శోణితాత్। ఉపేక్షితస్సిరోత్పాతో రాజీస్తా ఏవ వర్ధయేత్। కుర్యాత్తాస్రం సిరాహర్షం తేనాక్ష్యుద్వీక్షణాక్షమమ్॥" నేత్రమునందలి శుక్లభాగము రక్తవర్ణంబులగు రేఖలచే నావరింపబడి వాపును కన్నీళ్లును ఉపలేపంబును లేకయే అధికమైన మంటయు నొప్పియు కల్గియున్నయెడ రక్తముచే జనించిన సిరోత్పాతంబను వ్యాధి

యనియు, అట్టి సిరోత్పాతమును చికిత్సచేయక యుపేక్షించినయెడ పైజెప్పినవిధంబుగ రక్తవర్ణంబులైన రేఖలు వృద్ధినొంది రక్తముతోఁగూడి యుండి కన్నెత్తి చూచుటకు సామర్థ్యము లేకున్న యెడ సిరాహర్షంబను వ్యాధియనియు భావము.



[శుక్లగత నేత్రరోగ నిదానానన్తరము సంధిగతంబులను నవవిధ నేత్రరోగములయొక్క నిదానమును జెప్పుట. సంధిలక్షణము సుశ్రుతమునం దిద్విధంబుగ గానంబడియెడు: "పక్ష్మవర్త్మగతస్సన్ధిర్వర్త్మశుక్లగతోఽపరః। శుక్లకృష్ణగతస్త్వన్యః కృష్ణదృష్టిగతోఽపరః। తతః కనీనికాగతః షష్ఠశ్చాపాఙ్గగస్స్మృతః।" అని యున్నది. రెప్పవెంట్రుకలకును రెప్పలోపలి ప్రక్కకును మధ్యమందు సంధియు, రెప్పలోపలి భాగమునకును తెల్లగ్రుడ్డునకును నడుమనుండు సన్ధియు, తెల్లగ్రుడ్డునకును నల్లగ్రుడ్డునకును నడుమనుండు సంధియు, నల్లగ్రుడ్డునకును దృష్టికి నడుమనుండు సన్ధియు, నాసికామూలములకు సమీపమున నుండు నేత్రాంతముల (కొలుకుల) యందలి సంధియు, కన్గొనలయందలి సంధియు గలిసి నేత్రగతంబులగు సన్ధులు ఆరువిధంబులని భావము.]

(అట్టి సంధులలో కనీనికా (కొలుకుల) సంధిగతంబైన
పూయాలసక లక్షణము)

శ్లో॥ పక్వశోథస్సన్ధిజో యస్స్రావోదః
స్రవేత్పూయం పూతి పూయాలసాఖ్యః।

తా॥ నాసికామూలములకు సమీపమున నుండు కొలుకులసంధియందు వాపు జనించి పరిపక్వంబై పోటుతోఁగూడి దుర్గంధముతోఁగూడిన చీమును గార్చుచున్నయెడ పూయాలసకంబను వ్యాధియని యెఱుంగునది. ఇచ్చట "శోథక్లేదసమాయుక్తం తోదభేద సమాకులమ్। పూయాలసం తు తం విద్యాత్ సన్ధౌ కానీనికే నృణామ్॥" అను విదేహవచనమునుబట్టి "సన్ధిజః" అను పదమునకు కనీనికాసంధియని యర్థము. మరియు నీవ్యాధిని సుశ్రుతాచార్యుండు సాధ్యత్రిదోషజములలోఁ పఠించెను గాన సన్నిపాతముచే జనించుననియు సాధ్యంబనియు నెఱుంగునది.

## శ్లేష్మోపనాహ లక్షణము

శ్లో॥ గ్రన్థిర్నాల్పో దృష్టిసంధావపాకీ
కణ్డూప్రాయో నీరుజస్తూపనాహః ॥౨౦॥

తా॥ కన్పాపకును నల్లగ్రుడ్డునకును నడుమనుండు సన్ధియందు గొప్పదియైన యాకారము కల్గినదియు, స్వల్పమైన పాకము కల్గినదియు, అధికమైన దురదకల్గినదియునై స్వల్పవేదనతోఁగూడిన గ్రన్థి జనించును. దీనిని శ్లేష్మోపనాహంబను వ్యాధియని వచించెదరు. మరియు "వాయుశ్శ్లేష్మాణ మాదాయ దృష్టిసన్ధౌ వ్యవస్థితః। అరుణం కఠినం గ్రన్థిం జనయేదల్పవేదనమ్। శ్లేష్మోపనాహం తం విద్యాత్" అని విదేహుండు చెప్పెను. వాతము ప్రకుపితంబై శ్లేష్మతోఁగలిసి దృష్టిసంధియందు జేరి అరుణవర్ణంబును కఠినంబునై స్వల్పవేదనతో

గూడిన గ్రన్థిని కల్గించుననియు, దీనిని శ్లేష్మోపనాహంబని యెఱుంగవలెననియు భావము. ఈవాక్యమునుబట్టి ప్రకృతమూలమునందు "నీరుజః" అను పదమునకు స్వల్పవేదనతో గూడినది యనియు, ఉపనాహపదమునకు శ్లేష్మోపనాహంబనియు నర్థము నెఱుంగునది. మరియు నీవ్యాధి వాతపిత్తములరెంటిచే జనించినను శ్లేష్మము ప్రబలముగ నుండుటంజేసి శ్లేష్మోపనాహంబని వ్యవహరింపబడును.

## నాల్గు తెఱంగులైన స్రావముల సంప్రాప్తి

శ్లో॥ గత్వా సన్ధీనశ్రుమార్గేణ దోషాః
కుర్యుస్స్రావాన్ లక్షణైస్స్వైరుపేతాన్।
తం హి స్రావం నేత్రనాడీతి చైకే
తస్యా లిఙ్గం కీర్తయిష్యే చతుర్ధా ॥౨౨॥

తా॥ అశ్రువహంబులైన నాడులయొక్క మార్గమునుండి దోషములు నేత్రసంధులయందు జేరి ఆ యా దోషలక్షణములతో గూడిన స్రావములను గల్గించును. ఈ స్రావమును నేత్రనాడియని కొందరు వచించెదరు. సన్నిపాతకఫరక్తపిత్తములచే నాల్గువిధంబులగు స్రావములకు వేర్వేరుగ లక్షణముల వచించెదనని యర్థము. వ్యాధిస్వభావముచే వాతజనిత స్రావము లేదని భావము.

## పూయాస్రావ లక్షణము

శ్లో॥ పాకస్సన్ధౌ సంస్రవేద్యస్తు పూయం
పూయాస్రావోఽసౌ గదస్సర్వజస్తు।

తా॥ నేత్రమునందలి సంధులయందు పండై చీమును స్రవించుచున్నయెడ పూయాస్రావంబను వ్యాధియని యెఱుంగునది. ఈ రోగము సన్నిపాతముచే జనించునుగాన అసాధ్యంబై యుండును. తక్కిన స్రావములు మూడును అసాధ్యంబులైనను యాప్యంబులై యుండును.

## శ్లేష్మాస్రావ లక్షణము

శ్లో॥ శ్వేతం సాన్ద్రం పిచ్ఛిలం యస్స్రవేత్తు
శ్లేష్మాస్రావోఽసౌ వికారో మతస్తు ॥౨౩।

తా॥ శ్వేతవర్ణంబును పిచ్ఛిలంబునై చిక్కనై యున్న స్రావము కల్గినయెడ శ్లేష్మాస్రావంబని యర్థము.

## రక్తస్రావ లక్షణము

శ్లో॥ రక్తస్రావశ్శోణితోత్థో వికార
స్స్రవేదుష్ణం తత్ర రక్తం ప్రభూతమ్।

తా॥ దుష్టమైన రక్తము నేత్రగతసంధులనుండి అధికముగ స్రవించినయెడ రక్తప్రకోపముచే జనించిన రక్తస్రావంబను వ్యాధియని యెఱుంగునది. ఇచ్చట "రక్తస్రావః" అను పదముచేతనే

యీ వ్యాధి రక్తముచే జనించినదియని స్ఫుటముగ తెలియుచున్నను మరల "శోణితజః" అని చెప్పుటచేత మిక్కిలి ప్రకుపితంబైన రక్తముచే నీవ్యాధి జనించునని యెఱుంగునది. మరియు "రక్తస్రావః పిత్తలింగైరుపేతః" అని పాఠాంతరము గానంబడుచున్నది. ఆ పక్షమున పిత్తస్రావమునకు జెప్పిన లక్షణములుగూడ నీవ్యాధియందు జనించునని యర్థము.

## పిత్తస్రావ లక్షణము

శ్లో॥ హారిద్రాభం పీతముష్ణం జలాభం
పిత్తాస్రావః సంస్రవేత్సన్ధిమధ్యాత్ ॥౨౮॥

తా॥ పీతరక్తవర్ణములు కలిసిన రంగైనను, లేక పీతవర్ణంబైనను, లేక ఉదకమువలె స్వచ్ఛవర్ణంబైనను కల్గి మిగుల నుష్ణంబైన స్రావము నేత్రమునందుండు సంధుల నడుమనుండి స్రవించినయెడ పిత్తముచే జనించిన స్రావంబని యెఱుంగనగు. మరియు "సన్నిపాతాత్కఫాద్రక్తాత్పిత్తాత్స్రావోఽక్షిసన్ధిషు" అను విదేహుని వచనము ననుసరించి యిచ్చట నేత్రగతసంధులయందు సన్నిపాతము, కఫము, రక్తము, పిత్తము, అను నీనాల్గిటిచేత నాల్గువిధంబులైన ఆస్రావములు జనించుననియు, వ్యాధిస్వభావముచేత వాతముచే జనించు ఆస్రావము లేదనియు నెఱుంగునది.

## పర్వణికాలజీ లక్షణములు

శ్లో॥ తామ్రా తన్వీ దాహశూలోపపన్నా
రక్తాజ్ఞేయా పర్వణీ వృత్తశోథా।
జాతా సన్ధౌ కృష్ణశుక్లేఽలజీ స్యా
త్తస్మిన్నేవ ఖ్యాపితా పూర్వలిఙ్గైః॥౨౯॥

తా॥ నేత్రమునందలి శుక్లకృష్ణభాగములయొక్క సంధియందు రక్తప్రకోపముచేత రక్తవర్ణంబును, సూక్ష్మాకారంబును, వర్తులంబునై మంటయు నొప్పియు కల్గిన వాపు జనించును. దీనిని పర్వణియను వ్యాధియని యెఱుంగునది. పై జెప్పబడిన సంధియందు పర్వణీలక్షణములతో గూడిన బొబ్బ జనించినయెడ అలజియని యెఱుంగునది. మరియు "శుక్లకృష్ణాన్తసన్ధౌ తు చీయన్తేఽసృక్కఫానిలాః। పర్వణీ పిడకా తైస్తు జాయతే త్వఙ్కురోపమా। తామ్రా సదాహచోషోష్ణపీతకా। శుసమాకులా। కఫపిత్తే తు సంమూర్ఛ్య సహ రక్తేన మారుతః। శుక్లకృష్ణాన్తసన్ధౌ తు జనయేద్గ్రోస్తనాకృతిమ్। పిడకామలజీం తాన్తు విద్ధి తోదాశ్రుసంకులామ్॥" అని విదేహుండు చెప్పెను. నేత్రమున శుక్లకృష్ణభాగములకు నడుమనుండు సంధియందు రక్తకఫవాతములు వృద్ధినొంది మొలకవలె రక్తవర్ణంబైన బొబ్బలను కల్గించును; ఇయ్యది పర్వణికయనంబడు. ఈవ్యాధియందు మంటయు, చోషంబును ఉష్ణంబును, పీతవర్ణంబును కల కన్నీళ్లుకారుచుండును. కఫపిత్తరక్తవాతములు ప్రకుపితంబులై నేత్రములలో తెల్లగ్రుడ్డునకును నల్లగ్రుడ్డునకును నడుమనుండు సంధియందు ద్రాక్షపండువలె గుండ్రముగ

ముండు బొబ్బను కల్గించినయెడ అలజియని యెఱుంగవలెనని భావము. ఈ విదేహవాక్యమునను సరించి ప్రకృతసూత్రమున సూక్ష్మంబైన యాకారముకల్గినది పర్వణికయనియు, ద్రాక్షపండువంటి యాకారముకల్గినది అలజియనియు నీరెంటికిని పరస్పరభేదముల నెఱుంగునది. ఇచ్చట కొందఱు "పూర్వలిఙ్గైః" అను పదమునకు ప్రమేహపిడకారూపంబైన అలజియొక్క లక్షణములతోఁగూడి యుండునది యని అర్థము జెప్పి ఈరెంటికిని భేదముల నిరూపించెదరు.

## క్రిమిగ్రన్థి లక్షణము

శ్లో॥ క్రిమిగ్రన్థిర్వర్త్మనః పక్ష్మణశ్చ
కణ్డూం కుర్యుః క్రిమయస్సన్ధిజాతాః।
నానారూపా వర్త్మశుక్లాన్తసన్ధౌ
చరన్త్యన్తర్లోచనం దూషయన్తః ॥౨౬॥

తా॥ కనురెప్పల లోపలిభాగమునకును తెల్లగ్రుడ్డునకును నడుమనుండు సంధియందు క్రిములు జనించి పిదప రెప్పవెండ్రుకలకును రెప్పలోపలి భాగమునకును నడుమ వ్యాపించి దురదను కల్గించును. అట్టి క్రిములు సన్నిపాతముచే జనించుటంజేసి నానావిధరూపంబులై యుండును. మరియు నీక్రిములు కంటి లోప్రక్కను చెరచుచు నానాట కన్నును తినును. ఈవ్యాధి క్రిమిగ్రంథి యని చెప్పందగు. మరియు నీవ్యాధిలక్షణమును విదేహుం డివ్విధంబుగ వచించెను. "వర్త్మశుక్లస్య సన్ధౌ తు గ్రన్థిః పిత్తకఫాత్మకః। ఊష్మణా పచ్యతే గాఢం తత్ర మూర్ఛన్తి జన్తవః। సుసూక్ష్మజాతచరణా వర్త్మపక్ష్మ సమాశ్రయాః। తతస్తే పూయసంస్పృష్టాః పతన్తి క్రిమయస్తథా। లక్షణైర్వివిధైర్యుక్తాస్సన్నిపాతసముత్థితాః। క్రిమిగ్రన్థింతు తం విద్యాద్దేహినాం నేత్రదూషణమ్॥" వర్త్మ (రెప్పల లోపలిభాగము)కును తెల్లగ్రుడ్డునకును నడుమనుండుసంధియందు పిత్తకఫములచే గ్రంథి జనించి యాగ్రన్థి ఉష్ణముచేపరిపక్వంబైన పిదప దానియందు క్రమముగ జన్తువులు కల్గి నానాట మిగుల సూక్ష్మంబులైన కాళ్లుగల్గి కనురెప్ప లోపలిభాగమును రెప్పలను ఆశ్రయించి చీముతోఁగూడి క్రిందపడును. ఈక్రిములు సన్నిపాతముచే జనించును గాన త్రిదోషలక్షణములతో గూడియుండును. ఇది నేత్రమును జెరచు క్రిమిగ్రన్థివ్యాధియని జెప్పంబడునని భావము. ఇవ్విధంబుగ పూయాలసము మొదలు జేసి చెప్పబడిన నవవిధవ్యాధులును వర్త్మశుక్ల సంధిగత నేత్రరోగంబులని యెఱుంగునది.



[సంధిగతరోగనిదానమును జెప్పినపిదప "వర్త్మశుక్లాన్తసన్ధౌ" అనుచోట గ్రహించబడిన వర్త్మమునాశ్రయించిన యిరువదియొక నేత్రరోగముల నిదానమును జెప్పుట. వర్త్మరోగసంప్రాప్తి సుశ్రుతమునం దివ్విధంబుగ జెప్పంబడియె: "పృథగ్దోషాస్సమస్తాశ్చ యదా వర్త్మవ్యపాశ్రయాః। సిరా వ్యాప్యావతిష్ఠన్తే వర్త్మస్వధికమూర్ఛితాః। వివర్ధ్య

తా॥ వర్త్మయందు మిక్కుటమైన స్రావముతోగూడినవియు, దురదకల్గినవియు, గురుత్వముకల్గినవియు, ఎఱ్ఱనియావాలవంటి యాకారము కల్గినవియు, బాధతోగూడినవియునైన పొక్కులు కల్గినయెడ పోథకియను వ్యాధియని చెప్పందగును.

## వర్త్మశర్కరా లక్షణము

శ్లో॥ పిడకా యా ఖరా స్థూలా సూక్ష్మాభిరభిసంవృతా।
వర్త్మస్థా శర్కరా నామ స రోగో వర్త్మదూషకః ॥౧౦॥

తా॥ మిగుల కర్కశంబును కఠినంబును స్థూలంబునైన పొక్కు వర్త్మయందు జనించి సూక్ష్మాకారంబులైన పొక్కులతోగూడి యున్నయెడ దానిని వర్త్మశర్కర యనంజను. ఈ వ్యాధి కనురెప్పల లోభాగమును జెరచును. సున్నపురాయివలె గరగరలాడుచు నుండుటంజేసి యీవ్యాధి శర్కర యనంజనునని భావము. మరియు "సుసూక్ష్మపిడకాకీర్ణా యా స్థూలా పిడకా ఖరా। జాయతే సన్నిపాతాత్తు వర్త్మశర్కరికేతి సా॥" అని విదేహుండు జెప్పెను. మిక్కిలి సూక్ష్మంబులైన బొబ్బలతో గూడి స్థూలంబును కర్కశంబునైన పెద్దబొబ్బ కనురెప్ప లోపలిప్రక్క సన్నిపాతముచే జనించినయెడ నయ్యది శర్కరికయని యర్థము. ఈవాక్యమునుబట్టి యీ వ్యాధి సన్నిపాతముచే జనించునని తెలియుచున్నది.

## అర్శోవర్త్మ లక్షణము

శ్లో॥ ఏర్వారుబీజప్రతిమాః పిడకా మన్దవేదనాః।
శ్లక్ష్ణాః ఖరాశ్చ వర్త్మస్థాః తదర్శోవర్త్మ కీర్త్యతే ॥౧౧॥

తా॥ దోసవిత్తులవంటి యాకారము కల్గినవియు, స్వల్పమైన వేదన కల్గినవియు, కర్కశములుకాక శ్లక్ష్ణంబులును, కఠినంబులునైన పొక్కులు కనురెప్ప లోప్రక్క జనించినయెడ అర్శోవర్త్మంబను వ్యాధియని చెప్పంబడును. మరియు పిడకాసన్నిపాతేన "తదర్శోవర్త్మ నిర్దిశేత్" అని ఇతరతంత్రమున నుండుటంజేసి ఈ వ్యాధికూడ సన్నిపాతముచే జనించునని యెఱుంగునది.

## శుష్కార్శో లక్షణము

శ్లో॥ దీర్ఘాఙ్కురః ఖరస్తబ్ధో దారుణోఽభ్యన్తరోద్భవః।
వ్యాధి రేషోఽభివిఖ్యాతః శుష్కార్శో నామ నామతః ॥౧౨॥

తా॥ మిగులకర్కశంబును, కఠినంబును, మిక్కిలి బాధనుగల్గించుటం జేసిక్రూరంబునై దీర్ఘంబైన మాంసాంకురము కనురెప్పలోపల జనించినయెడశుష్కార్శోవ్యాధియని యెఱుంగునది. మరియు "వర్త్మాభ్యన్తరగతం త్వర్శః శుష్కం స్థూలం చ దారుణమ్ । జాయతే సన్నిపాతేన తచ్ఛుష్కార్శః ప్రకీర్తితమ్॥" అని విదేహుండు జెప్పెనుగాన నీవ్యాధి సన్నిపాతముచే జనించినది యని యెఱుంగునది.

## అఞ్జననామికా లక్షణము

శ్లో॥ దాహతోదవతీ తామ్రా పిడకా వర్త్మసంభవా।
మృద్వీ మన్దరుజా సూక్ష్మా జ్ఞేయా సాఽఞ్జననామికా॥౨౩॥

తా॥ మంటయు పోటును కల్గి తామ్రవర్ణంబును మృదువునై స్వల్పమైన వేదనతోఁగూడి సూక్ష్మాకారంబైన పొక్కు కనురెప్పయందు జనించినయెడ అఞ్జననామిక యను నేత్రవ్యాధి యని యెఱుంగునది. ఈవ్యాధి రక్తప్రకోపముచే జనించును.

## బహులవర్త్మ లక్షణము

శ్లో॥ వర్త్మోపచీయతే యస్య పిడకాభిస్సమన్తతః।
సవర్ణాభిస్సమాభిశ్చ విద్యాద్బహులవర్త్మ తత్॥౨౪॥

తా॥ వర్త్మమునకు సమానమైన వర్ణముకల్గినవియు, కఠినంబులునైన పొక్కులచే వర్త్మ వ్యాప్తంబై యున్నయెడ బహులవర్త్మ యను వ్యాధియని యెఱుంగునది. ఈ వ్యాధి సన్నిపాతముచే జనించును.

## వర్త్మబన్ధన లక్షణము

శ్లో॥ కణ్డూమతాఽల్పతోదేన వర్త్మశోథేన యో నరః।
న సమఞ్ఛాదయేదక్షి యత్రాఽసౌ వర్త్మబన్ధకః॥౨౫॥

తా॥ వర్త్మయందు దురదయు స్వల్పవేదనయుకల వాపు జనించి కన్నుమూయుటకు సాధ్యము కాకున్నయెడ వర్త్మబన్ధనమను వ్యాధియని యెఱుంగునది. ఈ వ్యాధిగూడ సన్నిపాతముచే జనించునది.

## క్లిష్టవర్త్మ లక్షణము

శ్లో॥ మృద్వల్పవేదనం తామ్రం యద్వర్త్మ సమమేవ చ।
అకస్మాచ్చ భవేద్రక్తం క్లిష్టవర్త్మేతి తద్విదుః॥౨౬॥

తా॥ వర్త్మలయందు ఊర్ధ్వాధోభాగములు రెండును సమకాలమున కారణము లేకయే మృదువులును, స్వల్పవేదనతోఁ గూడినవియునై, తామ్రవర్ణంబైనను రక్తవర్ణంబైనను కల్గియున్న యెడ క్లిష్టవర్త్మయను వ్యాధియని యెఱుంగునది. మరియు "శ్లేష్మణాప్యేన రక్తేన క్లిష్టం మాంసమివోభయమ్। బంధుజీవనిభం వర్త్మ క్లిష్టవర్త్మ తదుచ్యతే॥" అని విదేహుండు వచించెను. శ్లేష్మరక్తములు రెండును ప్రకుపితంబులై రెండుకనురెప్పల లోభాగమును కదలించుటకు మిగుల కష్టంబై మంకెనపువ్వువలె ఎఱ్ఱనైన మాంసము కల్గియున్నయెడ క్లిష్టవర్త్మ యను వ్యాధియను యర్థము. ఈ వాక్యముచే నీవ్యాధి శ్లేష్మరక్తములచే జనించునని యెఱుంగునది.

## వర్త్మకర్దమ లక్షణము

శ్లో॥ క్లిష్టం పునః పిత్తయుతం శోణితం విదహేద్యదా।
తతః క్లిన్నత్వమాపన్నముచ్యతే వర్త్మకర్దమః॥౮౭॥

తా॥ పైజెప్పిన క్లిష్టవర్త్మయనునది పిత్తవర్ధకంబులగు ఆహారాదులచే వృద్ధినొందిన పిత్తముతోగూడి రక్తమును విరుద్ధంబైన పాకము నొందించినయెడ వర్త్మ ఆర్ద్రంబైయుండును. దానిని వర్త్మకర్దమంబను వ్యాధియని వచించెదరు. ఇచట "తతః కృష్ణత్వ మాపన్నమ్" అను పాఠాన్తరమునందు రక్తము విదగ్ధంబగుటచే కృష్ణవర్ణంబగునని యర్థము.

## శ్యావవర్త్మ లక్షణము

శ్లో॥ యద్వర్త్మ బాహ్యతోఽన్తశ్చ శ్యావం శూలం సవేదనమ్।
తదాహుశ్శ్యావవర్త్మేతి వర్త్మరోగ విశారదాః ॥౮౮॥

తా॥ కనురెప్ప లోపలిభాగమునందును వెలిప్రక్కయు శ్యావవర్ణముకల్గి నొప్పియు వేదనయు కల్గియున్నయెడ శ్యావవర్త్మయను వ్యాధియని వైద్యనిపుణులు వచించెదరు. మరియు "దుష్టం శ్లేష్మ మరుత్పిత్తం వర్త్మనోశ్చీయతే యదా। అగ్నిదగ్ధనిభం శ్యావం శ్యావవర్త్మేతి తద్విదుః॥" వాతపిత్తకఫములు మూడును ప్రకుపితంబులై కనురెప్పలయందు వృద్ధినొంది నిప్పున కాలినవిధంబుగ శ్యామవర్ణమును కల్గించినయెడ శ్యావవర్త్మయను వ్యాధియని భావము. ఈ వాక్యమునుబట్టి ఈ వ్యాధి త్రిదోషములచే జనించునని తెలియుచున్నది.

## ప్రక్లిన్నవర్త్మ లక్షణము

శ్లో॥ అరుజం బాహ్యతశ్శూనం వర్త్మ యస్య నరస్యహి।
ప్రక్లిన్నవర్త్మ తద్విద్యాత్ క్లిన్నమత్యర్థ మన్తతః ॥౮౯॥

తా॥ కనురెప్పలోపల బాధలేకయే ఆర్ద్రంబై వెలిప్రక్క వాపుకల్గియున్నయెడ ప్రక్లిన్నవర్త్మయను వ్యాధియని యెరుంగునది.

## అక్లిన్న వర్త్మ లక్షణము

శ్లో॥ యస్య ధౌతాన్యధౌతాని సమ్బధ్యన్తే పునః పునః।
వర్త్మాన్యపరిపక్వాని విద్యాదక్లిన్నవర్త్మ తత్ ॥౯౦॥

తా॥ కనురెప్పలలో లోప్రక్క కడిగినను కడగకున్నను పరిపక్వంబులుగాకయే మాటిమాటికి నొండొంటజేరి కరచుకొనియున్నయెడ అక్లిన్నవర్త్మయను వ్యాధియని యెరుంగునది. మరియు "ప్రక్షాళితేఽథవా స్పృష్టే అనస్యాత పునః పునః। అపరిక్లిన్నవర్త్మేతి తత్పిల్లమితినిర్దిశేత్॥" అని విదేహుండు ఈ వ్యాధికి పిల్లంబను నామాన్తరమును గూడ జెప్పెను. ఇచట "వర్త్మాని" అను బహువచన నిర్దేశముచేత ఈ వ్యాధి నేత్రముల రెంటియందును సమకాలమున కల్గునని యెరుంగునది.

## వాతహతవర్త్మ లక్షణము

శ్లో॥ విముక్తసన్ధినిశ్చేష్టం వర్త్మ యస్య న మీల్యతే।
ఏతద్వాతహతం వర్త్మ జానీయాదక్షిచిన్తకః ॥౯౧॥

తా॥ వర్త్మకును తెల్లగ్రుడ్డునకును నడుమనుండు సంధి వదలి చలనాదిచేష్టలుదక్కి కన్ను మూతబడకున్నయెడ వాతహత వర్త్మయను వ్యాధియని తెలియందగినది. ఇచ్చట వర్త్మ సంధి సడలినప్పుడు దానిని ఆశ్రయించిన కన్నుల మూయుట, తెరచుట మున్నగు క్రియలగల్గించు సిరలు గూడ సడలియుండును గాన కన్నులమూయుటకు సాధ్యముగానుండునని భావము. "నిమీల్యతే" అను పాఠాన్తరమునందు కన్ను మూతబడి తెఱచుటకు సాధ్యము కాకుండునని యర్థము. ఈ వ్యాధిని సుశ్రుతాచార్యుండు అసాధ్యప్రకరణమున పఠించెనుగాన అసాధ్యంబై యుండునని యెరుంగునది.

## అర్బుద లక్షణము

శ్లో॥ వర్త్మాన్తరస్థం విషమం గ్రన్థిభూతమవేదనమ్।
ఆచక్షతార్బుదమితి సరక్తమవిలమ్బితమ్॥౯౨॥

తా॥ విషమంబై గ్రంథినిబోలె స్వల్పవేదనకల్గి కొంచెముగ రక్తవర్ణంబైన వాపు వర్త్మయందు జనించినయెడ దానిని అర్బుదంబను వ్యాధియని వచించెదరు. ఈ వ్యాధి సన్నిపాతముచే జనించుననియు సాధ్యంబనియు నెరుంగునది.

## నిమేష లక్షణము

శ్లో॥ నిమేషిణీస్సిరా వాయుః ప్రవిష్టస్సన్ధిసంశ్రయాః।
చాలయత్యక్షివర్త్మాని నిమేషం నామ తద్విదుః॥౯౩॥

తా॥ వాతము ప్రకుపితంబై కనురెప్పల లోభాగమునకును తెల్లగ్రుడ్డునకును నడుమనుండు సంధి నాశ్రయించి కనురెప్పలను చలింపజేయు సిరలయందు జేరి కనురెప్పలను మాటిమాటికి చలింపజేయును. ఇయ్యది నిమేషంబను వ్యాధియని యెరుంగునది. మరియు "ఉన్మేషణీస్సిరా వాయుః ప్రవిశ్య చావతిష్ఠతే। అత్యర్థం చాలయేద్వర్త్మ నిమేషస్స న సిధ్యతి॥" అని తంత్రాన్తరమున నుండుటంజేసి ఈ వ్యాధి వాతముచే జనించునదియనియు అసాధ్యంబనియు నెరుంగునది.

## రక్తార్శో లక్షణము

శ్లో॥ యస్థితో వర్త్మమధ్యేతు లోహితో మృదురఙ్కురః।
తద్రక్తజం శోణితార్శశ్ఛిన్నం ఛిన్నం ప్రవర్ధతే॥౯౪॥

తా॥ వర్త్మమధ్యమునందు రక్తవర్ణంబై మృదువైన మాంసాంకురము జనించి ఛేదించుచున్నను మాటిమాటికి యంకురించుచున్నయెడ శోణితార్శోవ్యాధియని యెరుంగునది. ఈ వ్యాధి రక్తముచే జనించును. మరియు "వాయుశ్శోణితమాదాయ సిరాణాం ప్రముఖే స్థితః।

జనయత్యఙ్కురం తామ్రం వర్త్మని ఛిన్నరోహణమ్। తచ్ఛోణితార్శోఽసాధ్యం స్యాత్ రక్తస్రావ్యథ నీరుజమ్॥'' అని విదేహుండు జెప్పెను. వాతము రక్తముతో జేరి సిరలయందు నిలిచి ఎఱ్ఱనై యుండు యంకురమును కల్గించును. అయ్యది మాటిమాటికి ఛేదింపబడినను మొలచుచుండును. దీనిని శోణితార్శస్సను నేత్రవ్యాధియని వచించెదరు. ఈ వ్యాధి బాధ లేకయే రక్తమును స్రవించుచు అసాధ్యంబై యుండునని భావము.

## నగణ లక్షణము

శ్లో॥ అపాకీ కఠినస్స్థూలో గ్రన్థిర్వర్త్మభవోఽరుజః।
నగణో నామ స వ్యాధిః లిఙ్గతః పరికీర్తితః॥౯౫॥

తా॥ పరిపక్వంబుగాక కఠినంబును స్థూలంబునైన గ్రంథి వర్త్మయందు జనించి బాధలేకున్నయెడ నగణంబను వ్యాధియని తెలియునది. మరియు ''వర్త్మోపరిష్టాద్యో గ్రన్థిః కఠినో న విపచ్యతే। నీరుజో నగణో నామ రోగశ్శ్లేష్మసముద్భవః॥'' అని తంత్రాన్తరమున నుండుటంజేసి ఈ వ్యాధి కఫముచే జనించునని యెఱుంగునది. ఈ వ్యాధి శ్లేష్మచే జనించినది గాన వేదనారహితంబై పక్వంబుగాక కఠినంబై యుండును.

## బిసవర్త్మ లక్షణము

శ్లో॥ త్రయో దోషా బహిశ్శోథం కుర్యుశ్ఛిద్రాణి వర్త్మనోః।
ప్రస్రవన్త్యన్తరుదకం బిసవద్బిసవర్త్మతత్॥౯౬॥

తా॥ వాతపిత్త శ్లేష్మములు మూడును ప్రకుపితంబులై రెప్పలో వెలిప్రక్క వాపును గల్గించి లోప్రక్క రంధ్రముల గల్గించును. ఆరంధ్రములనుండి తామరకాడల రంధ్రములలో నీరు కారువిధంబుగ జలము స్రవించుచుండును. ఈవ్యాధి బిసవర్త్మ యని చెప్పంబడును. మరియు ''బిసస్యాపాచితస్యేవ బహుమాంససిరాముఖమ్। బిసవర్త్మేతి జానీయాదశ్చికిత్స్యం త్రిదోషజమ్॥'' అని తన్త్రాన్తరమున నుండుటంజేసి ఈ వ్యాధి సన్నిపాతముచే జనించుననియు, అసాధ్యంబనియు నెఱుంగునది. తన్త్రాన్తరమునందు ''శూనం యద్వర్త్మ బహుభిః శ్లక్ష్ణైశ్ఛిద్రైస్సమన్వితమ్। వర్త్మాన్తరే బిసమివ బిసవర్త్మేతి తత్ స్మృతమ్॥'' అని యున్నది. కనురెప్పల పైభాగమున వాపుకల్గి లోప్రక్క తామరకాడలవలె మిక్కిలి సూక్ష్మంబులగు రంధ్రములతో గూడియున్నయెడ నయ్యది బిసవర్త్మయని చెప్పంబడునని భావము.

## కుఞ్చన లక్షణము

శ్లో॥ వాతాద్యా వర్త్మసఙ్కోచం జనయన్తి మలా యదా।
తదా ద్రష్టుం న శక్నోతి కుఞ్చనం నామ తద్విదుః॥౯౭॥

తా॥ వాతాదిదోషములు ప్రకుపితంబులై కనురెప్పల లోప్రక్కను ముడుచుకొనునట్లుజేయును; దానంజేసి చూచుటకు సాధ్యముగాకుండును. దీనిని కుఞ్చనంబను నేత్రవ్యాధియని వచించెదరు. ఈవ్యాధిలక్షణంబును, క్రిందజెప్పంబడు పక్ష్మశాతంబను వ్యాధిలక్షణంబును తన్త్రా

ష్టరములయందును సుశ్రుతమునందును గానంబడలేదు. మరియు సుశ్రుతమున జెప్పిన "ఏకవింశతిరిత్యేతే వికారా వర్త్మసంశ్రయాః" అను ఇరువదియొకసంఖ్యకు భంగము కల్గును గాన ఈ రెండును గణనీయంబులు గావు.

పక్ష్మకోప లక్షణము

శ్లో॥ ప్రచాలితాని వాతేన పక్ష్మాణ్యక్షి విశన్తి హి।
ఘృష్యన్త్యక్షి ముహుస్తాని సంరమ్భం జనయన్తి చ॥౯౮॥
అసితే సితభాగే చ మూలకోశాత్పతన్త్యపి।
పక్ష్మకోపస్స విజ్ఞేయో వ్యాధిః పరమదారుణః॥౯౯॥

తా॥ రెప్పవెండ్రుకలు వాతముచే చలింపబడి నేత్రమునం బ్రవేశించి కన్నుల నొరయుట చేత నేత్రమునందలి శుక్లకృష్ణమండలముల రొప్పియందును వాపును కల్గించును. ఇది మిగుల భయంకరమైన పక్ష్మకోపంబను వ్యాధియని యెరుంగునది. మరియు "పక్ష్మాశయగతా దోషాస్తీక్ష్ణాగ్రాణి ఖరాణి చ। నిర్వర్తయన్తి పక్ష్మాణి తైర్ఘృష్టంచాక్షి దూయతే। ఉత్పాటితైః పునశ్శాన్తిః పక్ష్మభిశ్చోపజాయతే। వాతాతపానలద్వేషీ పక్ష్మకోపస్స ఉచ్యతే॥" అని సుశ్రుతాచార్యుండు జెప్పెను. వాతాదిదోషములు మూడును కనురెప్పల నాశ్రయించి తీక్ష్ణాగ్రంబులును, కర్కశంబులునైన రెప్పవెండ్రుకలను కంటిలోపల బ్రవేశింపంజేయును. అవి యొరయుటచే కన్నులయందు మిక్కిలి బాధ కల్గును. అట్టి రెప్పవెండ్రుకలను వెలికిదీసినప్పుడు వేదన కొంచెము శమించియుండును. ఈవ్యాధి పక్ష్మకోపం బనంజను. ఈవ్యాధియందు గాలి, ఎండ, నిప్పు, వీనిని జూచుటకు సాధ్యము గాకుండునని భావము. ఈవాక్యముచే నీ వ్యాధి సన్నిపాతజనితంబని తెలియుచున్నది గాన ప్రకృతమూలమునందు "వాతేన" అను పదము చాలనక్రియార్థమై వేరుగ జెప్పబడినదియని యెరుంగునది. మరియు "పక్ష్మోపరోధో వాతేన కోపోఽన్తర్ముఖరోగవాన్। రోమ్ణోన్తర్ముఖైరన్యైరుపపక్ష్మస్తు త్రిభిః॥" అని కల్యాణవినిశ్చయమునందు ఉపపక్ష్మలక్షణము గానంబడియెడు. కనురెప్పలను లోప్రక్కబొబ్బకల్గి అన్తర్ముఖంబులైన రోమములతోఁగూడి నేత్రములను బాధించినచో నవ్యాధి ఉపపక్ష్మయను వ్యాధియనందగు. ఇవ్యాధి త్రిదోషములచే జనించునని భావము.

పక్ష్మశాత లక్షణము

శ్లో॥ వర్త్మపక్ష్మాశయగతం పిత్తం రోమాణి శాతయేత్॥
కణ్డూం దాహం చ కురుతే పక్ష్మశాతం తమాదిశేత్॥౧౦౦॥

తా॥ పిత్తము వర్త్మమునందును రెప్పవెండ్రుకల మొదళ్ల యందును జేరి దురదను, మంటను కల్గించి రెప్పవెండ్రుకల నూడించును. దీనిని పక్ష్మశాతంబను వ్యాధియని వచించెదరు. మరియు వాగ్భటాచార్యుండు "రోగాన్కుర్యుశ్చల స్తత్ర ప్రాప్య వర్త్మాశ్రయాస్సిరాః। సుప్తోత్థితస్య కురుతే వర్త్మస్తమ్భం సవేదనమ్। పాంసుపూర్ణాభనేత్రత్వం

కృచ్ఛ్రోన్మీలనమశ్రుచ। విమర్దనాత్స్వాచ్చ శమః కృచ్ఛ్రోన్మీలం వదన్తి తమ్॥''
అని కృచ్ఛ్రోన్మీలనలక్షణమును జెప్పెను. వాతము వర్త్మనాశ్రయించిన సిరలయందు జేరి నిదుర మేల్కాంచినప్పుడనే కనురెప్పలు స్తంభించి యుండుట, కన్నులయందు దుమ్మునిండిన విధంబుగ నుండుట, కన్నుల దెరచుటకు మిగుల కష్టమైయుండుట, కన్నీళ్లుగారుట, కన్నులను నలచినప్పుడు బాధ శమించియుండుట, ఇట్టి లక్షణముల గల్గించినయెడ కృచ్ఛ్రోన్మీలంబను వ్యాధియని భావము. ఇచ్చట '' దాహం చ కురుతే '' అనునట్టి చకారముచేత వాగ్భటోక్తకృచ్ఛ్రోన్మీలనమను వ్యాధిగూడ గ్రహించబడునని యెరుంగునది.

## నేత్రరోగ పరిగణనము

శ్లో॥ * * నవ సన్ధ్యాశ్రయాస్తేషు వర్త్మజాస్త్వేకవింశతిః।
శుక్లభాగే దశైకశ్చ చత్వారః కృష్ణభాగజాః
సర్వాశ్రయాస్సప్తదశ దృష్టిజా ద్వాదశైవ తు।
బాహ్యజౌ ద్వౌ సమాఖ్యాతౌ రోగౌ పరమదారుణౌ।
భూయ ఏతాన్ ప్రవక్ష్యామి సంఖ్యారూపచికిత్సితైః * *



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
నేత్రరోగ నిదానమ్
సమాప్తమ్



తా॥ నేత్రసంధుల నాశ్రయించిన రోగములు తొమ్మిది, వర్త్మల నాశ్రయించినవి యిరువదియొకటి, శుక్లమండలము నాశ్రయించినవి పదునొకండు, కృష్ణభాగము నాశ్రయించినవి నాల్గు, నేత్రమునందు సర్వము నాశ్రయించినవి పదునేడు, దృష్టినాశ్రయించినవి పండ్రెండు, ఆగంతుక నేత్రరోగములు రెండు, ఇవియన్నియు గలిసి నేత్రరోగములు (౭౬) డెబ్బదియారు అగునని యెరుంగునది.

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్ద సంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ గోత్రవిరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ విధేయ ''ఆయుర్వేదమార్తాణ్డ'' ''భిషఙ్మణి'' ''పణ్డిత'' గోపాలాచార్య విరచితంబైన నిదానదీపిక యను
మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు
నేత్రరోగ నిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# శిరోరోగనిదానమ్

నేత్రరోగనిదానమును జెప్పినపిదప కర్ణనాసికా నేత్రములకధిష్ఠానంబైన శిరస్సున జనించు రోగములయొక్క నిదానమును జెప్పుట.



## వాతాదులచేగల్గు శిరోరోగ భేదములు

శ్లో॥ శిరోరోగాస్తు జాయన్తే వాతపిత్తకఫైస్త్రిభిః।
సన్నిపాతేన రక్తేన క్షయేణ క్రిమిభిస్తథా॥
సూర్యావర్తానన్తవాతార్ధావభేదకశఙ్ఖకైః॥౧॥

తా॥ శిరోరోగములు వాత, పిత్త, కఫ, సన్నిపాత, రక్త, క్షయ, క్రిములచే జనించినవి యేడును, సూర్యావర్తంబును, అనన్తవాతంబును, అర్ధావభేదకంబును, శంఖకంబును జేరి పదునొకండు భేదములు కల్గియుండునని భావము. మరియు "సర్వ ఏవ శిరోరోగాస్సన్నిపాతసముత్థితాః। ఔత్కట్యాద్దోషలిఙ్గైస్తే కీర్తితాస్తద్విదా దశ॥" అని శాలాక్యతంత్రమున నున్నది గాన శిరోరోగములన్నియు సన్నిపాతముచే జనించినను వాతాదిదోషత్రయములో నేదోషము ప్రబలముగ నుండునో అట్టి దోషముచే నావ్యాధి జనించినదియని వ్యవహరించబడును గాన ప్రకృతమున "వాతపిత్తకఫైస్త్రిభిః" అను వాక్యమునకు దోషత్రయముచే జనించుననియు, అందు వాతాద్యాధిక్యమునుబట్టి వాతజత్వాది వ్యవహారము కల్గుననియు, "సన్నిపాతేన" అనుపదమునకు సమంబులుగ ప్రకుపితంబులైన దోషత్రయముచే జనించుననియు నర్థము. ఇచ్చట శిరోరోగమన శిరస్సున జనించు శూలరూపమైన వ్యాధియని భావము.

## వాతజశిరోరోగ లక్షణము

శ్లో॥ యస్యానిమిత్తం శిరసో రుజశ్చ
భవన్తి తీవ్రా నిశి చాతిమాత్రమ్।
బన్ధోపతాపైః ప్రశమశ్చ యత్ర
శిరోఽభితాపస్స సమీరణేన॥౨॥

తా॥ అభిఘాతాదికారణములు లేకయే తలనొప్పి కలిగి రాత్రులయందు మిగుల తీవ్రంబై వస్త్రాదులచే కట్టుగట్టినను, స్నేహస్వేదనాదిక్రియల జేసినను శమించినయెడ వాతముచే జనించిన శిరోరోగవని యెఱుంగునది. ఇచ్చట రాత్రులయందు శీతం బధికముగనుండుటంజేసి వాతము ప్రబలమై యుండును గాన శిరోరోగము అధికముగ నుండునని భావము.

## పిత్తజశిరోరోగ లక్షణము

శ్లో॥ యస్యోష్ణమఙ్గారచితం యథైవ
భవచ్ఛిరోధూప్యతి చాక్షినాసమ్।
శీతేన రాత్రౌ చ భవేచ్ఛమశ్చ
శిరోఽభితాపస్స తు పిత్తకోపాత్ ॥3॥

తా॥ శిరస్సు నిప్పుకణములచే గప్పబడినట్లు వేడిగల్గియుండుట, కన్నులయందు ముక్కులయందును పొగ నిండియున్నట్లుండుట, రాత్రులయందును, శీతోపచారముల జేసినప్పుడును శమించియుండుట, ఈలక్షణములు కల్గినది పిత్తముచే జనించిన శిరోరోగమని యెఱుంగునది. ఇచ్చట "శీతేన" అనునది యుపశయం (వ్యాధినివర్తనోపాయం) బనియెఱుంగునది.

## కఫజశిరోరోగ లక్షణము

శ్లో॥ శిరో భవేద్యస్య కఫోపదిగ్ధం
గురుప్రతిష్టబ్ధమథో హిమం చ।
శూనాక్షికూటం వదనం చ యస్య
శిరోఽభితాపస్స కఫప్రకోపాత్ ॥౪॥

తా॥ శిరస్సు కఫముచే నిండి మిగుల భారముకల్గి బంధించియుండి చల్లనై యుండుట. నాసామూలమున వాపుకల్గియుండుట, ఈలక్షణములుకల్గినని కఫప్రకోపముచే జనించిన శిరోరోగంబని యెఱుంగునది.

## సన్నిపాతజనిత శిరోరోగ లక్షణము

శ్లో॥ శిరోఽభితాపే త్రితయప్రవృత్తే
సర్వాణి లిఙ్గాని సముద్భవన్తి।

తా॥ సన్నిపాతముచే జనించిన శిరోరోగమునందు పై జెప్పబడిన వాతాది దోషత్రయలక్షణములన్నియు కల్గును. మరియు "వాతాచ్ఛూలం భ్రమః కమ్పః పిత్తాద్దాహో మదస్తృషా। కఫాద్గురుత్వం తన్ద్రాచ శిరోరోగే త్రిదోషజే" అని చరకాచార్యుండు జెప్పెను. సన్నిపాతముచే జనించిన శిరోరోగమునందు వాతముచేత వాపును, భ్రమయు, కంపంబును; పిత్తముచేత తాపంబును, మదంబును, దప్పియు; కఫముచేత శిరోభారంబును, కునికిపాటునుకల్గునని భావము.

## రక్తజశిరోరోగ లక్షణములు

శ్లో॥ రక్తాత్మకః పిత్తసమానలిఙ్గ
స్స్పర్శాసహత్వం శిరసో భవేచ్చ॥౫॥

తా॥ రక్తముచే జనించిన శిరోరోగమునందు పిత్తజశిరోరోగ లక్షణములు కల్గి హస్తముచే స్పృశించిన నోరువజాలకుండును.

## క్షయజశిరోరోగ లక్షణము

శ్లో॥ అసృగ్వసాశ్లేష్మసమీరణానాం
శిరోగతానామిహ సంక్షయేణ।
క్షయప్రవృత్తశ్శిరసోఽభితాపః
కష్టో భవేదుగ్రరుజోఽతిమాత్రమ్॥౬॥
సంస్వేదనచ్ఛర్దన ధూమనస్యై
రసృగ్విమోక్షైశ్చవివృద్ధిమేతి।

తా॥ శిరస్సునందుండు రక్తము, వస (క్రొవ్వు), శ్లేష్మము, వాతము, ఇవి యన్నియు నశించినప్పుడు దానంజేసి శిరోరోగము కల్గును. ఇది క్షయముచే జనించిన శిరోరోగమని యెరుంగునది. ఈ వ్యాధి మిగుల బాధనుగల్గించును గాన విక్కిలి కష్టంబై యుండును. మరియు నీవ్యాధియందు స్వేదనము, వమనము, ధూమము, నస్యము, రక్తమోచనము, ఈ క్రియల జేసినయెడ వృద్ధినొందును. ఇచ్చట స్వేదన ఛర్దన ధూమ నస్యములచేత కఫంబును, తీవ్రమైన ధూమము చేత వసయు, రక్తమోక్షణముచేత రక్తంబును క్షయమునొందును. రక్తాదిక్షయముచే జనించిన శిరోరోగమునందు "క్షీణా వర్ధయితవ్యాః" అను న్యాయము ననుసరించి క్షీణించిన రక్తాదుల వృద్ధినొందించుట యుక్తంబుగాన దానికి విరుద్ధముగ పైజెప్పిన స్వేదనాదిక్రియలచే రక్తాదులు క్షయించి వ్యాధిని వృద్ధి నొందించునని భావము. మరియు రక్తాదిక్షయముచే వ్యాధి వృద్ధి నొందుట వ్యాధి స్వభావముచే గల్గునని యెరుంగునది. మరియు నీవ్యాధిలక్షణము తన్త్రాన్తరమున నీరీతి గానంబడియెడు: "స్త్రీప్రసఙ్గాదభీఘాతాదథవా దేహకర్మణా। క్షిప్రం సఞ్జాయతే కృచ్ఛ్రః శిరోరోగః క్షయాత్మకః। వాతపిత్తాత్మకం లిఙ్గం వ్యామిశ్రం తత్ర లక్షయేత్॥" అని యున్నది. అధికముగ స్త్రీ సంభోగముజేయుట, అభిఘాతముకల్గుట, దేహపరిశ్రమజేయుట, ఈ కారణములచేత దేహమునందు రక్తాదులు నశించి శిరోరోగము కల్గును. దీనిని క్షయజనిత శిరోరోగంబని వచించెదరు. ఈ వ్యాధియందు వాతజపిత్తజ శిరోరోగములయొక్క లక్షణములు కలిసియుండునని భావము. మరియు క్షయముచే జనించు శిరోరోగలక్షణమును

విదేహుం డిట్లుగ నుడివెను: "శూన్యం భ్రమతి తుద్యేత శిరో విభ్రాన్తనేత్రతా। మూర్ఛా గాత్రావసాదశ్చ శిరోరోగే క్షయాత్మకే॥" క్షయముచే జనించిన శిరోరోగమునందు ఇతరవిషయముల నెఱుంగ నేరక శిరస్సు తిరుగుచుండుట, శిరస్సున పోటు పుట్టుట, కన్నులు తిరుగుచుండుట, మూర్ఛగల్గుట, అవయవములు శిథిలములై యుండుట, ఈ లక్షణము లన్నియు కల్గునని భావము.

## క్రిమిజశిరోరోగ లక్షణము

శ్లో॥ నిస్తుద్యతే యస్య శిరోఽతిమాత్రం
సమ్భక్ష్యమాణం స్ఫురతీవ చాన్తః॥౭॥
ఘ్రాణాచ్చ గచ్ఛేత్సలిలం సపూయం
శిరోఽభితాపః క్రిమిభిస్స ఘోరః।

తా॥ శిరస్సునందు సూదులబొడిచిన విధంబుగ పోటు, లోపల క్రిములచే తినబడు నట్లుండుట, శిరమునందంతర్భాగమున చలించునట్లుండుట ముక్కునుండి చీముతోగూడిన నీరు గారుట, ఈలక్షణములు కల్గినది క్రిములచే జనించిన శిరోరోగంబని యెఱుంగునది. ఇది మిగుల క్రూరంబై యుండును. మరియు శిరంబున క్రిములు జనించుటకు కారణముల వాగ్భటుం డివ్విధంబుగ జెప్పెను: "సంకీర్ణైర్భోజనైర్మూర్ధ్ని క్లేదితే రుధిరామిషే। కోపితే సన్నిపాతేన జాయన్తే మూర్ధ్ని జన్తవః। శిరసస్తే పిబన్తోఽస్రం ఘోరాః కుర్వన్తి వేదనాః॥" మధురాదిరసముల నొకటిగ జేర్చి భుజించుటచేత శిరమునందలి మాంసరక్తములు చెడి శిరస్సునందు క్రిములు జనించును. అట్టిక్రిములు శిరమునందలి రక్తమును పానముజేయుచు నానావిధవేదనల గల్గించునని భావము.

## సూర్యావర్త లక్షణము

శ్లో॥ సూర్యోదయం వా ప్రతిమన్దమన్దం
అక్షిభ్రువం రుక్సముపైతిగాఢమ్॥౮॥
వివర్ధతే చాంశుమతా సహైవ
సూర్యాపవృత్తౌ వినివర్తతే చ।
సర్వాత్మకం కష్టతమం వికారం
సూర్యాపవర్తం తముదాహరన్తి॥౯॥

తా॥ సూర్యోదయకాలమున కంటియందును కనుబొమయందు నొప్పికల్గి సూర్యుండు వృద్ధినొందునప్పుడు తదనుసారముగ నప్పటికప్పటికి మెల్లమెల్లగ వృద్ధినొంది మధ్యాహ్నకాలమున మిక్కుటమై పిదప సూర్యుని తీక్ష్ణత్వము క్రమక్రమముగ తగ్గుచుండ నొప్పియు కొంచెము కొంచెముగ తగ్గి సూర్యాస్తమయమునకు నిశ్శేషముగ శమించును. దీనిని సూర్యాపవర్తంబను

వ్యాధియని వచించెదరు. ఈవ్యాధి సన్నిపాతముచే జనించును గాన మిగులకష్టసాధ్యంబై యుండు నని యర్థము. మరియు "శీతేన శాన్తిం లభతే కదాచిదుష్ణేన జన్తుస్సుఖమాప్నుయాచ్చ। తం భాస్కరావర్తముదాహరన్తి సర్వాత్మకం కష్టతమం వికారమ్॥" అని సుశ్రుతమున నుండుటంజేసి ఈవ్యాధి శీతస్పర్శముచే నొకప్పుడు శమించుననియు, ఉష్ణస్పర్శముచే మరియొకప్పుడు శమించుననియు నెరుంగునది. పైజెప్పిన కాలనియమమునకు కారణములు గ్రన్థాన్తరమున నిట్లు వివిధంబుగ గానంబడియెడు: "సూర్యసోమాత్మకౌ నిత్యం స్వహేతూ పిత్తమారుతౌ। కుర్వాతే వేదనాం తీవ్రాం దినాభ్యావార్ధ్వాష్ట ఏవ తు। ఆదిత్యతేజసా యుక్తే వివృద్ధేఽపి చ భాస్కరే। స్రోతాంసి విస్తృతత్వాచ్చ తతశ్శ్లేష్మాధిగచ్ఛతి। ఉద్ధతో మారుతశ్చాపి చ స్వమార్గం ప్రతిపద్యతే। తస్మాన్మధ్యన్దినాదూర్ధ్వం వేదనాత్ర ప్రశామ్యతి॥" పిత్తము సూర్యాత్మకంబును వాతము సోమాత్మకంబునై యుండును గాన మధ్యాహ్నకాలమునకు మునుపు సూర్యునితాపముచేత పిత్తము వృద్ధినొంది మిక్కిలి తీవ్రంబగు వేదననుగల్గించును. మధ్యాహ్నమునకు పిదప సూర్యుని తేజస్సు తగ్గుటచేత శ్లేష్మము వృద్ధినొందును. స్రోతస్సులు తెరవబడినమార్గములు గల్గియుండును. దానంజేసి వాతము బైలువెడలి స్వమార్గమున జేరును గాన వేదన శమించునని యర్థము. ఈవాక్యమునకు సూర్యావర్తము సన్నిపాతముచే జనించినను వాతపిత్తములు రెండును మిక్కిలి అధికముగనుండునని యర్థము. మరియు సూర్యావర్తవిపర్యయమను శిరోరోగమును విదేహుం డివ్విధముగ జెప్పెను: "తత్ర వాతానుగం పిత్తం చితం శిరసి తిష్ఠతి। మధ్యాహ్నే తేజసార్కస్య తద్వివృద్ధం శిరోరుజమ్। కరోతి పైత్తికీం ఘోరాం సంశామ్యతి దినక్షయే। అస్తం గతే ప్రభాహీనే సూర్యే వాయుర్వివర్ధతే। పిత్తం శాన్తిమవాప్నోతి తతశ్శామ్యతి వేదనా। ఏష పిత్తానిలకృతః సూర్యావర్తవిపర్యయః॥" పిత్తము వాతముతో గలిసి శిరంబుననుండి మధ్యాహ్నకాలమున సూర్యునియొక్క తేజస్సుచేత వృద్ధినొంది పిత్తసంబంధమై మిగుల ఘోరంబగు తలనొప్పిని కల్గించును. సూర్యుం డస్తమించినప్పుడు వాతము వృద్ధినొంది పిత్తము శాన్తినొందును గాన వేదన శమించును. ఇయ్యది వాతపిత్తములచే జనించిన సూర్యావర్తవిపర్యయంబను వ్యాధియని భావము.

## అనన్తవాత లక్షణము

శ్లో॥ దోషాస్తు దుష్టాస్త్రయ ఏవ మన్యాం
సంపీడ్య ఘాటాసు రుజాం సుతీవ్రామ్।
కుర్వన్తి మోఽక్షిభ్రువి శఙ్ఖదేశే
స్థితిం కరోత్యాశు విశేషతస్తు॥౧౦॥
గణ్డస్య పార్శ్వే తు కరోతి కమ్పం
హనుగ్రహం లోచనజాంశ్చ రోగాన్।

అనన్తవాతం తముదాహరన్తి
దోషత్రయోత్థం శిరసో వికారమ్॥౧౧॥

తా॥ వాతపిత్తశ్లేష్మములు గూడుకొని దుష్టంబులై కంఠమునందలి మన్యయను సిరల రెండిటిని పీడించి కంఠమునకు వెనుకప్రక్క మిగుల తీవ్రంబైన బాధను గల్గించును. మరియు కన్నులయందును కనుబొమలయందును కణతలయందును విశేషముగ బాధను గల్గించును. గండపార్శ్వము నందు కంపమును కల్గించును, హనుగ్రహవాతమును, నేత్రజనితంబులగు నానావిధరోగములను గల్గించును. దీనిని అనన్తవాతంబను క్రూరమైన శిరోరోగమని వచించెదరు. ఈ వ్యాధి సన్నిపాతముచే జనించును.

## అర్ధావభేదక లక్షణము

శ్లో॥ రూక్షాశనాత్యధ్యశనప్రాగ్వాతావశ్యాయమైథునైః।
వేగసన్ధారణాయాసవ్యాయామైః కుపితోఽనిలః॥౧౨॥
కేవలస్సకఫోవాఽర్ధం గృహీత్వా శిరసో బలీ।
మన్యాభ్రూశఙ్ఖకర్ణాక్షిలలాటార్ధేఽతి వేదనామ్॥౧౩॥
శస్త్రారణినిభాం కుర్యాత్ తీవ్రాం సోఽర్ధావభేదకః।
నయనం వాఽథవా శ్రోత్రమతివృద్ధో వినాశయేత్॥౧౪॥

తా॥ మిగుల రూక్షంబులగు పదార్థముల భుజించుట, అజీర్ణముగనున్నపుడు భుజించుట, అధికముగ భుజించుట, తూర్పుగాలిని సేవించుట, మంచునతడియుట, అధికముగ స్త్రీసంభోగము జేయుట, మలమూత్రముల వేగమును నిరోధించుట, దేహమునకు శ్రమగల్గించు పనుల జేయుట, దేహపరిశ్రమము జేయుట, ఈ కారణములచేత కేవలవాతంబైనను, కఫముతోగూడిన వాతంబైనను ప్రకోపమునొంది శిరస్సున సగపాలునంజేరి మన్యయను సిరలు, కనుబొమలు, కణతలు, చెవులు, కన్నులు, నుదురు, వీనియొక్క సగపాలునందు శస్త్రములచే ఛేదించినవిధంబుగను, మథించినవిధంబుగను, మిగుల తీవ్రంబైన బాధను గలిగించును. ఇట్టిది అర్ధావభేదకంబను శిరోరోగమని యెరుంగునది. ఈవ్యాధికింపగిన చికిత్సజేయక యుపేక్షించినయెడ మిక్కిలి వృద్ధినొంది యొక కన్నునైనను చెవినైనను చెరచును. మరియు సుశ్రుతుండు "యస్యోత్తమాఙ్గం రుజతేఽర్ధమాత్రం సతోదభేద భ్రమ మోహశూలైః। పక్షాద్దశాహాదథవాఽప్యకస్మాత్ స్యాదర్ధభేదం త్రితయాద్వ్యవస్యేత్॥" అని చెప్పెను. శిరస్సులో నర్ధభాగమునందు పోటు, నొప్పి, భ్రమను, మోహము, శూల, ఈ బాధలు కల్గి ఒక పక్షమువరకైనను పదినాళ్లవరకైనను ఆకస్మికముగ బాధకల్గియున్నయెడ అర్ధావభేదంబను శిరోరోగమని యెరుంగునది. ఈవ్యాధి సన్నిపాతముచే జనించునని భావము. ఈ వాక్యమునుబట్టి యీవ్యాధి సన్నిపాతముచే జనించునని తెలియుచున్నది గాన ప్రకృతగ్రంథమునందు "కేవలస్సకఫోవాఽర్ధం" అను పదమునకు కేవలవాతమైనను, కఫముతోగూడిన వాతమైనను ప్రబలముగ నుండునని భావము. "తథా త్ర్యహాత్స పక్షాహాత్సపక్షాన్మాసాచ్చ దేహినామ్" అని విదే

హుండు చెప్పెను. ఈవ్యాధి మూడునాళ్లవరకైనను, ఐదుదినములవరకైనను, పదునైదుదినముల వరకైనను అనుసరించియుండునని భావము. ఇట్టి కాలనియతి వ్యాధిస్వభావముచే గల్గునని యెరుంగునది.

శంఖక లక్షణము

శ్లో॥ రక్తపిత్తానిలా దుష్టాశ్శఙ్ఖదేశే విమూర్ఛితాః।
తీవ్రరుగ్దాహరాగం హి శోథం కుర్వన్తి దారుణమ్॥౧౫॥
స శిరో విషవద్వేగీ నిరుధ్యాశు గలం తథా।
త్రిరాత్రాజ్జీవితం హన్తి శఙ్ఖకో నామతః పరమ్।౧౬॥
త్ర్యహాజ్జీవతి భైషజ్యం ప్రత్యాఖ్యాయ సమాచరేత్।



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
శిరోరోగనిదానం సమాప్తమ్



తా॥ రక్తము, పిత్తము, వాతము, ఈ మూడును దుష్ప్రకోపాదులచే దుష్టంబులై కణతలయందు వృద్ధినొంది తీవ్రంబైన నొప్పియు, మంటయు, రక్తవర్ణంబునుకల వాపును కల్గించును. ఈవ్యాధి విషమునుబోలె వేగముతోగూడి శిరంబున వ్యాపించి కంఠబిలము నడ్డగించి మూడు రాత్రులలోపల ప్రాణముల హింపించును. ఈవ్యాధి శంఖకమను శిరోవ్యాధియని యెరుంగునది. మూడురాత్రులలోగా అసాధ్యంబని చెప్పి వైద్యుండు చికిత్సజేయవలెను. ఇట్లు చెప్పుటచేత త్రిరాత్రమునకు లోపల నొకవేళ సాధింపంబడగియుండుననియు, పిమ్మట సాధ్యంబై యుండుననియు భావము. మరియు “శంఖాశ్రితో వాయురుదీర్ణవేగః కృతానుతాపః కఫపిత్తరక్తైః” అని సుశ్రుతమున నుండుటంజేసి వాతము కఫపిత్తరక్తములతోగూడి శంఖకమను వ్యాధిని కల్గించునని తెలియునది. మరియు “చీయతే తు యదా పిత్తం శఙ్ఖయో రనిలాచితమ్। నిరుణద్ధి తతో మర్మ పరిపూరిత ముల్బణమ్। తతశ్శఙ్ఖౌ ప్రయుజ్యేత దహ్యేత ఇవ వహ్నినా। సూచీభిరివ తుద్యేతే నికృత్యేతే ఇవాసినా। శంఖకో నామ శిరసి వ్యాధిరేష స్సుదారుణః। తృష్ణామూర్ఛాజ్వరకర స్త్రిరాత్రాత్పరమన్తకృత్। కుశలేన హ్యుపక్రాన్త స్త్రిరాత్రాదేవ జీవతి॥” అని విదేహుండు వచించెను. పిత్తము వాతముతోగలసి కణతలరెండియందును జేరి మిక్కిలి వృద్ధినొంది శంఖమర్మములయందు పరిపూర్ణముగ వ్యాపించి యడ్డగించి యుండును. దానంజేసి కణతలయందు నిప్పునకాల్చిన విధంబుగను, సూదులతోబొడిచినరీతిగను, కత్తితో ఛేదించిన భంగియు బాధ కల్గును. దీనిని శంఖకంబను శిరోవ్యాధియని వచించెదరు. ఈ వ్యాధియందు దప్పియు,

మూర్ఛయు, జ్వరంబును, కల్గును. మూడురాత్రులలో ప్రాణముల హింసించును. మూడు రాత్రులు గడచిన పిదప సమర్థుండగు వైద్యుండు చికిత్సజేసినయెడ సాధ్యంబగునని భావము.

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రిచర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానాన్ధ్ర తాత్పర్యమునందు
శిరోరోగ నిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీరస్తు

# అసృగ్దర నిదానమ్



ఇవ్విధంబుగ స్త్రీపురుషసాధారణంబులగు రోగములయొక్క నిదానమును జెప్పి పురుషులకు మాత్రము జనించు ఉపదంశంబను వ్యాధినిదానము మున్ను జెప్పంబడినది గాన అవ్విధంబుగనే స్త్రీలకు మాత్రము కల్గు యోనివ్యాపత్తనువ్యాధినిదానమును జెప్పందలంచి అందును ఆర్తవ ప్రవృత్తి విశేషముగ కల్గును గాన ముందుగ దుష్టార్తవప్రవృత్తిరూపంబగు రక్తప్రదరంబను వ్యాధి యొక్క నిదానమును జెప్పుట.



శ్లో॥ విరుద్ధమద్యాధ్యశనాదజీర్ణా
ద్గర్భప్రపాతాదతిమైథునాచ్చ।
యానాధ్వశోకాదతికర్షణాచ్చ
భారాభిఘాతాచ్ఛయనాద్దివా చ॥౧॥
తం శ్లేష్మపిత్తానిలసన్నిపాతై
శ్చతుఃప్రకారం ప్రదరం వదన్తి॥

తా॥ పరస్పరవిరుద్ధంబులగు క్షీరమత్స్యాదుల భుజించుట, మద్యపానము జేయుట, జీర్ణ మూగాకుండునపుడు భుజించుట, పక్వముగాని వస్తువులను భుజించుట, గర్భస్రావముకల్గుట, అధికముగ సంభోగము జేయుట, గుఱ్ఱములు మొదలగువానిపైనెక్కి తిరుగుట, అధికముగ త్రోవనడచుట, దుఃఖము, ఉపవాసాదులచే ధాతువులు నశించుట, బరువునుమోచుట, అభిఘాతము కల్గుట, పవటియందు నిదురించుట, ఇట్టి కారణములచేత వాతాదిదోషములు ప్రకుపితంబులై రక్తప్రదరంబను వ్యాధిని కల్గించును. ఈ వ్యాధి వాతపిత్తకఫ సన్నిపాతభేదములచే నాల్గువిధంబులై యుండును.

## రక్తప్రదరసామాన్య లక్షణము

శ్లో॥ అసృగ్దరం భవేత్సర్వం సాఙ్గమర్దం సవేదనమ్॥౨॥
తస్యాతివృత్తౌ దౌర్బల్యం భ్రమో మూర్ఛా మదస్తృషా।
దాహః ప్రలాపః పాణ్డుత్వం తన్ద్రా రోగాశ్చ వాతజాః॥౩॥

తా॥ రక్తప్రదరము లన్నిటియందును ఒడలినొప్పియును, శూలంబును, నియతముగ కల్గును. అట్టిరక్తము మిక్కిలి అధికముగ స్రవించినయెడల బలహీనము, ఒడలుతిరుగుట, మూర్ఛ, దప్పి, మంట, ప్రలాపము, పాండుత్వము, కునికిపాటు, ఈ లక్షణంబులును; వాతముచే జనించు సకలవ్యాధులును కల్గును. మరియు అసృగ్దరస్వరూపము తన్త్రాన్తరమున నిర్విధంబుగ గానంబడియెడు: “తదేవాతి ప్రసంగేన ప్రవృత్త మనృతావపి। అసృగ్దరం విజానీయాత్పగస్త్రా దుక్తలక్షణమ్॥” ఋతురక్తము ఋతుకాలముకానిసమయమునం దధికముగ పలుమారు స్రవించినయెడ రక్తప్రదరంబను వ్యాధియని భావము. “అసృక్ దీర్యతే అస్మిన్నితి అసృగ్దరమ్” అను వ్యుత్పత్తిచేత రక్తము స్రవించునదియే అసృగ్దరమని అన్వర్థము నెరుంగునది.

## కఫజరక్తప్రదర లక్షణము

శ్లో॥ ఆమం సపిచ్ఛాప్రతిమం సపాండు
పులాకతోయప్రతిమం కఫాత్తు।

తా॥ పక్వముగాని రసముతోగూడి బూరుగచెట్టు మొదలగు చెట్లయొక్క బంకవలె పాండువర్ణంబైనను, మాంసమును కడిగిన నీటిరంగైనను కల్గిన రక్తము స్రవించినయెడ కఫముచే జనించిన రక్తప్రదరమని యెరుంగునది.

## పిత్తజరక్తప్రదర లక్షణము

శ్లో॥ సపీతనీలాసితరక్తముష్ణం
పిత్తార్తియుక్తం భృశమేతి పిత్తాత్ ॥౪॥

తా॥ పీతవర్ణంబైనను నీలవర్ణంబైనను రక్తవర్ణంబైనను కల్గి ఉష్ణంబై పిత్తముచే జనించిన పోటు మొదలగు బాధలతోగూడి రక్తము అధికముగ స్రవించినయెడ పిత్తముచే జనించిన ప్రదరమని తెలియునది.

## వాతజరక్తప్రదర లక్షణము

శ్లో॥ రూక్షారుణం ఫేనిలమల్పమల్పం
వాతార్తి వాతాత్పిశితోదకాభమ్।

తా॥ రూక్షంబును, అరుణవర్ణంబై నురుగుతోగూడి మాంసమును కడిగిన నీళ్లవలె నుండు రక్తము స్రవించుచు వాతముచే జనించు బాధలు కల్గినయెడ వాతముచే జనించు రక్తప్రదరంబని యెరుంగునది.

## సన్నిపాతజరక్తప్రదర లక్షణము

శ్లో॥ సక్షౌద్రసర్పిర్హరితాలవర్ణం
మజ్జాప్రకాశం కుణపం త్రిదోషాత్ ॥౫॥
తచ్చాప్యసాధ్యం ప్రవదన్తి తజ్ఞాః
న తత్ర కుర్వీత భిషక్చికిత్సామ్।

తా॥ తేనె నెయ్యి హరిదళము వీనియొక్క చాయలు గల్గి మజ్జ (మూలగ) వలె చిక్కనై పీనుగవలె దుర్గంధముతోఁగూడిన రక్తము స్రవించినయెడ సన్నిపాతముచే జనించిన అసృగ్దరంబని యర్థము. ఈ యసృగ్దరము మిగుల నసాధ్యంబై యుండును గాన వైద్యునిచే చికిత్స జేయంజనదు.

## అసాధ్యరక్తప్రదర లక్షణము

శ్లో॥ శశ్వత్స్రవన్తీ మాస్రావం తృష్ణాదాహజ్వరాన్వితామ్॥౬॥
క్షీణరక్తాం దుర్బలాం చ తామసాధ్యాం వినిర్దిశేత్।

తా॥ దప్పియు, జ్వరంబును కల్గి మాటిమాటికి రక్తము స్రవించుచున్నను, రక్తము క్షీణంబై బలహీనంబై యున్నను, అట్టి రక్తప్రదరము మిక్కిలి యసాధ్యంబై యుండునని భావము.

## నిర్దుష్టార్తవ లక్షణము

శ్లో॥ మాసాన్నిష్పిచ్ఛదాహార్తి పఞ్చరాత్రానుబన్ధి చ ॥౭॥
నైవాతి బహులాత్యల్పమార్తవం శుద్ధమాదిశేత్।
శశాసృక్ప్రతిమం యచ్చ యద్వా లాక్షారసోపమమ్॥౮॥
తదార్తవం ప్రశంసన్తి యచ్చాప్సు న విరజ్యతే।



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
అసృగ్దర నిదానం సమాప్తమ్



తా॥ పిచ్ఛిలంబుగాక మంటయు నొప్పియు లేక మిక్కిలి యధికంబును స్వల్పంబును గాక సమమైన పరిమితికల్గి ఒకమాసమునకు ఐదుదినములు అనుసరించి స్రవించురక్తము పరిశుద్ధంబైన ఋతురక్తమని చెప్పందగును. మరియు కుందేటినెత్తురును బోలినదైనను, లత్తుకనుబోలినదైనను రక్తవర్ణంబై ఋతుశోణితము వస్త్రమున నంటినపుడు జలమున కడిగినయెడ జలము రక్తవర్ణము గాకుండెనేని అట్టి యార్తవము పరిశుద్ధంబై దోషరహితంబై యుండునని వచించెదరు. మరియు ఆర్తవము స్వల్పముగ స్రవించునెడ "స్త్రీణామృతుర్భవతి షోడశవాసరాణి" అను వచనమునుబట్టి ఐదునాళ్లకు పిమ్మటగూడ ఋతుకాల మున్నదిగాన అంతవరకు అనుసరించి యుండునని యెరుంగునది. మరియు "సురేన్ద్రగోప సఙ్కాశం స్నిగ్ధం చ మధుగన్ధి చ। అపిచ్ఛిలమశీతం చ యద్వాసో న విరఞ్జయేత్॥" అని తన్త్రాన్తరమున నున్నది. వర్షాకాలసూచకంబులైన ఇంద్రగోపంబులను పురుగులబోలి రక్తవర్ణంబును

స్నిగ్ధంబును, మద్యమువంటి పరిమళము కల్గినదియునై పిచ్ఛిలంబును మిగుల శీతలంబునుగాక వస్త్రమును రక్తవర్ణముగ జేయునదగు ఆర్తవము నిర్దుష్టంబైనది యని భావము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్ద సంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానాంధ్రతాత్పర్యమునందు

అసృగ్దర నిదానము

సమాప్తము





శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# యోనివ్యాపన్నిదానమ్



దుష్టార్తవనిదానమును జెప్పి పిమ్మట దుష్టార్తవముచే జనించు స్త్రీమాత్రసాధారణంబైన యోనివ్యాపత్తుయొక్క నిదానమును జెప్పుట.



## యోనివ్యాపత్ సంఖ్యాది నియమము

శ్లో॥ వింశతిర్వ్యాపదో యోనౌ నిర్దిష్టా రోగసఙ్గ్రహే।
మిథ్యాచారేణ తాః స్త్రీణాం ప్రదుష్టేనార్తవేన చ॥౧॥
జాయన్తే బీజదోషాచ్చ దైవాచ్చ శ్రుణు తాః పృథక్।

తా॥ యోనివ్యాపత్తు ఇరువదివిధంబులని రోగసంగ్రహమునందు జెప్పంబడియె. అవియన్నియు అపథ్యంబులైన ఆహారవిహారాదులచేతనున్ను, దుష్టంబైన యార్తవముచేతనున్ను, తలిదండ్రులయొక్క శుక్రశోణితదోషముచేతనున్ను, పూర్వజన్మమున జేసిన పాపశేషముచేతనున్ను కల్గును. వాని లక్షణములను వేర్వేరుగ జెప్పెదనని భావము.

## ఉదావర్తా లక్షణము

శ్లో॥ సా ఫేనిలముదావర్తా రజః కృచ్ఛ్రేణ ముఞ్చతి ॥౨॥

తా॥ యోనిద్వారమునుండి నురుగుతోగూడిన ఆర్తవము మిక్కిలి కష్టముచే వెడలినయెడ ఉదావర్తంబను యోనివ్యాపత్తని యెరుంగునది. ఈ వ్యాధియందు వాతము ఊర్ధ్వముగ వెడలి సంచరించును గాన ఉదావర్తంబన జను.

## వంధ్యావిప్లుతా లక్షణములు

శ్లో॥ వన్ధ్యాం నష్టార్తవాం విద్యాద్విప్లుతాం నిత్యవేదనామ్।

తా॥ ఆర్తవము నశించి సంతానముగల్గకున్నయెడ వంధ్యయనియు, ఎల్లప్పుడును వాతప్రకోపముచే గల్గు వేదనచే వ్యాప్తంబై యున్నయెడ విప్లుతమను యోనివ్యాపత్తనియు తెలియునది. ఈ వ్యాధియందు వాతముచే జనించు వేదన యెల్లప్పుడును వ్యాపించి యుండును గాన విప్లుతమనంజనును.

## పరిప్లుతా లక్షణము

శ్లో॥ పరిప్లుతాయాం భవతి గ్రామ్యధర్మేణ రుగ్భృశమ్ ॥3॥

తా॥ పరిప్లుతంబను యోనివ్యాపత్తునందు సంభోగమును జేయునప్పుడు మిగుల బాధ జనించును. ఈవ్యాధియందు యోనియందంతట వాతము వ్యాపించి యుండును గాన పరిప్లుతమనంబడును.

వాతలా లక్షణము

శ్లో॥ వాతలా కర్కశా స్తబ్ధా శూలనిస్తోదపీడితా।

తా॥ మిగులకర్కశంబై కఠినముగ నున్నయెడ వాతల యను యోనివ్యాపత్తని యెరుంగునది. ఈ వ్యాధియందు వాతముచే గల్గు బాధలు విశేషముగ నుండును.

శ్లో॥ చతసృష్వపి చాద్యాసు భవ న్త్యనిలవేదనాః ॥౪॥

తా॥ పైనజెప్పిన ఉదావర్తా, వంధ్యా, విప్లుతా, పరిప్లుతా, అను నాల్గుయోనివ్యాపత్తుల యందును వాతముచే జనించు వేదనలు కల్గును. పైనజెప్పబడినవి యైదును వాతముచే గల్గు యోనివ్యాపత్తులని భావము.

లోహితక్షయా లక్షణము

శ్లో॥ సదాహం క్షీయతే రక్తం యస్యాం సా లోహితక్షయా।

తా॥ రక్తము అధికముగ స్రవించుటచేత యోనియందు విశేషముగ మంటకల్గి రక్తము నశించును. దీనిని లోహితక్షయంబను యోనివ్యాపత్తని యెరుంగునది.

వామిని లక్షణము

శ్లో॥ సవాతముద్గిరేద్బీజం వామినీ రజసా యుతమ్ ॥౫॥

తా॥ వాతముతోగూడి రజోయుక్తంబైన శుక్రము యోనినుండి బైలు వెడలినయెడ వామిని యను యోనివ్యాపత్తని యెరుంగునది.

స్రంసినీ పుత్రఘ్నీ లక్షణములు

శ్లో॥ ప్రస్రంసినీ స్రంసతే చ క్షోభితా దుఃప్రజాయినీ।
స్థితం స్థితం హన్తి గర్భం పుత్రఘ్నీ రక్తసంక్షయాత్ ॥౬॥

తా॥ వాతముచే పీడితంబై మిగుల కష్టముగ ప్రసవించునదియై స్వస్థానమునుండి రక్తమును స్రవించునది ప్రస్రంసినియను యోనివ్యాపత్తని యెరుంగునది. గర్భము మాటిమాటికి నిలచి పలుమారు జారి పడిపోవునెడ పుత్రఘ్నియను యోనివ్యాపత్తని యెరుంగునది. ఈ వ్యాధి రక్తక్షయముచే గల్గును.

పిత్తలా లక్షణము

శ్లో॥ అత్యర్థం పిత్తలా యోనిర్దాహపాక జ్వరాన్వితా।
చతసృష్వపి చాద్యాసు పిత్తలిఙ్గోచ్ఛ్రయో భవేత్ ॥౭॥

తా॥ తాపంబును, పాకంబును, జ్వరంబును కల్గినయెడ పిత్తలయను యోనివ్యాపత్తని యెరుంగునది. అందు లోహితక్షయా, వామినీ, స్రంసిని, పుత్రఘ్నియను నాల్గు యోనివ్యాపత్తుల

యందును. పిత్తముచే జనించు ఓషచోషాది వేదనలు విశేషముగ జనించును. పై జెప్పిన యోనివ్యాపత్తులైదును పిత్తప్రకోపముచే జనించును. మరియు "వ్యాపల్లక్షణ కట్వమ్లతీక్ష్ణాద్యైః పిత్తజా భవేత్। దాహపాకజ్వరోష్ణార్తా నీలపీతాసితార్తవా॥" అని తన్త్రాన్తరమున నున్నది. పిత్తముచే జనించు యోనివ్యాపత్తులైదిటియందు పై జెప్పిన ఆయా లక్షణంబులతో గూడి, కారము, పులుపు, ఉప్పు, అను నీరసములు బుతురక్తమున కల్గి మంట, పుండగుట, జ్వరము, ఈయుపద్రవములచే పీడించబడి, నీలవర్ణంబును, పీతవర్ణంబును, నల్లనిరంగును కల రక్తము స్రవించునని భావము.

## కఫజయోనివ్యాపల్లక్షణములు

శ్లో॥ అత్యానందా న సన్తోషం గ్రామ్యధర్మేణ గచ్ఛతి।
కర్ణిన్యాం కర్ణికా యోనౌ శ్లేష్మాసృగ్భ్యాం ప్రజాయతే॥ ౮॥
మైథునేఽచరణా పూర్వం పురుషాదతిరిచ్యతే।
బహుశశ్చాతిచరణా తయోర్బీజం న విన్దతి॥ ౯॥
శ్లేష్మజా పిచ్ఛిలా యోనిః కణ్డూగ్రస్తాఽతిశీతలా।
చతసృష్వపిచాద్యాసు శ్లేష్మలిఙ్గోచ్ఛ్రయో భవేత్॥ ౧౦॥

తా॥ మైథునముచే సంతోషము కల్గకున్నయెడ అత్యానంద యను యోనివ్యాపత్తనియు, కఫరక్తములచేత యోనిముఖ్యమునందు మాంసగ్రంథి జనించినయెడ కర్ణిని యను యోనివ్యాపత్తనియు, సంభోగకాలమున పురుషునికన్న మున్ను స్త్రీ మైథునక్రియనుండి విరమించుకున్నయెడ అచరణయనియు, పురుషునికన్న దీర్ఘకాలము మైథునేచ్ఛగల్గియున్నయెడ అతిచరణయనియు, యోని జిగటకల్గి మిక్కిలి దురదతోగూడి శీతలంబై యున్నయెడ శ్లేష్మల యను యోనివ్యాపత్తనియు నెరుంగునది. అందు అచరణ అతిచరణ యను యోనివ్యాపత్తుల రెంటియందును పుత్రోత్పాదక బీజము నిలువదు. పై జెప్పిన అత్యానన్ద, కర్ణిని, అచరణ, అతిచరణ, అనునట్టి యోనివ్యాపత్తుల నాల్గిటియందును కఫముచే జనించు దురద మొదలగు వేదనలు విశేషముగ నుండును. "కఫోఽభిష్యన్దిభిర్వృద్ధో యోనిం చేద్దూషయేత్ స్త్రియాః। స కుర్యాత్పిచ్ఛిలాం శీతాం కణ్డూగ్రస్తాం స వేదనామ్।" అని తన్త్రాన్తరమున నున్నది. స్రోతస్సులయందు స్రవమును పుట్టించు పదార్థముల సేవించుటచేత కఫము వృద్ధినొంది స్త్రీయొక్క యోనిని దుష్టముగ జేసినచో యోని మిక్కిలి పిచ్ఛిలంబై చల్లనైయుండి దురదయు వేదనయు అధికముగ నుండునని భావము.

## సన్నిపాతజనితయోని వ్యాపల్లక్షణము

శ్లో॥ అనార్తవాఽస్తనీ షణ్ఢీ ఖరస్పర్శా చ మైథునే।
అతికాయగృహీతాయాస్తరుణ్యాస్త్వణ్డలీ భవేత్॥ ౧౧॥
వివృతా చ మహాయోనిః సూచీవక్త్రాఽతిసంవృతా।
సర్వలిఙ్గసముత్థానా సర్వదోషప్రకోపజా॥ ౧౨॥

చతస్రష్వపిచాద్యాసు సర్వలిఙ్గోచ్ఛ్రయో భవేత్।
పఞ్చాసాధ్యా భవన్తీహ యోనయస్సర్వదోషజాః॥ ౧౩॥



ఇతి శ్రీమాధవకరవిరచితే మాధవనిదానే
యోనివ్యాపన్నిదానమ్
సమాప్తమ్



తా॥ ఋతుమతిగాక స్తనములు జనించకుండి సంభోగకాలమున యోని మిగులకర్కశంబై యున్నయెడ షండి యను యోనివ్యాపత్తనియు, గొప్పదండముకల పురుషునితో సంభోగించుటంజేసి గ్రుడ్డువలె యోనిద్వారమునుండి బైలువెడలినయెడ అండలి యను యోనివ్యాపత్తనియు, యోనిద్వారము గొప్పదియైయున్నయెడ మహతి యనియు, యోనిద్వారము మిక్కిలి స్వల్పముగనున్నయెడ సూచీవక్త్రింబను యోనివ్యాపత్తనియు, త్రిదోషప్రకోపముచే జనించి త్రిదోషలక్షణములతో గూడి యుండునది సర్వజయను యోనివ్యాపత్తనియు నెరుంగునది. అందు షణ్ఢీ, అండలీ, మహతీ, సూచీవక్త్రి, అను యోనివ్యాపత్తుల నాల్గిటియందును త్రిదోషములయొక్క లక్షణములు విశేషముగ గానంబడును. సన్నిపాతముచే జనించిన ఈయైదు యోనిరోగంబులును అసాధ్యంబులై యుండును. మరియు పైజెప్పిన యోనిరోగముల కన్నిటికి వాతాదులచే విభాగము సుశ్రుతమున నివ్విధంబుగ గానంబడియెడు: "ఉదావర్తా తథా వన్ధ్యా విప్లుతా చ పరిప్లుతా। వాతలాచేతి వాతోత్థా పిత్తోత్థా రుధిరక్షయా। వామినీ స్రంసినీ చాపి పుత్రఘ్నీ పిత్తలా చ యా। అత్యానన్దా చ యా యోనిః కర్ణినీ చరణాద్వయమ్। శ్లైష్మికా సకఫా జ్ఞేయా షణ్ఢీ చ ఫలినీ తథా। మహతీ సూచివక్త్రా చ సర్వజేతి త్రిదోషజా॥" ఉదావర్తంబును, వంధ్యయు, విప్లుతంబును, పరిప్లుతంబును, వాతల, ఈయైదు యోనిరోగంబులును వాతముచే జనించునవియు; రుధిరక్షయంబును; వామినియు, స్రంసినియు, పుత్రఘ్నియు, పిత్తలయు, ఈయైదుయోనిరోగంబులును పిత్తముచే జనించినవియనియు; అత్యానన్ద, కర్ణిని, అచరణ, అతిచరణ, శ్లైష్మిక, ఈయైదు యోనిరోగంబులును కఫప్రకోపముచే జనించుననియు; షండి, ఫలినీ, మహతి, సూచివక్త్రి, సర్వజ, అను నీయైదు యోనిరోగంబులును సన్నిపాతముచే జనించుననియు భావము. ఇదియునుంగాక "ప్రవృద్ధలిఙ్గం పురుషం యాత్యర్థముపసేవతే। రూక్షదుర్బలబాలాయాస్తస్యా వాయుః ప్రకుప్యతి। స దుష్టో యోనిమాసాద్య యోనిరోగాయ కల్పతే॥" అని సుశ్రుతమున జెప్పిన యోనిరోగకారణముల నెరుంగునది. మిక్కిలి వృద్ధినొందిన లింగముగల పురుషునితో నధికముగ రూక్షంబైన శరీరముకల్గిన స్త్రీయును, బలహీనయైన స్త్రీయును, బాలికయు, అధికముగ

సంభోగించినయెడ వాతము ప్రకుపితంబై యోనిస్థానమున జేరి యోనిరోగముల గల్గించునని భావము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం ఘట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్ద సంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానాన్ధ్ర తాత్పర్యమునందు

యోనివ్యాపన్నిదానము

సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు



# యోనికన్దనిదానమ్



యోనికన్దముగూడ యోనియందు జనించును గాన యోనివ్యాపన్నిదానమును జెప్పిన పిదప యోనికన్దనిదానము జెప్పబడుచున్నది.



శ్లో॥ దివాస్వప్నాదతిక్రోధాద్వ్యాయామాదతిమైథునాత్।
క్షతాచ్చ నఖదన్తాద్యైర్వాతాద్యాః కుపితా మలాః ॥౧॥
పూయశోణితసఙ్కాశం లికుచాకృతిసన్నిభమ్।
జనయన్తి యదా యోనౌ నామ్నా కన్దస్స యోనిజః ॥౨॥

తా॥ పవటియందు నిదురించుట, అతిక్రోధము, దేహపరిశ్రమము జేయుట, అధికముగ సంభోగముచేయుట, గోళ్లు దన్తములు మొదలగువానిచే గాయములుకల్గుట, ఈకారణములచేత వాతాది దోషములు కుపితంబులై చీమునెత్తురులతోగూడి లికుచఫలమును(గజనిమ్మపండును) బోలె గుండ్రముగనుండు గడ్డను యోనియందు కల్గించును. దానిని యోనికందమని వచించెదరు.

వాతికాది యోనికన్ద లక్షణము

శ్లో॥ రూక్షం వివర్ణం స్ఫుటితం వాతికం తం వినిర్దిశేత్।
దాహరాగజ్వరయుతం విద్యాత్పిత్తాత్మకం తు తత్ ॥3॥
నీలపుష్పప్రతీకాశం కణ్డూమన్తం కఫాత్మికమ్।
సర్వలిఙ్గసమాయుక్తం సన్నిపాతాత్మకం విదుః ॥౪॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
యోనికన్ద నిదానం సమాప్తమ్



తా॥ నూతనంబై వికృతంబైన వర్ణముతోఁగూడి పగిలియున్నయెడ వాతముచే జనించిన యోనికందమనియు, మంటతోఁగూడి యెఱ్ఱనై జ్వరముతోఁగూడియున్నది పిత్తముచే జనించిన యోనికందమనియు, నల్లఅగిసెపువ్వులు మొదలగువానితో సమమైన రంగుకల్గి దురదతోఁగూడి యుండునది కఫముచేజనించిన యోనికన్దమనియు, వాతాదిదోషత్రయములకు వేర్వేరుగ చెప్పిన లక్షణములతోఁ గూడియుండునది సన్నిపాతముచే జనించిన యోనికందమనియు నెఱుంగునది.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రివర
చరణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యజ్ఞానాఢ్య రామకృష్ణశాస్త్రితనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానార్థ తాత్పర్యమునందు

యోనికన్ద నిదానము

సమాప్తము





శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# మూఢగర్భనిదానమ్



మూఢగర్భంబుగూడ యోనిస్థానమున జనించు వికారము గాన యోనిరోగనిదానానన్తరము మూఢగర్భనిదానమును జెప్పుట.



శ్లో॥ భయాభిఘాతాత్తీక్ష్ణోష్ణపానాశననిషేవణాత్ ।
గర్భే పతతి రక్తస్య సశూలం దర్శనం భవేత్ ॥౧॥

తా॥ భయము, అభిఘాతము, తీక్ష్ణంబులును ఉష్ణంబులును అన్నపానముల సేవించుట, ఈ కారణములచేత గర్భము జారిపడును. దానికి ముందు శూలతోగూడి రక్తము స్రవించును. మరియు నిచ్చట సుశ్రుతుండు చెప్పిన మైథునయానాదిగర్భపాతకారణముల నన్నింటిని యూహింపవలెను. మూఢగర్భలక్షణము తంత్రాన్తరమున నీరీతిగ జెప్పబడియెను: "సర్వావయవసంపూర్ణో మనోబుద్ధ్యాదిసంయుతః । విగుణాపానసంమూఢో మూఢగర్భోఽభిధీయతే॥" అని యున్నది. సకలావయవములుండి, మనోబుద్ధులతోగూడి, విలోమగతంబైన అపానవాతముచే మూర్ఛనొందియుండు గర్భము మూఢగర్భ మనంబడునని భావము.

## గర్భపాత గర్భస్రావముల కాలనిర్ణయము

శ్లో॥ ఆచతుర్థాత్తతో మాసాత్ప్రస్రవేద్గర్భవిద్రవః।
తతః స్థిరశరీరస్య పాతః పఞ్చమషష్ఠయోః ॥౨॥

తా॥ గర్భమును ధరించినదినము మొదలుకొని నాల్గుమాసములవరకు గర్భము ద్రవరూపంబై యుండును గాన స్రవించును; దానిని గర్భస్రావంబని వ్యవహరించెదరు. ఐదవనెలయందును ఆరవనెలయందును గర్భము ఘనీభవించిన అవయవములు కల్గియుండును గాన పైజెప్పిన కారణములచే నట్టిగర్భము జారి పడినపుడు గర్భపాతంబని వచించెదరు. మరియు భోజుండు "ఆతృతీయాత్తతో మాసాద్గర్భస్రవణమీరితమ్ । ఊర్ధ్వం సంఘాతభూతస్తు గర్భః పతతి యోషితామ్॥" అని చెప్పెను. మూడుమాసములవరకు ద్రవరూపంబైన గర్భము యోనిద్వారమునుండి స్రవించుననియు, పిదప గర్భము ఘనీభవించియుండును గాన పడిపోవుననియు భావము. "పంచమషష్ఠయోః" అను నియమముచేత సప్తమమాసమునందు అనుగుణముగ ప్రసవించినయెడ గర్భము సజీవంబై యుండు నని యెరుంగునది.

గచ్ఛేద్భుజద్వయశిరాస్స చ బీజకాఖ్యో
యోనౌ స్థితస్స పరిఘః పరిఘేణ తుల్యః।

తా॥ మరియు కొందరాచార్యులు సంకీలకమనియు, ప్రతిఖురంబనియు, పరిఘంబనియు, బీజకంబనియు మూఢగర్భముయొక్క గతులు నాల్గువిధంబులని వచించెదరు; అందు బాహువులును, పాదంబులును, శిరంబును ఊర్ధ్వముఖంబులై పిరుదులచే యోనిద్వారము నడ్డగించి యుండునెడ నయ్యది చీలగొట్టిన విధంబుగ నుండుటంజేసి సంకీలకంబనియు; హస్తపాదశిరస్సులు బైలువెడలి కొంచెముగ కనబడుచు శరీరముచే నడ్డగించియుండునది ప్రతిఖురంబనియు; భుజద్వయంబును శిరస్సును బైలువెడలి యడ్డగించియుండునది బీజకంబనియు గడియవలె నడ్డముగ యోనిద్వారమును నిరోధించి యుండునది పరిఘంబనియు నెరుంగునది. మరియు "యస్తు నిర్గచ్ఛత్యేకశిరోభుజః స బీజకః" అని యుండుటంజేసి ఒకభుజంబును శిరస్సును బైలు వెడలి యున్నయెడ బీజకంబని మతాన్తరమున నెరుంగునది.

## అసాధ్యమూఢగర్భలక్షణము

శ్లో॥ అపవిద్ధశిరా యా తు శీతాఙ్గీ నిరపత్రపా॥౭॥
నీలోద్గతసిరా హన్తి సా గర్భం స చ తాం తథా।

తా॥ గర్భిణీస్త్రీ శిరస్సును ధరించలేక మోమువాంచి నల్లని శరీరముతోగూడి లజ్జాహీనయై యున్నను, నీలవర్ణంబైన సిర బైలువెడలినను, అట్టి స్త్రీ గర్భమును చంపును. ఆగర్భముచే నా స్త్రీగూడ మృతిజెందును.

## మృతగర్భ చిహ్నములు

శ్లో॥ గర్భాస్పన్దనమావీనాం ప్రణాశశ్శ్యావపాణ్డుతా॥౮॥
భవేదుచ్ఛ్వాసపూతిత్వం శూనతాఽన్తర్మృతే శిశౌ।

తా॥ గర్భము కదలకుండుట, ప్రసవనిమిత్తమైన బాధలు నిలచియుండుట, శరీరము శ్యామలవర్ణంబును పాండువర్ణంబునై యుండుట, నిట్టూరుపుగాలి దుర్గంధముతోగూడి వెడలుట, ఉదరము స్థూలముగ నుండుట, ఈలక్షణములు గల్గినప్పుడు శిశువు కుక్షిలో మృతిజెందెనని యెరుంగునది.

## అసాధ్యమూఢగర్భ లక్షణములు

శ్లో॥ మానసాగన్తుభిర్మాతురుపతాపైః ప్రపీడితః॥౯॥
గర్భో వ్యాపద్యతే కుక్షౌ వ్యాధిభిశ్చ నిపీడితః।
యోనిసంవరణం సఙ్గః కుక్షౌ మక్కల్ల ఏవ చ॥౧౦॥
హన్యుః స్త్రియం మూఢగర్భాం యథోక్తాశ్చాప్యుపద్రవాః॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
మూఢగర్భనిదానం సమాప్తమ్



తా॥ మనస్సంబంధములైన దుఃఖములచేతనున్ను, ఆగంతుకంబైన దుఃఖముచేతనున్ను, వ్యాధులచేతనున్ను, గర్భము పీడింపంబడి మృతిజెందును. మఱియు యోనిసంవరణంబును, సంగంబును, కుక్షిలోజనించిన మక్కల్లంబును, ఈ మూడిటిలో నేదైన మూఢగర్భవ్యాధిగల స్త్రీకి జనించినయెడ అట్టి స్త్రీ మరణమునొందును. మఱియు ఆక్షేపకశ్వాసాద్యుపద్రవములు కల్గినను మృతిజెందును. యోనిసంవరణము తన్త్రాన్తరమునందు "వాతలాన్యన్నపానాని గ్రామ్యధర్మం ప్రజాగరమ్। అత్యర్థం సేవమానాయాః గర్భిణ్యా యోనిమార్గగః। మాతరిశ్వా ప్రకుపితో యోనిద్వారస్య సంవృతిమ్। కురుతే రుద్ధమార్గత్వాత్సు నర న్తర్గతో౽నిలః। నిరుణద్ధ్యాశయద్వారం పీడయన్ గర్భసంస్థితమ్। నిరుద్ధవదనోచ్ఛ్వాసో గర్భశ్చాశు విపద్యతే। బద్ధాంసరుద్ధహృదయాం నాశయత్యేవ గర్భిణీమ్। యోనిసంవరణం విద్యాద్వ్యాధిమేనం సుదారుణమ్। అన్తకప్రతిమం హ్యేతన్నారభేత చికిత్సితమ్॥" అని యున్నది. వాతమును ప్రకోపింపజేయు అన్నపానముల సేవించుట, సంభోగము నధికముగ జేయుట, రాత్రులయందు నిదుర మేల్కాంచియుండుట, ఈ కారణములచేత యోనిమార్గము నాశ్రయించియుండు వాతము ప్రకుపితంబై యోనిద్వారమును మూసికొనంజేయును. దానంజేసి అన్తర్గతంబైన వాయువు గర్భకోశద్వారము నడ్డగించును. పిదప గర్భమునందుండు శిశువు శ్వాసము బైటవెడలక మృతిజెందును. దానంజేసి గర్భవతియగు స్త్రీగూడ మృతిజెందును. దీనిని యోనిసంవరణంబను వ్యాధియని వచించెదరు. ఈవ్యాధి మృత్యువునుబోలి ప్రాణహరంబై యుండును గాన చికిత్స జేయంజనదని భావము. సంగంబనగా వాతము గర్భాశయము నడ్డగించినపుడు గర్భము లోపల చిక్కి యుండుటయని భావము. రక్తవాతములచే జనించు శూలవిశేషము మక్కల్లంబని యెఱుంగునది.

---

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్ద సంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపిక యను
మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు
మూఢగర్భనిదానము
సమాప్తము

---

శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

---

# సూతికారోగ నిదానమ్

---

సూతికారోగము మూఢగర్భమువలెనే స్త్రీసాధారణంబుగాన మూఢగర్భమును జెప్పిన పిదప సూతికారోగనిదానమును జెప్పుట.

శ్లో॥ * * వాయుః ప్రకుపితః కుర్యాత్సంరుధ్య రుధిరం స్రుతమ్।
సూతాయా హృచ్ఛిరో వస్తిశూలం మక్కల్లసంజ్ఞికమ్ * *
అఙ్గమర్దో జ్వరః కమ్పః పిపాసా గురుగాత్రతా।
శోథశూలాతిసారౌ చ సూతికారోగలక్షణమ్॥౧॥

తా॥ ప్రసవించిన స్త్రీకి వాతము ప్రకుపితంబై రక్తమునడ్డగించి హృదయమునందును శిరస్సునందును వస్తియందును శూలమును కల్గించును. దానిని మక్కల్లంబని వచించెదరు. ఒడలినొప్పులు, జ్వరము, కంపము, దప్పి, శరీరము బరువుగ నుండుట, వాపు, శూల, అతిసారము, ఈ రోగములు ప్రసవించిన స్త్రీకి కల్గినయెడ సూతికారోగములని వ్యవహరించబడును.

సూతికారోగ లక్షణము

శ్లో॥ మిథ్యోపచారాత్సంక్లేశాద్విషమాజీర్ణభోజనాత్।
సూతికాయాశ్చ యే రోగా జాయన్తే దారుణాస్స్మృతాః॥౨॥
జ్వరాతిసారశోథాశ్చ శూలానాహ బలక్షయాః।
తన్ద్రారుచిప్రసేకాద్యాః కఫవాతామయోద్భవాః॥౩॥
కృచ్ఛ్రసాధ్యా హి తే రోగాః క్షీణమాంసబలాశ్రితాః।
తే సర్వే సూతికానామ్నా రోగాస్తే చాప్యుపద్రవాః॥౩॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే

సూతికారోగ నిదానమ్

సమాప్తమ్



తా॥ అపథ్యంబులైన ఆహారాదుల సేవించుట, దోషమును వృద్ధినొందించు పదార్థముల భుజించుట, న్యూనాధికములుగ భుజించుట, జీర్ణము గాకుండునప్పుడు భుజించుట. ఈ కారణములచేత జ్వరము, అతిసారము, శోఫ, శూల, కడుపుబ్బరము, బలక్షయము, కునికిపాటు, అరోచకము, నోట నీరుగారుట, ఇవి మున్నగు వ్యాధులు ప్రసవించిన స్త్రీకి కల్గి మిగుల క్రూరంబులై యుండును. ఇవి కఫవాతములచే జనించును. మాంసబలములు క్షయించినవారికి జనించినయెడ మిగుల కష్టసాధ్యంబులై యుండును. ఇవి ప్రసవించిన స్త్రీలకు జనించుటంజేసి సూతికారోగములని చెప్పంబడును. ఈ రోగములలో నొకటి ముఖ్యముగ నుండునప్పుడు తక్కినవి యుపద్రవరూపంబులై యుండును.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్ద సంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యన్నవాను రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాండ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానాన్ధ్ర తాత్పర్యమునందు

సూతికారోగ నిదానము

సమాప్తము





శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# స్తనరోగనిదానమ్

ప్రసవించినవారికి ప్రాయికముగ స్తనరోగములు జనించునుగాన సూతికారోగనిదానమును జెప్పినపిదప స్తనరోగనిదానమును జెప్పుట.

శ్లో॥ సక్షీరౌ వాఽప్యదుగ్ధౌ వా ప్రాప్య దోషాస్స్తనౌ స్త్రియాః।
ప్రదూష్య మాంసరుధిరం స్తనరోగాయ కల్పతే॥౧॥
పఞ్చానామపి తేషాం హి రక్తజం విద్రధిం వినా।
లక్షణాని సమానాని బాహ్యవిద్రధిలక్షణైః॥౨॥

ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
స్తనరోగనిదానం సమాప్తమ్

తా॥ వాతాదిదోషములు ప్రకుపితంబులై స్తనముల నాశ్రయించి రక్తమాంసములను జెరచి స్తనరోగములం గల్గించును. వాత పిత్త శ్లేష్మ సన్నిపాత ఆగంతు భేదములచే నైదువిధంబులగు స్తనరోగములు బాహ్యవిద్రధి లక్షణములతో సమంబులై యుండును.

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్ద సంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాండ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపికయను
మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు
స్తనరోగ నిదానము
సమాప్తము

శ్రీ హయగ్రీవాయ నమః

## శ్రీరస్తు



# స్తన్యదుష్టినిదానమ్



స్తనరోగనిదానానంతరము స్తనముల నాశ్రయించియుండు స్తన్యముయొక్క దోషనిదానమును చెప్పుట.



శ్లో॥ గురుభిర్వివిధైరన్నైర్దుష్టైర్దోషైః ప్రదూషితమ్ ।
క్షీరం మాతుః కుమారస్య నానారోగాయ కల్పతే ॥౧॥

తా॥ అజీర్ణకరంబులైన నానావిధపదార్థముల భుజించుటచేత వాతాదులు ప్రకుపితంబులై తల్లియొక్క స్తనములయందలి పాలను చెరచును. అట్టి పాలు కుమారునికి నానావిధరోగములను గల్గించును.

### వాతాది దుష్టస్తన్య లక్షణము

శ్లో॥ కషాయం సలిలప్లావి స్తన్యం మారుతదూషితమ్ ।
కట్వమ్లలవణం పీతరాజీమత్పిత్తసంజ్ఞితమ్॥ ౨॥
కఫదుష్టం ఘనం తోయే నిమజ్జతి సపిచ్ఛిలమ్ ।
ద్విలింగం ద్వంద్వజం విద్యాత్ సర్వలింగం త్రిదోషజమ్॥3॥

తా॥ కషాయ (వగరు) రసముకల్గి నీళ్లలో బోసినపుడు పైన తేలుచునుండు స్తన్యము వాతముచే దుష్టంబనియు, చేదును పులుపును కల్గి ఉప్పనై పచ్చనిరేఖలతో గూడియుండు స్తన్యము పిత్తముచే దుష్టంబనియు, మిక్కిలి చిక్కనై జిడ్డుగల్గి నీళ్లలో బోసినప్పుడు మునిగియున్న స్తన్యము కఫముచే దుష్టంబనియు, దోషద్వయలక్షణములతో గూడిన స్తన్యము రెండు దోషములయొక్క సంసర్గముచే దుష్టంబనియు. దోషత్రయ లక్షణములతో గూడియున్నది సన్నిపాతముచే దుష్టంబైన స్తన్యమనియు నెరుంగునది. అభిఘాతముచే స్తన్యము దుష్టంబైనపుడు వాతజస్తన్యదుష్టిలక్షణములతో గూడియుండును గాన నిచట వేరుగ జెప్పబడలేదని యెరుంగునది.

### శుద్ధస్తన్య లక్షణము

శ్లో॥ అదుష్టం చామ్బునిక్షిప్తమేకీభవతి పాణ్డురమ్।
మధురం చాపివర్ణం చ ప్రసన్నం తత్ప్రశస్యతే॥౪॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
స్తన్యదుష్టి నిదానం
సమాప్తమ్



తా॥ ఉదకమున బోసినయెడ నీళ్లలో గలసియుండుట, పాండువర్ణము కల్గియుండుట, మధురంబైయుండుట, నీలపీతాదివర్ణములు లేకుండుట, స్వచ్ఛముగనుండుట, ఈ లక్షణములు కల్గిన స్తన్యము పరిశుద్ధంబైనదియని యెరుంగునది. మరియు "రసప్రసాదో మధురః పక్వాహారనిమిత్తజః । కృత్స్నదేహాత్స్తనౌ ప్రాప్తస్తన్య మిత్యభిధీయతే॥" అని సుశ్రుతమునందు స్తన్యలక్షణము గానంబడియెడు. పక్వంబైనయాహారముచే గల్గురసముయొక్క నిర్మలమైన ద్రవము సకలశరీరమునుండి స్తనముల నాశ్రయించి మధురంబైయున్నయెడ దానిని స్తన్యమని చెప్పుదురని భావము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవింద సంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యాన్వాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపికయను

మాధవనిదానప్రతాత్పర్యమునందు
స్తన్యదుష్టి నిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు

# బాలరోగనిదానమ్

స్తన్యదోషమును జెప్పినపిదప స్తన్యదోషముచే గల్గు బాలరోగనిదానమును జెప్పుట.

శ్లో॥ వాతదుష్టం శిశుస్స్తన్యం పిబన్వాతగదాతురః।
క్షామస్వరః కృశాఙ్గస్స్యాద్బద్ధవిణ్మూత్రమారుతః॥౧॥
స్విన్నో భిన్నమలో బాలః కామలాపిత్తరోగవాన్।
తృష్ణాలురుష్ణసర్వాఙ్గః పిత్తదుష్టం పయః పిబన్॥౨॥
కఫదుష్టం పిబన్ క్షీరం లాలాలుశ్శ్లేష్మరోగవాన్।
నిద్రాన్వితో జడశ్శూనవక్త్రాక్షశ్ఛర్దనశ్శిశుః॥3॥
ద్వన్ద్వజే ద్వన్ద్వజం రూపం సర్వజే సర్వలక్షణమ్।

తా॥ వాతముచే దుష్టంబైన స్తన్యమును త్రాగిన శిశువునకు కంఠస్వరము నశించియుండుట, శరీరము కృశించియుండుట, మలమూత్రంబులును అపానవాతంబును బద్ధంబులై యుండుట, ఇట్టి వాతవ్యాధులచే బాధ కల్గును. పిత్తముచే దుష్టంబైన స్తన్యమును త్రాగిన శిశువు చెమట బట్టుట, మలము శుష్కంబై ఖండఖండములుగ వెడలుట, కామలారోగము, దప్పి, సర్వశరీరంబును మిక్కిలి యుష్ణంబై యుండుట, ఈ లక్షణములు కల్గి యుండును. కఫముచే దుష్టంబైన చనుబాలు త్రావిన శిశువు జొల్లుగార్చుచు కఫరోగములు గల్గి అతినిద్ర, జడత్వము, ముఖంబును కన్నులును వాచి యుండుట, త్రాగిన పాలను వాంతిచేయుట, ఈ లక్షణములు కల్గియుండును. మరియు దోషద్వయముచే దుష్టంబైన పాలను త్రాగిన శిశువు పై జెప్పిన దోషములలో రెండేసి దోషములయొక్క లక్షణములతో గూడియు, దోషత్రయముచే దుష్టంబైన పాలుద్రావినయెడ త్రిదోషలక్షణములతో గూడియు నుండునని భావము.

## శిశువులరోగములను దెలిసికొను నుపాయములు

శ్లో॥ శిశోస్తీవ్రామతీవ్రాం చ రోదనాల్లక్షయేద్రుజమ్॥౪॥
స యం స్పృశేద్భృశం దేశం యత్ర చ స్పర్శనాక్షమః।
తత్ర విద్యాద్రుజం మూర్ధ్ని రుజం చాక్షినిమీలనాత్॥౫॥

కోష్ఠే విబన్ధవమథు స్తనదంశాన్త్రకూజనైః।
ఆధ్మానపృష్ఠనమనజఠరోన్నమనైరపి॥౬॥
వస్తౌ గుహ్యే చ విణ్మూత్రసఙ్గోత్రాస దిగీక్షణైః।
స్రోతాంస్యఙ్గాని సన్ధీంశ్చ పశ్యేద్యత్నాన్ముహుర్ముహుః॥౭॥

తా॥ శిశువు అధికముగ రోదనము జేయుచున్నయెడ మిక్కిలి తీవ్రంబైన బాధ కల్గినదనియు, స్వల్పముగ రోదనము జేయుచున్నయెడ కొంచెముగ తీవ్రంబైన బాధ కల్గియున్నదనియు నెరుంగవలెను. మరియు శిశువు తనశరీరమునం దెచ్చోట మాటిమాటికి స్పృశించుచుండునో అచ్చోట బాధకల్గినదియనియు, కన్నుల మూసికొనియుండెనేని తలయందు బాధ కల్గినదియనియు నెరుంగునది. కుక్షియందు బాధకల్గినపుడు మలబంధము, వాన్తి, స్తనముల గరచుట, ప్రేవులు కూయుట, కడుపుబ్బరము, వీపును పైకెత్తుట, కడుపు నెగురవేయుట, ఈ లక్షణములు కల్గును. వస్తియందు బాధ జనించినపుడు మూత్రంబును, గుదమునందు బాధ కల్గినపుడు మలంబును నిలచియుండుట, ఉలికిబడుట, దిక్కులజూచుట, ఈ లక్షణములు కల్గియుండును. నాసికాదిస్రోతోద్వారములయందును, అవయవములయందును, కీళ్లయందును, మిగుల ప్రయత్నముచే మాటిమాటికి పరీక్షించవలెను.

## శిశువులయొక్క వర్త్మరోగలక్షణము

శ్లో॥ కుకూణకః క్షీరదోషాచ్ఛిశూనామక్షివర్త్మని।
జాయతే తేన తన్నేత్రం కణ్డూరం చ స్రవేన్ముహుః॥౮॥
శిశుః కుర్యాల్లలాటాక్షికూటనాసావఘర్షణమ్।
శక్తో నార్కప్రభాం ద్రష్టుం న వర్త్మోన్మీలనక్షమః॥౯॥

తా॥ దోషములు క్షీణంబులగుటచేత శిశువులయొక్క కనురెప్పల లోప్రక్క కుకూణకంబను వ్యాధి జనించును. ఆ వ్యాధిచేత శిశువుయొక్క కన్నులు దురదగల్గి పలుమారు కన్నీరుగార్చుచుండును. మరియు నాశిశువు నుదురు, కన్నులు, నాసికలు, వీనిని మాటిమాటికి నలుచుచుండును. సూర్యునియొక్క కాంతిని చూచుటకును కనురెప్పల దెరచుటకును సమర్థుండు గాకుండును.

## పారిగర్భిక వ్యాధిలక్షణము

శ్లో॥ మాతుః కుమారో గర్భిణ్యాః స్తన్యం ప్రాయః పిబన్నపి।
కాసాగ్నిసాదనవమథుతన్ద్రాకార్శ్యారుచిభ్రమైః॥౧౦॥
యుజ్యతే కోష్ఠవృద్ధ్యా చ తమాహుః పారిగర్భికమ్।
రోగం పరిభవాఖ్యం చ యుఞ్జ్యాత్తత్రాగ్నిదీపనమ్॥౧౧॥

తా॥ గర్భవతియైయున్న తల్లియొక్క స్తన్యమును శిశువు తరుచుగ పానముజేసినయెడ దగ్గు, అగ్నిమాంద్యము, వాంతి, కునికిపాటు, కృశత్వము, అరోచకము, భ్రమము, కడుపు పెరు

గుట, ఇట్టి లక్షణములు గల్గియుండును. గానిని పారిగర్భికంబను వ్యాధియని వచించెదరు. ఈ వ్యాధి శిశువులను బాధించును గాన పరిభవాఖ్యంబనియు వచించెదరు. ఈవ్యాధియందు అగ్నిని దీపింపంజేయు చికిత్సను జేయవలెను.

### తాలుకణ్టక లక్షణము

శ్లో॥ తాలుమాంసే కఫః క్రుద్ధః కురుతే తాలుకంటకమ్।
తేన తాలుప్రదేశస్య నిమ్నతా మూర్ధ్ని జాయతే॥౧౨॥
తాలుపాత స్తనద్వేషః కృచ్ఛ్రాత్పానం శకృద్ద్రవమ్।
తృడక్షికణ్ఠాస్యరుజా గ్రీవాదుర్వహతా వమిః ॥౧౩॥

తా॥ తాలువులయొక్క మాంసమునందు కఫము ప్రకుపితంబై తాలుకణ్టకమను వ్యాధిని శిశువులకు గల్గించును. దానిచేత తాలువునందును శిరస్సునందును సంతబడియుండును. మరియు నీ వ్యాధియందు తాలువులు పడినట్లుండుట, స్తనముల సడుముట కిచ్ఛ లేకుండుట, మిగులకష్టముచే పాలుద్రావుట, మలము ద్రవయుక్తంబై యుండుట, దప్పి, కన్నులయందును కంఠమునందును ముఖమునందును నొప్పి కల్గుట, మెడ నిలువక వ్రేలబడుట, వాంతియగుట, ఈ లక్షణములు కల్గును.

### విసర్ప లక్షణము

శ్లో॥ విసర్పస్తు శిశోః ప్రాణనాశనో వస్తిశీర్షజః।
పద్మవర్ణో మహాపద్మనామా దోషత్రయోద్భవః ॥౧౪॥
శఙ్ఖాభ్యాం హృదయం యాతి హృదయాద్వా గుదం వ్రజేత్।
క్షుద్రరోగేషు యే ప్రోక్తే స్వాజగల్ల్యహిపూతనే ॥౧౫॥

తా॥ శిశువులయొక్క వస్తియందును శిరస్సునందును విసర్పంబను గడ్డ లేచి ప్రాణహరంబై యుండును. అది ఎఱ్ఱదామరరేకువలె రక్తవర్ణంబై యున్నయెడ మహాపద్మంబని జెప్పంబడును. ఇవ్యాధి దోషత్రయప్రకోపముచే జనించును. అందు శిరస్సున జనించిన విసర్పము కణతలనుండి హృదయమున జేరును. వస్తియందు జనించినది హృదయమునజేరి అచ్చటనుండి మరల గుదస్థానమున జేరును. ఇదియునుంగాక క్షుద్రరోగములయందు మున్నుజెప్పిన అజగల్లి అహిపూతనయను వ్యాధులు రెండునుగూడ బాలురకు జనించునని భావము,

శ్లో॥ జ్వరాద్యా వ్యాధయస్సర్వే మహాన్తో యే పురేరితాః।
బాలదేహేఽపి తే తద్వద్విజ్ఞేయాః కుశలైస్సదా॥౧౬॥

తా॥ మున్ను వచించిన జ్వరము మున్నగాగల గొప్పవ్యాధులుగూడ బాలురయొక్క దేహమునందు జనించును గాన సమర్థులగు వైద్యులు ఆయాలక్షణములబట్టి యెఱుంగవలెనని భావము.

### బాలగ్రహ సామాన్య లక్షణములు

శ్లో॥ క్షణాదుద్విజతే బాలః క్షణాత్త్రస్యతి రోదితి।
నఖై ర్దన్తైర్దారయతి ధాత్రీమాత్మానమేవ వా॥౧౭॥

ఊర్ధ్వం నిరీక్షతే దన్తాన్ఖాదేత్కూజతి జృంభతే।
భ్రువౌ క్షిపతి దన్తోష్ఠం ఫేనం వమతిచాసకృత్॥౧౮॥
క్షామోఽతి నిశి జాగర్తి శూనాక్షో భిన్నవిట్స్వరః।
మాంసశోణితగన్ధిశ్చ న చాశ్నాతి యథా పురా॥౧౯॥
సామాన్యం గ్రహజుష్టానాం లక్షణం సముదాహృతమ్।

తా॥ బాలుండు క్షణకాలము విహ్వలుండై యుండుట, క్షణకాలమునకు భయపడుట, ఏడ్చుట, గోళ్లచేతను దన్తములచేతను పాలిచ్చు దాదినైనను తన శరీరమునైనను గ్రుచ్చుట, పైనిజూచుట, పండ్లుకొరకుట, వికృతముగ నరచుట, ఒడలు విరచుట, కనుబొమలు వికారముగ గదలించుట, దన్తములచే పెదవులు కొరకుట, పలుమారు నురుగును వమనముజేయుట, శరీరము మిగుల కృశించి యుండుట, రాత్రులయందు నిదురపోకుండుట, కనురెప్పలు వాచియుండుట, మలము భిన్నంబై వెడలుట, కంఠస్వరము మారియుండుట, మాంసరక్తములవలె దుర్గంధము కల్గియుండుట, మునుపటివలె భుజించకుండుట, ఈ లక్షణములన్నియు గ్రహములచే పీడింపబడిన బాలులకు సామాన్యముగ జనించునని భావము. మరియు సుశ్రుతమునందు పూజలనొందుటకై గ్రహములు బాలులను బాధించునని జెప్పియున్నది. అది యెట్లనిన “ధాత్రీమాత్రోః ప్రాక్ప్రదిష్టాపచారాచ్ఛౌచభ్రష్టాన్ మఙ్గలాచారహీనాన్। త్రస్తాన్ హృష్టాం స్తర్జితాన్ క్రన్దితాంశ్చ పూజాహేతోర్హింస్యురేతే కుమారాన్॥” పాలిచ్చు దాదియొక్కయు తల్లియొక్కయు పొరబాటుచేత శౌచంబును మంగళవిధానంబులును లేకుండుట, భయపడుట, అధికముగ సంతోషము గల్గుట, భయపరచబడుట, ఏడ్చుట, ఇట్టి కారణములచేత గ్రహములు తాము పూజలనొందుటకై బాలులను బట్టి బాధించునని భావము.

## బాలగ్రహవిశేష లక్షణము

శ్లో॥ ఏకనేత్రస్య గాత్రస్య స్రావస్స్పన్దనకమ్పనమ్ ॥౨౦॥
ఊర్ధ్వం దృష్ట్వా నిరీక్షేత వక్రాస్యో రక్తగన్ధికః।
దన్తాన్ఖాదతి విత్రస్త స్తన్యం నైవాభినన్దతి ॥౨౧॥

తా॥ ఒకకంటియందు నీరుగారుట, ఒక అవయవమునందు చెమటకల్గుట, లేక కొంచెముగ చలనంబైనను వణకైనను కల్గుట, పైనిజూచుట, ముఖము వంకరయై యుండుట, రక్తమునుబోలి దుర్గంధము కల్గియుండుట, పండ్లు కొరకుట, పాలు ద్రావుటకిచ్చగొనకుండుట. ఈ లక్షణములు కల్గినయెడ బాలుండు భయము జెందెనని యెరుంగునది.

## స్కన్దాపస్మార లక్షణము

శ్లో॥ స్కన్దగ్రహగృహీతానాం రోదనం చాల్పమేవ చ।
నష్టసంజ్ఞో వమేత్ఫేనం సంజ్ఞావానతి రోదితి॥౨౨॥
పూయశోణితగన్ధిత్వం స్కన్దాపస్మారలక్షణమ్।

తా॥ స్కన్దగ్రహముచే బీడింపబడిన బాలులకు స్వల్పమైన రోదనముకల్గుట, మూర్ఛజెందుట, నురుగును వమనము జేయుట, మూర్ఛదెలిసినప్పుడు అధికముగ రోదనముజేయుట, రక్తమాంసములవంటి దుర్గన్ధము శరీరమున గల్గియుండుట, ఈలక్షణములు కల్గును. దీనిని స్కన్దాపస్మారగ్రహంబని వచించెదరు.

శకునిపీడిత లక్షణము

శ్లో॥ స్రస్తాఙ్గో భయచకితో విహఙ్గగన్ధి
స్స్రావవ్రణ పరిపీడితస్సమన్తాత్।
స్ఫోటైశ్చ ప్రచితతనుస్సదాహపాకై
ర్విజ్ఞేయో భవతి శిశుః క్షతశ్శకున్యా॥౨౩॥

తా॥ అవయవములు సడలిన విధంబుగ బాధగల్గుట, కారణములేకయే భయమునొందుట, మత్స్యమాంసములను తిను పక్షులవలె దుర్గన్ధముతో గూడియుండుట, శరీరమునందెల్ల చీమును గార్చుచుండు వ్రణములతో గూడి యుండుట, మంటగల్గి పగిలినపొక్కులు శరీరమున వ్యాపించి యుండుట, ఈ లక్షణములతో గూడియుండు శిశువు శకునిగ్రహముచే బీడింపబడినవాడని యెరుంగునది. ఈ వ్యాధి లక్షణము తంత్రాన్తరమున నిట్లెరంగున గానంబడియెడు: "సంస్రావదాహపాకాద్యైః చితస్ఫోటైర్భయాన్వితః। స్రస్తాఙ్గోవిస్రగన్ధిస్స్యాత్ శకున్యా పీడితశ్శిశుః॥" శకునిగ్రహముచే పీడింపబడిన శిశువు మంటగల్గి వ్రణములై చీముగార్చుచుండు బొబ్బలచే నావరించబడిన శరీరముకలవాడై భయముతోగూడి శిథిలంబులగు అవయవములుగల్గి మత్స్యమాంసములవంటి దుర్గంధముకల్గి యుండునని భావము.

రేవతీగ్రహ లక్షణము

శ్లో॥ వ్రణైస్స్ఫోటైశ్చితం గాత్రం పఙ్కగన్ధం స్రవేదసృక్।
భిన్నవర్చా జ్వరీ దాహీ రేవతీగ్రహలక్షణమ్॥౨౪॥

తా॥ శరీరమునందంతట వ్రణంబులును బొబ్బలును వ్యాపించియుండుట, అడుసువలె దుర్గన్ధముతోగూడిన రక్తము స్రవించుట, మలము నీళ్లవలె వెడలుట, జ్వరంబును తాపంబును గల్గుట, ఈ లక్షణములుకల్గియున్న యెడ రేవతీగ్రహముచే పీడింపబడెనని యెరుంగునది.

పూతనాగ్రహ లక్షణము

శ్లో॥ అతీసారో జ్వర స్తృష్ణా తిర్యక్ప్రేక్షణ రోదనమ్।
నష్టనిద్ర స్తథోద్విగ్నో గ్ర స్తః పూతనయా శిశుః॥౨౫॥

తా॥ అతిసారము, జ్వరము, దప్పి, అడ్డముగ జూచుట, ఏడ్చుట, నిదురబోకుండుట, ఉలికిబడుట, ఈ లక్షణములుగల శిశువు పూతనాగ్రహముచే పీడితుండని యెరుంగునది.

అంధపూతనాగ్రహ లక్షణము

శ్లో॥ ఛర్దిః తాపో జ్వర స్తృష్ణా వసాగన్ధోఽతిరోదనమ్।
స్తన్యద్వేషోఽతిసారశ్చ అన్ధపూతనయా భవేత్॥౨౬॥

తా॥ వాంతి, దగ్గు, జ్వరము, దప్పి, మాంసగంధమువంటి దుర్గంధము, అధికముగ నేడ్చుట. పాలు త్రావుట కిచ్ఛగొనకుండుట, అతిసారము, ఈ లక్షణములు కల్గినయెడ అంధపూతనా గ్రహముచే పీడితుండని యెరుంగునది.

శీతపూతనా లక్షణము

శ్లో॥ వేపతే కాసతే క్షీణో నేత్రరోగా విగన్ధితా।
ఛర్ద్యతీసారయుక్తశ్చ శీతపూతనయా శిశుః॥_౧౭॥

తా॥ వణకు కల్గుట, దగ్గు, శరీరము కృశించుట, నేత్రరోగములు గల్గుట శరీరమున దుర్గంధము గల్గుట, వాంతి, అతిసారము, ఈ లక్షణములతో గూడియున్న శిశువు శీతపూతనాగ్రహముచే పీడితుండని యెరుంగునది.

ముఖమండలికా లక్షణము

శ్లో॥ ప్రసన్నవర్ణవదనః సిరాభిరభిసంవృతః।
మూత్రగన్ధి చ బహ్వాశీ ముఖమండలికాగ్రహీ ॥_౧౮॥

తా॥ ముఖము సుముఖంబైన కాంతిగల్గియుండుట, సిరలచే నావరింపబడియుండుట, ఒడలు మూత్రమువలె దుర్గంధముతోగూడి యుండుట, మిక్కుటముగ భుజించుట, ఈ లక్షణములుగల శిశువు ముఖమండలికాగ్రహముచే పీడితుండని యెరుంగునది.

నైగమేయగ్రహ లక్షణము

శ్లో॥ ఛర్దిస్సన్నసకణ్ఠాస్య శోషమూర్ఛావిగన్ధితా।
ఊర్ధ్వం పశ్యేద్దశేద్దన్తాన్నైగమేయం గ్రహం వదేత్ ॥_౧౯॥

-ooo-

ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
బాలరోగ నిదానం సమాప్తమ్

---

తా॥ వాన్తి, వణకు, కంఠంబును ముఖంబును శోషించుట, మూర్ఛనొందుట, దుర్గంధము గల్గియుండుట, పైనిజూచుట, పండ్లుకొరకుట, ఈ లక్షణములు కల్గినయెడ నైగమేయగ్రహముచే పీడితుండని యెరుంగునది.

-ooo-

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రిచర
ణారవిన్దసంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యన్నవాయ రామకృష్ణార్యసూనుమాధవ సకలసాధ్యాయ
విధేయ "ఆయుర్వేదవిద్వాన్" "భిషజ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపికయను
మాధవనిదానాంధ్రవ్యాఖ్యానమునందు
బాలరోగ నిదానము
సమాప్తము

---

శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీరస్తు



# విషనిదానమ్



ఇత్తెరంగున వ్యాధులనన్నింటిని చెప్పి చికిత్సానిమిత్తమై శేషించియున్న విషనిదానము చెప్పబడుచున్నది.



శ్లో॥ స్థావరం జఙ్గమం చైవ ద్వివిధం విషముచ్యతే।
మూలాద్యాత్మకమాద్యం స్యాత్పరం సర్పాదిసంభవమ్ ॥౧॥

తా॥ విషము స్థావరమనియు జఙ్గమమనియు రెండువిధములు; అందు దుంపలు వేళ్లు ఆకులు మొదలగువాని నాశ్రయించిన విషము స్థావరమనియు, సర్పాదిగతంబైన విషము జంగమమనియు నెఱుంగునది. ఈ విషములరెంటియొక్క భేదములు సుశ్రుతమున నీరీతిగ గానంబడియెడు: "స్థావరం జఙ్గమం చైవ ద్వివిధం విషముచ్యతే। దశాధిష్ఠానమాద్యన్తు ద్వితీయం షోడశాశ్రయమ్। మూలం పత్రం ఫలం పుష్పం త్వక్క్షీరం సార ఏవ చ। నిర్యాసో ధాతవశ్చైవ కన్దశ్చ దశమస్స్మృతః॥" అని స్థావరవిషభేదములును: "తత్రదృష్టినిశ్వాసదంష్ట్రానఖమూత్రపురీషశుక్రలాలాఽఽర్తవముఖసన్దంశవిశర్ధితగుదాస్థిపిత్తశూకశవాని॥" అని జంగమవిషభేదంబులుగా జెప్పంబడియె. విషము స్థావరమనియు జంగమమనియు రెండువిధంబులు; అందు స్థావరవిషము వేళ్లు, ఆకులు, ఫలములు, పుష్పములు, తోలు, క్షీరము, సారము, బంక, ధాతువులు, (అనగా తాళకము శంఖపాషాణము అభ్రకము మొదలగునవి) గడ్డలు, ఈ పదింటినాశ్రయించి యుండుటచే పదివిధంబులై యుండుననియు; రెండవదియైన జంగమవిషము సర్పాదులయొక్క దృష్టి, శ్వాసము, కోరలు, గోళ్లు, మూత్రము, మలము, శుక్రము, నోటినీరు, ఆల, (లోక) ఆర్తవము, ముఖసందంశము, అపానవాతముతోగూడిన గుదము, అస్థి, పిత్తము, ముల్లు, శవము, ఈ పదునారింటి నాశ్రయించి యుండుటంజేసి పదునారుభేదంబులు గల్గి యుండుననియు భావము. ఈ యవాన్తరభేదములకు ప్రత్యేకలక్ష్యలక్షణముల సుశ్రుతమున విశేషముగ జూడందగినది.

## జంగమవిష లక్షణము

శ్లో॥ నిద్రాం తన్ద్రాం క్లమం దాహం అపాకం లోమహర్షణమ్।
శోథం చైవాతిసారం చ జఙ్గమం కురుతే విషమ్॥౨॥

తా॥ నిద్ర, కునికిపాటు, బడలిక, తాపము, అజీర్ణము, గగురుపాటు, వాపు, అతిసారము, ఇవి యన్నియు జంగమవిషముచే గల్గును.

## స్థావరవిష లక్షణము

శ్లో॥ స్థావరం చ జ్వరం హిక్కాం దన్తహర్షగలగ్రహమ్।
ఫేనచ్ఛర్ద్యరుచిశ్వాసం మూర్ఛాం చ కురుతే విషమ్॥౩॥

తా॥ జ్వరము, వెక్కిళ్లు, పండ్లుపులిసియుండుట, గొంతుపట్టియుండుట, నోట నురుగు వాంతియగుట, అరోచకము, శ్వాసము, మూర్ఛ, వీనినన్నింటిని స్థావరవిషము కల్గించును.

## విషమునుబెట్టినవాని నెరుంగువిధము

శ్లో॥ ఇంగితజ్ఞో మనుష్యాణాం వాక్చేష్టాముఖవైకృతైః।
జానీయాద్విషదాతారం ఏభిర్లింగైశ్చ బుద్ధిమాన్॥౪॥
న దదాత్యుత్తరం పృష్టో వివక్షుర్మోహమేతి చ।
అపార్థం బహు సఙ్కీర్ణం భాషతే చాపి మూఢవత్॥౫॥
హసత్యకస్మాత్ స్ఫోటయత్యఙ్గులీర్విలిఖేన్మహీమ్।
వేపథుశ్చాస్య భవతి త్రస్తశ్చాన్యోన్యమీక్షతే॥౬॥
వివర్ణవక్త్రో ధ్యామశ్చ నఖైః కిఞ్చిచ్ఛినత్త్యపి।
ఆలభేతాసనం దీనః కరేణ చ శిరోరుహమ్॥౭॥
వర్తతే విపరీతశ్చ విషదాతా విచేతనః।

తా॥ మనుజులయొక్క మనోభావమును దెలిసిన వైద్యుడు వాక్కు, చేష్టలు, ముఖవికారము మొదలగు లక్షణములచేత విషమునిడిన మనుజుని యెరుంగవలెను. మరియు ఒరులకు విషము నిడిన మనుజుండు పలుమరు అడిగినను బదులుచెప్పకుండును. బదులుచెప్ప యత్నించియు మూఢాత్ముండై యుండును. మూఢునివలె వ్యర్థములైన మాటల పలుదెరంగుల భాషించును. కారణములేకయే నగుచుండును. వ్రేళ్ళచే భూమిని గీరుచుండును. వీనికి శరీరకంపము విశేషముగ గల్గును. భయముజెంది నలుదెసల జూచుచుండును. వివర్ణంబైన ముఖముగలవాడై గోళ్ళచేత తృణాదులను ద్రుంచుచుండును. వానిముఖము కాలినవిధంబుగ వివర్ణంబై యుండును. మిగుల దీనుండై యాసనమున గూర్చుండి హస్తముచేత వెంట్రుకల దడవికొనుచుండును. జ్ఞానములేక సకలవిషయములయందును విరుద్ధముగ నుండును. ఇట్టి లక్షణములు విషముబెట్టినవానికి భయముచే గల్గును గాన పైజెప్పిన లక్షణములంబట్టి వాని నెరుంగవలెనని భావము.

## మూలాదిదశవిధ విషలక్షణములు

శ్లో॥ ఉద్వేష్టనం మూలవిషైః ప్రలాపో మోహ ఏవ చ॥౮॥
జృమ్భణం వేపనం శ్వాసో జ్ఞేయం పత్రవిషేణ తు।
ము(శు)ష్కశోథః ఫలవిషైః దాహోఽన్నద్వేష ఏవచ॥౯॥
భవేత్పుష్పవిషైశ్ఛర్దిరాధ్మానం శ్వాస ఏవ చ।
త్వక్సార నిర్యాసవిషైరుపయుక్తైర్భవన్తి హి॥౧౦॥

ఆస్యదౌర్గన్ధ్యపారుష్య శిరోరుక్కఫసంస్రవాః।
ఫేనాగమః క్షీరవిషైర్విడ్భేదో గురుగాత్రతా॥౧౧॥
హృత్పీడనం ధాతువిషైర్మూర్ఛాదాహశ్చ తాలుని।
ప్రాయేణ కాలఘాతీని విషాణ్యేతాని నిర్దిశేత్॥౧౨॥

తా॥ మూలము నాశ్రయించిన విషములచేత కొయ్యచే కలియబెట్టినవిధంబుగ వ్యథయు, ప్రలాపంబును, మూర్ఛయు గల్గును. పత్రవిషములచేత ఆవలింతలును, శరీరకంపంబును, శ్వాసంబును కల్గును. ఫలవిషములచేత ముష్కంబైన వాపును, (వృషణములయందు వాపును) తాపంబును, అన్నద్వేషంబును కల్గును. పుష్పవిషములచేత వాంతియు, కడుపుబ్బరంబును, శ్వాసంబును కల్గును. చర్మముయొక్కయు రసముయొక్కయు బంకయొక్కయు విషములచేత నోటియందు దుర్గన్ధంబును, పరుషత్వంబును, తలనొప్పియు, నోట కఫస్రావంబును కల్గును. క్షీరవిషములచేత నోట నురుగువెడలుటయు, మలభేదంబును, ఒడలు భారమై యుండుటయు గల్గును. ధాతువిషములచేత రొమ్మునొప్పియు, మూర్ఛయు, తాలువునందు మంటయు గల్గును. పైజెప్పిన విషములన్నియు కాలక్రమముగ ప్రాణముల హరించునవియై యుండును.

విషయుక్తశస్త్రహత లక్షణము

శ్లో॥ సద్యః క్షతం పచ్యతే యస్య జన్తోః
ప్రవేద్రక్తం పచ్యతే చాప్యభీక్ష్ణమ్।
కృష్ణీభూతం క్లిన్నమత్యర్థపూతి
క్షతాన్మాంసం శీర్యతే చాపి యస్య॥౧౩॥
తృష్ణా మూర్ఛా జ్వరదాహౌ చ యస్య
దిగ్ధాహతం తం పురుషం వ్యవస్యేత్।
లిఙ్గాన్యేతాన్యేవ కుర్యాదమిత్రై
ర్వ్రణే విషం యస్య దత్తం ప్రమాదాత్॥౧౪॥

తా॥ గాయము తగిలినతోడనే పాకమునొంది రక్తము స్రవించుచు మిక్కిలి పరిపక్వంబై యుండుట, నల్లనిరంగుకల్గి కుళ్లి మిక్కిలి దుర్గన్ధముతోగూడి గాయమునుండి మాంసంబూడి పడుట, దప్పియు మూర్ఛయు జ్వరంబును తాపంబును గల్గియుండుట, ఇట్టి లక్షణములు కల్గియున్నయెడ శత్రువులు విషముబూసిన ఖడ్గాదులచే ప్రహరించిరని యెరుంగునది. మరియు వ్రణమునందు పొరబాటుచే విషమునుంచినను పైనిజెప్పిన లక్షణములన్నియు గానంబడును.

విషపీత లక్షణము

శ్లో॥ సపీతం గృహధూమాభం పురీషం యోఽతిసార్యతే।
ఫేనముద్వమతే చాపి విషపీతం తమాదిశేత్॥౧౫॥

తా॥ పచ్చని రంగుకల్గి కరుదూపమువలె మలము వెడలి నోట నురుగు వాంతియగుచున్నయెడ విషపానముజేసినాడని యెరుంగునది.

## సర్ప భేదములు

శ్లో॥ వాతపిత్తకఫాత్మానః భోగిమణ్డలిరాజిలాః।
యథాక్రమం సమాఖ్యాతాః ద్వ్యన్తరా ద్వన్ద్వరూపిణః॥ ౧౬ ॥

తా॥ సర్పములలో భోగి యను సర్పము వాతప్రకృతి కల్గినదియనియు, పొడలుకల్గియుండు మండలియను సర్పము పిత్తప్రకృతి కల్గియుండుననియు, తెల్లని చారలుకల రాజిలంబను సర్పము కఫప్రకృతి కల్గియుండుననియు భావము. మరియు పై జెప్పిన వాతాదిప్రకృతులుగల సర్పములలో రెండుజాతులయొక్క సంబంధముచే బుట్టిన సర్పవిశేషములు వాతాదిదోషద్వయప్రకృతిగల్గి యుండునని భావము.

## సర్పదష్ట లక్షణములు

శ్లో॥ దంశో భోగికృతః కృష్ణః సర్వవాతవికారకృత్।
పీతో మణ్డలిజః శోథో మృదుః పిత్తవికారవాన్॥ ౧౭॥
రాజిలోత్థో భవేద్దంశః స్థిరశ్శోథశ్చ పిచ్ఛిలః।
పాణ్డుస్స్నిగ్ధోఽతిసాన్ద్రాసృక్సర్వశ్లేష్మవికారకృత్॥ ౧౮॥

తా॥ భోగియను సర్పముచే కరవబడిన కాటు కృష్ణవర్ణంబై వాతరోగములనన్నింటిని కల్గించును. మండలియను సర్పముచేనైన కాటు పీతవర్ణంబై మృదువైన వాపుకల్గి పిత్తవ్యాధులన్నియు కలుగును. రాజిలంబను సర్పముచేనైన కాటు కఠినంబైన వాపుతోగూడి జిడ్డుకల్గియుండును. పాండువర్ణంబును స్నిగ్ధంబునై మిగుల చిక్కనై యుండు రక్తమును స్రవించుచు శ్లేష్మవ్యాధులన్నియు గల్గును.

## అసాధ్యసర్పదష్ట లక్షణము

శ్లో॥ అశ్వత్థదేవాయతనశ్మశాన
వల్మీకసన్ధ్యాసు చతుష్పథేషు।
యామ్యే చ దష్టాః పరివర్జనీయాః
ఋక్షే శిరామర్మసు యే చ దష్టాః॥ ౧౯॥
దర్వీకరాణాం విషమాశు హన్తి
సర్వాణి చోష్ణే ద్విగుణీభవన్తి।

తా॥ రావిచెట్టుక్రిందను, దేవాలయమునందును, శ్మశానమునందును, పుట్టలయందును, సర్పములు కరచినను, సంధ్యాకాలములయందు సర్పములు కరచినను, నాల్గు త్రోవలు గలియు చోట సర్పములు గరచినను, యమదేవతాకంబైన భరణీనక్షత్రమునాడు సర్పము కరచినను, సిరల యొక్క మర్మములయందు సర్పములు కరచినను, వాటి విషము సాధ్యంబుగాదు గాన చికిత్స జేయంజనదు. పైజెప్పిన స్థలములయందు సర్పములకు విషము రెట్టింపై యుండును గాన శీఘ్రముగ ప్రాణముల హరించునని భావము, మరియు సర్పములు కరచినప్పుడు ఉష్ణపదార్థముల సేవిం

చినను విషము రెట్టింతయై యుండునని భావము. మరియు "ఆర్ద్రాశ్లేషామఘామూలాకృత్తికా భరణీషుచ। పఞ్చమ్యాం సన్ధ్యయోర్దర్శే మర్మస్వాశుహరేషు చ। దష్టాః కష్టేన జీవన్తి యది దూతాద్యసంభవః॥" అని తన్త్రాన్తరమున నున్నదిగాన ఆర్ద్ర, ఆశ్లేష, మఖ, మూల, కృత్తిక, భరణి యను నక్షత్రములయందును, పంచమియందును, సంధ్యా కాలములయందును, అమవసనాటియందును, శృంగాటక అధిపతి శంఖ కంఠ శిరః గుద హృదయ వస్తి నాభి అనునీ సద్యఃప్రాణహరమర్మంబులయందును, సర్పములు కరచినయెడ అట్టి మను జుండు యమదూతలు లేనిచో మిక్కిలి కష్టముచే బ్రతుకును. అట్టివిషము మిక్కిలి అసాధ్యంబై యుండునని భావము.

## మరికొన్ని యసాధ్య లక్షణములు

శ్లో॥ అజీర్ణపిత్తాతపపీడితేషు బాలేషు వృద్ధేషు బుభుక్షితేషు। ౨౦॥
క్షీణక్షతే మేహిని కుష్ఠయుక్తే రూక్షేఽబలే గర్భవతీషు చాపి।

తా॥ భుజించిన యాహారము జీర్ణముగాకయుండునప్పుడును, పిత్తముచే పీడితుండైనప్పుడు, ఎండచే బాధింపబడినప్పుడును సర్పము కరచినయెడ విషము ప్రాణహరంబై యుండును. మరియు బాలులు, వృద్ధులు, ఆకలిగొన్నవారు, క్షీణించిన ధాతువులుగలవారు, గాయముతగిలిన వారు, మేహవ్యాధిగలవారు, కుష్ఠవ్యాధిగలవారు, రూక్షంబైన శరీరముగలవారు, బలహీనులు, గర్భిణీస్త్రీలు, వీరిని సర్పము కరచినయెడల విషము అసాధ్యంబై యుండును.

శ్లో॥ శస్త్రక్షతే యస్య న రక్తమేతి
రాజ్యో లతాభిశ్చ న సంభవన్తి॥ ౨౧॥
శీతాభిరద్భిశ్చ న రోమహర్షః
విషాభిభూతం పరివర్జయేత్తమ్।

తా॥ సర్పము కరచినప్పుడు కత్తిచే కొట్లువేసినను ఆ కొటునందు రక్తము స్రవించ కున్నను, తీగెలు మొదలగువానిచే గొట్టినయెడ రేఖలేర్పడకున్నను, చల్లని నీళ్లు చల్లినయెడ రోమాఞ్చము గల్గకున్నను, అట్టి సర్పవిషము శాన్తిపొందదు గాన చికిత్స చేయంజనదని భావము. ఈ యర్థము తన్త్రాన్తరమునందును "నైవ రక్తం క్షతాద్యస్య లతాఘాతేన రాజికాః। న రోమహర్షశ్శీతాద్భిర్వర్జయేత్తం విషార్దితమ్।" అని చెప్పియున్నది.

శ్లో॥ జిహ్మం ముఖం యస్య చ కేశశాతో
నాసావసాదశ్చ సకణ్ఠభఙ్గః ॥ ౨౨॥
కృష్ణస్సరక్తశ్శ్వయథుశ్చ దంశే
హన్వోః స్థిరత్వం చ వివర్జనీయః।

తా॥ సర్పము కరచినప్పుడు ముఖము వక్రంబై యున్నను, చేత పట్టినయెడ వెండ్రుకలు రాలుచున్నను, నాసిక కృశించి యున్నను, గొంతు నిలువకున్నను, కాటునందు కృష్ణవర్ణంబును

రక్తవర్ణంబులైన వాపుగల్గినను, అంకిళ్లు పట్టియున్నను, అట్టి విషము అసాధ్యంబై యుండునని భావము.

శ్లో॥ వక్త్రిర్ఘనా యస్య నిరేతి వక్త్రా
ద్రక్తం స్రవేదూర్ధ్వమధశ్చ యస్య ॥౨౩॥
దంష్ట్రానిపాతాశ్చతురశ్చ యస్య
తం చాపి వైద్యః పరివర్జయేచ్చ।

తా॥ సర్వవిషము శరీరమున వ్యాపించినప్పుడు నోటియందు చిక్కనై తంతివలె నుండు జొల్లుగారుచున్నను, నాసిక మొదలైన ఊర్ధ్వద్వారములనుండియు, గుదమునున్న గు అధో ద్వారములనుండియు, రక్తము వెడలుచున్నను, కాటునందు నాల్గు కోరల కాట్లు కల్గియున్నను, విషము అసాధ్యంబై యుండునని భావము.

శ్లో॥ ఉన్మత్తమత్యర్థ ముపద్రుతం వా
హీనస్వరం వాఽప్యథవా వివర్ణమ్॥ ౨౪॥
సారిష్టమత్యర్థమవేగినం చ
జ్ఞాత్వానరం కర్మ న తత్ర కుర్యాత్।

తా॥ ఉన్మాదము గల్గియుండుట, మిక్కిలి యుపద్రవములు కల్గియుండుట, హీనస్వరము గల్గియుండుట, శరీరవర్ణము మారియుండుట, నాసాభంగాద్యరిష్టములు కల్గియుండుట, గమనాదివేగంబులును, మూత్రపురీషాది వేగంబులును లేకుండుట, ఈ లక్షణములు సర్వవిషము వ్యాపించినప్పుడు కల్గినయెడ చికిత్స చేయంజనదు.

దూషీవిష లక్షణము

శ్లో॥ జీర్ణం విషఘ్నౌషధిభిర్హతం వా
దావాగ్నివాతాతపశోషితం వా॥౨౫॥
స్వభావతో వా గుణవిప్రహీనం
విషం హి దూషీవిషతాముపైతి।

తా॥ విషహరంబులైన ఔషధములచే ప్రతిహతంబై వీర్యముదక్కియున్నను, కార్చిచ్చు గాలి ఎండ మొదలగువానిచే శోషించియున్నను, స్వభావముచేత నే వ్యవాయి వికాసి మొదలగు పదిగుణములలో కొన్నిగుణములు తక్కువయైయున్నను, అట్టి విషము దూషీవిషంబని యొప్పుంగునది.

శ్లో॥ వీర్యాల్పభావాన్న నిపాతయేత్త
త్కఫాన్వితం వర్షగణానుబన్ధి॥ ౨౬ ॥
తేనార్దితో భిన్నపురీషవర్ణో
వైగన్ధ్యవైరస్యయుతః పిపాసీ।

మూర్ఛాం భ్రమం గద్గదవాక్త్వమించ
విచేష్టమానోఽరతిమాప్నుయాద్వా ॥౨౭॥

తా॥ పైజెప్పిన దూషీవిషము స్వల్పమైన వీర్యము కల్గియుండును గాన మనుజుని జంపక కఫముతోఁగూడి చిరకాలమువరకు అనుసరించి శరీరమున వ్యాపించి యుండును. మరియు నావిష ముచే పీడింపబడిన మనుజుండు శరీరవర్ణము మారి భిన్నంబైన పురీషముగల్గి యుండును. శరీరమునందు విరుద్ధగంధంబును, నోటియందు రసహీనతయు, దప్పియు, మూర్ఛయు, భ్రమంబును, గద్గదభాషణంబును,వాంతియు కల్గి విరుద్ధచేష్టలం జేయుచు దేనియందును ఇచ్ఛలేకుండును.

ఆశ్రయభేదముచే దూషీవిషమున గల్గు విశేషములు

శ్లో॥ ఆమాశయస్థే కఫవాతరోగీ
పక్వాశయస్థేఽనిలపిత్తరోగీ।
భవేత్సముద్ధ్వస్తశిరోరుహాఙ్గో
విలూనపక్షస్తు యథా విహఙ్గః ॥౨౮॥

తా॥ పైజెప్పినవిషము ఆమాశయమున జేరినప్పుడు కఫవాతములచే జనించు వ్యాధులచే పీడితుండగును, పక్వాశయమున జేరినపుడు వాతపిత్తరోగములు విశేషముగ జనించును. మరియు శిరస్సునందలి వెంట్రుకలును శరీరమునందలి రోమంబులును ఊడి రెక్కలనొలిచిన పక్షివలె వికృతాకారముకల్గియుండును. మరియు "సీదన్తి కేశా లోమాని తస్మిన్పక్వాశయాశ్రితే" అని తంత్రాన్తరమున నుండుటంజేసి ప్రకృతిమూలమున "శిరోరుహాఙ్గః" అను చోట రుహా శబ్దమును శిరశ్శబ్దముతోడను అంగశబ్దముతోడను అన్వయించుటచే శిరోరుహా, అంగరుహా అని యర్థముచేయ నుచితంబని యెరుంగునది.

రసాదిధాతువుల నాశ్రయించిన దూషీవిష లక్షణము

శ్లో॥ స్థితం రసాదిష్వథవా యథోక్తాన్
కరోతి ధాతుప్రభవాన్ వికారాన్।
కోపం చ శీతానిలదుర్దినేషు
యాత్యాశుపూర్వం శృణు తస్య రూపమ్॥౨౯॥
నిద్రాం గురుత్వం చ విజృమ్భణం చ
విశ్లేషహర్షావథవాఙ్గమర్దమ్।
తతః కరోత్యన్నమదావిపాకా
వరోచకం మణ్డలకోఠజన్మ॥౩౦॥
మాంసక్షయం పాదకరప్రశోథం

మూర్ఛాం తథాచ్ఛర్దిమథాతిసారమ్।
దూషీవిషం శ్వాసతృషాజ్వరాంశ్చ
కుర్యాత్ప్రవృద్ధిం జఠరస్య చాపి ॥౩౧॥
ఉన్మాదమన్యజ్జనయేత్తథాన్య
దానాహమన్యత్క్షపయేచ్చ శుక్రమ్।
గాద్గద్యమన్యజ్జనయేచ్చ కుష్ఠం
తాంస్తాన్ వికారాంశ్చ బహుప్రకారాన్ ॥౩౨॥

తా॥ అట్టి దూషీవిషము రసాదిధాతువుల నాశ్రయించి యున్నపుడు రసాదులచే గల్గు వ్యాధులు జనించును. శీతకాలమునందును, గాలివీచు సమయమునందును, మేఘము లావరించి యుండు సమయమునందును ఆ విషము మిక్కిలి ప్రకోపము నొందును. మరియు నది ప్రకోపము నొందునపుడు మున్ను అతినిద్ర, శరీరము బరువుగ నుండుట, ఆవలింతలు, అవయవములు శిథిలంబులై యుండుట, గగుర్పాటు, ఒడలినొప్పులు, ఈ లక్షణములు కల్గును. పిమ్మట అన్నము భుజించినపిదప సంతోషము గల్గుట, భుజించిన యాహారము జీర్ణముగాకుండుట, అరుచి, దేహమునందు పొక్కులును దద్దులును గల్గుట, శరీరమున మాంసపుష్టి నశించుట, హస్తములయందును పాదములయందును వాపుగల్గుట, మూర్ఛ, వాంతి, అతిసారము, శ్వాసము, దప్పి, జ్వరము, జఠరము వృద్ధినొందుట, ఈ లక్షణములు విషము వృద్ధినొందుటచే గల్గును. మరియు నొకవిషము ఉన్మాదమును, వేరొకటి కడుపుబ్బరమును, ఇంకొకటి శుక్రమును నశింపజేసి నపుంసకత్వమును, మరియొకటి గద్గదస్వరమును, కుష్ఠమును కల్గించును. మరియు నీ విషముచేత విసర్పము మున్నగాగల నానావిధవ్యాధులు కల్గును.

## దూషీవిషశబ్దమున కర్థము

శ్లో॥ దూషితం దేశకాలాన్న దివాస్వప్నైరభీక్ష్ణశః।
యస్మాత్సందూషయేద్ధాతూన్ తస్మాద్దూషీవిషం స్మృతమ్॥౩౩॥

తా॥ దేశము, కాలము, అన్నము, పవటియందు నిదురించుట, ఇట్టి కారణములచేత దూషితంబై రసాదిధాతువులను నష్టములుగ జేయును గాన ఈ విషము దూషీవిషంబని పేర్కొనబడియెనని భావము.

## సాధ్యాసాధ్యదూషీవిష లక్షణములు

శ్లో॥ సాధ్యమాత్మవతస్సద్యో యాప్యం సంవత్సరోత్థితమ్।
దూషీవిషమసాధ్యం స్యాత్క్షీణస్యాహిత సేవినః ॥౩౪॥

తా॥ దూషీవిషము, ఇంద్రియముల నిగ్రహించియుండువారికి తత్కాలమున సంభవించిన యెడ సాధ్యంబును, సంవత్సరకాలమువరకు అనువర్తించి యున్నయెడ యాప్యంబును, శరీరబలము క్షయించి అపథ్యాహారముల జేయుచున్నయెడ అసాధ్యంబునై యుండును.

శ్లో॥ సౌభాగ్యార్థం స్త్రియస్స్వేదం రజోనానాఙ్గజాన్మలాన్।
శత్రుప్రయుక్తాంశ్చ గరాన్ ప్రయచ్ఛన్త్యన్నమిశ్రితాన్ ॥౩౫॥
తైస్స్యాత్పాణ్డుః కృశోఽల్పాగ్నిః గరశ్చాస్యోపజాయతే।
మర్మప్రధమనాధ్మానం హస్తయోశ్శోథలక్షణమ్ ॥౩౬॥
జఠరం గ్రహణీదోషో యక్ష్మా గుల్మః క్షయో జ్వరః।
ఏవంవిధస్య చాన్యస్య వ్యాధేర్లిఙ్గాని దర్శయేత్ ॥౩౭॥

తా॥ స్త్రీలు పురుషులను వశ్యముజేసికొనుటకు విషజంతువులయొక్క చెమట, మూత్రము, వాని శరీరమునందుండు నానావిధమలములు, వీనినన్నింటిని అన్నాదులయందు కలిపి పెట్టినను, శత్రువులు చంపుటకై విషయుక్తంబులైన యన్నాదుల నిడినను ఆట్టి విషము జీర్ణంబు గాకుండును. దానంజేసి పాండురోగంబును, కృశత్వంబును, అగ్నిమాన్ద్యంబును, మర్మములయందు వ్యథయు, కడుపుబ్బరంబును, హస్తములయందు వాపును, ఉదరవ్యాధియు, గ్రహణీరోగంబును, రాజయక్ష్మయు, గుల్మంబును, క్షయంబును, జ్వరంబును, ఈ వ్యాధులు ఆ యా దోషముల ననుసరించి కల్గును. మరియు విస్ఫోటము మొదలగు వ్యాధులయొక్క లక్షణములు గానంబడును.

లూతా లక్షణము

శ్లో॥ యస్మాల్లూనం తృణం ప్రాప్తాః మునేః ప్రస్వేదబిన్దవః।
తస్మాల్లూతాస్తు భాష్యన్తే సంఖ్యయా తాశ్చ షోడశ ॥౩౮॥

తా॥ వసిష్ఠమహర్షి యొక్క చెమటతుంపురులు ఛేదింపబడిన తృణములయందు పడి కీటరూపముల ధరించి యుండుటంజేసి లూత (సాలెపురుగు) యనంబడునని భావము. ఇచ్చట (విశ్వామిత్రుండు వసిష్ఠునియొక్క హోమధేనువును బలాత్కారముగ గ్రహించ సమకట్టినప్పుడు వసిష్ఠుండు కోపపరవశుండై క్రూరదృష్టిచే సూర్యునిజూడ ముఖమున చెమటబట్టి యాబిందువులు సమీపమునందు తృణములపయింబడిన అవి కీటరూపంబులై లూత యను పేరుచే చేర్కొనంబడియె నను పురాణకథ నెరుంగునది.)

మరియు ఆట్టిలూతలను కీటంబులు పదునారువిధంబులై యుండునని భావము. వాని భేదము లన్నియు సుశ్రుతమున నిత్తెరంగున గానంబడియెడు: "త్రిమణ్డలా తథా శ్వేతా కపిలా పీతకా తథా। లాలామూత్రవిషా రక్తా కశనా చాష్టమీ తథా। సౌవర్ణికా లాజవర్ణా జాలిన్యేకపదీ తథా। కృష్ణాగ్నివక్త్రా కాణ్డా చ మాలాగుణ్యష్టమీ మతా॥" త్రిమండల, శ్వేత, కపిల, పీతక, లాలావిష (ఎంగిలి విషముగ గల్గినది), మూత్రవిష (మూత్రము విషముగ గల్గినది), రక్త (ఎఱ్ఱనిరంగు కల్గినది), కశన (గట్టిగనుండునది), సౌవర్ణిక, లాజవర్ణ (పేలాలవంటి మచ్చలు కల్గినది), జాలిని, ఏకపది, కృష్ణ, అగ్నివక్త్రి (నిప్పువలె తీక్ష్ణమైన నోరుకల్గినది), అగ్నికాణ్డ (నిప్పువంటి తుండము కల్గినది), మాలాగుణి, అను నీ పదునారు పేర్ల చేత పదునారువిధములుగ భిన్నరూపములై లూతలు జనించునని భావము.

## లూతాదిదష్ట లక్షణము

శ్లో॥ తాభిర్దష్టే దంశకోథః ప్రవృత్తిః క్షతజస్య చ।
జ్వరో దాహోఽతిసారశ్చ గదాస్స్యుస్త్రిదోషజాః ॥౩౯॥
పిడకా వివిధాకారా మణ్డలాని మహాన్తి చ।
శోథా మహాన్తో మృదవో రక్తాశ్యావాశ్చలాస్తథా ॥౪౦॥
సామాన్యం సర్వలూతానాం ఏతద్దంశస్య లక్షణమ్।

తా॥ పైఁజెప్పిన పదునారు తెరంగులైన కీటములు కరచినప్పుడు కాటునందు కుళ్లి యుండుట, రక్తము స్రవించుట, జ్వరము, మంట, అతిసారము, త్రిదోషములచే జనించు వ్యాధులు, నానావిధంబులైన పిటకలు, పొడలు, మృదువులును, రక్తవర్ణంబులును, శ్యామవర్ణంబులును, చంచలంబులునైన వాపులు; ఇవన్నియును జనించును. నానావిధకీటములు కరచినప్పుడు సామాన్యముగ ఈ లక్షణంబులు కల్గునని భావము.

## దూషీవిష లూతాదష్ట లక్షణము

శ్లో॥ దంశమధ్యే తు యత్కృష్ణం శ్యావం వా జాలకాచితమ్ ॥౪౧॥
దగ్ధాకృత్యతిరుక్పాకక్లేదశోథజ్వరాన్వితమ్।
దూషీవిషాభిర్లూతాభి స్తద్దష్టమితి నిర్దిశేత్ ॥౪౨॥

తా॥ కాటునందు నడుమ కృష్ణవర్ణంబును శ్యామవర్ణంబునైన మచ్చ కల్గి పైకిమిక్కిలి అధికమైన పాకంబును, వాపును, జ్వరంబును కల్గి యున్నయెడల దూషీవిషంబులైన లూతలచే కరవబడెనని యెరుంగునది. కరచిన కొంతకాలమునకు శరీరమున వ్యాపించు విషముగల కీటములు దూషీవిషకీటంబులని భావము. అయ్యవి "త్రిమండలా తథా శ్వేతా" అని యుపక్రమించి సుశ్రుతమున చెప్పబడిన పదునారింటిలో కొన్నింటి నెనిమిదియు దూషీవిష కీటంబులని యెరుంగునది.

## సౌవర్ణికాది దష్ట లక్షణము

శ్లో॥ శోథశ్శ్వేతాస్సితా రక్తాః పీతా వా పిడకా జ్వరః।
ప్రాణాన్తికాశ్చ జాయన్తే శ్వాసహిక్కాశిరోగ్రహాః ॥౪౩॥

తా॥ వాపును, శ్వేతవర్ణంబులును, నల్లనిరంగుకల్గినవియు, రక్తవర్ణంబులును, పీతవర్ణంబులునైన పిటకలును, జ్వరంబును కల్గి శ్వాసము, వెక్కిళ్లు, తలనొప్పి కల్గినయెడ సౌవర్ణిక మొదలగు నెనిమిదివిధములైన కీటములయొక్క విషముచే పీడితుండని యెరుంగునది. ఈ విషములు ప్రాణాన్తకరంబులై యుండును గాన అసాధ్యంబులని యెరుంగునది.

## ఆఖువిష లక్షణము

శ్లో॥ ఆదంశాచ్ఛోణితం పాణ్డుమణ్డలాని జ్వరోఽరుచిః।
లోమహర్షశ్చ దాహశ్చాప్యాఖుదూషివిషార్దితే ॥౪౪॥

మూర్ఛాంగశోథవైవర్ణ్యక్లేదశబ్దాశ్రుతిజ్వరాః।
శిరోగురుత్వం లాలాసృక్ఛర్ది శ్చాసాధ్యమూషికైః ॥౧౪॥

తా॥ కాటునుండి రక్తము వెడలుట, పాండువర్ణంబులైన పొడలు కల్గియుండుట, జ్వరము, అరుచి, రోమాంచము, తాపము, ఈ లక్షణములు ఎలుకయొక్క దూషీవిషముచే పీడింపబడినప్పుడు కల్గును. మూర్ఛ, శరీరమున వాపు, వర్ణము మారియుండుట, చెమటబట్టుట, చెవులకు ధ్వని వినరాకుండుట, జ్వరము, తల బరువై యుండుట, నోట జొల్లుగారుట, రక్తమును వాంతి జేయుట, ఈ లక్షణములు ఎలుకల విషము శరీరమున వ్యాపించినపుడు కల్గినయెడ అసాధ్యంబై యుండునని భావము. మరియు "శుక్రం పతతి యత్రైషాం శుక్రదృష్టాస్పృశన్తిచ" ఎలుకలు శుక్రవిషంబులని తన్త్రాన్తరమున నున్నదిగాన అట్టి శుక్రము తగిలినచోట బాధ కల్గునని యెరుంగునది.

కృకలాసదష్ట లక్షణము

శ్లో॥ కార్ష్ణ్యం శ్యావత్వమథవా నానావర్ణత్వమేవ వా।
మోహోఽథ వర్చసోభేదో దష్టే స్యాత్కృకలాసకైః ॥౧౫॥

తా॥ శరీరము కృష్ణవర్ణంబుగనైనను శ్యామవర్ణంబుగనైన నుండుట, లేక అనేకవర్ణములు కల్గియుండుట, మూర్ఛ, మలము భిన్నమై యుండుట, ఈలక్షణములు కల్గియున్నయెడ ఊసరవల్లి కరచిన విషంబని యెరుంగునది.

వృశ్చికదష్ట లక్షణము

శ్లో॥ దహత్యగ్నిరివాదౌ చ భినత్తీవోర్ధ్వమాశు చ।
వృశ్చికస్య విషం యాతి దంశే పశ్చాత్తు తిష్ఠతి।
దష్టోఽసాధ్యశ్చ హృద్ఘ్రాణరసనోపహతో నరః।
మాంసైః పతద్భిరత్యర్థం వేదనార్తో జహత్యసూన్ ॥౧౬॥

తా॥ కుట్టినతోడనే నిప్పున కాలినవిధంబుగ అధికముగ మంటగల్గి శీఘ్రముగ కుట్టినచోట నుండి విషము పైకి వ్యాపించి పిమ్మట కొంతసేపటికి కుట్టినచోట జేరినయెడ తేలుకుట్టిన విషంబని యెరుంగునది. తేలుకుట్టినవానికి రొమ్ము, నాసాద్వారములు, కంఠము, ఇవి యడచికొనియున్నను, కుట్టినచోటనుండి మాంసం బూడిపడుచు మిక్కుటమైన వేదనకల్గియున్నను, తేలుకుట్టిన విషము సాధ్యంబుగాదని యెరుంగునది. వృశ్చికములు కొండెతో పొడిచినప్పుడు విషము వృద్ధినొంది బాధించునని యెరుంగునది.

కణభదష్ట లక్షణము

శ్లో॥ విసర్పశ్శ్వయథుశ్శూలం జ్వరశ్ఛర్దిరథాపి చ।
లక్షణం కణభైర్దష్టే దంశశ్చైవావసీదతి॥౧౭॥

తా॥ విసర్పము, వాపు, నొప్పి, జ్వరము, వాంతి, ఈ లక్షణములు కణభంబులను కీటములు (కణితిరీగలు) కరచినప్పుడు కల్గును. మరియు కరచిన కాటు తెలియకుండును.

### ఉచ్చిటింగ దష్టలక్షణము

శ్లో॥ హృష్టరోమోచ్చిటింగేన స్తబ్ధలింగో భృశార్తిమాన్।
దష్టశ్శీతోదకేనేవ సిక్తాన్యంగాని మన్యతే॥౧౦॥

తా॥ రోమహర్షము కల్గుట, శిశ్నము స్తంభించియుండుట, మిక్కిలి వేదనకల్గుట, శరీరము నందెల్ల చన్నీళ్లు చల్లిన విధంబుగ నుండుట, ఈ లక్షణములు కల్గినయెడ ఉచ్చిటింగంబను కీటము కరచినదియని యెరుంగునది.

### మండూకదష్ట లక్షణము

శ్లో॥ ఏకదంష్ట్రార్దితశ్శూనస్సరుజః పీతకస్సతృట్।
ఛర్దిర్నిద్రా చ సవిషైర్మణ్డూకైర్దష్టలక్షణమ్॥౧౧॥

తా॥ విషముతోగూడిన కప్పలు కరచినప్పుడు నొప్పితోగూడినవాపును, దేహమునందు పచ్చనిరంగును, దప్పియు, వాంతియు, అతినిద్రయు, ఈ లక్షణములన్నియు కల్గును. కప్పలు ఒక ప్రక్కనుండు కోరలచేతనే కరచును గాన "ఏకదంష్ట్రార్దితః" అని చెప్పియున్నదియని యెరుంగునది.

### మత్స్యజలౌక దష్టవిషలక్షణము

శ్లో॥ మత్స్యాస్తు సవిషాః కుర్యుః దాహం శోథం రుజం తథా।
కణ్డూం శోథం జ్వరం మూర్ఛాం సవిషాస్తు జలౌకసః॥౧౨॥

తా॥ విషముతోగూడిన మత్స్యములు కరచినయెడ మంట, వాపు, నొప్పి, దురద, ఈ లక్షణములు కల్గును. విషముతోగూడిన జలజన్తువులు (జలగలు మొదలగునవి) కరచినయెడ దురదయు, వాపును, జ్వరంబును, మూర్ఛయు కల్గును.

### గృహగోధికాశతపదీవిష లక్షణములు

శ్లో॥ విదాహం శ్వయథుం తోదం స్వేదం చ గృహగోధికా।
దంశే స్వేదం రుజం దాహం కుర్యాచ్ఛతపదీవిషమ్॥౧౩॥

తా॥ బల్లివిషము తగిలినప్పుడు మంటయు, వాపును, పోటును, చెమటయు, కల్గును. జెర్రికరచినయెడ కాటునందు చెమటయు, నొప్పియు, మంటయు, కల్గును.

### మశకవిష లక్షణము

శ్లో॥ కణ్డూమాన్మశకైరీషచ్ఛోథస్స్యాన్మన్దవేదనః।
అసాధ్యకీటసదృశ మసాధ్యం మశకక్షతమ్॥౧౪॥

తా॥ దోమలు కుట్టినయెడ దురదయు, కొంచెముగ వాపును, స్వల్పమైన వేదనయు, కల్గును. అసాధ్య కీటంబులగు లూతలతో సమానలక్షణంబులైన మశకములు కుట్టినయెడ నయ్యది యసాధ్యముగ నుండును. మరియు "పార్వతీయైస్తు కీటైశ్చ ప్రాణహారైస్తుల్యలక్షణమ్"

అని సుశ్రుతమున నుండుటంజేసి పర్వతమున జనించిన కీటములతో సమానలక్షణంబులైన మశకముల విషము ప్రాణహరంబై యుండునని యెఱుంగునది.

## మక్షికాదష్ట లక్షణము

శ్లో॥ సద్యః ప్రస్రావిణీ శ్యావా దాహమూర్ఛా జ్వరాన్వితా।
పిడకా మక్షికా దంశే తాసాం తు స్థగికాఽసుహృత్॥౫౫॥

తా॥ ఈగలు కరచినప్పుడు కరచినతోడనే స్రావముకల్గి శ్యామవర్ణంబై మంటయు, మూర్ఛయు, జ్వరంబును కల్గి కుట్టినచోట పొక్కులు లేచును. అందులో స్థగిక యను మక్షికము కరచినయెడ ప్రాణహాని కల్గును.

## వ్యాఘ్రాదిదష్ట లక్షణములు

శ్లో॥ చతుష్పద్భిర్ద్విపద్భిశ్చ నఖదన్తవిషం చ యత్।
శూయతే పచ్యతే చాపి స్రవతి జ్వరయత్యపి॥౫౬॥

తా॥ బెబ్బులులుమున్నగు నాల్గుకాళ్లుగల జంతువులైనను అడవిమనుష్యులు మొదలగు రెండు కాళ్ళుగల జంతువులైనను కరచినయెడ కాటునందు విశేషముగ చీముబట్టి పుండై చీముకార్చుచు జ్వరము కల్గియుండును.

## విషరహిత లక్షణము

శ్లో॥ ప్రశాన్తదోషం ప్రకృతిస్థధాతు
మన్నాభికామం సమమూత్రవిట్కమ్।
ప్రసన్నవర్ణేన్ద్రియచిత్తచేష్టం
వైద్యోఽవగచ్ఛేదవిషం మనుష్యమ్॥౫౭॥

తా॥ వాతాదిదోషములు ప్రకోపములేక స్వస్థానములయందు శాన్తంబులై యుండుట, రసాదిధాతువులు వికారములేకయుండుట, జఠరాగ్ని న్యూనాధిక్యములేక సమంబై యన్నముభుజించుట కిచ్చగొని యుండుట, మలమూత్రములు అధికంబులును న్యూనంబులును గాక సమంబులై యుండుట, నేత్రములు మొదలైన ఇంద్రియంబులు, శరీరవర్ణము, చిత్తము, చేష్టలు, ఇవియన్నియు వికృతంబులుగాక స్వాభావికములుగ నుండుట, ఈ లక్షణములు గల్గియున్నయెడ మనుజుని శరీరమునందు విషములేదని వైద్యుండెఱుంగవలెనని భావము. మరియు నిచ్చట "సమమూలజిహ్వం" అని పాఠాన్తరమును కొందరు చెప్పి జిహ్వామూలము రసాదులను విరుద్ధముగాక సమముగ గ్రహించుచుండినయెడ విషములేదని వచించెదరు. దీనిచేత విషము వ్యాపించియున్నపుడు నాలుకకు రసపరిజ్ఞానము లేకుండుననియు, విషములేనిచో యథాస్థితిగ రసముల గ్రహించుననియు నెఱుంగునది.

మరియు "అన్నాభికామమ్" అనుటచేత అగ్నిమాంద్యము లేక అగ్నిసమమై యుండునని భావము. ఈ యర్థము చరకమున నిత్తెఱంగున గానంబడియెడు: "ప్రాయేణోపహతాగ్నిత్వాత్ సపిచ్ఛమతి సార్యతే।।ప్రాప్నోతి చాస్యవైరస్యం న చాన్న

మభినన్దతి॥" జఠరాగ్ని చల్లారినయెడ పిచ్ఛిలంబుగ మాటిమాటికి విరేచనమగుచు నోరు రసాదుల నెరుగక విరసంబై అన్నమును భుజించుట కిచ్చగొనకుండునని యర్థము. ఈ వాక్యముచేత అగ్ని మందంబై యున్నపుడు అరుచియు, అన్నమునం దిచ్ఛ లేకపోవుటయు కల్గుననియు, సమముగ నున్నపుడు నోట రుచిగల్గి అన్నమునం దిచ్చబోడముననియు తెలియుచున్నది.

## విషపరీక్షా క్రమము

శ్లో॥ దర్శనస్పర్శనప్రశ్నైః పరీక్షా త్రివిధా మతా।
వయో వర్ణశరీరాణాం ఇన్ద్రియాణాం చ దర్శనాత్॥



ఇతి శ్రీ మాధవకరవిరచితే మాధవనిదానే
విషనిదానం సమాప్తమ్



తా॥ విషముచే పీడింపబడినవారిని దర్శనము (చూచుట), స్పర్శనము (తాకుట), ప్రశ్న (అడుగుట), ఈ మూడువిధములచేత పరీక్షించవలెను. అందు వయస్సు, శరీరవర్ణము, ఇంద్రియములు, వీనినన్నింటిని విశేషముగ పరీక్షించవలెనని భావము.



ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్ద సంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపికయను
మాధవనిదానాన్ధ్రతాత్పర్యమునందు
విషనిదానము
సమాప్తము



శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీరస్తు



# విషయానుక్రమణికా



శ్లో॥ జ్వరోఽతిసారో గ్రహణీ చార్శోఽజీర్ణం విసూచికా।
అలసశ్చ విళంబీ చ క్రిమిరుక్పాండుకామలాః॥౧॥
హలీమకం రక్తపిత్తం రాజయక్ష్మ ఉరఃక్షతమ్।
కాసో హిక్కా సహ శ్వాసైః స్వరభేద స్త్వరోచకః॥౨॥
ఛర్దిస్తృష్ణా చ మూర్ఛాద్యా రోగాః పానాత్యయాదయః।
దాహోన్మాదాపస్మారాః కఫతోఽథాఽనిలామయః॥3॥
వాతరక్తమూరుస్తమ్భ ఆమవాతోఽథ శూలరుక్।
పక్తిజం శూలమానాహ ఉదావర్తోఽథ గుల్మరుక్॥౪॥
హృద్రోగో మూత్రకృచ్ఛ్రం చ మూత్రాఘాత స్తథాశ్మరీ।
ప్రమేహో మధుమేహశ్చ పిడకాశ్చ ప్రమేహజాః॥౫॥
మేద స్తథోదరం శోథో వృద్ధిశ్చ గలగణ్డకః।
గణ్డమాలాఽపచీగ్రన్థిరర్బుదశ్లీపదం తథా॥౬॥
విద్రధిర్వ్రణశోథౌ చ ద్వౌ వ్రణౌ భగ్ననాడికే।
భగన్దరోపదంశౌ చ శూకదోష స్త్వగామయః॥౭॥
శీతపిత్తముదర్దశ్చ కోఠశ్చైవామ్లపిత్తకమ్।
విసర్పశ్చ సవిస్ఫోటః సరోమాన్త్య మసూరికాః॥౮॥
క్షుద్రాస్యకర్ణనాసాక్షిశిరస్త్రీబాలకామయాః।
విషం చేత్యయముద్దిష్టో రుగ్వినిశ్చయసఙ్గ్రహః॥౯॥

తా॥ జ్వరము, అతిసారము, గ్రహణి, అర్శస్సు, అజీర్ణము, విసూచిక, అలసకము, విళంబి, క్రిమిరోగము, పాండురోగము, కామల, హలీమకము, రక్తపిత్తము, రాజయక్ష్మ, ఉరఃక్షతము, కాసము, హిక్క, శ్వాసము, స్వరభేదము, అరోచకము, ఛర్ది, తృష్ణ, మూర్ఛ, భ్రమ, నిద్ర, తంద్ర, సన్యాసము, పానాత్యయము, పరమదము, పానాజీర్ణము, పానవిభ్రమము,

దాహము, ఉన్మాదము, అపస్మారము, వాతవ్యాధి, వాతరక్తము, ఊరుస్తంభము, ఆమవాతము, శూలవ్యాధి, పరిణామశూల, ఆనాహము, ఉదావర్తము, గుల్మము, హృద్రోగము, మూత్రకృచ్ఛ్రము, మూత్రాఘాతము, అశ్మరి, ప్రమేహము, మధుమేహము, ప్రమేహపిడక, మేదోరోగము, ఉదరవ్యాధి, శోథ, అండవృద్ధి, గలగండము, గండమాల, అపచి, గ్రంథి, అర్బుదము, శ్లీపదము, విద్రధి, వ్రణశోథ, శారీరవ్రణము, సద్యోవ్రణము, భగ్నము, నాడీవ్రణము, భగందరము, ఉపదంశము, శూకదోషము, కుష్ఠము, శీతపిత్తము, ఉదర్దము, కోఠము, అమ్లపిత్తము, విసర్పము, విస్ఫోటము, మసూరిక, క్షుద్రరోగములు, ముఖరోగములు, కర్ణరోగము, నాసారోగము, అక్షిరోగము, శిరోరోగము, స్త్రీరోగములు, బాలరోగములు, విషవ్యాధి, అను నీ రోగములయొక్క నిదానములు సంగ్రహముగ నీగ్రంథమున జెప్పంబడియెనని భావము.

శ్లో॥ సుభాషితం యత్ర యదస్తి కించి
త్తత్సర్వ మేకీకృతమత్ర యత్నాత్।
వినిశ్చయో సర్వరుజాం నరాణాం
శ్రీమాధవేనేన్దుకరాత్మజేన॥౧౦॥

తా॥ మనుజులకు సంబంధించిన సకలవ్యాధుల నిర్ణయించుటకై లక్షణము లచ్చటచ్చట గ్రంథాన్తరములయందు జెప్పబడిన వానినన్నింటిని మిక్కిలి ప్రయత్నముచే నొక్కచోట జేర్చి వివరముగ ఇందుకరతనయుండగు మాధవకరుం డనువానిచే జెప్పంబడియెనని భావము.

గ్రన్థాన్త మంగళము

శ్లో॥ యత్కృతం సుకృతం కించిత్కృత్వైవం రుగ్వినిశ్చయమ్।
ముఞ్చన్తు జన్తవస్తేన నిత్యమాతఙ్క సన్తతిమ్॥౧౧॥

ఇతి శ్రీ మాధవకరవిరచితం మాధవనిదానం
సమాప్తమ్

తా॥ పూర్వజన్మమున కొంచెమైనను సుకృతముజేసి యున్నయెడ పైజెప్పిన గ్రంథము ననుసరించి రోగముల నిశ్చయించి అట్టి పుణ్యవిశేషముచేత సకలప్రాణులును సకలరోగసమూహముమును వదలి ఎల్లప్పుడును సుఖించుచుండవలెనని భావము.

ఇతి శ్రీ శ్రీ ఆయుర్వేదమహోపాధ్యాయ పండిత అగరం పుట్టస్వామిశాస్త్రి చర
ణారవిన్ద సంసేవాసమాసాదిత ఆయుర్వేదవిద్యాసత్సంప్రదాయ గౌతమ
గోత్రవిరాజమాన దివ్యాన్వవాయ రామకృష్ణార్యతనూభవ సకలసహృదయ
విధేయ "ఆయుర్వేదమార్తాణ్డ" "భిషఙ్మణి" "పణ్డిత"
గోపాలాచార్య విరచితంబైన నిదానదీపికయను
మాధవనిదానాన్ధ్రతాత్పర్యము
సర్వంబును
సమాప్తము

# శుద్ధపత్రిక

| తప్పు | ఒప్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| తిర్యశ్చ | తిర్యక్చ | ౭ | ౬ |
| విచ రేదుంగపచ్చాపి | విచ రేన్యగపచ్చాపి | ౮ | ౧౫ |
| నీరామో | నిరామో | ,, | ౧౬ |
| సిరం | సిరం | ,, | ౧౯ |
| మరుగుతో | మరుగుతో | ౯ | ౧౧ |
| దోవివశేవ | దోషవిశేష | ౧౦ | ౧౯ |
| వాధిని | వ్యాధిని | ౧౨ | ౨౨ |
| శీతజల | శీతలజల | ,, | ౨౩ |
| విశేనులని | విశేషములని | ,, | ౨౫ |
| రోగంబులకు | రోగంబులను | ,, | ౩౨ |
| శమింపదగు | శమింపజేయదగు | ,, | ౩౩ |
| నిజంచిన | జనించిన | ౧౩ | ౬ |
| కరక్కాయ | క్షీరము | ౧౯ | ౨౦ |
| మదోత్యయ | మదాత్యయ | ,, | ౩౦ |
| అనునవి | యీ | ౧౫ | ౯ |
| అగ్నిమాంద్యము | ఒకటు పిగ బట్టినట్లు బాధ | ౧౪ | ౨౮ |
| మలా | మలాః | ౧౭ | ౫ |
| మిక్కువంబగు | మిక్కుటంబగు | ౨౦ | ౧౨ |
| రసానుడి నగాః | రసాను గాః | ౨౨ | ౮ |
| స్వరాజ్ఞ | స్వరాజ్ఞ | ,, | ౧౭ |
| రోగేచజ్వరో | రోగేచనజ్వరో | ,, | ౧౮ |
| ఆవలింతలు. | ఆవలింతలు, | ,, | ౩౧ |
| సంస్పృష్టేద్వంద్వ | సంసృష్టైర్ద్వంద్వ | ౨౩ | ౮ |
| ప్రకోపతే | ప్రకోపతః | ,, | ౯ |
| సోదాడి విపాకితా | సావోడి విపాకితా | ౨౪ | ౨౮ |
| శిరసే | విరసో | ౨౭ | ౧౦ |
| తంద్రయః | తంద్రతాః | ౨౯ | ౧౮ |
| త్రిరాత్రన్నహి | త్రిరాత్రాన్నహి | ,, | ౨౨ |
| అగన్తుజ్జాయతే | అగన్తుర్జాయతే | ౩౨ | ౨౭ |
| కఫలము | కఫముల | ౩౮ | ౩౨ |
| ప్రలేపకస్తు | ప్రలేపకస్తు | ౩౯ | ౨౪ |
| అసి | అసి | ౪౦ | ౧౧ |
| కప | కఫ | ౪౨ | ౨౦ |
| శ్ఛర్దవ | శ్ఛర్దన | ౪౪ | ౩ |
| స్పృష్ట | సృష్ట | ,, | ౯ |
| నిధాన | నిదాన | ౪౮ | ౧ |

# శుద్ధపత్రిక

| తప్పు | ఒప్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| హాంరబు | హారంబు | ౪౮ | ౨౫ |
| రచింగెను | రచించెను | ౬౦ | ౧౩ |
| గ్రహాణి | గ్రహాణి | ,, | ౧౫ |
| కల్గిదనియు | కల్గినదియు | ౬౨ | ౨౩ |
| ఉష్ట్రాశిమ | ఉష్ట్రాశ్విమ | ౬౮ | ౨౭ |
| తీష్ణాగ్ని | తీక్ష్ణాగ్ని | ౬౯ | ౧౭ |
| స్రావిణోవిస్రా | స్రావిణోవిస్రా | ౬౯ | ౨౫ |
| సమానంబులును | సమానంబులను | ౭౨ | ౨౪ |
| సంచిరించు | సంచరించు | ౭౩ | ౨౦ |
| వ్యవ | వ్యపివ | ౭౬ | ౬ |
| చతుర్విధః | చతుర్విధః | ౭౭ | ౮ |
| సుదగ్ధా | విదగ్ధా | ౮౧ | ౧౦ |
| చరకము | చరకమునందు | ౮౭ | ౨౦ |
| స్పృత్తుయా | స్వక్ త్వయా | ౯౨ | ౧౭ |
| యుపద్రవముతో | యుపద్రవములతో | ,, | ౨౦ |
| అసాధ్యందని | అసాధ్యంబని | ౯౩ | ౮ |
| కామిలా | కామలా | ,, | ౨౮ |
| కామాలా | కామలా | ౯౪ | ౨౫ |
| దానం | నిదానం | ,, | ౨౬ |
| క్షామ | క్షార | ౯౬ | ౯ |
| తస్త్వైవ | తస్త్వైవ | ౧౦౮ | ౧౦ |
| కణా | కణ్డా | ౧౦౯ | ౧౧ |
| వింధంబు | విధంబు | ౧౧౬ | ౧౬ |
| దుఃఖ | దుఃఖే | ౧౨౦ | ౧౦ |
| జనించిన | జనించిన | ౧౨౬ | ౧౪ |
| పరిమిళ | పరిమళ | ౧౪౦ | ౨౪ |
| పధార్థ | పదార్థ | ౧౪౭ | ౨౨ |
| సకించి | నకించి | ౧౪౮ | ౧౪ |
| మతాద్యయ | మదాత్యయ | ౧౫౦ | ౧౨ |
| నిదాన్ధ్రి | నిదానాన్ధ్రి | ౧౫౨ | ౧౭ |
| మత్యర్థ | మత్యర్థం | ౧౭౨ | ౨౫ |
| కణ్ఠరాః | కణ్డరాః | ౧౭౬ | ౧౯ |
| మూత్రాస | మూత్రాశ | ౧౮౨ | ౩౦ |
| మూర్ఛా | మూర్ఛా | ౧౮౪ | ౨౫ |
| అరోచకము | అరోచకము | ౨౦౬ | ౩౦ |
| ఇవ్వి | ఇవి | ౨౧౯ | ౮ |
| సామాన | సామాన్య | ,, | ,, |
| భాధ | బాధ | ౨౨౦ | ౨౫ |
| ప్రతిదిష్టమ్ | ప్రదిష్టమ్ | ౨౫౩ | ౧౨ |
| స్ఫుర్శనం | స్పర్శనం | ౨౫౫ | ౬ |

| తప్పు | ఒప్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| నుండుట | నుండుటచే | ౨౬౦ | ౩౨ |
| పిత్త | పిత్తజ | ౨౬౫ | ౨౧ |
| సామాన్యముల | సామాన్యములు | ౨౭౦ | ౩౨ |
| నాస్రావ | సాస్రావ | ౨౭౧ | ౨౪ |
| తచ్ఛోధా | తచ్ఛ్రోధా | ౨౮౩ | ౨౮ |
| చిన్నభిన్న | ఛిన్నభిన్న | ౨౯౩ | ౧౪ |
| శిరస్చులు | శిరస్సులు | ౩౦౧ | ౬ |
| యున్ని | న్నియు | ,, | ౩౧ |
| త్వఖరా | త్వక్ఖరా | ౩౨౩ | ౧౫ |
| నిగ్రహై | నిగ్రహైః | ౩౩౦ | ౧౧ |
| త్యచ | త్వచ | ౩౪౧ | ౧౩ |
| యస్త్యై | యస్యై | ౩౫౧ | ౪ |
| కాంతిగల్గినవియు, దురదతోఁగూడి నేతివంటి కాంతిగల్గినవియు, దురదతోఁ గూడినవి | కాంతిగల్గినవియు, దురదతోఁగూడినవియు | ౩౭౨ | ౬, ౭ |
| మాంస | మాంసము | ౩౭౪ | ౨ |
| సాసావం | సాస్రావం | ౪౧౧ | ౨౦ |
| నీన | నీవ | ౪౧౮ | ౫ |
| పీతకాశు | పీతకాశ్రు | ౪౨౯ | ౨౬ |
| సిడకా | పిడకా | ౪౩౨ | ౬ |
| కల్గినని | కల్గినవి | ౪౪౦ | ౨౧ |
| విభాంత | విభ్రాంత | ౪౪౨ | ౨ |
| పరిష్లుతంబు | పరిప్లుతంబు | ౪౫౪ | ౨౨ |
| గర్ఫ | గర్భ | ౪౫౮ | ౨౪ |
| నెరుంగువది | నెరుంగునది | ౪౬౦ | ౧౨ |
| కృచ్ఛా | కృచ్ఛ్రా) | ౪౬౯ | ౮ |
| తషతి | తిష్ఠతి | ౪౮౩ | ౨౦ |
| పాప్నోతి | ప్రాప్నోతి | ౪౮౫ | ౩౨ |



లిబర్టీ ముద్రాక్షరశాల, చెన్నపురి.

